## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010005121/22

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# గాంధీ-గాంధీతత్త్వము

(మొదటి సంపుటము)

రచయిత:

డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య

అనువాదకులు:

కోడాలి ఆంజనేయులు




ప్రభాత ప్రచురణ సమితి

ఖమ్మంమెట్టు (నైజాం)

# విషయసూచిక

అధ్యాయము | పేజి


1. గాంధి - ఆయన వ్యక్తిత్వము 1
2. అహింస 37
3. సత్యాగ్రహం 95
4. సత్యాగ్రహం - యుద్ధం 152
5. సత్యాగ్రహము - దాని నైపుణ్యము 213
6. ఉపవాసాలు 235
7. మతము 275
8. ఆశ్రమాలు 298
9. గాంధీ సేవాసంఘము 307

# తొలిమాట

"గాంధీ-గాంధీతత్త్వము" ను గూర్చి గ్రంథము వ్రాసి పంపవలసిందని నిరుడు వేసగిలో కితాబిస్తానంవారు నన్ను కోరినారు. అందువల్ల ఆ విషయంలో నాకుగల అభిప్రాయా లను తిరిగి కూర్చడానికి ఈ నూతనప్రయత్నం చేశాను. మొట్టమొదట క్రైస్తవ కళాశాలలలో దీర్ఘకాలం పొందిన శిక్షణవల్లనూ, పిదప 1905 లో వంగదేశంలో ఉద్భూతమైన నూతనచైతన్య వికాసంవల్లనూ, తరువాత మహాసంగ్రామం నాటి (1914-1918) డాక్టరు బెసెంటు హోంరూలు ఉద్య మంవల్లనూ రెండు దశాబ్దములుగా దున్ని పదునుచేయబడిన మనోక్షేత్రములో ఈ అభిప్రాయములు నాటుకొని దోహ దము చేయబడి మఱి ఇరువది సంవత్సరాలనుండీ పెరిగి పెద్ద వవుతూ వచ్చినవి. యుద్ధం ముగియడంతోనే భారత రాజకీయ నైతిక ఆర్థిక విషయాలలో- అదీ ఇదీ ఏమిటి భారత దేశ సర్వ తోముఖ పునరుద్ధరణ విషయాలలోనే గాంధీశకం ప్రారంభ మయింది.

౧౮౫౭ లో మొదటి భారత స్వాతంత్ర్య సంగ్రామం జరిగింది. దానికీ ఒక కారణముంది; నాయకుడున్నాడు; జండా ఉన్నది. కాని అది సరియైన కట్టుబాట్లలో జరుగలేదు. దాని ఉద్దేశంగానీ, పద్ధతిగానీ మహోన్నతములైనవి కావు. అది అంతా హింసాపద్ధతిమీద నడిచింది. కాంగ్రెసు ౧౮౮౫ నుండీ భారత స్వాతంత్ర్య సంపాదనకు పూనుకొన్నది. కాని

30 సంవత్సరములవరకూ అది ఆలోచనా ప్రపంచాన్ని దాటి వెళ్ళలేకపోయింది. ౧౮౫౭ లో ప్రారంభమైన తలలు పగలు కొట్టేవని ౧౯౧౯ నాటికి నెలుసులు వెదకడంలోకి దిగింది. తరువాత ఆత్మబలయుగం ప్రారంభమయింది. పశుబలానికీ బుద్ధిబలానికీ సంబంధించిన కార్యక్రమాలన్నీ దానితో మఱుగు పడ్డాయి. ఈ యుగపురుషుడైన గాంధీ డెబ్బదిరెండవ జన్మదిన జయంతి ఇప్పుడే జరిపాము. ఆయన జీవితంలో అనేక పోరాటాలు చేశారు. ఇప్పుడాయన చేసేది చివరిపోరాటం. ఇదివర కాయన పోరిన పోరాటాలన్నిటిలోకీ నిస్సందేహంగా ఇది పెద్దది. మనదేశంలో కారాగారశిక్ష ననుభవించినవారిసంఖ్యను బట్టికాదు ఈ పోరాటం గొప్పదనడం- తనకృషికి పరమావధిగా ఉపవాసవ్రతమూలమున- బహుశా అది ప్రాయోపవేశమే కావచ్చును- మాతృదేశ చరణములకు 'పూజాపుష్పం కావడానికి నిశ్చయించుకొన్నాడాయన.'

ఈ పోరాటంలో ప్రతిసంవత్సరమూ మనము మన వీరులకూ, మృతజీవులకూ (Martyrs), యోగులకూ, రాజకీయ చతురులకూ, శిల్పులకూ, కవులకూ, జన్మజయంతులు జరుపుతూన్నాము. ఇంతకుపూర్వము దాదాభాయి ఫిరోజిషా మెహతాలకూ, గోఖేలు తిలకుమహాశయులకూ, సురేంద్రనాధ్ బిపినచంద్రపాలులకూ, లజపతిరాయి దేశబంధుదాసులకూ మనము మన స్తుతిగీతములను సమర్పించాము. కాలమనే ఇసుకదారులలో వారి అడుగుజాడలు మాసిపోలేదు. వారింకనూ మనకు మార్గదర్శకులే. వారి స్మృతి మన భావోత్సాహ

అను చిగిరిస్తూ మన జాతీయ జీవితానికి నూతనచైతన్యం కలిగిస్తూన్నది; మన ఆదర్శాలనూ అభిప్రాయాలనూ మహోన్నతపథాలకు తీసికొనిపోతూన్నది. కాని వారు దురదృష్టవశమున భావిసంతానము పాడుకోవడానికి మిగిలిన స్మృతిగీతములుగా మాత్రమే నిలిచిపోయినారు.

గాంధీ అలాకాదు. నేడు జీవంతో ఉన్న భారత భాగ్యవిధాత ఆయన. ఆయన జీవితం దీర్ఘమైనకొలదీ భావాలు గంభీరము లవుతున్నాయి. ఉపాయాలు (Plans) ఉన్నతస్థాయిని పొందుతూన్నవి. ఆయన కర్మక్షేత్రం విశాలమవుతూన్నది. ఆయన ఆదర్శవాంఛలు నింగిముట్టుతున్నవి. ఆయనయందు గాలిలో అవ్యక్తంగా ఊగులాడే సమస్యలు లేవు. ఆయనకు నిన్నటి పగటికలలు నేటికి ఘనీభవించిన అభిప్రాయాలు. అవి రేపటికి ఉపాయాలుగామారి ఎల్లుండికి రూపందాల్చిన ఒక స్పష్టమైన కార్యక్రమంగా పరిణతి పొందుతవి. ముప్పైఐదుకోట్లజనం ధరిస్తూన్న 72 కోట్ల రూపాయిల విలువగల విదేశీవస్త్రం ఇండియాకు రాకుండా ఆపవలెనంటే ఒక పాతరాట్నంతోనూ చాలీచాలని ఖద్దరు ధోవతీతోనూ ఆయన పని ప్రారంభిస్తాడు. నాలుగైదుకోట్ల మందియొక్క అంటరానితనమును రూపుమాపడానికి ఆమరణాంతోపవాసవ్రతం అవలంబించి తద్వారా "దైవం కూర్చిన కూర్పు విచ్ఛిన్నం కాకుండా" హరిజనులను హిందూసంఘంలో నిల్పచూస్తారాయన. తాగుడుద్వారా వచ్చిన పాపపు రాబడిని రద్దుచేయడానికి ఆయన రాష్ట్రీయమంత్రుల కార్యాసక్తిని

నైతిక సంస్కారమార్గములకు పట్టించారు. హిందూమహమ్మదీయ సఖ్యతకొఱకు ఆయన 1924 లో ౨౧ నాళ్లు ఉపవాసం చేశారు. నేడాయన తన 72 వ యేట 1940 లో హిందూదేశాన్ని యుద్ధప్రయత్న బాధ్యతనుండి తప్పించడానికి వైస్రాయితో రాయబారములద్వారానూ, సత్యాగ్రహోద్యమం ద్వారానూ భగీరథప్రయత్నాలు చేస్తున్నారు. ఉత్త ఆయుధవిసర్జన కార్యక్రమంకింద కాక, అహింసా సిద్ధాంతంలో నైతికసూత్రము ననుసరించి, ఆయన సైనికసన్నాహములులేని భారత కేంద్రప్రభుత్వాన్ని భావింపగలుగుతున్నారు.

గాంధీ నాయకత్వంకింద నడచిన రెండు దశాబ్దములలో ఆయన భారత జాతీయసౌధానికి అంతరువులపైన అంతరువులు నిర్మించడమేకాక దాని మూలముకూడ క్రమంగా వైశాల్యంచేశాడు. ఆయన 1928 నాటికే భారత రాజ్యాంగంలో సంస్థానాలు పొందవలసిన ప్రాముఖ్యతను గుర్తించి, భారత స్వరాజ్యప్రణాళికలో వాటి అగ్రస్థానాన్ని అంగీకరించాడు. తరువాత సంస్థానప్రజా మహాసభ దాని శాఖోపశాఖలతో ప్రత్యేకసంస్థగా నుండనక్కరలేదని ప్రబోధించి మహాసభా కార్యవర్గమూ, కాంగ్రెసు కార్యవర్గమూ రెండూ దాదాపు లీనమయ్యేటట్టు చేశాడు. సంస్థాన ప్రజామండలి కీరోజున గాంధీ కొండంతబలం. అంతేకాదు; రాష్ట్రాలకూ, సంస్థానాలకూ, సంస్థానాధిపతులకూ, సంస్థాన ప్రజలకూ గాంధీజీ కొలికిపూస.

గాంధీ ఇండియాకు వచ్చినప్పటినుండీ పూర్తిగా ఆయన వ్యవహారములను పటం (Graph) లో చిత్రిస్తే ఆయన నడకలోని ఎచ్చుతగ్గులు మంచి అనుభవాన్ని చేకూరుస్తవి. 1915-1919 సంవత్సరాలమధ్య ఆయన జీవితంలో ముందుకు తోసుకొనివచ్చే స్వభావమున్నట్లు కనపడదు. 1919 లో అమృతసరం కాంగ్రెసునాడు ఒక్కసారిగా పైకివచ్చి కలకత్తా, నాగపురం కాంగ్రెసులనాటికి (1920) నాయకత్వం వహించగలిగినాడు. ఒక పదిహేనుమాసములు చేసిన గట్టి కృషి ఫలితంగా ఆయన జైలుకు పంపబడి 1924 లో తిరిగి విడుదలయినాడు. తరువాత మూడునాలుగు సంవత్సరాలవరకూ, 1926, 1927, 1928 సంవత్సరాలలో రాజకీయాలలో జోక్యం కలిగించుకోకుండా కేవలం నిర్మాణ కార్యక్రమంలోనే నిమగ్నుడైపోయినాడు. 1928 లో తిరిగి కలకత్తా కాంగ్రెసులో ముఖ్యపాత్ర వహించాడు. పిదప ఏడాదియైనా నిండకుండానే 1929 డిశంబరు 23 తేదీని, పూర్ణస్వరాజ్యంనిమిత్తం యావద్భారతోద్యమం ప్రారంభింపబోతూన్నానని ఇర్విన్ ప్రభువుకు శ్రీముఖం పంపించాడు. దీనిఫలితమే 1930-1934 వరకూ జరిగిన సత్యాగ్రహోద్యమం. తరువాత ఆయన కాంగ్రెసునుండి విరమించి కౌన్సిలు కార్యక్రమంలో ఎక్కువ ఉత్సాహం కనపరచలేదు. 1937 లో వైస్రాయి దగ్గరనుండి "హామీలు" సంపాదించడానికి చురుకుగా రాయబారాలునడిపించాడు. ఇవే రాష్ట్రీయ మంత్రివర్గ నిర్మాణమునకు కారణభూతములైనవి. కడలిలో ఈతగానివలె ఆయన "పోటు" లో

పైకివస్తూ "ఆటు" లో కనపడకుండా లోపలికి పోతూంటాడు. హింసాసంగ్రామ సముద్రకల్లోల తరంగములనుండి కాంగ్రెసు నౌకను ఒడ్డుచేర్చడానికి ఆయన నేడు కొండమీది కొడిదీపం. ఆయనకు మార్గంప్రధానం; అవధి కాదు; ప్రయత్నంప్రధానం. ఫలితంకాదు; ఉపాయాలు ప్రధానం. పర్యవసానాలుకాదు; ఉపాయాలు పరిశుద్ధములై, ప్రయత్నం మంచిదై, మార్గం తిన్ననిదైతే, అందుకు తగినఫలం కలుగనే కలుగుతుంది. ఆవిధంగా వచ్చిన ఫలితం శాశ్వతంగాకూడా ఉంటుంది. అంతే కాదు. ఆఫలితం పొందే ప్రతివాని శాశ్వత సౌభాగ్యానికీ అది తోడ్పడుతుంది.

కాబట్టి గాంధీ సిద్ధాంతాలనూ సూత్రాలనూ ఆయన వాటిపైన నిర్మించిన రాజకీయార్థిక సాంఘిక పునర్నిర్మాణ విధానములనూ భారత స్వరాజ్యమునకు ముఖ్యాంగములుగా సమన్వయం చేసుకోవడానికి ఈ గ్రంథమును ప్రచురణ నిమిత్తం "కితాబిస్థాన్" కు సమర్పించినాను.

బందరు,
28-12-1941.

భో. పట్టాభి సీతారామయ్య.

# గాంధీ - గాంధీతత్వము

## హేతువాదం

గాంధీ ఉద్యమానికి ఏ హేతువాదం కలదో అదంతా దాదాపు గాంధీభాషలోనే సంగ్రహంగా ఇక్కడవ్రాస్తాము. అదే ఈ పుస్తకానికికూడా మూలం కాగలదు.

గాంధీ భావోద్రేకం లేనివాడుకాడు. కాని ఆయనబోధలు కానీ సిద్ధాంతాలుకానీ దానిపైన ఆధారపడి ఉండవు. దేవుడు సర్వాంతర్యామియని ఆయన విశ్వాసం. "నాస్తికుని నాస్తిక్యం" కూడ ఆయనకు దైవస్వరూపమే. ఆయన దేవుడు సత్యం (సత్); ఆయన సత్యం జ్ఞానం (చిత్); నిజమైన జ్ఞానమున్నచోట ఆనందముంటుంది. కాబట్టి ఆయన సచ్చిదానంద స్వరూపంలో దేవుణ్ని తెలుసుకొంటూన్నాడు. పూర్ణసత్యం తెలుసుకోవడమంటే తననుతాను తెలుసుకోవడమూ తన పరమావధి యేమిటో తెలుసుకోవడమూను. అంటే పూర్ణపురుషుడవడం. అందువల్లనే గాంధీ "మన జీవితానికి సత్యమే ఊపిరి కావాలని" పదేపదే చెబుతూంటాడు. మనమహాభారత మహర్షులవలెనే ఆయన త్రాసుకు ఒకవైపున సమస్త యజ్ఞములనూ మఱొకవైపున సత్యాన్నీ ఉంచి తూస్తాడు. రెండోది మొదటి దానికంటె ఎక్కువ తూగుతుంది. కనుక సత్యాన్వేషణమే భక్తియని ఆయన తాత్పర్యం. ఒకరికి సత్యంగా తోచినది

రెండవవారికి సత్యంగా తోచకపోవచ్చు. అందువల్లనే సత్యం సహనభావాన్ని సాధించమంటుంది. "మనమంతా సత్యాన్ని వివిధ దృక్పథములలోనుండి కొద్దికొద్దిగా మాత్రమే చూస్తూ ఉంటాము."

"అహింస ప్రాణంలేని కట్టెసిద్ధాంతం కాదు. అది సజీవమూ ప్రాణప్రదమూను. అది ధైర్యవంతులకు నైజము. అదే వారి సర్వస్వము. అది ఆత్మయొక్క ప్రత్యేక ప్రకృతి. అందువల్లనే అది ఉత్కృష్ట ధర్మంగా పేర్కొనబడుతూన్నది. అహింసా భానూదయంతో అసూయా, కోపం, ద్వేషం మొదలైనతమో గుణాలు విరిసిపోతవి". గాంధీ.

కాబట్టి ఆయనప్రకారం "అహింస లేకుండా సత్యాన్వేషణం దుర్లభం."

"నన్ను హిందూమతాన్ని వివరించమంటే నేనొక్క మాటలో 'అహింసద్వారా సత్యాన్వేషణమ' ని చెప్పివేస్తాను." అంటాడు గాంధీ. అన్నిప్రాణులనూ ప్రేమించడమే అహింస. భారత సంతానానికి మాతృదేవిగానూ, కోరికలపంటగానూ పరిగణింపబడే ఆవు జంతుప్రపంచంలో అహింసకు చిహ్నం!*

కాబట్టి అంటరానితనమును అట్టేఉంచడం హింసా కళంకమునకు పాల్పడడమే. అంటరానితనాన్ని ఉంచడం మనం గర్వపడే అహింసా సిద్ధాంతాన్ని తృణీకరించడమేనని గాంధీ అభిప్రాయం. కాబట్టి దానిని శాశ్వతంగా నిర్మూలించాలి. చట్టంద్వారాకాదు; హిందూ అంతరాత్మ విజృంభించి తనం

* ఈ విషయం వివరంగా అనుబంధంలో వ్రాయబడినది.

తట తాను ఈ సిగ్గును తుడిచివేసుకోవాలి. అప్పుడే ప్రేమ
అహింసకు పరమావధి అనీ, మానవ సంబంధమునకు మూల
కందమనీ అర్థమవుతుంది. అహింస భయంవల్లనో పిఱికితనము
వల్లనో నాశనమవుతూన్నది. అహింసను అవలంబించి తీర
వలెనని చెప్పని మతంలేదు. అయితే ఒక్కొక్కప్పుడు మతం
హింసను అంగీకరించి ఉండవచ్చును. కాని మనం అభివృద్ధి
పొందినకొలదీ ఆ అంగీకారంకూడా మన మతసిద్ధాంతాలలో
నుండి పోవాలి. పిఱికితనంకంటె హింస మంచిదికావచ్చు.
కాని అహింస హింసకంటె మంచిది. అహింసలో తాను బాధ
పడడమున్నది. ఆ బాధ ఫలప్రదం కావలెనంటే అది పవిత్ర
వంతంగా ఉండాలి. పవిత్రతనుబట్టి బాధ తీవ్రమవుతుంది.
బాధా తీవ్రతనుబట్టి ఫలితముంటుంది. కాబట్టి మనం ప్రేమ
వల్లనే ఇతరులుపెట్టే క్లేశమునూ వెలినీ భరిస్తాము. కుటుంబ
ప్రతిష్ఠనూ ఆస్తినీ పోగొట్టుకోవడానికి ఒప్పుకొంటాము. అటు
వంటి పరిస్థితులలో ప్రతిక్రియ చేయకుండా ఉండవలెనంటే
ఆత్మనిగ్రహం అవసరం. కాని ఆత్మనిగ్రహమనేది కేవలం
మిన్నకుండడమే (Passive Force) కాదు. అందువలన సేవా
తత్పరత సర్వతోముఖం కావాలి. నిరంతర సేవాసక్తి త్యాగ
మునకుదారితీస్తుంది. ఈ త్యాగసిద్ధాంతం మానవులందఱికీ అను
ల్లంఘనీయముగా ప్రతిపాదింపబడినది. మనవాళ్ళంతా ఉద
యమూ సాయంకాలమూ భోజనానికిపూర్వం జపించే మంత్రా
లలో ఈ విషయమే గ్రథితమైఉంది. కాని చిరస్మరణీయమైన
త్యాగచిహ్నముగా నుండవలసిన ఈ సిద్ధాంతం కాలక్రమేణా

అర్థంలేని అభ్యాసమయిపోయింది. హిందువుడైనవాడు భోజనమునకు పూర్వం రెండుపూటలా అయిదు చిన్న అన్నపుకరుళ్ళను విస్తరిచుట్టూ ఉంచుతాడు. అవి ధర్మ, ధర్మరాజ, చిత్రచిత్రగుప్తులకూ సర్వదేవతలకూ అంకితం చేయబడుతూన్నవి.♦ భోజనం చేయడానికిముందు పరిషేచనంపిమ్మట నడుపబడే ఈ క్రియ దాతృత్వబుద్ధిని ప్రజ్వలింపచేయడానికీ, ప్రతిరోజూ మానవుడు నిర్వర్తించవలసిన ధర్మాన్ని స్మరింపచేయడానికీ ఉద్దేశింపబడ్డది.

దీనినిబట్టి భోగలాలసత్వము, ఎక్కువగా డబ్బు కూడబెట్టడము, నికృష్టంగానూ అవాంఛనీయంగానూ తలపబడుతూన్నవి. శరీరకష్టం-మగ్గంమీద పనిచేసినా, రాట్నంమీద పనిచేసినా పొలంలో పనిచేసినా, మిల్లులో పనిచేసినా, చెప్పులుకుట్టినా, దొడ్డిఊడ్చినా యేపనియైనాగానీ- పరమధర్మంగా యెన్నబడుతూన్నది. నూలువడకడం నిరాడంబరమైన నిష్కళంకమైన శరీరకృషికి చిహ్నం. కాబట్టి అది విధేకాదు సంస్కారం కూడాను. కనుక నీవు గ్రామాలయెడలనూ గ్రామ పరిశ్రమలయెడలనూ నీ ప్రథమధర్మాన్ని నిర్వర్తించవలసి యున్నది, గ్రామపరిశ్రమలే నిజమైన స్వదేశీవస్తువులు. వాటిలో అందచందాలు లేవని భావించకూడదు. నిజమైనశిల్పం ఆంతరంగికమైనదికాని బహిర్గత మైనది కాదు. ఆశిల్పమే అందం. ఆఅందమే సత్యం-ఆసత్యమే అహింస-ఆ అహింసయే ప్రేమ. ఆప్రేమయే

♦ ధర్మాయనమః ఓమ్, ధర్మరాజాయ నమః ఓమ్, చిత్రాయనమః ఓమ్, చిత్రగుప్తాయనమః ఓమ్, సర్వదేవేభ్యోనమః ఓమ్.

గ్రామస్థులు తమ చేతిపనులతో పొట్ట పోసుకోవడానికి సహాయ కారి అవుతుంది. పూర్వకవి ఒకాయన ఇలా గానంచేశారు.

"అందమే సత్యమూ
సత్యమే అందమూ
తెలిసిందదేనీకు
తెలియ వలసిందదే"

గాంధీజీ ఇలా అంటున్నారు :

"నిజమైన శిల్పం ఆత్మజ్ఞానం కలగడానికి తోడ్పడాలి. మన తోడి వారు సంతోషంగా ఉన్నప్పుడూ అందుకు మనం ఎంతో స్వల్పంగా నైనాసరే సహాయపడ్డప్పుడూ మాత్రమే మనకు ఆత్మజ్ఞానం కలుగు తుంది."

ఈ అభిప్రాయాలను మనమంగీకరించినట్లయితే మన విద్యా విధానమే మారిపోవాలి. జాతీయసంస్కారంద్వారానే యువక హృదయాలు శిక్షితములు కావాలి. అప్పుడు బుద్ధీ చేయీ హృదయమూ కలసి అవిరుద్ధమైన ఏకసంస్కృతి కలిగిఉండ డానికి వీలవుతుంది.

"అనుభవంలేని సిద్ధాంతం కళ్ళకుండా రక్షింపబడిన శవం వంటిది. అది బహుశా చూడడానికి అందంగా కనిపిస్తే కనపడ వచ్చునుగాని యేవిధమైన భావోత్కృష్టతనూ ప్రేరేపించదు" అని గాంధీజీ అంటారు.

ఇటువంటి ఇంగ్లీషువిద్య "భారతీయ విద్యార్థుల నరాలు తోడి వారిని ఆంగ్లమానస పుత్రులనుగా చేస్తున్నది" అని కూడా గాంధీజీ విశ్వాసం. మన భాషద్వారాన మన మతంపై

ప్రేమా గౌరవమూ కలుగతవి. మనమతమును గౌరవించడం తెలిస్తే ఇతరమతాలుకూడా సత్యాన్నే ప్రతిపాదిస్తున్నవి కాబట్టి వాటినిగూడా మనం గౌరవించగలుగుతాము.

ఈ ప్రధానసిద్ధాంతాలనన్నిటినీ అంగీకరించినప్పుడు సత్యాగ్రహం సనాతన ధర్మంయొక్క వ్యక్తస్వరూపమేనని వెంటనే గ్రహిస్తాము. సత్యాగ్రహం అనగా సత్యానికి నిలబడడమే; పశుబలానికి విరుద్ధమైన సత్యబలం లేక ఆత్మబలం; జగత్తుకు సత్యం మూలం. సత్యాగ్రహం అసత్యాన్ని అరికట్టడానికి సత్యాన్ని అంటిపట్టుకొని ఉంటుంది; చీకటిని నిరోధించడానికి వెలుతురుతో ఉంటుంది; చావును జయించడానికి బ్రతుకుతో నిలబడుతుంది. కాబట్టి ఎక్కడ క్రూరత్వమున్నా సరే- అది వ్యక్తిదికానీ, సంఘానిదికానీ, ప్రభుత్వానిదేకానీ-దానిని సత్యం ధైర్యంగా ఎదుర్కొంటుంది. సత్యాగ్రహం చెడుగును అరికట్టేటంతవరకు ఓటమిని యెఱుగదు. సత్యాగ్రహంద్వారా ఆదర్శాలను అందుకోవలెనంటే బాధాసహిష్ణుత ఒక్కటే మార్గం. కాని అది ఎడతెగని బాధ అయినప్పుడు ఓటమివలె కనిపించవచ్చును. అయితే అది గెలుపుకు మొదటిమెట్టు. ఒకప్పుడా బాధవలన చావుకూడా తటస్థించవచ్చును. అప్పుడుకూడా దానివిలువ కోలుపడదు. ఏది ఎలాఉన్నా ఒక్కసంగతిమాత్రం మనం జ్ఞాపకం ఉంచుకోవాలి. సత్యాగ్రహం ఎప్పుడూ ఇతరుల రక్షణకు భంగంరానీయదు. సత్యాగ్రహి తనకు తాను బాధను ఆహ్వానించుకోంటాడు. ఇతరులను సత్యాగ్రహం అవలంబించమనికూడా నీవు బలవంతపెట్టరాదు. అది క్రూరత్వ

మనిపించుకొంటుంది. అందువల్ల నీవు బలహరచదలచుకొన్న ఉద్యమానికి కీడు కలుగుతుంది. సంఘంలోనుండి వెలిబెట్టడం గాని సాంఘికసహాయం నిరాకరించడంగానీ నిజంగా ఒకవిధమైన క్రూరత్వమే. సంఘమర్యాదలను అతిక్రమించినవానితో మనం బుజాలు రాచుకొంటూ తిరుగకపోతే తిరుగకపోవచ్చు. కాని వానియింటికి మంగలి చాకలి మొదలయిన పనిబాగుల వాండ్లను రానీయకపోవడం తప్పు. మొట్టమొదట ఒకరి మధ్యవర్తిత్వాన్ని అంగీకరించి తరువాత వారితీర్పుకు కట్టుబడనంత మాత్రాన యెవరినీ సంఘబహిష్కారం చేయకూడదని గాంధీ విశదీకరించే ఉన్నాడు.

> "వాని పెండ్లివిందులలాంటి సాంఘిక సమావేశాలలో మనం పాల్గొనకపోవచ్చు. వానిదగ్గరనుండి మనమేమీ బహుమతులు గ్రహించకపోవచ్చు. కాని వానికి సాంఘిక సేవనుమాత్రం నిరాకరించకూడదు. సత్యాగ్రహి అజాతశత్రువు." (గాంధీ).

ఉపవాసమూ ప్రార్థనా- ఈ రెండూ సత్యాన్వేషణకు మార్గాలు. పూర్వఋషులూ యోగులూ మనకోసం సత్యాన్వేషణకు తగిన పద్ధతినీ ధోరణినీ యేర్పాటుచేసిపోయివారు. అసహాయోద్యమం, సాత్వికనిరోధం, శాసనోల్లంఘనం, సత్యాగ్రహం, ఇవన్నీ సత్యాన్వేషణముయొక్క వివిధపరిణామాలు. సహాయ నిరాకరణం పరిణతదశలో అరమరలేని నిష్కళంక ప్రేమగా మారి జీవితమంతా ఆవరిస్తుంది. దానిదృష్టిలో రాజకీయమే మతము; మతమే రాజకీయము; దానికి రహస్యమంటే గిట్టదు; కుండ పగులకొట్టినట్లు ప్రవర్తించవలసినదే. భయాన్ని

దులిపివేస్తుంది; సత్యానికి జంకదు; ప్రభుత్వాలను సౌమ్యంగా తృణీకరిస్తుంది. కాని క్రమశిక్షణలోబడి శాసనాలకు విధేయులుగా ఉండేవారుమాత్రమే సత్యాగ్రహులుగా కొన్ని ప్రత్యేకచట్టములను నిరాకరించడానికి అర్హులు. అన్యాయచట్టాలను నిరాకరించినందువల్ల (Civil Disobedience) కల్లోలము కలుగుతుందని భయపడడం కేవలం పొరపాటు. న్యాయచట్టాలను తృణీకరిస్తే (Criminal Disobedience) కల్లోలము కలుగుతుంది. సత్యాగ్రహమునకు ప్రేమ, భాతృత్వము, మర్యాదా- ఇవి మూలం. అందువల్ల సత్యాగ్రహి ఎన్నడూ న్యాయచట్టాలను తృణీకరించడు. కాబట్టి చెడుగును నిర్మూలించేటందుకు సర్వగుణసంపన్నుడైన ఒక్క సత్యాగ్రహియే చాలు. అహింసాపూర్వకమైన సాత్వికనిరోధము తప్పకుండా మంచిఫలితాలను చేకూరుస్తుంది. కాని నాయకుడుమాత్రం తనస్థానాన్ని గుర్తించుకొని మూకలకు లోబడిపోకుండా వుండాలి. ఇటువంటి ప్రణాళికపైన ఆధారపడిన ఉద్యమం ఒకొక్కప్పు డాకస్మికంగానూ మఱొకప్పుడు చాలా నెమ్మదిగానూ అభివృద్ధి పొందవచ్చును. సత్యాగ్రహంలో సంస్కారోద్యమ బీజాలూ విప్లవోద్యమ బీజాలూ కూడా ఉన్నవి. భారతీయులమైన మనము కలియుగంలోనుండి తిరిగి ఎన్నడో గడచిపోయిన స్వర్ణయుగమనబడే కృతయుగంలోకి తొందరలోనే రాబోతూన్నాము. ఈమార్పుక్షణంలోవచ్చి మరుక్షణం లోపోయేదికాదు. మనంకృతయుగం (సత్యయుగం) చేరుకోవలెనంటే సత్యాగ్రహామొక్కటే శరణ్యం.

# అధ్యాయం ౧

## “ గాంధీ - ఆయన వ్యక్తిత్వము ”

౧

మానవసంతానం పరిశీలించవలసిన మహోత్కృష్ట విషయం మనిషినిగూర్చినదే అయినట్లయితే తన సమకాలికులలోనేగాక పూర్వీకులలోకూడా మహాపురుషుడుగా భావింపబడుతూన్న వాని జీవిత సూక్ష్మాంశముల పరీక్ష అత్యుదాత్తమమైనదిగా భావించవలసి యున్నది. సాధారణంగా మనం, మన మహాపురుషులు కర్మక్షేత్రమునుండి విరమించినంతనే వారికి దైవత్వమాపాదిస్తాము. వారిచుట్టూ ఒక అగ్రాహ్యమైన ఊహాతీతమైన తేజస్సును సృజిస్తాము; వారిని మనం అందుకోలేనంత ఉన్నతపథాలలో ఉంచుతాము. వారి యశోగీతాలు గానం చేస్తూ ఉంటాము. ఇది మనక్లిష్టమైనపని. గాంధీ విషయంలో ఇదంతా అన్యథా పరిణమించింది “ కీర్తిపథములు కాటికే కేలుచూపు ” నని కవీశ్వరుడు గీతం పాడి ఉండవచ్చును. కాని గాంధీయొక్క కీర్తిపథము లాయనజీవితంలోనే, ఆయన పేరు ప్రతిష్ఠల ననుసరించి ఆయనకు దైవికశక్తులూ అద్భుతచర్యలూ ఆపాదింపబడకపూర్వమే, ఆయన సహచరులకు ప్రత్యక్షము లైనవి. గాంధీ పూర్ణపురుషుడనని ఎన్నడూ అనలేదు. ఆయన మనుష్యులలో మనుష్యుడూ దేవతలలో దేవత.

### ఆయన వ్యక్తిత్వము.

గాంధీ సామాన్య మానవుడుగాజన్మించి మహాపురుషుడైనాడు. ఆయన తన అర్థబలంవలన అనుచరులను సంపాదించుకోలేదు.

అసంగత్వంవలన సంపాదించుకొన్నాడు. కొత్త సిద్ధాంతాలను ఆచరణలో పెట్టినందువల్లనే ఆయన కనుచరవర్గం చేరింది ఆయన తాను సేవింపబడుటవలనగాక మానవసేవమూలమున మంది మనసుకు నచ్చినవాడైనాడు. ఆయనిది ప్రత్యక్షసిద్ధాంత వాదం. ఆయన జీవితం నిరాడంబరమైనది; ఆదర్శపూర్వక మైనది; ఉదాత్తమైనది; గాంధీ సేద్యగాడూ నేతగాడూను. మానవహృదయంలో తిరిగి మట్టోకతూరి ప్రేమను ఆయన ప్రజ్వలింపచేశాడు; మానవ స్వాతంత్ర్యాన్ని పునఃప్రతిష్ఠితంగా చేశాడు. ఆయనబోధ మానవకృషికి మర్యాదను చేకూర్చినది. ఖండానికి ఖండానికీ, సంఘానికి సంఘానికీ, స్త్రీకీ పురుషునకూ ఉండే భేదాలన్నీ ఆయన చూపుమేరలో లేనేలేవు. కాబట్టి అవన్నీ పోయితీరాలి. అవి పోకపోతే ఆయన నిరంతరానంద మనుభవించే మహానుభావులతోకంటె కంటికీ మంటికీ ఏకధారగా కన్నీరుకార్చే కరుణామూర్తులతోనే కలసి మెలసి ఉంటాను. "ఆయన వ్యక్తిత్వము ఇతరులపైన ప్రసరించడమే సృజనశక్తి. అది వారిదృష్టిని విశాలంచేసి సామర్థ్యమును పెంపొందిస్తుంది" అన్నాడు ప్రొఫెసరు మ్యాక్‌ముర్రే ఆయననుగూర్చి. ఆయనను ప్రజలనేకులు అనేకవిధాలుగా తలుస్తారు. అర్థంకాని మనిషిఅనీ, రాజకీయచతురుడనీ, యుద్ధాలకు వ్యతిరేకిఅనీ, ప్రజాప్రభుత్వ వాదిఅనీ, సాంఘిక విప్లవకారుడనీ, అభివృద్ధినిరోధక పూర్వాచార పరాయణుడనీ, కైతవనీతికోవిదుడనీ, అడ్డంగా ఆలోచించే చపలచిత్తుడనీ, యోగిఅనీ, అడవిమనిషి అనీ, జెహోవా అనీ, జోవ్ అనీ, జీసస్‌క్రీస్తుఅనీ,

మెస్సయ్యా అనీ, పైగంబర్ అనీ, వలి అనీ, అందరూ తలొక విధంగానూ అంటారు. ఆయన ఏమైనా ఏమి కాకపోయినా, యుద్ధాలతోనూ రక్తపాతంతోనూ చిందరవందర అవుతూన్న రోజులలో, అంతర్జాతీయ వివాద పరిష్కారమునకూ ఆంతరంగిక నియతిని సంరక్షించేటందుకూ, ఆరణ్యక న్యాయ్యమైనహింసయే ప్రయోగింప బడుతూన్న ప్రపంచంలో, ప్రజాభిప్రాయాన్నీ అంతరాత్మనూ అణగద్రొక్కి ప్రభుశాసనమనే పశుబలప్రయోగం శాంతిస్థాపన పేరుతో పీఠం పెట్టుకొని ఉన్న సంఘంలో, ఆయన ప్రేమ, సేవ, త్యాగం, బాధాసహిష్ణుత మొదలగు సిద్ధాంతములద్వారా మానవునికి తన గొప్పతనంలో విశ్వాసం చేకూర్చి తిరిగీ అతనికి అంతరాత్మను అధిష్ఠానదేవతగా ప్రతిష్ఠించడానికి సహాయపడ్డాడు. మానవ సౌభాగ్యంకోసం ఆయనచేసిన విశాల కృషివల్లనే ఆయనను వేదాంతి అనీ, యోగి అనీ, సంఘసంస్కారి అనీ, విజ్ఞానవేత్త అనీ, ఆర్థికశాస్త్ర కోవిదుడనీ, రాజకీయ ధురంధరుడనీ, ధర్మప్రతిపాదకుడనీ, పోరాటమునకు అతిరథుడనీ, ఎవరికి తోచినట్లు వారు పరిపరివిధాల చెప్పుకోవడానికి సావకాశం కలిగింది. ఆయనపద్ధతులు కొన్ని అసందర్భాలుగానూ సంబంధరహితాలుగానూ కనిపించవచ్చు. కాని కొంచెం దూరదృష్టితో చూచినా, లేదా కొంచెంకాలం వేచియున్నా, ఆయన కార్యక్రమంలోని వివిధవిషయములకుగల పరస్పర బాంధవ్యం గోచరం కాకపోదు. అప్పుడది శాస్త్రానుగుణంగా తీర్చి దిద్దబడినట్లు గ్రహించగలము.

## ఆయన ఉపదేశాలు.

ఆయన ఉపదేశముల మూలమున త్రాగుబోతు మితాహారి అయినాడు. ఆయన ఆశీర్వాదమువలన వ్యభిచారిణి గృహిణిగా మారిపోయింది. ఆయన శిక్షణకింద సోమరిపోతు కష్టజీవి అయినాడు. ఆయన సర్వసంగ పరిత్యాగం పేదరికానికి పెద్దరిక మిచ్చినది; ఆయన చిన్నమాట బానిసకు మోక్షమిప్పించింది; ఆయన నిట్టూర్పుతో అచేతనముగా వ్యవహరింపబడుతూన్న స్త్రీ చైతన్యంపొంది సంఘంలో బాధ్యతగలిగిన సభ్యురాలయింది. ఆయనది సర్వమత సమన్వయం. కాని ప్రధానంగా ఆయన హిందువు. ఆయన సంఘసంస్కర్తే కాని ముఖ్యంగా పూర్వాచార పరాయణుడు. గ్రామ పునరుజ్జీవన మాయనకిష్టం. కాని తిరిగి పురాణయుగంనాటికి పోవాలని కోరడు. ఆయన గ్రామాన్ని ప్రేమిస్తాడు. పట్టణాన్ని ద్వేషించడు. ఆయన బ్రిటనుతో పోరాడినా బ్రిటిష్‌వానితో స్నేహం చేయగలడు. ఆయన పాపాన్ని నిరసిస్తాడు. కాని పాపిని ద్వేషించడు;

గాంధీ దృష్టిలో స్వేచ్ఛ అంటే దుర్బలుల సర్వస్వమూ అపహరించడానికి బలవంతులకిచ్చే పట్టాకాదు. ప్రతిపౌరుడూ బహిరంగంగా ఆలోచించుకొని ఆయన అభిప్రాయాల కనుగుణంగా ప్రవర్తించడానికి హక్కు ఉండడమే గాంధీ స్వాతంత్ర్యానికి అర్థం. అన్ని అధికారాలకువలెనే ఈ స్వాతంత్ర్యాధికారానికి కూడా కొన్ని షరతులూ మేరలూ ఉన్నవి. పక్కవాని స్వేచ్ఛకు మొదలే నీ స్వేచ్ఛకు చివర. (పక్కవాని స్వేచ్ఛకు నీ స్వేచ్ఛ అడ్డంకాకూడదు.) పక్కవాని ఈహక్కును నీవు గుర్తిం

చడమే నీధర్మాన్ని గ్రహించడం. అదే అహింసకు పునాది. అప్పుడది కేవలం నిర్మూలనశక్తిగాక నిర్మాణశక్తి కాగలదు. స్వాతంత్ర్యమనే మాటను ఈవిధంగా గ్రహించినట్లయితే రాజకీయార్థిక సాంఘిక విషయాలకు కొలలు కొత్తవి కావలసివస్తవి. ఈ కొలతనుబట్టి బాహ్య పరిశుద్ధత ఒక్కటే పవిత్రతకాజాలదు. వేషమే గౌరవభాజనం కాజాలదు. ధనమువలన గౌరవంకాని పుట్టుకవలన ఉత్కృష్టతగాని కలిగినట్లు తలంపబడదు. ఆయుధ బలంవలన శక్తి వస్తుందనికాని అధికారంవలన పలుకుబడి వస్తుందనికాని నమ్మము. సంఖ్యాబలమే ప్రజా ప్రభుత్వముగానూ చట్టమే న్యాయమైనట్లూ భావించము. సంస్కారమంటే విద్వత్తనిగాని - నాగరికత అంటే సంప్రదాయమనిగాని అనుకోము. వివేకమంటే కేవలం లౌకికమనీ మోక్షమంటే స్వర్గమనీ కూడా ఊహించము. మతమంటే వైదిక కర్మలనీ ప్రార్థన అంటే వట్టి మాటలనీ గ్రహించము. పాండిత్యమంటే పదాడంబరం కాదనీ భక్తి అంటే సన్న్యాసం కాదనీ తెలుసుకోగలము. నాయకత్వం వోట్లతో వచ్చేది కాదనీ గవర్నమెంటంటే నిరంకుశత్వం కాదనీ నిజం తెలుస్తుంది.

## ఆయన తత్వం.

గాంధీ పూర్తిగా ఆధ్యాత్మిక నైతిక తత్వం కలవాడు. ఆయన ఆర్థిక సిద్ధాంతాలుకూడా ఆ తత్వము ననుసరించియే నిర్మింపబడినవి. ఆయన ఔదార్యమే ఆయన ఉత్కృష్టతకు కారణం. ఆయన సిద్ధాంతాలకూ ఆచరణకూ భేదం లేనందువల్లనే ఆయన ప్రభావము సర్వతోముఖమయింది. ఆయనకు ప్రజాసామాన్యంలో

ఎక్కువ విశ్వాసం. కాని తన ప్రతిష్ఠకోసం వారిని వినియోగించు
కోడు; వారిని సేవించడమే ఆయనమతం. ఆయన న్యాయదృష్టి
చట్ట సంప్రదాయాలంటే సహించదు. అవి సాంఘిక నైతిక
మర్యాదలపైన ఆధారపడి ఉంటుంది. ఆయనకు భారతీయ పురా
తన నాగరికతపైన భక్తి. కాని ఆ పూర్వాచారములవల్ల సంకు
చితహృదయుడు కాలేదు. ఆయన సంస్కారం పాండిత్యంవలన
కలిగినదికాదు. పుట్టుకనుబట్టీ పరిసరములనుబట్టీ కలిగిన ఆత్మశిక్ష
ణమువలన లభ్యమైనది. ఆయన కేవలం భౌతికదృష్టితో నడచు
కొనే పశ్చిమప్రపంచంనుండి విరమించుకోడు సరిగదా వారిలో
నిరుపేదవానితో కలసి వాని అభివృద్ధికోసం కృషిచేస్తాడు. ఆయన
చాలా దైవభక్తి కలవాడు. అయితే ఆయనప్రార్థన త్రికాల
సంధ్యావందనమూకాదు; పాంచ్ నమాజ్ కాదు; ఆదివారపు
పూజాకాదు; ఆయన ఆత్మనూ సత్యమునూ మాత్రమే దైవ
ముగా భావించి, ప్రపంచాన్ని సేవించడంద్వారా ఉపాసిస్తాడు.
ఇల్లిల్లూ మనిషి మనిషి దగ్గరకూ తిరిగి సంపాదించిన వోట్లమూల
మున ఆయన నాయకుడుకాలేదు. ఆయన ఉపదేశాలను హృదయ
పూర్వకంగానూ స్వచ్ఛందంగానూ అవలంబిస్తూన్న తన అను
చరవర్గంద్వారా ఈ మానవలోకాన్ని నడుపుతూన్నాడు.
ఆయన ప్రజలను త్యాగశీలురుగా నడిపినాడేకాని వెనుక ఎక్కడో
ఒకమూల ఉండి పదిలంగా నడుచుకోవలసిందని ఉపదేశించలేదు.

### ఆయన మహాత్ముడు.

గాంధీ మహాత్ముడు. ఆయనకీపేరు అకారణంగా వచ్చినదికాదు.
అది సార్థకనామం. మనకు రెండు వ్యక్తిత్వాలున్నట్లు ప్రతిబోధా

కలిగే అనుభవమువల్ల తెలుస్తూన్నది. అవి ఉచ్చము - నీచము. అంతేకాక జాగ్రదవస్థలో ఒక వ్యక్తిత్వం స్వప్నావస్థలో మరొకవ్యక్తిత్వం కూడా ఉన్నవి. వివిధవిధములగు జాగ్రదవస్థలు గ్రంథాలలో వివరింపబడడమేకాక అనుభూతి విషయము లుగాకూడా ఉన్నవి. మనము కలగని లేచినవెంటనే మెలకువలో గూడా ఆ కలలోగలిగిన భావోద్రేకాలను అనుభవిస్తూ మన మంతకుపూర్వము కన్నది కల అని గ్రహించగలుగుతూన్నాము. మనము జాగ్రదవస్థనూ స్వప్నావస్థనూ ఈవిధంగా అనుభవిస్తూన్నప్పుడు చేతనాతీతావస్థ (Super Conscious State) మరొకటి ఉండడానికి వీలుకలదని గ్రహించవచ్చును. అది పునీతులు, స్వార్థరహితులు, విరాగులు విశ్వప్రేమగల మహానుభావుల అనుభవములో మాత్రమే కలదు. ఆ అనుభవము మహాత్ముల యొక్కయూ జీవన్ముక్తుల యొక్కయూ సొమ్ము. అందువల్ల కోట్లాది ప్రజలకు గాంధీమాట అంటే శ్రీరామాజ్ఞ. ఆయన వాణీ వ్రాతా యెంతపని చేయగలవో మౌనంకూడా అంతపని చేస్తుంది. ఆయన వాడిచూపు నీ హృదయంలోదూరి పాప పుణ్యాలను పరిశీలిస్తుంది. ఆయన ఎత్తిన చిటికినవ్రేలు సముద్ర ఘోషనుకూడా చల్లారుస్తుంది. ఆయన బోసినవ్వు తొలకరి మెరుపు వలె మెరిసి వర్ణించరాని వెలుతురును వెదజల్లుతుంది.

ఆయన ముఖవికాసం పరిసర ప్రదేశాన్ని ప్రభావంతంగా చేస్తుంది.

ప్రపంచంలోని కాలుష్యాన్ని కడిగివేయడానికి గాంధీ భూమి పైకి దిగిన అవతారపురుషులలో ఒకడు. వారు భూమండలానికి

శిక్షకులుగానూ రక్షకులుగానూ కూడా వస్తారు. వారు తమ పరిసరములలోని పరిస్థితుల కత్యంత సన్నిహితులుగానుండి అక్కడి జనసామాన్యంతో కలసిమెలసి పనిచేస్తూ వారి నిర్ణీతకార్యమును ముగించుకొని, యెక్కడనుండి శిష్టరక్షణమూ దుష్టశిక్షణమూ చేయడానికి ఇహలోకానికి వచ్చారో తిరిగి ఆ శాశ్వతలోకానికి చేరుకొంటారు.

౨

కాలమే మహాపురుషుల జన్మకారణమనేమాట కేవలం స్వభావోక్తి. 19 వ శతాబ్దపు మొదటి పాతిక సంవత్సరాలలో కలిగిన ప్రాచ్య పాశ్చాత్య నాగరికతల కలయికయే శ్రీ రాజా రామమోహన రాయలవారి మతసిద్ధాంతాలకూ, వారి సంస్కృతికీ, మహత్కార్యములకూ కారణభూతమయినది. ఆయన మరణించిన మఱియొక అర్ధశతాబ్దమునకు భారత జాతీయతకూ లోకసంస్కృతికీ ప్రవక్తయైన మఱియొక మహాపురుషుఁడు జన్మించినాడు. ఆయన భావాలు దక్షిణ ఆఫ్రికా యుద్ధమువలననూ, 1914-1918 లలో జరిగిన ఐరోపా మహాసంగ్రామము వలననూ ఘనీభూతములయి యుంటవి. ప్రెసిడెంటు విల్సను నూతన ప్రపంచాన్నిగూర్చి కలలుకన్నాడు. టాల్స్టాయి, క్రొపాట్కినులు ఆ విషయంలో చాలావ్రాశారు. ఘోరకృత్యాలను చూస్తే మానవస్వభావం తిరుగుబాటు చేసేమాట నిజమేగాని తరువాత వాటిని త్వరలోనే మఱచిపోతుంది. మఱచిపోవడమేకాదు; తిరిగీ ఆ పనిలోకే దిగుతుందికూడా ఒకొక్కప్పుడు. గాంధీమాత్రం ఈ సందర్భంలో తన కాలికింద గరిక మొలవనీయలేదు. ప్రత్యక్షముగా తామనుభ

వించిన దానినిబట్టీ, తాము కళ్ళారా కనినదానినిబట్టీ మానవ లోకం గుణపాఠం నేర్చుకొనేటట్టు చేయడమే ఆయన జీవితాదర్శము.

తన చుట్టూ ఉన్న పరిస్థితుల ననుసరించి మనిషిశీలం ఉంటుంది. శీలం అనగా రోడ్డుమీద పడిఉన్న నగను పోలీసువారి స్వాధీనం చేయడంకానీ, దోవలో తేలుకనిపిస్తే దానిని చంపకుండా తొలగిపోవడంకానీ, రోడ్డుమీద బాధపడుతూన్న జంతువుకో మనిషికో సహాయం చేయడంగానీ మాత్రమేకాదు. శీలమనేమాటకు అంతంగానీ అవధిగానీ లేదు. అది వయస్సుతో పెరుగుతుంది; అనుభవంతో మెరుగెక్కుతుంది; లోహాలకు కొన్నివస్తువులతో కలిగిన సంపర్కంవల్ల తుప్పుపట్టినట్లుగానే మనిషి శీలంకూడా కళంకితం కావడానికి సావకాశమున్నది. కాబట్టి మానవుడా పరిసరాలకు దూరంగా ఉండాలి. లేదా వినాశ హేతుభూతములైన ఆ పరిస్థితుల అపగుణాలు తనపైన ప్రసరించకుండా నిరోధించగలిగి ఉండాలి. లేదా పరిస్థితులకు అతీతంగా ఉండడానికి నిరంతరమూ ప్రయత్నించాలి.

## సంఘ వ్యవస్థ.

మన జీవితంలో తటస్థించే అనుకూల ప్రతికూల పరివర్తనముల పర్యవసానమే మానవ ప్రవర్తనమునకు లేక సంఘవ్యవస్థకు మూలము. మనమూ పరిణామాలకు కేంద్రస్థానములవంటివాళ్ళము. లేదా త్రాసుపళ్లెము మొనవంటివాళ్ళము. ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క విషయాన్ని ఒక్కొక్కప్పుడమే ఒక కొత్త పంతం. అనగా మానవవ్యవస్థ అనే త్రాసుపళ్లెము మొనను. ఒకవైపునుండి మళ్లీ

యొక్క వైపుకు మొగ్గేటట్లుగా చేయ ప్రయత్నించడ మన్నమాట. కొన్ని ప్రత్యేకాదర్శములతో ప్రారంభమైన ఉద్యమాలు వివిధ మతములుగా పరిణమించవచ్చును. అసత్యాన్ని నశింపచేసి సత్యమునూ, మృత్యువును రూపుమాపి ప్రాణమునూ, చీకటిని పోగొట్టి వెలుతురునూ రక్షించవలెనంటే రైలుపట్టాలవంటి దోవ పనికిరాదు. రోడ్డుమీద మలికలు తిరిగిపోయే మోటారుదారివలే ఉండవలసివస్తుందది. అందువల్లనే నిర్మాణంలో గాని, కార్యవిధానంలోగానీ, యెంత సన్నిహిత సంబంధం కలిగిన మతమైనా, కొద్దిరోజులలోనే అభిప్రాయభేదాలకు తావలమై పక్షాలుగా చీలిపోవడానికి వీలు కలుగుతూన్నది. ఆ పక్షాలలో కొందరు మొదటిసిద్ధాంతాలకు కట్టుబడి ఉంటారు. మరికొందరు వాటికి చాలా దూరంగా ఉంటారు. ఇందుకుదాహరణం లెనిన్, ట్రాట్స్కీ స్టాలినులు. ప్రథమంలో మన కౌన్సిళ్ళ, కాలేజీల, కోర్టుల బహిష్కరణమూ, తరువాత కౌన్సిళ్ళ ప్రవేశము, మంత్రిత్వ స్వీకరణమూ, రాజీనామాలనూ కూడా ఇందుకు తార్కాణంగా చెప్పవచ్చును. ఈ సందర్భంలో కౌంట్ హర్మన్ కీసర్లింగ్ ఇలా అన్నాడు.

"ప్రత్యేక ఉద్యమాలకు సంబంధించిన ప్రత్యేకాభిప్రాయాలను లెక్కలోకి తీసుకోకూడదు. అవి సాధారణంగా అపార్థాలకు ఆస్పదాలుగా ఉంటవి. ముఖ్యంగా ప్రతిఉద్యమంలోనూ దాని పేరుకు నిలిచిన ఉద్దేశాలూ విషయాలూ ఇమిడిఉంటవి. నామరూపాలకూ వాటివెనుకనున్న నిజమైన శక్తికీ యేమీ సంబంధంలేదని కాలక్రమేణా తెలిసిపోతుంది. ఇది చరిత్ర చెప్తూన్న విషయం. ఒక ప్రత్యేకాదర్శముతో ప్రారంభ

పైన ఉద్యమం కొంతకాలంలో దానికి భిన్నమైనదిగా పరిణమించడం నిత్యమూ జరుగుతూనే ఉన్నది. కాబట్టి ప్రపంచోద్యమాలను గురించి నేడు చలామణీలో ఉన్న యే పేరునూగూడా సరియైన పేరుగా నే నెంతమాత్రమూ విశ్వసించను. ప్రజా పరిపాలనకోసమో, సోషలిజం కోసమో, స్వాతంత్ర్యంకోసమో, నాస్తికత్వముకోసమో పోరాడుతూ న్నామని నటించే ప్రపంచంలోని యే జాతీకూడా తాననుకొన్నది పైకి చెప్పడంలేదు. నిజానికి వాళ్ళ పరమావధి యేమిటో వాళ్ళకే తెలి యక చీకట్లో తడుముకొంటూన్నారు. వారి ఆదర్శములిప్పుడే మొల కెత్తుతూన్నవి. అవి కొంచెం పెరిగి మారాకు దొడిగినప్పుడుగాని వాటిని గుర్తుపట్టడం కష్టం. మనకాలంలోని ఈ మానవులు పోరాడుతూన్న యే ఒక్క ఆదర్శమూకూడా చివరకు విజయంపొందడం కష్టం. ఎందు వల్లనంటే నేటి మానవప్రపంచం పరస్పర మహాసంఘట్టనముల కాక రములయిన భీషణశక్తులకు కేంద్రములుగా విభజింపబడి యున్నది. ఈ తరుణం కడచినపిమ్మట మిగిలిఉన్న వివిధ సిద్ధాంత సమ్మేళనమే- అటువంటి సమ్మేళనం కలగడం చాలాకష్టమే- పర్యవసానానికి ఇతర మైన యే ఒక్క సిద్ధాంతంకంటెనూకూడా మేలుగా ఒడిదుడుకులు లేని ప్రపంచనియతికి కారణం కాగలదు.

## 3

గాంధీ తత్వజ్ఞానియా లేక అజ్ఞేయవాదియా అనిగానీ, ఆయన దేవుడు రూపం కలవాడా లేక భావకల్పితుడా అనిగానీ, ఆయ నను వ్యష్టిప్రార్థనలలో విశ్వాసమా లేక సమష్టిప్రార్థనలలో నమ్మకమా అనిగానీ, ఆయనమతం భక్తిజ్ఞానమూ మా లేక కర్మమూలమా అనిగానీ, యెవ్వరూ ప్రశ్నించనక్కరలేదు. ఆయనజ్ఞానం భక్తిగా పరిణామంపొందింది. ఆయనభక్తి కర్మగా

ఘనీభవించింది. ఈ సమన్వయమే గాంధీ లక్షణానికి సహజత్వం కల్పించి దానిని అత్యంతాదరపాత్రంగా చేసింది.

ఈ విషయంలో జాన్ మూర్రే ఇలా అన్నాడు:

"మానవ స్వభావముయొక్క విజ్ఞాన నైతిక లౌకిక భాగముల సమన్వయమును—బుద్ధి, ప్రేమ, ఇచ్ఛ ఈ మూడింటియొక్క అచంచల సహభాగమును—సూచిస్తుందది. ప్రేమకు విరుద్ధమైన పనిని దేనినీ బుద్ధి సూచింపదు. అది కావలెనన్న దేపనినీ బుద్ధి కాదనదు. ఇచ్ఛ శక్తికిన రెండుశక్తుల సమష్టి కోరికలను మన్నిస్తూంటుంది.

గాంధీకి వ్యాపరికమనేది లేదు. ఆయనచేసే ప్రతిపనిలోనూ ఆయనఆడే ప్రతిమాటలోనూ, ఆయనమతం ప్రతిఫలిస్తూంటుంది. ఆయన తన మతమని దేనినీ, యెక్కడా వేదంవలె, కొరాన్‌వలె, వ్రాసిపెట్టలేదు. కాని ఆయన ఉపదేశం ఆయన సమకాలికులకే కాక భావి సంతానానికికూడా అందుబాటులో ఉన్నది. ఆ స్త్రీని త్యజించిన జితేంద్రియుడు, బాహ్యశత్రువులనేకాక అంతశ్శత్రువులనుకూడా జయించినట్లే. జితేంద్రియునకు కోరికఉండదు. కోరిక లేనివానికి భయముకూడా ఉండదు. కోరిక - భయమూ ఈ రెండూ ఇంద్రియవికారమనే బొమ్మకు రెండువైపులు. గాంధీ ఇతరులకోసం జీవిస్తున్నాడు. సంఘం గాంధీకి కోవెల. సేవ ఆయన పూజావిధానం. మానవసంతానంపైననే ఆయన ఉత్కంఠ. ఆయన దైవం సత్యమొక్కటే. అహింసద్వారానే దానిని చేరనిశ్చగించును. ఆయన ప్రార్థన లోకంలోని ప్రాణులతో భిన్నముకాని విశ్వాత్మకం.

గాంధీ మతమంటే కొన్ని సూత్రాలూ, సిద్ధాంతాలూ, నియమాలూ, మర్యాదలూ, విధులూ, నిషేధాలూ కాదు. అది ఒక జీవిత విధానం. అది మన జీవితసమస్యలకు కొత్త దృక్పథాన్ని సూచిస్తుంది; లేదా పాత వైఖరినే పునరుద్ఘాటిస్తుంది; అంతేకాదు "ఆధునికసమస్యలకు సనాతన పరిష్కారములను తెలియజేస్తుంది."

సర్ రాధాకృష్ణ ఈ సందర్భంలో ఇలా వ్రాస్తున్నారు:

"జాతీయ స్థైర్యమునకూ ప్రపంచవ్యవస్థకూ కూడా నూతనజీవిత విధానమొకటి మూలము కావాలి. అది అన్నితరగతుల, అన్నిజాతుల, అన్నిదేశముల ప్రజల ప్రయోజనములనూ కాపాడగలిగి ఉండాలి. ఎవరైతే స్వార్థమనే అవిద్యాంధకారమునుండితప్పించుకొని బయటపడ్డారో, వారే ప్రపంచశాంతికోసం పాటుపడి దానిని స్థాపించగలవారు. ప్రపంచశాంతి అంటే మానవకోటియొక్క జీవితంలోనూ, ప్రవర్తనలోనూ, కొన్ని సార్వలౌకికసిద్ధాంతాలూ, ఆదర్శాలూ రూపం దాల్చడమే. అందుకోసం నీతిని వికృతము చేయుని, మానవజీవితమును వినాశనము చేయని, ఆయుధములద్వారా మనము పోరాడాలి. ఈ ప్రయత్నంలో మనకెట్టి కష్టనష్టాలు తటస్థించినా, మనము ఓర్చుకోడానికి సంసిద్ధంగా ఉండాలి."

అయితే మనమిక గాంధీ తత్వాన్ని పరిశీలించాలంటే ఏమి చేయాలి? గాంధీ జీవితమును, ఆయన మహాత్కార్యములనూ, ఆయన సంశయములనూ చిక్కులనూ, దృక్పథమునూ అర్థంచేసుకోవడమే ఆయన తత్వాన్ని పరిశీలించడం. "శాఠ్యేన శఠం జయేత్" చెడుగును చెడుగువలననే జయించవలెననడం తగదు. "చెడుగును మంచిచే జయించాలి." నీకపకారం చేసినవారికి ఉపకారం చెయ్యి. నిన్ను తప్పుపట్టేవారెవరూ లేరని ఇతరులను

తప్పుపట్టకు. నిన్ను అవమానం చేసినవారిని మన్నించు." అని క్రైస్తు సందేశం. మన ఇతిహాసాలు కూడా ఈవిషయంలో ఇంత గట్టిగానూ చెప్పినయి చూడండి "నీకుజరిగిన అపకారానికి ప్రత్యపకారం చేయకూడదు. కాని ఆ అపకారియెడల ఎప్పుడూ మంచిగా, దయగా ప్రవర్తించాలి. ఎందుకంటావా, ఎవరికైనా ఏదైనా అపకారం చేయతలచుకొన్న దుర్మార్గుడు తనంతటతానే నాశనమైపోతాడు. ♦

ఈ ప్రధానసూత్రాలు హిందువులకూ క్రైస్తవులకూ కూడా దేశకాల పాత్రావస్థలతో నిమిత్తం లేకుండా సమంగా వర్తిస్తవి. గాంధీజీ మాటలూ చేతలూ, ఆయన ఇతరుల మాటలనూ చేతలనూ గూర్చి చేసిన విమర్శలూ, ఈ అన్నీ గాంధీ తత్వాన్ని పరిశీలించడానికి మార్గదర్శకాలు.

"ఈ మతాలన్నీ తమ తీవ్రవాదాన్ని తగ్గించుకొని, కొంచెం నిజమైన మత తత్వాన్ని, కొన్ని ఆధ్యాత్మికసిద్ధాంతాలతో చేర్చుకొన్నట్లయితే, పరస్పర ప్రేమాలింగనం చేసుకొని ఉండేవి. ఈ మతసిద్ధాంతా లన్నింటిలోనూ, ఉంచుకోదగిన మహత్తర విషయాలూ ఉన్నవి, తీసివేయదగిన మహాపరాధ విషయాలూ ఉన్నవి."

౪

ఇంతవరకు మనము గాంధీని స్థూలంగా ఆలోచించాము. ఇప్పుడిక గాంధీ తత్వమును సూక్ష్మంగా పరిశీలించాలి. ఇజం అంటే పేరు. కాబట్టి గాంధీజం అనగా గాంధీపేరు అన్నమాట.

♦ మహాభారతం, వనపర్వం 206-42. 3

గాంధీ, ఆయన పేరూ, కొన్ని ప్రధాన సూత్రాలకూ విధానాలకూ సంబంధించి ఉండకపోతే వాని ప్రయోజనమేలేదు. గాంధీ తత్వశాస్త్రం అంటే, ఆ ఉపదేశాలూ విధానాలే. అదే గాంధీ జీవితాన్ని ప్రవర్తననూ తీర్చిదిద్దింది. అదే ఆయన సుభాషితాలకూ ఉపదేశాలకూ, మహత్కార్యాలకూ కారణభూతమయింది.

గాంధీజం అనేమాట దాదాపు అందరికీ సుపరిచితమైనదే. ఈ మాటను గాంధీ మొదటిసారి, గాంధీ-ఇర్విన్ ఒడంబడిక జరిగినపిదప, కరాచీలో కాంగ్రెసు జరిగేముందు ఒక బహిరంగ సభలో ఉపయోగించాడు. "గాంధీ మరణించవచ్చును కాని గాంధీజం మాత్రం శాశ్వతంగా ఉంటుంది" అన్నాడు. ఈ మాటను బహుశా, ఆయన అప్పటికప్పుడే సత్యాహింసల మూలమైన తన సిద్ధాంతమంతకూ సూత్రప్రాయముగు సంగ్రహనామంగా కల్పించి ఉంటాడు.

1936 మార్చిలో సయోలీలో గాంధీ సేవాసంఘ సభ్యులకు గాంధీయే ఈ విధంగా చెప్పినాడు.

> "'గాంధీమతొ' మన్నేది (Gandhism) ఎక్కడా లేదు. నా అనంతరం అటువంటి మతస్థులు ఉండవలెనని కూడా నేనుకోరను. నేనొక క్రొత్త సిద్ధాంతాన్నో మతాన్నో స్వయంగా సృష్టించినట్లుగా చెప్పుకోవడం లేదు. మన నిత్యజీవితంలోని సమస్యలకు శాశ్వతసత్యములను అనువర్తింపచేయడానికి మాత్రమే నేను ప్రయత్నించాను ... నా అభిప్రాయాలు కానీ, నా నిర్ణయాలు కానీ, మారవనడానికివీలు లేదు. రేపు వాటిని నేను మార్చుకోవచ్చును. నేను ప్రపంచాని కుపదేశించవలసిన క్రొత్తసంగతి ఏమీలేదు. సత్యాహింసలు కొండలు పుట్టిననాడే పుట్టినవి. నా సాధ్య

మైనంత పెద్ద యెత్తులో వాటిని ప్రయోగించి చూడడమే నేను చేసిన దంతా. ఈ నా ప్రయోగాలలో నేను కొన్నిసార్లు పొరపాటు చేశాను. ఆ పొరపాట్ల మూలాన నేను చాలా నేర్చుకొన్నాను. సత్యాహింసలను ఆచరణలో పెట్టడంలో జీవితమూ అందుకు సంబంధించిన సమస్యలూ నాకు పరీక్షలుగా పరిణమించినవి. స్వతస్సిద్ధంగా నేను సత్యవాదినే కాని హింసా తత్పరుడను కాను. నిజానికి నా సత్యాన్వేషణ ప్రయత్నంలో నేను అహింసను తెలుసుకోగలిగినాను... నేను చెప్పినదాని లోనే నా సిద్ధాంతమంతా — ఈ పెద్ద పేరే ఉండనీయండి-ఇమిడివుంది. దానిని గాంధీ మతమని పిలవకండి! దానిలో మతమేమీ లేదు."

గాంధీ సిద్ధాంత ధోరణులను తెలుసుకోవలెనని కోరేవారు, గాంధీ సేవా సంఘాధ్యక్షులు శ్రీ కిశోరీలాల్ మశ్రూవాలా, దేశ స్వాతంత్ర్యవాంఛ కలవారంతా అవలంబించవలసినదని సంగ్రహంగానూ సమగ్రంగానూ వర్ణించిన, ఈ క్రింది ముఖ్యసిద్ధాంతాలను గమనింపవలెను.

౧ జీవితమును సేవకొఱకు అర్పించడం,

౨ మంచిప్రవర్తనా ఆదర్శమూ కలిగిఉండడం,

౩ ఆత్మనిగ్రహమూ, నియతీ కలిగిఉండడం. వ్యర్థ కాలక్షేపమునకూ భోగపరాయణతకూ విముఖుడుగా ఉండడం,

౪ అత్యంత నిరాడంబరత్వమూ, పేదరికమూ, కష్టసహిష్ణుతా కలిగి ఉండడం.

గాంధీ యెప్పుడూ తాను గురుపీఠంలో కూర్చొని శిష్యులకు బోధించలేదు. "నాకు శిష్యులు లేరు. నేనే శిష్యుణ్ణిగా ఉండగోరి గురువుకోసం వెతుకుతూన్నాను" అన్నాడు. కాని యెంగొప్ప

ప్రవక్తా తాను గురువునని చెప్పుకోలేదు. గాంధీ తాను చెప్పు
కొన్నా, చెప్పుకోకపోయినా, ఆయన నూతన ప్రపంచవ్యవస్థకు
మూలపురుషుడనేమాట కాదనడానికి వీలులేదు. గాంధీ, గాంధీ
సిద్ధాంతమూ, మానవాభ్యుదయమునకు అనంతశక్తిని ప్రసా
దించినసంగతి ప్రపంచం విస్మరింపజాలదు.

గాంధీ మహోపదేశాలన్నీ సత్యాహింసలకు సంబంధించినవే.
"దౌర్జన్యం చేయడానికి తగినంత కోపకారణం కలిగినప్పుడుకూడా, మన
సా వాచా కర్మణా హింస లేకుండా ఉండడమే అహింసకు ఒరిపిడి
రాయి. మంచితనమూ మార్దవమూ కలచోట సామ్యంగా ఉండడం
గొప్పతనంకాదు. ప్రపంచంలో ఎటువంటి వ్యామోహాన్నయినాసరే
నిగ్రహించగల మహత్తమశక్తి కలది అహింస. జీసస్ క్రీస్తు విశ్వాస
ఘాతుకులను ఎఱుగును. వారికీ పేరు పెట్టడంలోకూడా ఆయన ఏమీ
సందేహించలేదు. కాని ఆయన దేవునియెదుట, వారియెడల దయచూపు
మని కోరినాడు. 'వారు చేస్తూండిన పని వారు తెలుసుకోలే' దన్నాడు.
నేను చెప్పిన ప్రతిమాటకూ తగిన ఉదాహరణాలను చూపించాను. నేను
క్రైస్తవమత ప్రచారకులకు మిత్రుణ్ణిగా భావిస్తూన్నాను. వారిలో అనే
కులతో నాకుసంతోషకరములైన సంబంధాలున్నవి. కాని నామిత్రత్వము,
నాస్నేహితుల పరిమితులనుకానీ, వారు ప్రోత్సాహపరిచే పద్ధతులనూ,
సంస్థలనుకానీ తెలుసుకోజాలనిది కాదు. ఔచిత్యమును గూర్చిన తప్పు
అభిప్రాయాలవల్లా, ఇతరుల మనస్సులను నొప్పిస్తామేమోననే భయం
వల్లా, తఱచుగా చాలామంది వారిభావమును విప్పిచెప్పక తుట్టతుదకు
కాపట్యమునకుకూడా గురి అవుతున్నారు. కాని వ్యక్తులలో గాని,
సంఘాలలోగాని, జాతులలోగాని, అహింసాభావం అభివృద్ధి పొందవలె
నంటే, తాత్కాలికంగా ఎంత అప్రియంగానూ కఠినంగానూ కనిపిం

చినా, సత్యమే చెప్పితీరాలి. అహింసా భావంలేని అహింసాకర్మ, నిష్ప్రయోజనం. అది ఎప్పుడూ వ్యాపకంకాదు. మాటలకంటెనూ క్రియలకంటెనూ కూడా, భావానికి ఎంతో ఎక్కువశక్తి ఉందని మనకు తెలియనే తెలియదు. భావము, పలుకు, పని, ఈ మూటినీ పోల్చిచూస్తే మొదటిదానికి పరిమితిలేదనీ తక్కిన రెంటికీ పరిమితి ఉందనీ తెలుస్తుంది. నేను 'భావము' అన్నప్పుడు పలుకులోకీ పనిలోకీ మారనున్న సజీవ భావమని మాత్రమే అర్థం చేసుకోవలెనని వేరుగా చెప్పనక్కరలేదు. శక్తిలేని ఊహలు గాలిలో మేడలు. వట్టి పొగ."—గాంధీ.

## సర్వమత సమన్వయం

అన్నిమతాలూ పరస్పర వైషమ్యాలతో మనిషినీ మనిషిని, జాతినీ జాతిని, వేరుచేస్తూన్న సమయంలో గాంధీజం, యాదృచ్ఛికంగా వాటిలో తటస్థించే ఆ పోరాటాలను సమన్వయం చేయడానికి సహాయపడుతూ, సోషలిజం, కమ్యూనిజం, ఫాసిజం, యూనివర్సలిజములలోని ముఖ్యసూత్రాలకు సమాధానం కుదర్చడానికి ప్రయత్నించిందని మా అభిప్రాయం. ఈ సమాధాన ప్రయత్నంలో గాంధీ ఇరవైయేండ్లు సాచివ్యం వహించి, శ్లాఘింపదగిన ఫలితములను పొందినాడు. ఏమత ప్రవక్తగానీ, యే తత్వవేత్తగానీ ఇంతకుముందు తాను జీవించియుండగానే, తనకళ్ళయెదుట, గాంధీ గడించినంతమంది అనుచరవర్గాన్ని గడించియుండలేదు. ఈమతాలనూ ఈసిద్ధాంతాలనూ, మేము స్థూలంగా ప్రాచ్య పాశ్చాత్య మతములనిగానీ, ఆధునిక సనాతన మతములనిగానీ వ్యవహరిస్తూంటాము.

కాని అవి సాధారణముగా రెంటి మిశ్రమముగానూ ఉంటవి. కేవలం చే ఒకటో అయియుండదు. ప్రతి నూతనసిద్ధాంతమూ కూడ పూర్వుల అడుగుజాడలను కొంతవరకైనా అనుసరించడం చేత, ఆకలయిక తప్పనిసరి అవుతుంది. మఱొకమాటలో చెప్ప వలెనంటే ప్రతిసిద్ధాంతానికీ ఒక కేంద్రమూ, ఒక వైవారమూ ఉంటుంది. ఆలాగే గాంధీసిద్ధాంతానికికూడా. ఆయన కేంద్రము భారతీయము. ఆయన వైవారం పాశ్చాత్యము లేక సార్వలౌకి కము. గాంధీజం కొత్త మతంకాదు. హిందూ ధర్మమునకు ప్రధానములైన ఆధ్యాత్మిక, నైతిక సూత్రముల కనుగుణముగా శతాబ్దాలకిందట రూపందాల్చిన ఆర్థిక, సాంఘిక నిర్మాణమే అది. దాని సంపూర్ణ స్వరూపాన్ని, ఆధునిక పరిస్థితులలో అది పనిచేసే విధానాన్ని తిరిగీ ఆయన దివ్యదృష్టితో చూచినట్లు చూడగలిగినాడు. గాంధీజం కొత్తది కాకపోవచ్చును, కాని మౌలికం. మౌలికమంటే లేనిది సృష్టించడంకానీ, ఉన్నది కను కోవడంకానీ. కనుక గాంధీజం మౌలికమని అంటున్నాము. అనగా కొత్త భావాన్ని వ్యాపకం చేయడంకానీ, లేదా పాత భావాన్నే కొత్తరూపంలో చెప్పడంకానీ అవుతుంది. మితపా నాన్ని, మద్యనిషేధాన్ని బోధించినవా రనేకమంది ఉన్నారు. స్వదేశీవస్తు స్వీకరణము విదేశవస్తు బహిష్కరణమునుగూర్చి కూడా చాలామంది ఉపదేశించారు. "తిరిగీ భూమి దున్ను కోండి" అనీ "గ్రామాలకు పోండి" అనీ చెప్పిన నాయకులు వంద లాది కలరు. కుల వైషమ్యాలనూ, సాంఘిక పోరాటాలనూ, అంట రానితనమునూ నిరసించిన మత ప్రచారకు లసంఖ్యాకులు, కాని

భారతజాతీయ సౌధనిర్మాణాన్ని సంపూర్ణంగా ఈయనవలె మనోనేత్రంతో చిత్రించుకొని చూచిన శిల్పిమాత్ర మెక్కడా లేడు. ఈయన జ్ఞానచక్షువులో ప్రతిఫలించిన జాతీయ భవనములో సమస్తమానవకోటికీ మఱి తగ్గించడానికి వీలులేని సమాన హక్కులూ, సమానావకాశాలూ, సమానస్థానమూ, సమాన స్థితీ యేర్పాటు చేయబడ్డది. దానికి పునాది భారతీయగ్రామం. అది స్వయంశక్తీ, స్వయంసంపూర్ణతా, స్వయంప్రతిభా కలిగి, పరస్పర భ్రాతృభావంతో, ప్రశాంతంగా జీవించే ప్రజలతో నిండి ఉంటుంది. యేసుక్రీస్తు మహానుభావుని సుభాషితాలు బైబిలులో ఉన్నవి. అవి వారం వారం ప్రపంచంలోని క్రైస్తవులందరికీ ఉపదేశింప బడుతూనే ఉన్నవి. కాని ఆ క్రైస్తవజాతులే నేడు ఆధునిక విజ్ఞాన శాస్త్రము కనిపెట్టగలిగిన మారణయంత్ర సాధనములతో పరస్పర హత్యాకాండకు దిగి, తమ కోసం పరాయిదేశముల నాక్రమించుకొంటూ, తక్కిన ప్రజలను పసులు చేయుస్తూన్నారు. మతమంటే ఆదివారపు ఆర్భాటం కాదనీ, అది ప్రతిక్షణమూ మానవుని ప్రతిపనికీ మార్గదర్శకంగా ఉండి, ఆతని తత్వంలో ఇమిడిపోవాలనీ ఉపదేశించడం గాంధీ పని అయింది.

స్వదేశీ, వంగరాష్ట్ర విభజనకు ప్రతిక్రియగా ప్రబోధింపబడ్డప్పుడు, మాతృదేశ ప్రేమా విదేశీయులయెడ ద్వేషమూ ఆ ఉద్యమానికి పునాదులయినవి. కాని దానివలన మాతృదేశస్వరూపం సరిగా ప్రస్ఫుటం కాలేదు. ఆంగ్ల విద్యాధికులు ప్రజాసామాన్యంతో కలసి మెలసి ఉండడమనేది అప్పుడూహింపబడలేదు.

అనగా పట్టణాలు, గ్రామ సౌభాగ్యంకోసం పాటుపడే ప్రణాళిక వారిదృష్టిలో లేదు. స్వదేశీ సిద్ధాంతప్రకారం నేతగానికి లాభం చేకూరిందికాని, వడికే మనిషినిగూర్చి ఆలోచనే లేకపోయింది. చేతిపరిశ్రమను అభివృద్ధి చేయడానికి ప్రయత్నం జరిగినా, పనిబాగుబవాండ్ల పనితనమునూ, పరికరములనూ భగ్నం చేయ పూనుకొన్న యంత్రముల దౌష్ట్యమునకు ప్రతిక్రియ యేమీ చేయబడలేదు. పైపెచ్చు గ్రామప్రజల అవసరాలకు భిన్నంగా కూడా అది కొనసాగింది. బ్రిటనుతో మనకుగల విరోధము బ్రిటిషు వస్తువుల బహిష్కరణమునుగూర్చి ఎలుగెత్తి చాటడంతో బాగా వెల్లడిఅయింది. అందువల్ల బ్రిటనుకు ఆర్థికంగా నష్టము కలిగింది. బ్రిటనుపైన ద్వేషం పుట్టించడం వరకే మనకుకలిగిన లాభం. కాబట్టి స్వదేశీ ఆందోళనలో నిర్మాణశక్తికంటె నిర్మూలనశక్తి యెక్కువ ప్రస్ఫుటంగా కనిపించింది. తరతరాలనాటి సిద్ధాంతాలతోనూ, సంప్రదాయాలతోనూ పునర్నిర్మితములైన నిజాదర్శములుగల జాతి అప్పటిప్రజల దృష్టిలో లేనేలేదు. వంగరాష్ట్ర విభజనాందోళనము ప్రారంభమయిన తరువాతకూడా ప్రజలలో ఉత్తమోత్తములైనవారు పాశ్చాత్య విజ్ఞాన వ్యామోహితులై బహిరంగంగా చెప్పకపోయినా, రహస్యంగానైనా మనస్సులో విదేశీయుల ఆశ్రయంకింద ఉద్యోగాలూ బిరుదులూ సంపాదించవలెననే కోరికతో ఉండేవారు. కాబట్టి గాంధీ 1915 లో ఇండియాకు వచ్చేసరికి ఇండియాప్రజలూ కాంగ్రెసువాదులూ కూడా రెండుపక్షాలుగా విడి ఉన్నారు. గోక్లే నాయకత్వంకింద బ్రిటిష్ రాజభక్తులూ, తిలక్ నాయకత్వంకింద

"ప్రభువుపైనా, ప్రజలపైనా కూడా అభిమానంగా ఉండే వారూ" పనిచేస్తూన్నారు. ఈ రెండూకాక, బసెంటు శ్రీరేపణతో బ్రిటిషు సామ్రాజ్యాధికారానికి లోబడి ఇండియా స్వతంత్రం కావాలనే మరియొక పక్షంబయలు దేరింది. వీరెవ్వరూ కూడా పాతవడ్డ బ్రిటిష్ పారతంత్ర్యాన్ని మూలముట్టుగా నిర్మూలంచేసి, ప్రతివానికీ చాలినంత అన్నం, వస్త్రం, ఇల్లూ లభించేటట్టు. ప్రాచ్యదేశీయ భావానుగుణమైన నూతన సాంఘిక ఆర్థిక నిర్మాణం చేయాలని ఎక్కడా చెప్పిఉండలేదు. నాటి విద్యాధికులకీ భావం కొత్త. వారిఘనత ఎంతవరకూ పరీక్షలలో ఉత్తీర్ణత పొందడంమీద ఉండేది. వారిదృష్టిలో సంస్కారమంటే యూనివర్సిటీ డిగ్రీ. ఆధిక్యత అంటే గవర్నమెంటు ఉద్యోగాలూ, బాగా డబ్బుసంపాదించే వృత్తులూ, ప్రభుత్వాశయంవల్ల లభించే గౌరవపదవులూ, రాజభక్తి చిహ్నంగా ఆరోపింపబడిన బిరుదులూ అలంకారాలూను. ఇటువంటిస్థితిలో మన సమస్యలను నూతన దృక్పథంతో పరిశీలన చేసినవాడు గాంధీ.

పెన్సిల్వేనియన్ విశ్వవిద్యాలయోపన్యాసకుడు అమెరికన్ జీవితాన్ని వ్యాఖ్యానం చేసినట్లుగా) గాంధీ మానవజీవితముయొక్క ఈ నూతన కథనాన్ని ఈ విధంగా వ్యాఖ్యానిస్తూన్నాడు.

"మానవజీవితము ఉత్తేజకరమైన ఒక గీతమువంటిది కాదు, ఒక దార్శనిక మహాకావ్యం వంటిదీ కాదు. సర్వతోముఖమైన స్వార్థానికీ, ఒక న్యాయం కోసమో ఒక సముద్యమంకోసమో ఒక ఆదర్శంకోసమో నిలబడి ఉండవలెననే కోరికకూ మానవ హృదయములో నిరంతరమూ నడిచే

సంగ్రామ నాటకమే అది. అనేకమంది, ఆదర్శాలకాలం అంతరించిం
దనీ, నైతికసిద్ధాంతాలను నెమ్మదిగా జారవిడిచి, వివిధవిధానాలుగా మన
స్వప్రయోజనాల కేవిధంగా ఉపకరిస్తవో జాగ్రత్తగా చూచుకొంటూ,
అవసరాల కనుగుణంగా ప్రవర్తించవలసిన తరుణ మాసన్నమైనదనీ,
చెప్పితే చెప్పుదురుగాక. మానవహక్కులనేవి కావ్యకల్పితములనీ, మన
వ్యక్తిసౌఖ్యమూ, సౌభాగ్యమూ చేకూర్చని ప్రజాపాలనములో మనకు
అభిమానపాత్రమైన దేదీ లేదనీ, తనపక్షంతో కలసి వోటుచేసి తనకో,
తనవారికో యేదో ఒకఉద్యోగం సంపాదించుకోవడమే, పౌరుని పరమ
ధర్మమనీ చెప్పేవారుకూడా ఉంటే ఉండవచ్చును. ధనం సంపాదించ
డమే పరమావధి అనీ, ధనముంటే అన్ని మంచిపనులనూ చేయవచ్చుననీ
కూడా కొందరనవచ్చును. 'మనము భాగస్వాములుగా నున్న పరిశ్రమ
లనుకానీ, వ్యాపారాన్నికానీ, కంపెనీనికానీ పెంపొందించడమే మనం
చేయవలసినపని. ప్రపంచంలో బలవత్తముడే బ్రతుకతగినవాడనే న్యా
యాన్ని వ్యాపారం ప్రతిపాదిస్తుంది. కాబట్టి మన వ్యాపారం నిలిస్తే
మనం బ్రతకతగినవాళ్ళ మన్నమాట ఋజువవుతుంది.' అని కొందరుచెప్ప
వచ్చును. ఈ లోకంలో బ్రతుకుతెరువు తెలిసిఉండడంతప్ప తక్కినద-తా
ఏమీలేదనీ- వట్టి మాయ, స్వప్నం, వేదాంతం అనీ-మనం చావదగిన
సముద్యమ మేమీ లేదనీ ఆ ఆదర్శాలకాల మిదివరకే అంతరించిందనీ
మరికొందరనవచ్చును.

"ఎవరైతే ఈ క్రూరసిద్ధాంతాన్ని ఉద్ఘాటిస్తారో, జపిస్తారో, హృదయా
లలో విశ్వసిస్తారో వారి జీవితాల కనువర్తింపచేస్తారో వారికినిజంగా
ఈ ఆదర్శాలకాలం అంతరించింది. అయితే ఇకవచ్చే దేమికాలము?
ఒక వర్గానికీ మరొక వర్గానికీమధ్య పెరిగిపోయే ఘోరమైన అసూయా
యుగమా? ఉన్నవాళ్ళకూ లేనివాళ్ళకూ మధ్య కలిగే ద్వేష పోరాటాల
యుగమా? పెద్దపెద్ద పేర్లుమాత్రం తగిలించుకొని సిద్ధాంతాలను విడచి

పెట్టి "డొల్లు బుచ్చకాయ పక్షాలు" యెన్నికలలో వ్యర్థంగా పోటీచేసే యుగమా? ఒకపక్క భోగలాలసత్వమూ, మఱొకపక్క దరిద్రదేవతా తాండవమాడే యుగమా? ఒకపక్క మేడలూ మఱొకపక్క పాడు గోడలూ ఉండే యుగమా? ఒకడు అష్టైశ్వర్యాలతో తులతూగుతూంటే మఱొకడు చూపోషమితో సృక్కిపోయే యుగమా? ఏవోవిధంగా వెల్లడిలోకి రావాలన్నే బడాయితో కోతులకు విందులు చేసి, సంభావన లిచ్చి, వ్యర్థకాలక్షేపం చేసిన 400 మంది ధనమదాంధులైన బుద్ధిహీనుల బొమ్మలనూ వార్తలనూ పత్రికలలో విస్తుపోయిచూచి ఆనందించిన 40 లక్షలమంది కబుర్లరాయళ్ళుఉండేయుగమా? ప్రజాపరిపాలకుల భీతినుండి రక్షణనుకోనుకొన్ని జీవించే సంస్థానాధిపతులయుగమా? పేదవాళ్ళభీమా ధనములకు రక్షకులమని చెప్పుకొంటూ, వాటిని లాభాలకింద ధనవంతుల భోగాలకోసం పంచి యిచ్చేవారి యుగమా? బంగారు నిచ్చెనలమీదుగా పక్కనున్నవాళ్ళ పైకెక్కి తమగుట్టు బయట పెడ్తామని బెదిరించే వారి కొరడావిదల్పు వినగానే కాస్సేపటికి, బూతులుతిట్టే పత్రికలకు భయపడి, వెంటనే కిందికి దిగివచ్చేవారి యుగమా? రాజకీయ దుర్వృత్తమనే కొండచిలువ, రాజ్యాలనూ రాజధానులనూ పెనవేసి చుట్టుకొని, ఋజువర్తనమునూ స్వాతంత్ర్యమునూ కుత్తుకనులిమి లాంగదీసుకొనే యుగమా? పూర్వ విజ్ఞాన దీపముల వెలుతురును వెదజల్లే దేవతామందిరముల దిక్కుకు పోని నాస్తికులకూ అవహేళనపరులకూ ప్రత్యేకమయ్యే యుగమా? కలుషీభూతమయిన, అనర్థదాయకమయిన, లజ్జాకరమైన యుగమా? పురాతన మహాత్ములనుండీ వారి అనుయాత్రికులనుండీ పరంపరాగతంగా సంక్రమించిన జీవితమూల్యంగల మాకు, స్వాతంత్ర్య చ్ఛాయల కింద మానవత్వమంటే యేమిటో తెలుసుకొన్న మాకు, ఆ యుగం రానక్కరలేదు. మతాన్నీ దేవుణ్ణీ విడిచిపెట్టిన ఆ దురదృష్టపు రోజులు మా దేశాని కసలేవద్దు. పురాతన భారతీయాదర్శ దేవతాప్రతిమ

న్యాయ్యదృష్టితో, నిష్కళంకహృదయంతో, సమబాహువులతో, మాకు కళ్ళకు కట్టినట్లు కనిపిస్తున్నది. నేటి పోరాటంలోకూడ పక్షాభిమానులు కాక సర్వమానవ సౌభాగ్యంకోరే స్థైర్యసంపన్నులూ ఋజుప్రవర్తకులూ అయిన యోధులు మాకు కనబడుతూన్నారు. మన పురాణ యోధులు నెత్తురు ధారపోసి సంపాదించిన హక్కులను మనం కష్టపడి రక్షించుకొని తీరవలెనని మా తాత్పర్యం. ("నిజమైన భవిష్యద్దృష్టితో మన పితరులు చేసిన పనిఅంతా మనం కాపాడుకొని తీరాలి.")

"భావిగతి తెలిసి పితరు లేవి చేసి
రవియ రక్షింప బడవలె నందు మేము"

వీటికి భంగము తీసికొనివచ్చే ఏ అధికారమునూ సహించకూడదు. వీటి కపాయముచేస్తే ఏ శాసన వ్యతిరేక కల్లోలమునూ అంగీకరించకూడదు. వీటిని గౌరవించని లేక వీటికెదురుతిరిగే ఏ వర్గమునూ మన్నించ కూడదు. పూర్వమే అకలుషిత జీవితంకోసం మనపెద్దలు జీవిస్తూ ఉండే వారో మనంకూడా అందుకే జీవించాలి. మనము పోరాడదగిన పోరా టమొకటి ఉన్నది. ప్రజల ప్రాథమిక హక్కులకోసం, అన్నవస్త్రాల కోసం పోరే పోరాటం. మన ప్రజలను నిజమైన స్వతంత్రులనుగా చేయ డం, మనస్వేచ్ఛను బంధించే పాశాలను త్రెంచివేయడం, రాజకీయా ర్థిక సాంఘిక దుర్వ్యవస్థ మునుండి మన జాతీయ జీవితమును నిర్మలంగా ఊంచడం, ఉపదేశంవల్లా ఉదాహరణవల్లా కూడా భారతీయ యువతీ యువకులను హిందూస్థానమును సేవించే ఉత్కృష్ట ధర్మాన్ని ప్రబో ధించడం, ఇవన్నీ భారత స్త్రీ పురుషులలో ఉత్తమోత్తములైన వారు చేయవలసిన పనులు. యెవరీపని చేయడానికి జన్మించారో వారిజన్మ ధన్యమయినది. యెవరీపని చేయడానికి గర్వపడుతూ పెరిగినారో వారిపెంపు పావనమయినది. ఈ పనియొక్క అర్థాన్నీ, అవసరాన్నీ యెవరు గ్రహించారో వారివిద్య కృతకృత్యమయినది. వారి త్యాగం

కానీ వారి కార్యదీక్షగానీ యెన్నటికీ వ్యర్థం కాదు. మానవ భాగధేయ మనే ఉన్నతాకాశములో, ప్రజావిశ్వాసము, స్వార్థరహిత ధైర్యము, ఆదర్శనిష్ఠ అనే మంచుచుక్కలు వెలుగుతూన్నంతవరకూ మహర్షుల యొక్కయు వారి అనుయాత్రికుల యొక్కయూ ఆశాజ్యోతి యెన్నటికీ చల్లారనే చల్లారదు.'

౫

గాంధీ ఉపదేశా లెక్కడా సూత్రప్రాయంగా వ్రాయబడలేదు. కాని ఆయన వ్రాతలలోనుండీ మాటలలోనుండి గ్రహించి కొంత వరకు "స్టీవెన్ హాబ్ హశాన్" ఈ దిగువ ప్రకారం వ్రాశాడు.

౧ అహింస (నిరపకారం లేక దౌర్జన్య రాహిత్యం) అంటే అత్యుత్కృష్టమైన ప్రేమ. అది ఉత్తమోత్తమమైన ధర్మం. అది ఒక్కటే మానవ సంతానానికి క్షేమం చేకూరుస్తుంది.

౨ అహింసలో నమ్మకం కలవాడు, చైతన్యంగల దేవునిలో నమ్మకం కలిగి ఉంటాడు.

౩ అహింస కేవలం నోటితో ఉపదేశింప బడేదికాదు. మనఃపూర్వక ప్రార్థనా ఫలితంగా దైవానుగ్రహంవలన అది మన హృదయంలోనే చిగురిస్తుంది.

౪ అత్యంత ధైర్యమూ అత్యంత బలమూ కలవారికే అహింస ఆయుధం. నిజమైన దేవుని మనిషికి శక్తిని ఉపయోగించడానికి తగినబలం ఉంటుంది. కాని ప్రతిమనిషీ దేవుని రూపమేనని తెలుసుకొని దానిని ఉపయోగించడు.

౫ నెత్తురే చిందవలసివస్తే మన నెత్తురే చిందనీ! చంపకుండా చచ్చి పోయేటందుకు, నిమ్మకు నీరెత్తినట్లు నిలబడగల ధైర్యాన్ని అలవాటు చేసుకో!

ప్రేమ ఇతరులను దహించదు. కాని సంతోషంగా ఆమరణాంతం బాధపడుతూ తనను తాను దహించుకొంటుంది. మనసా వాచా కర్మణా అది ఇంగ్లీషువానికికూడా ఉద్దేశపూర్వకంగా ఏవిధమైన హానీ చేయదు.

౭ ఇండియా విజేత లనబడేవారిని హిందూదేశం ప్రేమతో జయించాలి. సర్వమానవప్రేమ అన్నా, దేశభక్తి అన్నా మనకు ఒకటే అర్థం. హిందూదేశాన్ని సేవించడానికి నేను ఇంగ్లండుకు గానీ జర్మనీకి గానీ హానిచేయను.

౮ సత్యానికీ అహింసకూ అవినాభావ సంబంధం.

౯ సత్యాన్నిమించిన దేవుడులేడు. సత్యాన్వేషణమే ప్రధానము.

౧౦ దేవునిచే నడపబడుతూన్న మన పవిత్ర యుద్ధములో దాపరికమేమీ లేదు. మాయకు సావకాశంలేదు. అసత్యానికి స్థానంలేదు. ప్రతిప శత్రువు కళ్ళెదుట జరుగవలసినదే.

౧౧ సత్యాగ్రహ (సత్యశక్తి లేక ఆత్మశక్తి) మనకు, ఆత్మనిగ్రహం అవసరం. అందుకు ప్రార్థన చేయాలి.

౧౨ తాను చేసిన ప్రతిపనిలోనూ సత్యాగ్రహి తన ప్రత్యర్థి అవసరాలను గమనించాలి. ఆయన ప్రత్యర్థియెడల యెప్పుడూ సామ్యంగానూ దాక్షిణ్యంతోనూ ప్రవర్తిస్తాడు. కాని అన్యాయమైన చట్టాలను గానీ ఆజ్ఞలనుగానీ మన్నించడు.

౧౩ సత్యాగ్రహి న్యాయ్యపథమునుండి ఒక్క అడుగైనా తొలగడు. కాని శాంతికోసం తహతహలాడు తూంటాడు. అతనివిశ్వాసం అచంచలం, అతని సహన మనంతం. అతనిఆశ అమోఘం.

౧౪ మొత్తముపైన మానవస్వభావమంతా ఒకతీరుగానే ఉంటుంది. కాబట్టి దౌర్జన్యపరుడు చివరకు తప్పకుండా ప్రేమకు బదులు తీర్చక తప్పదు.

౧౫ శాంతవృత్తమూ, అచంచల సంకల్పమూ, దైవభీతీ గల యే జాతినీ ప్రపంచంలో యేశక్తీ అణగించలేదు. అవనిపైగల అంత ఆయుధ సామగ్రికంటెనూకూడా, అహింస యెక్కువ శక్తివంతము.

౧౬ దైవభీతి గలవాండ్లను మృత్యువు భయపెట్టలేదు.

౧౭ యుద్ధరంగంలోని ధైర్యం మనకు సాధ్యమైన పనికాదు. శరీరతుష్టిని కూర్చిన భయం, రోగభయం, మృత్యుభయం, కుటుంబప్రతిష్ఠ, ఆస్తిపాస్తులూ పోతవనే భయం-ఇవి లేకపోవడం అత్యావసరం. ఈ ప్రపంచంలో ఏదీ మనదికాదు.

౧౮ అహింసకు నిజమైన వినయం కావాలి. యెందువల్లననగా దానివలన మనము మనపైనకాక దైవముపైన ఆధారపడవలసి యున్నదిగనుక.



# అధ్యాయము ౨

## అహింస

### ౧

ప్రతి నూతనసృష్టి(Invention)ఆవిష్కారణమూ (Discovery) కూడా వెల్లడి చేసినతరువాత చాలా తేలికగా కనిపిస్తుంది. బురదను బురద కడిగివేయలేదనిగానీ, సైతాను సైతానును సంస్కరించలేడనిగానీ, హింసను హింస తొలగించలేదనిగానీ చెప్పడం చాలా తేలిక. హింసయొక్క చిత్రగతులను నిరోధించవలెనంటే అహింసయే మార్గం. హింసను హింసయే నిరోధించగలదనే సూత్రము నవలంబించినట్లయితే, మానవ సంఘంలోని చెడుగులను తొలగించడానికి రోజురోజుకూ యెక్కువ హింస చేయవలసి వస్తుంది. ఎందువల్లననగా తక్కువహింసను నిరోధించడానికంతకన్న ఎక్కువహింస చేయకతప్పదు. ఈ విధంగా హింస నానాటికి పైమెట్టులోకి పోతూ ఉంటుందేకాని ఎన్నడూ తొలగిపోదు. హింసను తొలగించడానికి ప్రయత్నించిన వారిలో గాంధీయే మొట్టమొదటివాడు కాదు. జీసస్ సంఘమునకు చెందిన ఇగ్నాటియస్ లొయోలా వంటివారనేకమంది, బ్రహ్మచర్య మవలంబించి, కామ మమకారములకు దూరులై హింసాపథము నడ్డగించి ఉండిరి.

ప్రపంచాభ్యుదయమునకూ సత్యస్థాపనకూ శ్రమచేసిన మహానుభావులెందరో కలరు. వారంతా ప్రత్యక్షంగానో పరోక్షంగానో అహింసా సిద్ధాంతము నుపదేశించినవారే. పార్శ్వుడు

(Parsva), బుద్ధుడు, మహావీరుడు లాట్సు (Lautsu), జీసస్ క్రీస్తు, పాల్ ఆఫ్ టార్సస్ (Paul of Tarsus), పీటర్ వాల్డో, వైక్లిఫ్, హస్ (Huss), సైనస్సు, జార్జి ఫాక్సు, జాన్ వూల్ మన్, విలియం పెన్, తోరే (Thoreau), టాల్‌స్టాయి-వీరందరూ కూడా మంచి దైవభక్తులు, అహింసా ప్రవక్తలూ ప్రామాణ పురుషులూను. రష్యాలో అహింసా సిద్ధాంతమునకు మూల పురుషులైన టాల్‌స్టాయి, క్రోపాట్కిన్ లున్నూ, రస్కిన్, తోరే, ఎడ్వర్డు కార్పెంటరులున్నూ ఇండియాలో చాలామందికి చిరపరిచితులైన వారే. బ్రదర్ గెల్సు, జాన్ వూల్‌మన్, మైకేల్ కోట్సు ది క్వేకర్, ఈశ్వరనిందకు శిక్షింపబడిన 17 వ శతాబ్దపునాటి జేమ్సు నేలర్, అరణ్యరోదనం చేసిన గూఢ తత్వవిదుడు జాకబ్ బహ్మే, ఆయన ఆంగ్లశిష్యుడు విల్లియం లా, టాల్‌స్టాయికి ముందువాడైన 15 వ శతాబ్దపు పీటర్ షెల్ షికీ (Chelchizki), ధర్మంకోసం ప్రాణా లర్పించిన సోక్రటీస్, గియార్డినో బ్రూనో, సర్వెటస్ మొదలయిన మృతజీవులూ కూడా చాలామందికి తెలిసినవారే. టాల్‌స్టాయి, క్రోపాట్కిన్‌ల మార్గాన పనిచేసినవా రెంతమందో జర్మనీలో కలరు. వారు కర్టు ఈస్నర్ (Kurt Eisner), గుస్టవ్ లాండర్ (Gustow Landauer), కార్ వాన్ ఒస్సీట్జ్కీ, ఈరిచ్ మిహాసాన్, థియోడర్ లెస్సింగ్. వీరుగాక ఆల్ఫ్రెడ్ వాలెస్, వాషింగ్టన్ కోషిన్‌స్కో (Washington Koscinsko) లఫయెట్టీ, క్లార్క్‌సన్, విల్బర్ ఫోర్సు, డేవిడ్ లాయడ్ గ్యారిసన్, అబ్రహాం లింకన్‌లు ఉన్నారు. వీరికి మకుటాయమానంగా ఇంకా కొందరు ప్రపంచ విఖ్యాతపురుషు లున్నారు. వారు

"సృష్టి కనుగుణంగా నిరాడంబరమైన నిరుపేదజీవితమును గడపిన" సెంటు ఫ్రాన్సిస్ ఆఫ్ అస్సీసి, తత్వజ్ఞాని భావుకుడూ అయిన సెంటు థామస్ ఎక్వినాస్. ఈ యోగులయొక్కయు దివ్యజ్ఞానులయొక్కయూ జాబితాకు గాంధీ పేరుకూడా మేము చేరుస్తున్నాము.

## ప్రయోగాలకు అవకాశం

పరాధీనమయిన భారతదేశపు వింతపరిస్థితులు, గాంధీ తనప్రయోగములను, ఇదివర కేమతగురువులకూ సాధ్యంకానంత విరివిగానూ స్థిమితంగానూ సాగించడానికి సావకాశం గలిగించినవి. ఏది ఎలా ఉన్నప్పటికీ ఈ యుగంలో అహింసాభావం కొంత ఉన్నత స్థాయికి చేరినదనిమాత్రం చెప్పకతప్పదు. అందువల్లనే ఉన్మాదాశ్రయాలు (**Lunatic asylums**) మానసిక చికిత్సాలయములూ (**Mental hospitals**), కారాగారాలు (**Jails**) పశ్చాత్తాప మందిరాలూ (**Pentientiaries**) అయినవి. మైనరు నేరస్థులు సంస్కార మందిరములకు (**Reformatories**) పంపబడుతూన్నారు. శిక్షకు బదులుగా నిరోధమే ఉపయోగింపబడుతూన్నది. రోగచికిత్సకు బదులుగా ప్రజారోగ్యసూత్రాలు పరిపాలింపబడుతూన్నవి. నేరాలుచేసే గుంపులకు విద్యాబుద్ధులు చెప్పి, కొత్తగా మళ్ళీ సెటిల్మెంటులలోకి తీసికొని వస్తూన్నారు. నేరం చేసిన తరువాత నేరస్తుణ్ని శిక్షించడంకంటే ప్రేమపూర్వకమైన ప్రయత్నంవలన నేరం చేయకుండానే చూడవచ్చునని నిరూపించడానికివి సకృతుగా అక్కడక్కడా చేయబడే ప్రయ

త్నాలు. పిచ్చివాణ్ణీ నేరస్తుణ్ణీ విద్యాబుద్ధులు చెప్పి సంస్క-రించినట్లుగానే, యుద్ధప్రియులనూ దురాశాపూరితులైన రాజులనూ ప్రజాపీడితులైన పాలకులనూ, కోపిష్ఠియైన సోదరుణ్ని, కసిపట్టిన భర్తనూ, పెంకెబిడ్డనూ-వీరందరినీకూడా మనము సంస్కరించవలసి యున్నది. గాంధీ వీరందరినీ ఒకే గుంపులో చేర్చి, ప్రేమ అనే నూతన చట్టప్రయోగమునూ అహింస అనే నూతన సిద్ధాంతాచరణమునూ అనువర్తింప చేశాడు.

నిజమైన మతము బుద్ధిచేత గాక హృదయముచేతనే గ్రహింపబడ దగినదైతే, యెవరికీ అది కొత్తగా ఉండడానికి వీలులేదు. ప్రతివాడూ అటువంటి మతమును తన హృదయమునుండియే వికసింప చేసుకోవచ్చును. సత్యమూ అహింసా ఆత్మనిగ్రహమూ, ఇవి గాంధీ అనుయాయులలో ప్రతివాడూ అవలంబించవలసిన ముఖ్య సిద్ధాంతాలు. అహింస కేవలం నిషేధాత్మకమైనది కాదు. విధియుక్తమైనది కూడా. "కుక్క-కాటుకు చెప్పుదెబ్బ" వలె అపకారం చేసినవానికి ప్రత్యపకారం చేయకపోవడమే అహింస కాదు. చెడుగును మంచితో జయించడం అహింస. నీకపకారం చేసినవారి కుపకారం చేయడం అహింస. నీపైకి వచ్చినవాండ్లను క్షమించడం అహింస. ధోవతీ దొంగిలించినవాడికి ఉత్తరీయం బహుమతీచేయడం అహింస. అంటే అహింసా సిద్ధాంతంలో ప్రత్యపకారం చేయడమనేది లేదు. మనస్సులో రోషం పెట్టుకోవడం తగదు. కసిపట్టుకోరాదు. రహస్యంగా చేసే ఖూనీ గానీ బహిరంగంగా చేసే యుద్ధంగానీ పనికిరాదు. మనస్సులో, మాటలో, క్రియలో, హింస కూడదు. కోపం తప్పు.

ఇదంతా మానవాతీతమయిన విషయంగా కనిపించవచ్చును. కాని శారీరకంగానూ మానసికంగానూ చేసే కొన్ని కష్టములైన అభ్యాసాలు (**exercises**) నీకు ఆత్మవిశ్వాసాన్ని కలిగించి, సంతోషమునూ ఆధ్యాత్మిక శక్తినీ పెంపొందింప చేస్తవి. ఇవి చేయడంలో ఎప్పుడు నీవు తప్పిపోయినా సిగ్గూ విచారమూ కలుగుతయి. ఎప్పుడు నీవు జయంపొందినా విశ్వాసమూ ఉత్సాహమూ కలుగుతయి. కాబట్టి ఈ సందర్భంలో జయం వలె జయం పొందేదికానీ, అపజయంవలె అపజయం పొందేది కానీ మఱొకటి లేదని నిశ్చయంగా చెప్పవచ్చును.

మానసిక ప్రవృత్తులను ప్రకోపింపచేసే చర్యగానీ, ఉద్దేశం కానీ, ఊహకానీ హింసకిందకే వస్తుంది. అనగా గర్వము, అవ హేళనము, అసహ్యాత, కోపం, అసహనం, గునియడం, కసి, కోపం, చంపడం, గాయపరచడం, భయపెట్టడం, దుర్విని యోగం చేయడం, మోసగించడం, విషంపెట్టడం, చెడుగును ప్రేరేపించడం, ముఖస్తుతిచేయడం, బుద్ధిపూర్వకంగా శీలాన్ని పాడుచేసుకోవడం-ఇవన్నీ హింసారూపాలే. సాత్విక నిరోధ కుడు నిరంతరమూ మంచి పరిసరములనూ మంచి పరిస్థితులను కల్పించుకుంటూ ఉంటాడు. అది పవిత్రీకరణం.

అహింస అచేతనమైన, అనాచరణ యోగ్యమైన, ఆదర్శ వాక్యం కాదు. ఊహాజన్యమైన చిత్తప్రవృత్తి కాదు. అది మాన వుల నైతిక స్వభావములో సజీవమైన, క్రియారూపకమైన ఒక సుగుణము. అది ఎటువంటి మందాత్మునైనా, ఉదాత్త మానసిక శక్తులతోనూ, నిస్స్వార్థ నిష్ఠగలిగిన ఆదర్శంతోనూ ఉజ్జీవింప

చేస్తుంది. అది నీచమైన స్వప్రయోజనమునుండి మానవులను విముక్తులనుగా చేస్తుంది. అటువంటివారి సహవాసం ఉదార భావహేతువు కాగలదు.

అహింస శాస్త్రమూ శిల్పమూ కూడాను. అన్ని శాస్త్రాల వలెనే దీనివెనుక కూడా ఒకచరిత్ర, ఒక సిద్ధాంతమూ ఉన్నది. ఇది కాలానుగుణమైన నూతన కల్పనకాదు. శతాబ్దాల కొలదీ స్పర్థా ద్వేషములతో, కామక్రోధములతో, భౌతిక వాంఛలతో, దౌర్జన్యంతో, పూడిపోయియున్న శకలరాసిలోనుండి పునరుద్ధరింపబడి ప్రత్యక్షం చేయబడ్డది. పురాతన నాగరికతావశేషమైన ఈ గనిని తవ్వి పైకి దీయడానికి, మహాత్ములూ యోగులూ అప్పుడప్పుడు ఉద్భవించారు. కాని దానిని కనుగొని తేజోవంతంగాచేసి, దురాశా క్రోధములతోనూ స్పర్థా ద్వేషములతోనూ కుంగి కృశించిపోతూన్న మానవజాతికి వెలుగువలె ప్రసాదించే భాగ్యం గాంధీకి దక్కినది.

## అహింసలో మొదటిపాఠాలు

అన్ని శాస్త్రాలకూ శిల్పములకూ వలెనే, అహింసకుకూడా మొదటి పాఠాలున్నాయి. నీ తల్లి దండ్రులు విశ్వవిద్యాలయ పరీక్షలలో ఉత్తీర్ణులయినంత మాత్రాన నీవు ప్రాథమిక పరీక్షలో కూడా ఉత్తీర్ణుడవు కాలేవు. ఒక్కొక్కప్పుడు పరంపరాగతంగా పితరులనుండి కొంత శిల్పజ్ఞానం కలిగితే కలగవచ్చును. ఒక గాయకుని కుమారుడు స్వతస్సిద్ధంగా ముడోమేటనుండి కొన్ని కొత్త సంగతులు వినుచుతూ పాడితే పాడవచ్చును. కాని శాస్త్ర

ఘటువంటిది గాదు. అది బాగా అధ్యయనం చేస్తేనేగాని అంటదు. సంగీతానికి చెవిలేనివాడు దానిలోని మార్దవం గ్రహించలేక వట్టి ధ్వని అంటాడు. అలాగే చిత్రకళాజ్ఞానం లేనివానికి యేబొమ్మ చూపినా వట్టిరంగులూ గీతలూ కనిపిస్తవి. కవిత్వంలో సారస్యం గ్రహించలేనివాడు వ్యాకరణపు తప్పులు చూస్తాడు. వాక్యరచన తలక్రిందులుగా ఉన్నదంటాడు. అంతకు తప్ప భావంలోనూ లయలోనూ ఉన్న సౌందర్యాన్ని అనుభవించలేడు. కాబట్టి అటువంటివాళ్ళ విమర్శలకు విలువలేదు. ముక్కు జబ్బున్నవాళ్ళకు పన్నీటి పరిమళమూ, కటికి చెవిటి వాళ్ళకు ఫిరంగిచప్పుడూ, పుట్టు గుడ్డివాళ్ళకు వస్తుసౌందర్యమూ తెలియనట్లుగానే కళాభిజ్ఞత లేనివాళ్ళ కాయా కళలలోని శిల్పము తెలియరాదు. పుట్టుకతోవచ్చిన లోపాలుగానీ తెచ్చి పెట్టుకొన్న వికారాలుగానీ అలా ఉన్నప్పటికీ, ప్రతిమనిషికీ, సంస్కృతియొక్క కళలను ప్రశంశించదగిన ఒకవిధమైన గ్రహణ శక్తి అతని ప్రకృతిలోనే నిహితమై ఉంటుంది. అది పెరిగి పెద్దది కావడానికి శిక్షణమూ సంస్కరణమూ అవసరం. రైతు పొలంలో ఎక్కువపంట పండించాలంటే అతనందుకు చేసే కృషి పైన ఆధారపడి ఉంటుందది. అహింసనుగూర్చి అనేకమంది అదిరిపోయే విమర్శలు చేశారు. వట్టి విమర్శలేకాదు; అవాకులూ చవాకులూ మాట్లాడారు. దానికి కారణం వాళ్ళ శిక్షణ వాళ్ళ వాతావరణం కేవలం అందుకు భిన్నమైనవిగా ఉండడమే.

భయం తెలియని పసిబిడ్డ తేలుకొండె పట్టుకొని లాగుతుంది. ఎగిరే కప్పమీదా పాకే చీమమీదా చేతుల్లు వేస్తుంది. ఆబిడ్డ

అన్న, దానిని కొడితేనో విసిగిస్తేనో వాణ్ని కొట్టినట్లుగా నటించి మనం పసిబిడ్డకు అప్పుడప్పుడే కలుగుతూన్న కసి దీర్చుకోవాలనే కోర్కెను సంతృప్తి పరుస్తాము. ఇద్దరుపిల్లల కేదైనా రోడ్డుమీద పేచీవస్తే వాళ్ళు తమ బలాబలాలను చూపించుకొంటారు. క్లాసులో అల్లరిచేసినా, పాఠశాలకు ఆలస్యంగా వెళ్ళినా పిల్లవాణ్ని ఉపాధ్యాయుడు బెత్తంతో కొడతాడు. పరీక్ష తప్పిన కొడుకును తండ్రి శిక్షిస్తాడు. వంట ఆలస్యమైతే మొగుడు పెళ్ళాన్ని తిట్టి కొడతాడు. ఆమె పిల్లలను కొడుతుంది. పిల్లలు దాసీదానిపైకి పోతారు. దాసీది యజమానిపైన కోపం తెచ్చుకొంటుంది. ఈవిధంగా కోపం కొంపంతా చుట్టుకొంటుంది. మ్యాజిస్ట్రేటు చిన్న జేబుదొంగను శిక్షిస్తాడు. వాడు జైలులోనుండి పెద్దవాడై వచ్చి మేజిస్ట్రేటు ఇంటికే కన్నంవేసి దొంగిలిస్తాడు. అంతటితో వాడు గజదొంగయిపోతాడు. పురుషులనూ స్త్రీలనూ గుంపులు గుంపులుగా నేరాలుచేసే అనాగరిక జాతులకింద లెక్కవేసి వాళ్ళందరిపైనా ప్రభుత్వంవారు కాపలా పెడతారు. వాళ్ళు రాత్రిళ్ళు తప్పించుకొనిపోతే కనుక్కొని పట్టుకొని వచ్చి పోలీసులు ఖైదులో పెడతారు. వాళ్ళు చాలా కాలం ఖైదులో ఉండడంవల్ల మరింత గట్టిపడి "నల్లటోపీ" ల సహవాసంతో కొత్తగుంపులను కట్టుకొని రాజధాని మొత్తం మీదనే నేరాలు సాగిస్తారు. చివరకీ మామూలు నేరాలు ఖూనీల కిందకు మారి ఖూనీలు ఉరిశిక్షలకు కారణాలవుతయి. ఈవిధంగా నేరమూ శిక్షా, ఒకటితరువాత ఒకటి అంతులేని గొలుసువలే

సాగుతూనే ఉంటుంది. అందువల్లనే శాంతిభద్రతలు కాపాడే టందుకు బలప్రయోగం అవసరమనే సిద్ధాంతం అంగీకరించబడ్డది.

౨

హింసాహింసల విభేదం ఋగ్వేద అథర్వ వేదాల కాలంనాటి నుండీ వస్తూన్నది. ఎప్పటినుండో మన మెఱుగనప్పటినుండీకూడా యజ్ఞాలు జరుగుతూనే ఉన్నప్పటికీ శ్రీరామచంద్రుడుకూడా జీవ బలికి సంబంధించిన యజ్ఞాలు చేసినప్పటికీ, పశుబలికి వ్యతిరే కంగా అప్పటికే కొంత ప్రబలమైన అభిప్రాయం కలదు. అందు వల్లనే పిష్ట మృగబలిని అప్పటి మహర్షులు కొందరు ఉపదేశిం చారు. ఉపనిషత్తులనాటి కథ ఒకటి ఉంది. నాచికేతుడనే బ్రాహ్మణబాలునితో యముడీవిధంగా అంటాడు "సృష్టి అంత లోనూ ఒకే ఆత్మ వ్యాపించిఉంది. సృష్టిలోఉన్న ప్రతిజీవి హృద యమూ, దానికి నివాసస్థానమే. హింస అనగా ఏమిటో ఎప్పుడూ ఎఱుగనివాళ్ళకు మాత్రమే అటువంటి ఆత్మ ప్రత్యక్ష మవుతుంది." సత్యాహింసలను ప్రధానములుగా ఉద్ఘాటించిన అనేకమంది మహర్షులు యజ్ఞాలలో పశుబలిని పూర్తిగా నిర సించారు. సత్యమూ సత్ప్రవర్తనములను ఆధారములుగా చేసికొని ఉదాహరింపబడిన నియమావళియే ధర్మంగా వ్యవహ రింపబడి ప్రపంచమునకు మార్గదర్శకముగా నున్నది. వేదాలూ ఉపనిషత్తులనిండా విశ్వప్రేమకు సంబంధించిన కథలూ ఉపా ఖ్యానాలే. యజ్ఞాలలో జీవబలి లేకుండా చేయవలసిందని ప్రజ లకు చాలా నచ్చచెప్పినవాళ్ళు మహర్షులు. జైన సాహిత్యంలో

ఇటువంటి ఉదాహరణాలింకా ఎక్కువగా ఉన్నవి. నేమిందు డనే 22 వ తీర్థంకరుడు శ్రీకృష్ణుడనేవానికి అహింసా ప్రబోధము చేయగా ఆయన యజ్ఞాలలో పశుబలిని మాన్పించడానికి తన పలుకుబడిని వినియోగించాడు. విశ్వామిత్రుడు రాజ్యపరిత్యాగం చేసి హిమాలయములకు తపస్సుకోసం పోయిన కారణం ఆయన సైనికబలం వశిష్ఠుని మంత్రబలంముందు ఎందుకూ కొఱగాకుండా పోవడమేకదా! విశ్వామిత్రుడు మహర్షి యైనతరువాత అహింసా గుణాన్ని అభినందిస్తూ ఆయన మెన్నో ప్రాణాలను రక్షించి నట్లుకూడా అనేక కథలున్నవి. ఈ పురాతన పుట్టు పూర్వోత్త రాలు కలిగిన అహింసను తమ ప్రధాన సిద్ధాంతంగా చేసికొని జైనులు ఎంతో పెంపొందించారు.

ఈ అహింసా జ్యోతిని మూలమూలలకు తీసికొని వెళ్ళినవాడు బుద్ధుడు. అహింసను శిల్పంగానూ శాస్త్రంగానూ కూడా పర మావధికి తీసికొని వచ్చినవాడు గాంధీ. దాని నాయన జీవితం లోని అన్నివిషయాలకూ అనువర్తించేటంత విశాలంగా చేయ గలిగినాడు. తాను దానిని అడుగడుగుకూ ఆచరణలో పెట్టి స్థిత ప్రజ్ఞస్థాన మధిష్ఠించాడు. స్థితప్రజ్ఞుడనగా కామాన్ని జయిం చినవాడు; ఉద్వేగం లేనివాడు; సుఖదుఃఖాలను సమంగా చూచు కొనేవాడు; భయ క్రోధాలు లేనివాడు; రాగద్వేషములను జయిం చిన సర్వసంగ పరిత్యాగి; అహింస వైదికులకు సన్న్యాసులకు, బౌద్ధ భిక్షుకులకు, జైనమునులకు-వీరందరికీ సమంగా అనువ ర్తించే ప్రిథమధర్మం. ఉద్దేశంలోనూ (Intention) వాక్కు లోనూ క్రియలోనూ అహింస ఉండవలసిందే నని శారీరకమైన

చెపుతూన్నట్లు, మనస్సు (Thought) విషయం చెప్పినట్లూ, ముసల్మాను ఉలేమాలు 1922 లో బాగా ఆలోచించి తమ అభిప్రాయాన్ని వెల్లడిచేశారు. అహింసను ఆచరణలోకి తెస్తే అన్ని అవగుణాలూ కోపం, అహంకారం, భోగాసక్తి, ఆశ, చేయరాని సంభాషణలు చేయడంవల్ల వచ్చే విషాదభావాలూ నశిస్తాయి. ఈ గుణాలన్నీ మానవునికి ఉన్మాదావస్థను కల్పించి హింసాతత్వాన్ని పెంపొందింప చేస్తవని జైనుల విశ్వాసం. ప్రేమకు పరమావధియైన అహింసను ఆచరణలో పెట్టినందు వలననే జీవితములోని వివిధశక్తులూ వాటికి సంబంధించిన ఆయా రంగాలలో ఆయాపనులను సక్రమంగా నిర్వర్తిస్తవి. అలా నడవకుండా ఆయా శక్తులను నిరోధించడమే హింస అవుతుంది. అహింసా కీర్తిని గానంచేసిన కథలు బౌద్ధ సాహిత్యంలో చాలా ఉన్నవి. "నాగానందం" లో చెప్పబడిన త్యాగకథ కొంతవరకు ఉన్నతభావాలను కలిగిస్తుంది. ఇతిహాసాలలోనూ మనుస్మృతిలోనూ కూడా అహింస పరమధర్మమని పదేపదే చెప్పబడడమే కాక అనేక ఉదాహరణాలతో ఋజువుచేయబడ్డది. "అహింస పరమధర్మ మని అంటారుకదా అయితే యజ్ఞములలో మాంసమును వేల్చడం వలన పితరులు తరిస్తారని చెప్పే ధర్మంతో, అహింసాధర్మాన్ని మెలా సమన్వయం చేస్తారు?" అని ధర్మరాజు భీష్మాచార్యులవారిని ప్రశ్నించాడు. "మాంసాన్ని యజ్ఞాలలో వేల్చడం మానినవాళ్ళకే అహింస పరమధర్మం. వాళ్ళకు పుణ్యంవస్తుంది. నెలనెలకూ అశ్వమేధయాగంచేస్తే వచ్చే అన్నిఫలితాలూ వాళ్ళకు కలుగుతవి. అందువలన వాళ్ళకే అది

ముఖ్యం" అని భీష్మాచార్యులవారు కచ్చితంగా జవాబిచ్చారు. మనకు పాఠశాలల్లో చెప్పిన ఈ పురాణగాథలను ఒకదాని తరువాత ఒకటి చెప్పుతూండడం ఇక అనవసరం. అయినా "గోవ్యాఘ్ర సంవాదమనే" పేరుతో వ్యవహరింపబడుతూన్న ఒక అద్భుతమైన ఉపాఖ్యానమును చెప్పి ఈ భాగాన్ని ముగిస్తాము.

## గోవ్యాఘ్ర సంవాదం

ఒక బ్రాహ్మణునికి మంచి సాధువైన పాడిఆవు ఉంది. అది కేవలమూ సాధుత్వంయొక్క అవతారమే. ఒకరోజున అది అడవిలో మేస్తూండగా అనుకోకుండా అమాంతంగా ఒక పెద్దపులి వచ్చి పైకురికి పట్టుకొంది. అప్పుడాగోవు "ఆగు: నీవు నన్ను తిందువుకాని; నాకోచిన్న కోరికఉంది తీర్చు" అన్నది. పులి "ఏమిటదని" ఆశ్చర్యంతో ప్రశ్నించింది. "నాకొక బిడ్డపుట్టి ఎనిమిది రోజులయింది. అది ఇంకా మేత పట్టలేదు. నీకు కావలసింది నా మాంసమేకదా. నేనుపోయి చివరసారి నాబిడ్డకు పాలిచ్చుకొని వస్తాను. నీవిందు కంగీకరిస్తే నీకుచాలా పుణ్యముంటుంది" అని రానున్న తనబిడ్డ నిస్సహాయతనుగూర్చి ఆవు కళ్ళనీళ్ళు పెట్టుకొన్నది. "బలవన్మరణమునుండి తప్పించుకొన్న యేజంతువూ కూడా చచ్చిపోయేటందుకు ఎన్నడూ తిరిగిరాదు. ఇది ప్రపంచానుభవంలో ఎక్కడాలేదు. ఎన్ని ప్రమాణాలు చేసినప్పటికీ ఈ మాటమాత్రం నమ్మడానికి వీలులేదు. నేను నిన్ను నమ్మను" అంటూ పులి అంతటితో ఊరుకోక "ఒక బ్రాహ్మణుడు పందిరూపాన్ని పొంది కూడా పూర్వ వాగ్దానప్రకారం ఆ జీవాన్ని

వదిలిపెట్టలేక పోయినాడు. ఎవరికైనా ప్రాణమంటే అంతతీపి" అని ఉదాహరణంగా ఒక కథకూడా చెప్పింది. అందుకు బదులుగా ఆవు లోకం సత్యంమీదనే నిలిచిఉందని, మదనలేఖ అనే రాజకుమార్తె తన మానసంరక్షణం చేసుకొని యేవిధంగా తన వాగ్దానాన్ని చెల్లించుకొన్నదో వివరించింది. మదనలేఖ రాక్షసునికి ఆహారంగా తనను అర్పించుకొన్నప్పుడు రాక్షసుడు సత్యాహింసల నేవిధంగా గ్రహించాడో ఆవు వర్ణించింది. అప్పుడు మనస్సు కరిగి ఆవుతో "నీమాట చెల్లించుకొంటావా?" అన్నది పులి. ఆవు చండాలుడంటే అబద్ధం చెప్పినవాడేనని జవాబు చెప్పింది. అప్పుడావును విడిచిపెట్టింది పులి. అప్పుడావింటికి వెళ్ళి సావకాశంగా దూడకు పాలిచ్చుకొని మిగిలిన పాలను బ్రాహ్మణున్ని పిదుకోనిచ్చి, దూడకు చెడు సహవాసాలకు పోవద్దనీ అజాగ్రత్తగా ఉండవద్దనీ బుద్ధులుచెప్పి తిరిగీ అడవికి పోయింది. ఈలోగా ఆవు రాలేదని పులి అరుస్తూ అటూ ఇటూ పరవళ్ళు తొక్కుతూఉంది. సరిగా ఆ సమయంలోనే ఆవు పులిదగ్గరకు పోయి "ఇదుగో నేను వచ్చా! నన్ను తిని నాకు పుణ్యమియ్యి" అంటూ తన తలను పులి నోటిదగ్గరకు చాచింది. కాని పులి తెల్లపోయింది. ఇటువంటి దృశ్య మెన్నడూ అది తన జీవితంలో ఇది వరకు చూచిఉండలేదు. దాని హృదయం కరిగింది. దాని చిత్తవృత్తి మారింది. "సృష్టిలో ఎప్పుడూ ఇటువంటిసంగతి నేను చూచిఉండలేదు. అటువంటిప్రాణికి నే నెలా హానిచేయగలను. ఆపాపం నేను భరించలేను. సత్య ధర్మాలు నిన్ను రక్షించినయి. నిన్ను తినడానికి నాకు బుద్ధిపుట్టడంలేదు. వెళ్ళు" అన్నది పులి.

తనను ఇంటికి వెళ్ళనిచ్చి కొంత సేపుండి రావడానికి వీలు కలిగించి నందుకు కృతజ్ఞతను తెలియచేస్తూ ఆవు తనను తినవలసిందని పులిని తిరిగి కోరింది. అది వినినంతనే పులి మనస్సు తిరిగి పోయింది. ఈ కథ స్వర్గంలో దేవతలకుకూడా ఆనందం కలిగించింది. పులి తినడానికి వస్తే ఆవేమిచేయాలని ఒకవిద్యార్థి ప్రశ్నించినప్పు డీగ్రంథకర్త పూనాలోని ఫెర్గూసన్ కళాశాలలో ఇదేకథను చెప్పగా విద్యార్థి "బ్రిటిష్‌పులి ఈ కథలోని పులి అంత సాధు వుగా మెత్తనిమనస్సు కలిగి ఉంటుందా" అని తెలివైనప్రశ్న వేశాడు. "ఆవును రక్షించింది పులి సాధుత్వంకాదు. ఆవు పునః పూర్వకమైన అహింసావలంబనముతో చేసుకొన్న ఆత్మార్పణమే పులికి సాధుత్వం కలిగించింది. మన త్యాగమూ, ఆత్మార్పణబుద్ధీ కూడా ఆ ఆవువంటి నిష్కళంకములైనవే అయితే బ్రిటిష్‌వారి మనసుకూడా కరిగిపోతుందనడానికేమీ సందేహంలేదు" అని తిన్నని జవాబీయబడింది. అక్కడి 2,000 మంది విద్యార్థులూ అధ్యాపకులూ కూడా ఈ అభిప్రాయంతో ఏకీభవించారని వేఱుగా యిక్కడ వ్రాయవలెనా?

## 3

కాంగ్రెసు వాదులకు కాంగ్రెసు తత్వంలో విశ్వాసమును నిలుపు కోవడానికి అహింస ఒక మంత్రమయింది. తదితరులకది వశం చేసుకోవడానికి వీలులేనిది సరికదా అభ్యసించేటందుకు ప్రయ త్నించడానికి కూడా సాధ్యంకాని ఒక మానవాతీత శక్తిగా తలపబడుతున్నది. ఏ విషయంలోనైనా అభివృద్ధి పొందవలె

నంటే మంచి విశ్వాసంతో పని ప్రారంభించాలి. సంశయంతో ప్రారంభించిన పని విజయం పొందదు. సంశయం మనిషిని నిరుత్సాహ పరుస్తుంది. నిరుత్సాహం అపజయానికి దారి తీస్తుంది. అన్ని లోక వ్యవహారాలనూ మన మొక్కవ విశ్వాసంతోనే ప్రారంభం చేస్తాము. ఒక పిల్లవాణ్ని విశ్వ విద్యాలయానికి పంపితే కొన్నియేండ్లయిన తరువాత పట్టపరీక్షలో ఉత్తీర్ణుడై వస్తాడని మనకు గట్టిగా తెలుసు. అహింసా పట్టపరీక్ష కూడా అటువంటిదే. దీనికి కూడా బాగా కష్టపడి శిక్షణ పొందాలి. ఇల్లే పాఠశాల. పాఠం తానే. నీ వాచరణలో పెట్టని యే పాఠాన్ని ఇతరులకు నచ్చచెప్ప లేవు. సత్యాగ్రహ సిద్ధాంతం నీవు చేసి మరీ చెప్పవలసిందని ఆదేశిస్తుంది. నీవు మాటి మాటికీ కోపంతో మండిపోతూ ఇతరులను సహనం కలిగి ఉండవలసిందని చెప్పజాలవు. తాను అభివృద్ధి పొందవలెననే నిజమైన కోర్కెతో తనకు తాను పశ్చాత్తాపపడి, తనను తాను మందలించుకోవడమే ఆత్మ సంస్కారానికి ఆవశ్యకం. మొట్టమొదట మనకు కోపం వచ్చిన సంగతి మనం గ్రహించాలి. తన తప్పును తాను తెలుసుకొన్నప్పుడే తిరిగి తెప్పిరిల్లడానికి వీలు కలుగుతుంది. నీ వెన్నిసార్లు తప్పు చేశావో లెక్కపెట్టుకో-ఎన్ని పర్యాయాలు నీవు నీ పిచ్చికోపాన్ని చూపించావో ఆలోచించుకో. కోపం వచ్చినప్పుడు నీ కుమారుణ్ని నీకు జ్ఞాపకం చేయమను. తరువాత నీకా అబ్బాయి కనిపిస్తే చాలు నీతప్పు నీకు తెలిసిపోతుంది. ఇంకా కోపం చల్లారకపోతే నీ భార్య వచ్చి నీముందు నిలబడితే అప్పుడైనా గుక్క తిప్పుకోవడానికి వీలు కలుగుతుంది. అదికూడా

చాలకపోతే అటువంటి సందర్భాలలో నీ ఎదురుగా అద్దం తెచ్చి చూపించ వలసిందని ముందుగానే ఎవరికైనా చెప్పిఉంచు. అద్దంలో కోపంతో ఉన్న నీమొగం ఎంత వికారంగా ఉంటుందో నీవు చూచుకోగలవు. కోపంతో ఉన్న మనిషి ముఖమంతా పసుడ తలుపడి అచ్చంగా కోతివలే ఉంటాడు. అద్దం చూడడంతోనే నిన్ను గురించి నీవు సిగ్గుపడతావు. ఈ కోప నివారణోపాయా లను ఎంత వృద్ధులైనా అవలంబించవచ్చు. మన ప్రవర్తనలో కొత్త అధ్యాయాన్ని ప్రారంభించవలెనంటే వయస్సు వచ్చినంత మాత్రాన సమయం మించిపోయినట్లుగా భావించకూడదు. ముసలితన మయినప్పటికీ తక్కిన లోకనీతిని మన్నిస్తూ ఉన్నట్లే కోపాన్ని ఆపుకోవడం కూడా విధిగా భావించాలి. నీకీ ఆత్మ నిగ్రహం అలవడిన తరువాత ఈ సూత్రాలనే నీ ఇల్లాలికీ బిడ్డలికీ అనువర్తింపచేయి. అనేకసార్లు మనం మన భార్యాబిడ్డల యెడల చాలా పిచ్చిగా ప్రవర్తిస్తాము. అటువంటి సందర్భాలలో పాప మామె యోగ్యతవల్లా వాళ్ల నిస్సహాయతవల్లా మాత్రమే మనం మర్యాదగా బతికి బయట పడుతూ ఉంటాము. ఒక్కొక్కప్పుడు తనను కొట్టవద్దనీ, తనకు వచ్చిన కోపాన్ని మనస్సులో ఉన్న కళ్ళెములను లాగిపట్టి అపుకొన్నాననీ ఆ రేళ్ళ బిడ్డకూడా మనకు అర్థమయ్యేటట్లు చెప్పే అదృష్టం తటస్థిస్తుంది. అటువంటి అను భవాలు మన జీవితాలకు చాలా మార్పును కలిగిస్తాయి. సత్యా గ్రహి ఇటువంటి ప్రయత్నాలను ముందు తనకూ, తరువాత తన కుటుంబానికీ, చిట్టచివరకు సంఘానికి అనువర్తింప చేయాలి. ఈ విధంగా వ్యక్తుల యొక్కయూ సంఘము యొక్కయూ చిత్త

వృత్తిలోనూ, శీలములోనూ, ప్రవర్తనలోనూ కలిగిన నూతన వికాసమువల్ల ప్రభుత్వ నీతిలోనే కొత్త ఆదర్శాలు ఆచరణలోకి వస్తవి. జే. హెచ్. హెయిన్సు సంగ్రహంగా ఇలా అన్నాడు:

> ఇతరులు వ్యక్తి నీతిగా చెప్పినదానినే గాంధీ ప్రపంచోద్ధరణ కోసం సంఘ కార్యక్రమంగా పరిణమింప చేశాడు.

బీజము - వృక్షము.

మొక్క చిగురించి పూచి కాయాలంటే చాలాకాలం క్రిందటనే విత్తనం నాటబడి ఉండాలి. కొత్త ఉద్యమా లన్నింటికీ ఈ ఉదాహరణం సరిపోతుంది. అంటుమామిడి చెట్టుయొక్క మొదటి కాయలను ఊరికే తుంచివేస్తారు. వాటిని పండనిస్తే చెట్టుకే ముప్పం కలుగుతుంది. ప్రతి చెట్టుకూ దానికి కావల సిన ఆహారాన్ని వేళ్లద్వారా కింద భూమిలోనుండీ, ఆకులద్వారా పైన వాతావరణం నుండి తీసికొని బలిష్ఠమవడానికి సావకాశ మియ్యాలి. అప్పుడే అది యజమానికి తగిన ఫలితాన్ని చేకూరు స్తుంది. విత్తనం నాటిన తర్వాత ఫలం చేతికి వచ్చేసరికి ఎంతో కాలం పడుతుంది. పనసచెట్టు పన్నెండేండ్లకుగాని ఫలితానికి రాదు. అటువంటప్పుడు అహింసవంటి నైతికోద్యమం సరియైన రూపం దాల్చి మానవసంస్థలకు ఒరవడి పెట్టగల యోగ్యతను సంపాదించాలంటే 25 సంవత్సరములు పట్టడం ఒక అబ్బురం కాదు. ప్రతి చరిత్రాత్మక సంఘటనమూ మనకు ప్రత్యక్షంగా కనిపించడానికి ఇరవై అయిదు సంవత్సరాలు పడుతుందని కౌంటు హర్మాన్ కీసర్లింగు (Count Hermann Keyserling) చెప్పిన మాటకిదే అర్థము. అంతేకాదు ఉద్యమోద్దేశా

లకూ కార్యక్రమాలకూ కూడా తండ్రికీ కొడుకుకూ పోలిక లోనూ ప్రవర్తనలోనూ ఎంత భేద ముంటుందో అంత భేద ముంటుంది. ప్రతి కొత్త ఉద్యమమూ అదివరకు ప్రచారంలో ఉన్న నమ్మకానికి విరుద్ధంగా బయలుదేరుతుంది. అభివృద్ధి అనే త్రాసుముల్లు ఒక వైపునుండి మరొక వైపుకు మొగ్గడం స్వభావ గుణం. కాబట్టి గాంధీ సత్యాహింసలపైన ఆధారపడి శాసనోల్లంఘన సత్యాగ్రహోద్యమాలను బోధించినా, అహింస అంటే హింస లేకపోవడమే కాక బాధా సహిష్ణుత, త్యాగ బుద్ధితో కూడిన కార్యశూరత్వము కూడా కలిగి ఉండడమని ఆయన వివరించినా, దేశంలో పోలీసునూ సైన్యమునూ లేకుండా చేసి ఒక విధమైన ఆధ్యాత్మిక అరాచక తత్వాన్ని స్థాపించ నూహించినా ఇదంతా ఆయన కలియుగాన్ని సాధ్యమైనంత త్వరగా కృతయుగంగా మార్చివేయవలెనని చేసే ప్రయత్నమే తప్ప భారతీయ చిత్తవృత్తి కర్థంకాని కొత్తపని యేదీకాదు. "సాంఘిక నైతిక వివర్తనాలు (Evolutions) ఆకస్మికంగా వెంటవెంటనే సర్ రాధాకృష్ణ చెప్పినట్లు రాకపోవచ్చును. కాని వివర్తనం నెమ్మదిగా జరిగినకొద్దీ విప్లవం రావడానికి వీలున్నది. విప్లవం రాకుండా ఆపాలంటే వివర్తనం (evolution) తొందరగా జరిగేటట్లు చూడాలి." గాంధీ తన సన్నిహిత పరిసరములకంటె చాలా ముందు పరుగెత్తడానికి ఒకే అర్థం చెప్ప వలసి ఉంది. అదేదంటే సంఘం నిమ్నోన్నతాలను సరిచేసుకోవడానికి ప్రయత్నిస్తుంది గనుక తాను పరుగిడినకొద్దీ తన వెంట సంఘం వస్తుందనీ, సంఘం వెనుకపడ్డప్పుడు తాను అప్పుడే వెను

కను తగ్గవచ్చుననీ ఆయన ఉద్దేశమైనట్లు అర్థం చెప్పుకోవాలి. అందువల్లనే గాంధీ సలహాప్రకారం కాంగ్రెసు కేంద్రప్రభుత్వం నుండి సైన్యమును తీసివేయడానికి సందేహించింది. రాష్ట్రాలలో పోలీసును ఉంచడానికి గాంధీ అయిష్టంగానైనా అంగీకరించాడు.

౪

అహింస ఒక సమిష్టి పదం. ఒక సమగ్ర సిద్ధాంతం. ఒక సత్కార్యం చేయడమో, ఒక ఉపకారం చేయడమో మాత్రమే అహింస కాజాలదు. దానిలో ప్రేమవల్ల కలిగే అన్ని సుగుణాలూ ఇమిడి ఉన్నవి. "ప్రేమ అనగా ఎడతెగని బాధ" అన్నాడు ఏసుక్రీస్తు. ఈ "ఎడతెగని బాధ" లోనే సత్య సహాన క్షమా గుణాలు ఇమిడి ఉన్నవి. అందులోనే ఎవరూ ఇతరుల యెడ చెడతలంపులను కలిగి ఉండకూడదని అర్థమున్నది. చెడ తలంపే కోపానికీ, కక్షకూ, కసికీ కారణం. తన అనుచరుడు తానన్న మాటనే తప్పిపోయినప్పుడు, తన ఆశ్రమవాసి ఆశ్రమ నియమాలకు విరుద్ధంగా నడచుకొన్నప్పుడు, శాసనసభాసభ్యుడు గాంధీ సిద్ధాంతంలో అవిశ్వాసాన్ని ప్రకటించినప్పుడు, దాని సత్యం నుండి తప్పించుకోవాలని కోరే జాతియొక్క ఆత్మను లొంగదీసుకోవాలని ప్రభుత్వం నిర్బంధచర్యల నవలంబించినప్పుడు-ఇంకా ఇటువంటి అనేక సందర్భాలలో గాంధీ చూపించే సహనశక్తి అద్భుతం. ఇందులో ఒక్కొక్కటి ఒక్కొక్కసారి తటస్థించినా, అన్నీ ఒక్కసారిగా తటస్థించినా ఆయన యేమీ క్షోభపడడు. కాని కార్యజన్యమైన ఆయన

కోపం తక్షణం కారణజన్యమైన విషాదంగా మారుతుంది. ఒక మనిషి తన ప్రతికక్షిపైన చూపించిన ప్రేమ ఫలవంతమై ప్రతికక్షిని మార్చజాలక పోయినందుకే ఆయన విషాదం. అసహనం దౌర్జన్యంయొక్క రూపమే. గాంధీ సహనమూర్తి గనుక తొందరపడి యేపనీ చేయడు. కాని దాని పరిణామం మాత్రం శరీరంమీద ఉండకపోదు. ఆయన మనోద్వేగాన్ని అనేకసార్లు అణచుకోగలిగినప్పటికీ,అది ఆయనహృదయంపైనా రక్తనాళాల పైనా విపరీత పరివర్తనములను కలిగించి "రక్తత్వర" ను (Blood Pressure) అప్పుడప్పుడూ భయంకరంగా ఎక్కువ చేస్తూ ఉంటుందంటే ఆశ్చర్యం లేదు. యుద్ధవిజయాలకంటె శాంతి విజయాలు ఎక్కువ సన్నుతింప దగ్గవని చాలామంది అంటారు. కాని మఱింత రక్తపాత హేతువై నూతన యుద్ధానికి బీజంగా పరిణమించి యుద్ధాన్నిమించిన సంధియైన వర్సైలీస్ నాటి శాంతివంటి శాంతి యుద్ధాలను తుదముట్టింప చాలవు. ప్రపంచంలో "సౌహార్దమూ సౌభ్రాతృత్వమూ" పెంపొందించే శాంతియే శాంతి. గాంధి ఇండియా సరిహద్దు రాష్ట్రాలలో పొందిన అఖండ విజయమే ఆయన కటువంటి శాంతిలోగల విశ్వాసమునకు తార్కాణం. అక్కడి వీరజాతులలో వ్యాపించిన అహింసా తత్వాన్ని ఆయన ఇలా వర్ణిస్తున్నాడు.

ఆ దృశ్యం నేను చూస్తానని అనుకోలేదు. వాళ్ళందరూ అందుకుగూర్చి చాలా శ్రద్ధగా ఉన్నారు. వారి హృదయాలలో దానియందు విశ్వాసం బాగా నాటుకొనిపోయింది. అహింసలో ఆశాజ్యోతిని వారంతటు వారు

చూస్తున్నారు... ఇంతకుపూర్వం అంతా అంధకారం. అక్కడ రక్త ప్రవాహాలతో కూడిన కుల కలహాలు తప్ప కుటుంబాలు లేవు. గుహాలో పులులవలె జీవిస్తూ ఉండేవారు. పఠాను లెప్పుడూ కత్తులూ తుపాకులూ బల్లెములూ పుచ్చుకొని తిరుగుతూన్నప్పటికీ వాళ్ళు పై ఉద్యోగులను చూస్తే తమ నౌకరీలు పోతయ్యేమోనని భయపడుతూ ఉండేవారు. ఇప్పు డనేకవేలమందిలో ఈ చిత్తవృత్తి మారిపోయింది. ఒకళ్ళ నొకళ్ళు ఖూనీలు చేసుకొనే కులకలహా లిప్పు డంతరించి పోయినయి. ఇదంతా ఖాన్‌సాహెబు యొక్క అహింసోద్యమ ప్రభావం. పఠాను లిప్పుడా చిల్లర నౌకరీలమీద ఆధారపడి లేరు. వారు పొలం దున్ను కొనే దృష్టిలో ఉన్నారు. ముందు ముందు పరిశ్రమల వైపునకు కూడా వారి చూపు వెళ్ళగలదని వారి మాటలనుబట్టి తెలుస్తుంది.

గాంధీకి అహింసయందుగల విశ్వాసాన్ని గమనించవలెనంటే ఆయన మ్యూనిచ్ రోజులలో వ్రాసిన వ్రాతలనుబట్టి చూస్తే తెలుస్తుంది. ఆయన కందులో ఎంత నమ్మకమున్నదో వ్రాత అంత శక్తివంతంగా ఉన్నది.

> ఇండియా దేశపు అరిష్టాలను తొలగించేటందుకు, అహింస అనే ఔషధ ప్రయోగంకోసం దేవుడు నన్ను తన పరికరంగా చేసుకొన్నాడు. అహింసలో నాకు అచంచల విశ్వాసం. అది మన దేశమునకు కావలసిన కోరికలను నెరవేర్చడమేకాక, దానిని సరిగా అనువర్తింప చేసేయెడల భారత దేశమునకు వెలుపల జరిగే రక్తపాతాన్ని నిలిపి పాశ్చాత్య దేశములను కూడా రానున్న ఆపత్తులనుండి రక్షించగలదు.

ఒక సందర్భములో గాంధీజీ అహింసను ఈ విధంగా వివరించారు.

నా అభిప్రాయంలో అహింస అంటే ఏవిధంగానూ ఉదాసీనత కాదు. అది అత్యంత కార్యోత్సాహ శక్తి అని నేననుకొంటున్నాను. అహింస ఉత్కృష్ట ధర్మం.

గాంధీ అహింస - ఉదాసీనత్వమూ కాదు. పిఱికి తనమూ కాదు.

హింసాస్థానము తనకు జరుగుతూన్న అవమానాన్ని నిస్సహాయ స్థితిలో గుడ్లు మిటకరించుకొని పిఱికి తనంతో చూస్తూ ఊరుకోవడం కంటె తన మాన సంరక్షణార్థం ఆయుధ బలప్రయోగం జేయడంకూడా నాకిష్టమే. (గాంధీ.)

కాని ఈ సలహా - అన్ని ప్రయత్నాలు విఫలమైనప్పుడు చిట్టచివరి ప్రయత్నంగా మాత్రమే - అనుసరించ తగినదని మాత్రం మనం జ్ఞాపక ముంచుకోవాలి. గాంధికి శాంతి ప్రధాన మన్న మాట సత్యమే. కాని అశాంతి మనుష్యత్వాని కవమానం గలిగించే శాంతిగా ఉండకూడదు.

## అహింసా శక్తి.

తన అహింసా సిద్ధాంతం వలన గాంధీజీకి నిస్సహాయస్థితి యెన్నడూ కలగలేదు.

ఎంత గట్టి లోహమైనా తగినంత వేడిఉంటే కఱుగుతుంది. అదే విధంగా ఎంత కఠినహృదయమైనా తగినంత వేడిగల అహింసవలన కఱిగి తీరుతుంది. అహింస పుట్టించ గలిగిన వేడికి అంతు ఉండదు. నా యాభై సంవత్సరాల అనుభవంలోనూ ఫలానా సందర్భంలో అహింస పనికిరాకుండా పోయింది. అందువల్ల నేను నిస్సహాయుడనైనాను ' అని చెప్పుకోదగిన స్థితి యెన్నడూ నాకు కలుగలేదు.

అహింసయొక్క అతి విస్తృతమైన అద్భుత శక్తి కాకపోతే జనరల్ స్మట్సు ఎన్నడూ ఈ విధంగా చెప్పి ఉండడు.

మీ ప్రజలంటే నా కయిష్టం. మీ వాళ్ళకు సహాయం చేయాలన్నే కోరిక యెన్నడూ నాకు లేదు. కాని నేనేమి చేయగలను? మా కవసరమైనప్పుడు మీరు సహాయ పడుతూన్నారు. అటువంటప్పుడు మిమ్మ నేమైనా చేయడానికి మాకు చేతులెలా వస్తయి? ఇంగ్లీషువాళ్ళ వలెనే మీరుకూడా దౌర్జన్యంలోకి దిగితే బాగుండునని చాలాసార్లు నే ననుకొంటూ ఉంటా. అప్పుడు మాకు మిమ్మల్ని సాగనంపడం తేలిక. కాని మీరు శత్రువు కైనా హాని చేయరు. సొంతంగా బాధ పడడం వల్లనే జయం పొందవలెనని మీ కోరిక. మీ అంతట మీ ఏర్పరచుకొన్న మర్యాదలైన దాక్షిణ్యమునుండి గానీ క్షాత్రధర్మమునుండి కానీ ఒక్క అడుగైనా అటూ ఇటూ తొలగిపోరాయె. అందువల్ల మే మేమీ చేయలేని నిస్సహాయ స్థితిలోకి వచ్చాము.

గాంధీ "ప్రతి బ్రిటిష్ వానికీ" అని వ్రాసిన ఉత్తరం ఆయన ధైర్యాన్ని తెలియచేస్తుంది. కాని అందులో ఆయన వ్రాసిన మాటలు కొత్తవికావు. 1939 మార్చిలోని సంకట స్థితిలో ప్రపంచానికి కేదైనా సందేశం పంపవలసిందని న్యూయార్కు పత్రికా విలేఖకుడు కోరినప్పుడు కూడా ఇవే అభిప్రాయాలు వెలడించాడు. నాటి సమస్యా పరిష్కారానికి ప్రజాపాలక ప్రభుత్వాలు వెంటనే ఒక్కసారిగా ఆయుధ విసర్జనం చేయడం మంచిదని సలహా యిచ్చాడు. రివరెండ్ విన్స్లో యూదుల కిలా సలహా యిచ్చాడు:

రానున్న మహా విలయమును రోజు రోజుకూ గ్రహిస్తూన్న ప్రపంచం ఉన్మాదద బంధనాలయమునుండి తప్పించుకొని శాంతి స్వాతంత్ర్యము లనే సూర్య రశ్మిని చూడవలెనంటే సత్యాగ్రహం ఒక్కటే ఉపాయం.

"యుద్ధ ప్రయత్నాల తోనూ యుద్ధ భయంతోనూ నిండి ఉన్న ప్రపం
చాన్ని తృణీకరించే గాంధీ నాయకత్వంలో ఆశా కిరణం అగుపిస్తూన్నది"
అని డాక్టర్ ఉడ్ అన్న మాటలు తూచినట్లు సరిపోతున్నవి.

౫

అసహాయోద్యమం ప్రారంభ మైనప్పటినుండీ దాని లక్షణం
అహింసా పూర్వక మైనదని వివరింప బడుతూనే ఉన్నది. ఒక్కొ
క్కప్పుడు "అహింసాయుత అసహాయోద్యమం" అనే సమాసం
లోని విశేషణాన్ని విడచిపెట్టి నామవాచకాన్నే కొంతమంది
పలుకుతూన్నప్పటికీ ఉద్యమ లక్షణంలో విశేషణం యొక్క
ప్రాముఖ్యత కేమీ లోటు రాలేదు. కాంగ్రెసు వాదులు మొత్తం
మీద అహింసా నియమాని కంగీకరించారు-కాని మతసిద్ధాం
తంగా మాత్రం దాని నందఱూ అంగీకరించలేదు. అప్పుడే
రాజనీతి (Policy) అనేమాట వ్యాపకంలోకి వచ్చింది. అహింస
అప్పటినుండీ ఒక్కొక్కప్పుడు మత సిద్ధాంతం గానూ మఱొ
కప్పుడు "రాజనీతి" గానూ వ్యవహరింప బడుతున్నది. ఈ అంత
ర్భేదం కాంగ్రెసు అధికారం లోకి రానంత వరకూ ప్రత్య
క్షంగా కనిపించలేదు. 1937 జులైలో రాష్ట్రీయ మంత్రివర్గ
నిర్మాణములు జరిగిన తరువాత పోలీసువా రనేక పర్యాయములు
తుపాకులు కాల్చవలసి వచ్చింది. ఒక్క సంయుక్త రాష్ట్రాల
లోనే కాంగ్రెసు మంత్రివర్గాలున్న రెండున్నర సంవత్సరాల
స్వల్పకాలం లోన్నూ 47 పర్యాయములు సైనికులను సహాయం
కోసం పిలువవలసి వచ్చింది. ఇందుకు తోడు యుద్ధం జరుగు

తూండగానే కేంద్ర ప్రభుత్వంలోకి సభ్యులను పంపవలసి వస్తుందేమో ననే ఆలోచన ఒకటి- అందుకు తగిన సావకాశా లప్పటికి వెంటనే లేకపోయినా-కాంగ్రెసు హృదయంలో పని చేస్తూన్నది. సైనిక వ్యవహారాలన్నీ కేంద్ర ప్రభుత్వానికి సంబంధించినవే అవడంచేత కాంగ్రెసు మంత్రివర్గాలు, 'ఇతర ప్రపంచంతో పాటు, ఇండియాలో అంతవరకూ నడుపబడు తూన్న పద్ధతి ప్రకారం తాముకూడా పోలీసు మిలిటరీ పరి పాలన నడుపవలసిందేనా అనే ప్రశ్న ప్రధాన సమస్య అయింది. అప్పుడు కాంగ్రెసు భిన్న మార్గాలలో పోక తప్పదా అన్నంత స్థితి వచ్చింది. గాంధీ శాంతి సైన్యాన్ని స్థాపించి క్రమేణా బల ప్రయోగాన్ని తొలగించాలన్నాడు. కాంగ్రెసు కార్యవర్గంలో నున్న ఆయన సహచరులు రెండు పక్షాలుగా చీలిపోయినారు. అహింసను రాజనీతిగా గానీ, మతసిద్ధాం తంగా గానీ అవలంబించడం వల్ల కలిగే వేరువేరు ఫలితాలు అప్పుడు స్పష్టమైనవి. మొదటిది బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరే కంగా చేసే స్వరాజ్య పోరాటానికి మాత్రమే బాగా పనికి వస్తుంది. రెండోది సత్యాహింసల పునాదిగా గలిగిన నూతన సంఘ నిర్మాణమునకు శక్తివంతమైన పరికరముగా ఉపయోగ పడుతుంది. నీతి అయినా సిద్ధాంతమైనా కాంగ్రెసు వాదు లొక్కసారి అహింసా నియమాన్ని అంగీకరించిన తరువాత దానిని తమ యిష్టం వచ్చినట్లు మార్చుకోజాలరనే మాట మాత్రం సత్యం. ఈ సందర్భంలో గాంధీ "రాజనీతులకు కూడా మనసా వాచా కర్మణా కట్టుబడి ఉండవలసిన అవసరం

ఉన్నది. కాని అహింసను జాతీయ నీతిగా మన మవలంబించే మెడల మనము దాని భావాన్ని భాషనూ అక్షరాలా అనుష్ఠించాలి" అని అన్నాడు.

గాంధీ ఈ సందిగ్ధ సమయంలో కొంచెంగా పేర్లను మార్చాడు. కాని ఆ మార్పు చాలా అర్థవంత మయింది. రాజనీతిగా అవలంబించే వాళ్ళ అహింస దుర్బలుల అహింస అనీ, సిద్ధాంతంగా అవలంబించే వాళ్ళ అహింస బలిష్ఠుల అహింస అనీ పేర్లు పెట్టినాడు. మొదటి దానిలో మాకు హింస చేయడానికి తగిన శక్తి సామర్థ్యాలు లేవు గనుక అహింసను నీతిగా అవలంబించక తప్పింది కాదనే అర్థం ఇమిడి ఉంది. రెండవ దానిలో మాకు హింస చేయగలిగిన శక్తి సామర్థ్యాలు ఉన్నప్పటికీ మేము దానిని బుద్ధిపూర్వకంగా విడచి పెట్టినాము. అన్ని పరిస్థితులలోనూ మేము అహింసనే అవలంబిస్తాము అనే అర్థం ఇమిడి ఉంది. ఈ రెండింటికీ "నిర్బంధాహింస" "స్వచ్ఛందాహింస" అని కూడా పేర్లు పెట్టవచ్చు. 1940 జూన్, జులైలలో జరిగిన కాంగ్రెసు కార్యవర్గ సమావేశాలలో గాంధీ "పౌర రక్షక" సంఘ నిర్మాణమును గూర్చి మొట్టమొదటి సారి చర్చకు తెచ్చాడు. అప్పుడు వారి కాయుధాలుండవలెనా లేదా అనే విషయమున్నూ, కాంగ్రెసు కేంద్ర ప్రభుత్వములో మంత్రి వర్గాలను ఒప్పుకొంటే సైన్యమును గూర్చి ఏ వైఖరి అవలంబించాలనే విషయమున్నూ వర్కింగు కమిటీవారు సంపూర్ణంగా విచారణ చేశారు.

గాంధీ తన మనస్సులో ఉన్నదంతా వెలపోసుకోవడం ప్రారంభించాడు. కాంగ్రెసు కార్యవర్గం వెంటనే. నిర్ణయానికి రాలేక సందిగ్ధ స్థితిలో బడ్డది. కాలం పరుగెత్తి పోతూన్నది. పత్రికా విలేఖకులూ ప్రజలూ ఓపిక పట్టలేకుండా ఉన్నారు. ఇంత జాగ్రత్తగా కాపాడ దగిన రహస్యమేమిటి? రాజకీయ రహస్యాలు కూడా ప్రియుల రహస్యాల వంటివి. ఒకప్పుడు వాటిని చాలా జాగ్రత్తగా కాపాడ వలసినట్లు కనిపిస్తుంది. కాని కొద్ది కాలంలోనే అవి అందరికీ తెలిసిపోయి ఈ సంగతి ఎందు కింతకాలం పెట్టెలో పెట్టి తాళం వేసుకొన్నారో అని పిస్తుంది యితరులకు. జులై 17-21 తేదీలమధ్య పత్రికలకు తెలియ కుండా ఎంతో కష్టంమీద కాపాడిన రహస్యం తరువాత ప్రజ లందఱికీ తెలిసిపోయింది. అప్పటి వర్కింగు కమిటీ సమావే శంలో ఆంతరంగిక కల్లోలములనుండీ, విదేశీయుల దండ యాత్రల నుండీ దేశాన్ని రక్షించే విషయంలో తాము చేసిన నిర్ణయాలతో గాంధీకి సంబంధం లేదని స్పష్టం చేశారు. కాబట్టి గాంధీజీ తననా బాధ్యతనుండి తొలగించ వలసిందని కోరిన కోరి కయే ఇన్నాళ్ళనుండీ వర్కింగు కమిటీవారు దాచిపెట్టుకొన్న రహస్యమని ప్రజలు గ్రహించడానికి వీలయింది. అహింసను అన్ని సందర్భాల లోనూ అవలంబించి తీరాలని గాంధీ స్పష్టంగా వివరించాడు. వర్కింగు కమిటీ చేసిన వార్ధా తీర్మానము నేడు చరిత్రలో ఒక అధ్యాయం అవడమే కాక నాటి సంకట సమ యంలో నాలుగు వారాల వరమే వాద ప్రతివాదాలకు మూల మయింది.

## బలవంతుల ఆయుధం

హింసా పంకంలో పడి దొర్లుతూన్న యిరోపా ఖండానికి, అంత ర్జాతీయ వివాదాలను పరిష్కరించేటందుకు పశుబల ప్రయోగానికి బదులుగా మరొక ఆయుధాన్ని కాంగ్రెసు ప్రసాదించ గలిగిందని వార్ధాలో గాంధీజీ అన్నాడు. అహింస, బలాఢ్యులకూ బలహీనులకూ కూడా తగిన ఆయుధంగా ఉపయోగపడు తుంది. ఇంతవరకు కాంగ్రెసు అహింసను దుర్బలుల ఆయు ధంగా వాడుతూన్నది. కాని ఇప్పుడు దండెత్తి వచ్చిన పరాయి సైన్యాల కనుకూలముగా ఆంతరంగిక కల్లోలములు కలిగించే బలవత్తర శక్తులకు వ్యతిరేకంగా కూడా అహింసా ఆయు ధాన్ని ప్రయోగించడానికి అవకాశం కలిగిందని ఆయన తాత్పర్యం. "బ్రిటనుకు వ్యతిరేకమైన పోరాటంలో కాంగ్రెసు అహింస యొక్క శక్తి సామర్థ్యాలను పరీక్షించి ప్రజా సామా న్యంలో ఎక్కడలేని చైతన్యమునూ కలిగించి నప్పుడు ఆంతరంగిక కల్లోలములను గానీ, పరస్పర వినాశకర పోరాటములను గానీ కాంగ్రెసు, అహింసద్వారా నిర్మూలించ లేకపోయినట్లయితే ఆ తప్పు కాంగ్రెసు దవుతుంది కాని, అహింసది కాదు. అయితే ఈ సందర్భాలలో ప్రయోగించ వలసిన అహింస బలవంతుల అహింస" అని గాంధీజీ వాదం. ఇందుకే గాంధీ వర్కింగు కమిటీల పంథాలు వేరు కావలసి వచ్చింది. వర్కింగు కమిటీ ఇటు వంటి సందిగ్ధ సమయంలో బాధ్యత వహించక ప్రజా సామాన్యం తమయందుంచిన విశ్వాసానికి ద్రోహకరంగా ప్రవ ర్తిస్తుందా లేక ఇంతకాలం నుంచీ తాము నేరవేర్చిన మహా

త్కార్యముల కనుగుణంగా గాంధీజీ సలహా నంగీకరించి కష్టము లనూ అపాయ పరంపరలనూ ఎదుర్కొంటుంచా? మంత్రిత్వ స్వీకరణమూ అహింసావలంబనమూ ఈ రెండూ అవినాభావ సంబంధము కలవనీ, కాంగ్రెసుకు ప్రజా సామాన్యంపైన అహింసా యుతమైన పలుకుబడి కలిగేటంత వరకూ ప్రభుత్వం లోకి పోరాదనీ గాంధీ తలంపు. కాబట్టి విదేశీయుల దండ యాత్రలను అరికట్టడానికి కూడా కాంగ్రెసు ఆయుధముల నుప యోగించకుండా, "ప్రాణం గలిగిన ప్రాకారంగా" ఉండే శాంతి దళములను నిర్మించవలెనని తేలింది. ఇది గాంధీ చూపిన తోవ. వార్ధాలో ఆయన యిచ్చిన ప్రణాళిక ఇదే. వర్కింగు కమిటీలోకి ఇటువంటి గడ్డు సమస్య విచారణకు రావడ మిదే మొదటిసారి. అందువల్ల చాలా సంచలనం కలిగించింది. పై పెచ్చు తక్షణం నిర్ణయించ వలసి వచ్చింది.

గాంధీ ఇంతవరకూ తన అహింసా సత్యాగ్రహములను పరాధీన దేశం విషయంలోనే ప్రయోగించి చూచాడు. కాని స్వతంత్ర దేశాలలో కూడా వీటి ప్రయోగ వైశాల్యానికి వీలున్నదని ఆయన మనస్సులో లేకపోలేదు. బ్రిటిష్ సామ్రాజ్యం వంటి బలిష్ఠమైన సంస్థతో పోరాడి స్వాతంత్ర్యం సంపా దించుకో గలిగిన దేశం, ఆ పద్ధతులతోనే తన స్వతంత్రను కాపాడుకో గలదని గాంధీజీ అనేకసార్లు చెబుతూ వచ్చారు. అంటే అహింసతో సంపాదించుకో గలిగిన స్వాతంత్ర్యాన్ని అహింసతోనే కాపాడుకో వచ్చునని ఆయన విశ్వాసం. దౌర్జన్యం పైనా రక్తపాతం పైనా ఆధారపడే సంగ్రామ సైన్యముల

కంటె, శత్రుసైన్యాలకూ మాతృదేశానికీ మధ్య నిలిచి ఆహుతి కాగలిగిన శాంతి సైన్యాలు ఉండడం అవసరమని ఆయన తలంపు.

## జెక్కులకు సందేశం

1938 అక్టోబరు నెలలో జెక్కులు శత్రువులకు లోబడి పోవడమును గూర్చి గాంధీ చెప్పిన మాటలీ సందర్భంలో పాఠకులకు జ్ఞాపకం చేయడం ఉచితం.

జెక్కుల దుస్థితి నాకు శరీర వ్యథనూ మనో వ్యథనూ కూడా కలిగిస్తూన్నది. కాబట్టి నాకు జెక్కులతో మాట్లాడవలెననే కోరిక కలిగింది. నా మనస్సులో కలిగిన అభిప్రాయాలు వారికి చెప్పకపోవడం పిటికితనమేమో అనిపించింది. చిన్న దేశాలు, యూరోపియన్ నియంతల సంరక్షణ కిందకు రాసైనా రావాలి లేక రావడానికి సంసిద్ధంగానైనా ఉండాలి. కాని పక్షంలో యూరోపులో అశాంతి తప్పదు. ఇంగ్లాండు, ఫ్రాన్సు దేశాలకా చిన్నదేశాల యెడల యెంత సుహృద్భావమున్నప్పటికీ అవి వాటిని సంరక్షించలేవు. అవి జోక్యం కలిగించుకొంటే అపూర్వమైన రక్తపాతమూ వినాశనమూ తటస్థించడం తప్ప మరేమీ ప్రయోజనం లేదు. నేనే జెక్కునయినట్లయితే ముందుగా ఆ రెండు దేశాలకు మమ్ములను రక్షించే బాధ్యత లేకుండా చేసేవాణ్ని. కాని నేను జీవించి తీరాలి. నేనొక దేశానికి గానీ వ్యక్తికి గానీ లోబడి ఉండజాలను. నేను సంపూర్ణ స్వతంత్రుడనుగానైనా ఉండాలి. మరణించనైనా మరణించాలి. ఆయుధ బలంతో గెలుస్తాననడం వట్టి బడాయి. నా స్వాతంత్ర్యాన్ని అపహరింపపూనుకొన్నవారి నెదిరించి వారి యిష్టప్రకారం ప్రవర్తించక ఆ ప్రయత్నంలో నిరాయుధుడను గానే చచ్చిపోవ నిశ్చయించు కొన్న

ట్లయితే అది బడాయి అనిపించుకోదు. అటువంటి ప్రయత్నంలో నా శరీరం నశించ వచ్చును, కాని ఆత్మ నశించదు. అనగా నా గౌరవం నశించదని అర్థం. ఇటువంటి అకీర్తి ప్రదమైన శాంతిని నేనొక మహా దవకాశంగా గ్రహిస్తాను. నేను అవమానమును తప్పించుకొని నిజమైన స్వాతంత్ర్యాన్ని సంపాదిస్తాను. కాని నా క్షేమం కోరే వారేమంటా రంటే "హిట్లరుకు దయలేదు. ఆయనముందు నీ ఆధ్యాత్మిక ప్రయత్నా లేవీ అక్కరకు రావంటారు". "మీరు చెప్పింది నిజం కావచ్చు. అహింసా నిరోధ మవలంబించిన జాతిని గూర్చి చరిత్రలో ఎక్కడా లేదు. హిట్లరు నేను పడే బాధవల్ల మారకపోతే మరేమీ పరవాలేదు. అందు వల్ల నాకు పోయేది కూడా యేమీ లేదు. నా గౌరవం నాకు ఉంటే చాలు. అది హిట్లరు దయమీద ఆధారపడి లేదుకదా? కాని అహిం సలో నమ్మకం కలిగిన నేను దాని శక్తికి మేర ఉండదని అనుకోక పోవచ్చు. ఇంతవరకూ షిట్లరూ, హిట్లరువంటి వాళ్ళు, ప్రజలు దౌర్జన్యా నికి లోబడి పోతారనే ఒక్క అనుభవం తోనే ప్రవర్తిస్తున్నారు. నిరా యుధులైన అనేకమంది స్త్రీలు పురుషులు పిల్లలూ వారి దౌర్జన్యాన్ని అహింసాయుతంగా అరికట్టడం వారికి నూతనానుభవం కావచ్చును. ఉదార తరములున్నూ, సూక్ష్మతరములునూ అయిన ఈ శక్తులకు వారు దాసీనులుగా ఉంటారని యెవరు ధైర్యంగా చెప్పగలరు? నావంటి ఆత్మరయే వారిదీని అంటాను నేను." "నీవు చెప్పేదంతా నీవిషయంలో నిజమే. కాని యిన్నడూ యెవ్వరూ యెఱుగని ఈ పనికి మీవాళ్ళు అందరూ అనుకూ లిస్తారని నీవెలా అనుకొంటావు? వాళ్ళు యుద్ధం నేర్చినవాళ్ళు. ధైర్యంలో, ప్రపంచంలో, యెవరికి వారు తీసిపోరు. ఇప్పుడు వాళ్ళ నంద రినీ ఆయుధా లవతల పారవేసి, క్రొత్తగా అహింసా నిరోధాన్ని నేర్చు కోమనడం వ్యర్థ ప్రయత్నంగా కనిపిస్తుంది నాకు" అని మఱొకమిత్రు డంటాడు. "నీవు చెప్పినది నిజమే కావచ్చును. కాని నాకు చెప్పాలని

బుద్ధి పుట్టింది చెప్పి తీరాలి. నా ప్రజలకు నా సందేశం ఇచ్చి తీర్తాను. ఎటు పోవడానికి కీలు లేక ఈ అనుమానం నా మనస్సులో జీర్ణించి పోయింది. నాకు కనిపిస్తూన్న ఈ వెలుగును బట్టి అథమము నేనైనా నడచుకోవాలి" అని నేను జెక్కునయితే చెప్పి, ఆ ప్రకారం నడచుకొంటాను. నేను మొట్టమొదట సత్యాగ్రహం ప్రారంభించినప్పుడు నాకు సహచరుడే లేడు. స్త్రీలూ పురుషులూ పిల్లలూ అంతాకలసి మేము పదమూడువేల మందిమి ఉన్నాము. అవతలవారో మమ్ముల నందరినీ కలిపి నాశనం చేయగలిగినంత పెద్దప్రజ. నామాట యెవరూ వింటారని నే నసుకోలేదు. అదంతా ఒక మెఱుపు మెటీసినట్లయింది. 13,000 మందీ పోరాటంలోకి దిగలేదు. అనేకమంది వెనుక పడిపోయినారు. కాని జాతియొక్క గౌరవం కాపాడబడ్డది. దక్షిణ ఆఫ్రికా సత్యాగ్రహంవల్ల నూతన చరిత్ర రచించబడ్డది.

డాక్టరు బీసున్గు ఇప్పుడు నేను బహుమతి చేసే ఆయుధం బలిష్ఠులవలంబించ తగినది కాని దుర్బలులది కాదు. ఏవిధమైన దౌర్జన్య చింతా లేకుండా, ఆత్మ తప్ప తక్కినవన్నీ అశాశ్వతాలనే సంపూర్ణ విశ్వాసంతో, ప్రపంచంలో యెటువంటి అధికారాన్నికైనా సరే తల వొగ్గకుండా యెదురు తిరుగ నిశ్చయించుకోవడం కంటె, ధైర్యతరమైన పని యేమీ లేదు. (గాంధీ.)

1938 అక్టోబరు 8 వ తేదీనీ అనగా మ్యూనిచ్ సంధి అయిన తరువాత గాంధీ ఇలా వ్రాశాడు :

తమ బలవంతులైన ఇద్దరు మిత్రులూ తమ్ముఁను జారవిడిచిన తరువాత జెక్కు లింతకంటే చేయగలిగిన పని యేమీ లేదు. కాని వారికి అహింస ఆయుధ ప్రయోగమే తెలిసి ఉన్నట్లయితే జర్మనీయే కాదు. ఇటలీ కూడా వచ్చినప్పటికీ వారిద్దరి బలాలనీ యెదిరించి జాతీయ గౌరవాన్ని

కాపాడుకో గలిగే వారని చెప్పే ధైర్యం నా కిప్పటికీ ఉంది. కాంగ్రెసు వాదులు నమ్ముతూన్నట్లుగా హిందూదేశం అహింసద్వారా స్వాతంత్ర్యాన్ని సంపాదించుకో గలిగితే, దానిద్వారానే దాన్ని నిల బెట్టు కొంటుంది. జెకోస్లోవకియా వంటి చిన్న దేశం కూడా అదే విధంగా చేసుకోగలదు. అనేక ప్రతికూల సందర్భాలలో పోరాడి చచ్చిపోవడం ధైర్యం మాట నిజమే. ఆక్రమణ దారుతో పోరాడడం మాని తల ఒగ్గ నిరాకరించడం అంతకంటె యెక్కువ ధైర్యం కాదా? బల ప్రయోగానికి ప్రజలు లోబడి పోతారని ప్రభుత్వాలకు తెలుసు. కాని నిరాయుధులైన స్త్రీలు, పురుషులు, పిల్లలూ బలాధిక్యతకు లోబడ కుండా తమపైన జరిగే దౌర్జన్య ప్రయోగాన్ని ద్వేషరహితమైన ఆనం దంతో భరించడం, ప్రభుత్వాలకు క్రొత్త అనుభవం కలిగించడ మవుతుంది.

జీవితంలో వచ్చే దుఃఖాలెప్పుడూ మనకు చెప్పిరావు. గాంధీ వార్ధాలో, స్వతంత్ర భారతదేశం కూడా అహింసా సిద్ధాం తంతో స్వసంరక్షణ చేసుకోవాలనే ప్రతిపాదన చేసినప్పు డాయన తన జీవితంలో ఒక పెద్ద దుఃఖాన్ని చేతులారా తెచ్చి పెట్టుకొన్నట్లు తోస్తుంది-అంటే ఈ దుఃఖభారం కింద ఆయన నలిగిపోతాడని మా అభిప్రాయం కాదు. కాని ఈ పరిస్థితి రాకుండా చూచుకొని ఉండవలసిం దాయన. అయితే కష్టా లను గానీ చిట్టచివరకు మహాపదలను గానీ తప్పించుకొని పోయే స్వభావం లేదాయనకు. తన ఉపదేశం సజీవమైన శక్తియో లేక మృతసిద్ధాంతమో తన సహచరులను గట్టిగా ఒరిసి చూడమన్నాడు. ఒక్కొక్కప్పు డాయా సంస్థలలో ప్రాముఖ్యంగా కనిపించిన మతాలు కానీ అభిప్రాయాలు కానీ

సిద్ధాంతాలు కాని కొంతకాలానికి పనికిరాక పోవడం నిజంగా సహజం. మొట్టమొదట్లో అభిప్రాయాలు ఘనీభవించి సంఘ నిర్మాణం జరిగేటప్పుడు పనిచేసిన ముఖ్యసూత్రం, తరువాత కొన్నాళ్ళకు నిరుపయోగం కావచ్చు. తామీ లోకంలో ఉన్నంతవరకు కళ్ళయెదుట కనిపిస్తూన్న లోక వ్యవహారాలను కాదనడానికి వీలు లేదని గాంధీ సహచరులు గట్టిగా అభిప్రాయ పడ్డారు. వారి రాజకీయ ధర్మాలకూ వారి ఆధ్యాత్మగురుని యెడల వారికి గల భక్తికీ తగవు వచ్చింది. వారికి గాంధీ యెడ గల భక్తికి కారణం కేవలం విశ్వాసం-ఒకవిధమైన మూఢ విశ్వాసమని కూడా అనవచ్చు. కాని ఇప్పుడు తమ ముందున్న సమస్యను జాగ్రత్తగా పరిశీలించి ఆచరణయోగ్యము కాదా అని నిర్ణయించ వలసిన అవసరం వారికి వచ్చింది. తన సహ చరులు తమ నమ్మకాని కనుగుణంగా నిలబడడం గాంధీకి సంతోషమయింది కాని, వారు చేసిన తప్పు నిర్ణయాలను గూర్చి వారంత పట్టుదల వహించడం ఆయనకు విచారం వేసింది. ఇప్పుడు వారు బ్రిటిష్ ప్రభుత్వమునకు కేవలం నైతిక సహా యమే కాక సైనిక సహాయం కూడా చేస్తామని నిర్ణయించి నందువల్ల భారతదేశపు దృక్పథం పూర్తిగా మారిపోయిందని అర్థం. భారతదేశపు చిత్తవృత్తి ఇక ముందునుండీ సైనిక శిక్షణ సైనిక సన్నాహాల వంకకు ప్రసరించక తీరదని వారు వెల్లడి చేశారు. ఇదీ ఆయన విచారానికి కారణం. ఆయన ప్రశాంతం గానూ గంభనగానూ కనిపించాడు గాని, ఆయన హృదయంలో అగ్నిపర్వతం వంటి దుఃఖాన్ని సహజ మంధహాసాలమధ్య దాచి

పెట్టుకొన్నాడని ఊహించడం అంత కష్టంకాదు. లాంగ్ స్టన్ హ్యూస్ (**Longston Hughes**) అనే నీగ్రో కవి పాడిన హృదయ విదారకమైన ఈ పాట ఆయన కనుకోకుండా నోటికి వచ్చి ఉంటుంది.

నోటినిండా నవ్వినందున
గొంతు విప్పి పాడినందున
ఇంత కాలము నేను పొందే
చింత లేదని యెంతు వోయీ!

*　　*

నోటి నిండా నవ్వినందున
అంత రంగపు గొంతు వినవో?
కదను తొక్కే కాళ్ళు గలగల
మరణ బాధ గ్రహింప లేవో!

౬

గాంధీజముకు మూలాధారమైన అహింసను గూర్చి విచారించేటప్పుడు, దానికీ విస్తృతావకాశమునకూ, విశాలార్థమునకూ, చెప్పబడిన అభ్యంతరాలను కూడా ఆలోచించడం యుక్తం. అహింస ఒక మతమై మనము ధైర్యవంతులంగా ఉండాలనీ, ఉన్నతాత్ములంగా ఉండాలనీ, అందరియందూ ప్రేమగలిగి ఉండాలనీ బోధిస్తూన్నట్లయితే, లోక వ్యవహారాలకు సంబంధించక "విశ్వప్రేమ" అనే మాటకు సంక్షిప్తమైన పర్యాయ పదముగా ఉండేది. కాని అహింసాయోధుడు "తనను బాధించే వాళ్ళయందు దుశ్చింత లేకుండా మరణించడానికి సంసిద్ధంగా

ఉండాలి" అన్నాడు గాంధీ. శత్రువున్నాడనేమాట గాంధీ గమనించనే గమనించడు. కాని శత్రువని పిలవబడేవాణ్ని కూడా సత్యాగ్రహి స్నేహితుల్ని చూచినట్లుగానే ప్రేమతో చూడాలని ఆదేశిస్తాడు. అందువల్లనే తాను సత్యాగ్రహిగా అహింసావలంబకుడుగా "ఇంగ్లాండు క్షేమం కోరుతూంటా" నని గాంధీ పదే పదే చెప్పుతూండడం. గాంధీజంలో "అహింస అంటే ప్రేమ. అది ఎన్నడూ ప్రతిపక్షుల యెడల స్థూల పరికరాల నుపయోగించదు." ఇది వ్యక్తుల సందర్భంలో ఉండవలసిన ఒక సుగుణమైతే కావచ్చును గాని దీనిని రాజకీయ పరికరంగా ఎప్పుడూ ఉపయోగించ వచ్చుననే మాట మాత్రం ఒక క్షణం కూడా ఒప్పుకోవడానికి వీలు లేదని విమర్శకుల వాదం. ఈ సందర్భంలో భగవద్గీత హింసను అంగీకరించిందనీ హింస చేసినవారి ఉద్దేశం మనకు ప్రధానం కాని, హింస చేశారా లేదా అనే విషయం ప్రధానం కాదనీ చాలామంది వాదిస్తారు. ఇంకా కొందరేమి చెబుతారంటే భగవద్గీత ప్రకారం, విశ్వ ప్రేమ కలవాడు కూడా తన నైతిక ఆధ్యాత్మిక ఆదర్శాలకు భంగం లేకుండానే శత్రు సంహారం చేయవచ్చునని "మంచి పనులు మంచివాణ్ని చేయవు; అయితే మంచివాడు మంచిపనులు చేస్తాడు. చెడ్డపనులు చెడ్డవాణ్ని చేయవు. కాని చెడ్డవాడు చెడ్డపనులు చేస్తూంటాడు." అని మార్టిన్ లూథర్ చెప్పిన మాటలను కూడా కొందరు విమర్శకు లుదాహరిస్తూ ఉంటారు. పూర్వ హిందూ ఋషులూ యోగులూ అహింస, వైరాగ్యం లవలంబించవలసిన ధర్మంగా చెప్పి ఉంటే, గాంధీ అందరినీ అవలం

బించ మంటాడని మరికొందరు విమర్శకులాక్షేపిస్తారు. అయితే గాంధీ పిరికివాళ్ళ విషయంలో మాత్రం అహింసావలంబనమును మినహాయింపు చేశాడు. ఆయన సిద్ధాంత ప్రకారము పిరికితనం కంటె హింస మంచిది. "ఇతరులను చంపకుండా ధైర్యంగా చచ్చిపోలేని వానికి అపాయకర స్థలమునుండి సిగ్గువిడిచి పారిపోవడం కంటె చంపి చావమని నా సలహా" అన్నాడు గాంధీ. అవసరాన్ని బట్టి సిద్ధాంతాన్ని మార్చుకోవడం గాని త్యజించడం గానీ గాంధీ స్వభావం కాదు. ఆయన మహాత్ముడు. ఆయన ఊహాలుగానీ చర్యలుగానీ ఈ భౌతిక ప్రపంచంలోని సామాన్య మానవు డందుకోవడానికి వీలులేనివి. సాయుధ దండయాత్రలను ఎదుర్కోవడానికి అహింసా సైన్యాన్ని చేకూర్చే విషయంలో కాంగ్రెస్సు గాంధీ స్థితికి రాజాలక పోయిందని విమర్శకుడు నిరూపిస్తాడు. గాంధీ "అది విషాదకరం" అంటాడు. గాంధీ ఒకసారి కాదు; అనేకసార్లు హిందూదేశ రక్షణ అహింసాత్మకంగా ఉండాలని ఉద్ఘాటించాడు. భారత "రాజ్య తంత్రంపైన గ్రంథాలు వ్రాసిన పూర్వ స్మృతికారు లనేకమంది బలప్రయోగమును హింస అనలేదని నిర్ధారణ చేస్తారు కూడా అనేకులు. హిందూమతం తన మత, నైతిక, సాహిత్యంలో అహింసా సిద్ధాంతాన్ని అంగీకరిస్తూన్నదని ఋజువు చేయడానికి చరిత్రను ఉదాహరణంగా తీసుకొన్నందువల్ల యేమీ ప్రయోజనం లేదు. అయిదువేల సంవత్సరాలకిందట దానికి కొన్ని మినహాయింపులూ, కొన్ని షరతులూ, కొన్ని హద్దులూ అప్పటి పరిస్థితుల ననుసరించి యేర్పాటు చేయబడి ఉండవచ్చును. హిందూరాజ్యతంత్ర

నీతి శాస్త్రాలు, శాంతి భద్రతల రక్షణ నిమిత్తమూ, పరాయి రాజుల దండయాత్రల నెదుర్కొనేటందుకూ, బలప్రయోగం ధర్మ సమ్మతమే నని స్పష్టంగా చెప్పినవి. కాబట్టిన్నీ, హిందూ రాజనీతి గ్రంథాలు ఇతర దేశాలనూ రాజ్యాలనూ జయించ వల సిందని కూడా ప్రోత్సహించినవి కనుకనూ, యాభై శతాబ్దాలు గడచిన తరువాత నేటి పండితులూ విద్వాంసులూ కూడా, వాటినే ఉదాహరణాలుగా తీసికొని వాటిలోని విధి నిషేధాల ప్రకారం నడచుకోండా మనడం న్యాయ్యమా? మే మెన్నడూ దండయాత్రకూ దౌర్జన్యానికీ లోబడి పొమ్మని చెప్పలేదే! కాని వాటి నరికట్టే విధానం అహింసగా ఉండాలని ఈ ఇరవయ్యో శతాబ్దంలో మా ప్రయత్నం. ఇంతవర కెన్నడూ అకలంక మైన అహింస ఆచరణలో పెట్టబడలేదు కనుక ఇకముందు ఆచరణలోకి తీసికొని రాకూడదనడం న్యాయ్యమా? మన పూర్వు లెన్నడూ విమాన ప్రయాణాలు చేయలేదు గనుక మనం చేయ లేము-చేయకూడదు అంటే ఒప్పుకొంటామా? హింసా విష యంలో ఇంత పూర్వాచార పరాయణులుగా ఉన్న వీరే, సైన్సువల్ల మనిషి ప్రకృతిని జయించి ప్రపంచ మంతకూ యంత్ర యుగాన్ని తీసికొని రావలెనని విశ్వసిస్తూన్న అతి నవీనులు. ఈ విమర్శకులలో చాలామంది సంఘ వ్యవస్థాపకులైన పెద్దలు కూడా ఉన్నారు. వారందరికీ వినయపూర్వకమైన మా మనవి యేమంటే, ప్రపంచంలో నైసర్గికాభివృద్ధి ఆగిపోనట్లే నైతికాభి వృద్ధి కూడా ఆగిపోలేదని; ఇంతవరకూ మనిషి ఆత్మ, శరీరంలో బంధింపబడి పోయింది. శరీరమూ మనస్సూ కలిసి ఆత్మపైన

అధికారం చేస్తున్నాయి. కొత్తయుగంలో ఆత్మ శరీరాన్ని వాహనంగా చేసికొని నడిపిస్తుంది. అంతేకాని యజమానిగా చేసుకోదు.

అహింసను ఆధ్యాత్మిక సిద్ధాంత ప్రకారం విమర్శించేవారు కూడా ఉన్నారు. వారిలో ఒకడు శబ్దసాగరుని ఉదాహరిస్తూ "చంపడం, కొట్టడం, బాధపెట్టడం, విసిగించడం, శత్రులకు నష్టం కలిగించడం ఇదంతా హింసగా చెప్పి, పరాధీన జాతి విదేశీ ప్రభుత్వానికి పన్నులు చెల్లించక పోవడం, ఆ ప్రభుత్వ చట్టాలను ధిక్కరించడం, ఉద్యోగస్థులను విసిగించడమే గనుక ఈ కార్య క్రమానికి సంబంధించినంతవరకు సత్యాగ్రహం అహింసా సిద్ధాంతానికి అనుగుణంగా లేదని వాదిస్తాడు. శబ్దసాగరుని ప్రకారం అహింసావలంబకుడు "ఏ జీవికీ మనస్సుచే గానీ మాటచే గానీ క్రియచే గానీ యే విధమైన బాధా కలిగించకూడదని" కూడా ఆ విమర్శకుడంటాడు. బార్డోలీ పన్నుల నిరాకరణ సందర్భంలో ప్రభుత్వానికి నష్టం కలగడమే కాక, ఎంతమంది రైతులకో ఎన్ని రైతు కుటుంబాలకో చాలా బాధ కూడా కలగ లేదా అని ప్రశ్నిస్తారు కొందరు. అహింసా ధర్మాన్ని ఆదే శించిన మహర్షులే అనేకసార్లు అయిన దానికీ కానిదానికీ అనేక మందికి శాపాలు పెడుతూ దానిని అనుష్ఠించలేక పోయినారు. వారహింసాపరులు కారు సరికదా హింసాపరు లంటారు కొంతమంది. ఇందు కుదాహరణాలుగా ఇతిహాసాలలో నుండి పరశురామ విశ్వామిత్రులను చూపిస్తారు. నారదుడు సరా సరి మహావిష్ణువునే శపించాడు చూడమంటారు. ఆశాపా

లన్నీ పైపెచ్చు నిజాలయినయి యింతకంటే అన్యాయ్య మున్నదా అంటారు. ఓషధులూ, లతలూ, మృగాలూ, పక్షులూ, లేళ్ళు ఈ అన్నీ మనుష్యుల ఆహారాలు కాబట్టి ఇవి తింటే పాపం లేదని వేదాలలో ఉన్నట్లుగా, ధర్మవ్యాధుడు కౌశికునికి చెప్పిన మాట లుదాహరించి, హింస, అహింస అనే మాటలు పరస్పరమూ మారడానికి వీలున్న మాటలు. వేటకోసం జంతువును చంపడం హింస; ఆహారంకోసం చంపడం అహింస, అని కొందరు వ్యాఖ్యానం చేయడం మాకు తెలుసును.

విమర్శలకు జవాబు.

ఈ విమర్శ లన్నిటికీ పూర్తిగానూ సంతృప్తికరంగానూ జవాబులు చెప్పవలసి ఉన్నది. కురుక్షేత్ర సంగ్రామంనాడు, ఏ కారణంవల్ల హింస అంగీకరింపబడి సంగ్రామ ఫలితాల కది హేతువుగా పరిణమించి నప్పటికీ తరువాత సంఘటనలనుబట్టి అది వ్యర్థమని తేలిపోయింది. కౌరవులంతా నశించారు. పాండవులు వారితో ఉన్న కుక్క మాత్రమే మహాప్రస్థానము చేయగా అంత రాజ్యాని కొక్క పసికూన ఔరసుడైనాడు. పాండవ జయచిహ్నంగా ధర్మరాజు చేసిన అశ్వమేధ యాగంలో, ఒక బంగారు ముంగిస అతడు చేసిన హింసను పురస్కరించుకొని హేళన చేసింది. గాంధీ సిద్ధాంతంలో మఠంలో ఉండే బైరాగులకు, ప్రాపంచక భోగాలను త్యజించిన సన్న్యాసులకు లోకంలో ఉండి పౌర ధర్మాలను నిర్వర్తించ వలసిన గృహస్థులకు, అందఱికీ ఒకటే ధర్మం ఉపదేశింప బడ్డది. సాంఘిక, ఆర్థిక,

రాజకీయ, భౌతిక, ఆధ్యాత్మిక విభేదాలను తొలగించడానికే గాంధీ ఈ నూతన సిద్ధాంతాన్ని నిర్మించాడు. సమగ్ర మానవ జీవితంలో, భావంలో గాని ప్రవర్తనలో గాని వేలువేలు అరలు మరలూ ఉన్నవని ఆయన మతం అంగీకరించదు. ప్రాపంచక వ్యవహారా లన్నిటికీ తన సిద్ధాంతాలను అనువర్తింప చేయవచ్చు నని ఆయన విశ్వాసం. అందఱూ కూడా ఇంత ఉన్నతాశయం తోనూ, ఇంత ఉన్నత దృక్పథం తోనూ ఈ విషయాన్ని గమనించాలని ఆయన కోరిక.

రెండవ విమర్శకుడు ముఖ్యంగా మన జీవితాలకు సంబంధించిన ఒక విషయాన్ని తీసికొని తార్కిక దృష్టితో విమర్శ చేస్తూ న్నాడు. ఒక్కొక్కప్పుడు తర్కం చాలా బాగా ఉన్నట్లు తోచినా, దాని పర్యవసానం మాత్రం అన్యాయంగానూ అనర్థ దాయకం గానూ ఉంటుంది. అనేక సందర్భాలలో మన జీవిత సూత్రాలు తర్కానికి పూర్తిగా వ్యతిరేకంగా ఉంటయి. ఓషధులకు ప్రాణమున్నది. జపాను దేశీయులు ఆత్మకూడా ఉందని నమ్ముతారు. కాబట్టి శాకాహారి యైనవాడు ఈ ఓషధులను కోసినందువల్ల జీవహత్యయే కాకుండా ఆత్మహత్య కూడా చేస్తూన్నాడు. కనుక మనుష్యులను చంపే వానికి, ఈ శాకాహారికి లేకపోతే సత్యాగ్రహికి యేమీ భేదంలేదని వాదించే వాదన బాగుండవచ్చు కాని అది జీవితానికి మంచిదికాదు. పూర్వ ఋషులకు కోపం వచ్చిన వారి మీద శాపాలు పెట్టడానికి వారి తపోబలం వల్ల వారు సమర్థులైనంత మాత్రాన వారు చేసిన పనులన్ని సత్యాగ్రహ నియమములకు అనుగుణంగా ఉన్నదని

ఎవ్వరూ చెప్పజాలరు. ఋషులు పూర్వ ముండినమాట నిజమే. ఋషులలో కూడా ఋషులున్నారు. విశ్వామిత్ర దుర్వాసులకూ, వసిష్ఠునకూ గల భేదం గమనిస్తే ఆ సంగతి తెలుస్తుంది. ఋషులకు కూడా కొందఱికి కొన్ని దౌర్బల్యాలున్నాయి. మన పూర్వులందఱూ నిష్కళంక ప్రవర్తన గలవారని గానీ అహింసను అక్షరాలా ఆచరణలో పెట్టినారని గానీ భావించకూడదు.

అహింసకు వ్యతిరేకంగా మూడో అభిప్రాయం కూడా ఉంది. ఈ తరగతివారు అహింస కేవలమూ మర్యాదస్థుల యెద్ద తప్ప జయం పొందదనీ, ఈ అహింసా వ్రతావలంబకు లెంత గొప్పవారైనా వట్టి మూర్ఖుల దగ్గర వీరి ఉపదేశాలు ఎందుకూ పనికిరావనీ ఒక్కొక్కప్పుడు వీరటువంటివారికి లొంగిపోవలసి కూడా వస్తుందనీ వాదిస్తారు. సత్యాగ్రహం కానీ అహింస కానీ జయం పొందదగినవే అయితే అసత్యాన్నీ హింసనూ ఆరాధించే అజ్ఞానుల దగ్గర కూడా అవి జయంపొంది తీరాలి. అంతేకాక మర్యాదస్థుల దగ్గర తప్ప అహింస జయం పొందదనే వాదమే సరియైనది కాదు. ఎందువల్ల నంటారా మర్యాదస్థు లెప్పుడూ అహింసా తత్పరుడుగానే ఉంటాడు. కాబట్టి వానికి వ్యతిరేకంగా అహింసను ఉపయోగించనే అక్కరలేదు. అహింసా తత్పరులైన ఇరువురు వ్యక్తుల కెప్పుడూ తగాదాయే రాదు. అహింస పోరాడవలసింది హింసతో; ఈ సందర్భంలో పూర్వపు ఉపనిషద్వాక్య మొకటి ఉదాహరిస్తాం.

"అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మా! మృతంగమయ"

"నన్ను అసత్తునుండి సత్తుకు, చీకటినుండి వెలుతురుకూ, మృత్యువు నుండి అమృతత్వమునకు కొనిపో" అని పై వాక్యానికి అర్థం.

శ్రీరామ చంద్రుణ్ని గానీ, హిందూ సంప్రదాయ ప్రకారం జీవన్ముక్తుడని పేరొందిన జనక మహారాజును గానీ, వసిష్ఠ మహర్షిని గానీ జయించడానికి సత్యాగ్రహం చేయవలసినదని యెవ్వరూ గట్టిగా వాదించరు. ఈ ముగ్గురు మహాపురుషులూ ఎన్నడూ చెడుతలంపులను మనస్సులకు రానీయరు. చెడుమాటలు అనరు. చెడుపనులు చేయరు. కాబట్టి వీరిపైన సత్యాగ్రహమే అనవసరం. సత్యాగ్రహం కేవలం దుష్టులకు, దుర్మార్గులకు వ్యతిరేకంగా ఉపయోగించ వలసిన ఆయుధం. ప్రతిపక్షి ఎక్కువ దుర్మార్గుడని మీరు ఋజువు చేసిన•కొద్దీ వానికి వ్యతిరేకంగా సత్యాగ్రహం చేయడం ఎక్కువ అవసరమని ఋజువు చేస్తూన్నా రన్నమాట.

కొన్ని సందర్భాలలో హింస కూడా మంచి పని చేసిందని కొందరు వాదిస్తారు. ఆ మంచిపని హింసవలన కాదు జరిగింది. అహింసకు పరిహారంగా జరిగిన అహింసా కృత్యముల వలననే, ఆ మంచి కలగిందని అంటూ, అందు కుదాహరణంగా ఇండియాలో బ్రిటను చేసిన పనిని, గాలులో రోము చేసిన పనిని పేర్కొన్నాడు ఆల్డస్ హక్స్లె (Aldous Huxley). కాని

ఆయనే "ఈ విజయా లభివృద్ధికి దారి తీసినవనీ చెప్పడం చాలా కష్టము" అని కూడా అన్నాడు. హిందూ సంఘం హింసను పరిత్యేజించింది. క్షత్రియులను మాత్రమే శాంతి భద్రతలు కాపాడే నిమిత్తం ఆయుధాలను ఉపయోగించ వచ్చునని ఆదేశించింది. బౌద్ధమతం, ఆయుధాలను తయారుచేయడం, అమ్మడం విషాలను మత్తు పదార్థాలను చేయడం, సిపాయీపని చేయడం, జంతువులను చంపడం-ఈ అన్నిటినీ నిషేధించింది. హిందూ బౌద్ధ సంస్కృతులు మత యుద్ధాలద్వారా వ్యాప్తి కాలేదు. కేవలం శాంతి బోధలవల్లనే ఆ మతాల కంత ప్రచారం కలిగింది. హిందూ బౌద్ధ మతస్థుల జీవిత పద్ధతులలోనూ ప్రభుత్వ నిర్మాణంలోనూ మాత్రమే హింస ఈ విధంగా దూరంగా ఉంచబడ్డదని భావింపనక్కరలేదు. సంగ్రామ రాక్షసి హాహాకారాలు చేస్తూన్న యీరాతపులో కూడా వయస్సును బట్టీ కుటుంబ బాధ్యతలను బట్టీ సోపానక్రమంగా మాత్రమే యోధులాహ్వానింప బడుతూన్నారు. కాబట్టి అనాదినుండీ ప్రపంచం హింసను ఆక్షేపణీయంగానే పరిగణిస్తూన్నది.

## సత్యాగ్రహి భావము.

మీ రేమైనా చెప్పండి అహింసను పిఱికితనమని తప్పుగా అర్థం చేసుకొనే మిత్రులు కొంతమంది ఉన్నారు. తన ఆస్తినీ అధికారాన్నీ తన బలంచేత-భౌతిక బలంచేత కాపాడుకో గలుగుతూన్నాడా లేదా అనే విషయంమీద మనిషియొక్క శౌర్యం, దర్పం, ప్రతిష్ఠా, ప్రాముఖ్యతా-ఈ అన్నీ ఆధారపడి ఉంటవి.

తన ప్రతిష్ఠ, తన దేశ గౌరవము, తన మతముయొక్క ఉత్కృష్ఠతా, తన మత స్వాతంత్ర్యమూ తన స్థిర చరాస్తుల రక్షణా, తన స్త్రీల శీల గౌరవాలూ, తన సంఘ శ్రేయస్సూ, తన మాతృదేశ స్వాతంత్ర్యమూ ఈ అన్నిటిని గూర్చి సత్యాగ్రహికూడా తక్కిన అందఱివలెనే చాలా శ్రద్ధ వహిస్తాడు. ఇండియాలో గాంధీ ఉపదేశముబవలన సత్యాగ్రహి ఎంతెంత త్యాగాలు చేశాడో మనకు తెలిసిన విషయమే. వాటి నన్నిటినీ ఇక్కడ ఉదాహరించడం అనవసర కాలహరణమే కాక వ్యర్థాడంబర మనిపించుకోవచ్చును కూడా. సత్యాగ్రహ నాయకుడు పోరాటానికి మొనలో ఉండి తన అనుచరు లందఱికీ మార్గదర్శకుడుగా ఉన్నాడే కాని ఎన్నడూ వెనుకపీటేసి నిలుచుండి ఎెఱుగడనే మాట ఒక్కటి చెప్పితే చాలు. సామ్రాజ్య దర్పితుడు కూడా సైనికులను సమకూరుస్తాడు. కాని వాండ్ల నందఱనూ ముందుగా ఫిరంగిగుండ్లకు గుఱి చేస్తాడు. అందులో ఆయన కుమాళ్ళు కూడా ఉంటారు. వీరికీ సత్యాగ్రహికీ మఱొక ముఖ్యభేద మేమిటంటే సత్యాగ్రహి పెద్దపెద్ద మాటలు చెప్పడు. ఐరోపా మహా సంగ్రామం జరిగిన ప్రెసిడెంటు విల్సను కాలంలో (1914-17-18) ప్రతివారినోట "వెనుకపడి ఉన్న సంఘాల ఉద్ధరణము-చిన్నజాతుల మోక్షము" అనే నినాదాలు వినపడేవి. తరువాత సంఘటనలను బట్టి అవి ఎలా గాలి కెగిరిపోయినవో అందఱికీ తెలుసు. నిరుపేదలకు గానీ నిస్సహాయులకు గానీ ఉపకారం చేయవలెనంటే ఒక్కొక్క దేశాన్ని గానీ, ప్రపంచాన్ని గానీ కేంద్రంగా పెట్టుకొంటే జరుగదు. చిన్నచిన్న ప్రదే

శాలను కేంద్రాలుగా చేసికొని పనిచేస్తూ వాటినన్నిటినీ ఏకీకృత చేస్తే అది నిజమైన "ప్రజోపకార" మవుతుంది. అంటే ఆ పని గృహపరిశ్రమల నిర్మాణం వంటిది కాని యంత్రాగార నిర్మాణం వంటిది కాదు. ఒకజాతిని దుష్టశక్తులనుండి విముక్తి చేస్తామనే పేరుతో గుణ పరిమాణాలలో అంతకంటెను ఎక్కువ దుష్టశక్తుల నవలంబించి లక్షలాది ప్రజలను నాశనము చేసినందు వల్ల ప్రయోజనం లేదు.

ఇంకా కొంతమంది మనిషి చేస్తూన్న పనినిబట్టి గాదు. అతని గొప్పతనాన్ని నిర్ణయించ వలసింది, కలుగుతూన్న ఫలితాన్ని బట్టి నిర్ణయించ వలెనని వాదిస్తారు. ఆమాట నిజమే. కాని చాలా సార్లు మనము సదుద్దేశాలతో చేసిన పనులకు దుష్ఫలితాలు కలుగుతూంటయి. అయితే దురుద్దేశంతో చేసిన పనికెక్కడా సత్ఫలితం కలగడం జరుగదు. నీవు బలప్రయోగం చేసిన ప్రతి సారీ నీకు మనస్సులో కసి లేకపోయి ఉండవచ్చు. బల ముపయోగించినంత మాత్రాన పాపంలేదు. తల్లి బిడ్డను సరియైన దోవలో పెట్టడానికి శిక్షిస్తుంది. అప్పుడామెకు కసి ఉందా? అలాగే ఒక జాతిని తప్పుదోవనుండి తప్పించడానికి బలప్రయోగం చేయవలసి వస్తుంది. అది తప్పా? అని కూడా వాదిస్తారు కొందరు. ఖద్దరెందుకు కట్టరయ్యా అని కొందరిని ప్రశ్నిస్తే మాకున్న దేశాభిమానాన్ని ప్రదర్శించడం మా కిష్టంలేదు. కాని మా హృదయాలనుచీల్చి చూడండి; మా మాతృదేశప్రేమ రక్తాక్షరాలలో మీకు ప్రత్యక్ష మౌతుందంటారు. ఇటువంటి వన్నీ తప్పుకు పోవడానికి చెప్పే మాటలయినా కావాలి లేదా

కుతర్కమైనా కావాలి. తల్లి తన బిడ్డను చెయిచేసుకొన్న కొంత సేపటికి తప్పు చేశానని పశ్చాత్తాప పడుతుంది. పోలీసువాడు లాఠీ చార్జి చేసేటప్పుడు తన మానవత్వం మఱచిపోయేటందుకు అడవి మృగంవలే అరుస్తాడు. అంటే వీరికి ఒకప్పుడు కాకపోతే మరొకప్పుడైనా తప్పు చేస్తూన్నామనే జ్ఞానం కలుగుతూన్నది. కాని యుద్ధాలకు పోయే సేనానులు గానీ వాళ్ళను యుద్ధరంగాలకు పంపే రాజకీయ ధురంధరులు గానీ ఎన్నడూ తాము తప్పు చేస్తూన్నామనే సంగతి ఒప్పుకోనే ఒప్పుకోరు. వీరందఱికీ భిన్నమైనవాడు సత్యాగ్రహి. అతనెన్నడూ తన మనస్సులో ఉద్దేశానికీ తాను చేసే పనికీ భేదం ఉంటుందనేమాట అంగీకరించనే అంగీకరించడు. అంతేకాదు అవలంబించే పద్ధతులకూ కలిగే ఫలితాలకూ కూడా భేదముంటుందని గుర్తించడు. అతను హృదయంలో ఏమీ దాపరిక ముండదు. ఒక తప్పుపనికి వెనుక చాలా సదుద్దేశ ముండి ఉంటుందనే మాట ఆయన విశ్వసించడు.

ఫాసిస్టులు చూడండి: యుద్ధాన్ని ఎలా శ్లాఘిస్తారో, మనుష్యుల దేశభక్తినీ, ధైర్యాన్నీ, పౌరుషాన్నీ చూపించడానికది మంచి అవకాశం కల్పిస్తుందంటారు. కత్తిని వాడకపోతే తుప్పు పడుతుంది. వాడుతూంటే పదునెక్కుతుంది. కాబట్టి మనుష్యులలో ఉన్న శౌర్య సాహసాలు కూడా అంతేనంటారు. కాని ఒక కత్తి తన పదునును కాపాడు కోవడానికి రెండోకత్తి నుపయోగించదు. అలాగే తన శౌర్య ధైర్య సాహసాలను కాపాడు కోవడానికి ఒక యోధుడు మఱియొక యోధుడి ప్రాణాలను తీయకూడదనే మాట ఫాసిస్టు గమనించడు. యోధలక్షణం

చెడిపోకుండా ఉండాలంటే యోధుడు తన ప్రాణాల నర్పించడమునకు సత్యాగ్రహి ఏమీ అభ్యంతర పెట్టడు. యోధలక్షణాలు ఇతరుల ప్రాణాలు తీయడంలోకంటె తన ప్రాణాలను ధైర్యంగా సమర్పించంలో ఎక్కువ ఉన్నతస్థితికి వస్తవని సత్యాగ్రహి తలంపు. శాంతిమార్గం నెత్తురుతో తడిసి ఉండదు. పరుల రక్తంతో తడియని పాదాలే ప్రపంచంలోని శాంతి సుక్షేత్రాలను చేరగలవు.

హింసా స్పర్థలపైన ఆధారపడియున్న ఈ ప్రపంచంలో ఈ సహకార సిద్ధాంతం, ఈ ప్రేమసూత్రం, ఈ ఆత్మార్పణబుద్ధి, ఇవన్నీ అక్కరకు వస్తవా? అసలు రావడానికి వీలున్నదా? అని కొందరు హేళనగానూ మరికొందరు నిజంగానూ అడుగుతారు. ఈ మిత్రులకు మానవ ప్రకృతి స్వతస్సిద్ధంగా సరళంగా ఉంటుందనే విషయంలో యేమాత్రమూ సందేహం లేదు. కాని వారు తమ చుట్టూ వున్న అవినీతినీ కల్మషాన్నీ చూచి నిరుత్సాహపడి, సంస్కారులమని చెప్పుకొనే వారే ఈ విధంగా ఉంటే తక్కిన అశిక్షితుల విషయ మేమనుకోవాలని ఆశ్చర్యంతో ఇటువంటి ప్రశ్న లడుగుతూంటారు. కాని ఈ అశిక్షితులైన అనేకమందికి తర్కం గానీ సూక్ష్మాంశ విమర్శన గానీ తెలియక పోయినప్పటికీ స్వతస్సిద్ధమైన గ్రహణశక్తితో వారి సహజ సరళ లక్షణాలను కాపాడుకొంటూంటారనే మాట ఈ మిత్రులు గమనించడం లేదు. ఇప్పుడు మనకు కావలసినది అహింసా తత్వముయొక్క ఆచరణ సిద్ధాంతములను గూర్చిన మానసిక పరిశోధనా కాదు. దాని శక్తి సామర్థ్యములను గూర్చిన అంచ

నాయమూ కాదు. అహింసలో అచంచలమైన విశ్వాసమే కావాలి మనకు. అది సంప్రదాయాన్ని అభివృద్ధి చేస్తుంది. విశ్వాసమూ-సంప్రదాయమూ ఇవి రెండూ తగిన వాతావరణాన్ని సృష్టిస్తాయి. శాకాహారులుగా పుట్టి సరియైన వాతావరణంలో పెరుగుతూన్న పిల్లలున్నారుకదా. వాళ్ళలో రెండేళ్ళ బిడ్డలకు ఉల్లిపాయలు, చేపలు, మాంసం అంటే యేమి తెలుసు? అయినప్పటికీ వాటిని వాళ్ళు నిరసించుకొంటూరు. వాళ్లు అమాంసాహారులుగా పెరిగి పానమనే దుర్వ్యసనానికి దూరంగా ఉంటారు. అదేవిధంగా అపశ్రుతులతోనూ అపనిందలతోనూ, దౌర్జన్యంతోనూ, యుద్ధాలతోనూ, కసితోనూ, రక్తపాతం తోనూ నిండి ఉన్న ఈ సంసారాన్ని సంస్కరించడానికి, క్షమా, దయా, ప్రేమా అనే విత్తనాలను వెదజల్లి, పశుశక్తితో గాక ఆత్మశక్తితో బలపడుపబడే నూతన ప్రపంచానికి మనం దారి తీయాలి. అహింస సూక్ష్మాతి సూక్ష్మమైన బలవత్తమమైన ఆయుధం.

ప్రొఫెసరు మేస్ అహింసనుగూర్చి ఇలా అన్నారు:

అహింసయొక్క ఆధిక్యతను గూర్చి నా కెంతమాత్రమూ సందేహం లేదు. కాని దానిని ఉచ్చశ్రేణిలో ఆచరణలోకి తీసికొని రావడమెలాగా అనేదే నన్ను బాధిస్తూన్న విషయం. జనసామాన్యము యొక్క మనస్సుకు ప్రేమ సూత్రమును అర్థమయ్యేటట్లు అనువదించడం కష్టమని నా తలంపు. వ్యక్తులకు తగిన శిక్షణ నీయడం సులభం. వాళ్ళు మన శిక్షణకు భిన్నంగా ప్రవర్తించినప్పుడు మనమేమి చేయాలి? తిరిగి రావాలా? లేక ముందుకు సాగాలా?

గాంధీజీ ఇలా అన్నాడు:

ఇక్కడ మా ఉద్యమ సందర్భంలో నాకనుభవం కలిగింది. ఉపదేశం వల్ల ప్రజలు శిక్షణ పొందరు. అహింస ఆచరించ వలసినదే కాని ఉప దేశపదేశించ వలసింది కాదు. బహిరంగ చిహ్నములతో హింసను అభ్యసించే విధానమును బోధించవచ్చును. ముందు యెదురుగా ఉన్న పలకలను, తరువాత యేవో కొన్ని లక్ష్యాలనూ, పిమ్మట మృగాలనూ తుపాకితో కొట్టడం నేర్వవచ్చును. అప్పుడు నీవు చంపే చదువులో సామర్థ్యం సంపాదించి నట్లవుతుంది. అహింసా తత్పరునికి బయటకు కనపడే ఆయుధమేమీ లేదు. అందువల్ల అతని మాటలేకాక చేష్టలుకూడా యేమీ ప్రయోజన కరములుగా కనుపించవు. నేను ఉద్దేశించ కుండానే నీకు చాలా తీయనిమాటలు చెప్పవచ్చు. ఒకప్పుడు నాకు నీపైన నిజమైన ప్రేమ ఉంటే కూడా దానిని బహిరంగ పరచడానికి సావకాశం లేకపోవచ్చు. ఈ రెండు సందర్భాలలోనూ బయటకు నేను చేసే పని ఒక తీరుగానే ఉండవచ్చు. కాని ఫలితంలో మాత్రం వేరు కావచ్చు. మనం చేసే పని బయటకు బాగా తెలియక పోయినప్పుడు ఫలితం యెక్కువ శక్తివంతంగా ఉంటుంది. కాబట్టి అనుద్దేశ పూర్వకంగా నీవు నాపైన కలిగించే పరివర్తనం నాకు తెలియకనే పోవచ్చు. కాని అది బుద్ధిపూర్వకంగా కలిగించే పరివర్తనం కంటె అనేకరెట్లు గొప్పది. హింసలో కనుపించని దేదీ లేదు. అహింస మూడుపాళ్ళు కనిపించనే కనిపించదు. కాబట్టి అది యెంత కనుపించదో దాని ఫలిత మంత యెక్కువగా ఉంటుంది. అహింస కార్యరూపంలోకి వచ్చినప్పుడు అత్యంత వేగంతో ప్రయాణిస్తుంది. అప్పుడది లోకోత్తర విషయంగా పరిణమిస్తుంది. కాబట్టి ప్రజా హృదయం, ముందు తెలియకుండానూ తరువాత తెలిసీ మార్పు పొందుతుంది. తెలిసి మార్పు పొందినప్పుడు గొప్ప విజయం కలుగుతుంది. ప్రజలు జారిపోతూన్నట్లుగా కనిపించినప్పుడు, నా అ...

భవములో నే సహజయం పొందినట్లు అనుకోలేను. 1922 లో నేను
శాసనోల్లంఘనమును నిలిపివేసినప్పుడు కూడా అహింసయొక్క శక్తి
సామర్థ్యాలలో నాకు సంపూర్ణ విశ్వాస ముండెను. నేను కూడా నేనా
ఆశాపూరిత చిత్తవృత్తితోనే ఉన్నాను. అహింస కేవల మొక ఉద్రేక
విషయం కాదు. ఒకవేళ నా కేమీ వెలుగు కనుపించక పోయినా నేను
నిరాశతో కుంగిపోను. ప్రతి పనికీ కాలం కూడా కలిసి రావాలి.

జన్మ వృత్తమూ (Heredity) పరిస్థితి(Environment) ఒక
దానిని బట్టి ఒకటి పరివర్తనం చెందే సంఘంలోనూ ప్రపంచం
లోనూ మనం జీవిస్తూన్నాము. విశ్వాసంతో నిండి సంప్ర
దాయంతో ఘనీభవించి ఉన్న జన్మవృత్తం, పరిస్థితి ప్రకోపింప
చేసే తర్కవాదముల ఆఘాతములకు గుఱిగాక తప్పదు. అనగా
మనిషియొక్క ప్రవర్తనకు దోవతీసే అతని ఆవేశాలు గాని నిశ్చ
యాలు గాని విజ్ఞాన శాస్త్ర మత విశ్వాసములపైన కలిగించే
భావముల ననుసరించి ఉంటవి. మానవ ప్రవర్తనం నిర్దోషంగా
ఉండేటందుకు మనపూర్వు లానాటి పరిస్థితులను అనుభవములను
వాద ప్రతివాదములను గమనించి భావి సంతానముయొక్క
శ్రేయస్సు కొఱకు నిర్మించిన ధర్మ సిద్ధాంతములను భక్తితో అవ
లంబింప చేయడం కంటె మతమునకు పరమోద్దేశ మేమున్నది?
నల్లిని, పేనును, చీమను, ఎలుకను, కప్పను, ఉడతను, తూనీగను,
తేలును, పామును-వీటన్నిటినీ కాలక్షేపం కోసమో, అవసరం
కోసమో జనులు చంపుతూంటారు. కాని చిన్నతనంలోనే
ప్రేమ తత్వాన్ని పిల్లల మనస్సులలోకి ఎక్కిస్తే ఆ ప్రేమ ఆత్మ
లేని పురుగుల విషయంలో గాని ఆత్మ ఉన్న దిక్కులేని జంతువుల

విషయంలో గాని సానుభూతితో ఉప్పొంగక తప్పదు. బాధ పడుతూన్న జంతువును చూస్తే బిడ్డకు కూడా ఎందుకు జాలి కలగాలి? ఆ జంతువులో కూడా తనలో ఉన్న ప్రాణమే ఉన్నట్లు బిడ్డకు తెలుసు. తన ప్రాణంపైన తనకెంత తీపో దానికి కూడా అంత తీపి ఉంటుందని బిడ్డ ఊహించుకొంటుంది. ఇటు వంటి ఊహ ఎప్పుడూ త్యాగాన్ని ప్రేరేపిస్తుంది. అంతకుతప్ప బోధించి ఊరుకోలేదు. ఈ చిత్తవృత్తి పైన ఆధారపడి ఉన్న నాయకు డెప్పుడు పోరులోకి "రా" అని పిలుస్తాడుకాని "పో" అని చెప్పడు. దేశభక్తి గల అహింసా యోధుడు తాను త్యాగిగా వుంటాడు. పెద్ద విషయాలకోసం చిన్న విషయాలను త్యాగం చేస్తాడు. కాబట్టి అహింస విశాలంగా గ్రహింప దగినది. అగాధమైన ప్రతి ప్రయోజనం గలది. సంపూర్ణ త్యాగభూయిష్ఠమైనది. సత్యాగ్రహి చుట్టుతికము స్నేహము అనే మేరలను గమనించకుండా తల్లి బిడ్డకువలె దేశానికీ జాతికీ సేవ చేస్తాడు. తనను ప్రేమించినందుకో, లేక తనకెదురు రానందుకో కాక తనను ద్వేషిస్తూన్నందుకు తనపైన పగ పట్టినందుకు చూపించే ప్రేమ అతి శక్తివంతమైనది, అతి పవిత్రతమమైనది. అతి స్వచ్ఛందమైనదీ. అది హృదయంలోనుండి పొంగి పొరలి వస్తుంది. అంతేకాదు. అది తన నిశ్చయాన్ని చక్కగా నిర్వహించ గలదు. ఎందువల్లననగా ఆ నిశ్చయానికది ఒక నూతన చిత్తవృత్తినీ చైతన్యాన్నీ చేకూరుస్తుంది. నిజంగా అది ప్రతికక్షి హృదయంలో విహరిస్తుంది. అనగా ప్రేమ ప్రతిబింబిస్తుంది. ప్రేమ కష్టాలకు జంకదు, కష్టములను కోరి తెచ్చుకొంటుంది.

ప్రేమకు పునాది ఆత్మ అందరికీ ఒకటే అనే సిద్ధాంతం. ప్రేమ గలవాడు తాను బాధ పడడానికి తయారుగా ఉండడమే అందుకు తార్కాణం. వినయము, బాధా సహిష్ణుత-ఇవి ప్రాచ్యదేశ భావాలు. ఇవి రెండూ కూడా మమకారమును తగ్గిస్తవి లేదా నిర్మూలిస్తవి. మొదటిది ఆత్మోన్నతీ మానసికోన్నతీ గలవాళ్ళ మనే అహంకారాన్ని తగ్గిస్తుంది. రెండోది శారీరక సౌఖ్యా వాంఛలను తగ్గిస్తుంది. వినయం ప్రేమ కింకొకరూపం. అది దాని అసలు సారం. ప్రేమతో సేవ చేయవలెనని నిరంతరమూ సంసిద్ధంగా ఉండేస్థితి-ఈ స్థితే సత్యాగ్రహి యొక్క బాధా సహిష్ణుతకు కూడా కారణం. ఒక విషయాన్ని సరిగా గ్రహించ లేక పోవడానికి గాని నిర్ణయించలేక పోవడానికి గానీ హేతువు. బయటి అభ్యంతరాలు కావు. ఆంతరంగికంగా ఉండే అడ్డంకులు, తాను చాలా తెలివిగలవాడననీ నీతివంతుడననీ అనుకోవడం వల్లనే మానవుడు విషయాలను సరిగా గ్రహించి నిర్ణయించలేక పోతాడు. ఇవి రెండూ లోపించిన వానిలో ప్రేమతత్వం జనించనేజనించదు. అహంకారమనే "ఇంజను"కు వినయమనేది "బ్రేకు." ఒకప్పుడు గర్వం కూడా వినయాన్ని ప్రేరేపించవచ్చు. కాని ఆ వినయానికి సేవాతత్వం మూలం కాదు. కష్ట సంసిద్ధత దానికి ఆధారం కానీ పోషణకానీ కాదు. గర్వం, దౌష్ట్యం, భయం, ఇవన్నీ ఒక వర్గంలోవి. ప్రేమ, ఐకమత్యం, సేవా పరత్వం, వినయం, కష్టసహిష్ణుత-ఇవన్నీ వాటి ప్రతికక్షి వర్గం లోనివి.

సరియైన సత్యాగ్రహి ఒక్కడైనప్పటికీ అసలు ఉద్దేశాన్ని నెరవేర్చగలడని 1940 లో గాంధీ అన్నమాట కొత్తగా ఆనాడు చెప్పినదికాదు. 1908 ప్రథమ భాగంలో దక్షిణ ఆఫ్రికా సత్యాగ్రహం ముగింపబడగానే జోహాన్సు బర్గుకు దగ్గరగానున్న ఒక పేటలో, యూరోపియనుల సభలో, గాంధీ అప్పటి పరిస్థితిని వివరించాడు. అప్పుడు ఆ సభకు అధ్యక్షత వహించిన సాను భూతిపరుడు హాస్‌కిన్ (**Hoskin**) అనే ధనవంతుడు గాంధీ ఆత్మ గౌరవానికీ, ప్రతిష్ఠకూ భంగకరమైన ఒకమాట అన్నాడట. "ఇంగ్లాండులో చర్చి సాంప్రదాయాలకు కట్టుబడి ఉండము అని చెప్పే (**Non Conformists**) వర్గంవారు, వోటుకోసం ఆందోళన చేసేవారు (**Suffragists**) లేవదీసిన ఉద్యమము వంటిదే దక్షిణ ఆఫ్రికాలో భారతీయుల సాత్విక నిరోధోద్యమం కూడా. అది దుర్బలుల సాధనం" అని అన్నాడట. ఆయన ఆనాడే. గాంధీ, మానసికం గానూ నైతికం గానూ బలవంతు డైన ఏ కైక సత్యాగ్రహి, మే ఉద్దేశాన్ని నిర్వహించడానికైనా సమర్థుడు కాగలడనే విషయాన్ని భావించాడు. ఆ సభలో సత్యాగ్రహం "ఆత్మశక్తి" యుతమైనదని చక్కగా సమర్థించాడు. దాని పొలిమేర సాత్విక నిరోధము నతిక్రమించి కూడా చాలా దూరం ఉందని వ్యక్తం చేశాడు.

ఇటీవల గాంధీ దేశాన్ని అహింసా శిక్షణమునందు ఆరితేరే టట్లుగా చేయాలని తలంచాడు. 1938 వ సంవత్సరంలో శాంతి సైన్య ప్రణాళికను తయారు చేశాడు. 1938 జూన్ 18 వ తేదీని ఈ ప్రణాళికను వివరిస్తూ శాంతి సైనికుల కుండవలసిన లక్షణా

లను నిర్ణయించారు. దొమ్మీలు ముఖ్యంగా మత విషయికమైన దొమ్మీలు జరిగేటప్పుడు వాటిని ఆపివేయడానికి శాంతి సైనికులు తమ ప్రాణ సమర్పణం చేయడానికి కూడా సిద్ధంగా ఉండాలని ఆ ప్రణాళిక ఉద్దేశం. అనగా పోలీసువారి యొక్కయు మిలిటరీ యొక్కయు సహాయంతో నిమిత్తం లేకుండా శాంతి సైనికులు శాంతి భద్రతలను కాపాడగలిగి ఉండాలన్నమాట.

ఈ ప్రణాళిక యొక్క కోరిక చాలా పెద్దదనీ నిర్వహణం అసాధ్యమని తోచవచ్చును. కాని కాంగ్రెసు తన అహింసా పోరాటంలో జయం పొందాలంటే పైన వివరించబడిన పరిస్థితులను శాంత పద్ధతులతో ఎదుర్కొనదగిన శక్తి నది సంపాదించాలి. అందుకొఱకు,

౧ శాంతి దళంలో చేరిన ప్రతిసభ్యుడు అహింసలో అచంచల విశ్వాసం కలిగి ఉండాలి.

౨ ఈ శాంతిసేన ప్రపంచంలోని అన్ని మతములయందు సమాన గౌరవం కలిగి ఉండాలి.

3 స్థానికంగా ఉన్న మనుష్యులే యెక్కువగా తమ ప్రదేశాలలో ఉండి పని చేయాలి.

౪ వారు ఒంటరిగా గానీ, సమూహంగా గానీ పనిచేయవచ్చు.

౫ స్థానికంగా తాను స్వయంగా చేసే సేవను బట్టి స్థానిక ప్రజలతో సన్నిహిత సంబంధం కలిగి ఉండాలి. అందువల్ల సంకట సమయాలలో శాంతి సైనికుని రాక వారికి కయిష్టంగా గానీ అనుమానాస్పదంగా గానీ ఉండదు.

౬ వేలుపెట్టి చూపడానికి వీలులేని శీలమూ, నిష్పక్షపాతబుద్ధీ ఉండాలి శాంతి సైనికునకు.

౭ తుపాను వచ్చే సూచనలు ముందుగా కనుపించినప్పుడు శాంతిదళం కల్లోలం కలిగేదాకా వేచి ఉండకూడదు.

ఛ వాళ్ళ ప్రాంతాలలో ఉన్న ప్రజలతో సన్నిహిత సంబంధం కలిగించు
కోవడానికి తగిన విరామం కూడా ఉండాలి శాంతి దళ సభ్యులకు.

జ కష్టం లేకుండా గుర్తించడానికి తగినట్లుగా వారికి ప్రత్యేక దుస్తు
లుండాలి. —గాంధీ.

ఇక్కడ ఉదాహరింప బడిన ఆదర్శం వెంటనే ఆచరణలోకి రావడానికి వీలు లేనిదనీ, వేసుకొన్న సిద్ధాంతాల ననుసరించి ఒక భూఖండాన్ని పరిపాలించడానికి చేసే ప్రయత్నమనీ కొంతమంది ఆక్షేపణ. నిరాడంబరమూ, శాంతియుతమూ అయిన ఈ ప్రతిపాదనను చూచి యెవ్వరూ భయపడనక్కర లేదని గాంధీ వివరించాడు. శాంతిదళ సభ్యులు దేశంలోని అన్ని నేరాల విషయంలోనూ పోలీసువారి పనిని యావత్తూ తామే నిర్వహించ పూనుకొంటారని అనుకోవద్దు. కొన్ని సమయాలలో మతోద్రేకాలు ప్రబలి ప్రమాదకరమైన పరిస్థితు లేర్పడవచ్చును. అప్పుడు ప్రజామిత్రులుగా శాంతిదళ సభ్యులు జోక్యం కలిగించుకొని, వారి మర్యాదనూ ఆ ప్రాంతాలలోవారి కున్న ప్రతిష్ఠనూ పలుకుబడినీ వినియోగించి అక్కడ శాంతి వాతావరణము నేర్పాటు చేయవలెను.

1937 లో అండమాను రాజకీయ ఖైదీలు నిరశన వ్రతమును దిగినప్పుడు గాంధీ జోక్యం కలిగించుకొని వారిని విరమింపచేయ గలిగినాడు. అప్పుడు ఇండియాలో అహింసకు క్రొత్త ప్రోత్సాహం కలిగింది.

తరువాత కూడా ఆయన రాజకీయ ఖైదీల విడుదల విషయం లోనూ, బెంగాలులోనూ, ఇతర రాష్ట్రములలోనూ స్వేచ్ఛకు

భంగకరంగా అనేక మందిమీద జారీ చేయబడిన నిర్బంధపు టుత్తరువులను రద్దు చేయించడం విషయాలలోనూ శ్రద్ధ తీసుకొన్నాడు. దాని ఫలితంగా బెంగాలు గవర్నమెంటువారు వెంటనే ఒక్కసారిగా 1100 మంది ఖైదీలను విడచిపెట్టినారు. తరువాత డిటెన్యూలను విడచిపెట్టి ఇతరుల పైనున్న నిర్బంధపు టుత్తరువులను రద్దు చేశారు. వంగరాష్ట్ర ప్రభుత్వంవారి నిర్ణయమునకు గాంధీ అభినందించాడు. అప్పుడు కలిగిన వాతావరణం వల్ల తక్కిన రాష్ట్రాలలో కూడా అహింసా వ్రతులైన ఖైదీలను వదలిపెట్టక తప్పిందికాదు. బీహారు సంయుక్త రాష్ట్రాల ప్రభుత్వాలు, అందరు రాజకీయ ఖైదీలనూ విడచిపెట్ట వలెనని నిర్ణయించారు. కాని ఇండియాప్రభుత్వ చట్టం వారి కాటంకమయింది. అందువల్ల బీహారు సంయుక్త రాష్ట్రాల మంత్రులు రాజకీయ ఖైదీల పక్షాన పోరాడ నిశ్చయించుకొని 1938 లో హరిపుర కాంగ్రెసు జరిగే రోజులలో తమ పదవులకు రాజీనామాలు పంపినారు. ఇండియా ప్రభుత్వం కొంత బిగువు సడలించింది. కనుక అందరు ఖైదీలు విడచిపెట్టబడ్డారు. విడుదలైన ఖైదీలు, దాదాపు అందరూ హింసలో తమకు విశ్వాసం లేదని ప్రకటించారు. అహింసా చరిత్రలో ఆనాటినుండీ ఒక నూతనశకం ప్రారంభ మయింది.

అహింసా వ్రతాన్ని ద్విగుణీకృత శక్తితో ప్రచారం చేయడానికి ప్రపంచ సంగ్రామం నూతనావకాశాలను కల్పించింది. యూరోపియన్ జాతులకు గాంధీ పోవులు పంపిన సందేశాలు తాత్కాలికంగా ఫలప్రదములు కాకపోయినప్పటికీ అహింస

స్థిరభావం పొందుతూన్నదనడాని కేంతమాత్రమూ సందేహం లేదు. అహింస పట్టి గాలిమూట కాదు. ఒక స్పర్శవేది కాదు. ఒక రక్షరేకు కాదు. ఒక తాయెత్తు కాదు. అది మానవలోకానికి పొరపాటు పడని శిక్షకుని వంటిది; ఆత్మ పరిశోధనా దీపం. జీవలోకంపైన ప్రేమను ప్రసరింపచేసే అంతర్జ్యోతి.

అహింస, సంఘాన్ని ఒకటిగా కూర్చే దారం. ఆకాశం మీదనున్న గ్రహ నక్షత్రాలు పరస్పరమూ సంబంధించి ఉన్న సంగతి, నక్షత్ర శాస్త్రజ్ఞులు కనిపెట్టేటంతవరకూ మనకెలా తెలియలేదో, అహింసతో సంఘం సంబంధించి ఉన్న సంగతి కూడా అలాగే తెలియలేదు. కాబట్టి అహింస ప్రజాతంత్రమునకు పునాది. అందువలన ప్రజా తంత్రముకింద ఉన్నవాళ్ళందఱూ దాని పునాదికి భంగంవచ్చే యుద్ధాలలోకి దిగరు. యుద్ధాలలోకి దిగిన ఇరుతెగలవారిని ప్రజాతంత్ర పాలకులని చెప్పడానికి వీలులేదు. వారిలో ఒకడు అందఱికీ తెలిసిన ఫాసిస్టుగానూ రెండవవాడు గుర్తించదగిన సామ్రాజ్య వాదిగానూ ఉంటాడు. సంపూర్ణ స్వాతంత్ర్యం ప్రతి జాతికీ ఆదర్శంగానూ, దాన్ని సంపాదించడానికి అహింస సాధనంగానూ ఉండాలని గాంధీ అభిప్రాయం. సత్యాహింసలు ప్రేమకు వ్యాకరణం వంటివి. వ్యాకరణ శాస్త్ర రచయితలు తమ సూత్రములను వ్రాయడానికి ముందెంత కాలంనుండో భాష ప్రచారంలో ఉన్నట్టుగానే సత్యాగ్రహి వాటి ఉపయోగాన్ని కనిపెట్టడానికి ముందెంతో కాలం కిందటనే సత్యాహింసలు జన్మించి ఉన్నవి.

# అధ్యాయము 3

## సత్యాగ్రహం

### ౧

### దాని సిద్ధాంతం

జీవిత సమస్యలను పరిష్కరించుకోవడానికి సత్యాగ్రహ మొక దోషరహితమైన సిద్ధాంతమని, అధమము శాస్త్ర దృష్టితో నయినా ఇప్పటి కంగీకరింప గలుగుతూన్నాము. సాధారణ మానవబుద్ధికి దీనిని అర్థం చేసుకోవడం లోనూ ఆచరించడం లోనూ కొన్ని కష్టా లున్నందువలన నే కొద్దిమందో మాత్రమే దీనినిగూర్చి ప్రచారం చేస్తూన్నారు. ఇది వాడుకలోకి రావడానికి కూడా అదే కారణంతో జాగవుతూన్నది. సత్యం గ్రహించ తగినది (Abstract) అహింస కనిపించేది (Concrete). సత్యం జగత్తు కాధారం. అహింస జగత్తుకు రక్షణ. సత్యం జీవకణంలోని జీవద్రవ్యం. అహింస జీవబిందు రచనకూ స్థితికీ తోడ్పడే పదార్థం. జీవబిందువులు ఒకప్పు డస్థిమయంగానూ, మఱొకప్పుడు స్నాయుమయంగానూ, ఇంకొకప్పుడు నాడీమయంగానూ, వేఱొకప్పుడు రక్త సంబంధిగానూ, త్వక్సంబంధిగానూ, మేదోసంబంధిగానూ ఉండవచ్చును. కాని ఎక్కడ ఉన్నా జీవబిందు రచనను నిర్మిస్తాయి. అట్లే సత్యం అనేక రూపాలలో ఉండవచ్చును. కాని ప్రతి రూపంలోనూ కూడా సమన్వయ సూత్రంగా ఉంటుంది. అహింసా సహాయంతో అధునాతన పురాతన సమస్యలను పరిష్కరించడానికి సత్యం అత్యవసరం. సత్యాహింసల సంయోగ మనేక రూపాలలో

ప్రత్యక్షం కావచ్చును. కాని జీవిత సమస్యా పరిష్కారమున కుపయోగపడే ఏ మిశ్రమము లోనూ ఈ రెంటినీ వేఱు వేఱుగా ఉపయోగించడానికి వీలులేదు.

## సత్యమునుగూర్చి గాంధీ భావం

సత్యాగ్రహ కళకు సత్యాహింసలు అంగాంగీ భూతములు. అవి కేవలం ఉదాసీన శక్తులుకానీ ప్రతిషేధక శక్తులుకానీ కావు. అవి క్రియాశక్తులు. విజృంభణ శక్తులు. హింసా పద్ధతిలో జరిగే యుద్ధానికి యేయే గుణాలు కలవో ఆ గుణాలన్నీ కూడా ఈ సత్యాగ్రహ సమరకళకు ఆపాదించవచ్చు. శత్రువుల కేమీ తోచకుండా భయభ్రాంతులనుగా చేసి వారిలో మార్పు తెచ్చి వారిని జయించడంలో నేమి, స్వసైనికుల ఉద్రేకోత్సాహాలను పెంచి, వారికి త్యాగబుద్ధీ ధైర్యమూ సహనశక్తీ కలిగించి, వారి మనస్సులలో నియమబద్ధ బుద్ధిని కల్పించి, తక్కువ ద్రవ్యంతోనూ అంతకంటెనూ తక్కువ వినాశకర పరికరములతోనూ విశాల దేశంపైన పోరాటం సాగించడానికేమి సత్యాగ్రహం అప్రతిహతమైన క్రియాశక్తిగా పరిణమించిన సంగతి దాని సామర్థ్యాన్ని చవిచూచిన వారికి తెలియనిది కాదు.

## రెండు వైపులు

సత్యాహింసలను గూర్చిన గాంధీ భావం చాలా తక్కువ మందికి తెలుసు. వీటిలో ప్రతి ఒక్కదానికి రెండు వైపు లున్నవి. మొదటిది విధి. రెండోది నిషేధం. చాంపరాన్ జిల్లా కలెక్టరు గాంధీజీ కొక కఠినమైన ఉత్తరం వ్రాసి తరువాత దానిని ఉప

సంహరించుకొని ఆ ఉత్తరం తిరిగి పంపవలసిందనీ గాంధీని కోరినాడు. అప్పుడు గాంధీ అనుచరులలో యువకులు కొందరు దాని నకలును తీసుకోవడానికి ప్రయత్నించారు. గాంధీ వారిని మందలించి ఆ ఉత్తరం నకలు మీదగ్గర ఉంచుకొన్నట్లయితే అది ఉపసంహరించుకోబడ్డట్లు కానేకాదు అన్నాడు గాంధీ. ఇర్విన్ సంధి సందర్భంలో కూడా సరిగా ఇంతే జరిగింది. హ్యూమ్ శక్రెటరీ అయిన ఎమర్సన్ అమర్యాదగా వ్రాసిన ఉత్తరాన్ని పునరాలోచన చేసి ఇండియా ప్రభుత్వంవారు ఉపసంహరించుకొన్నారు. దాని నకలిప్పుడు కాంగ్రెసు రికార్డులలో లేదు. ఉపసంహరించుకోబడ్డ ఉత్తరానికి నకలుంచుకోవడమంటే ఆ ఉత్తరంలోని విషయాలను మన ఫైలులో ఉంచుకోవడమే గాక హృదయంలో ఉంచుకోవడం కూడా అవుతుంది. అది సత్య విరోధమే కాదు; అహింసా విరోధం కూడాను అని గాంధీ వివరించాడు.

## సత్యం - ప్రాక్పశ్చిమ దేశాలలో

తూర్పు దేశాలలో గాని పడమర దేశాలలో గాని సత్యమును గూర్చి ఒకేరీతి సిద్ధాంతాలుపదేశింప బడ్డవి. జాన్ మార్లే ఇలా అన్నాడు:

> మినుప్ప విరిగి మీద పడ్డా సరే నిజానికీ న్యాయాన్నికీ నిలబడి ఉండడం ప్రధాన ధర్మంగా ప్రజలా దేశింప బడుతూన్నారు. కాని ఆచరణలో ఆ నిజాన్ని నిలబెట్టడం కోసమే కొంత రాజీ అవసర మవుతుందని అన్ని మతాలవారూ అంగీకరిస్తూన్న సంగతి మనకు తెలుసు. అయితే తాత్కాలి కావసరములను ముందుగా గమనించి సత్యం విషయం

తరువాత విచారిద్దామనే భావం వల్ల జాతీయ జీవితం నీచస్థితికి వస్తుంది; ప్రజాభిప్రాయాన్ని అంతగా లెక్కగొనక పోవడం అలవాటవుతుంది; ఉదాత్తమైన, ఆధ్యాత్మికమైన, సారప్రయోజనములు గలిగిన, ఆదర్శముల కంటె ఐహిక భౌతిక స్వార్థములపైన బుద్ధి యెక్కువగా ప్రసరిస్తుంది; విషయ నిర్ణయశక్తి విపరీతంగా మందగిస్తుంది; నైతిక వికాసం క్షీణిస్తుంది; ఆత్మ గౌరవబలం తగ్గిపోతుంది; ఇవన్నీ ప్రత్యక్షంగా కనిపిస్తవి.

సామాన్య జనాలను సత్యముయొక్క సంకుచిత భావాలకు ఒప్పచెప్పి ఊరుకోలేము. అది కేవలమూ అసత్యం అవుతుంది. మోర్లే మళ్ళీ ఇలా అంటున్నాడు :

> అంతేకాదు. సత్యాన్ని కాలానుగుణంగా అవలంబించాలని చెప్పే మాటను సత్యం పరిపూర్ణమైనది; నిష్కళంకమైనది; ప్రమాదరహితమైనది; దైవప్రేరితమైనది; పరమోత్కృష్టమైనది; అటువంటి పరిపూర్ణ సత్యానికి మేము పరిపాలకులము; యజమానులము. అని నమ్మే కులస్థులు విని ఆదరిస్తారని అనుకోవడం కంటె పిచ్చి ఊహ మరొకటి ఉండదు.

## ౨
## దాని మూలము

మొట్టమొదటి మహాపురుషులకీ సత్యచింత కలగడానికి మూలమేమిటా అనే సంగతి విద్వాంసులూ విమర్శకులూ పరిశోధించవలసిన విషయం. గాంధీ విషయంలో అలాకాదు. మేము ఆయన వ్రాతలను బట్టీ, ఆయన చేసిన మొట్టమొదటి సత్య పరిశోధనలలో ఆయనతో సన్నిహితంగా ఉన్న మిత్రులు చెప్పిన విషయాలను బట్టీ చాలా సంగతులు తెలుసుకొన్నాము. సాధార

ణంగా అనుచరులు చేసే ప్రచారంకంటె ప్రత్యర్థుల పొగడ్త మన ఉద్యమాలకు ఎక్కువ బలం చేకూరుస్తుంది. కాబట్టి స్మట్సు సేనానీ, గౌ. జాన్. హెచ్. హొఫ్‌మియర్ (Hon Jan. H. Hofmeyer) చెప్పిన మాటలు మనకీ విషయంలో అమూల్యములైన ప్రత్యక్షసాక్ష్యాలు.

హొఫ్ మియర్ ఇలా అంటున్నాడు:

> సాధారణంగా చరిత్ర చేసే పనిలో కొంత న్యాయ్యం కనిపిస్తుంది. హిందూదేశం, అబుద్ధిపూర్వకంగా తన అతికష్టమైన సమస్యలలో నొక దానిని దక్షిణ ఆఫ్రికాకు సంక్రమింపచేసింది. దక్షిణ ఆఫ్రికా కూడా అబుద్ధి పూర్వకంగానే భారత దేశానికి శాసనోల్లంఘన సిద్ధాంతాన్ని ప్రసాదించింది.

సత్యాగ్రహం పీడాకరుణ్ని పీడితుడ్ని కూడా దేవుని సన్నిధానానికి తీసుకొని పోగలిగిన అమోఘ శక్తులు కలిగినదని అంగీకరింపబడిన పిమ్మట, హిందువులూ క్రైస్తవులూ కూడా తమ మతములలోని ప్రధాన సిద్ధాంతాలిందులో ఇమిడి ఉన్నవని చెప్పకొన సాగినారు. అయితే గాంధీజీ స్వయంగా చెప్పిన విషయాలివి :

> జరిగిన ముప్పై సంవత్సరాలనుండి నేను సత్యాగ్రహాన్ని బోధిస్తూనూ ఆచరిస్తూనూ ఉన్నాను. నేడు నాకు తెలిసిన సత్యాగ్రహ సిద్ధాంతాలు క్రమాభివృద్ధి పొందుతూ వచ్చినవే. దక్షిణ ఆఫ్రికాలోని భారతీయులు యెనిమిదియేళ్ళు ఆచరణలో పెట్టిన తరువాత దానికొక్కని స్పష్టపరచేటందుకు నేనే ఆ ఉద్యమానికి 'సత్యాగ్రహం' అని నామకరణం చేశాను. అప్పుడు దక్షిణ ఆఫ్రికాలోనూ, యునైటెడ్ కింగ్‌డంలోనూ నడుపబడుతూన్న "సాత్విక నిరోధమునకు" భిన్నమైనదని తెలియచేయడానికే నే నీ పేరు కల్పించింది. దాని వ్యుత్పత్త్యర్థం "సజానికి నిలబడమని"

కాబట్టి అది సత్యశక్తి! నేను దాన్ని ప్రేమశక్తి ఆత్మశక్తి అనికూడా అంటూవచ్చాను. సత్యాన్వేషణం ప్రత్యర్థిపైన హింస చేయడానికి ఒప్పుకోదని సత్యాగ్రహాన్ని ఆచరణలో పెట్టేటప్పుడు నాకు తెలిసింది. కాని ప్రత్యర్థిని తప్పుతోవనుండి సరియైన దోవలో మాత్రం పెట్టాలి. కాబట్టి ప్రత్యర్థిని బాధపెట్టి నందువలన సత్యాన్ని నిలబెట్టలేమనీ మనం బాధ పడడానికి ఒప్పుకొన్నందువలననే సత్య నిర్ధారణ జరుగగలదనీ ఈ సిద్ధాంతము యొక్క తాత్పర్యం. సాత్విక నిరోధానికి సత్యాగ్రహానికి ఉత్తర ధ్రువానికీ దక్షిణ ధ్రువానికీ ఉన్నంత భేదముంది. మొదటిది దుర్బలుల ఆయుధంగా ఉద్దేశింపబడ్డది. అంతేకాదు; తన ఉద్దేశాన్ని నెరవేర్చుకోవడానికి సాత్విక నిరోధం శరీర బలాన్ని ఉపయోగించడం కానీ దౌర్జన్యం చేయడం గానీ తప్పుగా పరిగణించదు. ఇక రెండవదయిన సత్యాగ్రహం బలిష్ఠుల ఆయుధంగా ఉపయోగపడడమే గాక హింసను ఏ రూపంలోనూ అంగీకరించదు.

* * *

తన అంతరాత్మను బాధించిన మీడున్ యొక్కయు, పారశీకుల యొక్కయు చట్టములను ధిక్కరించి అందుకు వేయబడిన శిక్ష కిక్కురు మనకుండా అనుభవించిన డానియల్ అతి పవిత్రమైన సత్యాగ్రహాన్ని అవలంబించాడన్నమాట. ఎథీనియన్ యువక బృందానికి, సోక్రటీస్ తనకు తెలిసిన సత్యాన్ని జంకకుండా ఉపదేశించి మరణశిక్షకు గురియైనాడు. ఈ సందర్భంలో ఆయన సత్యాగ్రహి. తన అంతరాత్మకు తండ్రి ఉత్తరువులు తగనివిగా తోచినప్పుడు వాటిని ప్రహ్లాదుడు ఉల్లంఘించాడు. తండ్రి అందుకతన్ని పెట్టిన హింసను యెవరితో చెప్పుకోకుండా సంతోషంగా భరించాడు. తన అంతరాత్మకు తోచిన విధాన నడచుకొన్న మీరాబాయి, భర్త కపచారం చేసినట్లుగా భావింపబడి ఆయనకు దూరంగా ఉండవలసి వచ్చి, ఆయన తనను లోబరచుకోవడానికి పెట్టిన అన్నిబాధ

లను గంభీరంగానూ క్షమాబుద్ధితోనూ భరించింది. మీరాబాయి ప్రహ్లాదు లిరువురూ సత్యాగ్రహాన్ని ఆచరణలోకి తెచ్చారు. డానియల్, సోక్రటీసులకు గాని, ప్రహ్లాద మీరాబాయీలకు గాని, తమను హింసించిన వారిపైన యేవిధమైన చెడ్డతలంపూ లేదనేమాట మనం జ్ఞాపకముంచుకోవాలి. డానియల్, సోక్రటీసు లిరువురూ వారి రాజ్యాలలో ఆదర్శ పౌరులుగా భావింపబడ్డారు. మీరాబాయి ఆదర్శ గృహిణి గానూ, ప్రహ్లాదుడు ఆదర్శ పుత్రుడు గానూ కూడా భావింపబడు తూన్నారు.

*   *   *

ఈ సత్యాగ్రహ సిద్ధాంతం క్రొత్తది కాదు. గృహ జీవితంలో అవలంబింపబడుతూన్న ఈ సూత్రం రాజకీయ జీవితంలోకి కూడా విస్తరింప చేయబడ్డది. కుటుంబ కలహాలు కానీ కుటుంబాలలోని భిన్నాభిప్రాయాలు కానీ ప్రేమ వల్లనే సాధారణంగా పరిష్కరింప బడుతూంటవి. అపకారం పొందిన మనిషి కుటుంబంలో తనతో భేదాభిప్రాయం కలవారిపైన కోపం పెట్టుకోవడం గాని ప్రత్యపకారం చేయడంగానీ తలపెట్టకపైగా వారిపైన గౌరవంతో తానే ఓర్చుకొని ఉంటాడు. కోపాన్ని అణచుకోవడం కానీ బాధను ఓర్చుకోవడం గానీ చాలా కష్టమైన పనులు కావడంచేత, అముఖ్య విషయా లన్నిటిలోనూ అతడు కుటుంబంలోని తక్కిన వారితో వెంటనే ఏకీభవిస్తూ ఉంటాడు. అందువల్ల అతనికి శాంతి కలగడమే కాక తక్కినవారి శాంతికి కూడా భంగంరాదు. కాబట్టి అతను అవుననా్నా కాదనా్నా యెప్పుడూ అతనుచేసే పని మొత్తం మీద కుటుంబ క్షేమానికి అనుగుణంగానే ఉంటుంది. ఈ ప్రేమ సిద్ధాంతమే నాగరిక ప్రపంచంలోని యెక్కువ భాగంలో కుటుంబశాంతిని చేకూరుస్తూన్నది. ఈ కుటుంబ ప్రేమ సిద్ధాంతాన్ని జాతీయాంతర్జాతీయ విషయాలలో కూడా ప్రత్యక్షంగా అంగీకరిస్తేనే తప్ప, జాతులకు నిజ

మైన ఐక్యత కుదరజాలదనీ, వారి చర్యలు ప్రపంచ మానవ క్షేమాని కనుగుణంగా ఉండజాలవనీ నా విశ్వాసం—అనగా ఈ సిద్ధాంతం రాజకీయ జీవితంలో ఆచరణలోకి రావాలి. ఎంతవరకైతే ఈ సూత్రాన్ని జాతు లంగీకరిస్తవో అంతవరకే అవి నాగరికము లైనట్లుగా భావించాలి.

* * *

ఈ ప్రేమ సిద్ధాంతమే సత్య సిద్ధాంతము. సత్యం లేకుండా ప్రేమ లేదు. సత్యం లేకుండా మమత ఉండవచ్చు. అది ఇతరులకు అపకారం కలిగినా తన దేశంపైన అనురాగం కలిగి ఉండడం లాంటిది; యువకుడికి యువతి మీద వలె మోహం కూడా ఉండవచ్చు. అజ్ఞానులైన తల్లి దండ్రులకు బిడ్డలమీద వలె అకారణమైన గుడ్డి మమకారం కూడా ఉండవచ్చు. ప్రేమ జంతు తత్వాన్ని అతిక్రమించి నిష్పాక్షికంగా ఉంటుంది. అందు వల్లనే సత్యాగ్రహం, రెండువైపులు గల నాణెమని చెప్పబడినది. దానికి ముందువైపు ప్రేమ, వెనుకవైపు సత్యము. ఆ నాణెము యెక్కడైనా చలామణీ అవుతుంది. దాని విలువ ఇంత అని చెప్పడానికి వీలు లేదు.

* * *

సత్యాగ్రహం తన కాళ్ళమీద తాను నిలబడగలది. అది ఆచరణలోకి రావడానికి ప్రత్యర్థి అంగీకార మనవసరం. ప్రత్యర్థి యెదురొడ్డిన కొద్దీ అది మరింత మెరుగెక్కుతుంది. కాబట్టి దాని కెదురు లేదు. సత్యాగ్రహి అపజయ మనేది యెరుగడు. అతడు అలసిపోకుండా సత్యం కోసం నిరంతరమూ పోరాడుతూంటాడు. పోరాటంలో మరణం మోక్షం; కారాగారం స్వాతంత్ర్యం సింహద్వారం.

* * *

మరణంతో పోరాటం అంతమైనట్లుగా కాక పరమావధికి పోయినట్లుగా భావించే సత్యాగ్రహి తన అంతరంగంలో ఆత్మ ఒకటి ఉందని నమ్మకం కలిగి ఉండాలి. అందువల్లనే సత్యాగ్రహం ఆత్మశక్తి అని కూడా పిలవ

బడుతూన్నది. తనను తాను వ్యక్తం చేసుకోవడానికి సత్యాగ్రహికి శరీరం ఒక ఉపాధి మాత్రమే. తనలోని సత్యాన్ని ప్రత్యర్థి చూడగలగ డానికి శరీరం అడ్డంకుగా నున్నప్పుడు దానిని సత్యాగ్రహి సంతోషంతో త్యజిస్తాడు. తన ప్రత్యర్థిలో మార్పు కలిగించ గలిగిన దేదైనా ఉన్న ట్లయితే అది తాను బుద్ధిపూర్వకంగా చేసే శరీరార్పణమే నని గట్టిగా విశ్వసించినప్పుడే సత్యాగ్రహి అందుకు సంసిద్ధమౌతాడు. శరీరం నశిం చిన తరువాత కూడా ఆత్మ జీవించి ఉంటుందనే నమ్మకం గలిగి ప్రస్తుత శరీరంతోనే సత్య విజయాన్ని చూడవలెనని అతడాత్ర పడడు. సత్యాగ్రహి తానుద్ఘాటిస్తూన్న సత్యాన్ని ప్రత్యర్థికి కనిపించేటట్లు చేసే ప్రయత్నంలో చావడానికి శక్తి కలిగి ఉండడమే అతని విజయానికి మూలం.

* * *

సత్యాగ్రహి యెన్నడూ తన ప్రత్యర్థికి హాని కలిగించడు. సాధువాదంతో అతని బుద్ధికి నచ్చేటట్టు చేయ ప్రయత్నిస్తాడు; లేదా తన త్యాగం వల్ల అతని హృదయాన్ని కరిగింప చూస్తాడు. అందువల్ల సత్యాగ్రహం యొక్క ప్రయోజనం ద్విగుణీకృతం. అది ప్రయోగించిన వారికీ వ్యతి రేకంగా ప్రయోగింప బడినవారికీ కూడా ఉపకారి అవుతుంది

* * *

కాని ఇటువంటి సత్యాగ్రహం యేరి కోరి తెచ్చుకొన్న ఏ కొద్దిమందో ఆచరించ తగినది కాని యెక్కువమందికి సాధ్యం కాదని ఒక ఆక్షేపణ ఉంది. నా అనుభవం అందుకు వ్యతిరేకం. సత్యానికి కట్టుబడి అందుకు బాధ పడడానికి సంసిద్ధంగా ఉండడమనే ఈ చిన్ని సూత్రాన్ని అంగీక రిస్తే ప్రతివానికీ అది ఆచరణయోగ్యమే. ఏ మంచి విషయాన్నయినా సరే అవలంబించి ఆచరించడంలో యెంత సుఖమూ కష్టమూ ఉన్నదో దీని విషయంలో కూడా అంతే సుఖమూ అంతే కష్టమూ ఉన్నది.

త్రికడు పూర్తిగా మానివేయవలెనంటే అందుకు తగిన కారణాలన్నీ తెలుసుకోవలసిన అవసరం లేనట్లే, దీనిని ఆచరించవలెనంటే కూడా దీని సిద్ధాంతమంతా పూర్తిగా తెలుసుకోవలసిన అవసరం లేదు.

* * *

ఇంతా అయితే తనకు తెలిసిన నిజంమీద నిలబడి ఉండవలెననే విషయాన్ని యెవరు కాదంటారు! తాను నిజమని నమ్మినదానిని ప్రత్యర్థిని కూడా నమ్మించడానికి చేతిబలం ఉపయోగిస్తే మొరటుతన మవుతుందని గ్రహించడం చాలా తేలిక. కాని తప్పుకు లోబడిపోవడం మర్యాద కాదు. వాదంతో ఒప్పించలేక పోయినప్పుడు ప్రాణాలు త్యజించడానికైనా సిద్ధమై దానికి లోబడకుండా ఉండాలి. అప్పుడే ప్రపంచంలో తప్పనేది లేకుండా పోతుంది. ప్రధాన ధర్మాలకు భంగం కలిగించేటప్పుడు తప్పును చూచీ చూడనట్లు పోకూడదు.

* * *

రాజకీయ రంగంలో, ప్రజల పక్షాన, అన్యాయ్య చట్టాలలోని అపభ్రంశాలను యెదుర్కోవడానికే సత్యాగ్రహం అవలంబించాలసి వస్తుంది. అర్జీల ద్వారానూ తదితర ప్రయత్నాల వల్లనూ చట్టంలోని తప్పు తొలగింపబడక పోయినప్పుడు నీవా చట్టానికి లోబడ కూడదని అనుకొంటే, దానిని తృణీకరించి అందుకు వచ్చే శిక్షను అనుభవించడానికి తయారుగా ఉండడమే నీవు చేయదగిన పని. కాబట్టి సత్యాగ్రహం చాలావరకు శాసనోల్లంఘనం వలెనో, సాత్విక నిరోధం వలెనో కనిపిస్తుంది. అది సంఘ క్షేమం కోసం చేయబడిన చట్టాలను తిరస్కరించదు గనుక "సివిల్ డిస్ ఒబీడియన్సు" అని పిలువబడుతూన్నది.

* * *

నేరాలు చేసేవాడు యెప్పుడూ మంచి చట్టాలను రహస్యంగా ఉల్లంఘించి శిక్షను తప్పించుకోవాలని చూస్తాడు. కాని సాత్విక నిరోధి అలా

కాదు. ఆయన ప్రభుత్వ చట్టాలను యెప్పుడూ విధేయుడుగానే ఉంటాడు. అది భయంచేత కాదు; అవి సంఘ క్షేమం కోసం చేయబడ్డ వనే నమ్మకంతో. కాని చాలా సకృతుగా అప్పుడప్పుడూ ఆయన కూడా కొన్ని చట్టాలను ఉల్లంఘించ వలసిన అవసరం వస్తుంది. ఆయన వాటికి విధేయత చూపించడం ఆత్మగౌరవానికి భంగకరమని తలచినప్పుడు బహిరంగంగానూ సౌమ్యం గానూ వాటిని తృణీకరిస్తాడు. అందుకు వేయబడిన శిక్షను మాట్లాడకుండా అనుభవిస్తాడు. అంతే కాదు-శాసన నిర్మాణకుల చర్యలకు అసమ్మతి చూపడానికి కూడా ఒక్కొక్కప్పుడు, యే చట్టములను తిరస్కరించడం నీతిబాహ్యం కాదో అటువంటి చట్టములను ఏకి తిరస్కరిస్తాడు. సత్యాగ్రహం పిల్లలకుకూడా తెలిసేటట్లు చెప్పడానికి వీలయినంత సులభమైనదీ, అంత గొప్ప శక్తి సౌందర్యములు కలదీ, అని నా అభిప్రాయం. దీనిని దక్షిణ ఆఫ్రికా లోని వేలకొలదీ భారతీయ స్త్రీలకూ పురుషులకూ పిల్లలకూ నేనుపదేశించినప్పుడు మంచి ఫలితాలు కలిగినవి.

* * *

రౌలట్టు బిల్లు ప్రకటింప బడినప్పు డందులోని నియమాలు మానవ స్వాతంత్ర్యానికి చాలా భంగకరంగా ఉన్నవనే తలంపుతో వాటిని శక్తివంచన లేకుండా అడ్డగించ వలెనని అభిప్రాయ పడ్డాను. అవి భారతీయు లందరికీ అయిష్టంగా ఉండడం కూడా నేను గ్రహించాను. ప్రజలందరికీ అసహ్యంగా ఉండే చట్టాలను చేయడానికి యెంత నిరంకుశ ప్రభుత్వానికైనా అధికారం లేదనీ ముఖ్యంగా పూర్వోత్తర రాజ్యాంగ నియతి ననుసరించి పోయే ఇండియా ప్రభుత్వాని కసలే అధికారం లేదనీ నా విశ్వాసం. ఆ రాబోయే ఆందోళన భగ్నం కాకుండా ఉండవలెనన్నా, దౌర్జన్య మార్గములను పట్టకుండా ఉండవలెనన్నా, సరియైన తోవ ప్రజలకు చూపడం ఆవసర మనుకొని దేశానికి సాత్విక

విరోధ రూపంలో సత్యాగ్రహాన్ని ఉపదేశించాను. అది కేవలం మన మనస్సులను పరిశుద్ధం చేసుకోవడాని కుద్దేశింప బడిన ఉద్యమం కావడంచేత, ఒకరోజు పనులన్నీ మానివేసి ఉపవాసం, ప్రార్థనా చేయ వలసిందని సూచించాను. ఆరోజు ఏప్రిల్ 6.

## శాస్త్రము - పనితనము

గాంధీకి సత్యాగ్రహం పైనగల ధృఢ విశ్వాసానికీ, ఆయన అప్పు డప్పుడూ అందు కనుగుణమైన ప్రత్యక్ష చర్యను చతురతతో ప్రోత్సహించేటందుకూ తగినకారణం లేకపోలేదు. "హేతువాదం బుద్ధిపైన పనిచేస్తుందనీ, సత్యాగ్రహి పడే బాధ ప్రత్యర్థి హృదయంమీద పనిచేస్తుందనీ" ఆయన నమ్మకం. అందువల్ల సత్యాగ్రహి యొక్క ప్రత్యక్ష చర్యలో మంచి పనితన మున్న దంటాడు. అది మనుష్యుల ఆంతరంగిక జ్ఞానాన్ని వికసింప చేస్తుంది. కసి కలిగించదు. అంతకు పూర్వం ప్రత్యర్థులుగా ఉన్నవారిని మరుక్షణం సహచరులుగా చేయగల శక్తి దాని కున్నది. సత్యాగ్రహంలో సంఖ్యలకు స్థానం లేదు. అధిక సంఖ్యాకుల కంటె దానికి అల్పసంఖ్యాకులే జయకారకు లవు తారు. శరీర బలంకంటె నైతిక బలమే అందులో ప్రాముఖ్య స్థానం వహిస్తుంది. కొన్ని రోగాలు కుదిరేముందు బాగా ఎక్కు వగా ప్రకోపించి ప్రమాదకరంగా ఉన్నట్లు కనిపిస్తయి. అలాగే సత్యాగ్రహోద్యమంలో కూడా ఆకస్మికంగా అనుకోనంత మహా సంకట సమయాలు తటస్థించి మరుక్షణంలో మంచి ఫలాలు వస్తయి. యుద్ధం భౌతిక మార్గాలద్వారా జాతులను సరియైన త్రోవలో పెట్టడానికి ఉద్దేశింప బడ్డది. ఈ అహింసా

పోరాటం ప్రజలకు భావోద్రేకం కలిగించి వారి అభిప్రాయాల లోనూ చిత్తవృత్తుల లోనూ ఉదార పరివర్తనాలను కలిగించ డాని కుద్దేశింప బడినది. పెద్ద పెద్ద అన్యాయ్యాలు శాసనో ల్లంఘనం ద్వారానే తప్ప సరిచేయ బడవని గాంధీ చాలాకాలం కిందటనే అన్నాడు. ఈ మాట చెప్పిన ఎనిమిది ఏండ్లకు ఆయన ఉప్పు సత్యాగ్రహం ప్రారంభించాడు. భౌతిక యుద్ధంలో, బాధ కలిగించినందువల్ల సంఘంయొక్క భౌతికశక్తులు విజృం భిస్తాయి. కాని అహింసా యుద్ధంలో బాధ పడడంవల్ల సాంఘిక ఆధ్యాత్మిక శక్తులు విజృంభిస్తాయి. బాధను కోరి తెచ్చు కొన్నవానికి హాని కలగడమంటూ లేదు. పూర్వకాలంలో గొప్ప వాళ్ళు చాలామంది సంగ్రామాలను శ్లాఘించారు. కాని వారు అహింసాయుధాల శక్తి సామర్థ్యాలను ఎన్నడూ చవిచూచిన వారు కారు. అబ్దుల్ గఫూరుఖాన్‌వంటి యోగపురుషుడు ఒక లక్షమంది సాంగ్రామిక చిత్తవృత్తి గల పఠాను యోధులను అహింసా యుద్ధ సేవకులు గానూ సేనానులు గానూ చేయడం తన జీవితంలోనే చూడగలిగినందుకు గాంధీ చాలా ఆనందపడు తూంటాడు.

### యుద్ధవ్యతిరేకోద్యమము - సత్యాగ్రహోద్యమము

ఈ అహింసా పరిశీలనా సందర్భంలోనే మొక్కడో ఒకచోట యూరపు అమెరికా ఖండములలోని యుద్ధ వ్యతిరేకోద్యమానికీ ఇండియాలోని సత్యాగ్రహోద్యమానికీ గల భేదాన్ని విచా రించడం అవసరం. 1940 లో గాంధీ నాయకత్వమున నడచిన

కాంగ్రెసు కార్యక్రమాన్ని గూర్చి హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శి అమెరీ ఇలా అన్నాడు:

ఈ ఉద్యమం యుద్ధ వ్యతిరేక సిద్ధాంత ప్రచారం కోసం మాత్రమే ఉద్దేశింప బడలేదని నేను స్పష్టంగా చెప్పవలసి ఉంది. ఇంగ్లాండు దేశములో వలెనే యుద్ధాలకు వ్యతిరేకమైన అంతరాత్మ అభ్యంతరాలను వెల్లడించేటందుకు, గాంధీకి ఆయన అనుచరులకు వైస్రాయి అవకాశమీయడానికి అంగీకరించాడు.

గాంధీ తనకోసం తన అనుచరుల కోసమేకాక, భారతజాతి అంతటికీ కూడా హిందూదేశం యుద్ధంలో చేరవలెనా అక్కరలేదా అని నిర్ణయించడానికిన్ని, యుద్ధ సహాయానికి వ్యతిరేకంగా బోధించడానికిన్ని హక్కు కావాలన్నాడు. అంతకు పూర్వమే ఇండియన్ నేషనల్ కాంగ్రెసు, హిందూదేశ స్వరాజ్య సంపాదనానంతరం కూడా, స్వరాజ్య వ్యవహారా లన్నిటిలోనూ అహింసా కార్యవిధానమే అవలంబింప వలెనని చేసిన తీర్మానం, గాంధీయొక్క ఈ వైఖరికి యెక్కువ కారణభూత మయింది. "న్యాయ సమ్మతమూ క్రమబద్ధమూ అయిన పద్ధతులతో స్వరాజ్యం సంపాదించడం భారతీయుల ఆశయమని" కాంగ్రెసులోని ప్రథమసూత్రం. దీనినిబట్టి స్వరాజ్య సంపాదనకు మాత్రమే అహింసా పద్ధతిని అవలంబింప వలెనని ఒక హద్దు కలదు. కాని 1940 సెప్టెంబరు 15, 16 తేదీలలో చేయబడిన బొంబాయి తీర్మానంలో స్వరాజ్య సంపాదనానంతరంకూడా అహింసా పద్ధతులతోనే ఇండియా ప్రభుత్వం వ్యవహరించవలెనని వ్రాయబడ్డది. ఈ సందర్భంలోనే 1940 జూన్, జులై,

ఆగస్టు నెలలో గాంధీ కాంగ్రెసు కార్యవర్గముల మధ్య అభి ప్రాయ భేదములు కలిగినవి. బ్రిటను భారతదేశ స్వాతం త్ర్యాన్ని అంగీకరించి, సంతృప్తి కరమైన పద్ధతులమీద కేంద్రంలో జాతీయ ప్రభుత్వాన్ని యేర్పాటుచేస్తే బ్రిటనుకు సైనిక సహాయం చేయడానికి కాంగ్రెసు కార్యవర్గం ఆ రోజు లలో అంగీకరించింది. గాంధీ అందుకు వ్యతిరేకం. అందువల్ల గాంధీకి ఈ తీర్మానంతో సంబంధం లేదనీ, ఇందువల్ల కాంగ్రెసు అవలంబింప బోతూన్న రాజనీతికి గాంధీ జవాబుదారీ యేమీ లేదని స్పష్టం చేయబడ్డది. తరువాత బొంబాయిలో, అంతకు పూర్వం పూనాలో అఖిలభారత కాంగ్రెసు కమిటీ (జులై 1940 లో) ఆమోదించిన పై తీర్మానముయొక్క అభిప్రాయాన్ని తలక్రిందులు చేస్తూ, భారతదేశం స్వరాజ్య స్థాపనా నంతరం కూడా కేంద్రప్రభుత్వంలో అహింసా పూర్వకంగానే వ్యవహ రించ వలెనని అఖిలభారత కాంగ్రెసు కమిటీ మఱొక తీర్మానం చేసింది. కాని ఆ తీర్మానంలోని ఆయుధ విసర్జనమునకు సంబం ధించిన వాక్యం, అహింసా సిద్ధాంత బలాన్ని కొంత తగ్గిస్తూన్న మాట నిజమే. యుద్ధ వ్యతిరేకోద్యమానికీ సత్యాగ్రహానికీ యెంత భేదమున్నదో, ఆయుధ విసర్జనకూ అహింసకూ అంత భేద మున్నదనేమాట అంగీకరించాలి. ఆయుధ విసర్జనంలో యుద్ధ వ్యతిరేకోద్యమపు చిహ్నాలు కొన్ని కనబడతవి.

### పాశ్చాత్య యుద్ధ వ్యతిరేకులు (Pacifists)

ప్రవక్త జెరీమియా నాటినుండీ కూడా యుద్ధ వ్యతిరేకాందో ళన జరుగుతూనే ఉన్నది. ఆయన మొట్టమొదటి యుద్ధవ్యతిరేకి,

ప్రఖ్యాత యుద్ధ వ్యతిరేకియైన జోడ్సు 1940 బి. బి. సి. ఉప న్యాసంలో యుద్ధాన్ని సమర్థించాడు. యుద్ధ వ్యతిరేకులు అన్నివిధాలా యుద్ధానికి వ్యతిరేకంగా ప్రచారం చేస్తూంటారు. కాని యుద్ధం ప్రారంభ మయిందంటే దాన్ని సమర్థిస్తారు. ఈపని అందఱు యుద్ధ వ్యతిరేకులూ చేయకపోవచ్చు. యుద్ధ ఘోరకృత్యములనుండి తమ జాతిని సంరక్షించు కోవడానికి తమ శక్తినంతనూ వినియోగించడం తమ ధర్మమని యుద్ధవ్యతిరేకు లంటారు. కాని యుద్ధం రాగానే వారి ప్రభుత్వాలను వారు సమర్థిస్తూంటారు. బ్రియాన్ ఆలాగే చేశాడు. బ్రియాను, జోడ్సు వంటివాళ్ళు యుద్ధంలో చేరితే, యుద్ధం తప్పనిసరి అనీ, ధర్మసమ్మతమనీ సామాన్య జనంలో అభిప్రాయం కలుగు తుంది. యుద్ధ వ్యతిరేకి తన ప్రభుత్వంపైన తప్పు పెడతాడు. ఆయుధ విసర్జనం కావాలనేవారు ఇతర ప్రభుత్వాలను తప్పు పడతారు. అహింస ఇతరుల నిమిత్తం లేకుండా వ్యవహరిస్తుంది. భావి సాంఘిక వ్యవస్థకు పునాది కావలసిన అహింసా కార్య క్రమం, ముందు వ్యక్తిగతంగా ప్రారంభమై, పిదప కుటుం బానికీ, తరువాత సంఘానికీ, చిట్టచివరకు ప్రభుత్వముల జాతీయ అంతర్జాతీయ వ్యవహారములలోకీ వ్యాపిస్తుంది. ఇటువంటి కార్య క్రమంలో గొప్పగొప్పవాళ్ళకు వరవడి పెట్టగలవాడు సామాన్య పౌరుడు. సాధారణంగా ఈ గొప్పవాళ్ళనబడే అందఱూ ప్రభుత్వ యంత్రాలలో చిక్కుకొని బయట పడడానికి వీలులేని వాళ్ళుగా ఉంటారు; అందువల్ల నూతన దృక్పథంనుండి వారు విషయాలను చూడజాలరు. అయితే ఒక కుటుంబానికీ సంఘా

నికీ ఉపకరించిన కార్యక్రమం అంతర్జాతీయ వ్యవహారాలలో అనువర్తింప చేస్తే ఉపకరించక పోవచ్చునని చాలామంది అంటారు. అది సరియైన మాటకాదు. ప్రతి జాతియొక్క ప్రధాన నాయకులూ తమ ప్రజలకు ఈ నూతన పద్ధతులమీద శిక్షణ యిస్తే ఈ సిద్ధాంతాన్ని పెద్ద వ్యవహారాలలో ప్రవర్తింప చేయడానికి అడ్డంకులు తగ్గిపోతవి. వట్టి సిద్ధాంతంగా గాక జయప్రదంగా ఆచరింపబడిన అనుభవంగా, ప్రజలముందీ కార్యవిధానాన్ని ప్రత్యక్షం చేయగలిగి ఉండాలి. అప్పుడిది సందేహాస్పదమైన సమస్యగా గాక సంభవనీయమైన సత్యంగా భావింప బడుతుంది.

గాంధీ సత్యాగ్రహంలో ఉన్న విజృంభణశక్తి పాశ్చాత్య యుద్ధ వ్యతిరేకతలో లేదు. అదికూడా ఈ రెంటికీ గల ముఖ్య భేదం. అందువల్లనే దానిని గూర్చి ఇలాంటి అభిప్రాయం.

> ప్రపంచంలో దీనికి యెక్కువ ప్రోత్సాహం లేదు. కారణం దీని ఆదర్శాలు చాలా పెద్దవైనందున కాదు; చాలా చిన్నవైనందున.

రివ రెండు జాన్ సి. విన్‌స్లో ఈ విధంగా వ్రాస్తూన్నాడు:

> యుద్ధ వ్యతిరేకి నైతిక దోషాలను గూర్చి చూపే నిర్లక్ష్యత, ప్రేమ, న్యాయబుద్ధి అనే ఉత్తమోత్తమ గుణాలను అతనిలో లోపింప చేస్తూన్నదని చాలామంది క్రైస్తవుల అభిప్రాయం. చెడుగు అనేదానికి దైవం గట్టిగా వ్యతిరేకమనే సంగతి, స్పష్టంగా తోచేటట్లు వ్యవహరించవలెనని వారి కోరిక.

గాంధీ సత్యాగ్రహం ఇంకాముందుకు పోతూన్నది చూడండి:

ప్రత్యర్థిని హింసించక పోవడమే కాదు. అతనిపైన ఏవిధమైన కసి కానీ దుశ్చింత కానీ కలిగి ఉండకూడదు. ప్రేమవల్లా, బాధ పడడంవల్లా అతని మనస్సు కరిగేటట్లు చేయాలి. అదే సత్యాగ్రహ సారం.

గాంధీ ఉద్దేశంలో సత్యాగ్రహం "డైనమో" నుండి వగిలి వచ్చే శక్తి వంటి శక్తి కలదని. అయితే ఈ శక్తి "డైనమో" నుండి వస్తుందా? రాదు.

డైనమో తనంతట తాను శక్తిని సృజించదు. కాని శక్తిని తనలోనుండి బయటకు వచ్చేటట్లు చేస్తుంది. సన్నగా బక్కగా దేహంపైకి కనిపిస్తున్నప్పటికీ, మనిషియొక్క ఆత్మశక్తి కూడా అటువంటిదే. మనిషి యొక్క ఆత్మ, అతని విశాల జీవితమనే సరోవరంలోకి, ప్రేమ, సత్యము, వివేకము, అనే నిరంతర స్రవంతులను ప్రవహింపజేసి, తిరిగీ సవ్యమార్గములలో వాటిని బయటకు జాలువారేటట్లు చేస్తుంది. గాంధీ జీవితమంతా ఒక పెద్ద యుద్ధం. యంత్ర యుగానికి వ్యతిరేకంగా యుద్ధం; మనిషిపైనా మృగంపైనా చూపబడే క్రూరత్వానికి వ్యతిరేకంగా యుద్ధం; నిరంకుశాధికార తత్వానికి వ్యతిరేకంగా యుద్ధం;- ఈ యుద్ధాలన్నిటిలో తన అహింస అనే ఆయుధాన్నే ఆయన ప్రయోగించాడు. "అహింస శత్రువుల కత్తులను మొద్దుబారేటట్లు చేస్తుంది. వారి ఊహలను వమ్ము చేస్తుంది. శత్రువు మొట్టమొదట నిర్ఘాంతపోతాడు. తరువాత మార్పు పొందుతాడు." ఇవి అహింసనుగూర్చి గాంధీజీ చెప్పిన మాటలు.

సత్యాగ్రహాన్ని గూర్చి 1919 లో గిల్బర్టు ముర్రే ఇలా వివరించాడు:

> అత్యంతమైన భౌతిక శక్తికి వ్యతిరేకంగా నిస్సహాయంగా ఆత్మశక్తి చేసే పోరాటమే సత్యాగ్రహం. భౌతికశక్తి చిట్టచివరకు తన సన్నాహాలన్నిటినీ వదలించుకొని ఆత్మను ఆశ్రయించుకోవడంతో సత్యాగ్రహ సమరం పూర్తి అవుతుంది.

తరువాత ఇరవైయేండ్లకు 1939 లో కూడా ఆయన ఇలా వ్రాశాడు:

శత్రువులోని ఆధ్యాత్మిక గుణాన్ని సత్యాగ్రహం నిగూఢంగా రేకెత్తిం చేస్తుంది. శత్రు వప్పు డెంత పశుబలం కోసం ప్రయత్నించినా తన మానుషభావం నుండి పూర్తిగా తప్పించుకొని పోలేడు. అందువల్ల సత్యాగ్రహం విజయం పొందుతుంది.

వేదాంతులూ యోగులూ విరాగులూ సత్యాగ్రహాన్ని నిరంతరమూ శ్లాఘిస్తే శ్లాఘిస్తూండవచ్చు. కాని ఎక్కడబడితే అక్కడ దౌర్జన్యమూ యుద్ధమూ చెలరేగుతూన్న ఈ రోజులలో సామాన్య మానవుడి కది నచ్చదు. దాన్ని ఉపయోగించమనడం తాతలనాటి మొండికత్తిని ఉపయోగించమనడంగా ఉంటుంది. జనులు దాన్ని అర్థం చేసుకోరు; నమ్మరు; దానివంక చూడనైనా చూడరు; అటువంటి సామాన్య జనమే సత్యాగ్రహ సిద్ధాంతాన్ని అవగతం చేసుకొని దాని సూత్రాలకు కట్టుబడి ఉంటూన్నారు.

ప్రపంచ శాంతి స్వతంత్రములను రక్షించేటందుకు అహింసా నిరోధమును ఉపకరణంగా మార్చడంలోనే గాంధీయొక్క కళా కౌశలము కనబడుతూన్నది. ఈసందర్భంలో ఆర్.యఫ్.ఆల్ఫ్రెడ్ హెూర్లే ఇలావిశదంగా వ్రాశాడు:

ఆయనపైన ఆయనకు గల అధికారమే ఇతరులపైన కూడా ఆయన కధికారం కలుగచేస్తూన్నది. ఆయన ప్రదర్శించిన నిగ్రహశక్తి వలన, మాటకు మాటా దెబ్బకు దెబ్బా తగిలి తీరవలెననే ప్రపంచంలో పెరిగిన వాళ్ళందరికీ కూడా ఆయన ఉపదేశాలు మానవస్వభావాని కను

గుణమైనవే నని తెలిసిపోయింది. పరికాశ వంతంగా కనిపిస్తూన్న ఆయన ఉదాహరణ మొక్కటే అన్ని సందేహాలనూ తొలగించగలదు.

సత్యాగ్రహం యేవిధంగా ప్రత్యర్థిపైన విజయం పొంద గలదో ఆల్‌ఫ్రెడ్ హెబ్లర్ట్లె ఈ క్రిందిమాటలలో ఉదాహ రించాడు :

భౌతిక ఆయుధంగా కాక నైతిక ఆయుధంగా అది రాజకీయ పోరా టాన్ని ఉచ్చస్థాయికి తీసికొని పోతుంది. రాజకీయబలం కానీ సైనిక బలం కానీ లేనివారు ఈ ఆయుధాన్ని ఉపయోగించ వచ్చును. ఇందులో ఆత్మనిగ్రహము, సంకల్పబలము, బాధాసహిష్ణుత, వినయమూ-అన్నీ ఇమిడి ఉన్నవి. ఇది ప్రత్యర్థుల అంతరాత్మపైన బాగా పనిచేస్తుంది. వాళ్ళదే న్యాయ్యం అనే ఆత్మ విశ్వాసాన్ని వాళ్ళ హృదయాలనుండి పిండివేస్తుంది; వాళ్ళ శరీర బలాన్ని ఎందుకూ కొఱగాకుండా చేస్తుంది; తాము పెడుతూన్న బాధవల్ల తామే అపరాధం చేస్తూన్నామనే భావాన్ని వాళ్ళ మనస్సులలో కలిగించి వారి నిశ్చయాన్ని బలహీనం చేస్తుంది. ఈ అన్ని కారణాలవల్ల సత్యాగ్రహం తుదకు విజయం పొందుతుంది.

## పాశ్చాత్య పండితుల ప్రామాణ్యం

గాంధీకి మనుష్యులమీద గల వశీకరణ శక్తికి ఉదాహరణంగా చెప్పవలెనంటే "క్రైస్తును ఇంతకంటె ఎక్కువగా సేవించుట యెలా అనే విషయాన్ని గాంధీ పాదాలకడ గ్రహించడానికి" ప్రపంచంలోని క్రైస్తవ రాజకీయ చతురులు కొంద ఱాయన కడకు వార్ధాకు యాత్రికులుగా వచ్చారన్న సంగతి చెప్పితే చాలు. అప్పుడా ఉపదేశకుడు వారితో "మీరు ధనాన్నీ దైవాన్నీ ఒక్కసారిగా సేవించ జాలరు. ధనం ఇండియాను సేవించడానికి

పంపబడింది. దేవుడు వెనుక చిక్కిపోయినాడని అదీ నాభయం" అని వారిని ఉపాలంభించాడు. దబ్బుతో మునిగి తేలుతూన్న మతసంస్థలను గాంధీ ఏవగించుకొంటాడు. 1930 లో ఉప్పు సత్యాగ్రహం ప్రారంభింప బోయేటప్పుడు గాంధీ కాంగ్రెసు వర్కింగుకమిటీ యెదుట ఉపన్యసిస్తూ తాను దక్షిణ ఆఫ్రికాలో సత్యాగ్రహం ప్రారంభించిన సమయంలో తనకు వెనుక మూడువేల సిబ్బందీ ఉన్నప్పటికీ జేబులో ఒక్క రాగిడబ్బైనా లేకుండా ఎంతో హాయిగా తానప్పుడా ఉద్యమాన్ని నడప గలిగితిననీ, తాను వద్దన్నకొద్దీ గోఖ్లే, సర్ రతన్ తాతా దగ్గర నుండి రు 25000లకు చెక్కు పంపినప్పటినుండీ తనకష్టాలు ప్రారంభమై చివరకు సత్యాగ్రహం కూడా విరమించవలసి వచ్చిందనీ చెప్పినాడు. ప్రత్యర్థి బలాన్ని చూచి కంగారుపడే స్వభావం గాంధీకి లేనేలేదు.

బందిపోటు దొంగల హృదయాలను కూడా మనం కరిగించ కలమన్నే ధైర్యం కలిగి ఉండాలి; మనను చూచి ఇతరులు తాతిగోడను వేసి మన తలలు పగులకొట్టు కొంటున్నామని అనుకొంటే అనుకోనీయండి, అది తాత్కాలికం. అన్నాడు గాంధీ.

సత్యాగ్రహం చేసి తమ హక్కులను రక్షించుకో వలసిందని జర్మన్ యూదులను ప్రోత్సహించడం తన నూతన సిద్ధాంతాన్ని సముద్రాలను దాటించి ప్రవేశ పెట్టడానికి గాంధీ చూపిన ధైర్య సాహసాలకు మొదటి తార్కాణం. ఆయన వారికిలా సలహా యిచ్చాడు :

అహింసా మార్గాన్ని అవలంబిస్తే యూదుడైన వాడెవడూ నిస్సహాయత అనుభవించ వలసిన అవసరం లేదు. "ఇంతకన్న బాగా ప్రవ

ర్తించడం తెలియనివాళ్ళ చేతులలో మేము బాధలు పడడానికి సంసిద్ధంగా ఉన్నాము. అయితే వాళ్ళు మమ్మల్ని ఏవిధంగా బాధ పడవలసిందని కోరుతూన్నారో ఆవిధంగా మాత్రం మేము బాధపడ దలచుకో లేదు" అని చెప్పగలిగిన ఒక్క యూదుడైనా ఉంటే అతడు తన ఆత్మ గౌరవాన్ని కాపాడుకోవడమే కాకుండా ఆ తత్వముయొక్క వ్యాపకం వల్ల యూదుల నందతినీ కాపాడి మానవలోకాని కొక అమూల్యా గుణాన్ని సమర్పించిన వాడవుతాడు.

40 కోట్ల ప్రజలుగల చైనాదేశం కూడా జపాను దురాక్రమణను ఆపడానికి జపాన్ అవలంబించిన హింసా పద్ధతులనే అవలంబింపవలసి రావడం అన్యాయ్యమంటాడు గాంధీ. జెక్కుల ఖనిజ సంపదనూ పారిశ్రామి కాలయాలనూ జర్మను లాక్రమించినప్పుడు కూడా జెక్కులకు గాంధీ చెప్పిన సలహా ఇదే. ఆయనకు చర్చిలు అమెరీలలో ఎంత విశ్వాస మున్నదో- హిట్లరు ముసోలినీలలోకూడా అంతే విశ్వాస ముంది. అహింస జయం పొందవలెనంటే మనం మన పవిత్రతను సామ్రాజ్య వాదులకూ, బ్రిటిష్‌వారు ఫాసిస్టులకూ ప్రదర్శింప గలిగి ఉండవలెనని ఆయన తలంపు.

ఆయన 1940 జూన్‌లో "ప్రతీ బ్రిటిష్ దేశీయునకు" అని ఒక లేఖ వ్రాశాడు. అది ఫ్రాన్సు పడిపోకముందే వ్రాయబడ్డది. కాని ఫ్రాన్సు పతనానంతరం ప్రచురింప బడ్డది. ఆయన దానిలో ఉద్దేశించిన ప్రణాళికనూ, దానిని ఆచరించవలసిన విధానాన్నీ గమనించినట్లయి తే అంత ధైర్య సాహసాలు భూత భవిష్య ద్వర్తమానకాల చరిత్రలో ఎక్కడా ఉండవని అర్థ

మవుతుంది. బ్రిటను తన సలహా తీసికొన్నట్టయితే జర్మనీని అహింసా పూర్వకంగా ఆపే విధానం తాను చూపిస్తానని గాంధీ ఆ ఉత్తరంలో వాగ్దానం చేశాడు. అదంతా అహం కారంగా కనపడితే కనపడవచ్చు. కాని రివరెండు జాక్ సి. విన్‌స్లో గాంధీనిగూర్చి వ్రాసినప్పుడు ఆయనను కోరిన కోరిక అదే. ఆయన వ్రాసింది ఇది :

> అస్త్ర సన్న్యాసం చేసి ప్రశాంతంగా ముక్తిమార్గం చూచుకోవడానికి తగిన ఈ చివర రోజులలో కూడా మహాత్మా గాంధీ తన జీవిత చరిత్రకు మకుటాయమానంగా ఉండే ఈ అంతిమ మహాత్కార్యం ఎందుకు నిర్వర్తించి పోకూడదా అని ఆశ్చర్యం కలుగుతూంటుంది నాకప్పుడప్పుడు! ఇక్కడ, ఈ పడమరదిక్కున ద్వేష పోరాటాలు లేని నిరంతర శాంతి భద్రతలను కోరే అనాథులైన ఐరోపా దేశపు లక్షలాది ప్రజలకు నాయకత్వం వహించి మా భూమిలో అటువంటి న్యాయ్య ధర్మాలను స్థాపించడానికి మే మేమి త్యాగాలు చేయవలెనో, యేమేమి బాధలను అనుభవించవలెనో, మా కాయన యేల ఉపదేశించరాదు?

సత్యాగ్రహం తన దేశానికి ఐకమత్యమూ స్వతంత్రమూ సంపాదించడానికి గానీ లేక సాంగ్రామిక తత్వాన్ని నిర్మూలించడానికి గానీ, సాంఘిక ఆర్థిక లోపాలను సంస్కరించడానికి గానీ ఉద్దేశింపబడిన ఉపాయం మాత్రమే కాదు. దాని సంగతి ఇంకా చాలా ఉన్నది. "క్రైస్తు బాధను నేను ముగింపు చేస్తాను" అని చెప్పిన సెంటు పాల్ సిద్ధాంతం అందులో ఇమిడి ఉంది. సత్యాగ్రహ తత్వాన్ని సరిగా అర్థం చేసుకొన్నవాళ్ళు వెనకటి చరిత్రను పరిశీలించి, క్రమానుగతంగా అభివృద్ధి పొందుతూ ఇప్పటికి నిలచిఉన్న, ఇంకనూ నిలవదగిన జాతుల ఉచ్చస్థితి, అసంఖ్యాకులైన ప్రజల అనంత త్యాగ బలము వలననే తటస్థించినదని గ్రహింపగలర్రు.

మొదలు గృహములో ప్రారంభమైన తల్లిదండ్రుల ప్రేమ అంతకంతకు దృఢపడి సంఘంలోకి వ్యాపిస్తుంది. బిడ్డకోసం త్యాగం చేసినతండ్రి తరువాత సంఘంకోసం త్యాగం చేయడం నేర్చుకొంటాడు.

సత్యాగ్రహము - దాని పాత్రక్రమము

చెడుగును మంచిచే జయించడానికి సత్యాగ్రహమొక శాస్త్రం; ఒక కళ. తప్పు తప్పువల్లనూ దౌర్జన్యం దౌర్జన్యం వల్లనూ రూపు మాయదు. గనుక మనను ఇతరులు తిట్టినా కొట్టినా మన మా బాధను ఓపికతో సహించుకొన్న యెడల ప్రత్యర్థి మనస్సు పరివర్తనం చెంది సంస్కరింప బడతాడని సత్యాగ్రహంలో ఇమిడిఉన్న ఉద్దేశం. మన మనస్సులలోని సుహృద్భావమే ఇతరులలో కూడా ప్రతిబింబిస్తుంది. దానిని కార్యరూపంలో పెట్టేటందు కెంతత్యాగమున కైన సంసిద్ధంగా నుండవలెను. మన గృహములలోని స్త్రీలూ పిల్లలూ అనేకసారులు కోపం వచ్చి అన్నం మానివేసినప్పుడు మన మొక్కొక్కప్పుడు వారిపైన దౌర్జన్యం చేస్తూటాం. దీనికి కారణ మేమిటి? వారు పడుతూన్న బాధ నిష్కళంక మైనది కాదు. వారి బాధకు కారణం లోపల ఉన్న కసి. అందువల్లనే అది మనకు దయ పుట్టించడానికి బదులుగా క్రోధం కలుగచేస్తూన్నది. పవిత్ర హృదయంతో స్వచ్ఛందంగానూ సంతోషంగానూ పొందుతూన్న బాధ ప్రత్యర్థి మనస్సులోని చీకాకును నిమిషంలో తొలగించ గలదు. మానవజాతి కీసంగతులు తెలుసుకొనేటందుకు తిరిగి కొత్తగా శిక్షణ పొందాలి. అక్షరాభ్యాసం నుండి సాంగోపాంగంగా

సంపూర్తి అయ్యేవరకూ కూడా సత్యాగ్రహ ప్రక్రమం క్రొత్తగా బోధించవలసిందే. క్రైస్తవుడు, నాస్తికుడు, ప్రకృతి శాస్త్రజ్ఞుడు, తత్వవేత్త, మతప్రచారకుడు, మామూలుమనిషి, యోధుడు, రాజకీయ ధురంధరుడు- ఈ అందరూ కూడా హింసా సిద్ధాంతంతో మైకం కప్పి ఉన్న దురదృష్టపు రోజులివి. అందరూ దౌర్జన్య దేవతను పూజించేవారే. వారిదివరకు గ్రంథాలయాలలో చదివిన చదువు, పరిశోధనాలయాలలో చేసిన పరిశీలనలు, మానవ సంభాషణలలో నేర్చుకొన్న నీతులు. అనుభవ విశ్వ విద్యాలయాలలో అలవరచుకొన్న పాండిత్యం- ఇదంతా ఎటువంటి దైనప్పటికీ అంతర్జాతీయ పోరాటాలను పరిష్కరించడానికి పటాలాలు తప్ప పనికిరావని వారి అభిప్రాయం. బ్రిటను జర్మనీ దేశాల ఆర్చి బిషప్పు లిద్దరూ కూడా వారి మామూలు మతాచారాల ప్రకారం, ఒకే ప్రకారం ఒకేపద్ధతిని ఒకే క్రైస్తును తమ తమ సామ్రాజ్య ఫాసిస్టు తత్వాలకు జయం చేకూర్చ వలసిందని ప్రార్థిస్తూన్న కాలమిది. నైతిక శక్తి వట్టి మాటలలో చర్చియందే ఉండిపోయింది. నిస్సంగత్వం వల్ల ఉద్భవించే అద్భుత నైతికశక్తిని వారు గ్రహించినట్లు లేదు. మనిషియొక్క శరీరమే ఎంతో భౌతికశక్తిని విజృంభింప చేయగలిగి ఉండగా, అతని ఆత్మ ఇంకెంతో నైతికశక్తిని విజృంభింప చేయగలదు. రక్త మాంసములతో కూడిన ఈ శరీర పోషణకోసం పుష్టికరమూ జీర్ణకారీ అయిన ఆహార మెంత అవసరమో, కొన్ని సిద్ధాంతముల తోనూ, కొన్ని సత్యముల తోనూ సంస్కరింపబడి పోషింపబడడం మనస్సుకు కూడా అంత

అవసరం. అన్ని నైతిక సంభాషణల లోనూ ఈ సిద్ధాంతా లను అందఱూ చర్చిస్తూనే ఉంటారు కాని పౌరుల ప్రకృతిలో అవి తగినంతగా ఇమిడిపోవడం మాత్రం చాలా అరుదు. కాబట్టి బాల్య యౌవన కౌమార దశలలో కూడా ఈ సిద్ధాం తాలను మానవ హృదయాలలో ప్రవేశింప చేయగల నూతన విద్యా విధానమును మనం కనిపెట్టవలెను. అటువంటి విద్యవలన మనిషి పెరిగి పెద్దవాడైన తరువాత మోహ పరాయణుడుగా ఉండక ప్రతివానికీ కావలసిన స్వేచ్ఛకోసం న్యాయ్యంకోసం శాంతికోసం ప్రయత్నిస్తాడు.

## గాంధీపైన నేరాలు

కేవలం తప్పు పట్టవలెననే మిధ్యాపవాదులు గాక కొందఱు నిజ మైన మిత్రులే, గాంధీ బహు వేగంగా తన వైఖరిని మార్చు కొంటూ ఉంటాడనీ, నిష్కపటంగానూ, రహస్యమనేది లేకుం డానూ వ్యవహరించ వలెనని బోధించే తానే ఎన్నోసార్లు అందుకు విరుద్ధంగా బహు సూక్ష్మబుద్ధిని ప్రదర్శిస్తూంటాడని విమర్శిస్తూంటారు. ఈ విమర్శ కేవలం తోసివేయదగినది కాదు. కాని పరస్పర విరుద్ధాలవలే కనపడే ఈ విషయాలను అర్ధం చేసుకోవాలంటే సత్యాగ్రహ శిల్పకళను అర్ధం చేసుకోవాలి. అహింసా సూత్రములకు బద్ధమై యున్న సత్యాగ్రహుల పద్ధతికీ పర్యవసానానికీ వ్యత్యాసము గమనింపబడదు. అనగా మన మొక పనిని సాధించడానికి ప్రయోగించే పద్ధతీ, అందువలన కలిగే పర్యవసానము- ఈ రెండూ కూడా గౌరవప్రద మైనవి

గానే ఉండాలి. కాని సత్యాగ్రహి యెప్పుడూ సహకారానికీ సంధికీ సంసిద్ధంగా ఉంటాడు. కాబట్టి ఎప్పుడయినా ఉన్నత రాజకీయాలలో పోరాటాన్ని చాలించవలసి వచ్చినా, రాయ బారాలలో లొంగిపోవలసి వచ్చినా గాంధీ యెంతమాత్రమూ ప్రతిష్ఠకోసం పాకులాడడు. ఇదే గాంధీజీ నిజమైన బలం. ఈ విధంగా మహోన్నతమైన మతాదర్శాన్ని అద్భుతమైన లౌకిక దృష్టితో సమన్వయం చేయగలిగి ఉండడం, ఋషిగానూ రాజకీయ ధురంధరుడు గానూ కూడా వ్యవహరిస్తూండడం గ్రహించనివాళ్ళకు పరస్పర విరుద్ధభావంగా కనిపిస్తుంది. సత్యాగ్రహం పరిస్థితులను బట్టీ, జరిగే సంఘటనలను బట్టీ శత్రువు వైఖరిని బట్టీ అనువర్తింప చేయతగిన ఉద్యమం. గాంధీ "ఇస్తే అంతా ఇవ్వు. లేకపోతే ఏమీ వద్దనే బాపతు" కాదు. సగమిచ్చినా పుచ్చుకోవడానికి అనేకసార్లు ఒప్పుకొన్నాడు. కాని అంతటితో సరిపెట్టుకోలేదు. తక్కిన సగం కోసం ఆయన పోరాటం పెట్టుకోవడానికి తగిన అవకాశానికీ సమయానికీ ఎదురుచూస్తూంటాడు. ఎప్పుడు దెబ్బ కొట్టాలో ఆయనకే తెలుసు. అందువల్లనే ఆయన రణాంగణంలోనూ రాజకీయ రంగంలోనూ కూడా రాణిస్తున్నాడు. సత్యాగ్రహమనే రైలుకు ఆయన సాధుత్వ, రాజకీయ చాతుర్యములలో యేది "ఇంజనో" యేది "బ్రేకో" తెలుసుకోవడం కష్టం. సాధారణంగా మనం మొదటిది బ్రేకుగాను రెండోది ఇంజన్ గానూ లెక్కవేస్తూంటాం. గాంధీ విషయంలో కేవలం అది వ్యతిరేకం. అందువలననే ఆయన అనుచరులకూ విమర్శకులకూ కూడా

అపోహలు కలుగుతూండడం. అసలు వాళ్లు ఆలోచించే పద్ధతే వేరు. ప్రత్యర్థి చిక్కులలో ఉన్నప్పుడు దెబ్బ కొట్టడానికి మంచి అవకాశమని సాధారణంగా రాజకీయవేత్తలందరూ అనుకొనే విషయం. గాంధీ అది తప్పంటాడు. గాంధీ ఉపవాసాలు చేస్తాడు; రాయబారాలు నడుపుతాడు; ఉపవాసం మాని వేస్తాడు;- గాంధీ జైలుకు వెళ్ళుతాడు; మళ్ళీ బయటకు వస్తాడు; రాజీకోసం ప్రయత్నాలు చేస్తాడు. కొత్తగా సత్యాగ్రహ మతం పుచ్చుకొన్నవాడికిదంతా తమ నాయకుడు లోబడి పోతూన్నట్లు కనిపిస్తుంది. ఇక దూరంగా ఉండి ఎప్పుడూ ప్రతి విషయాలలోనూ తప్పులు వెతుకుతూ ఉండేవాళ్ల మాట సరేసరి. వాళ్ళ విమర్శ దయా దాక్షిణ్యాలు లేకుండా నడుస్తూనే ఉంటుంది. కాబట్టి గాంధీ విమర్శకులు ముఖ్యంగా గమనించ వలసిందేమంటే ప్రతి సత్యాగ్రహీ కూడా గాంధీ వలెనే తన శత్రువులకు స్నేహితుడుగా ఉండవలెనని. ఈ మాట పరస్పర విరుద్ధమైనదిగా కనపడవచ్చు- మన జీవితంలో ఒక సూత్రానికీ ఒక తర్కానికీ నిలవడానికి వీలులేని పరస్పర విరుద్ధ విషయా లనేకం జరుగుతూంటవనేమాట జ్ఞాపక ముంచుకోవడం మంచిది.

అనేక ముఖ్య సందర్భాలలో గాంధీ తన వైఖరిని మార్చు కొన్నమాట నిజమే. గాంధీ ఇర్విన్ రాయబారాలు జరిగేటప్పుడు ప్రస్తుతం నడుస్తూన్న రెండవ యిరోపా సంగ్రామమును గూర్చి కాంగ్రెసు దృక్పథాన్ని వెల్లడించ వలసినప్పుడు- ఈ రెండు ముఖ్య సందర్భాలలోను గాంధీ తన వైఖరిని మార్చుకొంటూ

వచ్చాడు. ఆయనలో కలిగిన ఈ పరివర్తనాలు కొన్ని ఆయనకు పరమ భక్తులుగా నుండే అనుచరులకు కూడా ఆశ్చర్యం కలుగచేసినవి. కాని చక్కగా పరిశీలించి చూస్తే ఆయనను విమర్శించేవాళ్ళు- పరాయివాళ్ళు కానీయండి, సన్నిహితులు కానీయండి, మిత్రులు కానీయండి, విరోధులు కానీయండి- వీరెవ్వరూ కూడా సత్యాగ్రహంలోని సూక్ష్మాంశములను గ్రహించి, సత్యాగ్రహులపైన అది ఎటువంటి నైతిక ధర్మాలను ఆరోపిస్తున్నదో సరిగా తెలుసుకొన్నట్లు కనిపించదు. 1930 లోని గాంధీ ఇర్విన్ ఒడంబడిక సందర్భంలో పోలీసు అత్యాచారాలను గూర్చిన విచారణ జరిగి తీరాలని పట్టుపట్టవద్దని ఇర్విన్ కోరినప్పుడు కాంగ్రెసు వర్కింగు కమిటీ, ప్రజలూ కూడా అందు కయిష్టంగా ఉన్నారు. వైస్రాయి, కాంగ్రెసు తనను అవమానపరచ కోరుతూన్నదా అనేసరికి గాంధీ మెత్తపడ్డాడు.అంతటితో అన్ని చిక్కులూ సందేహలూ తీరిపోయినవి. కాంగ్రెసు కార్యవర్గం పూర్వోత్తర సందర్భాలన్నీ ఆలోచించి గాంధీ నిర్ణయాన్ని అంగీకరించింది. కాని ప్రజలు మనస్సు కుదుర్చుకొని సంతృప్తి పడడానికి చాలాకాలం పట్టింది. ఎందువల్లనంటే పోలీసు అత్యాచారాలు, వైస్రాయి ఎఱుకతోనూ బాధ్యతతోనూ జరిగినవని ప్రజలకు తెలుసు. ఆసంగతి రాజప్రతినిధియే గాంధీ దగ్గర అంగీకరించాడు కూడాను. కనుక వైస్రాయిని చిన్నపుచ్చితే ప్రజలకు లెక్కలేదు.

కాని ప్రధాన సిద్ధాంతాలలోని ముఖ్య సూత్రాలలో గాంధీ యెప్పుడూ ఒకే తీరుగా ఉంటాడు. 1914-1918 యుద్ధాన్ని

గూర్చి ఆయన వైఖరిని పరిశీలించండి! 1906 లో జరిగిన జూలూ తిరుగుబాటులో తాను వలసరాజ్య ప్రభుత్వానికి వ్యతిరేకంగా నడుపుతూన్న సత్యాగ్రహోద్యమాన్ని చాలించి వ్రణచికిత్సా దళాలను (Ambulance Corps) నిర్మించాడు. 1914-18 లో జరిగిన యుద్ధ సందర్భంలో "నా చేతనైతే మా ప్రజలందరిచేతా కాంగ్రెసు తీర్మానములను ఉపసంహరింప చేయించి, యుద్ధానంతరం వరకూ "హోమురూలు" "బాధ్యతాయుత ప్రభుత్వము" అనే మాటల ఉచ్ఛ్వాసం కూడా బయటికి రాకుండా చేయాలని ఉంది నాకు" అన్నాడు. ప్రస్తుత యుద్ధంలో కూడా శత్రువు కష్టంలో ఉండగా మనం శాసనోల్లంఘనం ప్రారంభించడం సత్యాగ్రహ ధర్మాలకు విరుద్ధమని చెప్పి ఆ ప్రకారమే ప్రవర్తించాడు. న్యూయార్కు టైమ్సు పత్రికా విలేఖరి ప్రపంచానికేదైనా సందేశ మీయవలసిందని అడిగినప్పుడు కూడా తాను "ప్రతి బ్రిటిష్ వానికి" అని వ్రాసిన ఉత్తరంలోని విషయమే గాంధీ పునరుద్ఘాటించాడు. ప్రజాపాలిత రాజ్యాలన్నీ ఏకకాలమందు అస్త్ర సన్న్యాసం చేసినట్లయితే :

> "అది హిట్లరు కన్నులను తెరిపించి అతనిచేత కూడా అస్త్ర సన్న్యాసం చేయిస్తుందని ఈ కూర్చున్నపాటున నేను నిశ్చయంగా చెప్పగలను." అన్నాడు గాంధీజీ.

ఆయన మాటలలో అటువంటి పొందికా, మర్యాదా ధైర్యమూ ఉండబట్టేకదా "ప్రతి బ్రిటిష్ వానికి" అని ఆయన

వ్రాసిన ఉత్తరాన్ని వైస్రాయి బ్రిటిష్ ప్రభుత్వానికి పంపి వారి ప్రత్యుత్తరం తెప్పించింది. అయితే వారి ప్రత్యుత్తరం ఆశా భంగకరంగా ఉంటుందని అందరమూ అనుకొన్న విషయమే.

## సత్యాగ్రహ తార్కాణాలు

ఈ నూతన సిద్ధాంతమును గూర్చి అనేకమంది గ్రంథకర్తలు తమ పుస్తకాలలో తార్కాణములను చూపి ఉన్నారు. 1920 లో సహాయ నిరాకరణోద్యమం ప్రారంభింప బడ్డప్పుడే హంగేరీ దేశస్థుడైన ఫ్రాన్సిస్ డీక్, ఆస్ట్రియా దేశపు ఆఘాతముల నెదు ర్కొన్న విధానము చాలా గొప్పగా చెప్పబడుతూండేది. డీకు జాతీయాభ్యుదయ విధానము కూడా ఇంచుమించు గాంధీ విధానంతో సరిపోతూన్నది. ఆయన కార్యక్రమంలో సైతము జాతీయ విద్య, జాతీయ పరిశ్రమలు, ప్రధానస్థాన మాక్రమిస్తూ న్నవి. అందువల్ల హంగేరీపైన ఆస్ట్రియనులు సంపాదింప దలచుకొన్న నైతిక విజయాన్ని ఆయన అరికట్ట కలిగినాడు. ఇండియాలో వలెనే అక్కడ కూడా జైలు కార్యక్రమం ఆచ రణలోకి వచ్చింది. అక్కడ సైతం బహిష్కరణ విధాన మవలం బింప బడ్డది. ఆస్ట్రియన్ శాసనసభలలో స్థానాలు హంగేరి యను లక్కర లేదన్నారు. ఆస్ట్రియా కసిపట్టి హంగేరియను లను సైన్యంలో చేరవలెనని నిర్బంధించింది. హంగేరియనులు దానిని కూడా నిరోధించారు. చివరకు ఆస్ట్రియావారు లొంగిపోక తప్పిందికాదు. 1867 ప్రాంతాలలో హంగేరీకి నూతన రాజ్యాంగ ప్రణాళిక ప్రసాదింపబడ్డది.

మహాత్మా గాంధీకి సంబంధించిన మఱియొక సుప్రసిద్ధ ఉదాహరణాన్ని ఇచట జ్ఞాపకం చేస్తూన్నాము. 1906 లో నేటాలు భారతీయులందఱూ వేలుముద్రలు వేయవలెననీ, పోలీసు ఉద్యోగి కోరినప్పుడు రిజిస్ట్రేషన్ సర్టిఫికేటతనికి చూపవలెననీ చేయబడిన శాసనాన్ని నిరోధించడానికి 13000 మంది భారతీయులు నేటాలు సరిహద్దులను దాటి ట్రాన్సువాలుకు పోయిన సంగతి అందఱకూ తెలిసినదే. తరువాత 1913 లో మనిషి 1 కి మూడు పౌనులు తలపన్ను వేసినప్పుడూ, ట్రాన్సువాలులోకి ఎక్కువ మంది జనాన్ని వలస తీసికొని రావడానికి ప్రయత్నించినప్పుడూ, వాటి నిరోధమునకై మఱొక ఉద్యమం నడపబడ్డది. హార్డింజి ప్రభువు కాలంలో, దక్షిణ ఆఫ్రికా భారతీయుల రిజిస్ట్రేషన్ సందర్భంలోనేమి, పోలుటాక్సు సందర్భంలో నేమి, భారతీయ విద్యార్థికులు దక్షిణ ఆఫ్రికాలోని అన్నిభాగములకూ పోవడానికి అధికారమును సంపాదించడంలో నేమి- దాదాపు ఈ అన్నివిషయాలలో భారతీయులకే అనుకూలంగా పరిష్కారం జరిగిన సంగతి ఇండియాలో తెలిసిన విషయమే. చాంపరాన్‌లోని జనులు, యూరోపియన్ తోట యజమానులకు చెల్లించవలసిన 64 రకాల పన్నులను నిరోధించడానికి నడపబడిన ఉద్యమం తరువాతి తార్కాణం.

ప్రపంచంలోని అన్ని మహోద్యమాల వలెనే గాంధీ సత్యాగ్రహోద్యమం కూడా ముందు చాలా చిన్నగా ప్రారంభమవుతుంది. గాంధీ మొట్టమొదటనే ఉద్యమ పూర్ణ స్వరూపాన్ని ఊహించి యుండినప్పటికీ కూడా, ముందు బుద్ధి

పూర్వకంగా చాలా చిన్నగా ప్రారంభం చేస్తాడు. ఆయన ఇండియాలో తన కృషిని ప్రారంభించింది 1917. అప్పుడు దక్షిణ ఆఫ్రికాకు కొన్ని షరతులతో ఇండియానుండి కూలీలను పోగు చేసే పద్ధతిని రద్దుచేయించాడు. తరువాత వీరంగం దిగుమతి పన్నులను రద్దు చేయించాడు. అయితే ఈ సందర్భంలో ఆయన సత్యాగ్రహం ప్రారంభిస్తానని చెప్పినా ప్రారంభించ కుండానే పని జరిగింది. తరువాతిది చాంపరాన్ విజయం-ఈ విషయం ప్రత్యేకంగా మఱొకచోట ఉదాహరింప బడ్డది. చాంపరాన్ విజయ మాయనకు కొత్త ఉద్యమాలను ప్రారంభించ డానికి ప్రోత్సాహం కలిగించింది. కాని ఆ ఉద్యమాలన్నీ కొన్ని చిన్నచిన్న గ్రామాల అభివృద్ధికి సంబంధించినవి. పాఠశాలలను స్థాపించడం, ప్రజల ఆరోగ్యాభివృద్ధిని ప్రోత్సహించడం, వైద్య సహాయం, గో సంరక్షణ మొదలైన ఉద్యమాలవి. ఖేరా ఉద్యమం మొట్టమొదట ఆయన ఇండియాలో ప్రారంభించిన ప్రజా సమూహోద్యమం. అది పన్నులను ముజరా యిప్పించ డానికి ప్రారంభించ బడ్డది. అందులో ఆయనకు కలిగిన అను భవం వలన ప్రజా ఉద్యమాలంత తేలికగా ప్రారంభించ తగి నవి కావనీ, అటువంటి ఉద్యమాలను ప్రారంభించేముందు ప్రజ లను ముందుగా సత్యాగ్రహ సిద్ధాంతాలను గూర్చి తగిన శిక్షణ యిచ్చి వారెంతవఱకూ గ్రహించారో ఒరిసి చూస్తేనే తప్ప ప్రారంభించ కూడదనీ స్పష్టమయింది. ఈ ఉద్యమం ప్రజలు తగినంత త్యాగం చేయజాలనందున జయప్రదం కాలేదు. కాని వారికి కొన్ని హక్కులు కలవనేమాట మాత్రం వారికి తెలిసి

వచ్చింది. అంతేకాదు రాజకీయ జ్ఞానమును జనసమూహంలో వ్యాపింప చేయడానికి తగిన కార్యప్రణాళికకు కూడా ఈ ఉద్యమం మూలకారణ మయింది. ఖైరా ఉద్యమ ఫలితంగా శక్తివంతులు పన్నులు తక్షణం చెల్లించవలెనని, శక్తిలేనివారు కొంతకాలం ఆగవచ్చునని ఉత్తరువులు చేయబడ్డవి. సత్యాగ్రహము నందలి ఈ ఆరంభ ప్రయత్నాలే 1916 లక్నో కాంగ్రెసులో గాంధీని ఇండియా రాజకీయాలలోకి రావడానికి ప్రేరేపించినవి. 1918 లో అహమ్మదాబాదు మిల్లు కూలీలకు జీతాలు ఎక్కువ చేయించే పెద్దపనికి గాంధీ పూనుకొన్నాడు. అప్పుడు వాళ్ళు ఓర్పుగా, శాంతిగా, స్వశక్తిపైన ఆధారపడి తమతోపాటు సమ్మెకట్టని కూలీలపైన దౌర్జన్యం చేయకుండా బహు మర్యాదగా ప్రవర్తించారు. అందువల్లనే గాంధీ మిల్లు యజమానులతో రాయబారాలు నడిపి సమ్మెదారుల కూలి యెక్కువ చేయించ-గలిగినాడు. ఈ సందర్భంలో ఏ కొద్ది మందో చేసిన దౌర్జన్యానికి ప్రాయశ్చిత్తంగా ఆయన ఉపవాసం చేశాడు. ఈ విషయాన్ని గూర్చి "ఉపవాసాలు" అనే అధ్యాయంలో విపులంగా ఉదాహరింప బడ్డది. తరువాత రౌలట్ చట్టానికి వ్యతిరేకంగా 1919 లోని సత్యాగ్రహం, జలియన్‌వాలాబాగ్ హత్యాకాండ, ఖిలాఫతు దుర్ణయము స్వారాజ్య పోరాటము జరిగినవి..

కార్మిక కర్షకుల శ్రేయస్సు కోసమున్నూ, సాంఘిక సంస్కరణం కోసమున్నూ, ఇటువంటివే అనేక ఉద్యమాలు గాంధీ నాయకత్వంకింద నడిచినవి. గాంధీ యొక్కయు ఆయన అను

చరుల యొక్కయు ప్రయత్న ఫలితంగా కలిగిన విజయపరం పరే, ఇండియాలో అహింసా ఉద్యమ నూతనశక ప్రారంభము నకు కారణము లైనవి. చాంపరాన్, ఖైరా, బోర్సాదు సత్యాగ్రహోద్యమాలను గుఱించి కాంగ్రెసు చరిత్రలో పూర్తిగా వివరింపబడ్డది. తిరువాన్కూరులో ఒక దేవాలయానికి సమీపంలో ఉన్న వీధిలోనుండీ, మఱికొన్ని బ్రాహ్మణ వీధులలోనుండీ "అంటరానివాళ్లు" నడవకూడదనే ఆచారం పరంపరాగతమైన నిషేధపు టుత్తరువు ఎప్పటినుండో వస్తూన్నది. ఆ సందర్భంలో సత్యాగ్రహం ప్రారంభించగా పదహారు మాసములు కడచిన తరువాత, ఆ ఉత్తరువు రద్దయి, అందరూ ఆ త్రోవలను నడవవచ్చునని అంగీకరింప బడినది. ఈ సంస్కరణం చాలా చిన్నదిగా దూరాన ఉన్నవాళ్ళకు కనిపించ వచ్చును. కాని మలబారులో అంటరానితనమును గూర్చిన అప్పటి స్థితీ ఇప్పటిస్థితీ యెఱిగిఉన్న వాళ్ళకు మాత్రం ఈ మార్పుయొక్క ఔదార్యమూ, శ్రేష్ఠత్వమూ అర్థముకాక తీరదు. మఱొక ముఖ్యమైన విషయంకూడా పాఠకులు తెలుసుకోవలసి యున్నది. సిమ్లాదగ్గఱి కొండ జిల్లాలలోని కొండజాతులచేత గవర్నమెంటు ఉద్యోగస్థులు కానీ, యూరోపియనులు గానీ కూలి యివ్వకుండానో, పేరునకేదో కొద్దిగా యిచ్చో వాళ్ళ సామానులూ ఉత్తరాలూ మోయించుకొంటూ ఉండేవాళ్ళు. ఇండియాలోని సంస్థానాలలో ప్రతిచోటా ఉన్న "వెట్టి" పద్ధతిని సిమ్లా కొండల ఉద్యోగస్థులు కూడా అమలు జరుపుతూండిరి. తీవ్రమైన సత్యాగ్రహం కొన్ని నెలలు జరిగిన తరువాత ఆ పద్ధతి రద్దుచేయబడ్డది. సత్యాగ్రహో

లన్నిటిలోకీ ఎక్కువ ప్రసిద్ధమైనది 1928 లో బార్డోలీ చెర్యాడా తాలూకాలలో వల్లభాయి పటేలు నాయకత్వంకింద జరిగిన రైతుల పన్నుల నిరాకరణ సత్యాగ్రహం- అప్పుడా జిల్లాలలో రీసెటిల్‌మెంటు చేసి నూటికి 25 వంతున ప్రభుత్వంవారు భూమి పన్నును హెచ్చించారు. ఈ హెచ్చించడం న్యాయ్యపద్ధతి మీద జరుగలేదని రైతులు సత్యాగ్రహం ప్రారంభించారు. తరువాత ప్రభుత్వం రాజీకి వచ్చి మధ్యవర్తి తీర్పు కంగీకరించింది. సత్యాగ్రహం ఆపివేయబడ్డది. ఆ మధ్యవర్తుల తీర్పు ప్రకారం నూటికి 6¼ వంతున మాత్రమే పన్ను హెచ్చింపబడ్డది. నేటి ఈ బార్డోలీ ఉదంతం భారత భావి సంతానము కోసం సువర్ణాక్షరాలలో చరిత్రయందు లిఖింప బడింది. 1923 లోని నాగపూరు సత్యాగ్రహం భారత దేశాన్నంతటినీ ఆకర్షించింది. అది నాగపూరు సివిల్ లైన్సులోనుండి జాతీయ పతాకాన్ని తీసికొనిపోయే హక్కుకోసం చేయబడింది. గుర్కాబాద్ సత్యాగ్రహం, ఎల్లప్పుడూ కృపాణమును వీడని సిక్కులవంటి మహాయోధులు కూడా ఎంత శారీరకబాధ కలిగినప్పటికీ ఎంతో కాలం దౌర్జన్యానికి దిగక ఏవిధంగా అహింసను తు-చ-తప్పకుండా ఆచరించ గలిగినారో వెల్లడి చేస్తుంది. పిదప 1930 లోని ఉప్పుసత్యాగ్రహం, ఆధునిక చరిత్రలో ఒక ప్రత్యేక ఘట్టం. అందులోని సంఘటనలు పురాణములలోని ఉదంతములవలె భారత స్త్రీ పురుషుల హృదయాలలో మహోదార భావాలను రేకెత్తించగలిగి, వారిని సత్యాహింస లనే గగనవీధులలోకి తీసికొని పోగలుగుతూన్నవి.

## సత్యాగ్రహ మనఃప్రవృత్తి

సాంఘిక, కర్షక, నైతిక సంస్కరణల నిమిత్తం అప్పుడప్పుడూ నడపబడిన వివిధ సత్యాగ్రహోద్యమాలకు వెనుకనున్న మనః ప్రవృత్తినీ, పరిణామ క్రమాన్నీ మనం ఆలోచించాలి. సత్యాగ్రహ ప్రధానోద్దేశం మానవుని సున్నిత భావాలను రేకెత్తించడం. మానవుడు తన తప్పిదాలకు తానే సిగ్గుపడేటట్లు చేసి అతని కొక విధమైన నైతిక చిత్త వికాసాన్ని కలిగించాలి. హాని పొందినవాడు ప్రత్యపకారం చేయక పోవడమేకాక పైపెచ్చు మఱింత ఆనందంగా కనపడితే అపకారం చేసినవాడాశ్చర్య పడతాడు. ఏదైనా ఒక విషయంలో పరిహారం పొందాలంటే దౌర్జన్యం కాక తక్కిన మార్గాలు లేవా అని మొదటిసారి అతనికి ఆలోచన కలుగుతుంది. సాధారణంగా హింసింప బడిన వానికే గాక హింస పెట్టిన వానికి కూడా కొంత వ్యథ కలుగుతుంది. మనం కోపంలో బిడ్డను కానీ మఱొకరిని కానీ కొట్టిన తరువాత మనలో మనకే ఎంతో చిన్నతనం వేస్తూంటుంది. ఎవరి మనస్సు పూర్తిగా మొద్దుపార లేదో ఎవరిలో ఇంకను నైతిక సున్నిత భావాలు నాశనం కాలేదో, వారు కోపం కానీ, ఉద్రేకం గానీ ప్రదర్శించిన వెంటనే కొంత కాలం వరకూ ఏపనీ చేయలేని అలసత్వమూ, నిరుత్సాహమూ పొందుతూంటారు. తప్పు పని మాటి మాటికీ జ్ఞాపకం వస్తూండడం వల్ల విచారం కలుగుతూంటుంది. మనకు సంతోషకరమైన విషయము కూడా పదే పదే తలపునకు వస్తూంటే చిత్త స్థిమితం ఉండదు. పగలు ప్రశాంతంగా ఉండలేము; రాత్రుల్లు

నిద్రపట్టదు; ఇక మన తప్పు పనిని తలుచుకొంటూంటే కలిగే మనోవ్యథ ఎంతగా ఉంటుందో చూడండి. కనుక అపరాధి యైనవాడు, తాను అపరాధం చేసిన వానికి క్షమాపణ చెప్పే వరకూ గాని, లేక కాలక్రమేణా తాను చేసిన తప్పును తాను మఱచిపోయేటంత వరకూ గాని మనస్స్థిమితం కలిగి ఉండడు. ఈ రెండూ కూడా తప్పు చేసినవాడు పొందే సిగ్గును సూచిస్తవి. కాని వాడు మొదటి పద్ధతిని అవలంబించి నందువల్ల నిజమైన చిత్త సంస్కారం పొందడానికి వీలవుతుంది. రెండో పద్ధతి వల్ల క్రమ క్రమంగా అతని మనస్సు మొద్దుబాఱి పోవచ్చును. బాధితుడు ప్రదర్శించే సహజ మందహాస సహన భావాలే కాక, చుట్టూ చేరిన ప్రజలు- వాళ్ళ వైఖరి, వాళ్ళ మందలింపు, వాళ్ల ధిక్కారం- ఇవన్నీ కూడా బాధ పెట్టినవాని కళ్లు తెఱిపించి అహింసయొక్క సర్వతోముఖ వ్యాపకత్వాన్ని చూచేటట్టు చేస్తవి. అహింసా పోరాటంలో బాధ పొందేవానికంటె బాధ పెట్టేవాడే క్రమ క్రమంగా దుర్బలుడై పోతాడని కూడా ప్రతీతి. అతని దౌర్జన్యం అంతకంతకు తగ్గిపోతూన్న కొద్దీ అతనిలోని సున్నిత భావా లంతకంత కెక్కువగా రేకెత్తుతూంటయి. అందువల్ల అతనికి అంతర్దృష్టి వికాసం కలుగుతుంది. మాఱు చెప్పకుండా ప్రతిక్రియ చేయకుండా సహన భావంతోనూ క్షమాబుద్ధితోనూ బాధ పడేవాని నైతికశక్తి యొక్క ఆధిక్యత, బాధపెట్టేవాని మనస్సులో నాటుకోకుండా ఉండడానికి వీలులేదు. హింసాపరు డిటువంటి దృశ్యాన్ని గూర్చి తాను చదివి గాని, భావించి గాని, ఊహించి గాని, విని గాని

ఉండక పోవడం చేత బాధితుణ్ని చూస్తే మఱింత గౌరవం హెచ్చుతుంది. తన చర్యను యుక్తి ప్రయుక్తుల వల్ల గాని, వాద ప్రతివాదములవల్ల గాని, న్యాయ్యాన్యాయ్య విచక్షణవల్ల గాని, సమర్థించు కోవడానికి వీలు లేదని తోచి తన శత్రువు గెలిచి పోతాడేమోననే పిఱికితనం కలిగినప్పుడే యెవడైనా కసితో దౌర్జన్యానికి దిగుతాడు. భయము, పిఱికితనము, కసి, యివన్నీ ఒకదాని చుట్టూ ఒకటి సుళ్ళు తిరుగుతూంటవి. అటు వంటి వాతావరణంలో ఉదారబుద్ధీ న్యాయ్యదృష్టీ వర్ధిల్లవు. కుత్సిత బుద్ధీ, ద్వేష భావమూ ప్రబలుతూంటయి. మనస్సునూ హృదయాన్నీ నిష్కళంకంగా ఉంచుకో కలిగితే సద్భావం కల గడం సహజమే. కాని అలా కాకపోయినా సహజ సత్స్వభా వాలను, సమయంలో నొక్కిపెట్టకుండా ఉంటే ఒకప్పుడు ద్వేష క్రోధాలు కూడా మనిషి నడతలో పరివర్తనం కలిగించ డానికి తోడ్పడతయి. విశాల హృదయమూ, విశ్వ ప్రేమా కలవానికి సహజమైన సంస్కృతియే తన ప్రవర్తనను దిద్దుకోవలెననీ తనను లోబఱుచుకొన్న చెడు ప్రభావముల నుండి తాను తప్పించుకో వలెననీ ప్రయత్నించే వాని విషయంలో కృత్రిమ సంస్కృతి కావచ్చును. కాని ఈ రెండవరకం మనిషి, తన నైతిక శక్తి మీద తనకు విశ్వాసం కలిగినప్పుడు, తనకు కూడా మంచి ఆలోచనా శక్తి కలదనీ, తానూ న్యాయ్యం కోసం నిలబడ గలననీ తోచి నప్పుడు, తన ప్రకృతిలో దాగి ఉన్న శుభలక్షణాలను సద్విని యోగం చేసుకో గలడు. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యము లనే అరిషడ్వర్గాలను జయించవలెనని ప్రతి మనిషికీ

స్వతస్సిద్ధంగా కోరిక ఉంటుంది. వీటిని వాటి ఇష్టం వచ్చినట్లు చెలరేగనిస్తే మనిషి వీటికి బానిస అయిపోతాడు; కాని కొంచెం ప్రయత్నిస్తే వీటిని మనో బుద్ధులచేత పూర్తిగా లోబఱచుకో గలడు. కాబట్టి కోపాన్ని జయించ దలచుకొంటే శాంతం అల వాటు చేసుకోవాలి. అప్పుడు దయా దాక్షిణ్యా క్షమా గుణాలు రేకెత్తడానికి తగిన మనఃప్రవృత్తి కలుగుతుంది. అనేకసార్లు మనకు చెడ్డపని చేయాలని బుద్ధి పుట్టినప్పుడే కూడదని కూడా కోరిక కలుగుతుంది. మంచి చెడ్డలు మన కందరికీ తెలిసినవే. కాని మన కోరికలు మన నిగ్రహాన్ని నిలవ నీయవు. గుణవంతు డుగా, సత్య సంధుడుగా, నీతి పరుడుగా, ధైర్య శాలిగా, ఉదారుడుగా, క్షమా నిరతుడుగా, సేవా సక్తుడుగా, పర శ్రేయోభిలాషిగా, స్వార్థ రహితుడుగా ఉండాలనే ప్రతివానికీ సహజమైన కోరిక ఉండడం ఒక సుగుణం. ఈ సుగుణం పైననే సత్యాగ్రహ సిద్ధాంత మంతా ఆధారపడి ఉంది. ఈ పైన పేర్కొన బడిన గుణాలు వీటికి వ్యతిరేక గుణాలైన, అసత్యము, దౌర్జన్యము, కోపము, ద్వేషముల వలె విజృంభితములు కాకపో వచ్చును. బాధక బాధితుల మధ్య ఒక విధమైన నైతిక మోహ నాస్త్రం సంచరిస్తూంటుంది. సత్యాగ్రహం దాని వాయిని మొక్కవోకుండా చూడాలి. హింసా పరుని ఉద్రేకం కొండ మీదనుంచి దూకే జలప్రపాతం వంటిది. అతని మాటలూ చేతలూ అన్నీ కూడా అతని ఆవేశాన్నీ పరవశత్వాన్నీ ప్రద ర్శిస్తూంటాయి. ఉచితజ్ఞత, ప్రసన్నత, సహనశీలత, క్షమా పరత గల అహింసా యోధుని మనోభావాలు వానలను, వరద

లను, సెలయేళ్ళనూ, జలపాతాలనూ భరిస్తూ అతి విశాలం గానూ బహు గంభీరంగానూ ప్రవహిస్తూన్న వాహినీ గర్భ సలిలమువలె, దురాగ్రహ శాప ప్రహారాలను భరిస్తూ ఉంటవి. ఇట్టి చిత్తశాంతి కలిగి ఉన్నప్పుడే మన జీవిత సమస్యలు పరిష్కరింప బడడానికి వీలు కలుగుతుంది. మానవులు కోపంతో ఉన్నప్పుడు, వారికి ఉచిత జ్ఞత, మర్యాదా, ఆలోచనా లోపించినప్పుడు మన సమస్యలు సరిగా పరిష్కరింప బడవు. కొంచెం ఓర్పు వహిస్తే విషయం సరిగా గ్రాహ్యమై నిజమైన నిర్ణయానికి రా వీలవుతుంది. మనిషిలోని సున్నిత భావాలు ప్రేమ వాతావరణంలో వికసించినట్లు క్రోధ పరిస్థితులలో వికసించవు. అంత కంతకు అందటి యందూ ప్రేమభావం వర్ధిలుతూన్న కొద్దీ, ఆచరణ ఆదర్శాన్ని సమీపిస్తూన్న కొద్దీ, బుద్ధి మనో వైకల్యాన్ని లోబఱచుకో గలిగినకొద్దీ, మనిషి ప్రవర్తన తర్కానికి అతీతంగా ఉంటుంది; పూర్వాపర సందర్భాలను బట్టి గానీ లాభాలను బట్టి గానీ ఉండదు; తర్కానికీ హేతువాదానికీ దూరంగా ఉండే అంతః ప్రవృత్తిని బట్టి నడుస్తుందది. ఆలోచించ కుండా అకస్మాత్తుగా ఒక్కొక్కప్పుడు కొన్ని విషయాలు మన మనస్సుకు స్పష్టంగా తడతయి. దానినే అంతర్వాణి అనీ, అంతః ప్రవృత్తి అనీ అంటారు. తర్కం వల్లను ఆలోచన వల్లనూ కూడా అంత స్పష్టంగా విషయాలు తట్టవు. అందువల్లనే గాంధీ తన అనుచరులకు తన నిర్ణయాలను చెప్పివేస్తాడు. వాటికి తగిన తర్కమూ, హేతువాదమూ కనిపెట్ట తగిన పని ఆయన అనుచరులది. భయమూ, రాగమూ, క్రోధమూ, ద్వేషమూ, స్వార్థమూ, కాపట్యమూ,

లను విడిచిపెట్టిన సత్యాగ్రహి హేతువాదం పైన ఆధార పడడు. అంతఃకరణ ప్రవృత్తి మీద ఆధార పడతాడు; అవసరం కోసం చూడడు; సిద్ధాంతం కోసం నిలబడతాడు; రాజకీయాల కంటె నీతిని ఎక్కువగా పాటిస్తాడు.

## అంతఃకరణ ప్రవృత్తి

అహింసా పోరాటంలోనే కాదు నాయకులు అంతఃకరణ ప్రవృత్తిని బట్టి నడచుకోనేది. హింసా యుద్ధాలలో కూడా దానికి స్థానముంది. ఫీల్డు మార్షల్ రాబర్ట్సు, హేగ్ సేనానికి 1914-18 యుద్ధంలో వ్రాసిన ఉత్తరాన్ని చర్చిల్ ఈ విధంగా ఉదాహరిస్తూన్నాడు. "పడమర దిశను దండయాత్ర సాగించ వలసిందే. ఈ ఉద్దేశాన్ని బల పరచడానికి తగిన మంచి కారణాలు నే నేమి చెప్పలేను. కాని నా అంతఃకరణ మాత్రం అది మంచి పని అని నన్ను ప్రేరేపిస్తూన్నది." దీన్నిబట్టి రాబర్ట్సు తన నిర్ణయానికి తగిన కారణాలు చూపించలేక పోయినాడన్న మాట జ్ఞాపక ముంచుకోండి. కాని అతని సిబ్బందీ అంతా అతని అంతఃకరణ ప్రేరేపించిన నిర్ణయాలకు కారణాలు కల్పించుకొని అనుసరించి తీరాలి. శిల్పి భవన నిర్మాణం ఎలా ఉండాలో ఊహించి నిర్ణయిస్తాడు. ఇంజనీయరు ప్లానులు, అంచనాలు తయారు చేస్తాడు. తాపీమనిషి కడతాడు. అదేవిధంగా, ఫీల్డు మార్షల్ నిర్ణయించిన పనిని కెప్టెన్ అమలు జరుపుతాడు. నిజానికి అంతఃకరణ ప్రవృత్తి సూక్ష్మాతి సూక్ష్మమైన హేతువాదం; ప్రజ్ఞా పరమావధి; కార్యరూపం దాల్చిన ప్రతిభ.

సత్యాగ్రహం ఏ కొందఱి గొప్పవాళ్ల సొమ్మో కాదు. అశిక్షితులైన అనేక మందికి దానిని అవలంబించడాని కధికార ముంది. ఈ సందర్భంలో ధర్మరాజుకు నారదుడు చెప్పిన మాటల నుదాహరించడం ఉచితం. బదరి కాశ్రమంలో తపస్సు చేసుకొంటూన్న దాక్షాయణి బిడ్డయైన నారాయణు నుండి, తా నభ్యసించిన సనాతన ధర్మాన్ని నారదుడు ధర్మరాజు కిలా ఉపదేశించాడు :

> కుల భేదంతో నిమిత్తం లేకుండా ప్రతి వానికీ ఈ ముప్పై సుగుణాలూ ఉండి తీరాలి:- సత్యం, దయా, సోపవాస తపస్సు, శౌచం, క్షమా, యుక్తా యుక్త విచక్షణ, శమము, దమము, అహింస, బ్రహ్మచర్యం, ఔదార్యం, ఉచితధ్యానం, ఆనందం, సౌమ్యత, సదాచారం ప్రజా సేవ, ప్రాకృత వాంఛా విసర్జనం, ప్రయోజనం లేని పనులను చేయ కుండా ఉండడం, వాఙ్మియమనము, పరమాత్మను చింతనం, అఖిల భూతములకూ అన్న పానాదులను పంచిపెట్టడం, ప్రతి జంతువును పర మాత్మ స్వరూపంగా భావించడం, అంతరాత్మకు అనుకూలంగా నడచు కోవడం, శ్రీమన్నారాయణునిగూర్చి స్మరణం, సంకీర్తనం, శ్రవణం, వందనం, అర్చనం, దాసత్వం, సఖ్యం, ఆత్మజ్ఞానం అనే భక్తిమార్గాల నవలంబించడం.

## ధర్మం

సత్యాగ్రహ మొక నూతన ధర్మ శాస్త్రం కానీ నీతి సంగ్రహం కానీ కాదని, ఇప్పటికి బోధపడి ఉంటుంది. కులంతోనూ వృత్తి తోనూ నిమిత్తం లేకుండా ప్రతి మనిషీ అవలంబించ తగిన ధర్మమది. ప్రత్యేక కులాలకు ప్రత్యేక ధర్మాలు నిర్ణయింప

బడ్డవి. కాని నారదుడు చెప్పిన ఈ ధర్మాలు అందరూ అవలంబింప దగినవి. అక్షరాలు రావడం తోనే మనం చిన్నప్పుడు చదువుకొన్న చిన్ని చిన్ని పుస్తకాలలోని పద్యాలు జ్ఞాపకం చేసుకోవడం మంచిది. వాటిలో సత్యాగ్రహ ముఖ్యసూత్రాలిమిడి ఉన్నవి.

దౌర్జన్యం భయ క్రోధముల నుండి ప్రారంభిస్తుంది. అహింస క్షమాగుణం నుండి ఆరంభ మవుతుంది. భయం మానసిక కల్పనం. కోపం వాస్తవికం. క్రోధికి, తన కోపానికి గురికావలసిన మనిషి అవతల మరొకడు ఉండాలి. భయస్థుడు తన భయాన్ని లో లోపలనే మింగుకొని ఊరుకుంటాడు. వాడు తన కన్న బలమైన విషయాన్ని చూచి భయపడుతాడు. కోపం కల వాడు తనకన్న బలహీనుడిపైన తన ఆవేశాన్ని ప్రదర్శిస్తాడు. అనగా నీవొక శత్రువును చూచినప్పుడు నీకు కలిగే భయం కానీ, కోపం కానీ, నీ ప్రత్యర్థి కంటె నీవు బలహీనుడ వనుకొంటూన్నావో లేక బలవంతుడ వనుకొంటూన్నావో అనే విషయంపైన ఆధారపడి ఉంటుంది. "అనుభవమును బట్టీ తర్కమును బట్టీ మనుష్యుల మనః ప్రవృత్తులను మీరు చర్చిస్తూన్నారు బాగానే ఉంది. కాని ఒక పోరాటంలోకి ఎఱిగిఉండి బుద్ధి పూర్వకంగా ఆత్మ సమర్పణం కోసం జనం రావడము మాత్రం అంత తేలికైన పని కాదు సుమా. యుద్ధానికీ దోపిడీకీ బయలుదేరిన సిపాయీల గుంపుకు సాహస కార్యాల మీద ఉత్సాహం ఉంటుంది; ఏదైనా ప్రయోజనమూ లాభమూ కలుగవచ్చు ననే ఆశ ఉంటుంది; అందులో ఉన్న ప్రతి ఒక్కడూ, ఇంతమంది

ఉండగా తనకే దెబ్బ తగలవచ్చిందా అనుకోంటూండవచ్చు. ఈ అనుకోవడం వల్లనే ప్రతి వానికీ రక్షణ ఉన్నట్లుగా ప్రతి వాడూ భావించుకొంటూంటాడు. సత్యాగ్రహం విషయంలో అలా కాదే. తాను కావాలని అపాయాన్ని కొని తెచ్చుకోవడం; తనకు తప్పకుండా పెద్ద బాధ కలుగుతుందని తెలుసుకొని వెళ్ళడం; కాబట్టి సత్యాగ్రహంలోకి వలంటీర్లను చేర్చడం కంటె యుద్ధం లోకి సైన్యాలను చేర్చడం తేలిక" అని వాదించవచ్చును. అయితే సత్యాగ్రహంలో యే లోప మున్నదని మీ రంటూన్నారో సరీగా అదే దానిబలం. తన ముందు అపాయం ఉందని ఎఱిగి ఉండి, రాబోయే కష్టాలను బుద్ధి పూర్వకంగా ఎదుర్కోవడానికి మంచి ధైర్యముండాలి. తాను చేయబోయే పని మంచిదని విశ్వాస మున్నప్పుడే ధైర్యం ఇంకా ఎక్కువవుతుంది. ధైర్యానికి వ్యాపకశక్తి ఉంది. నీ ధైర్యం నీ పక్కను వాళ్లకు కూడా వ్యాపిస్తుంది. సైన్యం లోనో అలాకాదు; అనుకోకుండా యెవరికైనా ఒక సిపాయికి కలిగిన ఆపత్తు, పక్కను వాళ్ళకు భయం కలుగచేసి అందఱి స్థైర్యాన్ని కూడా చెడగొట్టవచ్చును. సత్యాగ్రహ సందర్భంలో బుద్ధి పూర్వకంగా తెలిసి ఉండి చేసే ప్రతిపనీ, ఇతరులలో కూడా త్యాగబుద్ధిని పురికొల్పడాని కుపయోగ పడుతుంది. బొంబాయి అజద్ మైదానంలో 1930-32, 33 లలో సత్యాగ్రహ పటాలాలు ఒకటి తరువాత ఒకటి వ్యూహాలుగా వచ్చిన దృశ్య మిందుకు తార్కాణం. నెత్తురు చూచినంత మాత్రాన వారి పట్టుదల సన్నగిల్ల లేదు.

దెబ్బ తగులుతుందనే భయంవల్ల వారు రంగంనుండి పారి పోలేదు. అజద్ మైదానం లోని ఉద్యమాన్ని నిర్మూలం చేయ డానికి బొంబాయికి కొత్త కమీషనరును నియమించారు గవర్న మెంటువారు. ఆయన బుద్ధిపూర్వకంగా సత్యాగ్రహుల ఒంటి మీదనే కాక నెత్తి మీద కూడా లాఠీతో కొట్టించాడు. ఆ దెబ్బల వల్ల తలలు పగిలి నెత్తురు జడివాన కురిసినట్లు కురిసింది; సత్యా గ్రహుల శరీరాల నుండి, సెలయేళ్ళవలె ప్రవహించింది. ఆ దృశ్యాన్ని చూడడానికి వేలకొలదీ ప్రజలు వచ్చారు. ధైర్య శాలికి నెత్తురు చూచిన కొద్దీ ఇంకా ఎక్కువ ధైర్యం వస్తుంది. పిఱికి వాడికి గుండె జాఱిపోతుంది. ఈ కొత్త ఉద్యోగస్థుడు సత్యాగ్రహాన్ని చంపడానికి ప్రయోగించిన ఉపాయాల వల్ల అది చావక పోగా, పైపెచ్చు ఆ దృశ్యాన్ని చూడడానికి అది వరకు 5,000 మందే వచ్చేవారు. ఇప్పుడు 25000 మంది వస్తూ న్నారు. రంగంలోకి వచ్చి సిపాయీల దౌర్జన్యానికి గుఱియైన ప్రతి సత్యాగ్రహ పటాలమూ తమ తరువాత వచ్చే పటా లంలో తమకంటె కూడా ఎక్కువ ధైర్యోత్సాహాలను ప్రద ర్శించవలెననే కోరికను కలిగించింది. ఈ ప్రకారం 1930 లో సత్యాగ్రహం అడ్డులేని ఆయుధంగా పరిణమించింది.

ఇక సత్యాగ్రహిని ఎదుర్కొంటూన్న సిపాయి యొక్కయు, పోలీసువాని యొక్కయు దృక్పథమునుండి ఈ విషయాన్ని పరి శీలన చేదాం. యుద్ధ రంగానికి వెనుకనే ఇరవై మైళ్ళ దూరానో ఒక్కొక్కప్పుడు నూరుమైళ్ళ దూరానకూడా ఉండి, సిపాయీలను ఫలానా దృక్కోణంలో నుండి మర ఫిరంగులను

కాల్చ వలసిందని సేనానాయకు డాజ్ఞాపిస్తూంటాడు. సిపాయీలకు కూడా తమ శత్రుసైన్యాలు కనిపించవు. దూరదృష్టి యంత్రాలతో యుద్ధ శాస్త్ర నిపుణులు పైనుండి కాని, లేక నేల మీదనుండి కాని ఆ కాల్పు ప్రయోజనకారిగా ఉందో లేదో చూస్తూ ఉంటారు. ఎప్పుడో కర్మం చాలక రెండు వైపుల సైనికులకూ ముష్టాముష్టి యుద్ధం జరిగితే తప్ప, లేకుంటే సైనికులు నిజమైన యుద్ధం చూడనే చూడరు. కాని సత్యాగ్రహులను పోలీసు కాని సిపాయిలుకాని కొట్టేటప్పుడు వారు ప్రత్యక్షంగా అంతా కళ్ళారా చూస్తూ కొట్టవలసి ఉంది. సత్యాగ్రహి అన్ని మంచి చట్టాలనూ నియమాలను శిరసావహిస్తాడు. వారు కొట్టే దెబ్బలకు మారు పలుకకుండా భరిస్తాడు. కొట్టినంత సేపూ యేవిధమైన ఉద్రేకమూ చూపించడు. ఇది చూచి తాను చేసిన పనికి సిపాయికి మనస్సులో సిగ్గు, ఆశ్చర్యం, విచారమూ కలుగతయి. నిరపరాధులు, నిరాయుధులు, నిరుద్రేక పరులూ అయిన వీళ్ళను కొట్టడానికి తానెందుకు ఆజ్ఞాపింప బడ్డాడా అని ఆలోచన కలుగుతుం దతనికి. సరిగా ఇదే కారణంవల్ల, ఘరియా వాలా సిపాయీలు, 1930-32 సత్యాగ్రహోద్యమంలో తుపాకులు కాల్చడానికి నిరాకరించారు. వారికి 14 సంవత్సరాలు ఖైదు విధింప బడ్డది. జైళ్ళలో ఖైదీలపైన లాఠీ ప్రయోగం చేయవలసి వస్తే పెండ్లాం బిడ్డలు కల వార్డరు కాక, అన్నదమ్ములను ఖూనీ చేసినవాళ్ళో, అంతకంటెనూ ఎక్కువ అవినీతి కరమైన నేరాలు చేసినందువల్ల ఎక్కువ కాలం శిక్షకు గురియైన వాళ్ళో కాన్విక్టు వార్డరుగా నియమింప బడినవాళ్ళో ఆ పనికి తయారవుతారు,

వార్డరు కంటె తప్పొప్పుల సంగతి తక్కువ తెలిసినవాళ్ళు కాన్విక్టు వార్డర్లు. అదే విధంగా సిపాయీల కంటె భార్యా బిడ్డలుగల పోలీసు వాళ్ళలో ఎక్కువ మానవత్వం ఉంటుందని విశ్వసింప బడుతూన్నది. మాతృదేశం కోసం పోరాడుతూన్న సత్యాగ్రహులను అకారణంగా కొట్టవలసిందని ఆజ్ఞాపింప బడిన పోలీసులకు తమ మాతృదేశమే సత్యాగ్రహుల మాతృదేశ మనే మాట గ్రహింపుకు వచ్చి, ఉదార బుద్ధితో వారా పని నుండి తొలగి పోతూంటారు. కాబట్టి మామూలు హింసాయుత యుద్ధంలో వలెనే, సత్యాగ్రహ యుద్ధంలో కూడా ప్రత్యర్థి యొక్క ధైర్య స్థైర్య శక్తి సామర్థ్యాలను పటాపంచలు చేసే ఉపాయాలు కలవు. పోలీసు మనిషికి కానీ సిపాయీకి కానీ తాను నిర్వర్తిస్తూన్న పనిలోని ధర్మాన్ని గూర్చి కొంచెం సందేహం తోచిందంటే చాలు, అతను నిర్వీర్యుడై పోయినా డన్న మాటే. ఇక సత్యాగ్రహ స్థితి యెలా ఉంటుందో ఆలోచిద్దాం. తాను దెబ్బలు తిని, మూర్ఛపోయి, తేరుకొని, మళ్ళీ దెబ్బలు తిని, మళ్ళీ పడిపోయి, మళ్ళీ లేచినప్పుడల్లా, తనలో ఎంత ధైర్యం కలదో, తా నెంత సహన శక్తిని ప్రదర్శిస్తూ న్నాడో, తనను చూస్తూన్న జనంలో యెంత ధైర్యం వ్యాపిస్తూందో అతనికి తెలుస్తూంటుంది. అందువల్ల అంతకంతకు తన ఉద్యమం బలమవుతూన్నట్లు, తనకు విజయం సమీపిస్తూ న్నట్లు అభిప్రాయం కలుగుతుంది. సత్యాగ్రహికి స్థైర్యమూ సంతృప్తీ కలిగిన కొద్దీ పోలీసువానికి కంపమూ, నిరాశా కలుగు

తవి. తన పై అధికారులు చెప్పినట్లు తాను, యుక్తా యుక్త విచక్షణ లేకుండా ఈ పని చేయడం న్యాయ్యమా అని అతనికి తోస్తుంది. అదే సత్యాగ్రహ విజయ ప్రారంభ దశ. అప్పుడే సత్యాగ్రహి ఇంకనూ ఎక్కువ నియమబద్ధంగా ఉండాలి.

సామాన్యజనం నియమ బద్ధంగా ఉండరని కొంతమంది నమ్మకం. అది సత్యం కాదు. యుక్తి ప్రయుక్తులు తెలిసిన ఆంగ్ల విద్యాధికుల కంటె, సామాన్య జనులే ఎక్కువ నియమ బద్ధులుగా ఉంటారు. విద్యాధికులు సత్యాగ్రహ కార్య క్రమాన్ని గూర్చి తర్క వితర్కాలు చేస్తారు; పూర్వ చరిత్రతో పోల్చి చూస్తారు; జయం పొందే అవకాశాలను లెక్క వేస్తారు; దెబ్బకు దెబ్బ కొట్టడ మంటే అందఱికీ అర్థమవుతుంది కాని సత్యాగ్రహం ఎవరి కర్థమవుతుం దంటారు; అందఱూ సత్యాహింసలు పాటించ గలరా అని సందేహిస్తారు. అందు వల్ల వారి విశ్వాసం అంతకంతకు జారి పోతూంటుంది. మామూలు మనిషి విషయంలో అలా కాదు. చెప్పగానే నమ్ము తాడు. ఆచరణలో పెడతాడు. విద్యాధికులకు తోచిన తర్క వితర్కా లతనికి తట్టనే తట్టవు. అంతేకాక, అహింసా సంగ్రామం గబగబా ఒక్కసారిగా సాగిపోయేది కాదు. క్రమానుగతంగా నడుస్తూన్న సత్యాగ్రహ నిగ్రహ పరం పరలతో అభివృద్ధి పొందుతూంటుంది. వాటిలోని ప్రతి సమ రమూ రాబోయే పోరాటానికి ప్రోత్సాహ కరంగా ఉంటుంది. సత్యాగ్రహంలో అహింస, ఇంగ్లీషు మందువలె గాక హెూమియో మందువలె పని చేస్తుంది. సత్యాగ్రహం

ఎప్పుడూ రాజీతోనే ముగింప బడుతుంది; ఆ రాజీ చిట్టచివరి రాజీ కాకపోవచ్చు; కాని అది ముందు రాబోయే రాజీకొక మెట్టుగా ఉంటుంది. కాబట్టి సత్యాగ్రహి ఇది చివరి యుద్ధమని కానీ, జయం పొందేదాకా ఈ యుద్ధం మానమని కానీ దౌర్జన్యమూ, రక్తపాతమూ చేయడానికి పూనుకొన్నవాళ్ళనేటంత గట్టిగా అనడు. సత్యాగ్రహ సమర ఫలితాలలో ఒక విధమైన అసంపూర్ణత ఉంటుంది. సమయం చూచి తిరిగీ పోరాటం ప్రారంభించి ఆ కొఱతను పూర్తి చేసుకోవాలి. కాని ఈ విధముగా పునరుద్ధరింప బడిన ప్రతి పోరాటమూ మొదటి దానంత తీవ్రంగా ఉండనక్కర లేకపోవచ్చు. చెట్టు మొదలును మూడుపాళ్ళు కొట్టిన తరువాత, నాలుగోపాలు కొట్టడానికి మొదటి పాలు కొట్టేటప్పు డుపయోగించినంత బలం ఉపయోగించ నక్కరలేదు. తాడుకట్టి ఒక్కలాగు లాగితే పడిపోతుంది; అలాగే చెదుగును కొట్టివేయ డానికి కూడా మొట్ట మొదట చేసినంత కృషి తరువాత చేయనక్కర లేదు.

## సత్యాగ్రహికి గల ప్రయోజనాలు

మామూలు యుద్ధంలో ఉన్న సదుపాయాలన్నీ సత్యాగ్రహంలోనూ ఉన్నాయి. కాని అందులో ఉన్న చిక్కు లిందులో లేవు. ఎందువల్ల నంటారా, పోరాటం ప్రారంభించాలా అక్కరలేదా అనే విషయం మన చేతుల్లో ఉంటుంది. మనం ఎంతవరకు చేయగలిగితే అంతే లాభం- సత్యాగ్రహంలో జయాప జయాలనేవి సంబంధ వాచకాలు. ప్రతి అపజయమూ జయానికి ఒక మెట్టు. ప్రతి విజయమూ అపజయ పరంపరలకు పరమావధి;

అగ్ర మవుటం; మనం చేసుకొన్న ప్రతి రాజీయున్నా పరస్పర ప్రత్యపకార చింతకు తావలంగా ఉండదు. సుహృద్భావ సదు ద్దేశాలను పెంపొందిస్తుంది. కాని హింసా యుద్ధంలో చేసు కొన్న రాజీలు, రాబోవు యుద్ధాలకు అంకురార్పణాలుగా పరిణ మిస్తవి. దౌర్జన్య యుద్ధంలో వలె, మన సత్యాగ్రహ సమ రంలో నీతి భ్రష్టులమూ ధర్మచ్యుతులమూ కాము. పైగా మన ప్రత్యర్థిని కూడా క్రూరత్వమనే బురదలోనుండి, కసి అనే ఊబిలో నుండి పైకి లేవదీయ గలం. ఒకవేళ అతడు ఓడిపోయి నప్పటికీ, అతని ప్రత్యర్థియైన సత్యాగ్రహి, అతనిపైన యేమీ దౌర్జన్యం చేయకుండా పై పెచ్చు అన్ని కష్టాలూ తానే అనుభ వించి నందువల్ల, అతని హృదయం మార్దవమూ పరిశుద్ధమూ అయి శత్రువుపైన యే విధమైన దుశ్చింతకూ అవకాశ మీయడు.

## సత్యాగ్రహానికి అభ్యంతరాలు

సామ్రాజ్య వాదుల దృష్టిలో శాంతి క్రమాలను కాపాడడమంటే, తమకు లోబడి ఉన్న దేశాలనూ వెనుకపడి ఉన్న జాతులనూ దోచుకోవడం. కాబట్టి అటువంటి ప్రభుత్వ చట్టాలను అహిం సాయుతంగా నిరోధించడం శాంతి క్రమాలను తలక్రిందులు చేయడం కాదు. బలం కలవాడిదే న్యాయ్యమనే సిద్ధాంతంపైన ఆధారపడి ఉన్న ప్రస్తుత సంఘం కంటె, ఉత్తమమైన సంఘాన్ని నిర్మించడానికే అహింసా నిరోధకు డాపని చేస్తూ న్నాడు కనుక అది సరియైనదే. కమ్యూనిష్టుల వలె, అహింసా నిరోధకు డెప్పుడూ, దౌర్జన్య యుతమైన కార్యక్రమం ద్వారా

కల్లోలం కలిగించాలని చూడడు. అతను బలవంతుల రాజ్యాన్ని లొంగదీయడమే కాకుండా, తిరిగి దేశంలో శాంతి భద్రతలను స్థాపించడానికి కృషి చేస్తాడు. అంతేకాదు, అతని కొక నిర్మాణ కార్యక్రమం కూడా ఉంది. ఆచరణ యోగ్యమగు అతని కార్యక్రమం పైన పునర్నిర్మాణం చేయబడిన రాజ్యం, ఐకమత్యంతోనూ సోదర భావంతోనూ వర్థిల్లుతుంది. హింస చెడుగు తరువాత చెడుగును కలిగించినట్లే, అహింస మంచి తరువాత మంచిని కలిగిస్తుంది. కొడితే కోపం వస్తుంది, కోపం వస్తే మళ్ళీ కొడతాడు; ఇది హింసాక్రమం. ఉపకారం చేస్తే స్నేహం కలుగుతుంది; స్నేహం కలిగితే ప్రత్యుపకారం చేస్తాడు; ఇది అహింసా క్రమం. దక్షిణ ఆఫ్రికాలో సత్యాగ్రహం రెండవ పర్యాయం జరుగుతూన్నప్పుడు, అక్కడి యూరోపియన్ రైల్వే ఉద్యోగులలో సమ్మె ప్రారంభ మయింది. అప్పుడక్కడి గవర్నమెంటు మంచి చిక్కులలో పడ్డదని గాంధీకి తెలుసు. కాని దాని వల్ల లాభం పొందడానికి బదులుగా ఉదార బుద్ధితో అది ఆగిపోయే టంతవరకూ భారతీయుల పోరాటాన్ని ఆయన నిలిపివేశాడు. అందువల్ల భారతీయులపైన గౌరవం హెచ్చింది.

అహింసను ఆధారం చేసికొని నిర్మించబడిన రాజ్యంలోని ప్రజలు, సేవా తత్పరత్వమూ త్యాగబుద్ధీ గలిగి ఐకమత్యంతో దాని స్థైర్యమునకు సహాయ కారులుగా ఉంటారు. అటువంటి ఫలితమును పొంద దలచుకొంటే అధమం, అహింసా సత్యములను అవలంబించి తీరాలి. అహింసా సత్యాలలో సంపూర్ణ

విశ్వాసం లేనివాడు, తన ప్రయత్నంలో తా ననుభవించబోయే కష్ట నిష్ఠురాలకు తాళ జాలడు. ఒక్కొక్కప్పు డతడు అతి నీచ మైన నేరాలు చేసిన వాళ్ళకంటె కూడా ఎక్కువ అవమానం భరించవలసి వస్తుంది. కాబట్టి అహింసలో అతనికి అత్యంత విశ్వాస ముండాలి. మామూలు మనుష్యులు సత్యాగ్రహ నియమాలను సరిగా ఆచరించ లేరనడం సత్యాగ్రహోద్యమానికి వ్యతిరేకంగా చెప్పదగిన వాదం కాదు. నియమ భంగం జరిగితే యేమి చేయాలో నాయకునకు తెలుసు. 1922 ఫిబ్రవరిలో చౌరీ చౌరా పోలీసు స్టేషను లోపల ఉన్న 21 మంది పోలీసు జవానులూ సబిన్స్పెక్టరుతో సహా తగులబెట్ట బడ్డప్పుడు, అసహాయోద్యమం ఆపివేయ బడలేదా! గాంధీ ఉద్యమాలలో చాలా వరకు అహింస యెంత కచ్చితంగా పాటింప బడ్డదో, ఇండియా గవర్నమెంటు హోము మెంబరు సర్ హ్యారీ హేగ్ వంటి ఉద్యోగులూ, డెయిలీ హెరాల్డు విలేఖకుడు జార్జి స్లోకోంబో వంటి పత్రికా రచయితలూ, నిస్సంశయంగా ప్రకటించే ఉన్నారు. ఒక్కొక్కప్పుడు, అహింస అక్షరాలా అవలంబింప బడిన సందర్భాలు వేయి ఉన్నప్పటికీ వాటిని వదిలిపెట్టి, హింసా సందర్భం ఒక్కటైనా వివరంగా పొల్లు పోకుండా వర్ణింపబడ్డ మాట కూడా గమనించాలి. కారెలు చెప్పినట్లు ప్రజ అంటే "అతి వేగంగా అంటుకొనే అంతులేని అగ్ని". కాబట్టి వాళ్ళకు సంబంధించిన ఉద్యమాలలో దౌర్జన్యం పుట్టకుండా చూడడం మరీ అవసరం. కనుక సత్యాగ్రహం గానీ శాసనోల్లంఘనము గానీ ప్రారంభించవలె నంటే ముందుగా, నియమ బద్ధమైన

మానసిక, నైతిక శిక్షణ ఉండాలి. ప్రభుత్వ శాసనాలు నేరాలను ఆపలేవు. నేరస్తులను శిక్షించగలవు. ప్రజాభిప్రాయమూ, వ్యక్తిగత వివేకమూ అభివృద్ధి పొందినట్లయితే, అవి నేరాలను ఆపడానికి పోలీసుకంటె, ప్రభుత్వ శాసనాలకంటె కూడా యెక్కువపని చేస్తయి. ఈ పద్ధతుల మీద ప్రజలకు శిక్షణ యిస్తే వారికి ఏకీభావం కలగడమే కాక, సేవా పరత్వము, ప్రేమ మొదలైన సుగుణాలు కూడా అలవడతయి.

## గాంధీ - సత్యాగ్రహ యంత్రము

గాంధీ సత్యాగ్రహ యంత్రమును బహు వేగం గానూ తలవని తలంపు గానూ నడుపుతూంటాడు. అంతర్వాణి ప్రబోధమును బట్టియే ఆయన ఆ ఉద్యమాన్ని ప్రారంభిస్తూంటాడు. ఆపి వేయడం కూడా అదే విధంగా చేస్తాడు. 1939 ఏప్రిలు ఒకటో తేదీని ఇండియాలోని రాజకోట, తిరువాన్కూరు, హైదరాబాదు జయపురములలోని- అన్ని సత్యాగ్రహోద్యమాలను నిలిపివేస్తూ ఆయన ఇలా వ్రాశాడు:

> సత్యాగ్రహంలో ఆశాభంగ మనేది కానీ అసంతృప్తి అనేది కానీ లేదు. మన ఆదర్శాన్ని అందుకొనే వరకూ ఏదో విధంగా పోరాటం నడుస్తూనే ఉంటుంది. సత్యాగ్రహి శాసనోల్లంఘనం చేయమన్నా చేస్తాడు; పోరాటానికి సంబంధించిన మరొక పనిని చేయమన్నా చేస్తాడు. శాసనోల్లంఘనం మధ్యలో అతనిని ఆపివేసి, ఇంకో పనిని పంపితే దానికీ సరే నంటాడు. అతనికి అదంతా మంచికోసమే ననే విశ్వాసం మాత్రం ఉండాలి. సత్యాగ్రహం ఆపివేసినప్పుడల్లా తరువాతి పోరాటానికి ప్రజలింకా యెక్కువ సంసిద్ధంగా ఉండడం, దౌర్జన్య భావాలను నిగ్రి

హించుకో గలిగి ఉండడం నా కనుభవంలోని విషయాలే. కాబట్టి నేను ఆపివేయ మనడంవల్ల, సత్యాగ్రహులకు అవిశ్వాసం ప్రబలి, అసలు పారిపోతారేమో ననే భయం నా కెంతమాత్రమూ లేదు. ఒకవేళ అలా జరిగితే నేను విచార పడను. పారిపోయిన వాళ్ళకు సత్యాగ్రహ మంటే యేమిటో తెలియలేదని నా కర్థమవుతుంది. తాము చేస్తూన్న పని యేమో తమకే తెలియని వాళ్ళు ఉద్యమంలో లేకుండా ఉంటే మరీ మంచిది.

తరువాతివారంలో గాంధీ తన మనస్సులోని భావాన్ని ఇలా వెల్లడించాడు. "నేను శాసనోల్లంఘనోద్యమాలను అతి విశ్వాసంతో తొందరపడి ప్రారంభిస్తూన్నాను. కాని దానివలన దేశానికి నష్టం కలుగుతూన్నట్లు కనుపించదు. నేను ఎప్పటికప్పుడు దేశముయొక్క నాడి పరీక్ష చేస్తూ యేదైనా అపాయం కలగబోతూన్నదని కాని, యేదో పొరపాటు చేశానని కానీ తోచినప్పుడు, వెంటనే వెనకడుగు వేయడానికి జంకకపోవడమే అందుకు కారణం."

సత్యాగ్రహం ఉపసంహరింప బడడంతోనే జను లెక్కడివారక్కడ పని లేకుండా ఉండిపోరు. తాము సత్యాగ్రహం చేసే సమయంలో నిర్మాణ కార్యక్రమాన్ని నిర్వహిస్తూన్న మిత్రులతో చేరుకొని, వారు కూడా ఆ పని ప్రారంభిస్తారు. సత్యాగ్రహ కార్యక్రమంలో రెండు శాఖ లున్నవి. నిర్మాణ కార్యక్రమం; నిర్మూలన కార్యక్రమం; పోరాటం జరిగేటప్పుడు నిర్మూలన కార్యక్రమమూ, పోరాటం మానినప్పుడు నిర్మాణ కార్యక్రమమూ ఆచరణలోకి వస్తవి. దీపావళినాడే కాకుండా [illegible]

కేడాదీ టపాకాయలు కాల్చాలనే అశిక్షిత హృదయులు చాలా మంది ఈ ఉద్యమం స్థిరమైనది కాదనీ గాంధీ వస్తూ పోతూ ఉంటాడని అనుకొంటూంటారు. ఆయన వచ్చిన తక్షణం విప్లవోద్యమ ఫలితాలు కలిగేమాట నిజమే. కాని ఆయన వెళ్ళిన తరువాత కలిగే ఫలితాలు అంతకంటె కూడా స్థిరమైనవి. వరద వచ్చి, ఒండుమట్టి పేర్చి, ఉప్పు పట్లలను సారవంతములుగా చేసినట్లు గాంధీ ఉద్యమాలు జనసామాన్యంలో చైతన్య వికాసాన్ని పెంపొందింప చేస్తాయి. గాంధీ కార్యక్రమం ఎప్పుడూ ఒకే తీరుగా విసుగు కలిగించేటట్లు ఉండదు. విద్యుత్కిరణం రాత్రుల యందు విమానాలను నడిపిస్తున్నట్లుగా, ఆయన అంతఃప్రవృత్తి భారత జాతిని నడుపుతూన్నది.

గాంధీ యే శక్తితో వ్యవహరిస్తూన్నాడో, యే శక్తిని ప్రతి వ్యక్తిలోనూ విజృంభింప చేయదలచుకొన్నాడో, ఆ ఆత్మశక్తి అనేక టన్నుల బరువును మోయింప చేస్తూన్న డన్‌లప్ టైరుల చుట్టూ ఉన్న వాతావరణ శక్తివంటిది; పెద్ద పెద్ద విమానాలను గాలిలో యెగిరేట్టు చేయగల శక్తికి సమానమైన శక్తి; మహా వృక్షాలనూ, దివ్య సౌధాలనూ పునాదులతో పెకలించ గలిగిన తుపాను శక్తిని పోలిన శక్తి; సముద్ర తరంగముల వలెను, జలావర్తమునందలి సుడులవలెనూ మహాద్భుత ప్రచండ వేగము గలిగిన శక్తి; ఆ శక్తి ప్రతి మనిషికీ అందుబాటులో ఉన్న శక్తి. కాని అటువంటి శక్తి ఒకటి ఉందని తెలుసుకొని దానిని ఉపయోగించుకో గలిగి ఉండాలి. సైకిలు టైరులో ఉన్న గాలి, బయటిగాలి వలెనే కంటికి కగపడక పోయినా 200 పౌనుల

బరువును గంటకు పండ్రెండు మైళ్ల వేగంతో తీసికొని పోగలిగిన శక్తి గలిగి ఉంటుంది. ఈ శక్తి దాని కెలా వచ్చింది? అశిక్షితుడు దానిని భావించలేడు. ప్రత్యక్షంగా చూపిస్తే కూడా గ్రహించలేడు. కాని స్వయంగా అభ్యసిస్తే దానిని గూర్చిన భావనా శక్తీ గ్రహణ శక్తీ కూడా కలుగుతయి. అదే విధంగా ఆత్మశక్తి అనగా ఏమిటో, దాని గుణా లేమిటో, దానిలో ఏమేమి ఇమిడి ఉన్నవో, ఇవన్నీ పరిశీలించి సుశిక్షితులం కావాలి. సుశిక్షితులమే కాదు అందులో పండితులం కావాలి. సత్యాగ్రహం నిరాడంబర మైనది; కాని శక్తివంత మైనది. అత్యుదాత్త మైనది; కాని ఆచరణయోగ్య మైనది. అత్యున్నత మైనది; కాని విశ్వవ్యాప్త మైనది. అది ఒక రహస్య శక్తి కాదు-రహస్యాలను తెలుసుకోవడాని కుపయోగపడే శక్తి. అది గారడీ కాదు; అద్భుతం. అది అగోచర మైనది కాదు; ఆశ్చర్య మైనది. అది తంత్రం కాదు; మంత్రం. అది కల్పన కాదు; సత్యావిష్కరణం.

# అధ్యాయము ౪

## సత్యాగ్రహం - యుద్ధం

జరిగిన ఇరవై సంవత్సరాల నుండీ గాంధీ జీవితమునూ ఆయన కార్య ప్రవృత్తులనూ పరిశీలిస్తే, తాను పౌరుడుగానూ, సహకారి గానూ ఉన్న రాజ్యం, యుద్ధంలో చిక్కుకొని ఉన్నప్పుడేమి చేయవలెననే విషయాన్ని గూర్చి, ఆయన భావముల లోనూ, అభిప్రాయముల లోనూ క్రమానుగతంగా కలుగుతూన్న పరివర్తనం అర్థమవుతుంది. దక్షిణ ఆఫ్రికా యుద్ధం లోనూ జూలూ తిరుగుబాటు లోనూ ఆయన చేసిన సహాయం అందరికూ తెలిసిందే. ఈ రెండో సందర్భంలో ఆయన అప్పుడు నడుపుతూన్న సత్యాగ్రహం కూడా ఆపివేసి ప్రభుత్వ పక్షమున వ్రణ చికిత్సా పటాలాలను సమకూర్చాడు. క్లిష్ట దశలో ప్రభుత్వాన్ని చీకాకు పఱచకూడదనే ఉద్దేశం తోనే ఇలా చేశాడు. 1914-18 యుద్ధంలో ఆయన ఇంగ్లండులో నున్నప్పుడు, సైన్యంలో ఆయన్ని చేరకుండా చేయడం చాలా కష్టమై పోయింది. ఆంగ్ల ప్రజల సద్భావమునందాయన కప్పుడచంచలమైన విశ్వాస ముండేది. 1914 లో కూడా ఆంగ్లేయులు చిక్కులలో నున్నప్పుడు, వారిని మఱింత చీకాకు పఱచడాని కాయన కిష్టం లేకపోయింది. అందువల్ల ఆయన వేమీ రాజకీయ లాభాల కోసం వత్తిడి కలిగించలేదు. ఇండియాలో ఆంగ్లేయులు చేసిన తప్పు పనులకు కారణం కొందఱు వ్యక్తులే కాని, ఆంగ్ల జాతీయ లక్షణము యొక్క భ్రష్టత్వము కాదని

ఆయన అభిప్రాయం. అందువలన ఆయన రెడ్ క్రాస్ సంస్థకు స్వచ్ఛంద సైనికులుగా 80 మంది మిత్రులను చేర్పించినాడు. షేమ్సుఫర్డు ప్రభువు, 1918 లో ఆయనను సంగ్రామ సభకు పిలచినప్పుడు, యుద్ధానికి సైనికులను చేర్పించడానికి వాగ్దానం చేశాడు. అందుకోసం చాలా ప్రయత్నించాడు. అహింసా తత్వానికి యుద్ధంలో సైన్యాలను చేర్పించడం వ్యతిరేకం కాదా అని, ఆయనను అనేకమంది ప్రశ్నించారు. బ్రిటిష్‌వారి చేత తాను రక్షింప బడుతూన్నంత వరకూ ప్రత్యక్షంగా తాను దార్జన్యంలో పాల్గొంటూన్నట్లే గనుక, తానిప్పుడు బ్రిటిష్ వారితో పూర్తిగా సహకారమైనా చేయాలి, లేదా వారికి పూర్తిగా ఎదురైనా తిరగాలి; తన కిప్పుడు ఎదురు తిరిగే శక్తి సామర్థ్యాలు లేవు గనుక సహకారం చేస్తూన్నానని ఆయన బదులు చెప్పినాడు. ఇది ఆయన అనుచరులకు చాలా కష్టం తోచింది. అప్పుడు ఇంగ్లండు లోనూ, ఇండియా లోనూ కూడా మాట్లాడుతూ, యుద్ధంలో పాల్గొనడమే సరియైన పంథా అన్నాడాయన. ఆయన చేసిన ఈ పని, క్షుద్రమైన జాతీయ లాభం కోసం కానీ మరొకందుకు కానీ కాదు. చెడును మంచి చేత నిర్మూలం చేసినందువలన అహింసకు క్షేమం కలుగుతుం దనే నమ్మకంతో ఆయన అలా ప్రవర్తించాడు. ఇంగ్లండు లోని యుద్ధ వ్యతిరేకులకునూ తనకునూ గల భేదాన్ని ఈ విధంగా వివరించాడు :

**తమకూ నాకూ గల ప్రధాన భేదాన్ని విరోధా యుద్ధ నిరోధకులు గమనించాలి. స్వప్రయోజనాల కోసం పరుల చేత ఉపయోగింప బడు**

తూన్న దేశాలకు వారు చెందరు. నేనో అటువంటి దేశాలలో అగ్రిస్థాన మలంకరిస్తూన్న దేశానికి చెందినవాణ్ని. వారు పిల్లి వంటివారు. నేనో ఎలుక వంటివాణ్ని. ఎలుకకు హింస చేయకూడదనే ఉద్దేశం ఒకటే ఉంటుందా? యుద్ధ నీతిలో అహింసా సిద్ధాంతం యొక్క ఔన్నత్యాన్నీ, ఔదార్యాన్నీ, విలక్షణతనూ, ఉపదేశించ డానికి ముందు తన బలమునంతా వినియోగించి తనను తాను రక్షించు కోవాలె ననే స్వతస్సిద్ధమైన కోరిక ఎలుకకు ఉండదా? "ఎలుక జాతి" కి ప్రతినిధినైన నాకు, దానివలెనే అవిధ్వంసక చర్యల ఔన్నత్యాన్ని ఉపదేశించే నిమిత్తమే విధ్వంసక క్రియ వల్ల స్వసంరక్షణ చేసుకోవలెననే కోరిక ఉండడం అవసరం కాదా?

తరువాత తాను యుద్ధానికి సహాయం చేసి ప్రజాను రంజకత్వాన్ని కూడా కోలుపోవడానికి సంసిద్ధపడ్డాడు. తాను యుద్ధ ప్రయత్నాలకు దూరంగా ఉండడానికి అప్పటికి కాలం పరిణతి పొందిన ట్లాయనకు తోచలేదు. కాని కాలం గడచిన కొద్దీ ఆయన అభిప్రాయాలు మారినయి. సత్యాగ్రహ ప్రచారం కానీ, ఉద్యమం కానీ పది సంవత్సరాలు నడచిన తరువాత 1929 లో, అంతకు పూర్వం తాను సిద్ధాంత రూపంలో ఉపదేశిస్తూన్న విషయం ఆచరణలోకి తేగల ననే విశ్వాసం ఆయనకు కలిగింది.

మామూలు పౌర ధర్మాల విషయంలో నేను నా నిర్ణయాన్ని విశ్వసిస్తాను. పూర్వానికీ ఇప్పటికీ నా స్థితిలో చాలా మార్పు కలిగింది. పరిస్థితులను బట్టి నేను అహింసను ఉపదేశించ వలసి వచ్చింది. నేను నా ఉపదేశాలను శక్తివంచన లేకుండా నా జీవితం లోనే ఆచరణలో పెట్టడానికి కోరుతూన్నాను. యుద్ధాన్ని నిరోధించడానికి తగిన శక్తి ఇప్పుడు నాలో ఉన్నట్టుగా నే ననుకొంటూన్నాను.

1929 లో వ్రాసిన ఈ వాక్యాలను బట్టి ఆయన వైఖరి మామూలుగా యుద్ధానికి వ్యతిరేకంగా ఉన్నట్లు స్పష్టమవుతుంది. తన యుద్ధ వ్యతిరేకతను ప్రకటించడానికి తగిన పెద్ద ఊతమూ, ఆయనకు ప్రజలలో ఉన్నది. ప్రజలా, ఈ కొత్త కొత్త అభిప్రాయాలను గ్రహించి ప్రయోజనమును పొందడానికి సంసిద్ధంగా ఉన్నారు. బ్రిటిష్ వారికి యుద్ధంలో సహాయం చేసే షరతుతో ఇండియాకు కొన్ని ప్రయోజనాలు పొందే నిమిత్తం రాయబారాలు నడపడానికి తాను కాంగ్రెసు నాయకత్వం వహించ జాలనని 1938 లో మ్యూనిచ్ సంధి జరిగినప్పుడు ఆయన ప్రకటించాడు. 1939-40 లో ఆయన యొక్క ఈ వైఖరి పరిపూర్ణత పొందింది. బ్రిటిష్ ప్రభుత్వము భారత స్వాతంత్ర్య ప్రకటన చేసి, భారత శాసనసభ లోని అన్ని పక్షాలకూ సంతృప్తి కరమైనట్టి వివిధ రాష్ట్రీయ ప్రభుత్వాలకూ అంగీకార మైనట్టి జాతీయ ప్రభుత్వాన్ని కేంద్రంలో స్థాపించినట్లయితే, తాము యుద్ధానికి అన్ని విధాలా సహాయం చేస్తామని అఖిల భారత కాంగ్రెసు కమిటీ పూనాలో తీర్మానించినప్పుడు, తనను కాంగ్రెసు నాయకత్వపు బాధ్యత నుండి తప్పించ వలసిందని గాంధీ కోరినాడు. కాని తరువాత 1940 సెప్టెంబరు 15, 16 తేదీలలో జరిగిన అ.భా.కాం.సం. సభలో ఆ తీర్మానాన్ని రద్దు చేయించి శాసనోల్లంఘ నోద్యమాన్ని చాలా చిన్నగా ప్రారంభం చేశాడు. అక్టోబరు 17 వ తేదీని వినోబా భావేను మొదటి సత్యాగ్రహిగా యేర్పాటు చేశాడు.

## అహింస - యుద్ధము

డాక్టరు పియరే సిరిసోల్ (Dr. Pierre Ceresole) "ఇంటర్నేషనల్ సర్వీసు సివిలును" నైతికంగా యుద్ధంతో తులతూగే టట్టున్నూ, యుద్ధాన్ని చల్లార్చడానికి తగిన శక్తి కలిగిన సంస్థగానూ చేయ గలిగినాడు. ఆయన 1914 లో దక్షిణ ఆఫ్రికాలోనూ, 1934 లో బీహారు భూకంపం లోనూ సేవ చేశాడు. గాంధీని గూర్చి 1936 లో ఆయన చెప్పిన సంగతులివి :

మీ ఉపదేశకుడూ మీనాయకుడూ అయిన గాంధీ కేవలం మీవాడే కాడు; మానవలోకాని కంతటికీ చెందినవాడు. మహాత్ముని పనులలోనూ భావాల లోనూ ప్రపంచ కష్టాలు గట్టెక్కడానికి తగిన మంచిమార్గం మాకు కన బడుతూన్నది. ఆయన జీవితంలోని ఒక సంఘటనము నన్నత్యంతమూ ఆక ర్షించింది. దక్షిణ ఆఫ్రికాలో ఆయన భారతీయుల పక్షాన సాత్విక నిరోధము నడుపుతూన్నరోజులలో, అక్కడి తెల్లకూలీలు సమ్మెకట్టినసంగతి మీకు తెలిసేఉంటుంది. ప్రభుత్వానికటువంటి కష్టం రావడం నిజంగా ఆయనకు మంచి అవకాశమే. ఆయన దానిని తేలికగా ఉపయోగించుకో వచ్చును కూడాను. కాని వారికివచ్చినచిక్కువల్ల ఆయన లాభంపొందాలని చూడ లేదు. ఆయన తనపోరాటాన్ని తాత్కాలికంగా చాలించాడు. అది మానవాతీత విషయం; ఇరవైరెండు సంవత్సరాల కిందట్ను, నేను ఇండియాను సేవించడానికి రావలసి వస్తుందని కలలోనైనా అనుకోలేదు. నేను ఇంజనీయరును. భౌతిక శాస్త్రజ్ఞుడను. గణిత శాస్త్ర నిపుణుడను. చదువుతూ, వ్రాస్తూ లెక్కలు వేస్తూ కాలం గడిపినాను. జరిగిన మహా సంగ్రామంలో, మేమంతవరకూ మా మనస్సులలో పోషించు కొంటూన్న మా ఉత్తమాదర్శాలు, కాళ్ళకింద నలిగి పోయినయి.

ఆధ్యాత్మిక నైతిక జీవితం నశించి పోయింది. క్రైస్తవ మత ప్రధాన ధర్మం కనిపించకుండా మాయ మయింది. అదీ అప్పుడు మాకు కలిగిన ఘోరానుభవం.

## గాంధీలో అనుకోని మార్పు

గాంధీ అవలంబించే పద్ధతు లాయన అనుచరులకు సాధారణంగా తెలుస్తూనే ఉంటయి. కాని "అహింసాత్మక రాజ్యంలో యుద్ధాన్ని గూర్చిన ఆయన వైఖరి ఆచరణ యోగ్యంగా లేదని తలంచి' వా రాయనను అనుసరించలేక పోయినారు. అయితే వా రనుకోకపోయి ఉండవచ్చును గాని, ఆయన వైఖరిలో మాత్రం వ్యత్యాస మేమీ లేదు. యుద్ధం ప్రారంభం కాగానే ఆయన బ్రిటిష్ వారికి స్వయంగా నైతిక సహాయం వాగ్దానం చేశాడు; కాని కాంగ్రెసు పక్షాన మాట్లాడ నిరాకరించాడు. తరువాత 1940 జులైలో, హిందూదేశ స్వాతంత్ర్యాన్ని ప్రక టించి జాతీయ ప్రభుత్వాన్ని స్థాపించే పక్షాన, బ్రిటిష్ వారికి యుద్ధంలో సహాయం చేస్తామని ఢిల్లీలో కాంగ్రెసు వర్కింగు కమిటీవారు తీర్మానం చేశాయ. అప్పుడు గాంధీ, నాయకత్వ బాధ్యత నుండి తొలగి పోవడానికి వర్కింగు కమిటీ అనుజ్ఞ పొందినాడు. నిజానికి ఆయన అంతకు ముందే, అహింసాయుత ప్రభుత్వ స్థాపనను గూర్చి వర్కింగు కమిటీ గట్టిగా నిలబడలేక పోయినప్పుడే, తన నాయకత్వాన్ని వదులుకోవడానికి అనుజ్ఞ పొందినాడు.

గాంధీ అహింసాయుత ప్రభుత్వ స్థాపనను గూర్చి చాలా పట్టుదలగా ఉన్నాడు. ఆయన కది నేడు కేవలం సిద్ధాంత

విషయంగా లేదు; ఆచరించ వలసిన అత్యవసర విషయంగా ఉంది; యుద్ధాలపైన ఆధారపడ్డ బ్రిటను తోకకు, ఇండియాను కట్టి తోలడం ఆయన కెంతమాత్రమూ ఇష్టం లేదు. 1877 లో భారత దేశం నిరాయుధంగా చేయబడ్డది. ఇప్పటి కప్పుడే ఒక తరం దాటిపోయింది; విడిచిపెట్టిన ఆయుధాలను తిరిగీ చేపట్టడ మంటే, భారతీయుల మనస్సు తమ యొక్కయూ తమ శత్రువుల యొక్కయూ రక్తములను చిందించే భవిష్యత్తును మాత్రమే భావించ గలుగుతుంది. కాబట్టి ఇండియా హింసా మార్గము ననుసరించాలా? లేక అహింసా మార్గము ననుస రించాలా? గాంధీ దృష్టికి భారత దేశ స్వాతంత్ర్యం చాలా సమీ పంలో కనిపించింది; జాతీయ కేంద్ర ప్రభుత్వం, విశ్వాస పూరితుల ఊహా ప్రపంచం లోని మిధ్యా విషయంగా గాక ప్రత్యక్ష సత్యంగా భావించాడు.

భారత స్వాతంత్ర్యానికి బదులుగా బ్రిటనుకు యుద్ధసహాయం చేయబూనుకోవడమంటే ఏమిటి?హిందూదేశం స్వతంత్ర దేశమైన తరువాత, పూర్వోత్తర సందర్భాలన్నీ ఎఱిగిఉండి, బుద్ధిపూర్వ కంగా కళ్ళు తెలుసుకొని యుద్ధం లోకి దిగడం. బ్రిటను ఇండి యానుండి బలవంతంగాతీసుకొన్న సహాయంగానీ,ఇండియాచేత చేయించిన పనులు గాని, ప్రజలు ఇష్టపడి చేసినవి కావు కాబట్టి ఇండియాకు బాధ్యత లేదని తోసివేయ వచ్చు. కాని స్వతంత్ర భారత జాతి. చేసిన ప్రతి పనికీ, భవిష్యత్తులో ఇండియాకు బాధ్యత ఉండి తీరుతుంది. గాంధీ ఇంతకాలం నుండీ ఆలో చిస్తూన్నది అధికారాన్ని గుఱించి కానే కాదు. ఎవరైనా

ఆయన అధికారాన్ని గూర్చి అశ్రద్ధ చేస్తూన్నాడని తలంచి నట్లయితే, అహింసవల్ల కూడా అధికారం రావచ్చుననీ, కాని అది హింసవల్ల నిలువ జాలదనీ ఆయన విశ్వాస మైనట్లుగా తెలుసుకోవాలి. ఆయన కొంత కాలం వరకు పోలీసు ఉండ డానికి ఒప్పుకొన్నాడు. కాని సైన్యం ఉండడానికి బొత్తిగా ఒప్పుకో లేదు. అయినా ఆ విషయాన్ని కూడా పరిశీలింకా ఆలోచనలో ఉంచడం మంచిదన్నాడు. ప్రజలను అహింసా మార్గంలో శిక్షితులనుగా చేయవలెనని ఆయన నమ్మకం. ఒక్కసారి సైన్యాన్ని ప్రవేశ పెట్టినట్లయితే, సైనిక భాష, సైనిక కళ, సైనిక ప్రతిక్రియల వైపునకే జాతీయ దృక్పథం నడుస్తూంటుంది. ఇది ఇలా ఉండగా సైనికోద్యోగులను తయారు చేయడానికి ఇరవై యేళ్ళు పడుతుంది. అధమం ఆరువేల మంది ఉద్యోగులు కావాలి; వీళ్ళందరూ ఏమి చేయాలి? ఈ ఉద్యోగుల కంటె కూడా, వీరి ఉనికి వలన ప్రజా హృదయంలో కలగ బోయే పరివర్తనాన్ని గురించి ఆయన ఎక్కువ బాధ పడ్డాడు.

గాంధీ ఈ సందర్భంలో అప్పటి పరిస్థితులనూ, సంఘటన లనూ వివరిస్తూ చేసిన వాదం అప్రతిహతం. అది ఆయన అను యాయుల విశ్వాసానికి పరీక్షగా పరిణమించింది. అది అలా ఉండగా కాంగ్రెసు అదివరకు, "న్యాయ్యమును ధర్మ సమ్మత మునూ అయిన మార్గాల స్వరాజ్య సంపాదనం చేస్తా" నన్నదే కాని అంతకన్న ఎక్కువ ఏమీ చెప్పలేదు. కాకపోతే స్వరాజ్యం వచ్చిన తరువాత కూడా కాంగ్రెసు అహింసా సిద్ధాంతాన్ని అంటిపట్టుకొనే ఉంటుందా అని విమర్శకు లడిగే ప్రశ్నలకు,

అహింసతో స్వరాజ్యాన్ని సంపాదించుకో గలిగినప్పుడు దానితోనే రక్షించుకో గలిగీ ఉండాలి. అని సంగ్రహంగా జవాబీయ బడుతూండేది. అంతకు మించి కాంగ్రెసెన్నడూ అహింసా ప్రభుత్వమును గూర్చి ఆలోచించనైనా లేదు. అంతే కాక 1934 అక్టోబరులో, కాంగ్రెసు మొదటి నిబంధనలోని "న్యాయ్యమును ధర్మసమ్మతమునూ అయిన మార్గాలతో" అనే మాటలకు బదులుగా "సత్యమును అహింసాయుతమును" అనే మాటలను చేర్చవలసిందనే సూచన చాలా గట్టిగా ఎదిరించ బడ్డది. గాంధీ కాంగ్రెసు సభ్యుడుగా ఉండక మానివేయడాని కదికూడా కొంత కారణం. ఇది జరిగిన ఆ రేండ్లకు విదేశ దండ యాత్రలనూ, ఆంతరంగిక కల్లోలాలనూ కూడా, ఆయుధాలు లేకుండా ఎదుర్కో గలిగిన, సైనిక రహితమైన అహింసా రాజ్య స్థాపనకు, గాంధీ వార్ధా - ఢిల్లీలలో వర్కింగు కమిటీ యొక్క సహాయం పొందడానికి ప్రయత్నించాడు.

1940 సెప్టెంబరులోని గాంగ్రెసు వాగ్దానం

జరిగిన అన్ని సంఘటనలనూ వరుసగా పరిశీలించుకొంటూ రాగా, 1939 సెప్టెంబరు 14 న కొన్ని షరతులతో బ్రిటనుకు సహాయ పడడానికి ఒప్పుకొంటూ, కాంగ్రెసు వర్కింగు కమిటీ వారు తీర్మానం చేసినట్లు తెలుస్తుంది. ఆ తీర్మానంలో ఉద్దేశింప బడిన సహాయం ఏమిటి? యుద్ధం ప్రారంభం కాగానే గాంధీ, వైస్రాయిని దర్శించినప్పుడు ఏ షరతులూ లేని సహాయాన్ని వాగ్దానం చేయడం, తరువాత అది నైతిక సహాయం కాని

భౌతిక సహాయం కాదు సుమా అని ఆయనే వివరించడం, మనం జ్ఞాపక ముంచుకోవాలి. యుద్ధం ప్రారంభించి పక్షం రోజులైనా కాకమునుపే, 14 సెప్టెంబరు తేదీని కాంగ్రెసు వర్కింగు కమిటీవారు, యుద్ధంపైన తమ చరిత్ర ప్రసిద్ధమైన తీర్మానాన్ని చేసినప్పుడు, గాంధీ యున్నూ వర్కింగు కమిటీ యున్నూ సహకార మనే పదానికి వేరువేరు అర్థాలు చేసుకొని ఉండడానికి చాలా సావకాశ ముంది. ఎందువల్ల ననగా, వర్కింగు కమిటీ తీర్మానం జరిగిన కొంత కాలానికి యేదో ఒక లండను పత్రిక గాంధీని ప్రశ్నించగా, తాను వాగ్దానం చేసిన సహకారం నైతిక సహకారం మాత్రమే నని అప్పుడు వివరించాడాయన.

## కాంగ్రెసు తీర్మానం

1939 సెప్టెంబరు 14 వ తేదీ ప్రకటన బహు స్పష్టంగా ఉంది. అది యిది :

> ఒక సదుద్యమం కోసం సహకారాన్ని బలవంతంగానూ, నిర్బంధంగానూ యెవ్వరూ పొందజాలరు. కాబట్టి బయటివారి అధికారానికి లోబడి వారి ఉత్తరువుల ప్రకారం, భారతీయులు ప్రవర్తించడానికి ఈ కమిటీ అంగీకరింప జాలదు. ఉభయులూ ఉత్తమ మైనదని నమ్మిన ఉద్యమ సందర్భంలో, సమాన ప్రతిపత్తి గల ఇరువురి మధ్య, పరస్పరాంగీకారముతో మాత్రమే సహకారం సంభవ మౌతుంది. ఇటీవల భారతీయులు తమ స్వాతంత్ర్య సంపాదన నిమిత్తమున్నూ, భారత దేశములో స్వతంత్ర ప్రజా రాజ్యమును స్థాపించే నిమిత్తమున్నూ, అనేక అపాయములకు గురియై హృదయ పూర్వకముగా మహా త్యాగములను

చేసి ఉన్నారు; కాబట్టి స్వాతంత్ర్య ప్రజా రాజ్యాల పక్షాన పూర్తిగా వారి సానుభూతి ఉంది. కాని ప్రజా రాజ్య స్వాతంత్ర్యం కోసం జరుగుతున్నదని చెప్పబడే ఈ యుద్ధంలో అటువంటి స్వాతంత్ర్యం భారత దేశానికి నిరాకరింపబడి నప్పుడున్నూ, అంతకు పూర్వ మున్న కొంచెం స్వాతంత్ర్యం కూడా లాగివేయబడి నప్పుడున్నూ, భారతీయులు ఐక్యం కలిగించుకో జాలరు.

తాను కానీ కాంగ్రెసు కానీ ఈ యుద్ధంలో చేస్తామని చెప్పే సహకారం కేవలం నైతిక సహకారమే నని, ఇప్పటి వరకూ గాంధీ అభిప్రాయమనే మాట స్పష్టం. ఈ విషయాం ఫ్రాన్సు పడిపోయిన పిమ్మట, 1940 జూన్ 14 వ తేదీని స్పష్టం చేయబడింది. కాబట్టి వార్ధాలో 17 జూన్ న వర్కింగు కమిటీ సమావేశ మయ్యే నాటికి, వాతావరణం పూర్తిగా మారి పోయింది. అహింసను గూర్చి నిర్ణయించ వలసిన అవసరం అప్పుడు వచ్చింది. ఆ చర్చలోనే అన్ని అభిప్రాయ భేదాలూ బయటికి వచ్చినయి. భారతీయుల కోరికను గూర్చి, వారు బ్రిటనుకు చేయబోయే సహాయమును గూర్చి, ఢిల్లీలో 1940 లో చర్చకు వచ్చినప్పుడీ విషయాం మఱింత ప్రాముఖ్యత వహించింది. భారత దేశ స్వాతంత్ర్యాన్ని బ్రిటను అప్పటికప్పుడు గుర్తించాలనీ, అందుకు బదులుగా హిందూ దేశం బ్రిటనుకు నైతిక సహాయం చేయాలనీ గాంధీ పట్టు పట్టినాడు. భారత స్వాతంత్ర్యం విషయంలో వర్కింగు కమిటీ పూర్తిగా యేకీభవించింది; కాని బ్రిటనుకు చేయబోయే సహాయం విషయంలో మాత్రం భేదించింది. ఈ భేదం కేవలం సిద్ధాంతానికి సంబం

ధించింది; అంతేకాని బ్రిటను యెడల ఇండియా చూపవలసిన వైఖరినిగూర్చి గానీ, గాంధీ వర్కింగు కమిటీల వ్యక్తిగత సంబంధమైనది కానీ కాదు. ఫాసిస్టు సామ్రాజ్య తత్వాలను నిరసించడంలో అందఱూ ఒకే అభిప్రాయంతో ఉన్నారు. బ్రిటను హిందూదేశ స్వాతంత్ర్యాన్ని ప్రకటించి, తన సామ్రాజ్య తత్వాన్ని వదులు కొన్నట్లయితే, నిష్కళంకంగా స్వతంత్ర భారత దేశపు స్నేహ సహకారాలను పొందేటందుకు రాయబారాలు నడప గలిగిన స్థితిలో ఉంటుంది. గాంధీ "న్యూస్ క్రానికల్" కు 4-12-39 న పంపిన కేబిలులో ఈ భావమే వ్యక్తం చేయ బడింది.

> నాకు గల అనేక వ్యక్తిగత సంబంధాల వల్ల బ్రిటను విజయం పొందాలని ఆతుర పడుతూన్నాను. కాని ఆ విజయం ఆయుధ బలాధిక్యత వలన కాక నిరంతర ధర్మబుద్ధి వల్లనే కలగాలి.

దీనిని బట్టి, స్వతంత్ర భారత దేశం బ్రిటను ఎడల స్నేహ భావం కలిగి ఉండాలనే విషయంలో, గాంధీ ఆయన సహచరులూ కూడా అంగీక రించారు. కాని యేవిధంగా ఆ దేశాన్ని సన్నాహ పఱచాలి అనే విషయంలోనే భేదాభి ప్రాయాలు కలిగినై. స్వతంత్ర భారతదేశం అహింసా యుతంగా ఉండాలని అంగీకరించేవారు కూడా, దానిని గూర్చి కాంగ్రెసు నిర్ణయం లేనందున శంకిస్తూన్నారు. కాని గాంధీ వలెనే అందఱూ కూడా వెంటనే ఈ సమస్య పరిష్కరింప బడవలెననే ఒప్పుకొంటూన్నారు.

## 1940 ఆగష్టులో అమెరీ ఆడిన నాటకం

కామన్సు సభలో 1940 ఆగష్టు 14 న అమెరీ ఆడిన మాటలు, 12 వ తేదీన బ్లాకు పూలులో తాను చేసిన వాగ్దానానికి ప్రత్యక్షు విరుద్ధంగా ఉండడమే కాక, వైస్రాయి ఆగష్టు 7 న సిమ్లాలో చెప్పిన మాటలకు ప్రతిధ్వనులుగా కూడా ఉన్నాయి. అమెరీకి భారతీయ ఆర్థిక సాంఘిక నిర్మాణాన్ని గూర్చి గానీ భారతీయ రాజకీయ ప్రజా జీవితములను గూర్చి గానీ నిజపరిస్థితు లేమీ తెలియనే తెలియవు. జడ్జీ కేసంతా సమకూర్చి చెప్పిన తరువాత ముద్దాయి శిక్షార్హుడే నని చెప్పే జూరరు వంటివాడు అమెరీ. ఈ కేసులో ఇండియా చాలా తప్పిదాలు చేసిందనీ, కాబట్టి ఆ దేశానికి స్వరాజ్యార్హత లేదనీ అమెరీ తీరుపిచ్చాడు. అయితే ఆయన దృష్టిలో కాంగ్రెసు ఒక్కటే నేరం చేసినట్లు కాదు. ఇంకా చాలామంది తోడి నేరస్తులున్నారు. వారిలో కొందరు నేరాన్ని ప్రోత్సహించిన వారు, కొందరు తరువాత తోడుపడ్డవారు. పాకిస్థానాన్ని కోరుతూన్న ముస్లిం లీగు అసంతృప్తిగా ఉంది. వైస్రాయి వలన 1940 ఆగష్టు 7 న రాజకీయ సంస్థగా గుర్తింపబడి, ముస్లిం లీగుతో సమాన ప్రతిపత్తి గలిగి వ్యవహరింప దలచుకొన్న హిందూ మహాసభ, పాకిస్థానానికి వ్యతిరేకంగా ప్రకటన కోరుతూన్నది. వైస్రాయి గాని, భారత రాజ్యాంగ కార్యదర్శి గానీ చెప్పిన మాటలు చెప్పినట్లుగా మనం నమ్ముదాం. వారిని గూర్చి మన మేమీ ఊహాపోహ పడవద్దు. మనిషి యొక్క నిజాయితీ, మాటలలో కంటె చేతలలో తెలుస్తుంది. కాబట్టి ప్రస్తుతం వాదం కోసం,

సంపూర్ణ స్వాతంత్ర్యానికీ అధినివేశ ప్రతిపత్తికీ గల సూక్ష్మ భేదాన్ని వదలివేదాం. ఈ రెంటింటిలో ఏ ఒకటి గానీ ఆచరణ లోకి వచ్చే తేదీనిగూర్చి కూడా మనం వివాద పడవద్దు. కాని ఇప్పుడీ అంతటిలోనూ మనకు తేలిన ముఖ్యాంశ మేమంటే జాతీయ ప్రభుత్వ నిర్మాణం దాని లక్షణం, దాని కార్యకలాపం, దాని అధికారం, దాని స్వాతంత్ర్యం. బ్రిటిష్ మంత్రులు కానీ వైస్రాయి కానీ చేసిన వాగ్దానం నిజమైనదని ఋజువు కావాలంటే, ముందుగా సివిలియనులు ప్రభుత్వంలో నుండి తొలగి పోవాలి. యుద్ధం ముగిసిన వెంటనే ఇండియాకు అధినివేశ ప్రతిపత్తిని యిస్తామని చెప్పిన వారిమాట నమ్మదగినదే ఐతే, కేంద్ర ప్రభుత్వం లోని ముగ్గురు సివిలియనులనూ తొలగించక, ఇండియనులను వారు నమ్మజాలక పోవడం జరుగనే జరుగదు. అటువంటి సందర్భంలో వారి సూచనను మితవాద వర్గం కూడా విశ్వసించ జాలదు. దేశంలో సివిలియను ప్రభుత్వాన్ని రద్దు చేయించ వలసిందని దేశమంతా ఏకగ్రీవంగా కోరుతూన్నది. రాష్ట్రాలలో అలా జరిగింది. కేంద్రంలో కూడా జరగాలి. దేశం యొక్క రాజ్యాంగ విధానంలో జరుగ వలసిన మార్పుల విషయం అలా ఉండగా, ఇండియాకూ బ్రిటనుకూ ఈ ముగ్గురు సివిలియనులు మాక్స్వెల్, క్లో, బాజ్‌పాయ్ గార్ల ఉనికిని గూర్చి కూడా తగాదా ఉన్నది. ఈ చివరవారు భారతీయు డైనంత మాత్రాన ఇండియాకు ఒరిగిందేమీ లేదు. ఇప్పుడు వివాదం, ఇండియనులు ఉండాలా యూరోపియనులు ఉండాలా అని కాదు సివిలియనులు ఉండాలా సివిలియనులు కానివా రుండాలా అని.

కాంగ్రెసు యాజమాన్యం క్రింద క్రమాభివృద్ధి పొందు తూన్న ఉద్యమానికి వెనుక గల పరిస్థితులను చూపించడానికే, ఈ విషయా లన్నీ వరుసగా మీకు చెప్పవలసి వచ్చింది. యువ కులు చేసే ఆక్షేపణలను విమర్శనలను, ప్రభుత్వం చూపే నిరా దరణను నిర్లక్ష్యాన్ని, కాంగ్రెసు చాలాకాలం తొట్రుపాటు లేకుండా భరించవలసి వచ్చింది. కాని దాని సహనం మితిమీతి పోయింది. గాంధీ శాస్త్ర ప్రకారం కాంగ్రెసులో లేకపోయినా, దానితో ఆయనకు సన్నిహిత సంబంధం లేకుండా పోలేదు. యుద్ధ సహాయం కోసం నిర్బంధంగా జరుగుతూన్న డబ్బు వసూళ్ళను గూర్చి ఆయనకు వచ్చే ఉత్తరాలు లెక్కలేకుండా పెరిగిపోతున్నాయి. గాంధీ కాంగ్రెసు కార్యవిధానంతో సన్ని- హిత సంబంధం లేకుండా ఉన్నాడని మెవరైనా అనుకొంటూ ఉంటే అది కేవలం పొరపాటు. గాంధీ యే విషయాన్నీ అశ్రద్ధ చేయడు. ఆయన కాంగ్రెసులో ఉండక పోవచ్చు. కాని ఆయన కాంగ్రెసు సొత్తు. కాంగ్రెసు లోని అన్ని ఆంతరంగిక వ్యవహా రాలలోనూ ఆయన సంబంధం కలిగించుకొని, వాటి నిర్వహణ మునకు మార్గ దర్శకుడుగా ఉంటాడు. తాను స్వయంగా ఆచ రించ డానికి సిద్ధపడని యే కార్య విధానాన్నీ కూడా ఆయన ఎన్నడూ కాంగ్రెసుకు సూచించలేదు. కాబట్టి మొత్తం మీద కాంగ్రెసు నడప దలచుకొన్న యే పోరాటంలో నైనా సరే ఆయన ఉండి నాయకత్వంవహించి తీరుతాడని నమ్మవచ్చును.

ఇండియాలో వలెనే యూరోపులో కూడా అతి వేగంగా అనేక సంఘటనలు జరుగుతూన్నవి- యూరపులో రక్తపాత

యుతమై వివిధ పరివర్తనములతో కూడిన మహా సంగ్రామం జరుగుతూన్నది. ఏ జాతి అదృష్టం ఏ క్షణంలో ఎలా ఉంటుందో చెప్పడానికి వీలు లేకుండా ఉంది. ఇండియాలో తెల్లవారితే యేమి రానున్నదో తెలియడం లేదు. ప్రతి మనిషి నోటా సత్యాగ్రహ మనే మాట వినబడుతూన్నది. ఉత్సాహ వంతులైన మిత్రులు కాంగ్రెసును తొందర చేస్తూ ఉండగా, ప్రభుత్వాచర్యలంత కంతకు ఆశ్చర్య కరంగా ఉంటూన్నాయి. కాంగ్రెసు వాగ్దానం చేసిన సహకారాన్ని వారు నిరాకరించారు. పూనా తీర్మానం దాదాపు చిత్తుకాగితం కింద పరిణమించింది. ఇటు వంటి స్థితిలో బొంబాయిలో అ. భా. కాం. సం. సమావేశం జరిగింది. తాము తిరగటిలోని బియ్యపు గింజవలెను, అడకత్తెరలోని వక్కవలెను నలిగి పోతూన్నామని అ. భా. కాం. సం. సభ్యు లభిప్రాయ పడ్డారు. ఇటువంటి సందిగ్ధ సమయంలో గాంధీ తిరిగి కాంగ్రెసు నాయకత్వం వహించడ మొక్కటే కాంగ్రెసు కనుకూల విషయం. పూనా పతకం ఫలవంతం కాలేదు. కాంగ్రెసులో "ఆలోచనాపరులు అవ్యగ్ర మనస్కులు" అయిన వారు తమ సహకార విధానాన్ని గూర్చి వత్తిడి చేయడం మానుకొన్నారు. కాని గాంధీ వలననే కొంత చిక్కు తటస్థించింది. రాజ ప్రతినిధీ హిందూ దేశ రాజ్యాంగ కార్యదర్శి మాట్లాడిన మాటల వల్ల ఆయనకు కోపమూ విచారమూ కలిగి నప్పటికీ, ఆయన ఈ పరిస్థితులలో విశాల సత్యాగ్రహోద్యమాన్ని సాగించ దలచుకోక పోవచ్చును. అందుకు మొదటి కారణ మది ఆయన సహజ స్వభావానికి వ్యతిరేకం. ఆయన

మెన్నడూ మొట్ట మొదటగా సత్యాగ్రహం కావాలని కోర లేదు. ఎప్పుడయినా సరే అది తప్పనిసరి అయినప్పుడు మాత్రమే దానిని ఆరంభించాడు. అయితే యిప్పటి సత్యాగ్రహం తన ఒక్కని వఱకేనని పరిమితి మేర్పాటు చేస్తాడా? లేక అది ప్రజా సామాన్య మంతకూ సంబంధించి ఉంటుందా? మూక సత్యాగ్రహానికి వ్యతిరేకంగా ఆయన అనేక పర్యాయాలు, ప్రత్యక్ష పరోక్ష కారణాలను చూపించాడు. కాబట్టి పూర్వ ప్రస్తుత కాంగ్రెసు కార్య నిర్వాహక సభ్యులు, అఖిల భారత కాంగ్రెసు సభ్యులు, రాష్ట్రీయ కాంగ్రెసు సభ్యులు అందఱు శాసనసభా సభ్యులు మాత్రమే సత్యాగ్రహం చేయ దగిన వారని పరిమితి మేర్పాటు చేయడం మఱొక పద్ధతి. ఈ సంఖ్య గాంధీ మనస్సులోని నైతికోద్దేశాన్ని వ్యక్తం చేయ డానికి తగినంత పెద్దది. హిందూదేశం బ్రిటిష్ యుద్ధ ప్రయత్నాల కనుకూలంగా ఉన్నదా? లోపల అనుమానం తోచినా బయటికి మాత్రం అనుకూలంగా ఉందనే బ్రిటిష్‌వా రంటారు. 1940 సెప్టెంబరు 15 వ తేదీని దీనిని గూర్చి ఇండియా ప్రత్యుత్తర మిచ్చింది. సెప్టెంబరు నెల దగ్గరకు వస్తూన్న కొద్దీ లక్నో అలహాబాదుల లోనూ, నాగపురం గౌహాతీల లోనూ కూడా, గాంధీ రాజప్రతినిధుల చివరి సంభాషణల వల్ల చిక్కు వీడిపో వచ్చుననే నమ్మకం- (అది కేవలం మన కోరికవలన కలిగినదే కావచ్చు) వెల్లడింపబడుతూ వచ్చింది. కాంగ్రెసుకు కష్టదశ వచ్చినప్పుడల్లా గాంధీ నాయకత్వం లభిస్తూ ఉండడం ఆ సంస్థ అదృష్టమని చెప్పాలి.

చిట్టచివరకు మేము భయపడుతూన్నట్లుగానే అనుకొన్నంతా జరిగింది. హిందూదేశము యొక్క అంగీకారం గాని ఎఱుక గానీ లేకుండానే దేశాన్ని యుద్ధంలోకి దింపడమే బ్రిటిష్ వారికీ ఇండియాకూ కలిగిన వివాదానికి మూలం. అసలు యుద్ధమంటేనే అసహ్యించుకొని అహింస విషయం అలా ఉండగా, పైన ఉదాహరించబడిన విషయం కూడా బొంబాయిలో జరిగిన అ. భా. కాం. సం. తీర్మానం లోనూ, గాంధీ రాజప్రతినిధిని కోరిన కోరిక లోనూ స్పష్టం చేయ బడింది. ఇండియా అబుద్ధి పూర్వకంగా యుద్ధంలో చిక్కుకోవడమును గూర్చి గాంధీ అనేక విధాల వివరించాడు. ఇండియాను ప్రజలు అంగీకారం గానీ ఎఱుక గానీ లేకుండానే యుద్ధంలోకి దింపినందు వల్లనూ, హిందూదేశం చేసే మనుష్య సహాయం కానీ ఆర్థిక సహాయం గానీ స్వచ్ఛందంగానే చేస్తూన్నదని బ్రిటను ఋజువు చేయ లేనందువల్లనూ, గాంధీ వాదం అప్రతిహతమని చెప్పాలి. నిర్బంధం లేకుండా చేసే సహాయాన్నే స్వచ్ఛంద సహాయమనాలి. యుద్ధ సహాయం చేయాలా అక్కరలేదా అనే స్వాతంత్ర్యం భారతదేశ ప్రజల కుండాలి. అదే గాంధీ కావాలని కోరిన హక్కు. ఆ హక్కే రాజప్రతినిధిచేత నిరాకరింపబడ్డది.

అఖిల భారత కాంగ్రెసు సంఘం బొంబాయిలో 1940 సెప్టెంబరు నెలలో అంగీకరించిన తీర్మానమిది:

**1940 జులై 27 వ తేదీని పూనాలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు సంఘ సమావేశానంతరం తటస్థించిన సంఘటనలను గూర్చీ, కడచిన**

ఆగష్టు నెలలో కాంగ్రెసు కార్యనిర్వాహకులు చేసిన తీర్మానాలను గూర్చి ఈ అ. భా. కాం. సం. జాగ్రత్తగా ఆలోచించింది. ఈ తీర్మానాలను ఈ కమిటీ పరిశీలించి ఆమోదిస్తూన్నది. బ్రిటిష్ ప్రజల సహకారంతో భారతదేశంలోని ప్రతిష్టంభనాన్ని అంతం కావించి, జాతీయ క్షేమాన్ని పెంపొందించే నిమిత్తం, గాంధీ మహాత్ముని సహకారాన్ని కూడా పోగొట్టుకొని జులై 7 వ తేదీని ఢిల్లీలో బ్రిటిష్ ప్రభుత్వానికి కాంగ్రెసు వర్కింగు కమిటీ చేసిన తీర్మానంలోని సూచన, తరువాత పూనాలో అ. భా. కాం. సం. చేత కూడా ఆమోదించ బడ్డది. కాని ఈ సూచన బ్రిటిష్ ప్రభుత్వం చేత నిరాకరింప బడిన విధానమును బట్టి, వారికి భారతదేశ స్వాతంత్ర్యమును గుర్తించే ఉద్దేశం యెంతమాత్రమూ లేదనీ, వారికి చేతనైతే ఈ దేశాన్ని బ్రిటిషు వారి స్వప్రయోజనం నిమిత్తం, శాశ్వతంగా దాస్య బంధనాలలోనే ఉంచ కోరుతున్నారనీ స్పష్టమౌతూన్నది. బ్రిటిష్ ప్రభుత్వంవారి ఈ నిర్ణయం, వారి అభిప్రాయాన్ని హిందూదేశం పైన బలవంతంగా రుద్దదలచు కొన్నట్లు ఋజువు చేస్తూన్నది. ఇంతేకాక ఇటీవల వారవలంబిస్తూన్న పద్ధతివల్ల, భారతదేశ ప్రజలలోని అత్యధిక సంఖ్యాకుల ఇష్టానికి విరుద్ధంగా, ఇండియాను జర్మనీకి వ్యతిరేకంగా యుద్ధంలోకి దింపి, ఈ దేశంయొక్క ప్రజలనూ ద్రవ్యములనూ అందుకు వినియోగిస్తూన్నందుకు నిరసించే ప్రజాభిప్రాయ ప్రకటనమును కూడా వారు సహించ జాలనట్లు విశదమౌతూన్నది. భారత దేశపు సహజాధికారమైన ప్రజాభిప్రాయ ప్రకటనమును నిరాకరించి, భారత ప్రజల నీచస్థితికీ వారి నిరంతర దాస్యమునకూ కారణ భూతమైన బ్రిటిష్ రాజనీతికి ఈ అ. భా. కాం. సం. తల ఒగ్గజాలదు. ఇటువంటి రాజనీతిని అవలంబించడం వల్ల బ్రిటిషు ప్రభుత్వం వారు ఇండియాలో సహించరాని పరిస్థితులను కల్పించి, ప్రజల ప్రాథమిక హక్కులనూ గౌర

వాన్ని రక్షించుకొనే నిమిత్తం, కాంగ్రెసుకు పోరాటాన్ని తప్పనిసరి చేస్తూన్నారు. భారత స్వాతంత్ర్య సంపాదనార్థం కాంగ్రెసు గాంధీజీ నాయకత్వం కింద అహింసా తత్వాన్ని ఆధారంగా చేసుకొన్నది. కాబట్టి జాతీయ స్వాతంత్ర్యోద్యమ సందర్భంలో తటస్థించిన ఈ విషమ స్థితియందు, కాంగ్రెసు అవలంబించ వలసిన చర్యను నిర్ధారణ చేయ డానికి, ఈ అ. భా. కాం. సం. ఆయననే కోరుతూన్నది. ఇలా చేయ డాని కాయనను అర్హుడుగా నన్నట్టి, పూనా అ. భా. కాం. సం. లో ఆమోదింప బడినట్టి ఢిల్లీ తీర్మానం ఇక ముందు వర్తించదు. దానికి కాలదోషం పట్టింది.

అఖిల భారత కాంగ్రెసు సంఘం, బ్రిటిష్ ప్రజ యందును, యుద్ధంలో చిక్కుకొన్న తదితర దేశాల ప్రజలయందునూ కూడా సానుభూతి గలిగి యున్నది. అత్యంతమైన అపాయ పరిస్థితులలో బ్రిటిష్ జాతి ప్రదర్శించిన ధైర్య స్థైర్యాలను కాంగ్రెసు శ్లాఘించకుండా ఉండజాలదు. వారిని గూర్చి కాంగ్రెసు కేమీ దుశ్చింత లేదు. వారిని చికాకు పరచే పనిని దేనిని గానీ కాంగ్రెసు చేయడానికి సత్యాగ్రహ సిద్ధాంతం ఒప్పుకోదు. కాని తనంతట తాను బుద్ధిపూర్వకంగా అవలంబించిన ఈ నిగ్రహం వల్ల కాంగ్రెసు ఉనికికే వినాశనం కలుగకూడదు. అహింసను ఆధారంగా చేసికొనిన తన కార్యక్రమాన్ని అవలంబించే విషయంలో, కాంగ్రెసుకు పూర్ణ స్వాతంత్ర్యం ఉండి తీరాలి. కాని అహింసాయుత నిరోధం తప్పనిసరి యైనయెడల ప్రజల స్వాతంత్ర్య రక్షణకు అవసరమైన దానికంటె యెక్కువగా, దానిని విస్తరింప చేయ వలెనని కాంగ్రెసు ప్రస్తుతం కోరడం లేదు.

కాంగ్రెసుయొక్క అహింసాపద్ధతినిగూర్చి కొన్ని అపోహలు పుట్టినందు వలన, అ.భా.కాం.సం. తిరిగీ ఆ విషయాన్ని కొత్తగా స్పష్టీకరించవలసి వచ్చింది; ఇదివరకు ఈ అపోహలు కలగడానికి హేతు భూతమ్మైన పూర్వపు తీర్మానములలో యేమి ఉన్నప్పటికీ, కాంగ్రెసు అహింసా

పద్ధతినే కొనసాగిస్తున్నదని తెలుసుకోవలెనని కోరుతూన్నది. స్వరాజ్య పోరాటంలోనే కాకుండా స్వతంత్ర భారతదేశంలో కూడా, ఆచరణ యోగ్యంగా ఉన్నంతవరకు, అహింసా పద్ధతినే అవలంబించవలెనని ఈ కమిటీ గట్టిగా విశ్వసిస్తూన్నది. ప్రస్తుత ప్రపంచం నశించి అనాగరిక స్థితికి పోకుండా ఉండవలెనంటే, అన్ని దేశాలూ, పూర్తిగా అస్త్ర సన్న్యాసం చేసి, ఇంతకంటె ఎక్కువ న్యాయ్యంగా ఉండే నూతన రాజకీయ ఆర్థిక వ్యవస్థను నిర్మించవలెనని నేటి ప్రపంచ సంఘటనలను బట్టి ఈ కమిటీ నమ్ముతూన్నది. కనుక ప్రపంచ ఆయుధ విసర్జనం కోసం స్వతంత్ర భారత దేశం, తన యావచ్ఛక్తినీ వినియోగించి, ఈ సందర్భంలో, ప్రపంచానికి నాయకత్వం వహించేటందుకు కూడా సంసిద్ధపడాలి. కాని అటువంటి నాయకత్వం బాహ్య పరిస్థితుల పైనా ఆంతరంగిక స్థితిగతుల పైనా ఆధారపడి ఉంటుంది. అయితే ప్రభుత్వం మాత్రం ఈ ఆయుధ విసర్జన పద్ధతికోసం శక్తివంచన లేకుండా పనిచేస్తుంది. నిజమైన అస్త్ర సన్న్యాసం కానీ, ప్రపంచ శాంతి స్థాపనము కానీ, యుద్ధాలకూ, జాతీయ పోరాటాలకూ గల మూల కారణాలను తొలగించడం పైననే ముఖ్యంగా ఆధారపడి ఉంటుంది. ఒక దేశం మరొక దేశం పైన అధికారాన్ని చలాయించడమూ, ఒక జాతిని మరొక జాతీ, ఒక సంఘాన్ని మరొక సంఘం స్వప్రయోజనార్థం వినియోగించుకోవడమూ, అనే మూల కారణాలు కూకటి వేళ్ళతో పెకలింపబడాలి. ఈ ఆదర్శాల కోసం ఇండియా ప్రశాంతంగా పని చేస్తుంది. ఈ ఉద్దేశంతోనే భారత ప్రజలు జాతీయ స్వాతంత్ర్యమును పొందగోరుతూన్నారు. ప్రపంచ శాంతి సౌభాగ్యాల కోసం, పరస్పర స్నేహభావం గల తదితర స్వతంత్ర దేశాలతో సన్నిహిత సంబంధమును కలిగించుకొనేటందుకే స్వాతంత్ర్యం అంకురార్పణ కాగలదు.

ప్రతి చెట్టుకూ వేళ్లు ఉంటాయి. అందులో ఒకదానిని మనం తల్లి వేరంటాం. ఎన్ని వేళ్లు తెగగొట్టినా చెట్టు చావదు. కాని తల్లి వేరును తెగగొడితే చెట్టు చచ్చిపోతుంది. భారత స్వరాజ్యమనే జాతీయతా వృక్షానికి, పౌర స్వాతంత్ర్యం తల్లి వేరు. యుద్ధ సమయంలో కాని యుద్ధంలో పాల్గొనే విషయమును గూర్చి కాని మన వాక్స్వాతంత్ర్యం నిరోధింప బడినట్లయితే, స్వతంత్ర జాతీయ వృక్షము యొక్క తల్లి వేరు నరకబడినట్లే. అప్పుడు చెట్టు ఎండిపోక మానదు. ఆ తల్లి వేరును పునరుజ్జీవింప చేసినందు వల్లనే జాతిలో జీవాన్నీ, శక్తినీ పునః ప్రతిష్ఠ చేసినవాళ్ళ మవుతాము. బొంబాయిలో జరిగిన అ. భా. కాం. సం. తీర్మానం దీనినే నిరూపిస్తూన్నది. యుద్ధ సన్నాహాలలో పాల్గొనాలా అక్కరలేదా అనే విషయాన్ని చర్చించేటందుకు ప్రజకు స్వాతంత్ర్యం ఉంటే, అది సజీవమైన జాతిగా వ్యవహరిస్తుంది. లేదా తనపని తాను నిర్వహించుకో లేని అనారోగ్య స్థితిలో ఉంటుంది. ఈ ప్రధాన హక్కును ఇండియా తిరిగి సంపాదించుకో గలిగినట్లయితే, ఐర్లండు వలెనే తాను కూడా, యుద్ధ సన్నాహాలకు అవుననో కాదనో చెప్పే సమర్థత గలిగి, ఇంగ్లాండుకు ఐర్లండు వలెనే మిత్రదేశం కాగలదు.

## గాంధీకి కావలసింది నైతిక విజయం

గాంధీ యెప్పుడూ నైతిక సమస్యలనే తీసికొని నైతిక విజయాన్నే ఆదర్శంగా చేసుకొంటాడు. జలియనువాలాబాగు సందర్భంలో కూడా ఆయన అలాగే చేశాడు. జనరల్ డయ్యారు

తలకాయ కావలెనని, ఆయన కోరలేదు. గాయపడిన వారికి గాని చనిపోయినవారి కుటుంబాలకు గాని నష్ట పరిహార మిమ్మన లేదు. ఇండియా గవర్నమెంటును క్షమాపణ చెప్పమన్నాడు. కానీ అటు ప్రభు వాపని చేశాడు- కాని ఏమిలాభం!- రాణింపు లేని పని చేశాడు. గాంధీ-ఇర్విను రాయబారాల సందర్భంలో ఆయన పోలీసు అత్యాచారాలను గూర్చిన కొన్ని ముఖ్య ఘట్టాల నైనా విచారణ చేయవలసిందని కోరడం మానేశాడు. కారణం రాజప్రతినిధి, తన కవమానం జరుగుతుందేమోననే భయాన్ని గాంధీకి సూచించడమే. నైతిక విషయ మేమైన ఉంటేనే గాంధీకి నచ్చుతుంది. దానినే రాజ ప్రతినిధితో చర్చిస్తాడు. అవసర మైతే అందుకోసమే ప్రజలను పోరాడ మంటాడు. ప్రధాన సమస్య యైన స్వరాజ్య విజయం కూడా, అటువంటి సమస్యల విజయం లోనే కలసి ఉంటుంది. ఎందువల్ల నంటే ఆయన యెత్తుకొనే నైతిక సమస్యలు చాలా పెద్ద సమస్యలు. ఇండియా స్వాతంత్ర్యం "ఉండడమా ఊడడమా" అనే సమస్యనే ఇప్పుడు గాంధీ యెత్తుకొన్నది. ఈ చిట్టచివరి సత్యాగ్రహ సమరం సాగించబోయే ముందు ఆయన రాజప్రతినిధితో చర్చించిన విషయము కూడా అదే.

ఆరవ జార్జి చక్రవర్తి పార్లమెంటులో సంభాషిస్తూ, ఈ యుద్ధం ఆదర్శాలకు సంబంధించిన యుద్ధమని సెలవిచ్చి యున్నారు. మేమూ ఆలాగే అనుకొన్నాము. పూర్వం ధర్మరాజు రాజసూయ యాగం చేసి తన అశ్వాన్ని దేశాలన్నీ చుట్టి రావడానికి పంపినప్పుడాయన, ఆయా దేశపు రాజులను తనకు

సామంతులు గానూ, తనను సామ్రాట్టు గానూ అంగీకరిస్తే చాలునని ప్రకటించాడు. ఆయన కింతకంటె ధనకాంక్ష గానీ రాజ్యకాంక్ష గానీ లేదు. తరువాత అశోకుడు కళింగ దేశానికి సైన్యాలను పంపినప్పుడాయన, అక్కడ ఒక స్తంభమును కట్టించి దానిపైన తన ౧౪ శాసనాలనూ వ్రాయించడంతో సంతృప్తి పడ్డాడు. అటువంటి స్తంభాలు నేడు పాతఢిల్లీ, కొత్తఢిల్లీ నగరాల మధ్యనూ, ఒరిస్సాలోనూ కనిపిస్తున్నవి. జునగాడ్ (కతియవారు) రాజ్యంలో, రోడ్డుకు పది అడుగుల లోపు ఎత్తుగా ఉండే ఒక అతిగుమ్మటం పైన, అశోక చక్రవర్తి 14 శాసనాలూ చెక్కబడి ఉన్నవి. అది గాలికీ వానకూ లోనవుతూండేది. దానిపైన కర్జను ప్రభు వొక భవనం కట్టించాడు. అశోకుడు చేసిన యుద్ధాలు సంస్కృతి కొఱకు చేసిన యుద్ధాలు. తరువాత రాజ్యకాంక్షతో చేసిన యుద్ధాలు బయలు దేరినవి. ఆవిరి యంత్రాలను కనిపెట్టిన తరువాతనూ, విద్యుచ్ఛక్తితో నడపబడే పరిశ్రమలు బాగా వ్యాపించిన పిమ్మటనూ, రాజ్యకాంక్షతో కాక వర్తక వాణిజ్య వ్యాప్తి కోసం యుద్ధాలు జరుగుతూన్నవి. "భావి యుద్ధాలు వాణిజ్య యుద్ధాలు" అని రోజ్‌బెరీ ప్రభు వేనాడో అన్నాడు.

పదినాల్గు మాసాలు గడచిన తరువాత, నేటి ప్రపంచ యుద్ధాన్ని ఆదర్శాల కోసం చేసే యుద్ధమని చెప్పగా వినడం మాకు పునరుల్లాస కరంగా ఉంది. అయితే మేము దీనిని-ఫాసిస్టు, ప్రజా స్వామ్యములకు మధ్య జరిగే యుద్ధ మనవచ్చునా? అప్పుడీ కింది ప్రశ్నను నిగ్గదీసి అడగడానికి మాకు హక్కుంది.

ప్రజా తంత్రం ఎక్కడుంది? ఇంగ్లండులోనా? దీనిని కాదన డానికి ఇంగ్లండులో పూర్వం అమెరికన్ రాయబారిగా ఉన్న జోసెఫ్ కెన్నెడీని సాక్షిగా వేస్తాము. ఆయన ఇంగ్లాండులో ప్రజాతంత్రం అవసానం పొందిందని ఇటీవలనే అన్నాడు. ఇండియాలో ఉందందామా? అది చక్రవర్తి గారి మంత్రులు ఋజువు చేయవలసిన విషయమే. 1914-18 లో జరిగిన ఐరోపా మహా సంగ్రామం కూడా, ఆదర్శాల కోసం చేసే యుద్ధమని ప్రెసిడెంటు విల్సన్ భావించి, ప్రకటించి, పదేపదే జ్ఞాపకం చేశాడు. కాని దాని ఫలితమే నేటి యుద్ధం. ఆదర్శాల కోసం చేసే యుద్ధం, అన్ని యుద్ధాలనూ పరిసమాప్తి చేస్తుంది. అటువంటి యుద్ధంలో చేసుకొనే సంధులు, గూడుపుఠాణీ చేయ డానికి సావకాశం కలిగించవు. రోష గర్భితాలు గానూ, ప్రత్యపకార బుద్ధి కలవిగానూ, దీర్ఘ క్రోధ భూయిష్టములు గానూ కూడా ఉండవు. నష్టపరిహార మీయవలసిందని కానీ ఋణాలను తీర్చివేయ వలసిందని కానీ కోరవు. ఆదర్శాలకోసం జరిగే యుద్ధమే అయితే, అందులో రాజ్యాలను కలుపుకోవడం ఉండదు. తమ తమ ప్రయోజనాలూ ప్రతాపాలూ సాగవలసిన ప్రదేశాలని, వివిధ ప్రభుత్వాల వారూ కొన్ని కొన్ని దేశాలను తమలో తాము పంచుకోవడం జరగదు. పెద్ద దేశాలమధ్య గానీ చిన్న దేశాలమధ్య గానీ కపటస్నేహా లుండవు. కుట్రలూ ద్వేషాలూ పెంపొందవు. వీటన్నిటికన్నా కూడా, ఆదర్శం కోసం యుద్ధం చేసే జాతి ముందు తన తప్పును దిద్దుకొని ఇతరు లకు నీతి చెప్పడానికి ప్రయత్నిస్తుంది. ఆదర్శ యుద్ధం పూర్వ

పశ్చిమ దేశాలకూ, తెల్లజాతులకూ రంగుజాతులకూ, భేదాన్ని గమనించదు. అది "విభజించి పాలించు" అనే మానసిక ప్రవృత్తితో ప్రారంభించి "పాలించి విభజించు" అనే రాజనీతి పైన ప్రబలం గాదు.

## యుద్ధ యంత్రాలు - రక్షణ సామగ్రి

అమెరీ దీనిని యంత్రాల యుద్ధమన్నాడు. జనరల్ స్మట్సు సాధనాల యుద్ధమన్నాడు. ఘనత వహించిన బ్రిటిష్ రాజుగారు ఆదర్శాల యుద్ధమని సెలవిచ్చారు. ఆరవజార్జి చక్రవర్తిగారి దృష్టిలో ఇది నైతిక యుద్ధం. భారత రాజ్యాంగ కార్యదర్శి దృష్టిలో వైజ్ఞానిక యుద్ధం. దక్షిణ ఆఫ్రికా ప్రధాని దృష్టిలో కేవలం భౌతిక యుద్ధం. అమెరీ యంత్రాలు, నెత్తురు సముద్రాలను వర్షింప చేసి కడుపారా త్రాగే బ్రహ్మ రాక్షసులు. స్మట్సు సాధనాలలో ఒకరిని మించి ఒకరు పన్నే వ్యూహాలు కూడా యిమిడి ఉన్నవి. ముగ్గురి అభిప్రాయాలూ మూడు ప్రత్యేక లోకాలలో విహరిస్తూన్నప్పటికీ, వీటికెక్కడో ఒకచోట అంతర్వాహినిగా సంగమస్థలం ఉండి ఉంటుంది. లేకపోతే సంవత్సరాల కొలదీ ఈ యుద్ధం నడవదు. బుద్ధి నైపుణ్యంతో ప్రయోగించే ఆయుధ బలంచేత, నైతికాదర్శాలను ఆచరణలోకి తీసికొని రావలెననియా' వీరందఱి ఉద్దేశం. అలా అయితే, ఆ ఆదర్శాల లోని నైతికోద్దేశం పోనే పోయింది. చెడుగుకు బదులుగా మంచిని స్థాపించడాన్నే ఆదర్శమని అంటాము. చెడుగును చెడుగుతో గానీ, లేక మంచిని చెడుగుతో

గానీ జయించడానికి తగిన సాధనమే యంత్రం. ఆధ్యాత్మిక ఆదర్శాలను భౌతిక సాధనంతో సంధానం చేయడానికి, మనో బుద్ధులు వంతెనలు. ఆదర్శం ఉన్నత మైనదై, ఉదార భావాలను పెంపొందించేటంత పవిత్రమైనదే అయితే, అందుకు తగిన ఫలితాల నది పొంది తీరాలి. అయితే ఆ ఫలితాలను పొందడానికి కది, తాను జయించ పూనుకొన్న చెడుగు వైపుకు దిగకుండా, తన మెత్తువరకూ చెడుగును లేవనెత్తుతుంది. అనగా ఏ ఆదర్శం ఉదార పద్ధతుల ద్వారా విజయం పొంద ప్రయత్నిస్తుందో, అదే ఉదాత్తమైన, నీతియుక్తమైన ఆదర్శం. కాబట్టి సత్యాగ్రహం మొక్కటే అందుకు తగినది. రక్తపాతంతో కూడిన యుద్ధాలు కావు. ఇటువంటి ప్రత్యేక సిద్ధాంతాలను మన్నించక బ్రిటను, యూరోపు వ్యవహారాల నన్నింటినీ మెడకు చుట్టుకొని, ఇండియా మెడకు కూడా చుట్టింది. ఇండియా, అందుకు తన అయిష్టాన్ని ప్రకటించి 1940 లో సత్యాగ్రహోద్యమం సాగించింది.

నిజమైన సత్యాగ్రహం, దేశంలో ఒకే రీతిని, మార్దవంగా రెండు దశాబ్దాల పాటు నడవదనే విషయం, ఈ నూతన సిద్ధాంతాన్ని అవలంబించి, జాతీయాభ్యుదయం కోసం విశేషత్యాగాలు చేసినవారు కూడా, ఇంకనూ గుర్తించవలసియే యున్నది. విజాతీయ ప్రభుత్వ నిర్బంధంవల్ల కలిగే జాతీయ కష్టాలను తొలగించుకొనే నిమిత్తం, ఒక్కసారి వ్యక్తి శాసనోల్లంఘనం గానీ సమష్టి శాసనోల్లంఘనం కానీ చేయడానికి అలవాటు పడటమయితే, ఆనాటి నుండీ దేశంలోని శాంతి శాసనాలకు

భంగం కలిగేటందు కవకాశ మున్నదని కొందరు ఆక్షేపిస్తూంటారు. మరొక ఆక్షేపణ కూడా ఉంది. అది సత్యాగ్రహేతరులనుండి కాదు; సత్యాగ్రహ నాయకులనుండి. సత్యాగ్రహానికి అలవాటు పడ్డవారు, అన్ని రాజకీయ బాధలకూ సత్యాగ్రహ మొక్కటే చికిత్స అన్నట్లుగా దానికోసం చేతులు ముడుచుకొని ప్రార్థిస్తూంటారని వారి విమర్శ. ఈ రెండు విమర్శలకూ కూడా భారత స్వాతంత్ర్య చరిత్రలో తగిన ఉదాహరణా లున్నవి. కాని సత్యాగ్రహ సిద్ధాంతంలో ప్రధాన సూత్రాలను చక్కగా అర్థం చేసుకొన్నవా రెవరూ, మొట్టమొదటి ఆక్షేపణకు ఏవిధమైన విలువా యివ్వరు. కాంగ్రెసు మంత్రివర్గాలు స్థాపించబడిన వెంటనే, పైకి సత్యాగ్రహం వలె కనపడే అనేక ఉద్యమాలు తలలెత్తినవి. కాని అవి ఉద్రేకంతో ద్వేషభావంతో, ధిక్కారంతో బయలు దేరిన వగుటచేత వాటిలో సాత్విక భావమనేది లేనే లేదు. అవి ఆ మహోద్యమము యొక్క కృత్రిమానుకరణాలు. ఖాక్సారులు శాంతికి భంగం కలుగ చేస్తే, వారి మర్యాదాతిక్రమణాన్ని సత్యాగ్రహానికి అంటకట్ట కూడదు. వారు మారణ సాధనాలతో బయలుదేరి, అవసరమైతే వాటిని నిరుద్రేకకర సమయాలలో సైతం ఉపయోగిస్తామని స్పష్టం చేసి ఉన్నారు. దేశంలో వివిధ ప్రాంతాలయందున్న కార్మిక సంస్థలనుండి, కమ్యూనిస్టులు లేవదీసిన కల్లోలముల వలన కూడా సత్యాగ్రహమనే ఈ నూతన సంగ్రామ విధానం, దాన్ని అవలంబించడాని కనర్హులైన అశిక్షితుల చేతులలో పడి, అపోహాలకూ అపనిందలకూ గురి కావడానికి వీలు

కలిగింది. కమ్యూనిజము యొక్క ముఖ్య సిద్ధాంతం, అహింసను అవతల పెట్టమంటుంది. కనుక ఆ సంస్థలోని సభ్యుల ఉద్రేక పూరిత మైనట్టీ, కోపకారణ మైనట్టీ ప్రవర్తనమునకు, సత్యాగ్రహోద్యమం కారణ మనడం సమంజసం కాదు. నిజానికి వారిలో సత్యాగ్రహ తత్వం లేకపోవడమే అందుకు కారణ మనాలి. సత్యాగ్రహ సిద్ధాంతానికి పునాదులైన సత్యాహింస లను త్యజించినందు వలన కలిగే ఫలితమే కమ్యూనిజం. గాంధీ యొక్క ఏకైక నాయకత్వం కింద శాసనోల్లంఘన మనే ఉద్యమం నడుస్తూండగా, అదే సమయంలో, స్పష్టంగా దానికి విరోధంగా ఉండే ఉద్యమాలు, విదేశీ ప్రభుత్వంతో ముఖా ముఖి రాజకీయ పోరాటం జరపడానికి, సత్యాహింసలు సరి యైన మార్గాలు కావని చాటిస్తూన్న వివిధ నాయకత్వాల కింద నడపబడుతూంటే- ఈ ఉద్యమాలన్నీ కూడా సత్యా గ్రహం యొక్క శాఖోప శాఖలే ననడం చాలా సాహసం. ఎవరో కొందఱు సత్యాగ్రహాన్ని సద్వినియోగం చేయకపోవడం కానీ, దుర్వినియోగం చేయడం కానీ, మాకిప్పు డంత పట్టింపుగా లేదు. కాని, సత్యాహింస లనే కఠిన నియమాలతో సహా సత్యాగ్రహాన్ని హృదయ పూర్వకంగా అవలంబించే వారే, దానిని అతిగా వాడుతూండడం మాకు కష్టమనిపిస్తూన్నది. వారికి భావోద్రేకం మెండు. వారి ఉత్సాహశక్తి అనంతం; కాని యుక్తాయుక్త వివేకం వలన కాని, సమగ్ర విషయావ లోకనం వలన గాని, అవి తగిన అదుపులో ఉంచబడడం లేదు. యుద్ధం ప్రారంభమైన మొదటి మేడాదిలోనే, యుద్ధంలో

జోక్యం కలిగించుకో కూడదనీ, యుద్ధ ప్రయత్నాలను నిరోధించ వలెననీ ముందుగానే ప్రచారం మొదలుపెట్టి, కాంగ్రెసును ఎలాగైనా సరే బలవంతంగా సత్యాగ్రహోద్యమం లోకి తోయాలని గట్టి ప్రయత్నం జరిగింది. అప్పటికా యువకుల ఉత్సాహాన్ని అణచిపట్టి, సత్యాగ్రహం ప్రారంభించేటందుకు సరియైన సమయం వచ్చిందని కాంగ్రెసు తలంచేటంత వరకూ పొంగి పొరలి పోతూన్న వారి భావోద్రేకాన్ని ఆపుజేవడానికి వారిని ఒప్పించడం కాంగ్రెసుకు చాలా కష్టమే పోయింది. శత్రువు యొక్క కష్టదశను అవకాశంగా తీసుకొని వినియోగించుకోవడం గాంధీజీ సిద్ధాంతాలకు విరుద్ధమని పదేపదే చెప్పవలసి వచ్చింది. ఇందుకు సంబంధించిన గాంధీ జీవిత చరిత్రలోని కొన్ని ఉదాహరణా లిదివరకే ఇచ్చి యున్నాము. కాబట్టి అనవసరం.

## సత్యాగ్రహము - ప్రపంచ యుద్ధము (1940)

ఇండియా దేశం యుద్ధంలో జోక్యం కలిగించుకోవడం విషయం లోనూ, యుద్ధ ప్రయత్నాల విషయం లోనూ, ఇండియన్ నేషనల్ కాంగ్రెసున్నూ తదితరులున్నూ తమతమ అభిప్రాయాలను సంపూర్ణం గానూ, అహింసాయుతం గానూ, ప్రకటించ గలిగిన స్థితిలో ఉండవలెనని, గాంధీ రాజప్రతినిధిని కోరినాడు. ఇంగ్లండులో అంతరాత్మ కారణముల చేత యుద్ధ విముఖులుగా నుండే వారికి, యుద్ధంలో సైనికులుగా చేరకుండా ఉండడానికి వారి విశ్వాసాన్ని బహిరంగంగా చెప్పడానికీ కూడా

హక్కున్నది. కాని యుద్ధంలో పనిచేసే వారికడకు పోయి, తమ ఉపదేశాలను అనుసరించ వలసిందని ప్రోత్సహించ డానికి అధికారం లేదు. ఇండియాలో కూడా, ఆ హద్దులను దాటి పోవడానికి వీలు లేదని లిన్ లిత్ గో ప్రభువు ప్రత్యుత్తర మిచ్చాడు. కాని హిందూదేశపు వింతపరిస్థితులను బట్టి, వైస్రాయి అంగీకరించిన దానికంటె, గాంధీ మెక్కువ కావాలని కోరినాడు. ఇండియాలో అసలు యుద్ధానికే వ్యతిరేకంగా ఉన్నవారు గానీ, ఇండియా యుద్ధంలో జోక్యం కలిగించుకో రాదనేవారు గానీ, తమతమ అభిప్రాయాలను ప్రకటించడానికి సంపూర్ణాధికారం ఉండాలని ఆయన వాదం. యుద్ధ కార్యాలను నిర్వర్తించే వారికడకు పోయి పికెటింగు చేయవలెనని కానీ, లేక వారు చేసే పనిని వద్దని బోధ చేయవలెనని కానీ గాంధీ ముఖ్యోద్దేశం కాదు. హిందూదేశాన్ని రక్తపాతానికి కారణ భూతంగా చేసే యుద్ధ ప్రయత్నాలకు ఏ విధంగానూ తోడు పడవద్దని ప్రజలకు చెప్పి, ప్రోత్సహించే నిమిత్తం కాంగ్రెసు వారికీ కాంగ్రెసేతరులకూ కూడా హక్కు ఉండాలని మాత్రమే ఆయన అభిప్రాయం. ఎవరికో కొందరికి అంతరాత్మ సంబంధమైన అభ్యంతరా లుండడంకాదిక్కడ మనం విచారించవలసిన విషయం. ఇండియాలో అనేకమంది కనేక కారణా లున్నాయి. యుద్ధానికి సహాయం చేయక పోవడానికి అంతరాత్మ కారణం సర్వోత్తమమైనదని. యుద్ధంలోకి సహాయం చేయడానికి [illegible] వెళ్ళాలి? తమను బలవంతంగా దించిన యుద్ధానికి [illegible] తోడ్పడాలి? తమను పీడించే సామ్రాజ్యతత్వ

రక్షణకోసం చేయబడుతూన్న యుద్ధమని తాము నమ్ముతూ
న్నప్పుడు, తమకా యుద్ధంతో ప్రయోజన మేమిటి? ఇవి
ఇండియా ప్రజల కారణాలు. కాని ఇదివరలో నాజీ తత్వా
నికి తాము వ్యతిరేకుల మనీ, బ్రిటిషు జాతీయ చరిత్రలో తట
స్థించిన ఈ క్లిష్ట దశయందు తాము బ్రిటిష్ వారిని చీకాకు
పఱచ దలచుకోన లేదనీ, కాంగ్రెసున్నూ గాంధీయున్నూ
చేసిన ప్రకటనలను రాజప్రతినిధి ఇప్పుడు, తన కనుకూలంగా
ఉపయోగించు కొంటూన్నాడు. మీరు నాజీలు జయించవలెనని
కోరక పోయినట్లయితే, యుద్ధం గెలవడానికి బ్రిటిష్ వారికి
సహాయం చేసి తీరాలని గాంధీతో రాజప్రతినిధి అన్నాడు.
కాంగ్రెసు కానీ భారతీయులు కానీ నాజీల విజయం కోరడం
లేదన్నంత మాత్రాన, బ్రిటను చేసే యుద్ధంలో, ఇండియా
పాల్గొంటుందనే అర్థం లేదని గాంధీ వ్యాఖ్యానం చేశాడు.
కాంగ్రెసు బ్రిటనును ఈ క్లిష్ట సమయంలో చీకాకు పెట్టదల
చుకో లేదన్న మాటకు, రాజప్రతినిధి, కాంగ్రెసు ఆత్మహత్యకు
ఒప్పుకొన్నదనే టంతవరకూ అర్థం లాగినాడు. ఇందుకు గాంధీ
ఒప్పుకోలేదు సరికదా, పైపెచ్చు కాంగ్రెసు భావాన్ని అర్థం
చేసుకొని, ప్రభుత్వం అందు కనుగుణంగా వ్యవహరించడాని
కవకాశ ముండవచ్చునని కూడా ఆశించాడు; తన విశ్వాసాన్ని
ప్రకటించే సందర్భంలో కాంగ్రెసును బాధించ కూడదని
కూడా ఆయన దాచకుండా చెప్పివేశాడు.

ఇంగ్లాండులోని, యుద్ధవ్యతిరేకి, (**Pacifist**) ఒక విఖ్యాత
పురుషుడని ఇదివరకే మనవి చేశాము. ఇక అంతరాత్మ అభ్యంత

రాలు కలవాడు; యుద్ధసమయం తన ప్రచారానికి మంచి అవకాశం కల్పించింద నుకొంటాడు. నిజాని కనేకమందికి, యుద్ధానికి వ్యతిరేకంగా అప్పు డేమి చెప్పినా అతుకుతుంది. కాని ఇండియాలోని కాంగ్రెసులో ఉన్నవాళ్ళంతా అంతరాత్మ అభ్యంతరాలు కలవాళ్ళే కారు. తమ దేశంపైన బలవంతంగా రుద్దబడిన ఈ యుద్ధమంటే వారికి బొత్తిగా గిట్టదు. అది వారి ఆత్మ గౌరవాన్ని బాధిస్తూన్నది. అందుకు తగిన కష్టాలు వారు పడాలి. మన మొక రాజ్యంలో పౌరులంగా ఉన్నందుకు కాక, మనకు కూడా కొన్ని అభిప్రాయా లున్నందుకు జాతీయ పునర్నిర్మాణమును గూర్చి, సాంఘిక సంస్కరణమును గూర్చి, మన అభిప్రాయాలను మనం ముందుగా వెల్లడిస్తూన్నందుకు- అంటే ఇంతకంటె మంచి రాజ్యం కోసం పరితపిస్తూన్నందుకు- మనం తగిన త్యాగం చేయక తప్పదు. కనుక కాంగ్రెసు తిరిగీ అచంచల విశ్వాసంతో అధికారాలను విసర్జించి అడవులపాలు కావాలి. రిచార్డు బి. గ్రెగ్గు ఇలా అన్నాడు :

> బాధ, అంతరాత్మ అభ్యంతరాలు కలవాళ్ళ శక్తినీ, భావాలనూ, చిత్తవృత్తినే కాక, ఉదార జాతీయాత్మ గౌరవం కలిగి, సత్యాహింసల పైన ఆధారపడే నూతన సాంఘిక వ్యవస్థను భావించగలవాళ్ళ శక్తినీ, ఊహాలనూ, మనో వైఖరినీ కూడా, బలపరచి పరిశుద్ధంగా చేస్తుంది.

## 1940 సత్యాగ్రహోద్యమం

గాంధీ మరొక పర్యాయం 1940 లో హిందూదేశంలో సత్యాగ్రహం సాగించాడు. ఇప్పుడు జరిగే యుద్ధంలో భారతీయులు

జోక్యం కలిగించుకోవడానికి గానీ, కలిగించుకోకుండా ఉండడానికి గానీ, వారికి స్వాతంత్ర్య ముండాలనే కోరికపైన ఈ ఉద్యమం ప్రారంభింప బడినది. అహింసపైన ఆధారపడిన రాజకీయ చతురతా నైపుణ్యములు, ప్రపంచంలో ఈనాడే విధంగా లోపించి పోయినవో బాగా స్పష్టమవుతూనే ఉంది. ప్రతి సంధీ భావి సంగ్రామానికి బీజంగా పరిణమిస్తూన్నది. యుద్ధం కానీ పరస్పర హత్యాకాండ కానీ జరుగకుండా ఉండవలెనంటే, సుహృద్భావం పెంపొందాలి. శాఖా భేదా లున్నప్పటికీ, యూరోపుఖండ మంతా క్రైస్తవ మతంలో నమ్మకం కలిగినట్లు గానే ప్రకటిస్తూంటుంది. కాని క్రైస్తు ఉపదేశాలను, అక్కడివారు మన్నించడం కంటె, ఉల్లంఘించడం ఎక్కువ. యుద్ధం చేసే ఉభయ కక్షులవారూ జీసస్ క్రైస్తును ఒకే విధంగా ప్రార్థిస్తూంటారు. జీసస్ బెర్లినుకు గానీ లండనుకు గానీ వచ్చి చూస్తే, పాప మాయన ఏమనుకొంటాడో? ఇండియాలో సైన్యం లేని రాజ్యం కావాలని కోరడంలో గాంధీ హద్దులను అతిక్రమించి పోలేదు.

సత్యాగ్రహానికీ సైన్యం కావాలి; ఉపాయం కావాలి; నైపుణ్యం కావాలి. సత్యము యొక్క ఆదర్శాలను అందుకోవడానికి ప్రయత్నించే అహింసావ లంబకులైన శాంతి సైనికులు కావాలి మనకు. అహింస కేవలం ప్రతిషేధాత్మక భావం కాదనీ, అది ఒక క్రియాశక్తి అనీ, ఇదివర కనేకసార్లు చెప్పి ఉన్నాము. ఐకమత్య వ్యాపకమునకూ ప్రేమ ప్రచారమునకూ, పశు శక్తిపైన ఆత్మశక్తిని విజయం పొందేటట్లు చేయడానికీ,

అది యొక ప్రబల సాధనం. శాంతి సైన్యంలో చేరే సైనికులు బలిష్ఠులుగా నుండనక్కర లేదు. కాని ఉన్నతాత్మ కలవారుగా ఉండాలి. సత్యాగ్రహం పరుల రక్తం కోసం హాహా కారాలు చేయదు. కాని సత్యాగ్రహి తన రక్తంతో పరుల దాహం తీరుస్తాడు. సత్యాగ్రహం, శత్రువులో గడ్డ కట్టుకొని పోయిన, ప్రాపంచిక జీవిత లక్ష్యాలకు సంబంధించిన పాత నమ్మకాలను చెల్లా చెదరు చేసి, అతనినుండి కావలసినంత నిర్మాణ శక్తిని వెలువరిస్తుంది. సత్యాగ్రహ మంటే పిఱికితనం కాదు ధైర్యం; స్తబ్ధత్వం కాదు చైతన్యం. సత్యాగ్రహం సంస్కారులైన యే కొలదిమంది సొత్తో కాదు; అసంఖ్యాకులైన ప్రజల హైత్యకథన మది. అది కొత్తకల్పన కాదు; రాజకీయాలకు అనువర్తింప చేసే టందుకు శిల్పం గానూ శాస్త్రం గానూ తయారు చేయబడిన పాత సిద్ధాంతం యొక్క ప్రత్యేకీ కరణమే అది.

## రథగమనం

1920 లో అసహాయోద్యమం ప్రారంభించి నప్పుడు గాంధీ ఒంటరిగా నిలబడ్డాడు. నాడు భారత జాతీయత అనే కాగు, నిప్పు పొయ్యి మీద యొక్కడో ఒక మూల మాత్రం ఆని ఉంది. అందులోని నీళ్ళు బాగా కాగి, కళిపెళ లాడుతున్నాయి. కాబట్టి 1940 లో ఒకే సత్యాగ్రహిని జైలుకు పంపించడ మనేది గాంధీకి కొత్త అనుభవం కాదు. నిప్పులు మండుతూన్న కొద్దీ బానకు క్రమ క్రమంగా ఒక్కొక్క పాళ్ళు కుదురుతూంటుంది. అప్పుడది స్థిరంగా ఒకచోట నిలబడడానికి వీలు కలుగుతుంది.

అలాగే 1920 లో గాంధీతో మొట్టమొదట మోతీలాలు నెహ్రూ చేరాడు. తరువాత లాలా లజపతిరాయి "పూర్ణ శరీరంతోనూ" అర్ధ హృదయంతోనూ చేరాడు. పిదప దేశబంధు చిత్తరంజన దాసు, కొండ కోననుండి దూకిన మంచుగడ్డవలె ఉఱికి, పంజాబు సంయుక్త రాష్ట్రాలలోని అసహాయోద్యమ నిర్మల సలిల ప్రవాహాలను పొంగి పొరలెత్తించి, బెంగాల్ మైదానాలలోకి మహా నదిగా విస్తరింప చేశాడు. ఇక వర్షఋతువు మళ్ళీ రావాలి. వేసగి మండు టెండలు లేనిదే వానలు కురియవు. సూర్య రథము నిరంతరం తిరుగుతూనే ఉంటుంది. సూర్య రథానికి ఒకటే చక్రం, ఏడు గుఱ్ఱాలు, ఏడు పాము పగ్గాలు; అది కిందా పైనా యేమీ ఆధారం లేకుండా అంతరిక్షంలో ఆకాశమంతా చుట్టి రావాలి. సారధిని చూతామా కుంటివాడు. కాని సూర్యుడు ప్రతి రోజూ యథా ప్రకారం ప్రయాణం సాగిస్తూనే ఉన్నాడు. అదే విధంగా గాంధీ సూర్యుడు, ఒక అజ్ఞాత సారధితో, దమ, యమ, దాన, శౌచ, సత్య, క్షమా, ధర్మాలనే ఏడు పాము పగ్గాలతో, భారతాకాశ వీధులను, తాను రథిగా చుట్టివస్తూ న్నాడు. మళ్ళీ వడగాడ్పులు సాగినయి. కాని వాటి కవసరం లేకపోలేదు. వానలు కురియడానికి ముందు హిందూదేశంలో ప్రతి మూలా వేడిగాడ్పు వీస్తూనే ఉంటుంది. తరువాత కొద్ది రోజుల లోనే వాన కురుస్తుంది. కొండలలో నుండి, లోయలలో నుండి, పొదలలో నుండి, అడవులలో నుండి ప్రవహించే ఈ వాన నీరు, భూమిని సస్య శ్యామలంగా చేసి ప్రపంచానికి జీవనాధార మవుతుంది. మహాత్ములకీ క్రియా సిద్ధి ఉపకరణముల వల్ల

గాక తమలోని సత్యాం వల్లనే కలుగుతుంది. ఒక్కటే చక్రంతో కాళ్ళు లేని సారథితో, ఏడు పాముఃపగ్గాలతో, సూర్య రథం ప్రతి రోజూ తూర్పు కొననుండి పడమటికొన వరకూ సంచారం చేయ గలిగితే, నిష్కళంక శీలం కల సారథి సహాయంతో, గాంధీ వంటి రథికుడు, భారత రథాన్ని పడమరనుండి తూర్పుకు తోలుకొని రాలేడని మన మెందుకు సందేహించాలి?

అయితే ఇప్పుడు మనం వ్యక్తిగతంగా చేయవలసిన పని యేమిటి? సైనికులు యుద్ధరంగంలో పోరాడుతూన్నప్పుడు, వారికి దుస్తులు, ఆహార పదార్థాలు, యుద్ధ సామగ్రి పంపించడానికి వెనుక ఒక ప్రత్యేక శాఖ పనిచేస్తూ ఉండాలి. అదే విధంగా మనమంతా, ఆహార పదార్థాలనూ వస్త్రాలనూ తయారు చేస్తూ యుద్ధ పరికరాలను కూడా సంసిద్ధంగా ఉంచాలి. రాట్నం, రోకలి, తిరుగలి, బెల్లపు పెనం, మగ్గం, గానుగ, ఇవీ మన పరికరాలు. కుల మత భేదాలను మఱచిపోయి మనమంతా ఒకే జాతి అనే సంగతి జ్ఞాపకం చేసుకోవాలి. అంటరానితనాన్ని నిర్మూలించాలి. త్రాగుడు మాన్పించాలి. బ్రిటిష్ వానిలో యెన్ని లోపాలున్నప్పటికీ అతనిని కూడా మనం ద్వేషించకూడదు. ఎందువల్లనంటే, ఆలోచించినకొద్దీ అతడు మొట్టమొదట మనకు అతిథిగా వచ్చినట్లు తేలుతుంది. మన మిచ్చిన ఆతిథ్యాన్ని ఆతడు దుర్వినియోగం చేసినప్పటికీ అతిథిని రక్షించవలసిన బాధ్యత మనకు పోలేదు.

ప్రతి యుద్ధంలోనూ "యుద్ధంయొక్క ఉద్దేశాలు" ఉంటాయి. "యుద్ధంయొక్క ఉద్దేశాలంటే యుద్ధం గెలవడమే నన్నా

'విఖాప్ స్పీడ్సు', "యుద్ధోద్దేశాలు" వేరు. "యుద్ధం యొక్క ఉద్దేశాలు వేరు." "యుద్ధోద్దేశా" లంటే శాంతిస్థాపనకు కారణ భూతములయ్యే సిద్ధాంతాలు. "యుద్ధం యొక్క ఉద్దేశాలు" యుద్ధం సాగించడానికి ప్రోత్సాహకరంగా ఉంటాయి. "యుద్ధోద్దేశాలు" యుద్ధ పరిసమాప్తిని నిర్ణయిస్తాయి. ఇండియాలో మొదటిది సత్యాగ్రహం; రెండోది నిర్మాణ కార్యక్రమం. యోధులు తక్కువగా ఉంటారు, పునర్నిర్మాణకు ఎక్కువగా ఉంటారు. గాంధీ అందువలననే సత్యాగ్రహాన్ని మొట్టమొదట సమూహానికి గాక, వ్యక్తులకు మాత్రమే వర్తింప చేశాడు. ఈ వ్యక్తి సత్యాగ్రహం కూడా ఇద్దరికే వర్తిస్తుందన్నాడు. భారత దేశంలోని కోట్లకొలదీ ప్రజలను, నూలు వడుకుతూ, బట్టలు నేస్తూ, వడ్లు దంచుతూ, పిండి విసురుతూ, నూనె ఆడుతూ, బెల్లం వండుతూ, కాగితం చేస్తూ శాంతి స్థాపనకు సంసిద్ధ పడమన్నాడు.

దంపుడు బియ్యమూ పిండీ రెండుకోట్ల మందికి పని కల్పిస్తవి. నూలు వడకడం వల్లా, బట్టలు నేయడం వలనా 12 కోట్ల మంది జీవిస్తూన్నారు. కుటీర పరిశ్రమల వలన సాధారణ నిరుద్యోగ సమస్య పరిష్కార మవుతుంది. ఒకప్పు డింగ్లీషు పరిపాలన పోయినప్పటికీ లంకాషైరు, మాంచెస్టర్, లివర్‌పూల్, నాటింగ్ హాముల యాజమాన్యాలు పోకపోవచ్చు. కాబట్టి స్వతంత్ర భారతదేశం స్వయం సంపూర్ణంగా, స్వయం శక్తి వంతంగా, ఆత్మ గౌరవ యుతంగా ఉండ ప్రయత్నించాలి. గాంధీ సత్యాగ్రహం పతన బంధన విముక్తమయిన "ఆత్మ" కు, నిర్మాణ

కార్యక్రమము తోడుగు. అది సత్యాగ్రహానికి అనుబంధం గాను అనుయాయి గాను ఉంటుంది. కాబట్టి ఇండియా - తన ఆత్మను గాంధీలో ప్రవేశింపచేసి, నిర్మాణ కార్యక్రమాన్ని కొనసాగిస్తూ, తన ఏకీభావం వల్ల ప్రేమ తత్వాన్నీ సేవా భావాన్నీ విజృంభింప చేయునుగాక.

## గాంధీ - విపరీత పరిణామమూర్తి

గాంధీ విపరీతంగా మారిపోతూంటాడనే ప్రజల దోషారోపణకు ఆయన సావకాశం కలిగిస్తూంటాడు. ఒక్కొక్కప్పుడు లోకాలను ప్రళయ కల్లోలంలోకి దింపుతున్నట్లుగా నిందాపాత్రు డవుతాడు. మరొకప్పుడు మహా సామ్రాజ్యాని కెదురుగా ఏదో బొమ్మ పోరాటం ప్రారంభించినట్లు అవహేళనకు గురి అవుతాడు. హైదరాబాదులో అభివృద్ధి నిరోధక శాసనాలను ఎదుర్కోవడానికి నలుగురు సైనికులను పంపుతాడు. ఇండియాలో బ్రిటిష్ సామ్రాజ్యాని కభిముఖంగా నిలబడడానికి ఒక్కడు చాలు నంటాడు. ఖజానాలో ఉన్న చిట్టచివరి షిల్లింగునూ, పటాలాలలో ఉన్న చిట్టచివరి సిపాయినీ కూడా వినియోగించి అయినా విజయం పొందవలెననే యుద్ధనీతి పైన ఆధారపడి లేదు సత్యాగ్రహం. పవిత్ర హృదయుడు, ఉన్నతాత్మ కలవాడు, నిష్కాముడు, స్వార్థరహితుడు, నిర్భయుడు, నిరాశాపేక్షుడూ అయిన ఒక్కవ్యక్తి, అత్యంత బలిష్ఠమైన ప్రభుత్వంతో ఒంటరిగా పోరాడగలడు. ఆ ప్రకారం తన వారపత్రికలో గాంధీ రాజప్రతినిధికి వ్రాశాడు. ఆ సంగతి ఆయన ఇంతవరకు

మూడు పర్యాయాలు వెల్లడించాడు. ఆయన ఎన్నడూ తాను చేయబోయే పనులను దాచడు. కాని విడివిడిగా ఆయన వ్రాస్తున్న వాక్యాలను జాగ్రత్తగా పరిశీలిస్తూ ఉండాలి. అప్పుడే వాటి భావం తెలుస్తుంది. అదే విధంగా, హిందూ సంఘం నుండి హరిజనులను విడదీసే ప్రయత్నాన్ని, తన ప్రాణాలను ఒడ్డి నిరోధిస్తానని గాంధీ, 1931 లో జరిగిన రెండవ రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సులో సర్ శామ్యూల్ హోరుతో అన్నాడు. ఆయన లండన్ నుండి తిరిగి వచ్చినతరువాత కూడా, అజద్ మైదానంలో జరిగిన బహిరంగ సభలో మళ్ళీ అదేమాట అన్నాడు. 1932 మార్చిలో తన కారాగారం నుండి, తిరిగి అదే అర్థం వచ్చే మాటలలో, హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శికి తన మనో నిశ్చయాన్ని తెలియపరిచాడు. ఆ సంవత్సరం సెప్టెంబరులోనే ఆయన అందుకోసం ప్రాయోపవేశం ప్రారంభించాడు. కాబట్టి ఆయన ఏమి చేయబోతూన్నాడో, అది ముందు చెప్పి చేస్తాడు. ఆయన నీతి అహింస. ఆయన ఉపాయం సత్యం.

కాని గాంధీ చేసిన పనిలో కొంత వింత లేకపోలేదు. ఎవరీ వినోబాభావే అని, అర్థంకాని ప్రపంచం అత్యాశ్చర్యంగా అడుగుతుంది. వేయి వేదికలపైన ఉపన్యాసాలిచ్చినవానికంటె, తన ఆశ్రమంలో, పాతుకొనిపోయి, రాటంపైన రాటు తేలిన వాడు గాంధీకి అనేక రెట్లు విశ్వాస పాత్రుడు. గాంధీకి సఖుడు "సహాయోపాధ్యాయుడు" వినోబా భావే. ఒక విధంగా గాంధీ ఆయనకు జాతీయ పోరాటంలో అగ్రస్థాన మిస్తాడు, జాతీయ

వాక్స్వాతంత్ర్యాన్ని ప్రతిష్ఠించే ప్రయత్నంలో, ఆయన మరణించడమే జరిగితే ఆయన త్యాగం స్వచ్ఛతమము. గాంధీ తన సేనానులను, తన యోధులను, తన సహచరులను, ఇటువంటి ప్రమాణాలతో పరీక్షిస్తాడు. గాంధీ కార్యక్రమమును గూర్చి అపోహలూ చిక్కులూ వెలడింపబడడ మిది మొదటిసారి కాదు. ఆయన, ఆనంద్ బార్డోలీ తాలూకాలలో తన కళ్ళయెదుట పన్నుల నిరాకరణమును ప్రారంభిస్తా నన్నప్పుడు, గుజరాతులోనే మొట్టమొదట మొందుకు ప్రారంభించాలి, గుంటూరులో మొందుకు ప్రారంభించ కూడదని పెద్ద గోల జరిగింది. ఆయన దండికి చేరుకోనేటంత వరకూ ఎవ్వరూ ఉప్పు ముట్టుకోకూడదని శాసించి నప్పుడు, స్వచ్ఛంద సైనిక దళాలలో గలిగిన ఆత్రాన్ని అణచిపెట్టి, వారిని శిబిరాలలో నుండి కదలకుండా చేయడమే, జిల్లా నాయకులకు రాష్ట్ర నాయకులకూ పని అయిపోయింది. అదేవిధంగా, ప్రపంచమంతా ప్రళయ యుద్ధంలో మునిగి ఉన్నప్పుడీ ఒక్క మనిషి అరెస్టుతో ఏమి జరుగుతుంది? తక్కిన దేశాలు మనను చూచి నవ్వుతాయి కూడాను; అనడం సాగించారు చాలామంది.

## వినోబా ఎవరు?

వినోబాను ప్రభుత్వంవారు పట్టుకోకనే పోతే యేమవుతుంది? అని చాలామంది అడుగుతూ వచ్చారు. వినోబా ఉత్త బొమ్మ కాదు; ఎందుకూ పనికిరాని మొద్దూ కాదు. ఆయన బరోడా [illegible] [illegible]లో ఇంటర్మీడియేటు తరగతి చదువుతూ మాని,

హిమాలయాలకు తపస్సు కోసం వెళ్ళినాడు. అక్కడనుండి తిరిగి
వచ్చిన తరువాత ఆయనకు గాంధీతో సన్నిహిత సంబంధం
కలిగింది. వినోబాసోదరులు ముగ్గురు. వారందరూ సుప్రసిద్ధులే.
కాని అందరిలో ఈయన ఎక్కువ తెలిసినవాడు. అందరి
లోనూ పెద్దవాడు కూడాను. వినోబా, భగవద్గీతను తన
మాతృభాష మైన మహారాష్ట్రం లోకి భావ పూర్ణంగానూ
మాధుర్యం గానూ అనువదించాడు. వడుకు కూలి హెచ్చించ
డాని కీయనే కారకుడు. ఈయన అనుభవాలను అందరికీ నచ్చ
చెప్పి, అది సాధ్యమని నిరూపించాడు. ఈయనవలన గాంధీ,
గాంధీ వలన ఈయన, పరస్పర పరివర్తనం పొందుతూ
వచ్చారు. కాంగ్రెసులో తక్కినవారంత యెంత రాజకీయ
వేత్తలో, ఈయన కూడా అంతకు తక్కువ రాజకీయవేత్త
కాడు. అందరూ వెళ్ళినట్లే ఈయనా జైలుకు వెళ్ళాడు.
అంతేకాని, ఈయనను పౌనారు ఆశ్రమంలోని దూదిబేళ్ళ కింద
నుండి లేవనెత్తి, గాంధీ సత్యాగ్రహానికి కీలు బొమ్మగా ప్రద
ర్శించ లేదు. వినోబాను అరెస్టు చేయకనే పోతే ఆయన
ప్రచారం కొనసాగిస్తాడు. వేలకొలదీ జనులు "ఈ వింతమృగాన్ని"
చూడడానికి వస్తారు. "ఈ అజ్ఞాత యోధుడు" ఏలా మాట్లాడు
తాడో, ఎలా పోరాడుతాడో, ఏమి చేస్తాడో, ప్రజలు కళ్ళారా
కనే భాగ్యం కలుగుతుంది. ఆయన పట్టుపడితే రెండో మనిషికి
స్థానం వస్తుంది. రెండో మనిషి యెవరో కొద్ది కాలం లోనే
తెలుస్తుంది. సత్యాగ్రహం ప్రారంభించ బడినప్పుడల్లా కొత్త
రూపాలు తాల్చుతూంటుంది. - కాని సత్యాగ్రహంలో కొత్తదనా

చేరినవాళ్లు తాము పూర్వ మెక్కడ విడిచిపెట్టినారో అక్కడ నుండి ప్రారంభిస్తారు. మూలపురుషుడు మాత్రం కొత్త కొత్త రూపంలో మొదలు పెడతాడు. ఇక తరువాత ఎత్తు ప్రభుత్వానిది. ప్రభుత్వం వేసిన ఎత్తును బట్టి మన ఎత్తు ఉంటుంది. ఇంతా అయితే సత్యాగ్రహం కూడా ప్రిటను చేసే యుద్ధం లాటిదే. కాని ఇందులో రక్తపాతం, క్రోధం, కసి- ఇవన్నీ ఉండవు. కాబట్టి ఈ యుద్ధంలో పోరే ఇరుకక్షులవారి ప్రకృతిని, ఇది ఉన్నతస్థితికి లేవనెత్తుతుంది. మొట్టమొదట శాసనోల్లంఘన కార్యక్రమం పిచారణకు వచ్చినప్పుడు, సముద్రపు నీటిని ఉప్పు చేసే నిమిత్తం కుండ బొచ్చెలలో కాచినప్పుడు, ఉప్పు మళ్లలోకి గుప్పెళ్ళతో ఉప్పు తీసుకొని రావడానికి ప్రజలు దండయాత్ర వెళ్లినప్పుడు, స్త్రీలు కల్లు దుకాణాలకు పికెటు చేయడానికి పోయినప్పుడు, ఈతచెట్లూ తాటిగెలలూ కొట్టివేయబడినప్పుడు, విదేశీ వస్త్రాలు దహింపబడ్డప్పుడు, పాత రాటాలను పైకి తీసినప్పుడు, అదంతా అహంకారోన్మాదమని అపహాస్యపు చేష్టలవలె, బంగారం చేస్తాననే గోసాయివాని శుష్క వాగ్దానాలవలె, పరికలదాని సోదులవలె, జ్యోతిష్కుల యొక్కయు, హస్తసాముద్రికుల యొక్కయు అనాగత వృత్తాంతముల వలె, ఐంద్రజాలికుని మాయవలె కనిపించింది. ఇరవై సంవత్సరాల నుండి సత్యాగ్రహాన్ని ఆచరణలో పెట్టి ఒరిసి చూచాము. ఇందులో మన ఆలోచనకు తోడు, మరికొంత నమ్మకం కూడా ఉంచినట్లయితే, కొద్దికాలంలోనే ఈ నూతన శాస్త్రం, హింసా

ప్రతీకారముల నుండి మానవ కోటిని రక్షించేటందుకు, శిల్పం గానూ శాస్త్రం గానూ కూడా అభివృద్ధి పొందుతూన్నదని తెలుసుకో గలము. సత్యాగ్రహం అద్భుతములతో నిండిఉంటుంది. అద్భుతం అత్యంతమైన సృజన శక్తిని కల్గించే భావ వికారం.

చిట్టచివరకి సత్యాగ్రహం వినోబా భావేతో ప్రారంభించినప్పుడు, ఏ కొద్దిమంది లోనో నిరాశా సందేహా లున్నప్పటికీ, అనేక మందిలో ఆశా విశ్వాసాలు అంకురించినవి. భావేకు సత్యాగ్రహంలో 32 ఏండ్ల అనుభవం ఉంది. ఆయన గొప్ప పండితుడు, గట్టి నియమంగల బ్రహ్మచారి. ఖద్దరు, గ్రామ పరిశ్రమల యందు శ్రద్ధా భక్తులు కలవాడు. గాంధీ అనుయాత్రికులలో అగ్రగామి. తేలిక భాషలో గట్టిగా తొట్రుపాటు పడకుండా తూచినట్లు యుద్ధ ప్రయత్నంలో జోక్యం కలుగచేసుకో కూడదని, వినోబా నాలుగు ఉపన్యాసా లిచ్చాడు. కాని కాంగ్రెసు, యుద్ధ చందాల విషయంలో గాని, సైనికులను సమకూర్చే విషయంలో కాని, పికెటు చేయదలచుకో లేదని కూడా వాటిలో స్పష్టం చేశాడు. చట్టం పరికార మీ ముద్దాయికి మూడు మాసాలు ఖైదు విధింప బడింది. ప్రభుత్వం కూడా మృదువును మృదుత్వం తోనే ఎదుర్కొన్నారు. "నేరమెం"త ఆడంబర రహితంగా జరిగిందో విచారణ కూడా అంత నిరాడంబరం గానూ జరిగింది. రెండు వైపులా కూడా దూరాలోచన, ఉచితజ్ఞత, దీర్ఘదర్శిత్వమూ ప్రదర్శింప బడినవి. చిట్టచివరి వరకూ ఇలా సాగుతుందా?

కాని తరువాతి సత్యాగ్రహి ప్రచండ వేగంగల వ్యక్తి. ఆయనకు సాధుత్వం అంటే ఏమిటో తెలియదు. నమ్రత అనే మాట పనికిరాదు. సాధారణంగా ఆయన సమావేశాలు అతి విస్తృతములు. ఆయన దీర్ఘోపన్యాసాలు గర్జారావాలు. ఉజ్జీని బట్టి ఉజ్జీ ఉంటూఉంటూరు. ప్రభుత్వంవారు వినోబా యెడల ప్రవర్తించినట్లుగానే జవహర్‌లాలు ఎడల కూడా ఒకేరీతిని ప్రవర్తిస్తారా అని, మేమాశ్చర్యంలో మునిగిపోయినాము. అలా ప్రవర్తించకుండా ఉండడంలో వింత లేదు. సత్యాగ్రహికి ఎంత శిక్ష వేశాడా అనేది ప్రధాన విషయం కాదు. సత్యాగ్రహం నడిపేటప్పుడు, అతను చూపే కార్యదీక్ష, వాక్పటుత్వము, మనో నిశ్చయము ఇవి మాత్రమే ముఖ్యములు. వినోబా భావే పేరు పేర్కొన బడ్డప్పుడు, అతనిని అజ్ఞాతయోధు డన్నారు. ఈనాడాయన పేరు లక్షలకొలదీ సమకాలికులలో తెలిసిపోయింది. రేపు భారత భావి సంతానం, ఈయనను మాతృదేశారాధనము నకు గాంధీ మహాత్మునిచే కోరుకోబడిన అనుయాత్రికులలో అగ్రేసరుడుగా పూజ చేస్తారు.

సత్యాగ్రహం ఒక యజ్ఞం. యజ్ఞపశువుగా ఎక్కడా తెలుపులేని నల్లని మేక కావాలి. అలాగే సత్యాగ్రహ యజ్ఞ పశువుకు ఎక్కడా నలుపులేని తెల్లని నడవడి కలవాడు కావాలి. ఒక్కసారి త్రోవ చూపబడింది. ఇంక నడుస్తుంది ఉద్యమం; ఎవరు ముందు తుపాకి పేల్చారు, ఎవరు ముందు పొలిమేర దాటినారు అనే దానిమీద విజయం ఆధారపడి ఉండదు. సత్యాగ్రహం ధర్మయుద్ధం. అందువలన ఎవరెవరో ముందుగానే

పరస్పరం యోధులకు తెలుసు. మేము ప్రత్యర్థికి మరొక లాభం కూడా చేశాం. భీష్మ డర్జునునికి తన రహస్యాలను వెల్లడి చేసినట్లుగా, మేము మా బలా బలాలను ముందుగా ప్రత్యర్థికి తెలియ పఱిచాము. మేమీ రహస్యం దాచుకో లేదు. మా యుద్ధనీతి తెలిసిందే. మా కోరికలు చాలా చిన్నవి. బ్రిటను ఈ రోజున, ప్రపంచంలోకెల్ల మహాపురుషు డైనవానినీ పవిత్ర హృదయుణ్ణీ తన పక్షాన కెందుకు తిప్పుకోలేదు? పవిత్రత వలన కలిగే బలం అజేయం కదా?

సత్యాగ్రహా లన్నిటిలోకి సాటిలేని సత్యాగ్రహ మిది. సందేహం లేదు. దీని దృష్టి చాలా విశాలం. కాని దీని ప్రారంభం అత్యల్పం. అయినా మహాత్ముడు దీనికి అత్యుత్తమ ఫలితం కలుగుతుందని ఆశిస్తూన్నాడు. ఇంత చిన్న గింజనుండి అంత పెద్ద ఫలం కలుగుతుందని ఆయన ఎలా అనుకొంటూన్నాడు? మన ఈ ప్రశ్న అసందర్భంగా లేదూ? ప్రతిగింజా చిన్నగానే ఉంటుంది. ప్రతి ఫలమూ పుష్కలంగానే ఉంటుంది. అయితే గింజ మొలిచి, చెట్టయి, పూచి, కాయాలి; అంటే అందుకు తగిన దోహదమంతా చేయాలి. అందువల్లనే గాంధీ భారతజాతి అంతటినీ, నిర్మాణ కార్యక్రమాన్ని అత్యంత శ్రద్ధా భక్తులతో సాగించ మన్నాడు. దోహదం లేని చెట్టు ఫలించనట్లే, నిర్మాణ కార్యక్రమంతో నడవని సత్యాగ్రహం, ఫలప్రదం కాదని ఆయన అభిప్రాయం.

ఇప్పుడు గాంధీ ప్రారంభించిన సత్యాగ్రహం వంటి దెన్నడూ ఇదివఱకు ప్రారంభింపబడ లేదు. తాను హిందూ దేశ

సమస్యనే కాక అంతర్జాతీయ సమస్యనుకూడా పరిష్కరించగల
నని గాంధీ ఆశ. గాంధీ, శాంతి సభలో హిందూదేశం పక్షాన
ప్రాతినిధ్యం వహించడమే కాక, యుద్ధంలో చిక్కుకొన్న అన్ని
దేశాలమధ్య తాను శాంతి రాయబారాలు నడపడానికి కూడా
తగినట్లు పరిస్థితులు పరిపక్వ దశను పొందుతవని ఆయన తలం
చెను. ఆయన "ప్రతి బ్రిటిష్ వానికీ" అని వ్రాసిన ఉత్తరంలో,
జర్మనీని నిరోధించకుండా బ్రిటనులోకి రానిస్తే, జర్మను దండ
యాత్రను అహింసా యుతంగా ఎదుర్కోవడానికి తాను
సంపూర్ణ సహకారం చేస్తానని రచించిన వాక్యం అత్యంత
కౌతుకావహంగా ఉంది. గాంధీ చేసిన ఈ వాగ్దానమును
రివరెండ్ జాక్ సి. విన్స్లో ముందుగా తానే ఊహించ గలిగి
నాడు. ఈ విషయం వెనుకనే ఉదాహరింప బడినది.

## సత్యాగ్రహ నియమాలు 1930.

సత్యాగ్రహ నియమాలను పూర్తిగా పరిశీలించవలెనంటే,
గాంధీ 1930 లోనూ తరువాత 1940 లోనూ నిర్మించిన నియ
మాలను కొన్నిటి నిక్కడ ఉదాహరిస్తే సరిపోతుంది.

> సత్యాగ్రహం అంటే సత్యమునందు పట్టుదల గలిగి ఉండడం. ఈ పట్టు
> దల సత్యాసక్తి గలవానికి అసమానమైన శక్తిని కలుగ చేస్తుంది. ఈ
> శక్తికే సత్యాగ్రహ మనే పేరు పెట్టబడ్డది. పరిశుద్ధమైన సత్యాగ్రహాన్ని
> తల్లి దండ్రులకు వ్యతిరేకంగా, భార్యకు వ్యతిరేకంగా, బిడ్డలకు వ్యతి
> రేకంగా, పరిపాలకులకు వ్యతిరేకంగా, తోడి పౌరులకు వ్యతిరేకంగా,
> [illegible] ప్రభుత్వానికి వ్యతిరేకంగా కూడా నడపవచ్చును.

ఆ విశ్వశక్తికి తనవాళ్ళూ పరాయివాళ్ళూ అనికాని, బాలురు వృద్ధులూ అనికాని, పురుషుడు స్త్రీ అనికాని, మిత్రుడు శత్రువు అనికాని భేదం లేదు. ఆ విధంగా ప్రయోగింప బడిన శక్తి యెన్నడూ భౌతిక శక్తి కానేరదు. దానిలో దౌర్జన్యానికి స్థానం లేదు. కాబట్టి అన్నిచోట్లా ప్రయోగించదగిన శక్తి, అహింసాశక్తి కానీ ప్రేమశక్తి కానీ ఐ యుండాలి. ఆత్మశక్తి అని కూడా అనవచ్చు.

ప్రేమ యితరులను దహించదు. తనను తానే దహించు కొంటుంది. కాబటి సత్యాగ్రహి అనగా సాత్విక నిరోధకుడు ఆమరణాంతం కష్టాలను సంతోషంతో ఒప్పుకొంటాడు.

కనుక సాత్విక నిరోధకుడు, ప్రస్తుత పరిపాలనా పద్ధతిని రూపు మాపడానికి, శక్తివంచన లేకుండా పని చేస్తాడు. కాని మనస్సుతో గాని, మాటతో గాని, క్రియారూపంలో గాని, యే ఇంగ్లీషు వానికీ ఎన్నడూ హాని కలుగచేయడు. సత్యాగ్రహాన్ని గూర్చిన ఈ సంగ్రహ వ్యాఖ్యానం, పాఠకున కీ క్రింది నియమాలను అర్థం చేసుకొని వ్యవహరించడానికి సావకాశం కల్పిస్తుంది.

## ఎ. వ్యక్తిగతంగా

౧ సత్యాగ్రహి అనగా సాత్విక నిరోధకుడు మనస్సులో కోపం పెట్టుకోడు.

౨ ప్రత్యర్థి కోపాన్ని భరిస్తాడు.

౩ ఆ సందర్భంలో ప్రత్యర్థి కొడితే పడతాడు; ఎన్నడూ తిరిగి కొట్టడు. కాని కోపంలో యిచ్చిన యే ఉత్తరువుకు, శిక్షా భయంవలన కాని, మరే ఇతర కారణం చేత కాని అతడెన్నడూ లోబడడు.

౪ ఏ అధికారి అయినా సాత్విక నిరోధిని అరెస్టు చేయదలచు కొంటే, ఆయన బుద్ధిపూర్వకంగా అరెస్టుకు లోబడతాడు. తన ఆస్తిని జప్తు చేసి స్వాధీనం వారు స్వాధీన పఱుచుకోవడానికి తీసికొని పోవ[illegible]యన అడ్డగించడు.

౫ సాత్విక నిరోధి సంరక్షణలో ఉన్న ధర్మాదాయాన్ని ప్రభుత్వం వారి స్వాధీనం చేయడానికి ఆయన అంగీకరించడు. అవసరమైతే, ఆ సందర్భంలో ప్రాణాలొడ్డైనా దానిని కాపాడుతాడు. కాని ప్రత్యపకారం మాత్రం చేయడు.

౬ ప్రత్యపకారం అంటే తిట్టడం శపథం చేయడం కూడా చేరుతుంది.

౭ కాబట్టి సాత్విక నిరోధి యెన్నడూ తన ప్రత్యర్థిని అవమానపరచడు. అంతేకాదు, ఇప్పుడు క్రొత్త క్రొత్తగా కల్పింపబడిన నినాదాలలో కూడా, అతడు జోక్యం కలిగించుకోడు. అవి అహింసా తత్వానికి వ్యతిరేకమైనవి.

౮ సాత్విక నిరోధి యూనియన్ జాకును ప్రణామము చేయడు. దానిని అవమానించనూ అవమానించడు. ఆయన యే ఉద్యోగినీ, భారతీయుడు కానీయండి ఆంగ్లేయుడు కానీయండి, అవమానం చేయడు.

౯ పోరాటం మధ్యంలో ఎవరైనా, ఉద్యోగస్తుణ్ణి అవమానపరచినా, కొట్టినా, సాత్విక నిరోధి, అటువంటి ఉద్యోగస్థులను అవమానం నుండి కాని, రక్షించేటందుకు తన ప్రాణాలను కూడా త్యజించడానికి సంసిద్ధంగా ఉంటాడు.

౧౦ ప్రతి సత్యాగ్రహి లేక సాత్విక నిరోధి జైలు ఉద్యోగులయెడ తగు మర్యాదగా ప్రవర్తిస్తాడు. తన ఆత్మ గౌరవానికి భంగం కాని పద్ధతిని జైలు నియమాలను పాటిస్తూంటాడు. జైలు నియమాల ప్రకారం జైలు ఉద్యోగస్తులకు వందనం చేయవలసి వచ్చినప్పుడు, అవమానకరమైన పనిని చేసినీ ఆతడాచరించడు. సర్కారుకు విజయం కలుగుగాక, అనే నినాదాన్ని ఆతడు చేయడు. ఆయన పరిశుద్ధంగా వండి వడ్డింపబడిన ఆహారాన్ని స్వీకరిస్తాడు. కాని అపరిశుద్ధమైన పాత్రలలో ఉంచబడిన ఆహారాన్ని నిరాకరిస్తాడు.

౧౧ తన శరీరాన్ని సరియైన స్థితిలో ఉంచడానికి అవసరం లేని యే అను కూలాన్నీ, అతను కోరడు. తన భౌతిక ఆధ్యాత్మిక శ్రేయస్సుకు కావలసిన అన్ని అనుకూలాలనూ, అతను కోరవచ్చును.

౧౨ తన ఆత్మగౌరవ రక్షణకు కావలసిన అవకాశములు లేవనే కారణం చేత తప్ప, సాత్విక నిరోధి యితర అనుకూలాలు లేనంత మాత్రాన ఉపవాసం చేయడు.

బి. దళంలో

౧౩ దళాధిపతి యిచ్చే అన్ని ఉత్తరువులను తన కిష్టమున్నా, లేకపోయినా సాత్విక నిరోధి సంతోషంతో అనుసరిస్తాడు.

౧౪ అవి ఆయనకు, అవమానకరంగానూ, విరుద్ధాంగానూ, అవివేకంగానూ కనిపించినప్పటికి కూడా, ముందా ఉత్తరువులను అనుసరించి, తరువాత పై అధికారులకు విన్నవించు కొంటాడు. మొట్టమొదట ఆయన చేరే టప్పుడే, ఆ దళం తనకు తగి ఉంటుందో లేదో చూచుకోవడానికి ఆయన కధికారం ఉంది. చేరిన తరువాత దళ నియమాలు, తనకు కష్టంగా ఉన్నా, ఎలా ఉన్నా, వాటికి లోబడి ఉండడం ధర్మం. దళం, మొత్తంపైన సరియైన శక్తివంతంగా లేదని కానీ, అవినీతి కరంగా ఉందని కానీ, ఆయనకు తోచే యెడల తానా దళంతో సంబంధం వదులుకోవచ్చు. కాని అందులో ఉండి మాత్రం నియమ భంగంగా ప్రవర్తించడాని కాయన కధికారం లేదు.

౧౫ తనపైన ఆధారపడి ఉన్నవారి సంరక్షణకు కావలసిన భరణం, ఎవ్వరో యిస్తారని సాత్విక నిరోధి అనుకోకూడదు. ఎప్పుడైనా అటువంటి సావకాశం కలిగితే, అది అకారణంగా సంభవించిం దనుకోవాలి. మామూలు యుద్ధాలలో సమర్పణమై పోతున్న లక్షలకొలదీ జనులు, ముందుగా తమ కుటుంబ భరణాలను ఏర్పాట్లు చేసుకొని పోజాల

కుండా ఉన్నారు. కాబట్టి సత్యాగ్రహంలో అసలే అటువంటి అవకాశం ఉండదనుకోవాలి. అటువంటి సమయాల్లో ఎవ్వరూ ఉపవాసాలు చేయవలసిన అవసరం కలగదనేమాట, అందరికీ అనుభవసిద్ధం.

సి. సాంఘిక పోరాటాలలో

౧౬ బుద్ధి పూర్వకంగా యే సత్యాగ్రహీ కూడా సాంఘిక పోరాటాలకు కారణం కాడు.

౧౭ అటువంటి కల్లోలం కలిగినప్పుడు తానొక పక్షాన్ని చేరడు. కాని యే పక్షాన ప్రత్యక్షంగా న్యాయ్యం కనిపిస్తున్నదో, ఆ పక్షానికి సహాయం చేస్తాడు. హిందూ అయితే ఆయన ముసల్మానుల యెడలనూ ఇతరుల యెడలనూ ఔదార్యంగా ప్రవర్తిస్తాడు. హిందువుల దండయాత్ర నుండి, హిందువులు కానివారిని రక్షించే నిమిత్తం ఆయన ఆత్మ సమర్పణ చేసుకొంటాడు. అవతలి వాళ్ళే పై పైకి వచ్చిన యెడల, తాను ప్రత్యపకారం చేయకుండా, హిందువులను రక్షించడానికి తన ప్రాణాలను ఒడ్డుతాడు.

౧౮ సాంఘిక పోరాటాలకు సావకాశం కలిగించే ప్రతి సందర్భాన్నీ, ఆయన శక్తి వంచన లేకుండా తొలగించే యేర్పాటు చేస్తాడు.

౧౯ సత్యాగ్రహుల ఉత్సవాలలో ఎవ్వరి మత భావాలకు గానీ విరుద్ధంగా ఉండే పనులేమీ వారు చేయరు. ఎవరి మత భావాలకైనా విరుద్ధంగా తోచే యే ఉత్సవాలలోనూ వారు జోక్యం కలిగించుకోరు.

ఈ ఇటీవలి సత్యాగ్రహానికి సంబంధించిన రెండు పత్రాలిచట ఉదాహరించడం ఉచితంగా కనిపిస్తుంది. ఒకటి సత్యాగ్రహీ యొక్క ప్రమాణ పత్రం. రెండు గాంధీ జారీ చేసిన సత్యాగ్రహ నియమావళి.

## 1. సత్యాగ్రహ ప్రమాణ పత్రం

నేను కార్యదీక్షా సత్యాగ్రహిగా చేరదలచు కొన్నాను. నేనీ దిగువ విధంగా ప్రమాణం చేస్తున్నాను.

౧ నేను కార్యదీక్షా సత్యాగ్రహిగా ఉన్నంత కాలమూ వాచా కర్మణా అహింసా యుతంగా ఉంటాను. ఉద్దేశంలో కూడా అహింసా యుతంగా ఉండడానికి ప్రయత్నిస్తాను. భారతదేశ మిప్పుడున్న పరిస్థితులలో, పూర్ణ స్వరాజ్య సంపాదనకు గానీ, హిందువులు, మహమ్మదీయులు, సిక్కులు, పార్శీలు, క్రైస్తవులు, యూదులు - ఈ అందరి మతస్థుల యొక్కయు, జాతుల యొక్కయు, ఐకమత్య సంధానమునకు గానీ, అహింస ఒక్కటే సహకారి కాగలదని నా విశ్వాసం.

౨ ఈ ఐకమత్యంలో నాకు నమ్మకముంది. అందుకోసం నేను కృషిచేస్తాను.

3 అస్పృశ్యతా కళంకాన్ని రూపు మాపడం అవసరమనీ, న్యాయ్యమనీ నా నమ్మకం. కాబట్టి అవకాశం వచ్చినప్పుడల్లా, నిమ్న జాతులతో సన్నిహిత సంబంధం కలిగించుకొని వారికి సేవ చేయడానికి ప్రయత్నిస్తాను.

౪ భారతదేశముయొక్క ఆర్థిక రాజకీయ నైతిక మోక్షమునకు స్వదేశీ అత్యావసరమని నమ్ముతూ, చేతితో వడికి చేతితో నేసిన బట్టను మాత్రమే నేను ఉపయోగిస్తాను. నేను సాధ్యమైనంత వరకు గ్రామ పరిశ్రమలనే వినియోగిస్తాను.

౫ నూలు సక్రమంగా వడుకుతాను.

౬ నా పై అధికారుల ఉత్తరువులను అనుసరిస్తాను. ఈ ప్రమాణ పత్రమునకు విరుద్ధం కాకుండా, పై కాంగ్రెసు సంస్థ యేదైనా గానీ లేక వర్కింగు కమిటీ గానీ, లేక కాంగ్రెసు నిర్మించిన యే సంస్థగానీ చేసే నియమాలను, నిబంధనాలనూ నేను నిర్వర్తిస్తాను.

౭ ఏవిధమైన అసంతృప్తి లేకుండా ఈ ఉద్యమం కోసం, నా దేశం కోసం, ఖైదు అనుభవించడానికి గానీ మరణించడానికి గానీ నేను సంసిద్ధం.
౮ నేను ఖైదు అనుభవించే సందర్భంలో నాకోసం గానీ, నా కుటుంబం కోసం గానీ, నామీద ఆధారపడి ఉన్న ఇతరులకోసం గానీ, కాంగ్రెసు నుంచి ఏ విధమైన సహాయమూ కోరను.

2. గాంధీ యేర్పాటు చేసిన నియమావళి ఇది.

(ఎ) ఎవరుగానీ ముందుగా జిల్లా మేజిస్ట్రేటుకు, స్థలము, కాలము, శాసనోల్లంఘన పద్ధతిని సరిగా తెలియపఱచకుండా శాసనోల్లంఘనం చేయరాదు.

(బి) ఇందుకోసం నగరాలలో బహిరంగ సభలు జఱపకుండా ఉండడం మంచిది. గ్రామాలలో సభలు జఱుపవచ్చును. శాసన నిరోధకుడు పోతూ, త్రోవను పోయేవారందరికీ, ఈ దిగువ నినాదాన్ని, ఆయన అరెస్టు చేయబడే టంతవఱకూ పదేపదే వినిపించడం, ఉత్తమోత్తమమైన, తేలికలోకి తేలికైన పద్ధతి ఆ పద్ధతే నాకెక్కువ యిష్టం. అది నిరపాయ కరమైనది, సంగ్రహమైనది, ప్రయోజనకరమైనది; వాదం అనవసరం. ఆది యుద్ధసమస్య ఒక్కదానిపైననే ప్రజల దృష్టిని కేంద్రీకరిస్తుంది. ఈ ఉద్యమం సమష్టి సత్యాగ్రహంగా మారిపోకుండా ఉండడమే దీని ఉద్దేశం. నినాద మిది : "బ్రిటిష్ యుద్ధ ప్రయత్నానికి మనుష్య సహాయం గానీ ధనసహాయం గానీ చేయడం తప్పు. అహింసా నిరోధంతో అసలు యుద్ధాలన్నిటినీ ఆపివేయడమే ఉత్తమ పద్ధతి" శాసనోల్లంఘనం జరుగవలసిన రాష్ట్రాలలో, అక్కడి భాషలలోకి ఈ నినాదము అనువాదం చేయబడవలెను.

(సి) శాసనోల్లంఘనం ఒక్కరొక్కరుగా చేయాలి. ఒక్కసారే ఒకేచోట ఒకరికంటె ఎక్కువమంది సత్యాగ్రహం చేయకూడదు. సాధ్యమైతే ఈ కార్యక్రమమంతా ఒక్క నెలలో పూర్తి కావాలి.

(డి) శాసనోల్లంఘనం జరుగుతూండగా ఏ విధమైన ప్రదర్శనాలూ ఉండ కూడదు.

(ఇ) మామూలు ప్రకటన మార్గాలన్నీ మూసివేయబడ్డప్పుడు, ప్రతివాడూ తనకు తాను పత్రిక కావడమే మార్గం. సత్యాగ్రహం మామూలు త్రోవలపైన ఆధారపడి ఉండదు; ఉండకూడదు. అవి లేకుండా ఉన్న మాత్రాన మనం నిస్సహాయులమై పోయినట్లు భావించ కూడదు. చాలా వర కవన్నీ, మనకు సంబంధించినంతవరకు ఇప్పటికే మూసివేయబడ్డవి. త్రోవనే పోతూ ఈ పలుకులను పదేపదే పలకడం ఉద్యమాన్ని సాధ్యమైనంత నిరాడంబరంగా చేస్తుంది.

(యఫ్) రహస్యమనేది ఉండనే కూడదు. కాబట్టి సైక్లోస్టైలు వంటి యంత్రాలను ఉపయోగించేవారు, వాటిని పోగొట్టుకోవడానికి తయారై ఉండాలి. ఎక్కువ ప్రతులు కావాలంటే కాంపోజిషన్ ట్రేలు ఉపయోగించ వచ్చు. వాటిని తయారు చేసే పద్ధతిని స్థానికంగా సంగ్రహించ వచ్చును. (తరువాత అ. భా. కాం. సం. కార్యాలయం పంపడానికి ప్రయత్నిస్తుంది.).

(జి) కాంగ్రెసు నిధులను రహస్యంగా దాచ నక్కరలేదు. ప్రభుత్వము వారు వాటిని స్వాధీన పరుచుకోదలచుకొంటే స్వాధీన పరుచుకో వచ్చు. బ్రతుకుతామో చస్తామో తెలియని ఈ పోరాటంలో, మన నిధులనే కాదు యావదాస్తినీ కూడా పోగొట్టుకోవడానికి సిద్ధంగా ఉండాలి. మన ఉద్యమానికి ప్రతిరోజూ కావలసిన ధనానికి, మనం మన దేశీయులపైన ఆధారపడి ఉండడం నేర్చుకోవాలి. కాబట్టి మనం మన అవసరాలను సాధ్యమైనంత వరకు తగ్గించుకోవాలి.

(హెచ్) మనం సాధ్యమైనంతవరకు ఖైదీలలో తరగతి విభజనము లేకుండా చూచుకోవాలి. ఏ సందర్భంలోనూ కూడా పెద్ద తరగతిని గాని

చిన్న తరగతిని గాని అడగ ప్రయత్నించ కూడదు. 'ఏ' తరగతి ఖైదీ తన కీయబడిన ప్రత్యేక సౌకర్యాలను, వినియోగించుకొని తీరాలనే నిర్బంధం లేదు. కాని తన ఆరోగ్యాని కవి అవసరమైతే, వాటిని వినియోగించుకోవడాని కాయన సిగ్గుపడ నక్కరలేదు.

(ఐ) మానవ మర్యాదకు భంగకరంగా ఉండనంతవరకు, జైలు నియమాలను క్రమాన్ని జాగ్రత్తగా అనుసరించ వలసిందే. పని తప్పించుకోవాలని చూడకూడదు. పనికొక గౌరవం ఉందని ప్రతిమనిషీ తెలుసుకోవాలి.

(జె) హర్తాళ్లాలు చాలా తక్కువగా ఉండాలి. మరీ తఱచుగా చేయడం వల్ల వాటి మర్యాద పోతుంది. అవి నిషేధింప బడవచ్చును. మన సాత్విక నిరోధం చాలా పరిమితమైనది. అందటికీ వర్తించేది కాదు.

(కె) కాంగ్రెసు అశాస్త్రీయ సంస్థగా ప్రకటింప బడినప్పటికీ ఏమీ పరవా లేదు. నేను స్వేచ్ఛగా ఉన్నంతవరకు నేనే ఉద్యమాన్ని నడుపుతాను. నేను నిర్బంధింప బడే సందర్భంలో, ప్రజలు అహింసా తత్వాన్ని అస్థిగతం చేసుకొన్నట్లయితే, ఈ ఉద్యమం దానంతట అదే నడుస్తుంది. కాంగ్రెసు వాదులు నిశ్చలంగానూ ప్రశాంతంగానూ ఉండాలి. ప్రతి మనిషీ తనకు తోచినట్లు చేయాలి. తాను శాసనోల్లంఘనం చేయవలె ననుకొంటే రేమీ అభ్యంతరం లేదు. అలా చేయలేకపోతే, నిర్మాణ కార్యక్రమం లోని ౧౩ విషయాలలో ఒకటి గానీ అంతకు మించి గానీ తీసుకొని పనిచేయ వచ్చును. నేను నా తరువాత పని చేయ వలసిన మనిషిని నియమించను. నేను జైలులోపల ఉన్నా, జైలు వెలుపల ఉన్నా, కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమానికి సంబంధించినవారెవరూ శాసనోల్లంఘనం చేయకపోవచ్చును.

(ఎల్) కాంగ్రెసు శాస్త్రీయ సంస్థగా పనిచేస్తూన్నంతవరకు, ఇప్పుడు పని చేస్తూన్న రాష్ట్రీయ కాంగ్రెసు అధ్యక్షులు నిర్బంధింపబడితే, వారి స్థానే కొత్త అధ్యక్షులను ఆ సంస్థ ఎన్నుకో వచ్చును. అలా ఎన్నుకో

బడిన మనిషి, నా అంగీకారం పొందాలి. నా షరతులను ఆయన నిర్వ
ర్తించక పోతే, ఆయనద్వారా పనిచేయడం నాకు కష్టమై పోతుంది.

(ఎమ్) కాంగ్రెసు వాదులు తాము ఫాసిజముకు గానీ, నాజీజముకు గానీ అను
కూలురు కారనీ, ఏ యుద్ధానికైనా తాము ప్రతికూలురే ననీ, కనీసం
బ్రిటిష్ సామ్రాజ్యం పక్షాన నడపబడుతూన్న యుద్ధానికి తాము ప్రతి
కూలురనీ, తమ మాటల లోనూ చేతల లోనూ కూడా స్పష్టం
చేయాలి. బ్రిటిష్ వారు తమ బ్రతుకు కోసం చేసుకొనే ప్రయత్నంలో
వారికి సానుభూతి ఉంది. కాని వారు కూడా పూర్ణ స్వాతంత్ర్యం
పొందిన జాతిలో సభ్యులుగా ఉండాలని కోరుతూన్నారు. కాబట్టి
వారి స్వాతంత్ర్యాన్ని త్యాగం చేసుకొని, బ్రిటనుకు వారు సహాయం
చేస్తారని అనుకో కూడదు. వారి కే జాతిపైనా ద్వేషం లేదు. ప్రపం
చంలో శాశ్వత శాంతిని స్థాపించే నిమిత్తం, వారి ధర్మాన్ని వారు
నిర్వర్తించ కోరుతూన్నారు.

## సత్యాగ్రహ ఖైదీలకు గాంధీ సలహాలు

సత్యాగ్రహ ఖైదీల ప్రవర్తనను గూర్చి అడిగినప్పుడు గాంధీ
1940 లో యిచ్చిన ప్రత్యుత్తరాలు.

౧ ఎక్కువ స్థితిలో నున్న సత్యాగ్రహులు తక్కువ స్థితిలో నున్న తన సోదర
సత్యాగ్రహుల కంటె, ఎక్కువ సౌకర్యాలను (నిరాకరించక) ఎందు
కంగీకరించాలి? ఈ భేద ప్రవర్తనకు వారెందు కసమ్మతి చూపించ
కూడదు? తమ రొండల చూపే ఈ ఎక్కువ మర్యాదను వారు నిరాకరిస్తే
ఒక నేరం కోసం ఒకే చట్టంకిేద శిక్షింపబడిన అందఱు రాజకీయ ఖయి
దీలకూ సమాన ప్రతిపత్తి ఈయవలసిన నిర్బంధం ప్రభుత్వానికి కలగదా?

౨ కొందఱు నియమంగా ఖద్దరు ధరించేవా రున్నారు. వారు ఖాదీ వస్త్రాలు
ధరించడానికి నానా కష్టాలూ పడుతున్నారు. వారు రాజకీయ ఖయిదీ

లయినప్పటికీ వారికి ఖాదీ ఇయ్యడం లేదు. అటువంటి పరిస్థితులలో వారేమి చేయాలి?

౩ హృదయ పూర్వకంగా కాంగ్రెసు వాదులు కానివారు కాంగ్రెసును ఉపయోగించుకొని, స్థానిక సంస్థలలోని అధికారాలలోకి మరికొన్ని అధికారాలలోకి దూరి, కాంగ్రెసు ప్రతిష్ఠను కించ పరుస్తూంటే యేమి చేయాలి!

జవాబులు

సేవాగ్రామం, వార్ధా, ౨౭-౧౧-౪౦.

౧ 'ఏ' క్లాసు ఖయిదీలు తమ ఆరోగ్య క్షేమాలకు అవసరమైనంత వరకే సౌకర్యాలను గ్రహించాలి. ఇతరులే సందర్భాలలోనూ గొణుగుకొంటూండరాదు.

౨ జైలులో ధరించడానికి ఖద్దరీయకపోతే ఖయిదీ ఉపవాసం చేయరాదు.

౩ ఏ ఉద్యమంలోకైనా సరే దొంగలను రానీయకుండా చేయడానికి అన్నప్పుడెల్లా సాధ్యం కాదు.

## వ్యక్తి సత్యాగ్రహం యొక్క అవకాశం

### కొన్ని ప్రశ్నలకు గాంధీ ప్రత్యుత్తరాలు

కలకత్తా, నవంబరు ౨౪, ౧౯౪౦

ప్రియమైన మహాత్మాజీ,

ఫార్వర్డ్ బ్లాకుకు సంబంధించిన కాంగ్రెసు వాదులు, సత్యాగ్రహం ద్వారా ప్రారంభించబడిన మీయొక్క ఈ క్రింది విషయాలను త్వరగ తెలుసుకోవాలని కోరుతున్నారు:

౧ మీరు ప్రారంభించిన వ్యక్తి సత్యాగ్రహానికి వాస్తవికోద్దేశ మేమిటి?

౨ (అ) మీరు వైస్రాయిని దర్శించిన సందర్భంలో సెప్టెంబరులో సెలవిచ్చి నట్లు, మాటకూ వ్రాతకూ, ప్రతి మనిషికీ స్వాతంత్ర్యం ఉండవలెననేనా ఈ ఉద్యమాన్ని ప్రారంభించింది?

(ఆ) లేక ఇది కేవలం యుద్ధ వ్యతిరేక ప్రచారం కోసం స్పష్టంగా ఉద్దేశింప బడిందా?

(ఇ) లేక సంపూర్ణ స్వరాజ్య సమస్యను గూర్చియా?

3 ఈ ఉద్యమం వర్కింగు కమిటీ, అ. భా. కాం. సం. కేంద్ర రాష్ట్రీయ సభల సభ్యులకు మాత్రమే నని పరిమితి యేర్పాటు చేయబడిందా?

(అ) అలా కాకపోతే ఇంకా ఎవరెవరీ ఉద్యమంలో పాల్గొనడాని కర్హులు?

౪ ఈ ఉద్యమాన్ని ఏ దశలోనైనా ప్రజా సామాన్యానికి వ్యాపింప చేసే ఉద్దేశం మీ కార్యక్రమంలో ఉందా?

దయచేసి తక్షణం ప్రత్యుత్తరంవ్రాస్తే చాలా కృతజ్ఞులం. నమస్కారాలు.

సెలవు మహాత్మాజీ,

మీ విశ్వాస పాత్రుడు.

## గాంధీ జవాబు

సేవాగ్రామం, వార్ధా, (సి. పి.) నవంబరు ౨౮.

ప్రియ మిత్రమా!

వాక్స్వాతంత్ర్యం లేకనా స్వాతంత్ర్యముల కోసమే వ్యక్తి సత్యాగ్రహము ప్రారంభింప బడెనదనే మాట నిస్సందేహం. కాని ప్రతి ఉద్దేశము యొక్క కొట్టకొనమూ భారత స్వాతంత్ర్య సమస్య ఉండనే ఉంది. ఈ ఉద్యమ పరిమితి మొట్టమొదట్లో ఇద్దరు ముగ్గురి వరకే ఏర్పాటు

చేయబడింది. తరువాత మీరు పేర్కొన్న మూడు సంఘాల సభ్యులలో నేను కోరుకొన్న వారికి కూడా విస్తరింప చేయబడ్డది. నేను రాష్ట్ర కార్య సంఘాలలోని రాష్ట్రీయ, జిల్లా, ఫిర్కా, తాలూకా, పట్టణ సంఘాలలోని సభ్యుల జాబితాలను తరగతులుగా యేర్పాటు చేసి పంప మన్నాను. కాని ఏ విధంగా విస్తరింప చేయబడినప్పటికీ ఇది ప్రజా సామాన్యోద్యమంగా మాత్రం పరిణమించదు. నేనూహించ గలిగినంత వరకిది వ్యక్తి సత్యాగ్రహం గానే ఉంటుంది. నా షరతులను నిర్వర్తించిన వారికి మాత్రమే వర్తిస్తుంది. మీ ప్రశ్న లన్నిటికీ ఈ జవాబు సరిపోతుం దనుకుంటాను.

మీ విశ్వాస పాత్రుడు.

## సత్యాగ్రహ ప్రదర్శనాలు వద్దు
## సాత్విక నిరోధకులకు గాంధీ జవాబు

బీహారు మాజీ ప్రధాని శ్రీకృష్ణసిన్హా నిర్బంధింప బడినప్పుడు జరిగిన సంఘటనను గూర్చి బాబూ రాజేంద్ర ప్రసాదు వ్రాయగా, "సత్యాగ్రహం చేసే విషయం ప్రజలకు తెలియపర్చ నక్కరలేదు. అధికారులకు తెలియపరిస్తే చాలు. సత్యాగ్రహ సందర్భంలో బహిరంగ ప్రదర్శనాలు కూడవు" అని గాంధీజీ ఆయనకు సలహా యిచ్చారు.

ఉద్యమం కొంత దూరం బాగా సాగినతరువాత, ఈ దిగువ షరతులను అక్షరాలా అనుసరించిన వారే సత్యాగ్రహం చేయ డాని కర్హులని గాంధీ స్పష్టీకరించాడు.

౧ వారు నిత్యమూ క్రమంగా నూలు వడికే వారుగా ఉండాలి.

౨ వారికి ఖాదీ కట్టడం నిత్య వ్యవహారంగా ఉండాలి.

౩ వారికి సాంఘిక ఐకమత్యము నందూ, అంటరాని తనమును అన్ని రూపాల లోనూ రూపు మాపడమునందూ విశ్వాస ముండాలి.

४ గ్రామ పరిశ్రమలకూ స్వదేశీని అన్ని విధాలా ప్రోత్సహించడం అవసరమని వారు నమ్మాలి.

౫ అహింస లేకుండా లక్షలాది ప్రజలకు స్వరాజ్యం లభించదని వారికి విశ్వాస ముండాలి.

౬ అ. భా. కాం. సం. వారి బొంబాయి తీర్మానంలో వారికి నమ్మకముండాలి.

౭ పైన చెప్పిన అన్ని విషయాలకూ అహింసకూ తీరని సంబంధ ముందని వారు నమ్మాలి.

కేవలం క్రమశిక్షణ కోస మెవ్వరూ ఖైదుకు పోనక్కరలేదని గాంధీ గట్టిగా వ్రాశారు. శాసనోల్లంఘనం క్రమశిక్షా సంబంధమైనది కాదు; అనుల్లంఘనీయ మైన విశ్వాసానికి సంబంధించి ఉందది. శాసనోల్లంఘనము యొక్క అవసరాన్ని గమనించని వా రెవ్వరూ ఆ పనిని అవలంబించ వలెనని కాంగ్రెసు కానీ గాంధీ కానీ అనుకోనైనా లేదు. వట్టి నియమాను సరణం కోసం శాసనోల్లంఘనం చేసినట్లుగా చెప్పడం, కాంగ్రెసు వాదికి లజ్జాకరమని గాంధీ అభిప్రాయం. కాంగ్రెసుకు అంటీ అంట నట్లుగా, పని చేసీ చేయనట్లుగా నటించడం వల్ల, మనం మన ఆదర్శాన్ని అందుకోలేము; ప్రయోజనం లేదని కూడా గాంధీ అనేక సార్లన్నాడు.

నిర్మాణ కార్యక్రమంలో పనిచేసే వారంతా కూడా శాసన నిరోధకుల వంటివారే. తాము శ్రద్ధతోనూ విశ్వాసంతోనూ చేసే సేవవల్ల, సందేహాస్పదులైన శాసన నిరోధకుల

కంటె కూడా వారు శాసనోల్లంఘనానికి ఎక్కువ దోహదం చేస్తూన్నారు. నిర్మాణ కార్యక్రమ రూపంలో దేశీయుల సహకారం ఉంటే శాసనోల్లంఘనం అప్రతిహతంగా మనను మన ఆదర్శ సీమకు తీసికొని పోగలదు. మన పోరాటానికి గుణం ప్రధానం కాని సంఖ్య ప్రధానం కాదు. రెండూ ఉంటే మరీ మంచిది.

# అధ్యాయము 6

## సత్యాగ్రహము - దాని నైపుణ్యము

త్రాను సంఖ్యలతో మునిగిపోతున్నానని గాంధీ అంటూంటాడు. ఇది కొంత లోక విరుద్ధంగా కనిపిస్తుంది. జైలుకు వెళ్ళేవాళ్ళు గాని సంఘంలో చేరేవాళ్ళు కాని ఎంత తక్కువమంది ఉంటే అంత సంతోష మాయనకు. ప్రతి వ్యక్తి యొక్క ఆత్మా పర మాత్మలో భాగమనీ, అందువల్ల ఆయన జగత్తు యొక్క సూక్ష్మ స్వరూపమనీ గాంధీ నమ్మకం. ప్రతి వ్యక్తికీ మొవరికి తగిన పవిత్రత వానికి ఉంది. కాని గాంధీ, ఆయన కోరిన కొద్ది మందే కావాలంటాడు. వారు "అకలంక బ్రహ్మచర్య వ్రత మవలంబించాలి; పేదరికాన్ని కోరి తెచ్చుకోవాలి; సత్యాన్ని అనుసరించాలి; నిర్భీతిని అలవాటు చేసుకోవాలి." ఆయన ఆధ్యాత్మిక చింతలో భౌతిక శరీరాన్ని మఱచిపోలేదు. "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం" అనే పూర్వఋషుల సూత్రాన్ని, వారివలెనే ఆయన కూడా గమనిస్తూ ఉంటాడు. అందువలననే ఆయన ఆర్థిక శాస్త్రంలో పేదల కూడు గుడ్డలు చాలా పెద్దస్థానాన్ని ఆక్రమిస్తున్నాయి. ఇందుకోసం ఆయన మధ్య తరగతుల జీవిత ప్రమాణాన్ని తగ్గించ కోరుతాడు. కొందఱి జీవితావసరాలను ఎక్కువగా పెంచుకొని, లక్షలాది ప్రజల జీవిత ప్రమాణాన్ని శూన్యందాకా తగ్గించడం ఆయనకు గిట్టదు. "ఓ ఆత్మా! తిని తాగి హాయిగా ఉండు" అనే వేదాంతం ఆయనది కాదు. తినేదీ తాగేదీ శరీరం, ఆనందమనుభవించేది ఆత్మ. మానవ

శరీరానికి అతి నిరాడంబరమైన ఆహారము, మానవాత్మకు, అత్యుదాత్తమైన ఆనందమూ కావాలని ఆయన ప్రయత్నం. కాబట్టి రైతును పాలీని తిరిగి తొలినాటి ఉన్నత స్థితిలోకి తీసుకొని రాగోరుతూన్నాడాయన. ముందీ సంస్కరణాన్ని తనతోనే ప్రారంభించాడు. కాబట్టే ఆయన వృత్తి "వ్యవసాయమూ నేత" అని చెప్పుకొంటాడు. నూలు వడకడం నేతకు ముందుగా జరుగవలసిన పనే గనుక, ఆయన నిజంగానూ ఆలంకారికంగానూ కూడా వడుకుతూ ఉంటాడు. అందువల్లనే పి. జి. బ్రిడ్జి

"జాతియొక్క భవితవ్యాన్ని నిజంగా వడుకుతూన్నద మహాత్మాజీ" అన్నాడు.

ప్రపంచ భవితవ్యాన్నే అంటాము మేము. రాజకీయం చదరంగపు ఆటవంటిదంటారు. అందులో ఎత్తును బట్టి పై ఎత్తు ఉంటుంది. పేకాటవంటి దంటామా పేకాటలో ప్రతివాడూ పక్కవాడి ముక్కలను ఓరగంటితో చూడాలని ఆతుర పడతాడు; లేకపోతే ఆ ముక్క లేవై యుంటవో ఊహించడానికైనా ప్రయత్నిస్తాడు. గాంధీ మాత్రం ఆలా చేయడు. ముందు తన ఎత్తులను నిర్ణయించుకొని ప్రత్యర్థిని స్వరక్షణలో పెడతాడు; తన పేక చూపించి ఆడతాడు. కల్లా కపటమూ ఏమీ లేదు. సత్యాన్ని మించిన రాజనీతి గానీ అహింసను మించిన రాజకీయ నైపుణ్యము గానీ లేదాయనలో.

ఆయన ఏమి చెప్పినా నీలోని ఉన్నతాత్మకు చెబుతాడు. ఆయన ఉపవాస వ్రతం వల్ల హిందూ అంతరాత్మను చీవుక్కుమనిపించి, సరియైన మత మార్గంలో పెట్టడానికి ప్రయత్ని

స్తాడు. ఆయన ఆత్మ ప్రపంచానికి బాగా తెలుసు. మౌన వ్రతము యొక్కయు ఉపవాస వ్రతము యొక్కయు శక్తిని ఎలా వినియోగించాలో ఆయనకు తెలుసు.

యఫ్. జి. జేమ్సు ఇలా అన్నాడు:

బాధపడడం ప్రేమించడం ఈ రెండూ "నాటి క్రీస్తు నేటి క్రీస్తు" (మహాత్మా గాంధి) తమతమ కాలాలలో బహిర్గతం చేసిన మహాత్తమ విషయాలు.

పురాణ జీసస్ వలెనే గాంధీ కూడా ప్రేమయొక్క మహా శక్తిని గుర్తిస్తూన్నాడు. జీసస్ సిద్ధాంతాలనే గాంధీ ఇంకనూ ఎక్కువ విస్తృతంగానూ ఇంకనూ ఎక్కువ పెద్ద ఆదర్శం కోసమున్నూ ప్రయోగిస్తూన్నాడు. ఆయన "భూలోక స్వర్గాన్ని" భావిస్తూన్నాడు.

## నేటి క్రీస్తు

ఆయన నేటి క్రీస్తు అనే విషయంలో ఎవ్వరికీ వివాదం లేదు. అందఱూ ఇదివరకే ఒప్పుకొన్న విషయానికి మన అంగీకార మనవసరం. కాని "ఆయన మళ్ళీ తిరిగి వచ్చినట్లుగా మన మాయనను గుర్తించాలా" అనేదే మానవలోకం నేడు విచారిస్తూన్న సమస్య.

ఆల్బర్టు ఈన్‌స్టీన్ ఇలా అన్నాడు:

గాంధీ పరాధీన జాతియొక్క మోక్షం కోసం అతి నూతనమైన, కరుణా పూర్ణమైన ఉపాయాన్ని కనిపెట్టాడు. తరువాత తన సొంత ఉదాహరణం వల్ల తన ప్రజలలోని నైతిక శక్తుల నన్నిటినీ ఒకసారిగా విజృంభింపచేసి వారిని శక్తివంతులనుగా చేశాడు.

గాంధీ యుద్ధనీతి ఒకప్పుడు కత్తిని ఒరలో పెట్టమంటుంది. మఱొకప్పుడు ఒరనుండి పైకి లాగమంటుంది. ఒకప్పుడు కౌన్సిళ్లు బహిష్కరించడం, మఱొకప్పుడు ప్రవేశించి పనిచేయడం, తరువాత వాటిని విడిచిపెట్టి రావడం,- ఇవన్నీ గాంధీ యుద్ధనీతిలో భాగాలే. మారణ యంత్రాలు లేని ఈ మాదిరి నైతికయుద్ధం, అప్రతిహత మైనదని స్మట్సు సేనాని అంగీకరించాడు.

ఎవరైనా మన వ్యవహారాల లోకి అనవసరంగా వచ్చి బలాత్కారంగా దూరితే, అక్కడ నుండి తాత్కాలికంగా గాని ఎప్పటికీ గాని వైదొలగడమే సత్యాగ్రహి అవలంబించ వలసిన పద్ధతి. పూర్వకాలంలో దుష్టుల రాష్ట్రాలలో నుండి జనమంతా లేచిపోతూండేవారు. పీడిత ప్రజలకు గాంధీ ఇచ్చే సలహా అదే. ఒరిస్సాకు తూర్పు యేజన్సీలో నున్న నీలగిరి రాజ్యంలోని ప్రజలు, గాంధీ సలహా ప్రకారం రెండుసార్లలా చేశారు. ఆ యేజెన్సీలోనే ఉన్న టాల్చేరు మొదలగు రాజ్యాల ప్రజలు కూడా తమ ప్రభువుల క్రోధాగ్ని నుండి తప్పించుకోవాలని లేచి పాఱిపోయినాడు. ఇరవై సంవత్సరాల కిందట ప్రజలసమ్మతి చూపినప్పటికీ, వారి ఇష్టానికి వ్యతిరేకంగా, చీరాల పేరాల గ్రామాలను మున్సిపాలిటీగా చేసినప్పుడక్కడి వారా మున్సిపల్ సరిహద్దులలో నుండి లేచిపోయి పదకొండు నెలలు వేరే కాపురమున్నారు. 1928 పన్నుల నిరాకరణోద్యమంలో బార్డోలీ ఆనంద తాలూకాల లోని రైతులు బరోడా రాజ్యం లోకి లేచిపోయినారు.

## గాంధీయొక్క సేవాతత్వం

గాంధీ చేసే సేవ, యేదో అనుగ్రహ భావంతో చేసేది కాదు. విశాల మానవ జీవితంలో తానొక అణువు వలె అభేదంగా లీనమై సేవించ వలెనన్నే తత్వమాయనిది. వరదలు కానీయండి భూకంపం కానీయండి ఆయన దృష్టిని ఆకర్షిస్తుంది; ఉన్మాదుడు కానీయండి; పతిత స్త్రీ కానీయండి ఆయనకు కనికరం కలుగుతుంది. నూలు వడికే హిందువైనా సరే నేసే మహమ్మదీయుడైనా సరే ఆయన హృదయానికి ఒకటే విధమైన సంతోషం కలిగిస్తాడు. సమ భూములలో ఉన్న నాగరికు డొకప్పుడు, గుహలో నుండి తరిమివేయ బడుతూన్న అడవి మనిషి ఒకప్పుడు ఆయన భావాలను అరికడుతూంటాడు. అధఃపతితుడైన అస్పృశ్యు డొకప్పుడూ, ఆకలితో అణిగిపోతూన్న హిందూ కులీను డొకప్పుడూ ఆయనకు జాలి కలిగిస్తూంటాడు. ఈ చెప్పిన వారిలో ప్రతి ఒక్కరూ కూడా ఎప్పుడూ ఆయన సేవకు అర్హి కారులైనట్లుగానే భావిస్తూంటారు. గాంధీ ఆశ్రమానికి వచ్చి సహాయం కోరిన కుష్ఠురోగి కాయన సేవాగ్రామంలో ఇల్లూ చోటూ ఇచ్చాడు. అంతే కాదు, సైన్యాలు గానీ యుద్ధసామగ్రి గానీ లేకుండా ఉండే ఆయన స్వరాజ్య ప్రణాళికలో, అతనికి పని కల్పించాలని కూడా గాంధీ ఆశ. అప్పు డాచరణలోకి వచ్చే శాంతి సైన్యంలో అతను చేరి, అవసరమైతే మాతృదేశ రక్షణార్థం కాల్చి బడడానికి సంసిద్ధమై కూడా సేవ చేసే అవకాశం అతనికి కలిగించ కోరుతున్నాడు గాంధీ.

న్యాయ్యం కంటె బలమే సాగిపోతూన్న రోజులలో స్వప్రయోజనాలను రక్షించుకోవడానికి శరీరబలం ఎక్కువ కావాలి. "బలం కలవాడిది భాగ్యం" అనే సామెత సామాన్యపు సామెతే కాని అందులో సత్యం చాలా ఉంది. కాబట్టి న్యాయ్యం, బలాన్ని ఎదుర్కొంటూన్నది అంటే, అది కొందరి స్వప్రయోజనాల నెదుర్కొంటూన్న దన్నమాట. గాంధీ జీవిత మంతా ఎప్పుడూ స్వప్రయోజనాల నెదుర్కోవడమే. దక్షిణ ఆఫ్రికాలో తెల్లవాళ్ళను, చాంపరాలో తోట యజమానులను, ఖైరాలో నిరంకుశ ప్రభుత్వమును, బోర్సాదులో పోలీసులను, అహమ్మదాబాదులో మిల్లు యజమానులను, హిందువులలో సవర్ణులను, భారత దేశంలో బ్రిటిషు సామ్రాజ్య తత్వాన్ని ఎదుర్కోవడం వాళ్ళ వాళ్ళ స్వప్రయోజనాల నెదుర్కోవడమే అవుతుంది. కాబట్టి ఆయన కార్యక్రమం ఎవరినో ఒకరిని ఎప్పుడో ఒకప్పుడు బాధించనే బాధించింది. విద్యార్థి, అధ్యాపకుడు లాయరు, డాక్టరు, ఉద్యోగస్థుడు, కల్లు దుకాణదారు, పెట్టుబడిదారు, సనాతన ధర్మపరుడు, వర్తకుడు, ముఖ్యంగా నిరంకుశాధికారి- వీరంతా బాధింప బడ్డవారే. కాని ఆయన ఎదుర్కొన్న ప్రతి విషయమూ న్యాయ్యమని అంగీకరింప బడడమే కాకుండా, తరువాత అందుకు తగిన పరిహారం జరిగినందు వలన కూడా అది ధర్మంగా స్థిరపడ్డది. బ్రిటిష్ కామన్ వెల్తులో ఇండియా స్వతంత్రం గానూ సమభాగి గానూ ఉండేటందుకు బ్రిటిష్ ప్రభుత్వం వారు తమ 1940 ఆగస్టు 8 వ తేదీ ప్రకటనలో అంగీకరించనే అంగీకరించారు. కాని ఇండియా

స్వాతంత్ర్య ప్రకటన కోసం పోరాడుతూన్నది. భవిష్యద్ద్రష్ట లందఱూ చపల చిత్తులని నిందింప బడడం జరుగుతూ వచ్చింది. వారు, తాము జన్మించ వలసిన కాలం కంటె ముందు జన్మించారు. నాస్తికులుగా పరిగణింపబడి హత్య చేయబడడం వారి విషయంలో పరిపాటి అయిపోయింది. వారు స్వధర్మం కోసం ప్రాణాలను సమర్పిస్తున్నారు. వ్యర్థ విమర్శలతో ద్వేషింపబడు తూన్నారు. కాని కొద్ది కాలంలోనే వారు మార్గోప దేశకు లవుతూన్నారు. అయితే గాంధీ విషయంలో అలా కాదు. సాక్రెటీస్ విషపాత్ర కాని గియార్డానో బ్రూనో (Giordano Bruno) అరిస్టాటిల్, లావాయిజర్ (Lavoiser) వంటి శాస్త్ర జ్ఞుల నెదుర్కొన్న వధ్యశిల, ఉరికంబాలు, శూలములు గానీ గాంధీ నెప్పుడూ ఎదుర్కోలేదు. ఎదుర్కోవడానికి సిద్ధంగానూ లేవు. ప్రపంచ ప్రవక్తగా అంగీకరింపబడి, తాను చేసిన వాగ్దానాలను సమర్థతతో చెల్లించుకొని, తన కార్యక్రమంలో చాలా వరకు విజయం పొందిన గొప్ప అదృష్టం ఆయన కొక్క డికే పట్టింది. మఱి యెక్కువగా అనేవారు, ఆయన భావ ప్రపం చంలో విహరిస్తాడన్నారు. అవును నిజమే, ఋషుల కుండవల సిన దివ్యదృష్టి భవిష్యత్తు లోకి చొచ్చుకొని పోయి చూడగలిగిన భావం- లేనిదే యే మహాత్కార్యమూ యెన్నడూ జరుగలేదు. పూర్వాచార పరాయణత్వముతో, పాత సంప్రదాయములతో కుంగిపోతూన్న యుగంలో, అటువంటి ఋషులూ ప్రవక్తలు, కొత్త భావాలు, కొత్త ఆదర్శాలు, కొత్త నడవడికలూ ప్రవేశ పెట్టడానికి పోరాడుతూనే ఉంటూరు, ఇవ్వాళ జరిగిన నైతిక

యుద్ధాలు రేపటికి చరిత్రగా పరిణమించి, ఎల్లుండికి ధర్మ శాస్త్రం గానూ, స్మృతి ప్రమాణం గానూ పరివర్తనం పొందుతయి. ప్రతి యుగములోనూ కూడా మార్పు జరుగుతూనే ఉంటుంది. అందులో మన యుగం మరీ ప్రత్యేక విలక్షణంతో విలసిల్లు తూన్నది. మానవ విశ్వాసముల లోనూ, మానవ ప్రవర్తనము లోనూ కూడ, పునాదుల నుండీ పరివర్తనము కలుగుతూన్నది. ప్రజల ఆత్మలు శూన్యములై పోయినవి. ఆ శూన్యంలోకి ప్రాపంచిక భూతాలూ ప్రవేశించినవి. గాంధీ అహింసా ఉద్యమము నూతన ప్రయోగ మన్నమాట నిజమే. గాంధీ తన స్వీయ చరిత్రకు "నా సత్య పరిశీలనములు" అని నామకరణం చేశాడు. కాని "నిజమైన నైతిక సిద్ధాంతాలు, అనుభవం వలన అందఱికీ వర్తించేటట్లు వ్రాయబడిన సూత్రాలు మాత్రమే" నని మనం మఱచిపో కూడదు. గాంధీ నిగూఢంగా చెప్పిన విషయాన్నే, జాన్ మార్లే వివరంగా ఇలా చెబుతూ న్నాడు :

> మానసిక స్తబ్ధత్వాన్ని, జడత్వాన్నీ ఒక సుగుణంగానూ, భావ సంకుచిత తత్వాన్ని ఒక పవిత్రత గానూ తలంచే యుగంలో జీవిస్తూన్నాము మనం.

ఈ నైతిక సిద్ధాంతాలను ఇంకొక అడుగు అటూ ఇటూగా నిర్ణయిస్తే చాలు, ఆ నిర్ణయం కాపట్యానికికూడా దారి తీస్తుంది. జీవితమంతా అరలూ మరలూ అయిపోయింది. దేవాలయంలో హేయంగా భావింపబడి నిషేధింపబడిన అసత్యం, కోర్టులలో తప్పు కానట్లు తలంప బడుతూన్నది. నైతిక సిద్ధాంతాల

శాశ్వత సత్యం కొన్ని పరిస్థితులలో కొన్నిచోట్ల మాత్రమే అనుసరింపబడ తగిన దంటూన్నాము. గాంధీ అలా కూడ దంటాడు. ఆయన దృష్టిలో జీవితంలో అరలూ మరలూ లేవు; అది అవిభాజ్యము; నీతి ఎటు తిప్పితే అటు తిరుగదు. ఎప్పుడూ ఒకే తీరుగా ఉంటుంది. గుణా గుణాలు ఒకదానిపైన ఒకటి ఆధారపడి ఉండక స్వతంత్రంగా ఉంటవి. సత్యం సోరణ గండ్లలో నుండి క్రమక్రమంగా తొంగి చూస్తుంది. కాని ఒక్క సారిగా సూర్యోదయం వలె మనకు ప్రత్యక్షం కాదు. కాబట్టి రాజకీయానికీ మతానికీ, మతానికీ నీతికీ, నీతికీ సంఘమర్యాదకూ, సంఘ మర్యాదకూ అంతరాత్మకూ ఉండే భేదాలను తుడిచిపెట్టి వేసే నూతన మతసిద్ధాంతం ప్రచారంలోకి తీసికొని రాబడింది. సిద్ధాంతానికీ తాత్కాలి కావసరానికీ, తత్క్షణలాభ సౌకర్యా లకూ ముందెప్పుడో కలిగే శాశ్వత క్షేమానికీ, నిరంతర యుద్ధం జరుగుతూంటుందనే మాట అంగీకరిస్తే గాంధీ చేసే పోరాటం యొక్క మూలం అర్థమవుతుంది. రాజనీతి ఆచరణ యోగ్యం గానూ అందరికీ వర్తించే టట్లుగానూ ఉండాలనే సూత్ర మవ లంబించి "మిన్ను విరిగి మీద పడ్డాసరే సత్యానికీ న్యాయ్యానికీ కట్టుబడి ఉండాలి" అనే సుభాషితానికి భిన్నంగా ప్రవర్తించ కూడదని గాంధీ అభిప్రాయం. కాని సమయం వచ్చినప్పుడు నిరపాయ కరములైన రాజీలకు అంగీకరించక కార్యభంగం కావించుకొనే పిచ్చి పట్టుదల కలవాడు కాడాయన.

మార్లీ ఆయనను గూర్చి ఇలా అన్నాడు:

ఆయన చతురుడే కాని కుయుక్తిపరుడు కాడు. మితభాషే కాని కపటి కాడు. నెమ్మది మనిషి కాని మందుడూ కాడు, భీరువూ కాడు. సక్రియ స్వాతంత్ర్యం, నిష్కళంకమైన ప్రజా పరిపాలనం, కాదనడానికి వీలంలేని వ్యక్తి స్వాతంత్ర్యంతో కూడిన నిరంతర శాసన విధేయత- ఇవి ఆయన నీతి సూత్రాలు.

బుద్ధి బలం, ప్రేమ బలం, ఇచ్ఛా బలం, ఈ మూటినీ సమన్వయం చేసుకోగలిగిన జీవితాన్ని మనం ఉచిత జీవిత మంటాము. గాంధీ అటువంటి జీవితాన్నే అంగీకరిస్తాడు. అప్పుడు "ప్రేమకు విరోధమైన విషయాలను బుద్ధి సూచించదు. అది కావాలన్న విషయాలను నిషేధించదు. ఇచ్ఛ, బుద్ధీ ప్రేమా ప్రేరేపించే ప్రవృత్తుల కనుగుణంగా నడుస్తుంది." నైతిక దోషంవల్ల కలిగే చెడుగు స్థానికంగానే ఉంటుంది కాని ఇతరచోట్లకు వ్యాపించదని ఆయన విశ్వసించడు. జాతీయ సహజ లక్షణాలకు భిన్నమైన సిద్ధాంతం ఆ జాతియొక్క శాంతి అభ్యుదయములకు తోడ్పడుతుందనే పిచ్చి నమ్మకం ఆయనకు లేదు.

## రహస్యం లేని రాజకీయ చతురత.

సత్యాగ్రహ మూలపురుషుడు, తన జీవితంలోనూ కాంగ్రెసు చరిత్రలోనూ ఇంతకు పూర్వం నుడువబడిన సిద్ధాంతాల కనుగుణంగా, ఆ ఉద్యమాన్ని నడపిన నైపుణ్యాన్ని గూర్చి, ఇక్కడ కొంత చెప్పవలసి ఉంది. గాంధీ దురాశపరుడని వెఱ్ఱివాడైనా అనుకొంటే అది పొరపాటు. ఆయనను అజేయుడనాలి. ఆయన

అజేయత్వానికి గల రహస్యకారణ మేమిటి? భారతీయు లాయన లోని ఆ సుగుణాన్ని గ్రహించక మునుపు లేక ఒప్పుకోక మునుపు, ఇరవై యేండ్లకిందట గిల్బర్టు ముర్రే పండితుడీ విధంగా వ్రాశాడు :

ఇంద్రియ భోగాలను కానీ, శారీరక సుఖాలను కానీ, స్తుతిని కానీ పదవిని కానీ లక్ష్యపెట్టక, కేవలం తాను న్యాయ్యమని నమ్మిన పనిని చేయ నిశ్చయించుకొన్న మనిషితో వ్యవహరించే టప్పుడు జాగ్రత్తగా ఉండాలి. అటువంటి మనిషి అపాయకరమైన ప్రబల శత్రువు. ఎందు వల్ల నంటే, ఆయన శరీరాన్ని నీ వెప్పుడైనా జయించ వచ్చును. కాని ఆత్మ స్వాధీనం కాదు.

కాబట్టే గాంధీ తన రాజనీతిలో రహస్యం లేకుండా చేశాడు. సత్యాహింసలపైన ఆధారపడిన రాజనీతి బహిరంగంగా ఉండక తీరదు. రహస్యం తన రాజనీతికి శత్రువని ఆయన భావం. ఆయన వేయబోయే ఎత్తులమూ ఉద్దేశాలమూ అను కూలమూ శత్రువుకు తెలుపుతూనే ఉంటాడు. అందువల్లనే ఆయన టెరరిస్టు ఉద్యమాన్ని నిరసించాడు. అందులోని రహస్య భావమూ దౌర్జన్య గుణమూ కూడా ఆయనకు గిట్ట నివి. అయితే టెరరిస్టులతో (విప్లవకారులతో) తాను మాట్లాడి వారిని మార్గమునుండి తప్పించ కోరినాడు. అదేవిధంగా 1932 లోని దౌర్జన్య రహిత సత్యాగ్రహోద్యమం కూడా, రహస్య మార్గాలను పడుతున్నదని తెలిసి నిరసించాడు.

సత్యాగ్రహానికి మూలం : సత్యమునందు పట్టుదల గలిగి ఉండడమే. సత్యాగ్రహులు స్వాతంత్ర్యోద్యమంలో పట్టిన నే

తోడి తోటమాలీల వలె పోలీసుతో కలసి, వారి కార్యక్రమాన్ని ముందుగా పోలీసుకు తెలియపరుస్తూండేవారు. కాని రహస్య పద్ధతుల వలన 1932-33 ఉద్యమం యేవిధంగా కళంకితమైనదో, 1934 లో ఉద్యమాన్ని ఆపివేస్తూ గాంధీ రహస్య పద్ధతుల నేవిధంగా ఖండించాడో అందరికీ తెలిసిన విషయమే. ఉద్యమం బాగా నడుస్తూన్నప్పుడు, గవర్న్మెంటు దాని లోతుపాతు లన్నీ తెలుసుకొని దాన్ని సాగనీయకుండా చేశారు. అనుకో కుండా తటస్థించిన అటువంటి అడ్డంకులనుండి తప్పించుకోవ డానికి, ఉద్యమాన్ని రహస్యంగా సాగించడం ఉత్తమమని తరు వాత వచ్చిన సత్యాగ్రహ దళముల వారున్నూ, జైళ్ళనుండి ముందుగా విడుదల చేయబడ్డ వారున్నూ తలంచారు. ఇది మేము సిగ్గుపడుతూ నైనా ఒప్పుకోక తప్పదు. కాంగ్రెసు అశా స్త్రీయ సంస్థగా ప్రకటించ బడినప్పుడు, కలకత్తాలోనూ, ఢిల్లీ లోనూ కాంగ్రెసు మహాసభలను జరిపేటందుకు ప్రతినిధులుగా పోయినవారు పట్టుబడకుండా ఉండడానికి, విదేశీ బట్టలలో ప్రయాణం చేయడం విపరీతంగా కనిపించలేదా రోజులలో. ఉద్యమానికి సంబంధించిన సాహిత్యాన్ని రహస్యంగా పంచి పెట్టడం, టైపురైటర్లు, సైక్లోస్టైలు మెషీనులు రహస్యంగా పని చేయడం, ఛాయా కార్యనిర్వాహకులు, నామమాత్ర నియం తలు యేర్పాటు కావడం- ఇవన్నీ ఉద్యమ ప్రతిష్ఠను తగ్గించి దాని నొక "పాతాళ హోమం" గా తయారు చేసినవి. గాంధీకి ఈ సంగతి అంతా తెలిసి, ఈ పద్ధతులను నిరసిస్తూ 1934 లో ఉద్యమాన్నే ఆపివేశాడు. అనేకసార్లు డబ్బు దాచి

పెట్టాలని ప్రయత్నాలు చేశారు. గాంధీ ఇదికూడా మేమీ బాగా లేదన్నాడు. మన శరీరం, మన ఆస్తి, మన స్వేచ్ఛ, మన సర్వస్వమూ కూడా శత్రువుకు ధారపోయడం లోనే సత్యాగ్రహ మూలతత్వ మంతా ఉందనీ, అంతకు తప్ప మేదో విధంగా వాటిని దాచుకోవడం సరియైన పద్ధతి గాదనీ నిక్కచ్చిగా చెప్పాడాయన. రహస్యం అనేది, భయమనే మాటకు, అసత్యమనే మాటకూ పర్యాయపద మన్నాడు గ్గు. అహింస ఆంతరంగిక నిర్మలత్వమునకు, అంతర్దృష్టికీ అవకాశం కలిగిస్తుంది. అందువల్లనే గాంధీ కాంగ్రెసులో- ముఖ్యంగా మంత్రిత్వాలు పుచ్చుకొన్న తరువాత సభ్యులను చేర్పించడం లోనూ కాంగ్రెసు ఎన్నికల లోనూ జరిగే అకృత్యములను, విసుగూ విరామం లేకుండా ఖండిస్తూ వచ్చాడు. మా యిల్లు మేము బాగుచేసుకోవడానికి కావించుకొన్న ప్రకటనలను ఆధారంగా చేసుకొని, మా శత్రువులు మాపైన రాళ్లు విసరడానికి కూడా సావకాశం కలిగింది. అందువలన మా తప్పులను దిద్దుకోవడానికి మేము ప్రయత్నించ కుండజాలము. ప్రపంచంలో ఏ నాయకుడైనా తన సంస్థలోని అకృత్యాలను బహిరంగంగా వెల్లడించడం కానీ, ఏ రాజకీయ సంస్థ మైనా తమ మంత్రులు చేసిన తప్పులను బహిరంగంగా విచారించడం గానీ జరిగిందా? అటువంటి సంస్థనూ నాయకుణ్ణి మీ రెప్పుడైనా చూచారా? బయటి ప్రపంచాన్ని మమ్ములను గౌరవించక తీరని స్థితిలో పెట్టడమే అహింసలో ఉన్న చాతుర్యం, అవినీతి, సంస్థ ప్రతిష్ఠను తగ్గించి విజయాన్ని దూరం చేస్తుంది. అందువల్లనే, గాంధీ

1940 లో ప్రారంభించిన సత్యాగ్రహోద్యమం, 1932 లోని ఉద్యమం కంటె విలక్షణంగా ఉంది. 1940 లో తాను ఇద్దరు సత్యాగ్రహులను మాత్రమే జైలుకు పంపుతున్నానని మొట్ట మొదటగా రాజప్రతినిధికి తెలియపఱిచాడు. తరువాత తన ఉపవాస వ్రతాన్ని తాత్కాలికంగా విరమించిన తరువాత, వ్యక్తి సత్యాగ్రహోద్యమాన్ని విస్తీర్ణం చేయ దలచుకొని, ఆ సంగతి తిరిగీ రాజప్రతినిధికి తెలియచేశాడు. ఆయన కాంగ్రెసులోని తన అనుచరుల కిచ్చిన సూచనలను మఱొకచోట పూర్తిగా ఉదాహరించి ఉన్నాము.

ఇంతా అయితే సత్యాగ్రహ పరిణామదశలో మే మిప్పటికీ ఓనమాల దగ్గరే ఉన్నామని ఒప్పుకొని తీరాలి. ఆ ఉద్యమం ఇంకా అపరిణతం గానూ అపూర్ణం గానూ ఉన్నప్పుడు, దానిని పరిశీలన చేయ పూనుకోవడం చాలా కష్టమైన పని, సున్నితమైన విషయమూ కూడాను. ముఖ్యంగా దాని అద్భుత శక్తిలో విశ్వాసం కలిగినవారు, దాని ప్రత్యర్థులకు అవహేళన పాత్రులు గానూ ద్వేషభాజనులు గానూ అవుతూ ఉన్నప్పుడు, ఆ పని మఱింత కష్ట మనిపిస్తుంది. అన్ని మహోద్యమాలూ అటువంటి దశలను కడచినవే. ఉద్దేశ పూర్వకంగా గాని అజాగ్రత్త వలన గాని, అసలు ఉద్యమాలను కృత్రిమోద్యమాలతో పోల్చి, కొందఱు విమర్శిస్తారు. మఱికొందఱు ఉద్యమ ప్రారంభ దశ లోని వంకరలను తరువాత కూడా ఆపాదించి వెక్కిరిస్తారు. బీజాన్ని పరిశీలించి, దాని గుణాలనుబట్టి అది బాగోదని నిర్ణయించినట్టుంటుం దీవిషయం. సత్యాగ్రహాన్ని కూడా ఇలాగే

ఒక్కొక్కప్పుడు సాత్త్విక నిరోధంతో సమానం చేసి మాట్లాడు తూంటాము. కాని ఈ రెండు ఉద్యమాలకూ చాలా భేదముంది. వజ్రపు మసిలోని నిగ్గులకూ, ప్రకృతి శాస్త్రజ్ఞుని పరిశోధ నాలయం లోని నల్లని వజ్ర పదార్థం మసిబొగ్గుకూ- యెంత భేద మున్నదో అంత భేదమున్నది. కాదు, అంతకంటెనూ యెక్కువ భేదమున్నది. సాత్త్విక నిరోధ సత్యాగ్రహాలు రెండూ పరస్పర విరుద్ధ లక్షణాలను ప్రదర్శిస్తవి. సత్యాగ్రహోద్యమ మూల పురుషుడు బుద్ధిపూర్వకంగా, తన ఉద్యమం సాత్త్విక నిరోధమును పోలి ఉండవలెనని తలంచక పోయినప్పటికీ, ఆయన తన ఉద్యమం ప్రారంభించే ముందు 1917 లో బెసెంటు నిర్బంధింప బడినప్పుడు, అటువంటి చిన్నెలు కొన్ని కనిపించినవి. గాంధీ, కాంగ్రెసు రంగంలోకి వచ్చిన తరువాత కొంత కాలానికి, సత్యాగ్రహ మనగా సాత్త్విక నిరోధ పునరుద్ధరణం కాదనీ, అది మఱియొక విశిష్టోద్యమ మనీ అర్థమవుతుంది. సాత్త్విక నిరోధంలో కసి, గర్వం, కొంత ద్వేషం, దౌర్జన్యం- అన్నీ ఇమిడి ఉండేవి. సహాయ నిరాకరణంలో, ప్రజల తీవ్రత, ఆవేగం, ప్రభుత్వంమీద కోపం, కొట్టాలని కోరిక, కొట్టేటందు కశక్తి - ఇవన్నీ కనిపించేవి. సివిల్ డిజొబీడియన్సు లోని నామ వాచకానికి ప్రాధాన్య మీయబడి విశేషణం విడిచివేయ బడేది. తరువాతి పరిణామదశలో విశేషణంలోని విశేషం గ్రహించ బడడం చేత, సత్యాగ్రహానికి మార్గ మేర్పడింది. కొద్ది కాలంలోనే సత్యాగ్రహానికి సత్యాహింసలు పునాదులనీ, అహింస కేవలం ప్రతిషేధాత్మక మైనది కాక క్రియారూపక శక్తి అనీ, "ఇతరు

లను దహించక తన్ను తాను దహించుకో గలిగిన ప్రేమతత్వాని" కది సరిపోలు తుందని అర్థం చేసుకొన్నాము. కాబట్టే చౌరీ చౌరా సంఘటనం జరుగగానే ఒక్క గోరఖ్ పూరు జిల్లాయే గాక, భారతదేశ మంతా శిక్షింపబడ తగినంత ఘోర కృత్యం జరిగినట్లుగా భావింప బడింది. ఈ విధంగా సత్యాగ్రహం కేవలం భౌతిక శక్తియే గాక, చాలా త్యాగం చేయవలసిన నైతికశక్తి ఆధ్యాత్మిక శక్తి కూడా నని గ్రహించాము. సత్యాగ్రహంలో చైతన్యం ఉంది. పరాక్రమం ఉంది. ప్రచండ శక్తి ఉంది. జలియన్‌వాలాబాగు హత్యాకాండలో నుండి ఉద్భవించిన సత్యాగ్రహం, చౌరీచౌరా హత్యలతో తనంతట తానే భస్మీ పటలమై పోయింది. సత్యాగ్రహి అప్పటినుండీ నూతన భావ ప్రపంచంలో ప్రవేశించాడు. అక్కడ ద్వేష దోషాలకూ భయ, భీరుత్వాలకూ, క్రోధ ప్రత్యపకార చింతలకూ బదులుగా, ప్రేమ, పవిత్రత, ధైర్యము, బాధాసహిష్ణుత, సహనం, క్షమా ఉంటవి; ఐశ్వర్యానికి గౌరవం పోయి సేవకు స్థానం వస్తుంది; శత్రువును ఓడించడం కాక సరిచేయడం ముఖ్య మవుతుంది. ప్రతి సత్యాగ్రహి కూడా అన్ని భయాలనూ - మనిషి భయం, ప్రభుత్వ భయం, సంఘభయం, దరిద్ర భయం, మృత్యుభయం- వీటి నన్నిటినీ కూడా వదిలించి వెయ్యాలి. ఇవి మనిషిని ఎప్పుడూ చుట్టుకొని ఉంటయి. గర్వం భయానికి కారణ మవుతుంది. వినయం ధైర్యాన్ని విజృంభింప చేస్తుంది. కాబట్టి గర్వంతో కాక వినయంతో ఆత్మ సమర్పణమునకు శిక్షణ పొందాలి. దానికి సహాయ నిరాకరణం క్రమవిధానం గానూ

సాధన గానూ పనికి వస్తుంది. కాబట్టి సత్యాగ్రహోద్యమ విధాత ఒక్కసారిగా ఆనాటి కలుషిత రాజకీయాలను సంస్కరించి ఔన్నత్య దశకు తీసికొని వెళ్ళినాడు. మనం సత్యము నందు పట్టుదల గలిగి, భావోద్వేగాలను అరికట్టి, పవిత్ర వంతులంగా ప్రవర్తించ గలిగినప్పుడు, మనలో వినయ సేవా భావాలు వికసిస్తాయి. ఒక్కసారి కోపాన్ని అణచుకొని, సహనాన్ని అలవాటు చేసుకొంటే, మానవ వ్యవహార నిర్వహణంలో అహింస ఆధిపత్యం వహిస్తుంది. సత్యాగ్రహ వృక్షానికి వేరు తృప్తి; సంఘత్యాగం చేసే సన్యాసం కాక కోరికలనూ భావోద్వేగాలనూ పరిమితిలో ఉంచుకో గలిగిన భోగ విముఖత- ప్రపంచాన్ని విడచిపెట్టడం కాక మానవ సేవలో త్యాగబుద్ధి కలిగి ఉండడం. ఈ నూతనోపదేశం కావలసినంత శక్తిని విజృంభింప చేస్తూన్నది. అంతేకాక శత్రువుతో మనం సహాయ నిరాకరణం చేస్తూన్నప్పటికీ, అతని సాహచర్యం అవసరమని ఆదేశిస్తూన్నది. ఈ శక్తిని పేదల సేవకు వినియోగించ వలెననే ఉద్దేశంతో సత్యాగ్రహి ముఖ్యంగా నూలు వడకవలె ననే నియమం ఏర్పాటు చేయబడింది. ఇది పేదలయందు మనకు గల స్నేహాను రక్తికి పవిత్ర చిహ్నంగా భావింప బడుతూన్నది. ఇందుకు మనస్సు శరీరాన్ని స్వాధీన పఱచుకోగలిగి ఉండాలి. ఆత్మ, మనశ్శరీరాలను రెంటినీ సరియైన మార్గంలో పెట్టగలిగి ఉండాలి. అప్పుడు బుద్ధి కూడదన్న దానిని దేనినీ శరీరం వాంఛించదు. భావం పనికిరాదన్న దానిపైకి ఆలోచన పోనే పోదు. ఈ ఫలితాలను పొందడానికి నిగ్రహాంకంటె ఉత్తమ

మార్గం లేదు. మనో వాక్కుల విషయంలో మౌనమును, ఆహార విహారముల విషయంలో ఉపవాసమును, భావోద్వేగాల విషయంలో బ్రహ్మచర్యమును నిగ్రహమని చెప్పవలెను.

## మౌనం

ఈ ఒక్కొక్క శీర్షిక కింద మనం సత్యాగ్రహ శాస్త్రాన్ని పరిశీలింతము గాక. గాంధీ మాట్లాడుతూ ఉన్నప్పటి కంటే మౌనం వహించినప్పుడు, కాంగ్రెసుకు లోపల ఉన్నప్పటి కంటె వెలుపల ఉన్నప్పుడు, మన ఎదుట ఉన్నప్పటికంటె జైలులో ఉన్నప్పుడు, ఎక్కువ ప్రత్యక్ష ఫలితంతో ఎక్కువ ప్రయోజనకరంగా పని చేస్తాడు. కాన్పూరు కాంగ్రెసు (1925 డిశంబరు) తరువాత ఒక సంవత్సరం ఆయన రాజకీయ మౌనం అవలంబించాడు. ఈ మౌన కాలాలలో ఆయన, మనస్సులో పెద్ద పెద్ద ప్రణాళికలను ధ్యానం చేస్తాడు. కాలక్రమేణా అవి పరిణతములై సమగ్ర కార్యక్రమాలుగా వెలువడతయి. మౌనవ్రతం వెటకారంగా ఉంటుందనీ, ఉపవాసం శరీరాన్ని కృశింప చేస్తుందనీ, బ్రహ్మచర్యం సాధ్యంకాని పని అనీ ఎవరో కొందరు అనేక విధాలుగా అపహాస్యం చేస్తూన్నారంటే ఆశ్చర్య పడవలసిన పని లేదు. అన్ని మహోద్యమాలనూ ప్రారంభ దశలో అలాగే అవహేళనం చేశారు. అట్టి వెక్కిరింపులను, నిందలను, తిట్లనూ కూడా లెక్కపెట్టకుండా జీవించి, మానవాభ్యుదయమునకు తోడ్పడే ఆదర్శాలనవి పునరుజ్జీవింప చేసినయి.

మౌనవ్రతం శిక్షణగా, పుష్టిదాయకంగా, భావప్రేరకంగా ఎలా పనిచేస్తుందో గాంధీ వ్రాసిన మాటలనే ఈ దిగువ ఉదాహరిస్తున్నాము.

నేనింక నిరంతర మౌనవ్రతావలంబినని చెప్పగలను. కొంతకాలం కిందటనే నేను రెండు నెలలవరకూ పూర్తిగా మౌనంలో ఉన్నాను. ఆ మౌనం యొక్క వశీకరణ శక్తినుండి నేనింకా బయట పడలేదు. ఈ రోజులలో, సాయంకాలం ప్రార్థనా సమయంలో నేను మౌనమవలంబించి, రెండు గంటలకు నన్ను చూడవచ్చిన వారికోసం విడిచిపెడుతూన్నాను. ఈ నాడు మీరు వచ్చినప్పుడే విడిచి పెట్టాను. అది నాకు శారీరకం గానూ ఆధ్యాత్మికం గానూ కూడా అవసరమయింది. మొట్టమొదట వత్తిడి తప్పించుకోవడానికిది ప్రారంభించాను. అప్పుడు నాకు వ్రాసుకోవడానికవకాశం కావలసి వచ్చింది. కాని కొంతకాలం దానిని నే నభ్యాసం చేసిన తరువాత, దానిలోని ఆధ్యాత్మిక గుణాన్ని అర్థం చేసుకొన్నాను. దేవునితో సంధానం కలిగించుకోవడానికదే అత్యుత్తమ సమయమని నా మనస్సు కకస్మాత్తుగా తట్టింది. మౌనానికి తగిన సహజలక్షణాలు నాదగ్గర ఉన్నట్లుగా నే నిప్పుడు భావిస్తూన్నాను.

గాంధీ చిరకాలము కిందటనే అంతర్వాణిని అనుసరించవలెనని తెలుసుకొన్నాడు. దక్షిణ ఆఫ్రికాలోని ఒక ట్రాపిస్టు మఠమునుండి ఈ సంగతి నేర్చుకొన్నాడు. ఆ మఠంలోని వారు చాలామంది "మనలో నిరంతరమూ నెమ్మదిగా మాట్లాడుతూన్న చిన్ని గొంతును మనం వినదలచుకొన్నట్లయితే, మనమే ఎప్పుడూ మాట్లాడుతూంటే దానిని వినలేము" అనే నమ్మకం గలిగిన మౌనవ్రతావలంబకులు కాబట్టి "సత్యాన్వేషి

మానంగా ఉండాలి" అని ఆయన సిద్ధాంతీకరించాడు. ఆ అమూల్య పాఠాన్ని ఆయన గ్రహించి మాన వ్రతంలోని రహస్యాన్ని గుర్తించాడు. ఐహికాధికార రక్షణకింద వచ్చిన క్రైస్తవ మత ప్రచారకునికి "గ్రహించే సహనము, వినయము, ప్రజా సామాన్యంతో కలసి మెలసి ఉండాలనే కోరిక"- ఇవి కలుగవు.

సత్యాగ్రహ శాస్త్రంలో మానం, ఉపవాసం, బ్రహ్మచర్యం, ఈ మూడు భౌతిక విషయాలు, అనిర్వచనీయమైన ఆధ్యాత్మిక ఫలములను ఇంకనూ ఫలింప చేస్తూనే ఉన్నవి. అయితే సత్యాగ్రహి ప్రవర్తనమునకు కొలికిపూస అయిన ఆత్మోన్నతిని కూడా కలిగిస్తున్నవవి.

శాస్త్ర దృష్టితోనూ ఆధ్యాత్మిక దృష్టితోనే కాక, అవసరాన్ని బట్టి కూడా ముఖ్యంగా ఈ తరుణంలో అహింసా సిద్ధాంతాలను అవలంబించ వలసిన అగత్యమున్నది. జీవహింస చేయడానికీ, ఖడ్గబలం మీద ఆధారపడి ఉండడానికీ ఇష్టపడక పోవడంలో, క్రైస్తు బోధలలోని క్షమాగుణం కొంతవఱకైనా అవలంబించినట్లు అర్థమౌతుంది.

డాక్టర్ ఉడ్ ఇలా అన్నాడు :

బ్రిటిష్‌వారు చేసిన పనులలో క్షమించ వలసినవి చాలా ఉన్నాయి. సామ్రాజ్యతత్వం భారత ప్రజల యొక్కయు బ్రిటిష్‌ప్రజల యొక్కయు బాంధవ్యాన్ని విషపూరితంగా చేసింది. బహుశా పూర్తిగా విడాకులు పుచ్చుకొంటేనే తప్ప ఈ విషం పోదు. తాను కోరుకొన్న నాయకుల

కింద ఇండియా తన మోక్షం తాను చూచుకోవడానికి తగిన తరుణం తటస్థించింది. మనం నిజంగా ఇండియాను రొమ్ముబాయవలసే వస్తే క్షమా సమాన భావాలతోనే ఎందుకు కడబాయ కూడదు?

అటువంటి మెడబాటు, ఉభయ జాతులకూ గౌరవప్రదంగా ఉండే షరతులతో ఇరువురూ తిరిగి కలియడానికి తోడ్పడడమే గాక, మానవాభ్యుదయ సిద్ధాంతాలతో "ప్రపంచ సమష్టి సౌభాగ్య సంస్థను" (World commonwe.lth of Nations) స్థాపించడానికి సాధన మవుతుంది.

మఱచి పోవడం, క్షమించడం అనే ఉత్తమ గుణాలు, ఆటల లోనూ దావాలలోనే గాక, సంఘం లోనూ గృహకృత్యాల లోనూ కూడా అవసరం. కాబట్టి సత్యాగ్రహంలో అవి అగ్ర స్థానం వహించవలె ననడంలో అభ్యంతర మేముంది? కోప మెన్ని వ్యాఘాతాలకో, ఎన్ని వైకల్యాలకో కారణ మవుతుందని ఇదివరకే చెప్పి ఉన్నాము. దానికి క్షమా గుణమే తగిన మందు.

గాంధీ ఇలా అన్నాడు :

అహింసావలంబకుని నిఘంటువులో బాహ్య శత్రువు అనే మాటలేదు. కాని శత్రువుగా తలంపబడే వానినిగూర్చి కూడా ఆయనకు జాలి తప్ప మఱొకటి ఉండదు. ఆతడు ఏమనిషీ బుద్ధి పూర్వకంగా దుర్మార్గుడుగా ఉంటాడని నమ్మడు. మంచి చెడ్డలు తెలుసుకొనే శక్తి లేని మానవు డుండడనీ, ఆ శక్తిని పూర్తిగా పెంపొందిస్తే అది అహింసగా పరిణతి పొందుతుందనీ ఆయన తలంపు. కాబట్టి శత్రు వనబడే వానికి తగిన వివేకాన్ని ప్రసాదించి దీవించ వలసిందని, ఆయన భగవంతుణ్ణి, ప్రార్థి

స్తాడు. తనలోని జాలి సెలయేటి తరగలు ఎడతెగకుండా జాలువారవలె
ననీ, తన నైతిక బలం మృత్యువును నిర్భయంగా ఎదుర్కోగలిగేటంత
వరకూ దినదిన ప్రవర్ధమానం కావలెననీ, తనను గూర్చి తాను కోరు
కుంటూ ఉంటాడు.

గాంధీ మఱొకచోట :

"సహనం బలవంతుల శుభలక్షణ" మన్నాడు.

# అధ్యాయము ౬

## ఉపవాసాలు

### ౧

సత్యాగ్రహ శాస్త్రంలోనూ, సత్యాగ్రహ ఉద్యమ చరిత్ర లోనూ ఉపవాసములకూ ఉపవాస వ్రతములకూ ఇయ్యబడిన విలువ కొంత వింతగా కనిపిస్తుంది. ఇంగ్లీషు చదువుకొన్న వాళ్ళకు ఉపవాసం అంటే దాదాపు వెక్కిరింపుగా ఉంటుంది. కాని హిందువులకు పండుగలూ విందులూ కూడా ఉపవాస మును ప్రోత్సహిస్తూ ఉంటాయి. హిందూ దేశీయునికి విందులంటే దాదాపు ఆలస్యంగా భోజనం చేయడమని అర్థం. పండుగలలో జరుగవలసిన వ్రతానుష్ఠానాలూ, పూజా పురస్కారాలూ పూర్తి అయ్యేసరికి దాదాపు ఉపవాస వ్రతంగానే పరిణ మిస్తుంది. భారతీయులు- హిందూ మహమ్మదీయ క్రైస్తవులు, తమ పండుగుల యెడల చూపే శ్రద్ధా భక్తులు, ఇట్టి ఉపవాస ముల వల్ల మఱింత అతిశయిస్తూ ఉన్నవి.

గాంధీ మొట్టమొదటి సారి 1919 లో, రౌలట్టు శాసనాం దోళన సందర్భంలో, సత్యాగ్రహ ప్రారంభానికి ముందుగా, ఈ ఉపవాస వ్రతాన్ని ప్రజలకు ఆదేశించాడు. ఉపవాస వ్రత ములలో ఆయనకు కల విశ్వాసాన్ని తెలియచేసేటందు కాయన వ్రాతలలో నుండి మూడు ఉదాహరణాల నీ దిగువ యిస్తూ న్నాము :

౧ ఉపవాస వ్రతము కృతయుగం నాటినుండీ వస్తూన్నది. అది ఆత్మ పరి శుద్ధత కోసము గానీ లేక మంచికోసమో చెడ్డకోసమో యేదో ఒక

ప్రయోజనం కోసం గానీ అవలంబించ బడుతూన్నది. బుద్ధుడు, జీసస్, మొహమ్మదులు దేవుణ్ని ముఖాముఖి దర్శించ వలెనని ఉపవసించారు. రామచంద్రుడు తన వానర సైన్యానికి దారి నీయ వలసిందని సముద్రుని గూర్చి ఉపవసించాడు. పార్వతి మహాదేవుణ్ని తనకు ప్రభువు గానూ పతి గానూ కోరి ఉపవసించింది. నేను వారి కోరికల కంటె తక్కువ కోరికలతో ఆ మహా మహుల మార్గాల ననుసరించి ఉపవాస వ్రతము నవలంబిస్తూన్నాను.

*  *  *

2 సత్యాహింసలతో పాటు తనకు దేవుడు తగిన బల మిస్తాడనే విశ్వాసం కూడా సత్యాగ్రహికి ఉండాలి. తన ఉపవాసంలో యేమాత్రం కళంకం ఉన్నా వెంటనే దాని నతడు సందేహించకుండా విడచిపెట్టాలి. అనంతమైన ఓర్పు, గట్టి పట్టుదల, ఏకాగ్ర చిత్తం, సంపూర్ణ శాంతి, అక్రోధం- ఇవన్నీ అతనికి ఉండి తీరాలి. ఈ అన్ని సుగుణాలూ, ఆకస్మికంగా ఒక్కసారి రావడమంటే అసంభవం గనుక, అహింసయందు శ్రద్ధ పూననివారెవరూ సత్యాగ్రహోపవాసములను సాగించ కూడదు.

*  *  *

3 ఆత్మ పరిశుద్ధత కోసం నేను చాలా చిన్న వయస్సులోనే ఉపవాసాలు ప్రారంభించానన్న విషయం ప్రజలు తెలుసుకొందురు గాక. నా కొడుకు చేసిన తప్పిదాలకు నేను దీర్ఘోపవాస వ్రత మవలంబించాను. తరువాత నా ఆత్మీయ మి[illegible] కూతురు చేసిన తప్పిదానకు వెంటనే మరి యొక దీర్ఘోపవాసం [illegible]. ఈ రెండు సందర్భాలలో [illegible] లిగిన ఫలితాలూ కూడా ఉపవాసాల ఉత్కృష్టతను స్పష్టం చేసినయి. దక్షిణ ఆఫ్రికా సత్యాగ్రహ పోరాటంలో వ లోన్న కూలీల కష్ట నివారణార్థం, నేను మొదటిసారి ఆదేశంలోనే బహిరంగోపవాస వ్రతానికి పూను కొన్నాను. నేను [illegible]సిన ఉపవాసాలలో ఒక్కటి కూడా నిష్ప్రయోజనమై

పోయినట్లు నాకు జ్ఞాపకం లేదు. పైపెచ్చు నేను అమూల్యమైన శాంతినీ, అనంతమైన ఆనందాన్నీ, ఆ ఉపవాసాలన్నిటిలోనూ అనుభవించాను. దైవ ప్రేరితం గాని ఉపవాసం, ఉపయోగం లేని ఉత్త లంకణమో అంతకంటెనూ అధమమో అని చెప్పాలి.

పూర్వోపవాసములను గూర్చిన ఈ అభిప్రాయాలు తరువాత, యుద్ధకాలంలో (1940 ఆగస్టు, డిశంబరుల మధ్య) గాంధీ ప్రారంభించ వచ్చునని తలంపబడిన ఉపవాసమును గూర్చి, ఆయన 1940 నవంబరు 7 వ తేదీని హరిజన్‌లో వ్రాసిన వ్రాతలను పరిశీలిద్దాం.

నేను నా జీవితంలో మఱియొకసారి ఉపవాసవ్రత మవలంబించ వచ్చుననీ అది నేననుకొన్న దానికంటె ముందుగానే తటస్థించ వచ్చుననీ వర్కింగు కమిటీలో నా మిత్రుల కిదివరకే సూచించి ఉన్నాను. కాని నాకు జ్ఞాపకమున్నంత వరకు, నేను ముందుగా ఆలోచించి దిగిన బహిరంగోపవాస మొక్కటి కూడా లేదు. నా ఉపవాసాలన్నీ దేవుని వరాలవలె అప్పటి కప్పుడు తటస్థించినవే. వాటన్నింటికీ తప్పనిసరిగా మంచి ఫలితాలు కలిగినయి. ఎప్పుడూ వాటినిగూర్చి నేను పశ్చాత్తాప పడ్డ క్షణం లేదు. దేవుడు నా కోసం మఱియొక ఉపవాసాన్ని నిర్దేశించి నట్లయితే అది తప్పకుండా మంచి ఫలితాన్నే చేకూరుస్తుంది. అన్ని విషయాల లోనూ అతని కోర్కే సిద్ధిస్తుంది.

భారత భూమిలో గాంధీ ప్రారంభించిన బహిరంగోపవాసాలలో, 1918 అక్టోబరులో జరిగిన అహమ్మదాబాదు మిల్లు కూలీల సమ్మె సందర్భంలోది మొట్టమొదటిది. గాంధీ తన స్వీయ చరిత్రలో దానిని గూర్చి ఇలా వ్రాస్తూన్నాడు :

నేను చాలా మొగమాటు పరిస్థితులలో పడిపోయినాను. మిల్లు కూలీల వాదం బలమైనది. అంబాలాల్ శరభాయి మిల్లు యజమానుల పక్షం వహించాడు. ఆయన సోదరి అనసూయా బేన్ ఆయన కెదురు పక్షంలో పోరాడవలసి వచ్చింది. నాకూ వారికీ స్నేహం. అందువల్ల పోరాటం సాగించడం మరీ కష్టమై పోయింది. వారితో ఆలోచనలు ప్రారంభించి మధ్యవర్తి తీర్పుకు ఒప్పుకోవలసిందని వారిని ప్రార్థించాను. కాని వారా సిద్ధాంతాన్నే అంగీక రించలేదు.

కాబట్టి గాంధీ, కూలీలను సమ్మె కట్టవలసిందని సలహా యిచ్చాడు. పూర్తిగా దౌర్జన్య రహితంగా ఉండి, గట్టిగా నిలబడేటట్లు వారికడ నుండి ప్రమాణాలు తీసుకొన్నాడు.

కాని చిట్టచివరకు వారు తడబడుతూన్న చిహ్నాలు కనిపించినయి. సమ్మె చల్లబడుతూన్న కొద్దీ పనిలోకి పోయే కూలీల యెడల సమ్మెదారుల వైఖరి మరింత భయంకరంగా ఉంటూ వచ్చింది....చివరకు సమ్మెదారు లెక్కడివా రక్కడ జారిపోతూన్నట్లుగా వార్త తెలిసింది. అప్పుడు నేను చాలా చీకాకు పడ్డాను. ఆ పరిస్థితులలో నే నవలంబించ వలసిన ధర్మ మేమిటని తీవ్రంగా ఆలోచించాను.

గాంధీ ఆ చరిత్ర ప్రసిద్ధమైన ఉపవాస వ్రతాన్ని అవలం బించిం దప్పుడే.

అప్పటికింకా నా కేమీ దారి తోచక తడుముకొంటూన్నాను. ఆ ఉదయాన మిల్లు కూలీల సమావేశంలో అకస్మికంగా నాకు వెలుతురు కనిపించినట్లయింది. "కూలీలంతా సమావేశమై సంధి కుదిరేటంత వరకూ సమ్మె సాగించనైనా సాగించాలి, లేదా వారు పూర్తిగా మిల్లులను విడిచిపెట్టనైనా విడిచిపెట్టాలి. ఈ రెంటిలో ఏదో ఒకటి జరిగేవరకూ నేను అన్నం ముట్టను" అనే వాక్యాలు అనుకోకుండా తమంతట తాము

నా పెదవులనుండి వెలువడినయి. అనసూయాబేను చెక్కిళ్ళనుండి కన్నీరు కార ప్రారంభించింది.

కూలీలు కూడా దఃఖంతో "మీరు కాదు మేము ఉపవాసం చేయాలి. మీ రుపవాసం చేయడం ఘోరం. మా తప్పు క్షమించండి చిట్టచివర వరకు మేము చేసిన ప్రమాణానికి కట్టుబడి ఉంటాం" అన్నారు. అక్కడి పరిసరాలన్నీ సుహృద్వాతావరణంతో నిండి పోవడమే దాని పర్యవసానం. మిల్లు యజమానుల హృదయాలు కరిగినవి. వారు రాజీ ఉపాయాలను ఆలోచించడం ప్రారంభించారు. వారి ఆలోచనలకు అనసూయాబేను గృహమే ఆస్పదమయింది. ఆనంద శంకర ధ్రువుడు జోక్యం కల్పించుకోగా, ఆయన మధ్యవర్తిగా నియోగింప బడ్డాడు. నేను మూడురోజులే ఉపవాస మున్నది. తరువాత సమ్మె ముగిసింది. ఈ విధంగా 21 రోజులు సమ్మె జరిగిన తరువాత రాజీ కుదిరింది.

కార్మికోద్యమంలో గాంధీకి కలిగిన విజయాలు కానీ ఆయన చేసుకొన్న రాజీలు కానీ ఎటువంటి వైనప్పటికీ, కూలీ సంఘాలను గూర్చి ఆయన అభిప్రాయాలకు తక్కిన రాజకీయ, కార్మిక నాయకుల అభిప్రాయాలకూ చాలా భేదమున్నది. అహమ్మదాబాదు మిల్లు కూలీల కాయన (1940 డిశంబరు 4 వ తేదీన) మరి ఇటీవల యిచ్చిన సందేశ మిది :

నాకు మీతో సన్నిహిత సంబంధం కలిగినప్పటి నుండీ మీ మోక్షం మీ చేతుల లోనే ఉందన్నే మాట నచ్చచెప్పడానికి ప్రయత్నించాను. పనికి యిచ్చే పైకం ఖరీదుకంటె పనివిలువ ఎన్నో రెట్లెక్కువ. మీ కోరికను బట్టి మీ విలువను మీరు పెంచుకోనూ వచ్చు తగ్గించుకోనూ వచ్చు. అయితే మీ పనికి కట్టిన మూల్యానికు మీరు సంతృప్తి పడ్డట్లయితే, మీ విలువకు మీకే పరిమితి ఏర్పాటు చేసుకొంటూన్నారన్నమాట.

ఇక జరిగిన ఇరవై సంవత్సరాలలో నిర్వహింపబడిన అనేక ఉపవాసములలో కొన్నిటిని గూర్చి మాత్రం పరిశీలిద్దాం. "బ్లాకు బిల్" అని పిలువబడ్డ రౌలట్టు చట్టానికి వ్యతిరేకంగా అసమ్మతిని చూపిస్తూ 1919 ఏప్రిల్ 6 వ తేదీని అఖిల భారత దేశంతో, చేసిన బహిరంగోపవాసం ఆ తెగలో మొట్టమొదటిది.

తరువాత చౌరీచౌరాలో జరిగిన అపరాధానికి ప్రాయశ్చిత్తంగా 1922 ఫిబ్రవరి నెలలో గాంధీ అయిదురోజులు ఉపవాసం చేశాడు.

ఆ సందర్భంలో ఆయన ఇలా వ్రాశాడు :

నేను ఆత్మ పరిశుద్ధత పొందాలి. నాకు చుట్టూ ఉన్న నైతిక వాతావరణంలో యేమాత్రం మార్పు కలిగినా తెలుసుకో గలిగినంత సున్నిత పరికరంగా ఉండాలి నేను.— నా ప్రార్థనలు పైకి కనబడేటంతకంటె కూడా ఎక్కువ వినయవంతములుగానూ యెక్కువ సత్యాభిప్రాయిష్టములుగానూ ఉండాలి. మానసిక సహకారంతో కూడిన ఉపవాసంకంటె నాకు సహాయం చేయగలిగినదీ పవిత్రవంత మైనదీ మతియొకటి లేదు. శరీరంపైన ఆత్మ ఆధిపత్యం వహించేటందుకున్నూ మనోభావాన్ని నిక్కవగా ప్రదర్శించే టందుకున్నూ చేయబడే ఉపవాసం, మనిషియొక్క పరివర్తనానికి అత్యంతం తోడ్పడుతుంది కాబట్టి బాగా ఆలోచించి అయిదురోజుల ఉపవాసం నాపైన నేను విధించు కొంటూన్నాను.

ఉపవాస ప్రాయశ్చిత్తములు సాధ్యమైనంత వరకు రహస్యంగా జరగాలి. కాని నా ఉపవాసం, ప్రాయశ్చిత్తమూ శిక్షా కూడా అవడంచేత బహిరంగం చేయవలసి వచ్చింది. అది నాకు ప్రాయశ్చిత్తము, నే నెవరిసేవ చేయదలచుకు న్నానో, యెవరికోసం నేను జీవించ కోరుతూన్నానో,

యెవరికోసం చావడానికి కూడా యిష్టపడతానో వారికి శిక్ష. వారికి కాంగ్రెసుతో సంబంధం లేకపోయినా, కాంగ్రెసుపైన సానుభూతి పరులుగా, కాంగ్రెసు నియమాల కనుద్దేశ పూర్వకమైన కళంకం కలిగించారు. తమ దేశీయులు సోదరులూ అయిన పోలీసులను- బహుశా నా పేరును ఉచ్చరిస్తూ- నటికి-ఉంటారు వారు. కేవలం తాను బాధపడడం వలననే ప్రేమ, తప్పు చేసినవారిని శిక్షిస్తుంది. వారు కాంగ్రెసును ఉల్లంఘించి నందువల్లనే నేనీ బాధను తెచ్చిపెట్టుకొన్నానని వారెఱుంగుదురు గాక.

దేశం హిందూ ముస్లిము కొట్లాటలతో అట్టుడికిన ట్లుడికిపోతూన్న సమయాన, గాంధీ హిందూ మహమ్మదీయ సఖ్యత కోసం మహోత్కృష్టమైన తపస్సు చేశాడు. 1924 సెప్టెంబరు 18 వ తేదీని 21 రోజుల ఉపవాస వ్రతాన్ని ప్రకటిస్తూ గాంధీ ఈ రీతిగా అన్నాడు.

ఇటీవల జరిగిన సంఘటనలను నేను భరించలేకుండా ఉన్నాను. మనం తొలగించలేని ఆపత్తు వచ్చినప్పుడు, ఉపవాసం చేసి దేవుణ్ణి ప్రార్థించవలసిందని నా మతం నాకు బోధిస్తూన్నది. నా కత్యంత ప్రేమాస్పదులైనవారి విషయంలో నేనలా చేశాను. నేను చెప్పే మాటలు కానీ వ్రాసే వ్రాతలు కానీ ఈ రెండు సంఘాలనూ ఏకం చేయజాలక పోతూన్నవనేమాట స్పష్టం. కాబట్టి ఇవ్వాళ ప్రారభించి 21 రోజుల ఉపవాసం నాపైన నేను ధించు కొంటున్నాను. అది తపస్సు, ప్రార్థనా కూడాను తపస్సుగా నా ఉపవాసాన్ని గూర్చి నేనెవరికీ చెప్పనక్కరలేదు. హిందూ మహమ్మదీయు లిరువురకూ నా ఉపవాసం ఫలప్రదమైన ప్రార్థనగా (నా ఆశ అది) ఉండాలని నేను ప్రకటిస్తూన్నాను. ఇంతవరకూ కలసి పనిచేసిన ఉభయ సంఘాలూ ఆత్మహత్య చేసుకోవద్దని. నా ప్రార్థన మతానికీ మానవత్వానికీ కూడా లజ్జాకరంగా ఉండే ఈ

పోరాటాన్ని, అన్ని సంఘాల నాయకులు ఇంగ్లీషు వారితో సహా సమావేశమై తుదముట్టింప వశౌనని నే నాహ్వానిస్తూన్నాను. దేవుడు సింహాసన భ్రష్టు డైనాడా అనిపిస్తోంది. తిరిగి ఆయనను మన హృదయాలలో ప్రతిష్ఠింతము గాక.

* * *

(తరువాత మళ్ళీ వారం రోజులకు ఆయన ఇలా వ్రాశాడు)

దేవునిలో వస్తగింజంత నమ్మక మున్నవా డెవడూ నిరాశ చెందడు. అతడు తుదకు సత్యం విజయం పొందుతుందనే నమ్మకంలోనే ఉంటాడు. దైవభక్తిపరు డెప్పుడూ అసత్యానికి పోడు. కాబట్టి ఆయనకు నిరాశ అనేది కలుగదు. పైగా ఆయన ఆశ గాఢాంధకారంలో మరింత ప్రకాశిస్తుంది. "దిక్కులేని వాళ్ళకు దైవమే దిక్కు" అని మంచి తెనుగుసామెత ఒకటి ఉంది. దీని తత్వం ఇవ్వాళ తెలిసినంత బాగా ఇదివరకు నాకు తెలియలేదు. పెద్దపెద్ద జన సమూహాలను నడిపించడం, వాళ్ళతో వ్యవహరించడం, వారి పక్షాన మాట్లాడడం, పనిచేయడం, ఇవి దేవునిచే పరిమిత శక్తితో సృజింపబడిన సామాన్య మానవునికి సాధ్యమ్మైన పనులు కావు. కాబట్టి అటువంటి మనిషి కలకాలం కాపుదలమీద ఉండాలి. పూర్తిగా నా నిస్సహాయత్వాన్ని నేను గమనించిన తరువాతనే ఈ చిట్ట చివరి పనికి నేను పూనుకొన్నానని పాఠకులు గ్రహింతురుగాక. తన రక్షకులైన పాండవు లైదుగురూ కూడా తనను విడిచివేసినట్లు భావించిన ద్రౌపది వలెనే నేను దేవుణ్ణి ఎలుగెత్తి పిలుస్తూన్నాను. ఆమె కేక దేవునికడ వ్యర్థం కాలేదు. ఆ కేక కేవలం పెదవులమీద నుండి కాదు రావలసింది; అగాధమైన అంతరంగమునుండి; కాబట్టి ఎంతో మనోవేదన ఉంటేనే కాని అటువంటి కేక రాదు. ఇప్పటి నా కేక ఉపవాసవ్రతము ద్వారా బహిర్గతము చేయబడినది; అది ప్రస్తుత సమస్యలను పరిష్క-

రింప దగినంత సమర్థమైనది కాదు. నా హృదయము నిరంతరమూ ఇలా పాడుతూన్నది :

"నా కొలుకు 'తొలినాటి కొండ' పగిలినది
దైవమా! నన్ను నీలోన దాగనిమ్ము"

* * *

ఢిల్లీలో 1924 సెప్టెంబరు 16 వ తేదీని ఐకమత్య మహాసభ సమావేశ మయింది. హిందువులు, మహమ్మదీయులు, పార్శీలు, సిక్కులు, క్రైస్తవులూ ఇంగ్లీషువారూ కూడా ఆ సభకు హాజరైనారు. భారతదేశపు ప్రధాన క్రైస్తవ మతగురువయిన డాక్టరు ఫాస్ వెస్టు కాట్ కూడా హాజరైన వారిలో ఉన్నాడు. ఆ మహాసభా ఫలితా లానా డంత శ్లాఘింప దగినవిగా లేవు. కాని ఐకమత్యాని కవి కొంత ఉపకరించినవి. "ఈ కొత్త భావం కింది తరగతులకు వ్యాపించాలి. అందుకు కొంతకాలం పట్టే మాట నిజమే; కాని ఆ ధోరణి ఇప్పటికే కనిపిస్తూన్నదని మన మనుకో వచ్చును" అన్నాడు ఇండియా ప్రధాన క్రైస్తవ గురువు. గాంధీ చేసే ఉపవాస వ్రతాలను గూర్చి ప్రపంచంలోని మహా పురుషు లందఱూ ముందు తరంలోని పాఠకుల శాశ్వత ప్రయోజనం కోసం ఆందోళనతో నిరీక్షిస్తూండేవారు. 1924 లో హిందూ మహమ్మదీయ కొట్లాటల సందర్భంలో జరిగిన ఒక ఉపవాస వ్రతాన్ని గూర్చి యిదివరకే తెలిసికొని ఉన్నాము. అప్పుడు సెప్టెంబరులో ప్రారంభమైన ఆ మూడువారాల ఉపవాసమునూ పరిశీలించిన ఇండియా క్రైస్తవ ప్రధాన గురువు రివరెండు డాక్టరు ఫాస్ వెస్టు కాట్, ఉపవాస మూలకారణ

మును తుద ముట్టించే నిమిత్తం ఢిల్లీ శాంతిసభలో తక్కిన అన్ని పక్షాల వారితోనూ గలసి పాల్గొన్నాడు. గాంధీ తన ఉపవాసములకు కొన్నిటికి పరిమితిని యేర్పాటు చేస్తాడు. కొన్నిటికి చేయడు. కాని 1924 లో తాను ఉపవాసం చేసి చావపోవడం లేదని గాంధీ స్పష్టం చేశాడు. "దేశానికీ దేవునికీ సేవ చేయడానికి ఇంతకంటె బాగానూ పవిత్రవంతం గానూ జీవించే నిమిత్తమే" తా నుపవసిస్తున్నట్లుగా కూడా ప్రకటించాడు. ఇది చెప్పి "చచ్చిపోవడమా భుజించడమా అన్నంత సంకట స్థితి వచ్చినప్పుడు, తాను తప్పకుండా ఉపవాసం మానివేస్తానని" కూడా ఆయనన్నాడు. ఆయన ఉపవాసాలు అందరికీ హృదయాలు కలసిపోయి తాము చూచిన సత్యం చెప్పే సావకాశం కలిగించేటందు కుద్దేశింపబడవి. "ఐకమత్య వర్ధంతి" (Unity day) నాడు 1924 అక్టోబరు 8 వ తేదీన, స్టేట్సుమన్ పత్రికలో ప్రకటింపబడిన ఒక సందేశాన్ని ఇలా ఉదాహరించాడు డాక్టర్ వెస్టు కాట్ :

> ప్రత్యక్ష మైనట్టి రాజకీయ వాదం యేమాత్రమూ రాణించనిచోట గాంధీ ఉపవాసం వలన ఉద్భూతములైన ఆధ్యాత్మిక శక్తులు విజయం పొందినవి. సహన భావాన్ని అలవాటు చేసుకో వలసిందని లక్షలాది ప్రజలను ప్రోత్సహించ వలసిన అతి కఠినమైన పని ఇంకా అలాగే మిగిలి ఉంది.

రెండవ రౌండు టేబిలు మహాసభ జరిగిన తరువాత 1932 లో రామ్సే మాక్డొనాల్డు చేత సాంఘిక సమాఖ్య అని పిలువబడుతూ వచ్చిన సాంఘిక నిర్ణయమును గూర్చి యిక విచారింతము. అప్పుడు రాజాజీ ఇలా అన్నాడు :

సమాఖ్య రోగం కాదు. రోగ స్వభావాన్నీ దాని భయంకర స్వరూపాన్నీ వెల్లడి చేసే రోగ లక్షణం మాత్రమే. అది హిందూ మతంలో విభాగాలు కలిగించి, అరుకోట్ల హిందువులను హిందూ మతానికి సంబంధించని పరాయి వాళ్ళుగా చేయడానికి తయారుగా ఉంది. అది శస్త్ర చికిత్స చేయవలసిన రోగ చిహ్నమని గాంధీజీ అభిప్రాయం.

రామ్సే మాక్డొనాల్డు సాంఘిక సమస్యను గూర్చి తీర్పు చెప్పిన మరునాడు, 1932 ఆగస్టు 18 వ తేదీని, తాను ఏ విధమైన ఆహారమూ తీసికోకుండా ప్రాయోపవేశం చేయడం వలన మాత్రమే, ఈ తీర్పును నిరోధించ గలనని బ్రిటిష్ ప్రధాన మంత్రికి గాంధీ వ్రాశాడు. ఆయన వ్రాసిన అంత్య లేఖలో ఇలా ఉంది :

నిమ్న జాతులకు ప్రత్యేక నియోజకవర్గా లుండడం, వారికి గానీ హిందూ మతానికి గానీ అపాయ కరముగా భావించే నేను, పూర్తిగా పొరపాటు పడి ఉండవచ్చును. నా నిర్ణయం సరియైనది కాకపోవచ్చును. అలాగే అయితే నా జీవితానికి సంబంధించిన తక్కిన సిద్ధాంతాల విషయంలో కూడా నా అభిప్రాయాలు సరిగా ఉండడానికి వీలు లేదు. అటువంటప్పుడు నా ప్రాయోపవేశ మరణం నా తప్పులకు ప్రాయశ్చిత్తం గానూ, నా వివేకంలో పసిపిల్లల వలె అమాయక విశ్వాసం గల అసంఖ్యాకులైన ప్రజలపై నుండి నా భారాన్ని తొలగించడానికీ కూడా వినియోగిస్తుంది. కాక నేను నిస్సందేహంగా విశ్వసిస్తోన్నట్లు నా నిర్ణయం సరియైనదే అయితే, జరిగిన పాతిక సంవత్సరాల పైనుండి అచంచలంగా అనుసరించ బడుతూన్న నా జీవిత కార్యక్రమాన్ని నెరవేర్చడానికి మాత్రమే నేను తీసుకోబోయే ఈ చర్య అక్కరకు వస్తుంది.

సెప్టెంబరు 13 వ తేదీ గాంధీ ప్రాయోపవేశ వార్త వల్ల హిందూదేశమంతా కంపించి పోయింది. ఒక్క హిందూదేశమే కాదు ప్రపంచ మంతాను. "సండే టైమ్సు" పత్రికా విలేఖకు లొకరిలా వ్రాస్తూన్నారు :

భారతదేశ ప్రజల హృదయ స్పందనం ఇంగ్లాండు అమెరికా ప్రజల మనస్సులలో ప్రతిధ్వనించింది. మొదటిసారి ఈ వార్త వినగానే అవి శ్వాసమూ ఆశ్చర్యమూ కలిగినవి. అతి నూతనమూ అతి నిరుపమానమూ అయిన ఈ ప్రతిజ్ఞయొక్క ఉద్దేశం కానీ అర్థం కానీ గ్రహించలేక లోకం విస్తుపోయింది.

గాంధీని ఇందులోనుండి తప్పించవలెనని ప్రయత్నించినవారి కాయన ఇలా వ్రాశాడు :

నా అంతర్వాణి సత్యసంధతను గూర్చి నా కవిశ్వాసం లేదు. ఈ విచార మేఘంలో నుండి తొలకరి మెఱుపు తొంగి చూస్తుందని నాకు నమ్మక మున్నది. దాదాపు రెండువే లేండ్లకిందట కూడా ఒకసారి యిటు వంటి ఆపత్సమయమే వచ్చినది. తమ ప్రభువుపై ప్రేమతో దుఃఖించిన మిత్రులకు జెరూసలెంలో ఇటువంటి ప్రత్యుత్తరమే ఈయబడింది.

నిమ్నజాతుల నాయకులూ కులీన హిందూనాయకులూ కూడా ఈ ఉపవాస వ్రతాన్ని గూర్చి చాలా ఆందోళన పడ్డారు. చాలాదూరం రాయబారాలు సాగినయి. చిట్టచివరకు ఎటువాడా జైలులో ఒడంబడిక పత్రం వ్రాసుకొన్నారు. కాని "బ్రిటిష్ ప్రభుత్వం దాన్ని అంగీకరిస్తుందా?" అని అందఱూ అడగడం ప్రారంభించారు. గాంధీ స్థితి అంతకంతకు సందిగ్ధ మవుతూన్న సమయంలో, బ్రిటిష్ మంత్రివర్గం తొందర

తొందరగా సమావేశమై ఎరవాడ ఒడంబడికను తుట్టతుద కంగీకరించింది. సెప్టెంబరు 26 సాయంకాలం గాంధీ ఉపవాసం విరమించాడు. సెప్టెంబరు 27 న ప్రారంభించి అక్టోబరు రెండో తేదీవరకు భారతజాతి అంతా "అస్పృశ్యతా నివారణ వారం" జరిపారు. ఉపవాసం జరిగిన పూనాలో సమావేశమైన సభకు అధ్యక్షత వహించి, ఆ తరుణానికి తగినట్లుగా, మహాకవి టాగూరు మనస్సులు కలిగిపోయేటట్లు ఇలా మాట్లాడాడు :

దైవయోగం వలన కలిగిన జన్మ కారణంగా, కళంకితులుగా వ్యవహరింప బడుతూన్నవారి వంగిన నడుములపై నుండి, తరతరాల నుండీ ఉన్న అవమాన భారాన్ని తొలగించడానికి ప్రయత్నించే గాంధీ మహాత్ముని మహత్తర ప్రయత్నంలో, మనం నేడు పాల్గొనడం వల్ల, మన దేశీయులలో అనేకమంది యొక్క జన్మహక్కును తృణీకరించిన పాపాన్ని తుడిచివేసు కోవడమే కాక, భారతదేశపు నైతిక పరాధీనతను తొలగించి మానవ లోకానికి మార్గదర్శకులంగా కూడా కాగలుగుతూన్నాము. స్వార్థ వంచనం ఎక్కడైన ఏ రూపంలో ఉన్నాసరే, అది ఈ నాడు మహాత్మాజీ ప్రచారంలోకి తెచ్చిన అంతరాత్మ వేసే సూటి ప్రశ్నకు ప్రత్యుత్తర మీయగలదా అని అడుగుతూన్నాము.

ఈ ఉపవాసాలే కాక దండన గానూ ప్రాయశ్చిత్తం గానూ ఉద్దేశింప బడిన ఉపవాసా లింకా కొన్ని ఉన్నవి. 1933 మే లో గాంధీ 21 రోజుల ఉపవాసం మరొకటి ప్రారంభించాడు. కాని దాని కేమీ ప్రత్యేకోద్దేశం లేదు. అది "తన యొక్కయు తన అనుయాయుల యొక్కయు పవిత్రత కోసము జాగరూకత కోసము అప్రమత్తతకోసమూ ఉద్దేశింపబడ్డ హృదయప్రార్థనం" అన్నాడు. గాంధీ ఇలా వ్రాశాడప్పుడు :

నాకు చచ్చిపోవాలనే కోరిక లేదు. నా ధర్మ నిర్వహణం కోసం, నా మంచికోసం, నా అనుయాయుల కెక్కువ పవిత్రత, ఎక్కువ అనువర్తనము, ఎక్కువ శ్రద్ధా భక్తులూ కలిగేటందుకు, నేను జీవించదలచుకొన్నాను. నిష్కళంక జీవితంగల అనుచరు లింకా నాకు కావాలి. ఆశ్చర్యం కలిగించే అపవిత్ర వృత్తాంతాలు నాకు తెలిసినవి. అటువంటి వారంతా నా ధర్మకార్యాన్ని నాకు విడచి వెళ్ళవలెనని ప్రార్థించడమే ఈ ఉపవాసోద్దేశం.

తరువాత 1933 నుండి రెండు ఉపవాసాలు జరిగినవి. అందులో ఒకటి, సనాతనమత నాయకుని పైన కొందఱు సంఘ సంస్కర్తలు చేసిన దౌర్జన్యానికి ప్రాయశ్చిత్తంగా, 1934 ఆగస్టులో ఒక వారం జరిగింది. 1933 ఆగస్టు ఒకట్లో తేదీనుండి వ్యక్తి సత్యాగ్రహం ప్రారంభించ వలసిందని గాంధీ సలహా యిచ్చిన పిమ్మట, ఆయన ఆ తేదీనే అరెస్టు చేయబడ్డాడు. అప్పుడు హరిజన్ పత్రికను జైలులో నుండి నడిపే హక్కును ఆయనకు తీసివేయ బడినందున వెంటనే ఆయన ఉపవాసం ప్రారంభించాడు. ఆయన ఆరోగ్యం అపాయకర స్థితిలోకి వచ్చినప్పుడు, యేవిధమైన షరతులూ లేకుండా విడుదల చేయబడి పూనాలోని సాసూన్ ఆసుపత్రికి పంపబడ్డాడు.

రాజకోటలో జరిగిన ఉపవాస వృత్తాంతం చాలా ఇటీవలి జరగడంచే దానిని గూర్చి తిరిగి ఇక్కడ విశేషంగా చెప్పవలసిన అవసరం లేదు. అది నిజంగా "దైవ ప్రసాదితోపవాసం." ఠాకూరు సాహెబు ప్రజామండలితో చేసుకొన్న ఒడంబడికను భిన్నంగా నడపడం మంచిది గాదని, తాను బిడ్డగా చూచును

కొంటూన్న ఆయనను మందలించడానికి రాజకోటకు వెళ్ళి నప్పుడు, తానక్కడ ఉపవాసం చేయవలసి వస్తుందని గాంధీ యెంతమాత్రమూ అనుకోని ఉండలేదు.

దానిని గూర్చి మహాదేవ దేశాయి హరిజన్‌లో ఇలా వ్రాస్తూన్నాడు :

> దర్బారు వీరవల్లాతో జరిపిన మనోవేదన కరములైన సంభాషణలలో చిట్ట చివర సంభాషణ యొక్క చాలునని పించింది. 1939 మార్చి రెండో తేదీ రాత్రి ఒక్క క్షణంలో ఈ నిర్ణయం జరిగింది. ఈ ఉపవాసమును ఆవరించుకొని పెటిగిన రాజకీయ తికమకలతో మనకిక్కడ పనిలేదు. చిట్ట చివరకు ఫెడరల్ ప్రధాన న్యాయాధిపతి సర్ మారిస్ గయర్ మధ్యవర్తిత్వానికి యావద్విషయము గాంధీ వదలివేశాడు.

## రాజకోట ఉపవాస విచారణ

రాజకోట ఉపవాసం జరుగుతూండగా తటస్థించిన చిక్కులు, ఉపవాసం పూర్తి అయిన పిమ్మట కూడా అంతకంటె ఎక్కువైనయి. ఆ విధంగా రాజకోట ఉపవాసం అగ్రస్థానం అలంకరిస్తూన్నది. "ఆ నాలుగురోజుల ఉపవాసము, సత్యాగ్రహి కుండవలసిన లక్షణాలను గూర్చి ఆలోచించే టందుకు నా కవకాశం కల్పించింది" అని ఆ లక్షణాలను గాంధీ ఇలా వ్రాశాడు :

౧ ఆయనకు దేవునిలో అనంతమైన నమ్మక ముండాలి. దేవుడొక్కడే ఆయనకు కొండవంటి తోడు.

౨ సత్యాహింసలలో ఆయన మత విశ్వాసం కలిగి ఉండాలి. తద్వారా తన బాధాసహిష్ణుత వల్ల రేకెత్తించ నుద్దేశించిన మానవ ప్రకృతిలోని సహజ సద్గుణమునం దాయనకు నమ్మకం ఉండాలి.

౩ ఆయన జీవితం పవిత్రంగా ఉండాలి. తన ధర్మం కోసం ఆయన తన సర్వస్వమును తుదకు జీవితమును కూడా త్యజించ సిద్ధంగా ఉండాలి.

౪ ఆయన నిత్య ఖద్దరు ధారిగానూ, నిత్యమూ నూలువడికే వాడుగానూ ఉండాలి. ఇది ఇండియాకు ముఖ్యం.

౫ ఆయన పూర్తిగా మద్యపాన విముఖుడుగా ఉండాలి. ఇతర మత్తుపదార్థాలను కూడా యేమీ ఉపయోగించ కూడదు. అందువల్ల ఆయన బుద్ధి ఎల్లప్పుడూ నిర్మలంగానూ ఏకాగ్రంగానూ ఉంటుంది.

౬ అప్పుడప్పుడూ యేర్పాటు చేయబడే అన్ని నియమాలనూ ఆయన హృదయపూర్వకంగా అనుసరించాలి.

౭ తన ఆత్మ గౌరవానికి హానికరంగా ఉన్నప్పుడు తప్ప తక్కిన అన్ని సందర్భాలలోనూ జైలు నియమాలను పాటించాలి.

ఇవి కేవలం ఉదాహరణంగా చెప్పబడినవి మాత్రమే. కాని పూర్తిగా చెప్పబడినట్లు భావింపరాదు.

రాజకోట ప్రజ లవలంబించ వలసిన విధులను ఈ విధంగా ఆదేశించాడు :

౧ బాగా శిక్షణ పొందండి. బ్రాందీ వగైరా తాగుడు మాని నిరాడంబర జీవిత మలవాటు చేసుకోండి.

౨ నిర్మాణ కార్యక్రమంలో నమ్మకం కలిగి ఉండండి.

౩ "నాదే న్యాయ్య మన" కండి. "న్యాయ్య మేదో అది నాద" నండి.

౪ ఆడంబరం, అసూయ, దురభ్యాసాలు- ఇవి మానండి.

౫ ఇతర ప్రజల హక్కులకు భంగం చేయడం అన్యాయ్యం.

౬ బాధితుణ్ణి రక్షించడం మన ధర్మం.

౭ క్షమ బలవంతుల సద్గుణం.

౮ విలువ కలిగినమాట మాత్రమే మాట్లాడండి. అనాలోచితంగా ఒక్క మాట కూడా అనవద్దు. మీకు స్వేచ్ఛ కావాలంటే ధైర్యంగా ఉండండి.

## రాజకోట ఉపవాసమును గూర్చి వాద ప్రతివాదాలు

రాజకోట ఉపవాసాన్ని గూర్చీ దాని ఫలితాన్ని గూర్చీ జరిగిన వాద ప్రతివాదాలలో, గాంధీ సత్యాగ్రహ మర్యాదలను అతిక్రమించకుండా తన హక్కులలో తాను ఉన్నాడా, అతి తీవ్రమైన చర్చ వచ్చింది. గాంధీ వారం వారం తనను సమర్థించుకొంటూ వచ్చాడు. చిట్టచివరకు 1939 ఏప్రిల్ చివరలో లోబడి, తాను పజయం పొందినానని ఒప్పుకొన్నాడు. 24-4-39 న బొంబాయి పోయే రైలులో వ్రాసిన మాటలలో, ఆయన ఈ నిర్ణయానికి రావడానికి తగిన మానసిక ప్రవృత్తి బాగా వెల్లడింప బడింది.

> రాజకోట నా యౌవనాన్ని అపహరించి నట్లున్నది. ఇంతకు పూర్వం నేను ముసలివాడినని ఎన్నడూ అనుకోలేదు. ఇప్పుడు నేను నా వార్థక్య జ్ఞానంతో వంగిపోయినాను. నేనెన్నడూ ఆశను కోల్పోయి ఎఱుగను. కాని అది రాజకోటలోనే దహింప బడ్డట్లున్నది. ఇదివరకెన్నడూ ఇంత కఠినంగా నా అహింస ఒరిసి చూడబడలేదు.
>
> ఇండియా ప్రధాన న్యాయాధిపతి తీర్పు ప్రకారం కమిటీని నిర్మించడానికి, నేను నా విలువయిన 15 రోజుల కాలమును వెచ్చించాను. కాని మొదట నేనున్నచోటనే ఉన్నట్లు కనిపిస్తూన్నది. ఈ సందర్భంలో నేననుకోని చిక్కులు నాకు తటస్థించినవి. సర్దారుకు సంపూర్ణ విజయం కలిగినట్లుగా హిందూదేశంలో. అందఱూ తీర్పును గూర్చి శ్లాఘించారు. కాని దానివల్ల నేను ముస్లిములకూ భయాతులకూ చేసిన వాగ్దానాన్ని భంగం చేసినట్లుగా నన్ను గుఱించి బాగా ఆడి పోసుకొంటూన్నారు. నేను ఢిల్లీనుండి తిరిగి రాగానే ఠాకూరు సాహేబు చేసిన వాగ్దానభారం, బలహీనుడనైన నేను భరించవలసి వచ్చింది, తీర్పు ప్రకారం వాళ్ళు

బాధ్యత లేకపోయి నప్పటికీ, థాకూరు సాహెబు చేసిన వాగ్దానాన్ని చెల్లించడానికి సహాయ పడతాననే నేను చెప్పిన మాటలలోని సారాంశం. కారణాలేమైనా కానీయండి, ముస్లిములూ భయతులూ కూడా, థాకూరు సాహెబు చేసిన వాగ్దానమును చెల్లించ వలసి, బాధ్యత నుండి ఆయనను తప్పించారు. ముస్లిములనూ భయతులనూ సమాధాన పఱచ లేక, థాకూరు సాహెబుకు పరిషత్తు పేర్లను ఏడింటిని పంపించాను. వారి జవాబులో నేను పంపిన ఏడుగురిలోనూ ఆరుగురను గూర్చి వారు రాజకోట సంస్థాన ప్రజలని ఋజువుచేయ వలసిందని నన్ను అడిగారు. వారి అభ్యంతరానికి కారణాలేవో సూచనగా నైనా నాకు తెలిపి ఉండ వలసింది. న్యాయ్యంగా నిజమని నమ్మడానికి వీలున్న యే మాటను ఋజువు చేయమన్నప్పటికీ, ఒక్కొక్క విషయాన్ని ఋజువు చేయడాని కొక్కొక్క సంవత్సరం పడుతుంది. కాని వారు కోరిన ఋజువులను నేను పంపించాను. నేను చేయవలసిన ప్రయత్నాలన్నీ చేసిన తరువాత నా ఓర్పు పోయి, రాజప్రతినిధి చేసిన వాగ్దాన షరతుల ననుసరించి, స్థానిక సర్వాధికారియైన అక్కడి రెసిడెంటుకు మొరపెట్టుకొంటూ ఆయన సహాయం కోరినాను. ఆయన నన్ను మాట్లాడడానికి రమ్మని ఆహ్వానించాడు. నే నాయనతో ఈ చిక్కులను విడదీయడానికి మార్గాంత రాలను చర్చిస్తున్న సమయంలో, కమిటీ సభ్యులను వేరొక్కనే అధికా రాన్ని నేను వదులుకొని ఈ సంతాపాన్ని చల్లార్చుకొంటే బాగుండు ననిపించింది. ఆమాటే ఆయనతో అన్నాను. ఆయన అది చాలా ఉదార మైన సంగతి అన్నాడు. వెంటనే కమిటీ సభ్యుల నందరినీ థాకూరు సాహెబు పేర్కొని, డిశంబరు 26 న చేయబడిన ప్రకటనలోని షర తుల ననుసరించి నివేదికను తయారుచేసి, దానిని పరిషత్తుకు చూపించి, పరిషత్తువారు డిశంబరు ప్రకటనలోని షరతుల నా నివేదిక సరిగా నిర్వ ర్తించ లేదని తలంచినట్లయితే, వారి అభ్యంతరాలతో సహా ఆ నివేదికను

ప్రధాన న్యాయాధిపతి నిర్ణయం కొఱకు పంపడం మంచిదని సూచిం
చాను. ఈ సూచనను రెసిడెంటు, దర్బారు శ్రీ వీరవాలాకు పంపినాను.
కాని ఘనత వహించిన ఠాకూరు సాహెబు దానిని తోసిపుచ్చాడు.
ఠాకూరు సాహెబు గానీ దర్బారు శ్రీ వీరవాలా గానీ, పైనుండి వచ్చిన
ఒత్తిడివల్ల మాత్రమే తామేమైనా ఈయవలసి వచ్చిందని అనుకొన్న
ట్లయితే, నా అహింస అపజయం పొందినట్లుగా తెలుసుకోనేటందుకే
మనస్తాప కరములైన ఆ పదిహేనునాళ్ళ అనుభవాలూ నాకు తోడ్పడ్డాయి.
అటువంటి అభిప్రాయం వారి మనస్సులలో నుండి తొలగించ వలసిందని
నా అహింస నాకు చెప్పింది. కాబట్టి నా కవకాశం రాగానే, సామ్రా
జ్యాధికారుల సహాయం పొందడం నాకు సంతోషకరమైన పని కాదని,
దర్బారు శ్రీ వీరవాలాకు నచ్చచెప్ప ప్రయత్నించాను. అహింస అలా
ఉండగా, రాజకోటతో నాకు గల సంబంధాన్ని బట్టి కూడా అటువంటి
నిగ్రహం కలిగి ఉండడం విధి అని తలంచాను. నేను హఠాత్తుగా గిబ్సన్‌కు
చేసిన సూచనకు కూడా కారణ మదేనని ఆయనకు వివరించాను. కాని
ఆయన "రాజుగారి కమిటీ నివేదికను, డిశంబరు ప్రకటన ననుసరించి
పరిశీలించి, అభ్యంతరాలుంటే వ్రాసి, ఇండియా ప్రధాన న్యాయాధి
పతి నిర్ణయం కొఱకు పంపడానికి పరిషత్తు కధికారం ఉండాలని మీరు
కోరినారుగదా! ఇది ఒత్తిడిని తొలగించడ మవుతుం దంటారా? రాజు
గారినీ ఆయన మంత్రినీ పూర్తిగా ఎందుకు నమ్మరాదు? మీరు కోరిన
దంతా ఇప్పుడు మీకు రాకపోవచ్చుగాక. కాని వచ్చేదేదో రాజుగారి
సుహృద్భావం తోనూ, ముందు పూర్తిగా యిచ్చే వాగ్దానం తోనూ
వస్తుందికదా! నన్ను గురించీ ఠాకూరు సాహెబును గూర్చీ పరిషత్సభ్యు
లేమన్నారో మీకు తెలుసునా? స్వస్థానాధిపతుల నుండి రాజకీయ
సంస్కరణాలను కోరే ప్రజలు ప్రవర్తించవలసిన విధ మిదేనా?" అని
నిగ్గదీసి అడిగాడు. ఆయన మాటలలో పరిషత్తు సభ్యులను గూర్చి కాఠి

న్యమూ ద్వేషమూ కనిపించింది. కాని నా కతనిని ఎదురుదెబ్బ కొట్టవలె ననే కోరికకు బదులుగా, నేను అహింసను సరిగా ఆచరణలో పెట్టలేదని హఠాత్తుగా అర్థమయింది. మానవ స్వభావం లోని మంచితనాన్ని విశ్వసించ లేకపోయినా నన్ను అతని వాదంలోని పటిమను నేను గ్రహించాను. అహింసలో నాకు గల నమ్మకం అత్యల్పమైన దన్నట్లుగా తోచింది నాకు. ఆపైన చాలా సేపు మే మిరువురమూ మాట్లాడుకొన్నాము. చాలా సూచనలను గూర్చి విచారించాము. కాని మా సంభాషణ పూర్తి కాలేదు. నేను చిక్కులోనుండి ఇంకా బయట పడలేదు. అయితే మే మిద్దరమూ విడిపోయే టప్పుడు పరస్పరం అర్థం చేసుకొన్నాము. దర్బారు వీరవాలాను మంచిమాట చేసుకో వలెనని నేను ప్రయత్నించడం సరియైన పద్ధతే నని నా అభిప్రాయం.

తరువాత నా సహచరుల కీ క్రొత్త పద్ధతిని గూర్చి చెప్పినాను. రాజకోటకు వచ్చిన ఈ ముప్పుకు మూలకారణం దర్బారు శ్రీ వీరవాలాయే అనీ అతనిని తీసివేస్తే తమకు పూర్ణ స్వరాజ్యం వచ్చినట్లే ననీ అనేక సార్లు వారు నాతో అన్నారు. అయితే వా రనుకొనేది సుపరిపాలనం కాని స్వపరిపాలనం కాదనే విషయం వారు తేలికగా గ్రహించేటట్లు చేశాను. అహింసను గూర్చి నేను చెప్పే అర్థాన్ని వా రంగీక రించేటట్లయితే దర్బారు శ్రీ వీరవాలాను తొలగించడానికి గాక, ఆయనను మార్చడానికి ప్రయత్నించ వలసి ఉంటుందని నిన్న జరిగిన సమావేశంలో వారికి నేను తెలియపరిచాను. ఆయనలోని మంచి గుణాలను కనుగొనడానికి ప్రయత్నిస్తూ పనిచేయడం వలన మాత్రమే సాధ్య మవుతుంది. హింసాయుత మానవుణ్ని శక్తిహీనుణ్నిగా చేయడానికి అహింసలో అత్యంతమైన విశ్వాసం కలిగి ఉండాలి. హింస నోటిలో తల దూర్చడమే నిజమైన అహింస. ఆవులకు తెలివి ఉండి, తగినన్ని ఆవులను పెద్దపులి నోటి కందించ గలిగినట్లయితే, పులికి ఆవుమాంసం మీద అసహ్యం పుట్టి తన

ప్రకృతిని మార్చుకొంటుంది. కాబట్టి దర్బారు శ్రీ వీరవాలాను గూర్చిన భయాన్నీ, అహింసా శక్తి యందుగల అవిశ్వాసాన్నీ వారు విడిచిపెట్టి, చూడడానికి అసంభవంగా కనిపించే ఆదర్శాన్ని అందుకొనే టందుకు ప్రయత్నించాలి. ఈ నూతన సిద్ధాంతాన్ని వా రత్యంత శ్రద్ధతో విన్నారు. వారికిది ఒప్పుదలగా ఉందో లేదో నే నెరుగలేను. వా రొప్పుకొన్నారనే అనుకొంటూన్నాను; "ప్రధాన న్యాయాధిపతి యిచ్చిన తీర్పును చింపివేసి, కేవలం దర్బారు శ్రీ వీరవాలా మంచితనం మీద ఆధారపడి ఉండవలసిందని మీరు మా కుపదేశిస్తూ అవలంబించిన ఈ వింత వైఖరి సరియైనదే నని మీకు నమ్మక మున్నదా" అని వారే నన్ను న్యాయ్యంగా అడిగి ఉండవలసింది. వారు నన్నామాట అడిగి ఉంటే నాకంత ధైర్య మింకా కలుగలేదు. "ధైర్యవంతుల లోనే అహింస అభివృద్ధి పొందుతుంది" అని నాకు చెప్పక తప్పేదికాదు.

కాబట్టి నా ఆశ దగ్ధమై, శరీరం జీర్ణమై, రిక్తహస్తాలతో వచ్చాను. రాజకోట నా కమూల్యమైన పరిశోధనాలయ మయింది. కతియవాడు కుటిల రాజకీయాలలో నా ఓర్పు తీవ్రంగా పరీక్షింప బడింది. నన్నూ సర్దారు పటేలునూ మఱచిపోయి, దర్బారు శ్రీ వీరవాలాతో ఆలోచనలు సాగించి, వారి కనీసపు కోర్కెలు లభించినట్లయితే మాతో చెప్పకుండానే అంగీకరించ వలసిందని అక్కడ పనిచేసే వారికి చెప్పి వేశాను. "నేను ఓడిపోయినాను. నీవు జయం పొందుదువు గాక! సాధ్యమైనంత ఎక్కువ యిచ్చి ప్రజలను సమాధానపఱచి వెంటనే నాకు తంతీ పంపితే, నేను తాత్కాలికంగా ఆరిపోయిు దనుకుంటూన్న ఆశాజ్యోతి తిరిగీ నా హృదయంలో ప్రకాశిస్తుంది." అని దర్బారు సర్దారు వీరవాలాకు చెప్పి వచ్చాను.

కడసారికి 1939 మే 17 వ తేదీని గాంధీ తన పొరపాటును గుర్తించి, ఆ సాయంకాలము తన సహచరులతో తర్జన భర్జ

నలు చేసిన పిమ్మట, తాను ప్రధాన న్యాయమూర్తి తీర్పువలన పొందిన ప్రయోజనాలను వదులుకోవలెనని నిర్ణయించు కొన్నాడు. 1939 మే 20 తేదీ "హరిజన్" లో తన దౌర్బల్యం వల్ల తాను వైస్రాయికీ ప్రధాన న్యాయమూర్తికీ కలిగించిన అనవసర శ్రమకున్నూ, తన సహచరులతోపాటు తానుకూడా దర్బారు శ్రీ వీరవాలాను గూర్చి మనస్సులో చెడ్డ అభిప్రాయాలను పెట్టుకొన్నందుకున్నూ, క్షమాపణలు చెప్పుతూ ఠాకూరు సాహెబు నుద్దేశించి కూడా తన్ను మన్నించమని వ్రాశాడు. ఒకపక్క తీర్పును చూపించి భయపెడుతూ, రెండోపక్క దర్బారు శ్రీ వీరవాలా ద్వారా ఠాకూరు సాహెబుకు సలహా యిప్పించి మంచి రాజ్యాంగ సంస్కరణలను రాబట్టుకోవడానికి ఆయనతో మంచిమాట లాడుతూ, రెండువిధాలా నాటక మాడినట్లు కనిపించే నేరానికి తాను గురియైన ట్లాయన ఒప్పు కొన్నాడు.

రాజకోట ఉపసంహారానంతరం గాంధీ నేర్చుకొన్న కొత్త గుణపాఠము ననుసరించి, తిరువాన్కూరు ప్రజలు సర్ సి. పి. రామస్వామయ్యరు పైన మోపిన నేరములను ఉపసంహరించు కొని, మహారాజు తోనూ దివానుతోనే తమ వ్యవహారములను పరిష్కరించుకోవలసిందని సలహా యిచ్చాడు.

ఏమిటి నీవిప్పు డవలంభించిన కొత్త పంథా అని ఆండ్రూసు అడిగిన ప్రశ్నకు గాంధీ ఇలా వ్రాస్తున్నాడు:

> అది హింసకు ఇంకా దగ్గర మార్గం. అంతకంటె కొత్తేమీ లేదు దానిలో. నేను వైస్రాయి దగ్గరకు వెళ్ళవలెనంటే నేను సిమ్లాకు నడవనైనా

నడవాలి లేదా ఆయన ఢిల్లీకి విమానంమీద రానైనా రావాలి. గోఖలేతో కలసి వెళ్ళినప్పుడు తప్ప ఎన్నడూ దక్షిణ ఆఫ్రికాలో నేను కారులో గాని విక్టోరియాలో గాని వెళ్ళలేదు. నేనెన్నడూ మోటారులో ఎక్క పోలేదు. జనరల్ స్మట్సు దగ్గరకు నేనెప్పుడూ నడిచే పోయినాను. ఉపవాసం చేయడం, బాగా ఒత్తిడి చేయడమే. తండ్రిని తాగుబోతుతనంనుండి తప్పించాలంటే, ఉపవాసం యొక్క ఉపయోగం. విషము కానీ తుపాకీ కానీ కాదు. అందువల్లనే నేను సీరవాలాకు విరుద్ధంగా ఉపవసించాను. కాని ఆయనయందు నేను కాఠిన్యం వహించాను. నేను ఢిల్లీనుండి వచ్చిన తరువాత అంతకుపూర్వ మెన్నడూ నా ఉపవాస మంత ఫలప్రదం కాలేదనుకొన్నాను. కాని కొద్దిరోజులలోనే నేను పొందదకూడనిచోట నుండి సహాయం పొందప్రయత్నించడం వల్ల తప్పు చేసినట్లుగా గ్రహించాను.

ఉపవాసాలను గూర్చి 1940 నవంబరు 7 వ తేదీని గాంధీ చేసిన ప్రకటనతో ఈ అధ్యాయము ముగించెదము గాక. అది ఇది ,

నాచే ఉద్దేశింప బడిన ఉపవాస వ్రతమును విరమించ వలసిందని నా కనేక తంతులు వస్తున్నవి. దాదాపు ఈ అన్ని తంతీవార్తలు కూడా నా మిత్రుల దగ్గరనుండే. వారంతా నే నింకా జీవించి ఉన్నట్లయితే, దేశానికి ఉపయోగ కరమైన సేవ చేస్తాననే ఉద్దేశంతో, నా ఆరోగ్యమును గూర్చి ఆందోళన పడుతున్నారు. ఒక వరు మాత్రం రాజకీయాలలో ఉపవాసాలకు స్థానం లేదనీ, పైపెచ్చు రాజకీయ వాతావరణాన్ని కల్లోలం కావించి స్వాతంత్ర్య పోరాటంలోని ప్రభుత్వ వ్యతిరేక శక్తులను బలహీన పరుస్తుందనీ, గట్టిగా నిందిస్తూ తంతు లిచ్చారు. నా మిత్రులకూ నా విమర్శకులకూ కూడా కృతజ్ఞుడను. వర్కింగు కమిటీ సభ్యులూ నేనూ ఉపవాసాన్ని గూర్చి చాలాకాలం తర్జన భర్జన పడ్డాము.

వ్యక్తి సత్యాగ్రహాన్ని విశాలపఱిచే సందర్భంలో ఉపవాసం విషయం కొంతకాలం ఆపి ఉండవచ్చు. కాని ఇంతవరకు నేను విన్న ఈ విషయాలన్నీ జీవిత వ్యవహారా లన్నిటిలోనూ రాజకీయాలలో కూడా ఉపవాసాల ఔచిత్యాన్ని గూర్చి గాని, అవసరాన్నిగూర్చి గానీ మొదటి నుండీ నాకున్న అభిప్రాయాలను మార్చలేక పోయిన వన్నమాట నేనిక్కడ చెప్పవలసి ఉంది. ఇది ఒక కొత్త ఆయుధమని నేను అంగీకరిస్తాను. అంతేకాదు, దీనిని ఎవరు పడితే వా రుపయోగించడానికి వీలు లేదనీ, శాసనోల్లంఘనము వలెనే దీనిని కూడా ఇందులో నిపుణులైన వారు మాత్రమే ఉపయోగింప నర్హులనీ కూడా నేను ఒప్పుకొంటాను. శాసనోల్లంఘనానికి కొన్ని అర్హతలు కావలసి వచ్చినప్పుడు, ఉపవాసవ్రత మవలంబించడాని కంతకంటె అనేక రెట్లెక్కువ అర్హతలు కావాలి. నాకా అర్హతలు ఉన్నవని నా నమ్మకం. 1906-07 ల నుండీ, 38 సంవత్సరాలు బుద్ధిపూర్వకంగా ఈ విధమైన శిక్షణ పొందడానికి నాకు భగవత్ప్రసాదితము లైన అవకాశాలు లభించినవి. కాని ఊరికే యంత్రం లాగున ఉపవాసాలు చేయడానికి వీలు లేదు. అవి ఒక అజ్ఞాత శక్తి యొక్క ఆజ్ఞల ననుసరించి ప్రారంభింపబడ వగినవి; దానిని మీరు అంతర్వాణి అనండి, దైవం అనండి, మరి మీ యిష్టంవచ్చిన ట్లింకేమైనా అనండి. నాలో ఏదో ఒకటి నన్ను ప్రేరేపిస్తూండడం చేత నే నుపవాసం చేయవలసి రావచ్చునని అన్నాను. నా అంతట నేనే దానిని నిరోధిస్తూన్నాను. నా భావం ఎంత బలంగా ఉన్నా శరీరం దుర్బలంగా ఉంది. ఉపవాసంలో తగినంత ఉదకం పుచ్చుకోకపోతే ముఖ్యంగా మొదటిరోజులు గడవడం చాలా కష్టమన్న సంగతి నాకు తెలుసు. అయితే శరీరం ఎంత బలహీనంగా ఉన్నా అన్ని శక్తులనూ మించిన ఆ అజ్ఞాతశక్తి నాలో అధివసించినట్లయితే, దుర్బలత్వం దూరంగా పోతుందని నా విశ్వాసం.

కాని ఇంకా ఆ ధైర్యం నాకు కలగడం లేదు. అది కలిగేదాకా ఉపవాస ముండదన్నమాట నిశ్చయం. అది కలిగినట్లయితే స్నేహితులు తెచ్చే ఒత్తిడి గానీ, విమర్శకులు చేసే కోపం గానీ గ్రహించడానికి తగిన శక్తి నాకు తప్పిపోతుంది. కాబట్టి ఆదటినీ సహనంతో రానున్న సంఘటనలను నిరీక్షింప కోరుతూన్నాను.

దేశాన్ని ప్రస్తుత సంకట స్థితినుండి తటింప చేసేటందు కందరూ నాకు తోడ్పడడానికి సావకాశ మున్నది. స్నేహితుడు గానీ విమర్శకుడు గానీ నాకు సహాయ పడడానికి తగిన అనేక మార్గాలను నేను చెప్పిఉ ఉన్నాను. ప్రజలు నాకు తోడ్పడవలసిన పద్ధతులను సూచిస్తూ నేనిప్పు డొక పెద్ద ప్రకటన చేయదలచుకోన లేదు. హరిజన్ వార పత్రికను ప్రచు రించడం మానివేసిన తరువాత, బహిరంగ ప్రకటనలను చేయాలనే కోరికే పోయింది నాకు. అసంఖ్యాకులైన ప్రజల ఆందోళనమును అణచి వేయడానికిన్ని, మిత్రుల ప్రశ్నలకు ప్రత్యుత్తరంగా నున్నా నేనీ ప్రక టన చేయవలసి వచ్చింది.

### ఉపవాసాలు ఒత్తిడియా?

ఉపవాసం కూడా ఒక మోస్తరు ఒత్తిడియే అనిపించు కుంటుందా? ఈ ప్రశ్నకు గాంధీగారు ఇలా జవాబిచ్చారు: ఒక్కొక్కప్పుడు చచ్చేదాకా, మరొకప్పుడు చావ సిద్ధమయ్యే వరకూ, ఉపవాసవ్రత మవలంబించి గాంధీ తన శత్రువులను ఒత్తిడి చేయడం సత్యాగ్రహ పద్ధతికి కేవలం విరుద్ధంకాదా అని ఆయనను చాలామంది తీవ్రంగా విమర్శిస్తూంటారు. తాను ప్రారంభించిన ఉద్యమ విజయానికి తా నవలంబించే ఉపాయం వల్ల తానే ఉద్యమ నియమాలను అతిక్రమిస్తూన్నాడా లేక

అసలు ఉద్యమానికే భంగం తీసికొని వస్తూన్నాడా అనే విషయాన్ని, నిర్ణయించి చెప్పడానికి నిజంగా ఉద్యమ మూలపురుషుడే ఎక్కువ అర్హుడు. శత్రువు యొక్క ఆలోచనకు, నిర్ణయానికీ, చర్యకూ స్వేచ్ఛ లేకుండా చేసే ఉత్కృష్ట శక్తిని గానీ ప్రభావాన్ని కానీ, ఒత్తిడి అనేటట్లయితే ఆ శక్తి యెటువంటిదో విచారిస్తేనే గాని అది ఆక్షేపణీయ మైనదా కాదా అనే సంగతి తేలదు. "ఏ" అనే మనిషి తన బుద్ధి విశేషం వల్ల "బి" మనస్సును లోబఱచుకో గలిగిన మొదల అది ఆక్షేపణీయమైన పద్ధతి కాదు. "ఏ" తన నైతిక బలంవల్ల "బి"ని లొంగదీసుకొన్నా తప్పుకాదు. శరీర బలంవల్ల గానీ దౌర్జన్యంవల్ల జయించ ప్రయత్నిస్తే, అది ఒత్తిడి అవుతుంది. సత్యాగ్రహం ప్రతివానినీ బాధ పడమని ఉపదేశిస్తుంది కాని, బాధపెట్టమని ఉపదేశించదు. అయితే సత్యాగ్రహం వల్ల పొందే బాధకు మితీ మేరా ఉండవచ్చు లేకపోవచ్చు. ఉపవాసం వల్ల కలిగే బాధకు మితీ మేరా లేదు. కాబట్టి న్యాయ్యమైన కారణం కోసం, సరియైన సమయంలో ప్రభుత్వానికి గానీ, సంఘానికి గానీ, షాహుకారుకు గానీ వ్యతిరేకంగా ఉపవాసం ప్రారంభించ బడినట్లయితే అది ఒత్తిడి అనిపించుకోదు. కాబట్టి గాంధీ రాజకోట సంస్థానమునకు వ్యతిరేకం గానూ, హరిజన సమస్యా సందర్భంలో బ్రిటిష్ ప్రభుత్వ, కులీన హిందువులకు వ్యతిరేకం గానూ, అహమ్మదాబాదు మిల్లు యజమానులకు వ్యతిరేకం గానూ చేసిన ఉపవాసాలను, ఒత్తిడి అనడానికి వీలులేదు. అయితే ప్రతివారూ ప్రతి పనికీ ఉపవాసాన్ని ప్రారంభించ కూడదు.

ఎందువల్ల ననగా ఉపవాసం బాధావలంబనమునకు పరమావధి. ఎంతో సమగ్రదృష్టి, యుక్తాయుక్త వివేకజ్ఞానమూ కలిగిన వారే దానిని ప్రారంభింప తగినవారు.

యూరోపు ఖండంలోని ప్రజలు దేవుణ్ణి ప్రత్యక్షం కావించుకొని శాంతిని పునరుద్ధరించు కోవలెనని కోరుతూ, ఇటీవల (1940 డిశంబరు) పోప్ ఏడురోజులు ఉపవసించడమే ఉపవాస వ్రతముయొక్క ఉత్తమత్వాన్ని తెలియచేసే ప్రబల నిదర్శనం.

పికెటింగు - బహిష్కరణము

గాంధీ సత్యాగ్రహ కార్యక్రమంలో పికెటింగుకు మంచి స్థానముంది. 1921 లో కల్లు సారా దుకాణాలను, తరువాత విదేశీ వస్త్ర విక్రయ శాలలనూ పికెటింగు చేసేటప్పుడు ఈ మాట ఎక్కువ ప్రచారంలోకి వచ్చింది. పిదప కొద్దికాలం లోనే కోర్టులకు వెళ్ళే లాయర్లనూ పరీక్షలకు పోయే విద్యార్థులను, కౌన్సిళ్ళకు పోయే శాసనసభ్యులను పికెటింగు చేయడం ఆచారమైపోయింది. రీడింగుప్రభువు కాలంలో గాంధీ గవర్నమెంటుల మధ్య రాజీ సూచనలు భగ్నమై పోవడానికి కొంత కారణం పికెటింగే. 1931 ఫిబ్రవరి మార్చి నెలలోని గాంధీ ఇర్విను రాయబారాలు కూడా ఈ కారణంతోనే విచ్ఛిన్నం కావడానికి సంసిద్ధమైనవి. పికెటింగు సామాన్య చట్టసమ్మతమైన నైతిక హక్కనీ, పికెటు చేయబడే మనుష్యులకు కానీ ప్రదేశాలకు కానీ అపాయం కలిగించకుండా ఉన్నంతవరకు వ్యతిరేక ప్రదర్శనాలు కానీ నిరసన నినాదాలు కానీ చేయకుండా ఉన్నంత

వలసు, పికెటింగును నిరోధించడం ఆపివేయడం కూడదని పని అనీ గాంధీ వాదం. సమ్మెల సందర్భం లోనూ పికెటింగు సందర్భం లోనూ కూడా, యజమానులపైన గానీ సమ్మెలో నుండి చీలి పోయిన వారిపైన గానీ దౌర్జన్యం చేయకూడదని గాంధీ గట్టి నియమం చేశాడు. సమ్మెదారుల కారణం న్యాయ్యమైనదై వారిలో ఆత్మ విశ్వాసమూ ఐకమత్యమూ ఉంటేనే కాని సమ్మె ప్రారంభించ కూడదనే సంగతి, చెప్పకుండానే చదువరులు గ్రహించుకో గలరు.

1931 మార్చిలో జరిగిన గాంధీ ఇర్విన్ ఒడంబడికలో పికె టింగు వివరింప బడ్డది. అందులోనే బహిష్కరణమును గూర్చి కూడా ఒక ముఖ్యమైన భావం ఉదాహరింప బడింది. బ్రిటిష్ వస్తు బహిష్కరణమునకూ విదేశీ వస్తు బహిష్కరణమునకూ సూక్ష్మభేదం గలదని గాంధీ వివరిస్తూ ఉంటాడు. మొదటి దానిలో ఒక విధమైన ద్వేషం కనిపిస్తూన్నది కనుక పనికిరాదనీ, రెండవది కేవలం స్వయం సంపూర్ణతా స్వయం శక్తులను అభి వృద్ధి చేసుకోవడానికే ఉద్దేశింప బడినది గనుక అవలంబించ తగినదనీ గాంధీ వాదం కాబట్టి గాంధీ ఇర్విన్ ఒడంబడిక జరి గిన తక్షణం, 1931 మార్చి ఐదో తేదీన బ్రిటిష్ వస్తు బహిష్కా రోద్యమాన్ని గాంధీ నిలిపివేశాడు. పికెటింగు బహిష్కారము లకు సంబంధించిన గాంధీ ఇర్విన్ సంధి షరతు ఒకసారి జ్ఞాపకం చేసుకో తగ్గవి.

**విదేశీ వస్తు బహిష్కరణ సందర్భంలో రెండు విషయాలను మనసాలో చించాలి. ఒకటి, బహిష్కరణ లక్షణం, రెండు, దానిని ఆచరణలో**

పెట్టడాని కవలంబించే పద్ధతులు. ప్రభుత్వంవారి పద్ధతి ఇది : భారత దేశ భౌతిక పరిస్థితులను వృద్ధిచేసే నిమిత్త ముద్దేశింపబడిన ఆర్థిక పారిశ్రామి కోద్యమములోని భాగంగా, భారత దేశంలో తయారైన వస్తువులను ప్రోత్సాహ పరచడానికి వారంగీకరిస్తారు. శాంతి భద్రతలకు భంగంలేని పద్ధతిని, వ్యక్తి స్వాతంత్ర్యానికి అడ్డు తగలని సందర్భంలో, స్వదేశీ వస్తువుల ప్రదర్శనమునకు గాని, ప్రోత్సాహమునకు గాని, ప్రచారమునకు గాని నిరోధం కలిగించ వలెనని కూడా వారు కోరరు. అయితే విదేశీవస్తు బహిష్కరణం (వస్త్రముల విషయంలో తప్ప- వస్త్ర బహిష్కరణం విదేశీ వస్త్రాలన్నిటికీ వర్తింప చేయబడ్డది) శాసనోల్లంఘనోద్యమ సమయంలో, కేవలంగా కాకపోయినా ముఖ్యంగా, బ్రిటిషు వస్తువులకు వ్యతిరేకంగా రాజకీయ ప్రయోజనముల కోసం ప్రయోగింప బడినది.

కాంగ్రెసు యొక్కయు, బ్రిటిష్ ప్రభుత్వము యొక్కయు, సంస్థానాల యొక్కయు, ఇంగ్లాండులోని రాజకీయ కక్షుల యొక్కయు ప్రతినిధు లందఱూ కలిసి రాజ్యాంగ ప్రణాళికను స్నేహభావంతో చర్చించడాని కిటువంటి బహిష్కరణం అనుగుణంగా ఉండదనే ఉద్దేశంతో శాసనోల్లఘనం విరమింప బడడంతోనే బ్రిటిషు వస్తు బహిష్కరణోద్యమం కూడా విరమింప బడింది. అందువల్ల రాజకీయోద్యమం ప్రచండంగా జరుగుతూన్న సమయంలో ఉద్రేక పూరితులై బ్రిటిష్ వస్తువులను కొనడం గానీ అమ్మడం గానీ మానివేసినవారంతా, ఇష్టమైతే తమ వైఖరిని మార్చుకోవడాని కేమీ అభ్యంతరం లేదని నిర్ణయింప బడింది. విదేశీ వస్తువులకు బదులుగా స్వదేశీ వస్తువులను ప్రోత్సహించే సందర్భం లోనూ, కల్లు సారాయీలను ఇతర మత్తుపదార్థాలనూ ఉపయోగించ కుండా చేసే సందర్భం లోనూ, సాధారణ శాసనానికి అనుగుణంగా ఉన్నంతవఱకు తప్ప ఆ హద్దు మించి పికెటింగు చేయకూడదని నిర్ణయించ

బడినది. అటువంటి పికెటింగులో నిర్బంధం గానీ భయపెట్టడం కానీ నిరోధించడం కానీ, వ్యతిరేక ప్రదర్శనాలు గానీ, ప్రజలకు అడ్డంకు కలుగజేయడం కానీ ఉండకూడదు. శాసనబద్ధంగా వ్యవహరించాలి. ఎక్కడైనా ఈ పైన చెప్పబడిన అశాస్త్రీయ పద్ధతు లుపయోగింప బడినట్లు తెలిసినయెడల ఆచోట పికెటింగు తాత్కాలికంగా ఆపివేయ బడును.

"సత్యాగ్రహికి శారీరక శిక్షణ మవసరమా? అయితే అది ఎటువంటిదిగా ఉండాలి" అని తరచుగా అడుగుతూంటారు. గాంధీ సత్యాగ్రహోద్యమాన్ని విరమించిన తరువాత 1934 మే లో స్వచ్ఛంద సైనిక దళోద్యమమును పునరుద్ధరించ వలసినదిగా ఆయనను కొందరు బలవంతం చేశారు. అప్పటికీ ఆయన అందుకు వ్యతిరేకంగానే ఉన్నాడు. 1940 లో కొన్ని రాష్ట్రాలవారు స్వచ్ఛంద సైనికుల కిచ్చిన శిక్షణను కూడా ఆయన ఇష్టపడలేదు. గాంధీ యీ విషయాన్ని గూర్చి పూర్తిగా చర్చించే ఉన్నాడు. ఆయన అభిప్రాయాలు సత్యాగ్రహ శాస్త్ర చర్చకు సన్నిహితంగా సంబంధిస్తున్నవి. అవి ఇవి :

"సైనికశిక్షణ ఎలా ఉంటుందో మనకందరికీ దగ్గరదగ్గరగా తెలియనే తెలుసు కాని అహింసా శిక్షణ దానికి భిన్నంగా ఉండాలని మన మెప్పుడూ అనుకోలేదు. పూర్వ మెప్పుడైనా ప్రపంచంలో ఎక్కడైనా అటువంటి శిక్షణ ఈయబడిందా అనే సంగతి తెలుసుకొనేటందుకు కూడా మన మెప్పుడూ ప్రయత్నించ లేదు. పూర్వ మటువంటి శిక్షణ ఈయబడు తూండేదనీ, ఇప్పుడుకూడా అక్కడక్కడా యాదృచ్ఛికంగా ఈయ బడుతున్నదనీ నా అభిప్రాయం. హఠయోగంలోని వివిధ ఆసనాలూ దీనికి సంబంధించినవే. ఈ పద్ధతులలో ఈయబడిన శారీరక శిక్షణవల్ల, ఇతర గుణములతోపాటు ఆరోగ్యము, బలం, చురుకుదనం, శీతోష్ణము లను ఓర్చుకోగల శక్తి కలుగుతవి.

పూర్వంనుండీ వస్తూన్న ఈ అహింసాత్మక వ్యాయామం ఇప్పటికీ ఆచరణలోనే ఉంది. కాని దీనిని ఇంకా అభివృద్ధి చేయడానికి అవకాశముందని నా తలంపు. ఈ శాస్త్రము యొక్క మూలపురుషుడు ప్రజా సమూహమునకు సంబంధించిన అహింసా తత్త్వాన్ని ఉద్దేశించాడో లేదో నేను చెప్పజాలను. ఈ వ్యాయామం వ్యక్తి మోక్షమును ఉద్దేశించి ఏర్పాటు చేయబడినది. ఈ ఆసనాలన్నీ శరీరాన్ని బలిష్ఠం గానూ పరిపుష్టం గానూ చేసుకొని, మనస్సును స్వాధీన పఱచుకోవడానికి తోడ్పడతవి. మన ముద్దేశిస్తూన్న సమష్టి అహింస అన్నిమతాల వారికీ వర్తిస్తుంది. అందువల్ల అందుకు సంబంధించిన నియమాలు అహింసలో నమ్మకమున్న అందరూ అంగీకరించేటట్లుండాలి. అంతేకాక, మనమిప్పుడొక అహింసా సైన్యాన్ని అనగా ఒక సత్యాగ్రహ సంఘాన్ని నిర్మించాలని అనుకొంటూన్నాము. కనుక ఇదివర కున్నదానిని పునాదిగా తీసికొని క్రొత్త దాన్ని కట్టడం తేలిక. ఇక మనం సత్యాగ్రహికి కావలసిన శారీరక శిక్షణమును గూర్చి విచారింతము. సత్యాగ్రహి, మానసికం గానూ శారీరకం గానూ కూడా ఆరోగ్యంగా లేకపోయినట్లయితే నిర్భయత్వాన్ని అలవాటు చేసుకోలేడు.

ఆతడు రాత్రింబవళ్ళు ఒక్కచోటనే నిలచినవాడు నిలచినట్లుగా కావలి కాసే శక్తి గలిగి ఉండాలి; వానకూ ఎండకూ చలికీ ఓర్చుకోగలిగి, జబ్బు పడకుండా ఉండాలి; అపాయకర ప్రదేశములలోకి పోవడానికీ, అగ్ని ప్రమాదాలు తటస్థించిన స్థలాలకు పరుగెత్తడానికీ బలం కలిగి ఉండాలి; నిర్జనారణ్య ప్రదేశాలలోనూ శ్మశానభూముల లోనూ ఒంటరిగా తిరగడానికి తగిన ధైర్యంతో ఉండాలి; [illegible] దెబ్బలకు, ఆకలికి, అంతకంటే ఎక్కువ కష్టాలకూ ఓర్చుకొని తన స్థలాన్ని కదలకుండా నిలబడగలిగి ఉండాలి. లోపలికి పోవడానికి వీలు లేనట్లు కనిపిస్తూన్న దెబ్బలాటల మధ్యకు దూకేటందుకు తగిన ఉపాయమూ

శక్తి కలిగి ఉండాలి; మేడల పైన మంటలతో ఆవరింపబడిన మనుష్యులను రక్షించేటందుకు. భగవన్నామ స్మరణంతో పరుగెత్తే కోరికా సమర్థతా కలిగి ఉండాలి; వరదలో కొట్టుకొనిపోయే వారినీ నూతిలో మునిగిపోయే వారినీ రక్షించేటందుకు నీటిలో ఉరుకగల ధైర్యం కలిగి ఉండాలి.

ఈ జాబితాను అంతు లేకుండా ఎంతవఱకైనా పెంచవచ్చును. ఆపత్తులోనూ దుఃఖంలోనూ ఉన్న ప్రజలను రక్షించడానికి, మన మెటువంటి కష్టములకైనాసరే ఆనందంతో భరించగలిగిన శక్తిని సంపాదించవలయు ననియే దీని సారాంశం. ఈ మూలసిద్ధాంతాన్ని అంగీకరించినవారు, సత్యాగ్రహుల వ్యాయామ శిక్షకు తగిన నియమాలను తేలిగ్గా నిర్మించ గలరు. ఈ శిక్షణకంతకూ పునాది దైవభక్తి అని నాకు గట్టి విశ్వాసం. అది లేకపోతే సంకటసమయం వచ్చేసరికి ఇంత శిక్షణమూ ఎందుకూ పనికిరాకుండా పోవచ్చు. దేవుడి పేరుచ్చరించడానికి సిగ్గుపడే వాళ్లెంతో మంది కాంగ్రెసులో ఉన్నారని చెప్పి నా మాటలను తేలికగా తోసివేయకండి! నేను భావించి పెంచి పెద్ద చేసిన సత్యాగ్రహ శాస్త్ర సిద్ధాంతాలను బట్టి మాత్రమే ఈ సంగతులు నేను మీకు చెప్పుతూన్నాను. ఎవరే పేరుతో ఆయనను ఎఱిగి ఉన్నప్పటికీ సత్యాగ్రహి చేతిలో ఉన్న పరికరం దైవమే. అతడు లేకపోతే అతి భయంకరాయుధములు గల శత్రువు నెదుట, సత్యాగ్రహి సారం లేనివా డవుతాడు. ప్రపంచంలో అనేకమంది భౌతిక బలానికి పాదాక్రాంతు లవుతూంటారు. కాని దైవాన్నే రక్షకుడుగా నమ్మినవాడు అవనిపై గల అత్యంత శక్తివంతుడికికూడా తలఒగ్గడు.

సత్యాగ్రహికి దైవభక్తివలెనే బ్రహ్మచర్యం కూడా ముఖ్యం. బ్రహ్మచర్యం లేకపోతే సత్యాగ్రహికి తేజస్సు ఉండదు. ప్రపంచానికంతటికీ వ్యతిరేకంగా నిరాయుధుడై నిలబడగలిగిన ఆత్మబలముండదు. బ్రహ్మచర్యమంటే కామక్రియా నిగ్రహం కలిగిఉండి వీర్యశక్తి వృథా కాకుండా

ఉంచుకోవడమన్నే సంక్షిప్తార్థంలో ఇక్కడ వాడుతూన్నాను. అంతేకాని ఇదివరకు నేనుచెప్పిన సమగ్రార్థంలో ప్రయోగించడం లేదు. కొద్ది భోజనంతో జీవిస్తూ వేతే బాహ్యోపచారాలేమీ లేనివాడు బలం కలిగి ఉండాలంటే, ఆయన వీర్యశక్తిని కాపాడుకోవలసిన అవసరముంది. మనిషి పొందగలిగిన అత్యంతమైన ఐశ్వర్యం అదే. దానిని నిలుపుకో గలిగినవాడు దానినుండి నూతన శక్తిని సంపాదించుకొంటూంటాడు. బుద్ధిపూర్వకంగాగాని అబుద్ధిపూర్వకంగాగాని దానిని వెచ్చించివేసి నట్లయితే చిట్టచివరకు క్షీణబలుడై పోతాడు. అవసరం వచ్చినప్పుడు తనబలం అక్కరకురాదు.

కాబట్టి సత్యాగ్రహి పొందవలసిన శరీర వ్యాయామ శిక్షణంలో బల్లెము, కత్తి మొదలగు మారణ సాధనాలకు స్థానం లేదనే సంగతి ఇప్పటికి తెలిసి ఉంటుంది. ప్రస్తుత స్థితిలో ఇంతకంటెనూ ఎక్కువ భయంకర సాధనాలు ప్రచారంలో ఉన్నవి. ప్రతిరోజూ కొత్త కొత్తవి కనిపెట్ట బడుతూన్నవి. అటువంటి సమయంలో ఈ చిన్న మారణ సాధనాలలో నేమి ప్రయోజనం? నిజమైనదిగానీ ఊహాజనితమైనదిగానీ అసలు "భయమనే" పదార్థాన్ని జయించే శక్తిని సంపాదించుకో దలచిన మానవునకు, కత్తి యేపాటి భయాన్ని పోగొట్టగలదు? కత్తిసాము తెలుసుకొనినంత మాత్రాన నిర్భీతుడైన మానవుణ్ని నేనింతవరకు చూడ లేదు. మహావీరుడూ కానీ తదితరులు కానీ కత్తిని ఉపయోగించడం తెలుసుకొన్నందువల్ల అహింసా తత్పరులు కాలేదు. కత్తుల ఉపయోగం వారికి తెలిసినప్పటికీ కూడా భయం విడిచిన కారణం చేతనే వారలా అయినారు.

కొంచెం అంతర్దృష్టి కలవానికి కత్తిమీద ఆధారపడి ఉండడం అలవా టయినతరువాత, దానిని విడచిపెట్టడ మెంత కష్టమో తెలుస్తుంది. కాని దానిని బుద్ధిపూర్వకంగా విడచిపెట్టిన వాని అహింస, కత్తి [illegible]

గించడమే తెలియక, దాన్ని చూచి భయపడనని అనుకొనేవాని అహింస కంటె ఎక్కువ చిరస్థాయిగా ఉంటుంది. దీనినిబట్టి నిజమైన అహింసా తత్పరుడుగా ఉండవలెనంటే ప్రతివాడూ మొట్టమొదట ఖడ్గధారియై యుండి, దాన్ని ఉపయోగించడం తెలిసి ఉండవలెనని అర్థం కాదు. అలా అనుకోవడం, రోగమాత్రమే మర్యాదస్థుడవుతాడనీ, రోగిష్ఠియే ఆరోగ్యవంతుడౌతాడనీ విషయాసక్తుడు మాత్రమే బ్రహ్మచారి కావీలున్నదనీ అనుకోవడం వలెనే ఉంటుంది. నిజానికి మన ఆలోచనలన్నీ ఆచారాన్ని అనుసరించి ఉండడంచేత, అందులోనుండి బయట పడడం కష్టమౌతూన్నది. అంతే కాదు, మనం నిర్మమకారంతో ఆలోచించ లేనందువలన సరియైన నిర్ణయాలకు రాలేక మాయా వాగురలలో చిక్కు కొని పోతూన్నాము.

సత్యాగ్రహ శాస్త్రంలో మనం పరిశీలించ వలసిన వింకా రెండు అంశాలున్నవి. వాటితో గాని అది పరిపూర్ణం కాదు. అందులో ఒకటి ప్రార్థన, రెండోది దారిద్ర్య స్వీకరణము. ఈ రెండు విషయాలను గూర్చి స్వానుభవం లేనిది వ్రాయడం కష్టం. కాబట్టి వీటిని గూర్చి గాంధీ వ్రాసిన విషయాలనే ఉదాహరించడం యుక్తం.

## ప్రార్థన

ప్రార్థన నాకు రక్షరేఖ అయింది. అది లేకపోతే నేనెన్నడో పిచ్చి వాణ్ణి అయి ఉండేవాణ్ణి. నా ప్రజా జీవితంలోనూ వ్యక్తి జీవితం లోనూ కూడా అనేక కఠినతమములైన కష్టాలను అనుభవించాను. అవి తాత్కాలికంగా నన్ను నిరుత్సాహంలో ముంచివేసినవి. నేనా నిరుత్సాహంలో నుండి తప్పించుకో గలగడానికి కారణం ప్రార్థనయే. సత్యమువలె ప్రార్థన నా జీవితంలో ఒకభాగం కాదు. కేవలం అవస

రాన్ని బట్టి ప్రార్థనను అవలంబించాను. ప్రార్థన లేనిదే హాయిగా బ్రతుక జాలననే సందిగ్ధ స్థితిలో పడ్డాను నేను. దేవునిలో నాకు భక్తి కుదిరిన కొద్దీ ప్రార్థనలో నాకు ఆసక్తి ఎక్కువ అయింది. అది లేని జీవితం జడం గానూ శూన్యం గానూ కనిపించింది.

నేను దక్షిణ ఆఫ్రికాలో క్రైస్తవ మత కైంకర్యాలకు హాజరవుతూండే వాణ్ణి. కాని అవి నన్ను ఆకర్షించలేక పోయినయి. నా క్రైస్తవ మిత్రులు దేవుణ్ణి దైన్య వృత్తితో యాచించేవారు. నే నలా చేయ జాలక పోయినాను. అందులో నేను పూర్తిగా అపజయం పొందినాను. దేవునిలోనూ ప్రార్థనలోనూ అపనమ్మకంతో ఆరంభించాను. చాలా కాలం వరకూ నా జీవితం శూన్యంగా నేను భావించలేదు. శరీరానికి ఆహారం అవసరమైనట్లు ఆత్మకు ప్రార్థన అవసరమనే సంగతి పెష్ట కాలానికి తెలిసింది నాకు. ఇంకా ఆలోచిస్తే నిజానికి ఆత్మకు ప్రార్థన అవసరమైనంతగా శరీరానికి ఆహార మంత అవసరం కాదు. శరీరాన్ని ఆరోగ్యంగా ఉంచవలెనంటే ఆహారం మానివేయవలసి వస్తుంది. ప్రార్థన మానివేయవలసిన తరుణం రాదు. ప్రార్థన విషయంలో అతి అనేది లేదు. ప్రపంచంలో అత్యుత్కృష్ట ప్రవక్తలుగా పరిగణింపబడే బుద్ధుడు, జీసస్, మహమ్మదు, ఈ సద్గురు కూడా ప్రార్థనద్వారా తమకు వెలుగు కనిపించిందనీ, అది లేకుండా తాము జీవించలేక పోయినామనీ ప్రశ్నించ వీలు లేని ప్రత్యక్ష ప్రమాణాలను మనకు చూపి వెళ్ళినారు. లక్షలాది హిందువులూ క్రైస్తవులూ మహమ్మదీయులూ కూడా ప్రార్థన వల్లనే ఉద్ధరింప బడుతూన్నారు. వారిని నీవు అసత్యవాదులని గానీ, వట్టి భ్రమలో చిక్కుకొని బాధపడుతూన్నారని కానీ, త్రోసివేయాలి. అయితే అటువంటి "అబద్ధం" లో సత్యాన్వేషినైన నాకు ఆనందం కనిపిస్తూన్నది. అది లేకపోతే నాకు ఒక్క క్షణం కూడా స్థైర్యం ఉండేది కాదని నేను ధైర్యంగా చెప్పగలను." రాజకీయాకాశంలో నిరాశా నా

వంక దృష్టి నిగిడించి చూస్తూన్నప్పటికీ కూడ, నా మనశ్శాంతిని నే నెన్నడూ కోల్పోలేదు. పైగా నా మనశ్శాంతిని చూచి, తమరలా ఉండగలిగితే బాగుండు ననుకొనేవారి ననేకమందిని నే నెఱుగుదును. అది ప్రార్థనవల్ల వచ్చిన శాంతి. నేను పండితుణ్ని కాను. కాని ప్రార్థనా పరుణ్ని అనుకొంటూన్నాను. ప్రార్థన ఉండవలసిన పద్ధతిని గూర్చి నాకంత పట్టుదల లేదు. ఈ విషయంలో ఎవరికి తోచినట్లు వారు ప్రవర్తించ వచ్చును. కాని పూర్వ ప్రవక్తలు పోయిన పాత దోవలలో, వారి అడుగు జాడలను అనుసరించడం అపాయంలేని పద్ధతి.

మీకు దేవునిలో విశ్వాసం కలిగించడానికి నాకు శక్తి చాలదు. కొన్ని విషయాలు తమంతట తాము ఋజువు కావలసి ఉంటవి. కొన్ని ఋజువు కావడానికే వీలులేదు. దేవుని ఉనికి రేఖాగణిత మూలసూత్రం వంటిది. అది మనకు హృదయగోచరం కాకపోవచ్చు. బుద్ధి గోచరం సంగతి నేను మాట్లాడ దలచుకోలేదు. బుద్ధితో చేసే అన్ని ప్రయత్నాలూ దాదాపు భ్రాంతిపూరితమౌతాయి. యుక్తివాదం మీకు నిజమైన దేవుడిలో నమ్మకం కలిగించజాలదు. ఎందువల్ల ననగా అది యుక్తివలన సాధించ తగినది కాదు. అది అన్నియుక్తులనూ అతిక్రమిస్తుంది.

దేవుని ఉనికిని ప్రతిభాసింప చేయదగిన వనేక మహద్విషయా లున్నవి. కాని ఆ విధంగా యుక్తివాదంతో మిమ్ముల నొప్పించడానికి ప్రయత్నించేసి మీ తెలివితేటలను నే నవమానించ తలచుకోలేను. కాబట్టి అన్ని తర్క వితర్కాలనూ అవతలబెట్టి దేవునిలో పసిపాపవంటి నిష్కల్మష విశ్వాసం కలిగి ఉండండి. నేను ఉంటే దేవుడూ ఉన్నాడు. నాకు సంబంధించినంతవరకు అటువంటి విశ్వాసం నా జీవితాని కవసరం. కోట్లకొలదీ ప్రజల విషయంలో కూడా అంతే. దైవభక్తిని గూర్చి వారు మాట్లాడలేక పోవచ్చును. కాని వారి జీవితమునుండి, అది వారి బ్రతుకులో భాగమని మీరు గ్రహించగలరు.

# దారిద్ర్య స్వీకరణం

నేను రాజకీయ కోలాహలంలో పడిపోయినానని తెలుసుకోవడం తోనే, అవినీతికీ అసత్యానికీ రాజకీయ ప్రయోజనాలకూ దూరంగా ఉండవలె నంటే నేనేమి చేయవలసి ఉంటుంది, అని ఆలోచించుకోవడం ప్రారంభించాను. అప్పుడు నేనేమి చేశానో ఆ వివరాలన్నీ వినడానికి మీకు వినోదంగా ఉండవచ్చును గాని, నేనవి ఇక్కడ చెప్పదలచుకో లేదు. కాని మొదట్లో అది నాకు కృత్యాద్యవస్థ అయిపోయింది. నా భార్యతోనూ పిల్లలతోనూ కూడా కుస్తీ పట్టినంతపని జరిగింది. అది ఇప్పటికీ నాకు బాగా జ్ఞాపక మున్నది. ఆ సంగతి అలా ఉండనీయండి. ఏ ప్రజల కష్ట పరంపరలను నేను కళ్ళారా ప్రతిరోజూ చూస్తూన్నానో, ఆ ప్రజల మధ్య నేను జీవిస్తూ వారిని నేను సేవించవలెనంటే, నా భాగ్య భోగ్యాలను విడిచివేయడం ముఖ్యావసరమని నాకు గట్టిగా తోచింది. నాకిలా తోచిన తక్షణం నాదగ్గర ఉన్నదంతా త్యజించానని నేను మీకు నమ్మకంగా చెప్పజాలను. మొట్టమొదట ఈ అభిప్రాయాన్ని ఆచరణలో పెట్టడానికి చాలా జాగయింది. జాగవడమే కాదు, చాలా బాధగా కూడా ఉన్నట్లు జ్ఞాపకం. కాని కాలక్రమేణా నావి అనుకొన్న వనేకం నేను వదిలివేయవలసి వచ్చింది. ఆ తరువాత కొంతకాలానికి వాటిని వదలివేయడమే ఆనందంగా కూడా పరిణమించింది. పిదప అన్నీ ఒకటి తరువాత ఒకటి నా దగ్గరనుండి హారతికర్పూరం వలె హరించి పోయినవి. అప్పుడు నా నెత్తిమీద బరువంతా తీసివేసినట్లయింది. తేలికగా నడవగలిగాను. ప్రజాసేవ యెక్కువ చులుకుగానూ సుఖంగానూ సంతోషం గానూ కూడా చేయగలుగుతానని తోచింది. ఏమాత్రం మిగిలి ఉన్నా అప్పుడు నాకు చిక్కుగానూ బాధగానూ తోచేది. ఈ వర్ణించిందంతా నా అనుభవం.

ఆ సంతోషానికి కారణ మేమా అని ఆలోచించాను. "నాది అనుకొనేది ఉంటే దానిని రక్షించు కొనేటందుకు ప్రపంచమంతా ఎత్తి వచ్చినా ఎదురు నిలవడానికి నేను తయారు కావాలి. అంతేకాక అది తమకు కావాలన్నప్పటికీ రాక ఇబ్బంది పడుతూన్నవారు చాలామంది ఉన్నారు. కటువువల్ల ఆకలితో బాధపడుతూన్నవారు నన్నొంటరిగా చూచి, తమకు కావలసినది నా దగ్గరనుండి తీసుకోవడంతో సంతృప్తి పడక, నాకసలే లేకుండా చేదామని ప్రయత్నించినప్పుడు. నేను పోలీసు సహాయం కూడా పిలవవలసి వస్తుంది. కాబట్టి వారికది కావలసి తీసుకొనే పక్షంలో, ఏ విధమైన దురుద్దేశమూ లేకుండా తీసుకోనీ. నాకంటె వారి కెక్కువ అవసరం కనిపిస్తూన్నది అని నాలో నే ననుకొన్నాను." అదే నా ఆనందానికి కారణం.

తరువాత మళ్ళీ ఇలా ఆలోచించాను : ఆస్తి కలిగి ఉండడమే అపరాధంగా కనిపిస్తూన్నది. కావాలంటే ఇతరులకు కూడా లభించేటందుకు వీలున్న వస్తువులనే నే నుంచుకోవాలి. కాని అనుభవం వల్ల అది అసంభవంగా కనిపిస్తుంది. కాబట్టి మనం చేయవలసిం దేమిటంటే ఏమీ ఉంచుకోక పోవడమే. అనగా ఉన్నదంతా బుద్ధిపూర్వకంగా వదిలివేయడం. అయితే ఉన్నదంతా వదలివేయ వలసిందని ఒకవంక ఉపన్యసిస్తూ నీ ఒంటిమీద ఇన్ని వస్తువుల నెలా ఉంచుకొన్నావు అని మీరు నన్నడగవచ్చును. ఇప్పుడు నేను చెప్పిన విషయాలను పైపైన అర్థం చేసుకొన్నట్లయితే మీ అవహేళనమున కవకాశ ముంది. కాని మీరు నా మాటలలోని ముఖ్య భావాన్ని గ్రహించండి. మీకు శరీర మున్నంతవరకు దానిని కప్పడానికి ఏదో ఒకటి కావలసి వస్తుంది. కాబట్టి మీ శరీరానికి మీకు లభించిందంతా ఉపయోగించకండి. ఎంత తక్కువ, అవసరమో అంత తక్కువ ఉపయోగించండి. మీ రుండడానికి సౌధాలు కావాలని కోరుకోకండి. ఎంత కప్పు అవసరమో అంతతో సరిపుచ్చుకోండి. కూడు గుడ్డల విషయంలో కూడా అదే ఆదర్శంగా గ్రహించండి.

నేడు మనము నాగరికత అనుకొనే దానికన్నీ, అందరూ వాంఛించ తగిన స్వర్గ రాజ్యంగా చిత్రించి నేను మీకు ప్రదర్శిస్తున్న దానికన్నీ, దిన దినమూ వైమనస్యం కలుగుతూండడం మీరు గమనిస్తూనే ఉన్నారు. పైపెచ్చు కోరికలను హెచ్చించుకోవడమే నాగరికతకు కావలసిన ప్రధాన సంస్కృతిగా కూడా భావించ బడుతూన్నది. మీకొక గది ఉండడం తోనే రెండు కావాలి, మూడు కావాలి, ఎన్ని ఉంటే అంత సంతోషం అనిపిస్తుంది. ఇక ఇల్లు నిండిపోయేటంతవరకూ గృహోపకరణాలు కావాలనిపిస్తుంది. అన్ని విషయాలలోనూ కూడా ఈలాగే కోరికల కంతుండదు. మీరెంత భోగం అనుభవిస్తారంటే అంత ఎక్కువ సంస్కారం కలిగినవారుగా అనుకొంటారు జనం. ఇప్పుడు నేను చెప్పినదంతా అనాగ రికతను సమర్థించేవారు చెప్పగలిగినంత బాగా చెప్పలేకపోయి ఉండ వచ్చు. కాని నేను దానిని అర్థం చేసుకొన్న పద్ధతిని మీకు వివరించాను. ఇక మీరెంత తక్కువ భోగం అనుభవిస్తారంటే అంత తక్కువ కోరికలు కలుగుతాయి. అంత ఎక్కువ హాయిగా ఉంటారు. హాయి అంటే మీ స్వీయ భోగం కాదు. మీ సోదర మానవులను మీరు సేవించే భాగ్యం కలగడం. మీ ఆత్మ, దేహం, మనస్సు, ఈ అన్నీ వారి సేవలోనే విని యోగించడం.... ఈ దేహం కూడా మీది కాదని నమ్మండి. తాత్కా లికంగా ఇది మీ స్వాధీనంలో ఉంచబడింది. మీకీ శరీరం ఎలా వచ్చిందో అలాగే పోవచ్చు కూడాను.

కాబట్టి నాలో సంపూర్ణ విశ్వాస ముంచిన మీరు, దైవాజ్ఞ అయితే మీ శరీరాన్ని కూడా అర్పింప సంసిద్ధంగా ఉండాలని నా కోరిక. ఇక మీ శరీరం నా స్వాధీనంలో ఉన్నంతకాలము, భోగలాలసత్వముతోనూ ఐహిక సుఖానుభవముల తోనూ జీర్ణించి పోకుండా, మీరు మేలుకొని ఉన్నంతసేపూ ప్రజా సేవలోనే ఉపయోగ పడాలి. మీ శరీరానికే ఈ సిద్ధాంతాన్ని వర్తింప చేసినప్పుడు ఇక వస్త్రాలు మొదలయిన వస్తువుల కెంత బాగా అనువర్తింప చేయవచ్చునో ఆలోచించండి......

ఎవరైతే ఈ పైన చెప్పిన ప్రకారం తమకు సాధ్యమైనంత సంపూర్ణ దారిద్ర్యాన్ని బుద్ధి పూర్వకంగా తెచ్చుకొని (ఈ సందర్భంలో పూర్ణత్వమును పొందడం అసాధ్యం కనుక సాధ్యమైనంత అంటూన్నాను) ఆదర్శప్రాయు లవుతారో వారు, నీవేమీ లేకుండా చేసుకొన్నప్పుడు ప్రపంచ భాగ్యమంతా నీపాలే అవుతుందని చూపగల ప్రమాణ పురుషులు కాగలరు. అనగా నిజంగా నీ కవసరమైన దంతా నీకు వచ్చి తీరుతుంది. అన్నం అవసరమైతే వెంటనే అన్నం వస్తుంది.

మీలో అనేకమంది భజనపరు లున్నారు. భజనచేసి భోజనం సంపాదించు కొన్నట్లుగా అనేకమంది క్రైస్తవుల నోటినుండి నేను విన్నాను. ప్రార్థన చేస్తే కావలసింది లభిస్తుందని వా రంటారు. నేను నమ్ముతూ న్నాను. కాని ఇది చాలదు. నాతో కలసి ఇంకో అడుగు ముందుకు వేసి నన్ను నమ్మండి. నేను చెప్పినట్లుగా సర్వమూ విడిచిపెట్టి శరీరాన్ని కూడా సమయం వస్తే సమర్పించడానికి సిద్ధంగా ఉన్నవాళ్ళు (వారు చాలా కఠినంగా అణువణువూ పరీక్షించుకొని తమకు తామే వ్యతిరేకంగా తీర్పు చెప్పుకొనేటందుకు తయారుగా ఉండాలి) నిజంగా లేనివాళ్ళు కారని వాళ్ళకే తెలుస్తుంది...... మళ్ళీ అన్నదానికంతా అక్షరాలా అర్థం తీయకండి. దేవుడంత కఠినుడు భూమండలంలో లేడు. అతడు మాటు మాటుకూ మిమ్మల్ని ఒరిపి చూస్తాడు. మీ విశ్వాసం చలిస్తూ న్నప్పుడు, మీ శరీరం దుర్బల మవుతూన్నప్పుడు, మీరు కుంగిపోతూ న్నప్పుడు, ఏదో ఒక రూపంలో మీ కాయన సహాయపడి, మీరు విశ్వాసం కోలుపో కూడదనీ మీరు పిలవగానే తాను ప్రత్యక్ష మౌతాననీ నమ్మకం కలుగచేస్తాడు. అయితే, ఆయన మీరు చెప్పినట్లు వినడు. ఆయన చెప్పినట్లు మీరు వినాలి. ఇది నా అనుభవం. అత్యంత సంకట సమయాలలో ఒకప్పుడు కూడా ఆయన నన్ను విడనాడినట్లు నాకు జ్ఞాపకం లేదు.

# అధ్యాయము ౭

## మతము

శతృ మితృలతో సమాన శాంతి కలిగి మెలగవలెననీ, ప్రతి జంతువు తోనూ తాదాత్మ్యమును పొంది జీవించ వలెననీ గాంధీ యొక్క మహదాశయం. ఆయన జాతీయత కాని, దేశభక్తి కాని, పృథగ్భావాన్ని పరిబుద్ధ స్వార్థ పరత్వమునూ వెల్లడించవు. అవి "నిరంతర శాంతి స్వాతంత్ర్య సీమకు దారి తీస్తవి." అటువంటి సీమ ఈ భూమండలంలో లేదనీ చచ్చిపోయిన పిమ్మట పొందే స్వర్గలోకమనీ ఆయన అభిప్రాయం కాదు. అది కేవలం మన ప్రపంచానికి సంబంధించినదే ననీ మన మవలంబించ వలసింది కూడా లౌకికమార్గమే ననీ ఆయన మతం. కనుకనే ఆయన ఇలా అన్నాడు :

> మతం లేని రాజకీయాలు లేవు. అవి మతాన్ని అనుసరిస్తవి. మతాన్ని వీడిన రాజకీయాలు మృత్యు వాగురుల వంటివి. అవి ఆత్మను చంపుతయి.

మనిషి దేహాత్మల మిశ్రమ సమన్వయం. దేహం ఆధారం,-ఆత్మ ఆధేయం. కేవలం ఆధారం విషయంలో అతి జాగ్రత్త వహిస్తూ ఆధేయమును గూర్చి అశ్రద్ధ వహిస్తే, ఆత్మ నశించి దేహం అభివృద్ధి పొందుతుంది. అదే విధంగా అంతా ఆత్మయే అయి దేహం లేకనే పోతే, జీవితం ఒక అస్పష్టమైన అగ్రాహ్యమైన అతి సున్నిత పదార్థంగా తయారవుతుంది. గాంధీ యోగి యైనప్పటికీ సన్న్యాసి యైనప్పటికీ ప్రపంచమును, ప్రాపంచిక వ్యవహారములను విడచిపెట్ట లేదు. భారతదేశపు యోగులు

వారు సేవించే ప్రదేశములను బట్టి తీర్థ, ఆశ్రమ, వన, అరణ్య, గిరి, పర్వత, సాగర, సరస్వతి, భారతి, పురి, మొదలగు పేరులతో వ్యవహరింప బడుతూన్నారు.

కాని గాంధీ నది సాగర పర్వత పట్టణ నగరాలను వేటినీ తన సేవా స్థలములుగా కోరుకోక, గ్రామమును తన నివాస స్థలముగానూ గ్రామీణులు తాను సేవించదగిన వారుగానూ నిర్ణయించు కొన్నాడు. వారి సేవలో తనకు ఆత్మావబోధం కలుగుతుందని ఆయన నమ్మకం. కాబట్టి ఆయనకు రాజకీయమూ మతమూ దేహాత్మల వంటివి. ఈ రెంటిలో ఏది లేకపోయినా లోపమే. అవి రెండూ జీవిత నాణెమునకు రెండు వైపులు. రెండూ కలిస్తేనే పూర్ణజీవిత మవుతుంది. ప్రత్యగాత్మ పరమాత్మతో అనుసంధానం పొందినప్పుడు కలిగే సంతోషం నుండి జనించిన అగ్రాహ్యానందం యొక్క జాడ్యస్థితియే సన్న్యాసమని మానసిక వైద్య శాస్త్ర నిపుణుల అభిప్రాయం. సన్న్యాసి అంతకంతకు లౌకిక జీవితానికి దూరమైపోయి స్వకర్మలను త్యజిస్తాడు. ఇంకా విశేష సందర్భాలలో పర్వతాల లోనో, గుహాలలోనో ఏకాంతంగా విహరిస్తూ పరమాత్మతో సన్నిహిత సంబంధం కలిగి ఉంటాడు. ఆరావళీ పర్వతాలలో అనేక సంవత్సరాలు కడపిన బుద్ధుని చరిత్రములోనూ సెంటు క్యాథిరీన్ ఆఫ్ సీనా, సెంట్ ఆంథోనీ, సెంటు ఫ్రాన్సిస్ ఆఫ్ అస్సిసీ, మొదలగువారి కథలలోనూ, ఇంకా అనేకచోట్ల కూడా మత ప్రవక్తలు ధ్యాన నిష్ఠతో ఏకాంతంగా కొంతకాలం గడపి అప్పుడప్పుడు తమ మత వ్యాప్తి కోసం పీఠాధిపతులుగా బయలు వెడలుతూండినట్లు

మనం వింటున్నాము. గాంధీ జీవితంలో ప్రవృత్తి నివృత్తు లావిధంగా పరస్పర పరివర్తనం పొందుతూండడం మనము చూడలేదు. కాబట్టి గాంధీ, మతంతో రాజకీయాలను కలంగ దీస్తున్నాడని కానీ, రాజకీయాలతో మతాన్ని కళంకితంగా చేస్తూన్నాడని గానీ నిందించడం, మానవ సంఘాన్ని గానీ ప్రధాన జీవిత నిర్మాణ నియోగములను గానీ గ్రహించలేక పోవడం. ఆయన అహింసకు ఆధారమే యిది. ఆయనకు శత్రు మిత్రులు సమానులు. మనమీ యిరువురిలో ఎవరితో పోరాడ వలసి వచ్చినా అహింసా మర్యాదను అతిక్రమించ కుండానే పోరాడాలి.

తప్పో ఒప్పో, కాని కాంగ్రెసులో మాత్రం మతాలను ఆధారంగా చేసుకొన్న తీవ్ర విభజనలు లేవు. మతం కేవలం వ్యక్తుల విశ్వాసానికి సంబంధించింది; మనిషికీ అతని సృష్టికర్తకూ మధ్య ఉండే బాంధవ్యాన్ని తెలియ చేస్తుందది. కాబట్టి ఏ మతమువారైనప్పటికీ మనుష్యులందఱికీ సంబంధించిన సామాన్య విషయాలు సమష్టిగా నిర్వర్తించుకో వలసిన వనేక ముంటవి. మతాలు మనుష్యులను చీలదీయ డానికి కాక వారిని ఐక్యం కావించడాని కుద్దేశింప బడినవి. మతాలు మానవులలో పరస్పర కలహములకు హత్యలకూ కారణం కాకూడదు. ఇండియాలో అంతకంతకు మతం నశిస్తూన్నదని గాంధీ చాలా విచారపడుతూ ఉంటాడు. ఆయన మతము అని వాడినప్పుడు ఒక ప్రత్యేక మతాన్ని ఉద్దేశించక అన్ని మతముల లోను ఇమిడి ఉన్న ముఖ్యోద్దేశాన్ని ఉద్దేశించి వాడతాడు, "మనము దేవుడికి దూరమై పోతూ

న్నాము" అని ఆయన భయం. ఒకప్పుడు గాంధీ దేవుణ్ణి "సత్యము" అని వర్ణించాడు. మఱొకప్పుడు ఇలా అన్నాడు :

ఆనిర్వచనీయము. నిగూఢము, విశ్వవ్యాప్తము, సృష్టిస్థితి లయములకూ పునఃసృష్టికీ కారణభూతము, ప్రాపంచక నిరంతర పరిణామములకు మూలము, నిర్వికారము అయిన చేతనాశక్తి లేక భావమే దైవం.

## గాంధీ సనాతన ధర్మపరుడు

ప్రపంచం లోని భక్తి పరులకు గాంధీ నిగూఢ పురుషుడు. ఆయన నేటి మతాలను కాదనడు. కాని వాటిలో ఉన్న విషయాలన్నిటినీ ప్రబోధించడు. తాను సనాతన ధర్మపరుడనని చెప్పుకోవడానికి చాలా గర్వపడతాడు. కాని ప్రత్యేకం ఒక్క వేదాలలోనో, లేక బైబిలు, కురాను, జెండ్ అవస్తాలలోనో మాత్రమే దైవతత్వం ఉన్నదనే మాట విశ్వసించరాదని ఖండితంగా అంటాడు. ఆయన అన్ని మత గ్రంథాలకూ సమాన స్థానమిస్తాడు. సనాతన ధర్మ సౌధం, "అహింస", "సత్యము", "బ్రహ్మచర్యము", "అపరిగ్రహము" అనే నాలుగు మూల స్తంభాలమీద నిర్మింపబడినదని ఆయన మతం. వట్టి పాండిత్యం వ్యర్థమనీ, పాండిత్యంతో పాటు పవిత్రత కూడా ఉంటేనే రాణిస్తుందనీ ఆయన ఆశయం. ఆయన ఇలా వ్రాశాడు :

వర్ణాశ్రమం మానవ ప్రకృతిలో పరంపరాగతంగా వస్తూన్న ధర్మం. హిందూమతం దానిని కేవలం శాస్త్రంగా చేసింది. అందులోని నాలుగు విభాగాలూ మనుష్యుల వృత్తులను వివరించినవే కాని సాంఘిక సంబంధాలను నియమించడం కానీ నిరోధించడం కానీ చేయలేదు.

అన్ని వర్గాలూ కూడా సమాన ప్రయోజనకరములైన సాంఘిక సేవలకోసమే ఉద్దేశింపబడినవే. గాంధీ తన జీవితమును

నాలుగు వర్ణాల యొక్కయు, నాలుగు ఆశ్రమముల యొక్కయు ధర్మాల సూత్న సంయోగమునకు స్థానంగా చేశాడు.

నాలుగు వర్ణ విభాగాలను పూర్వం వలె హద్దు మీరకుండా ఆచరణలో పెట్టడానికి వీలులేని ఈ యుగంలో, గాంధీ విజ్ఞాన మును వెదజల్లే బ్రాహ్మణుడు గానూ, రక్షణ ఇచ్చే క్షత్రియుడు గానూ, ఐశ్వర్యాన్ని సమకూర్చే వైశ్యుడు గాను, ఉత్పత్తి చేసే శూద్రుడు గానూ ప్రాతినిధ్యం వహించి నిజమైన చాతుర్వర్ణ సంయోజకుడుగా వ్యవహరిస్తూన్నాడు. ఈ జీవిత విభాగం లోనే నాలుగు వర్ణాలకూ ప్రతిగా నాలు గాశ్రమాలు కూడా ఉన్నవి. వర్ణాలు హిందూజాతి అంతకూ వర్తిస్తాయి. ఆశ్రమాలు ప్రతి హిందువు యొక్క వ్యక్తిగత జీవితాన్ని నియమిస్తాయి. ప్రతి వ్యక్తీ మొదటి పాతిక సంవత్సరాలు బ్రహ్మచర్యాశ్రమం, తరువాత మరి పాతికేండ్లు గృహస్థాశ్రమం, పిమ్మట పదేళ్ళు వానప్రస్థాశ్రమం, చివరకు సన్న్యాసాశ్రమము స్వీకరించ వలెనని నియమింప బడినది. బ్రహ్మచర్యాశ్రమంలో జ్ఞాన సముపార్జనం, గృహస్థాశ్రమంలో భక్తిపూర్వక సంఘ సేవా పరత్వము, వానప్రస్థ సన్న్యాసాశ్రమములలో సర్వసంగ పరిత్యాగమూ ధర్మములుగా చెప్పబడెను. విగ్రహారాధనము మానవ ప్రకృతిలో భాగము. మానవు డెప్పుడూ రూపకల్పన చేసుకోకుండా ఉండలేడు. గాంధీ దీన్ని ఆక్షేపించడు. హిందూ మతం తక్కిన మతాలతో కలసి ప్రశాంతంగా కాలక్షేపం చేయ గలదు. సత్యం తనలో తప్ప తక్కిన మతాలలో లేదని అది యెన్నడూ చెప్పదు. కనుక హిందూ మతంల్లోకి ఇతరులను

కలుపుకోవడమనే పద్ధతి లేదు. గాంధీ జీవితంలోని చాలా విష యాలు, మనలను క్రైస్తవ సిద్ధాంతోప దేశములకు దగ్గర దగ్గ రగా తీసికొని పోగలవు. కాబట్టే గాంధీ జీవితం ప్రపంచ విఖ్యాత క్రైస్తవ రాజకీయ చతురుణ్ని తనవైపు కాకర్షించుకో గలిగింది. "మీలోని ఉత్కృష్ట పురుషుడు మీకు సేవకుడుగా ఉండనిండు" అని జీసస్ అన్నాడు. ఆయనే గాంధీ.

హిందూమతం ఆత్మ స్వాతంత్ర్యం కోసం శరీర సుఖాలను త్యజించ వలసిందని ఆదేశిస్తుంది. అందువల్ల ఆ మతంలో ఆత్మ నిగ్రహం పరమావధిని పొందిందని గాంధీ తలంపు. ఆయన దృష్టిలో ఆవు "కరుణా గీతం" అది మానవునికి దిగువ మెట్టులో నున్న జంతు ప్రపంచాన్ని నిరూపిస్తుంది. లక్షలాది ప్రజలచే మాతృదేవిగా పూజింప బడుతుంది. హిందూమత ప్రకారం ప్రతి మనిషీ తన ధర్మాన్ని తాను నిర్వర్తిస్తూండాలి; అన్ని మతాలు పరస్పర శాంతితో వర్థిల్లాలి; అది యుగ యుగాలనుండీ క్రమాభివృద్ధి పొందిన మతం. కాని అందులో అస్పృశ్యత, కణితి పెరిగినట్లు పెటిగింది. దానికి శస్త్రచికిత్స కావాలి.

## గాంధీ క్రైస్తవమతం

గాంధీయే ఒకప్పు డిలా అన్నాడు :

మానవజాతికి మహోపదేశకు లైనవారికి లభించిన స్థానం ఒకరిస్తే వచ్చిందికాదు. వారి సేవనుబట్టి వారి కది అధికారరీత్యా లభించింది. కాని దానినిగూర్చి కొన్ని అభిప్రాయాలను కలిగి ఉండడానికి మాత్రం సంఘంలో అట్టడుగునఉన్న జనులకుకూడా హక్కున్నది.

ఇక్కడ గాంధీ "ఈయడం" "పుచ్చుకోవడం" అనే మాటలలో బుద్ధిపూర్వకంగా భేదాన్ని నిరూపిస్తున్నాడు. మహాపురుషులను తాను గానీ తదితరులు గాని స్థానాన్ని యిస్తున్నామనుకొని అహంకార పడడం తప్పని ఆయన తలంపు. దీనినిబట్టి గాంధీః భారత దేశపు మహర్షుల యొక్కయు స్వధర్మం కోసం ప్రాణాలను త్యజించిన మహానుభావుల యొక్కయు యశో మందిరములోనూ, ప్రపంచ మహాపురుష సమ్మేళనంలోనూ, తన స్థానాన్ని తా నిదివఱకే నిర్మించుకొని ఉన్నాడన్నమాట సత్యము. కుటుంబముయొక్క విస్తృత రూపమే సంఘమని గాంధీ ఉద్దేశం. అందువల్ల సంఘ సమస్యలను విచారించడంలో కుటుంబ సంబంధములైన ఉదాహరణా లెక్కువ సహకారాలుగా ఉంటవని నమ్ముతాడాయన. మనకూ ప్రపంచ ప్రవక్తలకూ గల సంబంధం దాదాపు భార్యా భర్తల సంబంధం వంటిది. అందువల్ల హృదయంలో పీఠం పెట్టుకొని ఉన్న భార్యకు ఎటువంటి స్థాన మిద్దామా అని బుద్ధితో ఆలోచించడం ఎంత భయంకర విషయమో ఎంత విషాద భూయిష్టమైన సంగతియో ప్రపంచ ప్రవక్తల కీయదగిన స్థానమును గూర్చి యోచించడం కూడా అటువంటిదే" అని గాంధీ భావం. ఎంత సత్యము! "ప్రపంచ మహా ప్రవక్తలలో జీసస్ ఒకడు. ఏ మతానికి చెందినవారైనా సరే పరమత సిద్ధాంతాలను పరిశీలించి నందువల్ల హృదయం సంకుచితం కాదు; విశాల మవుతుంది. అన్ని మతోప దేశాలనూ భక్తిపూర్వకంగా పఠించడమే ఉత్కృష్ట విద్యా పద్ధతి. మనస్సంస్కారం హృదయ సంస్కారానికి

లోబడి ఉండడమే విద్యకు మూలంగా ఉండాలి" అని గాంధీ ఉపదేశించాడు. ఆయన ఇంకా ఇలా అన్నాడు :

"దేవుడు" అనే మాటకు మనలో ఒక్కొక్కరు ఒక్కొక్క అర్థం చెప్పుకో వచ్చును. మనకలా చెప్పుకోక తీరదు. ఎందువల్లనంటే దేవుడు మన ఈ ఒక్క అల్ప గోళాన్నే ఆవరించి లేడు. ఇటువంటి గోళాలను అర్బుదాల కొలదీ అవరించి లోకాలపై లోకాల కతీతుడుగా ఉన్నాడు. ఈ నేలపైన పాకే చిన్ని కీటకములవంటి మన మేవిధముగా ఆయన మహాత్మ్యాన్ని, ఆయన అనంత ప్రేమను, నిరంతర కరుణనూ ఎన్నగలము? మనిషి గర్వంతో ఆయనను తృణీకరించి నప్పటికీ, తోడి మానవుల కుత్తు కలు కోసినప్పటికీ, దేవుడు పేక్షాభావం వహించడం ఆయన అనంత కరుణా ప్రేమలకు చిహ్నము.

గాంధీ ఇటీవల వ్రాసిన వ్రాతలను బట్టి ఆయన విశ్వాస మీ దిగువ విధముగా నున్నట్లు కనిపిస్తున్నది.

దైవ నియతిని దాటకుండా ఉండడమే మతమని సిద్ధాంతీకరించ వచ్చును. దైవం అన్నా, దైవనియతి అన్నా ఒక్కటే. కాబట్టి దేవుడంటే నిర్వి కార చైతన్యమని అర్థ మవుతుంది. నిజానికి ఆయనను ఎవ్వరూ ఎప్పుడూ చూడలేదు. కాని అవతార పురుషులు మహర్షులు తమ తపోబలం ద్వారా దైవతత్వాన్ని మనకు మసక మసకగా చూపించి, మన హృదయాలను పరి శుద్ధంగానూ పవిత్రంగానూ చేసుకొనేటందుకు మనలో ప్రతివానినీ నిష్కళంకమైన నీతిని పాటించ వలసిందిగా నియోగించారు.

## మత ప్రచారకులకు సలహా

సింహళ దేశంలోని క్రైస్తవ మత ప్రచారకుల కాయన ఈ విధంగా ఉపదేశించాడు :

మనం, మన మాటల వల్లను, చేతల వల్లను, మన మతంలో కలుపుకో చూడటం అనవసరం. మన ప్రవర్తన వల్లనే ఆ పని చేయవచ్చును. మన జీవితాలు పఠించడానికి తగిన బహిరంగ గ్రంథాలుగా ఉండనీయండి.

అంతటితో ఊరుకోక ఇంకా ఇలా అన్నాడు :

> నైతిక ప్రధాన సిద్ధాంతాలకు విరుద్ధం కానంతవరకు దేశ ప్రజల ఆచార వ్యవహారాలలో బుద్ధిపూర్వకంగా గానీ అబుద్ధిపూర్వకంగా గానీ బలవంతంగా జోక్యం కలిగించుకోకండి. ప్రాచ్య ప్రజల జీవిత మూలాలను త్రెంచివేయడం మీ ధర్మంలో భాగం కాదని నేను మీకు గట్టిగా చెప్పగలను. వినయము, స్వాభిమానమును దేశభక్తినీ మించిన సుగుణం.

మిషనరీలకు చెప్పిన ఈమాటలాయన అసామాన్య ధైర్యాన్ని వెల్లడిస్తున్నవి.

క్రీస్తు ఉపదేశించిన ప్రధాన సిద్ధాంతానికీ క్రైస్తవజాతుల జీవితానికీ గల భేదాన్ని యోజించినట్లయితే "ఈనాడు క్రైస్తవ మతంగా వ్యవహరింప బడుతూన్నది చాలావరకు క్రీస్తు ప్రధాన సిద్ధాంత తృణీకరణమే" నని గాంధీ అభిప్రాయం. "జీసస్ స్వధర్మంకోసం ప్రాణాలను త్యజించిన మహానుభావుడు; త్యాగమూర్తి; దివ్యోపదేశకుడు; కాని పూర్ణపురుషు డనడానికి వీలులేదు" అని ఆయన తలంపు. త్యాగబుద్ధిలో హిందువులు క్రైస్తవులను అతిక్రమించారనియే గాంధీ విశ్వాసం. ఆయన హిందూ మతాన్నిగూర్చి ఇలా అన్నాడు :

> నే నర్థం చేసుకొన్నంత వరకు హిందూమతం నా ఆత్మను సంతృప్తి పరుస్తూన్నది. అది నా ఆపాదమస్తమూ ఆవరించి ఉన్నది. క్రైస్తవ ప్రధాన సిద్ధాంతంలో కూడా కానని ఊరడింపు, నాకు భగవద్గీతలోనూ ఉపనిషత్తులలోనూ కనిపిస్తూన్నది.

గాంధీ అన్ని మతాలనూ పరిశీలించి అన్నీ సరియైనవే ననీ, కాని అన్నీ అసమగ్రంగానే ఉన్నవనీ అర్థం చేసుకొన్నాడు. "హిందూ దేశంలో ప్రతి దృశ్యమూ ఆనంద జనకంగానే ఉంటుంది. కాని మానవుడే కొఱగానివాడు. పంచముని చిన్ని గుడిసెలో సత్య దైవములు మూర్తీభవించి ఉన్న దేశమిది."

మతము - అతీత శక్తులు

మానవునికి ప్రత్యేకం బయట గాని ప్రత్యేకం లోపల గానీ లేని విశ్వవ్యాప్తమైన శక్తి ఒకటి ఉంది. అది సమగ్ర జ్ఞాన బలములు గల అతీతశక్తి. దానిద్వారా, జీవితంలో సమన్వయం కాని అనుభవాలను సమన్వయం చేసుకొనే నిమిత్తం ఉపయోగ పడే మూలసిద్ధాంతమే మతం. మనిషి శీలమునూ జ్ఞానాన్ని అభివృద్ధి చేసేటందుకే మత ముద్దేశింప బడ్డదన్న మాటను ఎవ్వరూ కాదనరు. ఉపదేశములతోనూ ఆచారములతోనూ పాటు, కొన్ని వాదాలను కర్మకాండలనూ కూడా, మతం తప్పనిసరిగా ప్రచారంలోకి తీసికొని వచ్చినది. ఒక మతంలో విశ్వాసమును ప్రకటిస్తూ మఱియొక మతములోని ఆచారాలను అవలంబిస్తూన్నందువల్ల విశాలదృష్టీ, సమబుద్ధీ అలవడడాని కవకాశం ఉన్నమాట వాస్తవమే. మతాలు మూఢభక్తిని కలిగించి ఉండవచ్చును. కాని అవిశ్వాసాన్ని పురికొల్పి భావోద్రే కాన్ని పెంపొందింప చేస్తవి. అవి ప్రజలను విజ్ఞానవంతులుగా చేసి, సేవాసక్తినీ త్యాగబుద్ధినీ వారిలో కలిగించడానికి సహాయ పడుతవి. స్వార్థాన్ని త్యజించి ఇతరుల మంచిని కూర్చువే

నిరంతరం ధ్యానించడంవల్ల, ఉత్తమజ్ఞానం కలిగి మనిషిలో ఉదార శక్తులు విజృంభింప వచ్చును. మనం స్వాభావిక జ్ఞానమని చెప్పే అతీత శక్తులు పక్షులకూ జంతువులకూ ఉన్నవి. సృష్టిలో ఇతర విధంగా ఉన్నతదశలో నున్న మానవులకు గల మాట్లాడే శక్తీ, ఆలోచనాశక్తీ అనే సాధారణ శక్తుల నవి అభివృద్ధి చేయక పోయినందువల్లనే, ఆ అతీతశక్తులు వాటికి లభ్యమైనవి. కాని మనిషి నిద్రాహారములను విడచి, శరీరాన్ని వశపఱచుకొని, మౌనవ్రతమును పూని, తన అధికశక్తులను ప్రతిరోధించుకోవడంవల్ల, దిగువ మెట్టులోనున్న జంతువుల అతీత శక్తులను అభివృద్ధి చేసుకోవచ్చును. ఈ విధంగా మనిషికి భవిష్యద్దృష్టి తేలికగా యుక్తాయుక్త వివేకము, ఇంద్రియ నిగ్రహమూ అలవడతవి. అటువంటి మహాశక్తులను దుర్వినియోగం చేస్తే, అవి నెత్తి అపుస్తయ్యని సాధువులు, మంత్రవేత్తలు, మహర్షులూ అంటారు.

కాబట్టి ఈ శక్తులను ప్రజల క్షేమంకోసం ఉపయోగించవలెనేకాని స్వార్థం కోసం వినియోగించుకోరాదు. జీసస్ తన మూడేండ్ల సేవ వల్లనూ అద్భుతమైన పలుకుబడిని సంపాదించడమే కాక అనేకమంది ఆగ్రహమునకు పాత్రుడైనాడు. ఇందుకు ముఖ్యకారణం—ఆయన వారందఱికీ లోబడక పోవడమేగాక తన అద్భుత శక్తులను బహిర్గతం చేయ నిచ్ఛగించకుండుట కూడాను. ఇదంతా ఏదో నిగూఢ తత్వంగానూ అహంకారోన్మాదంగానూ తోచవచ్చును. కాని మతవిశ్వాసం కలిగి యున్నప్పటికీ కర్మానుష్ఠానాలలో పడిపోక, భక్తిపరు

డైనప్పటికీ భావోన్మాదుడు కాక, నూలువడకడమే మత సంస్కార విధిగా భావిస్తూ దంభాచార పరుడు గాక, గాంధీ తన జీవితంలో ఈ సిద్ధాంతాలను ఏవిధంగా ఆచరణలో పెడు తూన్నాడో గ్రహించవలసి యున్నది. సనాతన ధర్మపరునికి "సంధ్యావందనము", "బ్రిహ్మయజ్ఞము", "పితృతర్పణము" వలెను, మాల్వీకి "వాజూాచ్", "పాంచ్ నమాజ్" వలెను, క్రైస్తవ గురువులకు "ప్రభు ప్రార్థనము వలెను ఆయనకు నూలు వడకడ మొక పవిత్ర నిత్యకర్మ. "ఇచ్ఛా బుద్ధులమధ్య జరిగే సంవా దమే ధ్యానమని" గాంధీ అభిప్రాయం. ఆయన యెప్పుడూ సత్యాన్ని అతిక్రమించిన భావ ప్రపంచంలో విహరించడు. నిత్యజీవిత సమస్యలను గూర్చియే ఆయన తన మనస్సును విని యోగిస్తాడు. ప్రభుత్వం నడపే ప్రధానమంత్రి అన్ని శాఖల లోని కార్యక్రమాన్ని సంయోగ పఱచుకొని సమన్వయం చేసు కొంటాడు. గాంధీ, మద్యపాన నిషేధము, ఖద్దరు ఉత్పత్తి ఖద్దరు ప్రచారం, అస్పృశ్యతా నివారణము, గ్రామపరిశ్రమలు, ఈ అన్నిటిని సమన్వయం చేసుకొని సాగిస్తూ, ప్రపంచ మంతా ఒక కుటుంబ మనుకొని అందులోని ప్రతి భాగాన్ని ఆయన స్వయం సంపూర్ణంగా చేయకోరుతూన్నాడు. ఇందు కొఱకు ప్రపంచంలోని తదితర భాగాల కాదర్శంగా ఉండేటట్లు భారత జాతీయ జీవితాన్ని ముందు పరమావధికి తీసికొనిపో ప్రయత్నిస్తూన్నాడు. ఈ విధంగా ప్రపంచములోని అన్ని దేశాలూ స్వయం సంపూర్ణములై ఒకే సమ్మేళనముగా చేరి నప్పుడది, నైతికంగానూ ఆర్థికంగానూ వంకపెట్టడానికి వీల్లు

లేని సుందర కళామందిరంగా తయారు కాగలదు. ఇదే గాంధీ దృష్టికి ప్రత్యక్షంగా కనిపిస్తూన్న మతం.

ఈ సందర్భంలో స్టీవెన్ హాబ్ హౌస్ చెప్పిన కథ ఒకటి వ్రాయవలసి ఉంది. జర్మన్ సైలీషియాలోని గార్లిట్జ్ పట్టణంలో, యాభై యేండ్లకిందట ఒక అజ్ఞాత క్రైస్తవ మహా పురుషుని శిలావిగ్రహం నిర్మింప బడింది. ఆయన పేరు జాకబ్ బోహెమ్. ఆ విగ్రహం నిలపెట్టబడిన వేదికపైన "మా ఆయుధం ప్రేమ, వినయము" అని వ్రాయబడి ఉన్నది.

## దాని శక్తి

పట్టి రాజకీయ వేత్తకు వినయమనగా ఏమిటో తెలియదు. తెలియక పోవడమే కాదు అతనికి అసలు పనికిరాదు. "నాలో వినయం లేదు. నా నిఘంటువులో దానికి స్థానం లేదు" అన్నాడొక నాయక శిఖామణి ఒకనాడు. ఆయన నిఘంటువులోనే కాదు, ఆయన జీవితంలో కూడా లేదు. అయితే అప్పుడప్పుడూ మన అభిప్రాయాలను స్పష్టమైన వినయపూర్వక భాషలో వెల్లడిస్తూంటాము. కాని అది భాషా సౌష్టవంకోసం చూపించే వినయం కాని నిజమైన వినయం కాదు. గాంధీకి ఉన్న శక్తి అంతా ఆయన వినయంలోనే ఇమిడి ఉంది. అహింస అనగా అందరియెడలా ఔదార్య ప్రేమలను గలిగి ఉండడమే అయితే, అహింసావలంబకుడు నిష్కామంగానూ, తనది అనేది లేకుండానూ ఉండాలి. అప్పుడు తప్పకుండా అతనికి వినయం వస్తుంది. అందువల్ల స్వీయ ప్రతిష్ఠకోసం కాక పరులకోసం సేవ చేస్తాం.

టాడు. ఆయన కరుణ, అనుగ్రహ పరత్వంతో కళంకితం గాక నిర్మలంగా ఉంటుంది. వినయము నిర్మమత్వము, వినయము నిష్కామము, వినయము బ్రహ్మచర్యము, ఇవన్నీ కారణ కార్యములవలె పరస్పర సంబంధము కలవి. వీటి సంచలన ఫలితంగా మధ్య తేలిన స్వార్థపరత్వమనే ఒండును కిందకు తోసివేయగా ప్రేమ, బాధా సహిష్ణుత, పవిత్రభావము, గర్వరాహిత్యము, విశ్వాసము, నిష్కామము, నిర్భీతి అనే సుగుణముల నిర్మల ద్రవ పదార్థంపైన నిలచి ఉంటుంది. "వినయవంతు లదృష్టవంతులు. వారు భూమండలానికి వారసులయి తీరుతారు" అని క్రీస్తు రెండువే లేండ్లకిందట అన్నాడు. ఈ రోజున కూడా ఆమాట నిజమే. కాని వారికి వినయంలో విశ్వాసం మాత్రం ఉండాలి. గాంధీకన్న ఎక్కువ బాగా మాట్లాడగలవాళ్ళు చాలామంది ఉన్నారు. ఆయనతో సమానంగా చక్కగా వ్రాయగలవాళ్ళు కూడా కొంతమంది ఉన్నారు. ఆయనకన్న భాగ్యవంతులు లక్షోపలక్షలున్నారు. కాని సాధారణపు ఎత్తుకంటె తక్కువ ఎత్తు, సామాన్యపు ఆరోగ్యముకంటె తక్కువ ఆరోగ్యము, మామూలు సామర్థ్యంకంటె మేకొంచెమో మెక్కువ సామర్థ్యం గల ఈ మనిషి, రాజులను రాష్ట్రాధిపతులనూ లోబఱచుకొన్నాడు. నిరంకుశాధికారులను ప్రజాప్రభుత్వ వాదులనూ కూడా ఆకర్షించాడు. పండితులకు ప్రాజ్ఞులకూ, ప్రధానులకు ప్రభువులకూ, ఆర్థిక శాస్త్ర నిపుణులకు మత పీఠాధిపతులకూ, సమానంగా గౌరవపాత్రుడు నమస్కారార్హుడూ అవుతున్నాడు. దీనికి కారణం ఆయన బుద్ధివిశేషం కాదు; అనేక

ఉపన్యాస వేదికలపైన ఉపన్యసించి నందువలన కాదు; ఆయన ఉపదేశించిన ఆర్థిక సిద్ధాంతాల వల్లను, నీతిసూత్రముల వల్లనూ కాదు; ఆయన గంభీర భాషణములు కాని, సూత్రప్రాయ సుభాషితములు గానీ ఇందుకు హేతువులు కావు. కాని ఆయన అనుకొన్నది చెప్పి, చెప్పింది చేస్తాడు. పరమ పవిత్రంగా జీవితాన్ని నడుపుతాడు. ఇదే ఆయన జీవిత రహస్యం. శౌర్యమంటే ఆయనకేమీ మోజులేదు. కీర్తి ఆయనకు లెక్కలేదు. సంఖ్యా బలంపైన ఆయన ఆధారపడడు. ఒంటరిగా ఉండడానికి కల్లోలపడడు; కటిక చీకట్లో ఏకాంతంగా కూర్చొని జ్ఞాన చక్షువుతో వెలుతురును చూడగలడు; తర్క వితర్కాలను లెక్కపెట్టక అంతర్వాణి చెప్పినట్లాయన నడచుకొంటాడు. స్వార్థము, గర్వము, కోరిక, భయము- వీటిని త్యజించినందువలన ఆయనకు యోగదృష్టి లభించినది. మానవునిలోని సహజాంతరంగ జ్ఞానాన్ని ఆయన అభివృద్ధి చేసుకొన్నాడు. వినయము వలన ఆయన వేలకొలది సుగుణాలను పొందగలిగాడు. "మానవుని గొప్పతనానికి అంతులేదు. కాని దాని గాంభీర్యాన్నిబట్టి అది శాశ్వతంగా ఉంటుంది" అని చెప్పగా విన్నాము. వినయమే దాని గాంభీర్యాన్ని తెలియచేసే గుణం.

వినయమువంటి లేక వినయమునకు విరుద్ధమైన గుణంచేత కూడా మనిషి వినయవంతుడివలె కనపడవచ్చు. జీవితంలో గర్వం వినయంగా ఎప్పుడు కనిపిస్తుందో, వినయం వినయంగానే యెప్పుడు ప్రత్యక్ష మౌతుందో తెలుసుకోవడం కష్టం. క్రియలో రెండూ ఒకటిగానే ఉంటయి. కాని రెండింటికీ వెనుకవున్న

ఉద్దేశాలలో భేదముంది. ఉత్సవాలు, అభినందన పత్రాలు, ఛాయాపటాలు, పూవుల దండలు, ఇవన్నీ వద్దనడం ఆచార పరంపరగా వచ్చే ఈ గౌరవాలను గర్వంతో తృణీకరించడమూ కావచ్చు, లేక అంతఃశ్శుద్ధిగా నిరాడంబర జీవితమును కోరే విన యమూ కావచ్చును. కాని అది మొదట గర్వంగా ప్రారంభ మైనప్పటికీ, నిరంతరం అలాగే చేస్తూన్నందువల్ల కొంతకాలాని కది సరియైన వినయ గుణములోకి మారుతుంది. వినయం బలాన్ని చేర్చిపెట్టి శక్తిగా మారుస్తుంది. పాండిత్యం, ఐశ్వర్యం, ఆడంబరం, అహంకారం, ఇవన్నీ కలిగించ జాలని నైతిక సంవే గాన్ని అభివృద్ధి చేస్తుంది వినయం.

"సోవియటు యువకులకు" ప్రొఫెసర్ ఇవాన్ పావ్‌రావ్ ఉపదేశించిన మాటల నిక్కడ ఉదాహరిస్తూన్నాము:

**మీరు వినయవంతులు కావాలని కోరిక. అన్నీ మీకే తెలుసుననుకోకండి. ఎక్కువగా ఎవరైనా పొగిడేటప్పుడు "నే నజ్ఞానిని" అని చెప్పగల ధైర్యం ఉండాలి మీకు. గర్వానికి దాసులు కాకండి. అది లొంగిపోవలసిన చోట పెంకెతనం చూపేటట్లు చేస్తుంది; స్నేహితుల సలహా సహాయా లను అంగీకరింపనీయదు; వాస్తవికతను సరిగా గ్రహించే శక్తిని నశింప చేస్తుంది. ఈ మానవ సమూహంలో సాధారణ వాతావరణాన్ని బట్టి ప్రతివిషయమూ ఆధారపడి ఉంటుంది. మనమంతా కలిసి పనిచేస్తూ న్నాము. మనలో ప్రతి ఒక్కరు తమ తమ శక్తి సామర్థ్యాలను బట్టి సహాయ పడుతూన్నారు. కాబట్టి "నాపని" "నీపని" అని విడదీయ రాదు. అందువల్ల మనకందరికీ సంబంధించిన పనికి లాభం కలుగుతుంది.**

గాంధీజీ ఒకరోజున ఆకు కూరలు, ఎండు రొట్టె, దవడలు నొప్పి పట్టేటట్టు నమలుతూన్నాడు. "మీరీ భోజనం బాగా భుజిస్తూన్నారా మహాత్మాజీ!" అని ఈ గ్రంథకర్త ఆయనను ప్రశ్నించాడు "ఓ!" అన్నాడాయన. "గమగమ లాడుతూ కమ్మగా ఉందా?" అన్నాడు మళ్ళీ ఈ గ్రంథకర్త "సరి! అది నాకు తెలియదు" అన్నాడు గాంధీ. నిజానికి మనం మన భోజనం కోసం ఏరీ కోరీ తెచ్చుకొన్న వస్తువులను ఎలా చెయ్యాలో చెప్పి, ఆ ప్రకారం తయారుచేస్తే గమగమలాడుతూ కమ్మగా ఉంటయి. అవి తిని మనం తృప్తి పడతాము. కాని గాంధీ ఇంద్రియ వాంఛలను నిగ్రహించుకో వలెననే తత్వంలోని మనిషి గనుక, ముందుగా ఆయన జిహ్వేంద్రియ నిగ్రహమును ప్రారంభించాడు. ప్రాపంచక భోగలాలసత్వం అనేక పాపాలకు దారి తీస్తుంది- ముఖ్యంగా జీవితానికి కావలసిన దానికంటె ఎక్కువగా కూడబెట్టడం- అందువల్ల సంఘంలో, హెచ్చు తగ్గులు- మహా వృక్షాలకూ కుక్కగొడుగులకూ ఉన్నంత హెచ్చుతగ్గులు కలగడం- ఇవన్నీ తటస్థిస్తయి. ఇంద్రియ నిగ్రహం కంటె కూడా ఉదాత్త సద్గుణం మరొకటున్నది. అది అపరిగ్రహము. ఈ సద్గుణాలను ఆచరణలో పెట్టినప్పుడు, పర సేవా పరత్వమునందు జీవితమును వినియోగించడానికి సావకాశం కలుగుతుంది. భయము, కోరిక- ఇవి ఉండవు. అందువలన సత్యాహింసలను సరిగా అవలంబించ వచ్చును.

భారతీయులకు తెలిసింది, పరాయివాళ్ళకు తెలియనిది ఇంగ్లీషులో చెప్పడానికి వీలులేనిదీ మరొక ఉత్కృష్టగుణం

ఉంది. అది పూర్వఋషులు తపస్సు- అంటే యమ దమ ధర్మ దాన శౌచ క్షమా గుణాలను కలిగి ఉండడమే. నిష్కళంక పరివర్తనము, విశ్వప్రేమ, ఇవి జీవిత ముఖ్య ధర్మాలు.

## మతము - రాజకీయాలు

మత రాజకీయ సాంఘిక విషయాలను వేరువేరుగా తలంచే పాశ్చాత్యులకు గాంధీ అర్థంకాడు. వార్థాకు వచ్చిన క్రైస్తవ యాత్రికులు కొందఱు, భారతదేశంలో గాంధీ చేసే సేవకు మూలోద్దేశ మేమిటని ఆయన్ని ప్రశ్నించారు. వెంటనే "మతోద్దేశం తప్ప మరేమీ లేద"ని జవాబిచ్చాడు. "నేను విశ్వమానవ సంబంధం కలిగి ఉంటేనే గాని భక్తజీవితాన్ని గడప వీలులేదు. రాజకీయాలలో జోక్యం లేకుండా విశ్వమానవ సంబంధం కలుగదు. మనిషి జీవితం విభజించడానికి వీలులేనిది. మత సాంఘిక రాజకీయ కార్యములను వేరువేరుగా విభజించడానికి సాధ్యం కాదు. మానవ కార్యరంగము నతిక్రమించిన మతం నాకు కనిపించడం లేదు. మతం అన్నిపనులకూ నైతిక సిద్ధాంతాల నేర్పాటు చేసింది. మతం లేకపోతే జీవితం శూన్యం" ఇవి గాంధీ చెప్పిన మాటలు. ఈ భక్తి ప్రపూర్ణతయే ఖండ ఖండాంతరాల నుండి వివిధ మతస్థుల నాకర్షించ గలిగింది. విగ్రహారాధకునికీ, అగ్నిపూజా పరునికీ, బ్రహ్మోపాసకునికీ ఆశ్రయ మిచ్చిన అబ్రాహాం హృదయం వంటిదే గాంధీ హృదయం. ఆయన ఇలా అన్నా డొకప్పుడు :

పాము చుట్టలవలె చుట్టవేసికొని ఉన్న రాజకీయాలనుండి మనమెంత ప్రయత్నించినా తప్పించుకోలేము. అందువల్లనే నేను రాజకీయాలలో జోక్యం కలిగించుకోవలసి వచ్చింది. ఆ పాముతో నేను కుస్తీ పట్టుకోరు తూన్నాను........రాజకీయాలలోకి మతాన్ని ప్రవేశపెట్ట వలెననే ప్రయత్నిస్తూన్నాను.

"నేను కలుసుకొన్న మతానుష్ఠాన పరు లనేకమంది ఆరూ పంలో ఉన్న రాజకీయ వేత్తలు. కాని నేనో రాజకీయవేత్తగా కనపడే మతానుష్ఠాన పరుణ్ని". 1917 లో మాంటేగు ఇండి యాకు వచ్చినప్పుడు "మీరు నిజంగా సంఘ సంస్కారులే! రాజ కీయాలలోకి ఎందుకు దిగారు?" అని గాంధీని ప్రశ్నించాడు. అందువల్లనే రాజకీయాలలోకి దిగవలసి వచ్చిందని గాంధీ జవా బిచ్చాడు. ఇందులో పరిపాలనా ఫలితమంతా ఇమిడి ఉంది. పర ప్రభుత్వం మానముద్రాలంకారుడైన రాజుగారి పేరుతో ప్రజాభ్యుదయమునకు సంబంధించిన అన్ని పనులకూ దూరంగా ఉండి, ప్రజా జీవితంలో జోక్యం కలిగించుకోక, అభివృద్ధిని నిరో ధించి, ఆచారాలను జడతుల్యములుగా చేసింది. స్వపరిపాలిత దేశాలలోని రాజు, ప్రజారక్షకుడుగా రాజ్యాంగ నేతగా ప్రథమ పౌరుడుగా, జాతీయసంఘ నాయకుడుగా ఉంటాడు.

స్వతంత్ర రాజ్యాల రాజకీయాలు దాదాపు సంప్రదాయ పరంపరగా వస్తూంటయి. పరాధీన దేశాలలోని వారికి, చిన్న తనంలోనే కొన్ని రాజకీయాభిప్రాయా లేర్పడి, సాధారణంగా అవి మారవు. గోఖేలు సర్ ఫిరోజిషా మెహతాలు, సురేంద్ర నాథ భూపేంద్రనాథులు, వారు ప్రజాజీవితం ప్రారంభించిన

నాడేవిధంగా ఉన్నారో అంత్యకాలం దాకా అలాగే ఉన్నారు. లజపతిరాయి, తిలక్ బిపినచంద్రపాలులు మొదటి నుండీ జాతీయవాదులై చివరవరకూ రెస్పాన్సివ్ సహకార వాదులుగానే ఉండిపోయినారు. అసహాయోద్యమ సంపూర్ణ సిద్ధాంతంతో వారేకీభవింపజాలక పోయినారు. కాని గాంధీ, తన జీవితంలో ఒక అద్భుత పరివర్తనాన్ని ప్రదర్శించాడు. ఆయన ఒక స్వదేశ సంస్థానపు దివాన్‌కు బిడ్డ కావడంవల్ల పుట్టుకతోనే మితవాది. ఇంగ్లాండులో ఆంగ్ల విద్యా శిక్షణతో పెరిగి బారిష్టర్ వృత్తి అవలంబించిన మనిషి; సంప్రదాయ క్రమం అలాగే ఉండాలనే పద్ధతివాడు. బ్రిటిష్ ప్రకృతిలో అనంత విశ్వాసంగల పురుషుడు. కాని మహా యుద్ధానంతరం ఆయన మానసిక ప్రవృత్తి, అభిప్రాయాలూ అన్నీ మారుతూ వచ్చినయి. ఆయన అభిప్రాయాలకు, అనురాగాలకు కల భిన్నత్వం అనేకసార్లు ప్రదర్శింప బడుతూ వచ్చింది. 1931 లో ఆయన శ్రీ శ్రీ చక్రవర్తి గారిని దర్శించినప్పుడు, 1918 నాటికీ అప్పటికీ ఆయనలో కలిగిన మానసిక పరివర్తనమును గూర్చి ఆయనకు రాజుగారే స్వయంగా తెలియజేశారు. గాంధీజీ జూలూ తిరుగుబాటులోనూ, దక్షిణ ఆఫ్రికా యుద్ధంలోనూ వ్రణచికిత్సా దళాలను తయారు చేశాడు; 1917 లో బ్రిటను కోసం సైనికులను సమకూర్చాడు. తరువాత ఆయనలో మార్పు వచ్చింది. కాని జార్జి చక్రవర్తి ఆయనకీ మార్పును గూర్చి తెలియ చెప్పడానికి పూర్వం చాలాకాలం కిందనే, 1920 ఆగస్టు

1 వ తేదీని అసహాయోద్యమ ప్రారంభదినమున, అప్పుడు వైస్రాయిగా నున్న చెమ్సుఫర్డు ప్రభువుకు గాంధీ ఇలా వ్రాశాడు :

> మీరు ప్రభుత్వోద్యోగుల అపరాధాన్ని అంతగా పాటించక పోవడం, సర్ మైకేల్ ఒడయరును సమర్థించడం, మాంటేగు నివేదిక, పార్లమెంటు ప్రభువులు పంజాబు దురంతాలను గూర్చి ప్రదర్శించిన అపకీర్తిదాయకమైన అజ్ఞానం, భారతీయాభిప్రాయాలను గూర్చి వారు చూపిన తృణీకారభావం- ఇవన్నీ సామ్రాజ్య భావిదశను గూర్చి అతి ప్రబలములైన అపోహలను గలిగించి ప్రస్తుత ప్రభుత్వముపైన నాకు పూర్తిగా కోపం పుట్టించినవి. కాబట్టి ఇంతవరకూ చేస్తూన్న హృదయపూర్వక సహకార మిక నేను చేయజాలను.

ఒక పక్షాన్ని నిర్మించి అభివృద్ధి చేయదలచుకొన్నవాని రాజకీయాలకు ఒక విధమైన నిర్మమకారాన్ని నిర్దేశించే సిద్ధాంతానికీ పరస్పర కలహం కలుగుతూంటుంది. కాని హాకింగ్ చెప్పినట్లుగా గాంధీ, "సన్న్యాసి నిర్మమత్వమునకూ రాజకీయ విశారదుని కార్య సాధకత్వమునకూ చక్కని సమ్మేళనం" కలుగ చేశాడు. మొదటిది రెండోదానిని కేవలం బలపరుస్తూన్నది. సంప్రదాయం పడుగుగానూ, పరిస్థితిని పేకగానూ చేసి "ప్రస్తుత చరిత్రను" నేయగల నేర్పే రాజకీయ చతురత తరతరానికీ కాలమూ కాలతత్వమూ కూడా మారుతూంటవి. కాబట్టి రాజకీయ స్వభావం మారుతూంటుంది. భారత దేశంలో ప్రజాజీవితానికి ప్రాణమిచ్చి నడిపిస్తూన్నది రాజకీయం. రాజకీయజ్ఞులే అక్కడ ప్రధాన పురుషులు. పత్రికలు

పైనుండి కిందివరకు రాజకీయాలనే చర్చిస్తూంటయి. కాని ఇటీవల న్యాయ్యంగా రాజకీయ దృక్పథంలోకి రావలసినవన్నీ రాజకీయాలుగానే వ్యవహరింప బడుతూన్నాయి. విదేశీ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆందోళన చేయడంతోనే ఆగిపోక, భారత జాతీయ నిర్మాణానికి కావలసిన ప్రధాన విషయాలను గూర్చి హిందూదేశ రాజకీయజ్ఞులు శ్రద్ధ వహిస్తూన్నారు. ఖద్దరు కేవలం పునరుజ్జీవన చిహ్నంగా మాత్రమే గాక, దేశంలో ఒక నిర్దిష్ట సంఘానికి ఆర్థిక సహాయంగాను, నిరుపేదలకూ అనాథలకూ శరణ్యంగాను, భారత జాతీయతకు పునాదియైన గ్రామాన్ని పునరుద్ధరించే గృహపరిశ్రమలకు అగ్రగామి గానూ భావింపబడుతూన్నది. గాంధీ ప్రాయోపవేశ ఫలితంగా హరిజనులకు లభించిన రాజకీయస్థితిని బట్టి, అస్పృశ్యతా నివారణ తేలికయింది. ఆత్మ గౌరవం కళకళ లాడుతూన్న ముఖాలతో వారు తలలెత్తుకొని తిరుగుతూన్నారు. బ్రిటిష్ ప్రధాని రామ్సే మ్యాక్డొనాల్డు హృదయంలో ఏ మూలనో న్యాయ్యబుద్ధి మినుకు మినుకుమంటూ నైనా ఉండకపోయినట్లయితే, 1932 లోనే గాంధీ ఒక్క హరిజనులకోసం ప్రాణాల నర్పించి ఉండేవాడు. ఇంతకంటెనూ ఎక్కువ ఘనకార్యముల కోసం హిందూస్థానం లోని రెండు పెద్ద సంఘాలకు ఐకమత్యం చేకూర్చడం కోసం, బ్రిటిష్‌వారు నూరు సంవత్సరాల పైనుండీ తమ రాజకీయ నిర్మాణాన్ని బలవత్తరంగా చేసుకొనేటందు కుపయోగించిన పాపపు ద్రవ్యాన్ని తుడిచిపెట్టడం కోసం, ఆయన ప్రాణాలు నిలచి ఉన్నవి. త్యాగుడు పిశాచమయింకా పోనిమాట నిజమే. హిందూస్థా

మహమ్మదీయులకు ఇంతవరకూ సామరస్యం కుదరనిమాట నిజమే. ఇవి రాష్ట్రీయ స్వాతంత్ర్యం ద్వారా పరిష్కరింపబడ తగినవి. అయితే 1935 ఇండియా ప్రభుత్వ చట్టము ననుసరించి బల్లవంతంగా జరుపబడే ఎన్నికలలో కాంగ్రెసు పాల్గొనాలా లేక బహిష్కరించాలా? శాసన సభలలోను మంత్రివర్గాల లోనూ ఉండి చట్టాన్ని ఎదిరించాలా? లేక శాసన సభలకూ మంత్రివర్గాలకూ వెలిగా ఉండి నిరోధించాలా?- 1935 నుండి కొంతకాలం వఱకు గాంధీని ముఖ్యంగా బాధించిన విషయాలివే.

ఇవి భారత స్వాతంత్ర్య సమస్యకు సంబంధంలేని సమస్య లుగా ఆయన భావించలేదు. కేవలం ఆ ప్రధాన సమస్యతో విడదీయడానికి వీలులేని విషయాలివి. కాని ఈ సమస్యలన్నీ కూడా సామాన్య లౌకిక జ్ఞానంతో కాక మహర్షుల దృష్టితో గాంధీ పరిష్కరిస్తూన్నాడు. వట్టి రాజకీయ దృక్పథంతో గాక, నైతిక ఆధ్యాత్మిక దృక్పథంతో చూస్తూన్నాడాయన. ప్రతి విషయాన్ని మత రాజకీయముల పరస్పర సమ్మేళనము భార తీయ పద్ధతుల కనుగుణమైన ప్రభుత్వాన్ని నిర్మించడానికి పునా దులను వేసింది. కాని అదియే శ్రోత్రియులకు లౌకికులకు కాంగ్రెసుకు ఆశ్రమములకు, రాజకీయసంస్థలకు నైతిక వ్యవస్థ లకూ మధ్య, కలహకారణం కూడా అయింది.

# అధ్యాయము ౮

## ఆశ్రమాలు

కొన్ని నియమాలను కొన్ని సిద్ధాంతాలను అనుసరించే కొంత మంది సహచరులు కలసి ఆశ్రమాలను నిర్మించుకొంటారు. వాటిలో అభిప్రాయాల కలయిక లేనివారుండరు. ఇటువంటి ఆశ్రమ వాసులే ఈశ్వర దూతలనే పేరుతో వ్యవహరింపబడుతూ వచ్చారు. క్రీస్తు కటువంటిదూతలు పన్నెండుమంది ఉన్నారు. రామకృష్ణ పరమహంసకు కూడా అంతమంది ఉన్నారు. "ఇరవైమంది లేక ముప్పైమంది కూడా కలసి పనిచేస్తూ ఒక సమూహంగా ఉండవచ్చునని" ఆల్డస్ హక్స్లీ అభిప్రాయం. బెనెడిక్టిన్ మతస్థులు ఒక్కొక్క మఠాధిపతికింద పదిమందివంతున్న గుంపుగా చేరి పని చేస్తూండేవారని ఆయనే వ్రాశాడు. కమ్యూనిస్టు గుహాలో సరిగా అంతమందే పని చేస్తూంటారు. పాత సత్యాలను పునఃప్రతిష్ఠ చేయడానికి, నూతన సత్యాలను శాస్త్రీయ పద్ధతులతో నిరూపించడానికి ఏర్పడిన పరిశోధనా కేంద్రాలే ఆశ్రమాలు. సత్యం చక్కగా వ్యాపించవలెనంటే కేవల మొక సిద్ధాంతాన్ని స్పష్టీకరించిన మాత్రంతో చాలదు. దానికి తగిన ప్రచారం సాహిత్యం కూడా కావాలి. ప్రత్యక్ష దివ్య చక్షువుతో చూచినదానిని మహర్షి "ఋక్కు" లో గానం చేస్తాడు. వారి శిష్యకోటి ఆ అభిప్రాయాలను ఆచరణలో పెడుతూ "ఉత్తమ సంఘ వ్యవస్థకు ఉదాహరణంగా ఉండే

చిన్నచిన్న సంస్థలను స్థాపిస్తూంటూరు". కొండంత సిద్ధాంతం కంటె గోరంత ఆచరణ నయం" అనే సామెత ఇక్కడ బాగా వర్తిస్తుంది. నూలు వడకడంపైన మనం గంటలకొలదీ మాట్లాడిన దానికంటె ఒక చిలప నూలు వడికి చూపిస్తే ప్రజలకు చిత్తాకర్షంగా ఉంటుంది. మీరు కట్టుకొన్న బట్ట మీరు వడికిన నూలుతో నేసిందేనని తెలిస్తే, ప్రజల సంతోషం పట్టశక్యం గాదు. వసిష్ఠ, అత్రి, భరద్వాజ, మైత్రావరుణ, కౌండిన్య, శ్రీవత్స, కౌశికాది మహర్షులందఱూ ఈ విధంగానే తమ సిద్ధాంతాన్ని సంస్కృతినీ ప్రచారం చేశారు. * గాంధీ సేవాసంఘం గాంధీ జీవిత సిద్ధాంతాల నంగీకరించి శ్రద్ధా భక్తులతో పని చేస్తూన్న సంస్థ. ఇటువంటి సంస్థలలో చాలాకాలం మనుష్యులను గట్టిగా ఒరిసి చూస్తేనేగాని సభ్యులుగా చేర్చుకోరు. సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీ కూడా ఇంత గట్టిగానూ పరీక్ష చేస్తుంది. కాని అక్కడ ఆధ్యాత్మిక వాతావరణం శూన్యం. గాంధీ సేవాసంఘంవారు చేసే పరీక్ష లంత కఠినంగా ఉండక పోవడంచేత అక్కడ సభ్యత్వం సంపాదించడం తేలికవుతూంది. తన కాలనీలో చేర్చుకొనేముందు మనుష్యులను పరీక్షించక పోవడంలో "రాబర్టు ఒవెన్" తప్పు చేశాడు. "జాన్ హంఫ్రీ నాయిస్" గట్టిగా పరీక్ష చేస్తేనేగాని చేర్చుకొనేవాడు కాదు. అందువల్లనే "ఒనీడా సంఘం" చేయగలిగిన పని "న్యూ హార్మనీ" చేయలేక పోయింది. బ్రాహ్మణులది కూడా పూర్వం అటువంటి

* ఈ సంఘం వివరణము ముందొకచోట ఉదాహరింప బడింది.

వ్యవస్థయే. కాని పేదరికం కంటె ఐశ్వర్యానికి ఆధిక్యత వచ్చే సరికి వారి పతనం ప్రారంభ మయింది. సోవియట్టులు నాజీలు కూడా ఇటువంటి సమూహాలకు చెందినవారే. కాని వారి ఆదర్శాలకు పునాది దౌర్జన్యం. ఇండియాలోని కాంగ్రెసువాదు లోక సమాజం- మహాజన సమాజం అని చెప్పవచ్చును. కాని వారందఱూ ఒకే జీవిత పద్ధతిని అనుసరించేవారు కారు. అయినప్పటికీ వారు నియమించుకొన్న అహింసను నిత్యజీవితంలో ఆచరణలోకి తెచ్చుకొన్నట్లయితే, ఒకే విధమైన జీవితపద్ధతి లోకి వస్తారు. సంఘ క్షేమంకోసం మొట్టమొదట బయలు దేరిన సమాజాలలోని ప్రధాన సిద్ధాంతాలు, పోనుపోను పల్చబడి, సాహసికులకు మోసగాళ్ళకూ వ్యాజంగా ఉపయోగ పడుతూన్నవి. ఈ సమాజాలన్నీ మొట్టమొదట దరిద్రంతో ప్రారంభించి నప్పటికీ తరువాత ధనం చేరగానే ఇటువంటివారుకూడా వీటిలో చేరుతూంటారు. ధర్మ సంస్థలలోని వారందఱు తమ పాండిత్యాన్ని, దరిద్రము, శిక్షణ, సేవ, త్యాగము- వీటికి కంకితం చేయాలి అనేది మొదటి సిద్ధాంతంగా ఉంటుంది. యూరపులో నున్న ధర్మజ్ఞాన సమాజకులలోని వివిధ సమూహాల శిక్షణ క్రమాలను ఆల్డస్ హక్స్లే పోల్చి చూపిస్తూన్నాడు. లయోలా సంఘములోని జేసూట్ సభ్యులది "చేసి చూపు! ఎందుకని ప్రశ్నింపరాదు" అనే సైనికశిక్షణ పద్ధతి. క్వేకరు సమాజం వారిది సభ్యుల ఇష్టము ననుసరించి నడచుకొనే ప్రజాపాలన పద్ధతి. బెనిడిక్టిన్ మఠాధిపతులు ముందు సభ్యుల అభిప్రాయాలను తెలుసుకొన్న తరువాత, తమ విచక్షణను వినియోగిస్తారు.

కాబట్టి ఇది ఒకతరహా శాసనానురూప చక్రవర్తిత్వము. గాంధీ ఆశ్రమాలకు కొన్ని ముఖ్య సిద్ధాంతాలు ఉన్నవి. కాని మార్చ వీలులేని కఠిన నిబంధనలు లేవు. వాటిలో కొంతమంది చిన్న చిన్న సమూహాలుగా పనిచేస్తూంటారు. వారి కార్యసిద్ధి సాధారణంగా వారి నాయకుని ఔన్నత్య స్థితినిబట్టి ఉంటుంది. ఇటువంటి "వ్యవస్థల"న్నీ సాధారణంగా అధిపతిపైన ఆధార పడి ఉంటవి. అధిపతితోనే అంతరిస్తాయి కూడాను.

కాని గాంధీ ఆశ్రమవాసులు అహింసా మార్గము ననుసరించి జాతీయాభ్యుదయమునకు చాలా తోడ్పడ్డారు. వైజ్ఞానికం గాను, ఆర్థికంగాను కూడా, నూతన సాంఘిక వ్యవస్థకు గ్రామమే పునాదిగా ఉండవలెనని వీరి ఆదర్శం. చరిత్ర భూగోళం చదివేకంటె, ప్రతిరోజూ మూడుగంటలు నూలు వడికితే జీవితంలో యెక్కువ ఉపయోగకరంగా ఉంటుందని, అటువంటి నియమం చేయడం ఈ ఆశ్రమాలలోని ముఖ్యలోప మని పిస్తుంది. కాని విసుగుపుట్టిస్తూ నిర్జీవంగా కనిపించే ఈ కఠిన నియమంవల్ల, అనుకోకుండా ఆశ్చర్యకరమైన అభివృద్ధి కలిగింది. విద్యాపద్ధతియే పూర్తిగా మారిపోతూన్నది. వ్రాయడం చదవడం జ్ఞాపకముంచుకోవడం విద్యకు ముఖ్యాంగాలుగా పరిగణింపబడుట లేదు. * చేతి పనులలో నేర్పుకలిగి ఉండడమే విద్యాభ్యాసమునకు మూలంగా ఎన్నబడుతూన్నది. నవ్య భారత దేశమునకు కావలసిన నూతనావసరముల కోసం, వ్యవసాయంలో పరిశ్రమలలో, దేశీయ సంస్కృతిలో శిక్షణ పొందిన

* ఈ విషయం మరొకచోట వివరంగా వ్రాశాము.

యువకులు కావలసి యున్నారు. ఈ ఆశ్రమా లటువంటి యువకులను తయారుచేస్తూ గ్రామస్థుల వైద్య సహాయానికి తోడ్పడుతూన్నవి. పెద్దపెద్ద పారిశ్రామిక సంస్థలను స్థాపించే ముందు ప్రారంభింపబడే ప్రదర్శన యంత్రాలయాల వంటివీ ఆశ్రమాలు. ఈ ఆశ్రమవాసులు ముందొక మూలసిద్ధాంతాన్ని భావించి దానిని అనుసరించడం ద్వారా ఒక శాస్త్రాన్ని తయారు చేస్తారు. వారి విశ్వాసాని కనుగుణంగా ఆశ్రమ నియమాలుంటయి. ఆశ్రమ నియమాల ననుసరించి వారి ప్రవర్తనను అలవఱచు కొంటారు. వ్యక్తులుగా వారికి కొన్ని కర్తవ్యాలు ధర్మాలూ ఉన్నవి; సంఘ సభ్యులుగా వారు కొన్ని దృక్పథాలను పెంపొందించుకోవాలి. సత్యాహింస లొకరి సొంత సొత్తు కాదు. కాబట్టి అవీ, అందుకు సంబంధించిన సిద్ధాంతాలూ ప్రజా సామాన్యంలో బాగా వ్యాపించవలెననీ వారి ఆశయమూ ఆదర్శమూ అయి ఉండాలి. ప్రత్యేక గౌరవాల కోసమూ సౌకర్యాల కోసమూ కాక, ప్రజల సేవలో పనులను చంపకుండా తాము చచ్చేటందుకు మాత్రమే ప్రజానాయకులు కావలెనని వారు కోరుతూండాలి. ఎప్పుడూ నెమ్మదిగా ఓర్పుతో ఇతరులకు నచ్చచెప్పే పద్ధతిలో ఉండాలి వారు. ఈ పద్ధతుల వలన శాంతి సైన్యాలకు, సమష్టి సత్యాగ్రహానికీ కూడా ఏకకాలమందు పునాది వేయగలుగుతూన్నాము. ఇది మీకు అత్యాశగా కనిపించవచ్చును గాని, నిజానికి ఈ రీతిగా చేసిన బోధనలే ప్రజల మనస్సులను తత్క్షణం ఆకర్షించి వారిని కార్యరంగంలోకి తీసుకొని రాగలుగుతవి.

## ఆశ్రమాల నడక

గాంధీ ఆశ్రమాలలో క్రొత్తగా ప్రవేశించ దలచుకొన్న మనిషి, ముందుగా సంఘంలో అట్టడుగున ఉన్నవాడు చేసే సేవ చేయ డానికి సంసిద్ధంగా ఉండాలి. ఇది మొట్టమొదటి నియమం. ఈ పనిని అక్కడి పాతవాళ్ళు చాలా సంతోషంతో నిర్వహి స్తూంటారు. ఎవరి పళ్ళెములను వారు తోముకోవడం, ఎవరి బట్టలు వారు ఉతుక్కోవడం, ఎవరిగదులు వారు తుడుచుకోవడం, ఎవరి పాకలను వారు కట్టుకోవడమే అయితే మన యువతీ యువ కుల కంత క్రొత్తగా ఉండదు. ఈ పనులన్నీ దాదాపుగా హాస్టె లులో వాళ్ళిదివరకు చేసుకొంటూన్నవే. కాని ఆశ్రమంలోని క్రొత్త పద్ధతులు వారికి విపరీతంగా కనుపించవచ్చును. ఆశ్రమ వాసులు మఱుగుదొడ్లను తుడిచి, మలపు బొక్కెనలను తీసుకొని పోయి కడగవలెననే నియమం కేవలం క్రొత్తగా కనిపించడమే కాక అతి కఠినంగా కూడా కనిపిస్తుంది. అయినప్పటికీ విశ్వ విద్యాలయ పట్టములను పొందిన యువతీయువకులీ పనులను సంతోషంగా నిర్వహిస్తూంటే చూడడంవలన, తాత్కాలికంగా చుట్టపు చూపుగా వచ్చిన అతిథికి కూడా ఆపని చేయడానికి, మొట్టమొదట "క్రొత్త ఒక వింత" అన్నట్లుగా ఉత్సాహం కలుగు తుంది. తరువాత అది ఒక విధి అనుకొని చేయగా చేయగా, అందులో ఒక విశ్వాస ముత్పన్నమౌతుంది. చివరకు సంఘా నికి వెలిగా ఉన్న పాకీమనిషి, మనకెంతో సేవ చేసి మన జీవి తాన్ని ఆనంద దాయకంగా చేస్తూంటే, మనమతనికి ప్రత్యుప కారం చేయలేకపోగా అతనిని అస్పృశ్యుడుగా పరిగణిస్తూన్నా

మనే విచారం కలుగుతుంది. ఒక్కసారి సేవ చేయడం అలవాటయితే మానవ సమూహమంతా బంధువర్గంగా కనిపిస్తుంది. వేళ ప్రకారం పని, భోజనం, తిరుగ మూతలు పరిమళద్రవ్యాలూ లేని పుష్టికరమైన నియతాహారం, ఉదయం రాత్రి క్రమప్రకారం ప్రార్థన, చేతిపనులను నేర్పడం, విధిగా నూలు వడకడం, అతిథి పూజ, గురు శిష్యుల ప్రశ్నోత్తరాలు సంభాషణలు, స్త్రీలూ పురుషులూ కలసి మెలసి ఉండడం, తోటపని, గాలిలో క్షాళ క్షేపం చేయడం, శరీరశ్రమ ఇవన్నీ ఆశ్రమ జీవితానికి సంపూర్ణత్వాన్నీ ఉత్సాహాన్నీ కలిగిస్తాయి. వీటికితోడు అప్పుడప్పుడు ఉపవాసాలూ మౌనవ్రతాలూ ఉంటాయి. ఇవి రెండూ శరీరానికీ ఆత్మకూ కూడా పుష్టిని కలిగిస్తాయి. గాంధీ ఉపవాస వ్రతాలను గూర్చి ఇదివరకుదాహరించే ఉన్నాము. అవి సుప్రసిద్ధంగా అందరికీ తెలిసే ఉన్నాయి. గాంధీ మౌనం ఉపవాసంతోనే ఉంటుంది. ప్రతి సోమవారము ఆయన 24 గంటలు మౌనము, 12 గంటలు ఉపవాసము ఉంటాడు. ఇటీవల ఆయన ఉపవాసంతో చేరని మౌన మవలంబిస్తూన్నాడు. కాని, ఆయన ఈ వ్రతాలకు గాని నియమాలకు గానీ దాసుడు కాడు. తాను ప్రపంచంలో చేయవలసిన పని చాలా ఉందని తెలుసుకోవడం వలన, తన కార్యవిధానానికి భంగం కలిగించే యే కర్మకాండకు ఆయన ప్రాముఖ్యత ఈయడు.

ఇటువంటి చిన్నచిన్న నిలయములనుండియే “నిరాడంబర జీవితము ఉదారభావము” కలిగి ఉండవలెననే సిద్ధాంతము ప్రచారంలోకి వచ్చింది. గొప్పగొప్ప మతాలు కూడా

ఆ సిద్ధాంతాన్ని ఆధారం చేసికొని వర్ధిల్లినవి. పురాణకాలపు మఠాలనుండి క్రీస్తు ఉపదేశాలు ప్రచారంలోకి వచ్చి మధ్యయుగ నాగరికతకు కారణము లైనవి.

తమకడ శిక్ష పొందవలెనని వచ్చే శిష్యులను వినీతులనుగా చేసేటందుకు ఆశ్రమాలు, బౌద్ధ విహారాలవంటి విద్యాలయాలు, ఈ పురాతన సంస్థలను వివేకానంద రామకృష్ణ పరమహంసల వలెనే గాంధీజీ పునరుద్ధరించాడు. వీటి ననేక పేర్లతో పిలుస్తూండ వచ్చును. చైత్యాలు, విహారాలు, మఠాలు, ఆశ్రమాలు- అనే నామ భేదాలతో ఈ వ్యవస్థలు వ్యవహరింప బడుతూన్నప్పటికీ, ఇవన్నీ కూడా ఆధ్యాత్మిక సంస్కృతికి, సంఘసేవకు, విజ్ఞాన ప్రచారానికీ కేంద్రా లైనవని చెప్పక తీరదు. గాంధీ ఆశ్రమ జీవితం యావత్తూ జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమానికి అనుగుణంగా నియమింప బడింది. ఐహిక వ్యవహారాలలో మునిగి పోయి భోగపరాయణు లైనవారికి, ఈ ఆశ్రమాలు బైరాగి మఠాలో బౌద్ధ విహారాలో అన్నట్లుగా పైకి తోచవచ్చును గాని, లోపలికి దిగి ఆలోచిస్తే అలా కాదని తెలుస్తుంది. ఇవి తమ ముఖ్యోద్దేశాలకు భంగంకాని పద్ధతిని పనులను చక్కబెట్టు కుంటూ, వయస్సులో నున్న ఆశ్రమ వాసులు జీవిత ప్రారంభ దశలో తగు నిగ్రహం కలిగి అభివృద్ధి కావడానికి తగిన అవకాశాలను కల్పించినవి. ఆశ్రమ కార్యాలు నిర్మాణ కార్యక్రమానికి సంబంధించి ఉంటవి. ముఖ్యంగా చాలామంది "నీచం"గా తలంచే చేతిపనులు చేస్తూంటా రాశ్రమవాసులు. చేతి పనుల్లో నిజానికి నీచమనదగిన దేదీ లేదు. నూలు వడకడం,

నేయడం, ఏకడం, ఏకులు చేయడం- ఇవన్నీ ఉదారములు ఉత్తేజకరములూను. పేదలకు చదువు చెప్పడం, రోగులకు వైద్య సహాయం చేయడం, అప్పుడప్పుడు సహకారోద్యమంలో పని చేస్తూండడం, ప్రజల ఆరోగ్య రక్షణను గూర్చి నిత్యమూ ప్రచారం చేయడం, గ్రంథాలయాలు నడపడం, పంచాయతీలు చేయడం, ప్రదర్శనాలు పెట్టడం, వయోజనులకు లోకజ్ఞానం కలిగించే విద్యా వ్యాపకం చేయడం- ఇవన్నీ వారి కార్యక్రమ ప్రకారం నిర్వహించవలసిన పనులు. బ్రహ్మచర్యవ్రతం పూని పేదరిక మనుభవిస్తూ ఆశ్రమవాసులు చేసే ఈ లోకసంగ్రహ కార్యాలు, విముక్త మాతృదేశ పునరుజ్జీవనమునకు కావలసిన ఆర్థిక సాంఘిక విశాల కార్యక్రమంలో పాల్గొనేటందుకు దేశ సేవికా సేవకులకు మంచి శిక్షణ ఈయగలవు.

ఆశ్రమాలు జీవిత రంగాలకు కేంద్రాలుగా ఉండాలి- అంతే కాని బిచ్చపు డబ్బులను దాచిపెట్టుకొనేవిగా ఉండకూడదు. అవి ఆహారాన్నీ బట్టనూ ఉత్పత్తి చేస్తూ తాము స్వయం సంపూర్ణములుగా ఉండి, పరిసరాలకు జీవశక్తిని విజృంభింప చేయాలి. అంతేకాని పోషకులమీద ఆధారపడే దేశాభిమానుల గుంపుగా ఉండకూడదు.

# అధ్యాయము ౯

## గాంధీ సేవా సంఘం

మానవ జీవిత నీలాకాశంలో ఆశ్రమాలనేక స్వయం ప్రకాశ మాన తారా మండలాల వంటివి. వాటన్నిటి మధ్యను ఉజ్జ్వల సూర్యగోళమువలె, నిరంతరము తన చుట్టూ తిరుగుతూన్న గ్రహముల పైనను ఉపగ్రహముల పైన నూతన తేజః పుంజములను వెదజల్లుతూ, గాంధీ సేవా సంఘం దేదీప్యమానంగా ఉంది. అది కేవల మొక సహచర మండలికానీ, పఠన సమాజంకానీ కాదు. అది సత్యాన్వేషణ తత్పరులుగల ఒక సోదర సంఘం. ఇటీవల, వివిధ రాష్ట్రాలల్లో ఆ సంస్థ యేటేటా మహాసభలు జరుపుతూన్నది. సవ్లీ (1936) మహారాష్ట్రంలో, హుడ్లే (1937) కన్నడరాజ్యంలో, డెలాంగ్ (1938) ఒరిస్సాలో, బృందావనం (1939) బీహారులో, మాలికంద (1940) వంగరాష్ట్రం. ఈ సంఘం కఠిన నియమాలు కట్టికి నిబంధనలు కల మతసంస్థ కాదు, ఇందులో ఉన్నవారంతా పరిశోధకులు, సాధకులు, ఆత్మ పరిశుద్ధతకోసం కృషి చేసేవారూ. దేశములో ఒక కొన నుండి మఱియొక కొనవరకూ వ్యాపించిన యంత్రాలయాల వల్లను, ఐహిక భోగాసక్తి మూలముననూ, నేడు మఱుగుపడి పోయిన ఆర్థిక నైతిక రంగములలో వారు తత్వాన్వేషణ తత్పరులై పని చేస్తూన్నారు. ఈ సంఘముయొక్క పుట్టు పూర్వోత్తరాలను గూర్చి మాకు తెలిసిన సంగతు లివి:

**1923 లో** గాంధీ దీర్ఘ కారాగారశిక్ష ననుభవిస్తూండగా అప్పటి రాజకీయ పరిస్థితుల ఆవశ్యకత ననుసరించి ఈ సంఘం స్థాపించబడింది.

ఆయన ఆదర్శాలు ఉద్దేశాలూ అప్పటికింకా సరియైన రూపం దాల్చ లేదు. గాంధీ ప్రధాన శిష్యులలో ఒకడైన జమన్‌లాలు బజాజు, తన ఐశ్వర్యం కంటె గాంధీ ఆదర్శాలు, సిద్ధాంతాలూ ఎక్కువ అమూల్యాము లని తలంచి, ఆయన పద్ధతులమీద జాతీయ కార్యక్రమాన్ని నడిపించేటందు కత్యధికంగా ధనసహాయం చేశాడు. జమన్‌లాలు బజాజుచేత స్థాపించ బడిన ఈ సంఘ కార్యవిధానం, 1924 నుండి 1929 వరకు కాంగ్రెసు కార్యక్రమాని కనుగుణంగా క్రమ పరివర్తనం పొందుతూ వచ్చింది. తరువాత "గాంధీ సిద్ధాంతాల ననుసరించి జాతీయ సేవ చేయడమే" ఆ సంఘ పరమోద్దేశమని తేలింది. అప్పటినుండీ అది కేవలం కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమాన్ని మాత్రమే నిర్వహిస్తున్నది. 1930 లో శాసనోల్లంఘనోద్యమ దండయాత్రకు కాంగ్రెసు శంఖధ్వానం చేసింది. 1934 ప్రారంభదశ వరకూ సంఘ ధర్మకర్తలు చాలామంది జైలు లోనే ఉన్నారు. 1934 మధ్యలో శాసనోల్లంఘనం కాలపరిమితి లేకుండా విరమింప బడ్డది. అప్పుడు సంఘ కార్యక్రమం ఇంకా ఎక్కువ స్పష్టంగా వివరింప బడింది. సభ్యత్వాన్ని విస్తరింప జేసుకోవడానికి వీలుగా సంఘ నియమాలలో మార్పు జరిగింది. 1937 లో ఆ సంస్థలో నూరు మంది సభ్యు లున్నారు. వారంతా తమ వ్యక్తి జీవితంలోనూ సంఘ జీవితంలోనూ కూడా సత్యాహింసలనే అవలంబించ వలెననీ, సత్యాహింసలపైన ఆధారపడి నడచే యావత్తు జాతీయ కార్యక్రమం లోనూ వారు పాల్గొనవలెననీ కూడా ప్రమాణాలు చేసుకొన్నారు. అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యం, దారిద్ర్య స్వీకరణము, శరీరకృషి, జిహ్వేంద్రియ నిగ్రహం, నిర్భయత్వం, సర్వమత సామరస్యం, స్వదేశీ, విశ్వమానవ సౌభ్రాతృత్వం— ఈ పదకొండు సూత్రాలు నేడా సంఘ ధర్మ సిద్ధాంతాలైనవి.

1936 లో గాంధీ సభ్లిలో ఇలా అన్నాడు :

సత్యాహింసలను కాదు అహింసనే (సత్యం వినా అహింస అసంభవం గనుక) ప్రత్యక్షంగా ప్రదర్శించే ప్రతి కార్యక్రమం లోనూ సంపూర్ణ విశ్వాసం గల సహచర మండలిగా మీ సంఘం పని చేస్తూంటే నేను సంతోషిస్తాను. కాబట్టి మీ సభ్యులలో ఎవ్వరూ కూడా "సత్యా హింస లలో నమ్మక మున్నది గాని, గృహ పరిశ్రమలలో గానీ, లేక ఖాదీ గ్రామ సేవలలో గానీ, లేక హిందూ మహమ్మదీయ సఖ్యతలో గానీ, లేక అస్పృశ్యతా నివారణంలో గానీ నమ్మకం లేదనకూడదు. ఎవరైనా అటువంటివారు మీ సంఘంలో ఉంటే వారి భావం ప్రకారం వారు సత్యా హింసలలో నమ్మక మున్నవారు కావచ్చును కాని గాంధీ భావం ప్రకారం మాత్రం కాదని చెప్పి, వారి సభ్యత్వానికి రాజీనామా యిప్పించండి. దీనిని మించి మీ సంఘానికి ధార్మిక, ప్రాదేశిక, వ్యావస్థాపిక నియమా లేవీ లేవు.

1937 నాటి హుబ్లీ సభలో, గాంధీ సేవాసంఘ సభ్యులు శాసనసభల ఎన్నికలలో నిలబడవచ్చునా లేదా-అని తీవ్ర చర్చ జరిగింది. సభ్యులు తమ సభ్యత్వ దరఖాస్తులను పంపిన తరువాత గాంధీ అంగీకారము నర్థించిన సంగతి ఆయన ఆ సభలో వెల్లడి చేశాడు. 1939 లో ఆ సంఘానికొక ప్రత్యేక రాజకీయ పక్షం ఉండాలా అనే విషయం చర్చకు రాగా, బృందావనంలో అక్కర లేదని తేల్చారు. సాంఘిక కల్లోలములు జరుగుతూన్న రోజులలో, సంఘ సభ్యులను మత కలహాలను మాన్పించే నిమిత్తం శాంతి దళంలో చేర కోరుతూ, 1938 లోనే గాంధీ డెలాంగు సమావేశంలో ఉపన్యసించాడు. బృందావనంలో ఆత్మ పరీక్ష చేసుకోవడం అలవాటు చేయండని సంఘ సభ్యులకు సలహా యిచ్చాడు. అది ఒక నూతన శాస్త్ర

పద్ధతి అన్నాడు. అప్పటి నుండీ అహింస పరమావధిని పొందింది. ప్రతిపక్షి పైన యే విధమైన దురుద్దేశము గాని, కసి గానీ ఉండక పోవడమే అహింస అనిపించు కొంటూన్నది.

శాసన సభలను గూర్చి 1937 హుడ్లీ సమావేశంలో గాంధీ యిచ్చిన ఉపన్యాస భాగాలను కొన్నిటి నిక్కడ అవసరమైనంత వర కుదాహ రిస్తూన్నాము :

సత్యాహింసలవలె శాసనసభా బహిష్కారం మారడానికి వీలులేని సిద్ధాంతం కాదని తెలుసుకోండి. వాటిని గూర్చి నా పాతికూల్యం చాలావరకు తగ్గిపోయింది. కాని అంతమాత్రంతో నా పూర్వ స్థితికి భిన్నంగా పోతూన్నానని అర్థం కాదు. ఇది కేవలం రాజనీతికి సంబం ధించిన విషయం కాబట్టి, ఏ క్షణంలో ఏది ఉచితమో ఆ సంగతి మాత్రమే నేను చెప్పగలను. నేను 1920 నాటి అసహాయవాదినేనా నేడు? అవును, అప్పటి అసహాయవాదినే. కాని నేనా కాలంలో కూడా సహాయవాదిని. నేను సహకారం నిమిత్తమే అసహాయ యోగాన్ని అవ లంబించాననీ, సహాయం చేసినందువల్ల దేశానికి ఉపకారం జరిగేటట్లు యితే, తప్పకుండా సహాయం చేస్తాననీ నే నానాడే అన్నాను. కాని ఆ సంగతి మీరు మఱచిపోయినారు. నేనిప్పుడు మిమ్మలను శాసన సభ లకు పొమ్మనడం సహకారం చేయడానికి కాదు. వాళ్ళదగ్గరనుండి సహాకారం నిక్కచ్చిగా అడగడానికి. మన దేశీయులలో చాలామందికి దాదాపు వోటు చేయగలవారిలో మూడోవంతుకు వోటిచ్చే అధికారం వచ్చింది. మన కాంగ్రెసు కార్యక్రమాన్ని వారికి తెలియచేయడానికి మనకీ ఎన్నిక లవకాశం కల్పించినవి. అటువంటప్పుడు గాంధీ సేవా సంఘ సభ్యులు దూరంగా ఉండడం మంచిదా? మనం నిర్మాణ కార్య క్రమం కోసం నిలబడినమాట నిజమే. కాని మన పేరుతో అక్కడకు పోయినవాళ్ళు కూడా నిర్మాణ కార్యక్రమాన్ని సాగించేటట్లుగా

చూడడం మన విధి కాదా? నిర్మాణ కార్యక్రమం లేకుండా రాజకీయ కార్యక్రమం నిలవజాలదని తెలుసుకోండి. నిర్మాణ కార్యక్రమమంతా సత్యాహింసల చిహ్నం. కాబట్టి అది ఏ విధంగానూ కొఱవడకుండా చూడడం గాంధీ సేవాసంఘ సభ్యుల ప్రధాన కర్తవ్యం.

"వోటు చేయడానికి హక్కులేని 31½ కోట్ల జనాభాలోనూ నేనొకడను" అని ఫైజుపూరులో నే నన్న మాటలు నాకు గంగాధరరావు దేశపాండే జ్ఞాపకం చేస్తున్నాడు. కాని ఈ రోజున మనం విచారిస్తున్న విషయానికది వర్తించదు. గాంధీ సేవాసంఘ సభ్యులుగా మనం చేసి ఉండవలసిన పని యేమిటి? వోటు చేయరాదని మనం ప్రజలకు బోధించి ఉండవలసిందా? కాంగ్రెసు కార్యక్రమాన్ని ప్రజలలో వ్యాపింప చేయడానికి మనం స్వయంగా నిర్మించుకొన్న సంస్థ గాంధీ సేవా సంఘం. గుజరాతులో నున్న ప్రతి కాంగ్రెసు ప్రచారకుణ్ని- మన సంఘ సభ్యులను సహా, ఎన్నికలలో పూర్తిగా దిగి పనిచేయడానికి సర్దారు చేర్చుకొన్నాడు. అంతకంటె ఆయన ఇంకో విధంగా చేయడానికి వీలేముంది? ఇంకో విధంగా చేస్తే మనం ఎన్నికలలో గెలిచేవాళ్ళమా? ఆయనకు మాత్రం ఎన్నికలలో ఎవళ్ళు పనిచేసి ఉండేవాళ్ళు? ఆయన "ఈ ఎన్నికలతో నాకు నిమిత్తం లేదు. నేను నిర్మాణ కార్యక్రమం కొనసాగిస్తానని ప్రతిజ్ఞ చేశాను" అని దూరంగా నిలబడి ఉండవలసిందా? రాజగోపాలాచారి శాసనసభకు నిలబడడానికి నిశ్చయించుకొన్నాడు. పని జరిగిన తరువాత ఎప్పుడో ఒక క్షణంలో ఆయన నా అనుజ్ఞ కోరాడు. నీ యిష్టం వచ్చినట్లు చేసుకోవచ్చు నన్నాను ఆయనను. ఆయనకూడ నాకంటె తక్కువ సత్యాహింసలను అవలంబించినవాడు కాడు. మద్రాసు రాజధానిలో నైనా మనకు ఎన్నికలలో అంత అపూర్వ విజయం రావడానికి, అక్కడ జరిగిన నిర్మాణ కార్యక్రమమే కారణం. స్నేహితులను శాసన సభలకు వెళ్ళకూడదని నే నెలా అనగలిగి ఉండేవాణ్ని. శాసన సభలకు ఒకరివెంట ఒకరిని పంపుతూండిన సర్దారును, సంఘ సభ్యత్వం

వదులుకోమని కోరితే బాగుండేదా? జమన్‌లాలు ధనసహాయమే గాక
ఇతర సహాయం కూడా చేశాడు. ఆయనను రాజీనామా యీయవల
సిందని అడిగితే ఎలా ఉండేది?

కాదు; అలా జరగడానికి వీలు లేదు. మనమొక చిన్న కూటమిగా ఉండి
పోయి వైదొలగవలసి వచ్చేది. అది కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమాన్ని
శిథిలం చేయడ మవుతుంది. నిర్మాణ కార్యక్రమంలో నమ్మకం ఉన్న
వాళ్ళు లేకపోతే ఇక కాంగ్రెస్సేమిటి!

అయితే తప్పనిసరి అయింది గనుక, తప్పయినప్పటికీ మీ సంఘ సభ్యులు
శాసనసభలకు పోయేటందు కంగీకరించండని నేను మిమ్మల్ని కోరు
తూన్నా ననుకోకండి. అది ధర్మంకూడా కావచ్చును. నేటి శాసన
సభలు ప్రజా ప్రతినిధి వర్గాలు. మన సత్యాహింసల నిప్పుడక్కడ
సాగించాలి. నేను నా ప్రత్యేక కారణాలతో, కాంగ్రెసు కింకా
ఎక్కువ సహాయం చేయడానికే ఆ సంస్థకు దూరంగా ఉన్నాను.
కాంగ్రెసు సత్యాహింసల మూలకమైన 1920 నాటి కార్యక్రమాన్ని
అవలంబిస్తూన్నంతవరకు, దానికే నా కాలమునూ శక్తినీ కూడా విని
యోగిస్తాను. మనం ప్రాతికూల్యంగా ఉన్న సంస్థలలోకి ఎలా మనం
పోవడం? అని అడుగుతూన్నారు మీరు. నేటి శాసనసభలు పాత శాసన
సభలు కావు. చాలా భేదమున్నది. వీటిని మనం నాశనం చేయదలచుకో
లేదు. ఇవి ఎందుకోసం నిర్మించబడ్డవో ఆ ఉద్దేశాన్ని భగ్నం చేయ
దలచు కొన్నాము. అక్కడకు మనం పోవలసి వస్తే సత్యాహింసలను
త్యజించడానికి పోము, వాటిని నిలబెట్టడానికే పోతాము. కాంగ్రెసు
ఈ రోజున ఎన్నికలలో కొన్ని లక్షలు ఖర్చుపెట్టింది. మనకు దేశంలో
ఎదురులేని శక్తి కలిగినప్పుడు మనమొక దమ్మిడీకూడా అందుకోసం
వెచ్చించము. నిర్మాణ కార్యక్రమమని మనం ఊరికే అంటూంటాము
కాని నిజంగా మన మింతవరకే పని నిర్వహించాము? ఖాదీ శాస్త్రంలో

నిపుణు లీనా డెంతమంది ఉన్నారు? మనం పూర్తిగా నిర్మాణ కార్య క్రమాన్ని సాగించి ఉండినట్లయితే ఎన్నికలలో కాంగ్రెసు కెక్కడా ప్రదురుపక్షం ఉండేదే కాదు.

అయితే నేనిప్పుడు చెప్పిన దానంతటికీ అర్థం, ఈ నాటినుండీ మీరు శాసన సభలను గూర్చి ఆలోచించడం మొదలు పెట్టండని కాదు. మీ అందతిమాటు అలా ఉండనీయండి. మీలో ఒక్కరుకూడా శాసన సభల లోకి వెళ్ళేటందుకు ప్రయత్నించ కూడదు. అవసరం వచ్చినప్పుడు మాత్రే మది తప్పించు కోవాలని చూడకూడదనే నేను చెప్పదలచు కొన్నది. అక్కడకు వెళ్ళేటందుకు న్యాయశాస్త్ర ప్రవీణత అక్కర లేదు. నిర్మాణ కార్య క్రమంలో అచంచల విశ్వాసమూ ధైర్యమూ ఉంటే చాలు. మీ రక్కడకు పోతే అక్కడ మీ శక్తిలు వదుకుతూనే ఉండాలి. మద్యపాన నిషేధం కోసం, నిర్మాణ కార్యక్రమం కోసం, పనిచేస్తూ ఉండాలి. అంతేకాని అధికారం కోసం దేవులాడ కూడదు. అది మనకు పని చెలుపు. గాంధీ సేవా సంఘం వెళ్ళమని కోరినవారు మాత్రమే వెళ్ళాలి. దాదాపు కల్లు దుకాణాల వలెనే శాసన సభలు కూడా గొప్ప వ్యసనమనే మాట నేను కాదనను. స్వార్థపరులకు, ఉద్యోగాసక్తులకు అవి చాలినన్ని సావకాశాలు కల్పిస్తవి. కాని అటు వంటి నీచోద్దేశంతో కాంగ్రెసువాది కాని, గాంధీ సేవాసంఘ సభ్యుడు కానీ అక్కడకు పోడు. కాంగ్రెసు నాయకుడు కార్యక్రమాన్ని దృష్టిలో ఉంచుకొని, దానికి భిన్నంగా ఎవరినీ నడవనీయడు. ఈవిధంగా ప్రతిజ్ఞ చేసి అక్కడకు పోయేవారు ధర్మబుద్ధితో వెళ్ళుతూన్నారే కాని, ఆపద్ధర్మంగా పోవడం లేదు. మనకు చేతనైతే నిస్వార్థంగా సేవ చేసే టందుకు ప్రతిజ్ఞ చేసిన, ఉక్కువంటి నిక్కచ్చి మనుష్యులతో రాష్ట్ర శాసన సభలను నింపివేయాలి. రాజభక్తి ప్రమాణం చేయడానికి అంత రాత్మ సంబంధమైన అభ్యంతరా లున్నవా రెవ్వరూ అక్కడకు పోన

క్కర లేదు. మత విశ్వాసానికి సంబంధించిన ప్రమాణాలు కాదది. రాజ్యాంగ చట్టాన్ని నే నర్థం చేసుకొన్నంత వరకు మనం కోరే తత్తుల సంపూర్ణ స్వరాజ్యాని కది ఏ మాత్రమూ భిన్నమైనది కాదు.

1938 నాటికి గాంధీ సేవా సంఘం బాగా బలిష్ఠమయింది. పూర్తిగా సంఘ ఆదర్శములతోను కార్యక్రమంతోనూ లీనమైనవారి సంఖ్య, 102 నుండి 118 వరకు పెరిగింది. సానుభూతిపరులుగా గానీ, సహచర వర్గంగా గానీ ఉన్నవారి సంఖ్య 31 నుండి 39 వరకు పెరిగింది. వీరిలో 26 మందికి మాత్రం సంఘ నిధులనుండి జీతాలిస్తూన్నారు. వారి ప్రతిఫలం నెలకు రు 7/- ల నుండి రు 75/- ల వరకూ అంతరువులుగా ఉన్నది.

1938 డెలాంగు సభలో సభ్యులను ఆత్మపరీక్ష చేసుకోవలసిందని కోరుతూ గాంధీ యిచ్చిన ఉపన్యాసం నిరంతరం స్మరించ తగినది. "అహింస దుర్బలుల ఆయుధం కాదుసుమా! బలిష్ఠుల ఆయుధమది" అని అందులోనే ఆయన స్పష్టపరిచాడు.

ఆయన ఇలా అన్నాడు :

నేడు రాజప్రతినిధి కాంగ్రెసు అధ్యక్షుణ్ని పిలిచి మీ మగతు లేమిటని అడుగుతా డనుకోండి! "కాంగ్రెసు పరిపాలనా బాధ్యత తీసుకోగలిగిన స్థితిలో ఉంది. ఇక బ్రిటిష్‌వారు వెళ్ళిపోవచ్చును" అని చెప్పగలిగిన బలం ఉందా ఆయనకు? సైన్యము పోలీసు లేకుండా మనం పరిపాలించ గలమని చెప్పగల స్థితిలో ఉన్నామా? సంస్థానాధిపతులతో, జమీందారులతో, ముసల్మానులతో మనం రాజీ చేసుకోగలమనే ధైర్యం మన కుందా? తేలికగా మనమీ పనులన్నీ నిర్వహించ గలమన్ని చెప్పడానికి తగిన నమ్మకం నాకు లేదు. అయినప్పటికీ మనలో నిజమైన అహింస ఉన్నట్లయితే మనం వీటన్నిటినీ నిర్వర్తించ గలమని చెప్పి, చెప్పినప్రకారం చేసే సమర్థులం కావాలి.

కాబట్టి మన అహింస, దుర్బలుల అహింసయా లేక బలిష్ఠుల కుండతగిన అహింసయా అని, నన్ను నేను ప్రశ్నించుకొంటూ మిమ్మల్నలను కూడా ప్రశ్నిస్తూన్నాను. దుర్బలుల చేతులలో అది కొంతకాలం ఉపయోగ కరంగా ఉండేమాట వాస్తవమే. సరిగా మనకది అలాగే ఉపయో గించింది. కాని దాన్ని మన దుర్బలాని కొక మిషగా ఉపయోగించు కొంటూన్నట్లయితే, అది మనలను నిర్వీర్యులనుగా చేస్తుంది. నిర్వీర్యులం కావడంకంటె, శరీరబలం ఉపయోగించగల ధైర్యం ఉండడం అనేక రెట్లు మంచిది. పిరికితనం కంటె పోట్లాడుతూ చచ్చిపోవడం ఎంతో ఘనకార్యం. బహుశా మనమంతా మొట్టమొదట పశువులుగా ఉండే వార మనుకుంటాను. తరువాత నెమ్మదిగా క్రమ పరివర్తనం పొంది పశు త్వమునుండి మానవత్వమునకు రాగలిగాము. మనం పశుబలంతోనే ముందు జన్మించాము. కాని మనలో నున్న దైవాన్ని తెలుసుకొనే టందుకు మనుష్యుల మయినాము. అదీ మానవునికిగల ప్రత్యేక సౌకర్యం. అందువల్లనే అతడు పశు ప్రపంచానికి భిన్నంగా కనిపిస్తూన్నాడు. ప్రతి సజీవ పదార్థం లోనూ భగవంతుణ్ని చూడగలగడమే, అతనిని ప్రత్యక్షం చేసుకోవడం. అంటే సృష్టికీ మనకూ గల భిన్నత్వాన్ని అర్థం చేసు కోవడం. మన అందరిలోనూ అంతర్గర్భితంగా ఉన్న సచేతనా హింసను పెంపుచేసుకొని, బుద్ధిపూర్వకంగా దౌర్జన్యాన్ని పారదోలితేనే కాని ఇది సాధ్యం కాదు. ఇది బలం వలన తప్ప సిద్ధించదు. మనది బలవంతుల కుండవలసిన అహింసయేనా? అటువంటి అహింస అసాధ్యమని తోసి వేసి, అందుకు బదులుగా హింసా పద్ధతిని అవలంబించడానికి మనకు హక్కున్నది.

కాని అహింస బలవంతుల ఆయుధమని మనం అంగీకరించినట్లయితే, తప్పని సరిగా కొన్ని కర్తవ్యాలను మనం నిర్వహించవలసి ఉంటుంది. హిందూ మహమ్మదీయ కలహాలను మన మాపాలి. ఈ కొట్లాటలను దూషు మూస

వలెనంటే మనమేమి చేయవలెనని మీరు ప్రశ్నించ వచ్చును. ఈ కొట్లాటలను ఆపడం పని, మొట్టమొదట కాంగ్రెసు కమిటీది. అటువంటి సంకట స్థితి వచ్చినప్పుడు పని చేయడానికి మనకు వేలకొలదీ స్వచ్ఛంద సైనికులు కావాలి. 1921 లో స్వచ్ఛంద సైనిక దళాలను మేమొక ప్రమాణ పత్రం వ్రాశాము. ఆ ప్రకారం ప్రతి స్వచ్ఛంద సైనికుడు త్రికరణ శుద్ధిగా (మనసా వాచా కర్మణా) అహింసావలంబకుడై ఉండాలి. అప్పటి కాంగ్రెసు అధ్యక్షుడు ఖిలాఫతు వలంటీర్లచేత కూడా ఆ ప్రమాణ పత్రాన్నే అంగీకరింప చేశాడు. ఖిలాఫతు మహాసభలో ఆ ప్రమాణపత్ర మంగీకరింప బడడం కష్టంమీద జరిగింది. మాట, క్రియ, ఇవి అహింసాయుతములుగా ఉండవలెనంటే అర్థమవుతుంది కాని, మనస్సులో కూడా అహింస ఉండవలెననడం గొంతెమ్మ కోరిక అన్నారు కొంతమంది మౌలానాలు. నేను వారి మనస్సులపైన యాజమాన్యం వహించాలని చూస్తున్నానన్నారు కొంతమంది. "అది కాదు. అహింస యాజమాన్యం వహించాలని నా అభిప్రాయం" అన్నాను నేను. చిట్టచివరకు వారా ప్రమాణ పత్రాన్ని అంగీకరించారు. కాని 17 సంవత్సరాల క్రిందట మనమా అహింసా ప్రమాణాన్ని అంగీకరించి నప్పటికీ అది ఉద్దేశించిన ఆ అప్రతిహత శక్తిని మన మభివృద్ధి కావించుకోలేక పోయినాము. దానికి కారణం, అటువంటి స్వచ్ఛంద సైనిక దళాన్ని యేర్పాటు చేయడానికి మన మెంతమాత్రమూ కృషి చేయకపోవడమే. మనం చేసిన ప్రమాణాన్ని మనం నిర్వహించుకోలేక పోయినప్పుడు మన స్థితిని గూర్చి పునరాలోచన చేసుకోవడం మంచిది. ఆ ప్రమాణ పత్రం ఆచరణలో లేకుండా, ఇంతవరకూ కాగితంమీద మాత్ర ముండడం అన్నిటికంటె దురదృష్టం. అయితే, దాని ప్రకారం చాలినంత మంది అహింసా యోధులను మనం సంపాదించ గలిగినటయితే ఈ కొట్లాటలుండేవే కావు. ఒకవేళ అవి తటస్థించి నప్పటికీ కూడా మన అహింసా సైనికులు వాటిని చల్లార్చగలిగి ఉండేవారు. లేదా ఆ ప్రయత్నంలో

తా మాహుతి అయి ఉండేవారు. అలా మరణించినవారి నొక్కరినే మన మెఱిగి ఉన్నాము. వారి సర్వ సమర్పణ బుద్ధి కొనియాడ తగినది. గుప్త వంటివా ళ్ళనేకమంది ఉన్నట్లయితే నా హృదయం సంతోషంతో ఉప్పొంగి పోయేది. ఇవంతా వట్టి కలలనుకుంటున్నారా? అటువంటి అహింసా దళంతో కూడా కొట్లాటలను చక్కార్చలేమనేనా మీ అభిప్రాయం? శాంతంగా సమ చిత్తంతో ఆలోచించి మీ రలా నిర్ణయించినట్లయితే స్వరాజ్యం కూడా అహింసా పద్ధతులతో లభించదనే అభిప్రాయ పడవలసి వస్తుంది.

గాంధీ సేవా సంఘం ఆయిదవ మహాసభ బృందావనంలో జరిగినప్పు డాయన ఉపన్యాసంలో ప్రతిఫలిస్తూన్న దుఃఖాన్ని పరిశీలించండి :

కాంగ్రెసు కళంకాన్ని గమనించండి. కాంగ్రెసులో ఇంత కళంకం ఎందుకు పెఱిగి పోవాలి. ఇంత కళంకం పెట్టుకొని మనం కాంగ్రెసు వాదులమని ఏ మొగంతో పిలుచుకోగలం. మీలో కొందఱు గాంధేయు లనిపించు కొంటున్నారు. గాంధేయు డనేపేరు పెట్టుకోతగినది కాదు. అంతకంటె అహింసా వాదులని ఎందుకు పిలిపించుకో కూడదు. గాంధీ గుణా గుణముల, బలా బలముల, హింసా హింసల మిశ్రమం. కాని అహింసలో కల్తీ ఉండదు. ఇక అహింసా వాదులైన మీరు అచ్చాగా అహింసను ఆచరించగలమని చెప్పగలరా? ప్రతికక్షుల బాణ పరం పరలకు, ఎదురు బాణాలు వేయకుండా రొమ్ము చూపగలరా? ఎదుటి వారు చేసే విమర్శలకు కల్లోల పడమని గానీ కోపపడమని గానీ మీ రనగలరా? మీలో చాలామంది అలా చెప్పలేరనే నా నమ్మకం.

"అయితే అంతదాకా అహింసాభ్యాసం చేయాలని మీ రిదివఱ కెన్నడూ అని ఉండలేద"ని మీరు జవాబు చెప్పవచ్చును. అలా అయితే అంత వఱకు నా కార్య నిర్వహణంలో ఉన్న తప్పును నేను ఒప్పుకొంటాను,

అహింస మన తప్పులను పెద్దవిగాను, ప్రతిపక్షుల తప్పులను చిన్నవిగానూ కనిపింప చేస్తుంది. మన గోరంత తప్పును కొండంత గాను, ఎదటివాని తప్పు కొండంతయినా గోరంతగానూ నిరూపిస్తుంది అహింస. మనం ఇందుకు విరుద్ధంగా ప్రవర్తించాము.

సంస్థానాల విషయంలో వాటి పరిపాలనమును సంస్కరింప తలపెట్టామే కాని వాటిని నాశనం చేదామని అనుకోలేదు. సంస్థానాధిపతులకు చిత్త సంస్కారం కలిగించా లనుకొన్నాము. కాని మనమాటలు మన సంకల్పానికి తగినట్టుగా లేవు.

రాజకోటను గూర్చి నేనా ప్రకటనను చేసినంత మాత్రాన ఆ సంస్థాన ప్రజలను చిక్కులలో వదిలిపెట్టి వేస్తానని మీ రనుకోకండి. నా సహకారుల నెన్నడు నేను జారవిడచి వారికి నిరుత్సాహం కలిగించను. అది చేస్తే కేవలం మనో దౌర్బల్య మనిపించు కొంటుంది. అలాగా ఉంటుందో ఇంతవరకు నే నెఱుగను. పైగా అక్కడ పనిచేసేవా రంతకంతకు బలిష్టులు కావలెనని ప్రతిదినము నేను ప్రార్థన చేస్తూన్నాను. కార్య నిర్వహణంలో పద్ధతిలో ముఖ్యమైన మార్పు రావాలని మాత్రమే నేను చెప్పేది. ఇక గాంధీ సేవా సంఘం అవలంబించ వలసిన పద్ధతిని గూర్చి యోచిద్దాము. ఇంతవరకు నేను చెప్పినదంతా మీరు గ్రహించి ఉన్నట్లయితే మనం కూడా కొంతవరకు సంస్కరించుకోవలసి వస్తుందనే సంగతి అర్థమై ఉంటుంది. మనం ఆత్మపరీక్ష చేసుకొని మన సిద్ధాంతాల కనుగుణంగా ఎంతవరకు నడచుకొంటూన్నామో అని యోచించుకోవాలి. అప్పుడు మనలో లోపం కనిపిస్తే మన సంఖ్యను తగ్గించుకోవడం ఎక్కువ ఉపయోగం. సత్యాహింసలలో హృదయపూర్వక విశ్వాసంగల స్వచ్ఛమైన సభ్యులు ఇరవైమంది ఉంటే, ఉదాసీన భావంగల సభ్యులు రెండు వందల మంది ఉండడంకంటె ఎక్కువ ప్రయోజనం. మొదటిరకంసభ్యులు మన ఉన్నతికి కారణం కాగలరు. రెండో రకం సభ్యులు మన నాశనానికి దారి తీస్తారు. మన సంఘంలో కూడా కళంక మేర్పడలేదా? మన

సభ్యులు కూడా కపటానికి, అనుమానానికి, పరస్పర అవిశ్వాసానికీ చోటీయడం లేదా? నేనందరి సభ్యులనూ ఎరుగను. కొందరి పేర్లు నే నెరుగుదును. నేనీ మాటలు స్వయంగా తెలుసుకొని అనడం లేదు. నాకున్న కొద్ది అనుభవంతో నేను మాట్లాడుతూన్నాను. దురదృష్ట వశాత్తు జమన్‌లాల్ జీ ఇక్కడ లేరు. ఆయనకు సంబంధమున్న అనేక సంస్థలలో, నా అనుభవాలే ఆయనకూ కలిగినట్లుగా అనేకసార్లాయన ఒప్పుకొన్నారు. ఒడుదుడుకు లేకుండా మనమీ సంస్థలను నడపడ మెందుకు కష్టమవ్వాలి? మన ప్రచారకులను దేశంలో ఒక కొననుండి ఇంకో కొనకు పోయి పనిచేయమని పంపించడానికి మనకెందుకు ధైర్య ముండకూడదు?

చిట్టచివరకు 1940లో సంఘ విషయాలు మరీ విషమపరిస్థితికి రాగా, సమగ్రాలోచనలు జరిగినపిమ్మట మలికందలో సంఘ సభ్యులు తొమ్మిదిమంది మాత్రమే ఉండాలని నిశ్చయింపబడినది. రాజకీయాలలో పనిచేసేవారంతా సంఘ సభ్యత్వానికి రాజీనామాలిచ్చారు. అసలీసంగతి తెలిసిన కొంతమంది అంతకు పూర్వమే సభ్యత్వం వదులుకొన్నారు. ఈ సంగతులన్నీ ఇంతకంటె ఎక్కువ వివరంగా తెలుసుకోవలెనంటే, హరిజన సంచికలలో చదువవచ్చును. గాంధీ సిద్ధాంతాలకూ ఉపదేశాలకూ సంబంధించిన వివిధ విషయాలపైన ప్రమాణవచనాల కోసం, ఆయన గాంధీసేవాసంఘ సాంవత్సరిక సమావేశాలలో చేసిన ఉపన్యాసాలు హరిజన్‌లో చాలామంది విరివిగా చదువుతూ ఉంటారు.

## గాంధీ సేవాసంఘం - దాని నియమావళి.

(ఎ) గాంధీమహాత్ముని ఉపదేశాల ననుసరించిన సత్యాగ్రహి సిద్ధాంతాల ప్రకారం ప్రజాసేవ చేయడమే ఈ సంఘోద్దేశం.

(బి) సంఘోద్దేశమును నెరవేర్చేటందుకు తత్క్షణం ఈ కార్యక్రమం అంగీకరింపబడింది. చేతితో వడుకుట, చేతితో నేయుట; ఈ పనులను పునరుద్ధరించాలి.

గ్రామసేవ,

జాతీయవిద్య,

జాతీయ భాషాప్రచారం,

తాగుడును, మత్తుపదార్థాలను మాన్పించడం, వెనుకపడిఉన్న సంఘాలకు సేవచేయడం, వివిధ సంఘాలలోను పరస్పరం ఐక్యభావాన్ని స్థాపించడం;

స్త్రీల స్థితిని అభివృద్ధిచేయడం,
వైద్యసహాయము, రోగులకు ఉపకారము,
కష్టనివారణకోసం పనిచేయడం,
పశువుల వృద్ధికి పాటుపడడం,
గాంధీ సంబంధమైన సాహిత్యాన్ని ప్రచురించడం,
కార్యనిర్వాహకసమితి అంగీకరించిన ఇతర పనులు.

మరా:- "గాంధీమహాత్ముని ఉపదేశాల ననుసరించిన సత్యాగ్రహ సిద్ధాంతాలు" అంటే, త్రికరణశుద్ధిమైన అహింస, దానికి సన్నిహితములైన ప్రేమ, ఇంద్రియ నిగ్రహం; దారిద్ర్య స్వీకరణం, అలోభత్వం, నిర్భయత్వం, జిహ్వేంద్రియ నిగ్రహం, కష్టజీవనం, స్వదేశ, అస్పృ

శ్యతా నివారణం, గొప్పవారి తక్కువవారు అనే భేదం లేకుండా ఉండడం, సర్వమత సమబుద్ధి, మంచిచెల్ల చేనుగును ఎదిరించడం— వీటన్నిటిద్వారా వినమ్రతతో చేసే నిరంతర సత్యాన్వేషణమే.

సంఘంలో మూడుతరగతుల సభ్యులున్నారు. (౧) సేవకవర్గం (౨) సహయోగి వర్గం (౩) సహాయక వర్గం.

౩ స్వభావ యోగ్యతలు:- (౧) సంఘోద్దేశాన్ని అంగీకరించాలి. ముఖ్యంగా సత్యాహింసలను మతవిశ్వాసంగా అంగీకరించాలి. (౨) గ్రామాలలో నూలువడకడం ఉ. వృత్తిగా ఉండాల సేవవిశ్వాసం కలిగి, నిరంతర ఖాదీ ధారిగా ఉండాలి. మత్తుపదార్థాలను గ్రహించకూడదు. తనకు సంబంధించినంతవరకు హరిజనులను సమానప్రతిపత్తితో చూడాలి. వివిధ సంఘాలమధ్యనూ మిత్రత్వమును విస్తరింపచేయాలి.

౪ ఇవికాక సేవకుడు హిందూస్థానీలో పనిజరుపుకొని పోవడానికి తగిన జ్ఞానం కలిగిఉండాలి. చురుకుగా పనిచేయడానికి తగిన ఇష్టము, సామర్థ్యము కలిగిఉండాలి. తన జీవితంలోను, ప్రవర్తనలోను సత్యాగ్రహ సిద్ధాంతాలను ఆచరణలో పెట్టడానికి నిరంతరం ప్రయత్నిస్తూండాలి, నెలకు వేయిగజాలకు తక్కువకాకుండా నూలు వడకాలి. రోజంతా పనిచేసేవాడుగా ఉండాలి. కార్యనిర్వాహక సమితి అంగీకారం లేకుండా, సొంతానికి లాభించేపనిని దేనినీ చేయకూడదు.

౫ సంఘం అంగీకరించిన కార్యక్రమంలోని ఒకటి రెండు పనులలోనైనా సహయోగి నియామకంగా పాల్గొంటూండాలి. ఆ సందర్భంలో సంఘ నియతికి కట్టుబడి ఉండాలి. సేవకునివలెనే ఆయనకూడా నూలు వడకాలి.

౬ అధ్యక్షుడు నిర్ణయించినప్రకారం ప్రతి సహాయకుడు నియామకంగా కొంత సొమ్మును సంఘ కార్యనిర్వాహకంకోసం చెల్లిస్తూండాలి. లేదా మొత్తంగాకూడా చందాలిస్తూండవచ్చు.

# గాంధి - గాంధీతత్త్వము

## (రెండవ సంపుటము)


రచయిత:

డాక్టరు, భోగరాజు పట్టాభిసీతారామయ్య

అనువాదకులు:

కొడాలి ఆంజనేయులు






ప్రభాత ప్రచురణ సమితి

ఖమ్మంమెట్టు (నైజాం)

# విషయసూచిక


| అధ్యాయము | | పేజి |
|---|---|---|
| 10 | గాంధీజం-సోషలిజం | 1 |
| 11 | భారతదేశ గ్రామము | 62 |
| 12 | ఆర్థికాభివృద్ధి | 84 |
| 13 | అఖిలభారత గ్రామపరిశ్రమల సంఘం | 130 |
| 14 | విద్యాపునర్నిర్మాణం | 172 |
| 15 | సంఘన్యాయ్యం | 200 |
| 16 | సాంఘిక సామరస్యం | 215 |
| 17 | నైతికౌన్నత్యము-మద్యనిషేధము | 233 |
| 18 | స్వరాజ్యంలో ఇండియాదృశ్యం | 269 |
| 19 | ముగింపు | 282 |
| | అనుబంధము ౧ | 321 |
| | అనుబంధము ౨ | 327 |

# గాంధి - గాంధీతత్వము

## సంపుటము 2

## అధ్యాయము 10

# గాంధీజం - సోషలిజం

## సోషలిజం

ప్రపంచ పరిణామంలో ఏక జీవకణ సూక్ష్మాతిసూక్ష్మ జంతువు మొదలు సర్వాంగసుందరమైన మానవుని వరకునూ గల దశా పరివర్తనాలను విచారించిన యెడల, సృష్ట్యాదిని జలచర జంతువులును, తరువాత జలచర, భూచరములును, పిదప కేవల భూచరములు, పిమ్మట చతుష్పాద మృగములు, అటుపిమ్మట ద్విపాద మానవాకార జంతువులు, తుదకు మానవుడు జనించినట్లుగా తేలగలదు. ఆకాశంలో తిరిగే పక్షులకు గూళ్ళు, పొలాలలో తిరిగే జంతువులకు బొర్రెలు, ఉన్నట్లే మానవులకు చిన్న చిన్న గుడిసెలో లేక ఆకాశాన్ని అంటే పెద్ద పెద్ద మేడలో వున్నవి. అడవిమృగా లాహారంకోసం రాత్రిళ్ళు సంచారం చేసి, పగలు పొదలలోనో, బిలాలలోనో, గుహాలలోనో నివసిస్తూన్నవి. అవి ఒకదానిమీద ఒకటి వైరముతో తమ బలా

ధిక్యతవల్ల జీవిస్తున్నవి. బలం లేని జంతువులు నశించి పోతూన్నవి. మనిషి పరస్పర సహకారబుద్ధిని పెంపొందించుకొన్నాడు. కాని పశ్చిమ దేశాల యంత్ర నాగరికతలో ఆ ప్రాక్పు స్పర్ధాయుగమునాటి చిహ్నాలింకా మిగిలి ఉన్నవి. ముఖ్యంగా ఐరోపా అమెరికా ఖండాలలో, ఒక మనిషికి నష్టదాయకంగా మరొకడు జీవించడ మలావుండగా, ఒక జాతిని మరొక జాతి దోచుకొని తినేపద్ధతికూడా నడుస్తున్నది. పాశ్చాత్య దేశాలు ప్రాచ్య దేశాలతో పోటీ పడడమేగాక తమలో తాముకూడా పోటీపడి నిరంతర సంగ్రామాలకు పాల్పడుతూన్నవి. ఈనిరంతర సంగ్రామ యుగంలో దేశాలమధ్య ఏర్పడిన తగవులను పరిష్కరించుకోవడానికి యుద్ధాలు ధర్మమార్గాలుగా పరిణమించినవి. అందువల్ల మనిషి తన సాహచర్య భావాన్ని విచ్ఛిన్నం చేసుకొని మానవసంహారం నిమిత్తం సంచరిస్తూ, తిరిగీ బొర్రెలలో, గోతులలో, కందకాలలో, నేల అడుగున నివసించవలసిన అవస్థ పట్టింది. ఈ విధంగా నాగరికత మూలమట్టానికి కదిలిపోతూన్నది. కాలం ఒక విధంగా వెనుకటి అనాగరికత వైపుకు తిరిగి పోతూన్నదా అన్నట్లు కనిపిస్తూన్నది.

## భారతదేశంలోని విపరీత పరిణామం

ఒక జాతి మరొకజాతిని జయించినప్పుడు, ముఖ్యంగా ఆ విజయం సర్వతోముఖ విజయమైనప్పుడు, పరాధీన జాతి స ప్రధాన సంస్కృతి, నాగరికత, శిల్పకళాకౌశలం, పరి

శ్రమలు, జాతీయ జీవితోద్దేశాలు, ఆదర్శాలు ఈ అన్నిటినీ అచిరకాలంలోనే విస్మరించి, ప్రతివిషయంలోనూ పాలక జాతిని అనుసరిస్తుంది. ఇందుకు తార్కాణం భారతదేశం. మొదటి భారత స్వాతంత్ర్య సమరం జరిగిన ఎనభై ఏండ్లలో పాశ్చాత్య సంస్థల సంపర్కంవల్లను, పాశ్చాత్య జీవిత భాషా ప్రభావముల వల్లను, హిందూ దేశంలో సంఘ స్వరూపమే సంపూర్ణముగా మారిపోయింది. కళాశాలలు, న్యాయస్థానాలు, శాసనసభలు- వీటిద్వారా విద్యా, న్యాయ, శాసన వ్యవహారములలో కలిగిన పరివర్తన మలా ఉండగా పణ్య ప్రదేశములలోకూడ పరరాజ్య ప్రభావం ప్రస్ఫుట మయింది. ప్రజల వేషాచారాలు, పాశ్చాత్య దేశాలనుండి ఒక్కుమ్మడిగా దిగిన పారిశ్రామిక ప్రభువులు పెంపొందించిన యంత్రవ్యామోహము, గ్రామాలను క్షీణింపజేసి పట్ట ణాలనభివృద్ధి కావించడమే దీనికి కారణం. భారతదేశము పేదరికంతో కుంగిపోతూన్నప్పటికీ, గ్రామస్థుల నెత్తురు పిండి సంపాదించిన ధనమును పట్టణాలలోని కొన్ని వ్యాపారసంస్థ లలో నిలవజేయడం మూలకంగా పెట్టుబడి సమకూరింది. ఈ పెట్టుబడితో యంత్రాలు, యంత్రాలయాలు స్థాపింప బడ్డవి. ఇంతకుపూర్వం పాశ్చాత్య యంత్ర నిర్మిత సామగ్రుల దిగుమతితో ప్రారంభమైన గ్రామకళా కౌశల వినాశనం వీటి స్థాపనతో పరిసమాప్తి అయింది. ఎంతకాలంనుండో అధికారైశ్వర్యాలను సమభావంతో ఉచితరీతిని నియమించు కొని పెంపొందుతూ, నిరుద్యోగ సమస్యకు తావులేకుండా

చేసుకొన్న హిందూసంఘం, శతాబ్దాల తరబడి విదేశీ పాలనకు లోనయి పాశ్చాత్య దేశాల నెదుర్కొన్న గడ్డుసమస్యలకు తానుకూడ గురికావలసివచ్చింది. పెట్టుబడిదారీవిధానం పాశ్చాత్య దేశాలలో వ్యాపించినంత ప్రమాదకరంగా ఇండియాలో వ్యాపించి ఉండకపోవచ్చును. కాని, పాశ్చాత్య దేశాలలోని పెట్టుబడిదారీ పద్ధతికి కారణభూతమైన జమీందారీ విధానమే ఇండియాలోకూడా ప్రవేశించి కొద్దిమంది ప్రభువులచేతుల్లో ఐశ్వర్యమంతా ఉండిపోవడమున్నూ, అధికసంఖ్యాకులైన రైతులకు భూమిని ఆక్రమించుకొనే హక్కులు లేక దాస్యజీవితం గడపవలసిరావడమున్నూ తటస్థిస్తూన్నవి. పశ్చిమ దేశాలలో పెట్టుబడిదారీ విధానానికి విరోధంగా ప్రారంభమయిన ఉద్యమమే సోషలిజం. అక్కడి ధనవంతులు తమ రక్షణకోసం తొడుగుకొన్న కవచంగాదది. నిరంతరం విజృంభిస్తూన్న పెట్టుబడిదారీ యత్నాలవలన తటస్థించే చెడుగులను చక్కజేసేనిమిత్త ముద్దేశింపబడిన నూతన సంఘవ్యవస్థ. హిందూదేశపునగరాలు కొంతవరకు పాశ్చాత్య పారిశ్రామిక పద్ధతులనే అనుకరించినవి. ఈ దేశంలోని అన్ని యంత్రాలయ కేంద్రాలలోనూ పనిచేసే కూలీ లందరూ కలసి ఇరవైలక్షలకు మించక పోయినప్పటికీ, వాళ్ళ కిళ్ళు కట్టడం, వాళ్ళపిల్లలను పెంచడం, వాళ్ళచదువు, ప్రసూతి చికిత్సాలయాలు, లాభాలకూ కూలికీ గల పరస్పర బాంధవ్యం, కూలికీ - పనికీ ఉన్న సంబంధం, పనిజేసే గంటలు, సెలవులు ఇవన్నీ ప్రాముఖ్యత వహించి, వీటిముందు

గ్రామాలలో లెక్కకు రాని లక్షలాది ప్రజల నిరుద్యోగ సమస్య మఱుగు పడిపోయింది. పాశ్చాత్య సంస్కారమును, తత్సంబంధములైన ఆర్థిక సిద్ధాంతాలను, సూత్రాలను పరంపరాగతంగా జీర్ణించుకొంటూన్న విద్యావంతులైన యువకులు, పెట్టుబడిదారీ విధానాన్ని వెంబడించివచ్చే సోషలిస్టు భావాలయందు కూడా సహజ పక్షపాతం వహిస్తూన్నారు.

## ఇండియాలో సోషలిజం పరుగు

భారత రాజకీయాలలో సోషలిస్టు భావపరివర్తన మిటీవలనే ప్రారంభమైనప్పటికీ, ఒక్క దశాబ్దంలోనే అతివేగంగా అభివృద్ధిపొంది, కాంగ్రెసులో తీవ్రవిభేదాలకు కారణమయింది. కాని, గాంధీ సిద్ధాంతానికి మూలకందమైన అహింస వలన కలిగిన అద్భుత ఫలితాలు లా భావాలను వెనుకకు నెట్ట గలిగినవి. అహింసా బలాన్ని ఒక్కసారి మనం ఒప్పుకొన్నట్లయితే, ఒక అనంత నూతనశక్తి మన కళ్ళయెదుట ప్రత్యక్షమౌతుంది. ఈ సిద్ధాంతంపైన వర్థిల్లిన సాంఘిక సంస్థ ఒక విద్యుత్పరిశ్రమాలయమై (Electric power house) గాంధీ ప్రవర్తకుడై (Operator) ఆయన అహింసా సత్యములనే విద్యుచ్ఛక్తియంత్రం (Dynomo) ద్వారా పర్వతములను కదిలించగల, సామ్రాజ్యములను పెకలించగల, అంతులేని శక్తిని ఉత్పత్తి చేస్తూన్న సంగతి మనము చూస్తూన్నదే. ఆ శక్తి భూకంపములోవలె, కూలి పూడిపోయిన పూర్వజాతీయ నాగరిక లక్షణాలను, మోటారు యంత్రములతో త్రవ్వినట్లు త్రవ్వి పైకి లేవనెత్తినది. గాంధీ సోషలిజం కేవలం

నాస్తిక శక్తిగాదు. ఉపేక్షవల్ల నిస్సారములై కటికిబాఱిన జాతీయ సంస్కార క్షేత్రాలను తిరిగి ఫలవంతాలుగా చేసే నైతిక శక్తి అది. కాని, దాని కాయన త్రికరణ శుద్ధియైన అహింసయే పునాదిగా ఉండాలంటాడు. మన కామ్రేడ్లు సోషలిస్టు ప్రభుత్వ స్థాపన కావాలంటారు. కాని వారు హింసాపద్ధతివలన దానిని స్థాపించగోరుతున్నారో అహింసా పద్ధతినే అవలంబించ గోరుతూన్నారో మనకు చెప్పడానికి వెనుకంజ వేస్తారు. అందువలన వారిలో చాలామంది క్రమంగా అహింసా సిద్ధాంతంచేత ఆకర్షింపబడి గాంధీ వర్గంలోనైనా చేరిపోయినారు; లేదా బహిరంగంగా కమ్యూనిస్టు తత్వాన్ని చేపట్టి హింసావాదులైనా అయిపోయినారు. వారు సంఘవ్యవస్థలో రెండు భిన్నపద్ధతులను వెల్లడిచేస్తూన్నారు. సాంఘిక, ఆర్థిక పద్ధతులమీద విభజింపబడి, వివిధ వర్గాల మధ్యను, నిరంతర సమానాధికార ప్రాబల్యముగల సంఘవ్యవస్థ ఒకటి. స్వార్థాహింస లనే నిప్పులపైన, జీవితమనే బాగులో కళపెళలాడే వేడి పొంగులవలన, అట్టడుగు పొరలు నిరంతరం పైపైకి లే ప్రయత్నించడంచేత, ఎప్పటికీ నిలకడ కుదరని సంఘవ్యవస్థ రెండోది.

ప్రభుత్వం సర్వాధికార సంపన్నంగా ఉండవలెనా లేక మానవ వ్యక్తిత్వానికి స్థానమున్నదా, స్పర్థ ప్రధానమా, సహకారం మంచిదా, మానవోన్నతికి దోహదంచేసేది భౌతిక విషయమా ఆధ్యాత్మిక విషయమా, ధనమా, సేవా, అగ్రస్థానం వహించ వలసింది; గృహావరిశ్రమలా,

యంత్రపరిశ్రమలా, అభివృద్ధి పొందవలసిందనే విషయాల పైననే నిజంగా ఈనాడు జరుగుతూన్న పోరాటమంతాను.

## కాలస్థితి

కాలం మారిపోతున్నప్పుడు కాలానుగుణంగా అతిపురాతన పవిత్రవ్యవస్థలు, ఆచారాలుకూడా మారిపోక తప్పదు. కాని ఎంత ఆకర్షవంతంగా ఉండే మార్పయినప్పటికీ, ప్రజలు గునియకుండా ఆమోదింపజాలరు. ఇవి కేవలం చప్పిడిమాటలుగా కనపడవచ్చును. కాని ఈ చప్పిడి మాటలలోకూడ మానవప్రవర్తనమునకు మార్గదర్శకమైన నిజంలేక పోలేదు. అందువల్లనే ఇప్పుడు హిందూదేశం నూటయాభై సంవత్సరాలనాటి పారిశ్రామిక విప్లవ ఫలితంగా కలిగిన చెడుగులను తుడిచివేయడానికి పాశ్చాత్య దేశాలవారు నిర్ణయించిన మార్గాలను 'తూ' 'చా' తప్పకుండా అవలంబించవలెనా, లేక పురాతన సంఘవ్యవస్థను, దాని కార్యవిధానాన్ని, దాని ధర్మ విభాగమును, దాని గ్రామ నిర్మాణమును సానుభూతితో పునర్విచారణచేసి, తత్ఫలితంగా ౧. జాతీయతా అంతర్జాతీయతలకు ౨. వైశ్యులచే అవలంబింపబడుతూన్న పెట్టుబడిదారీ విధానపు ఆర్థిక పద్ధతికిన్ని, సోషలిస్టు సిద్ధాంతానికీ, గ్రామసంఘము, సమష్టి కుటుంబము, శ్రమజీవనకులము వీరందఱి కాయకష్టవిధానమునకున్నూ ౩. జీవితంలో ఆధ్యాత్మిక దృక్పథాన్ని పెంపొందించే మతానికి, భౌతిక వైఖరిని అభివృద్ధిచేసే వైజ్ఞానిక శాస్త్రానికీ ౪. మనుష్యుల నియంతృత్వం కాని ధర్మ నియంతృత్వమునకు, ఆచరణలో కాక వైశా

వ్యాంలో నైతిక పోషణార్థ ప్రజాపాలన పద్ధతికీ న్నీ. అహింస అనే యజమానికీ ఉత్పత్తి యోగమనే సేవకునకూ సమన్వయం కుదుర్చుకుంటూ ఉచిత జీవితమును నడపవలెనా, అనే విషయం ఆలోచించుకోవలసిన తరుణం వచ్చింది. పరస్పర విరోధ విషయాల కి విధంగా ఉచితరీతిని సంవిధాన పరచు కోవడంవల్ల ప్రస్తుతానికీ భవిష్యత్తుకూ, సిద్ధాంతానికీ అవసరానికీ, ఐహికానికీ పారలౌకికానికీ, ఆనందదాయకమైన సామరస్యం కుదురుతుంది. కాబట్టి పాతదైనంతమాత్రాన ఏ పరిష్కారపద్ధతినీ తృణీకరించరాదు. కొత్తదైనంతమాత్రాన ఏ సమన్వయమూ పరిష్కరించడానికి వీలు లేనిదిగా భావించ కూడదు. ఈపని ఎంత కష్టమో అంత స్వాస్థమైనది. కాబట్టి ఈ ధర్మ నిర్వాహణంలో మనం ఉపశమన పద్ధతుల నవలం బించేకంటె, నివారణ విధాన మవలంబించడం మంచిది. ఉపశమనము ఉత్తమమైనదే; కాని నివారణ ముత్తమతరం, ఈ సిద్ధాంతం శరీర రుగ్మత విషయంలోనూ, రాజకీయ రుగ్మత విషయంలోనూ కూడా సరిగా వర్తిస్తుంది. కాబట్టి హిందూ సంఘ నిర్మాణమునకు, దాని ధర్మములకు మూలములైన సిద్ధాంతాలను పరిశీలించవలెననీ, పేదరికాన్ని తొలగించలేక పోయినప్పటికీ, ఐశ్వర్యం ఒకేచోట రాశీభూతంకాకుండానూ, తగినంత పని చూపలేకపోయినప్పటికీ నిరుద్యోగ సమస్య లేకుండానూ, ఆ పూర్వ పద్ధతుల నవలంబించి చేయగలి గిరో ఆ పురాతన పద్ధతులను పరీక్షించవలెననీ మాత్రమే మేము కోరుతున్నాము.

# రెండు తరహాల నాగరికత

ప్రపంచంలోని నాగరికతను మొత్తంమీద రెండు తరగతులుగా విభజింప వచ్చును. ఒకటి ఐశ్వర్యంపైన ఆధారపడిన నాగరికత. రెండోది సంస్కృతి లేక పాండిత్యంపైన ఆధారపడిన నాగరికత. లక్ష్మీదేవి చంచలస్వభావం కలదనీ, సరస్వతి అటువంటిది కాదనీ సాధారణంగా అంటూంటారు. హిందూ సంప్రదాయ ప్రకారం లక్ష్మీసరస్వతులకు చాలా కాలంనుండీ తగాదా ఉందని ప్రతీతి. ఈ తగాదాయే భారతీయ నాగరికతకు మూలంగా పరిణమిస్తూన్నది. ఐశ్వర్యము, పాండిత్యము ఇక్కడ వేరువేరుగా ఉంటవి. అలా ఉండడం వల్లనే సంఘంలో అధికారం సరిగా విభజింపబడి సంఘ నియతి చక్కగ నడుస్తూన్నది. ఈ విధంగా పెంపొందిన నాగరికత, పాశ్చాత్య నాగరికతా దండయాత్రలకు హఠాత్తుగా గురియైనది. పాశ్చాత్య నాగరికతతో పాండిత్యం కంటె ఐశ్వర్యానికి ఉన్నతస్థాన ముంది. అంతేకాక పాండిత్యం ఐశ్వర్య సంపాదనకు పరికరంగా ఉపయోగింపబడుతూన్నది. పాశ్చాత్య నాగరికతా ప్రభావం కిందకు వచ్చిన భారతీయ నాగరికత అపజయం పొందినట్లుగా నేడనేక తార్కాణాలు కనబడుతూన్నవి. చూడండి !

రైతులు పండించి ఉపవాసం చేస్తున్నారు.

సాలీలు బట్టలు నేసి దిగంబరులుగా ఉంటూన్నారు.

సహకారోద్యోగులు అప్పు తీసికొని తిరిగి చెల్లించరు.

డాక్టర్లు రోగులయి చనిపోతూన్నారు.

లాయర్లు వ్యాజ్యాలకోరులై ఓడిపోతూన్నారు.

ఇంజనీయర్లు కట్టుకొన్న ఇళ్లు పడిపోతూన్నవి.
ఉపాధ్యాయుల కొడుకులు చదివి పరీక్ష తప్పుతూన్నారు.
ప్రజాసేవకులని పేరుపెట్టుకొన్న ప్రభుత్వోద్యోగులు జీతాలుపుచ్చుకొని పనిచేయరు.

బ్యాంకులు డిపాజిట్లు పుచ్చుకొని దివాలాతీస్తున్నవి.
ఇక కంట్రాక్టు ఉద్యోగుల కొడుకులు ఇన్సూరెన్సు ఏజంట్లవుతున్నారు.
తల్లి బిడ్డలకు విషం పెడుతూన్నది.
తండ్రి కొడుకులను కొడుతూన్నాడు.

ఏమి చెప్పగలం! కంచె చేను మేస్తూన్నది. నిజానికి ఈనాడు సహచరభావమూ సానుభూతీ నశించి దురాశ పెచ్చు పెరిగింది. వ్యాపారం ఋజువర్తనం లేని జూదంగా మారింది. ధర్మనిష్ఠ మాయమై మోసం హెచ్చింది. యుక్తాయుక్త వివేకజ్ఞానమూ సహజప్రేమాకూడ, క్రోధోద్రేకం ముందు కూలిపోతూన్నవి. పాండిత్యం ఐశ్వర్యానికి దాస్యంచేసే పనిముట్టుగా ఉపయోగ పడుతున్నది. ప్రపంచ సాంఘిక ఆర్థికాభ్యుదయంలో వ్యష్టి, సమష్టి భావా లొకదానికంటె ఒకటి ఆధిక్యత సంపాదించవలెనని ప్రయత్నిస్తూన్నవి. మొదటిది పచ్చి స్వేచ్ఛా వ్యాపార పద్ధతి కావాలంటుంది. రెండోది పూర్తిగా ప్రభుత్వ సోషలిజం కావాలంటుంది. పచ్చి స్వేచ్ఛావ్యాపార పద్ధతిలో యే ఒక్కనికీ సంపూర్ణాధికారాలుండవు. ప్రభుత్వం ప్రత్యేక హక్కుల నీయదు. ప్రత్యేక ధనసహాయం చేయదు. కార్మిక సంఘా లుండవు, సాంఘిక శాసనా లుండవు. వస్తువులను స్వేచ్ఛగా కొనవచ్చు అమ్మవచ్చు. ప్రభుత్వం శాంతిభద్రతలను కాపాడుతూంటుంది; అంతే. 'చౌకగా, కొను -

ప్రియంగా అమ్ము' ఇదే దాని నినాదం. లాభాలు పిడుగులుకట్టి విస్తళ్లు వేయడానికంటారు, కాని, నిజానికి వాటి నెవరూ అంటుకోవడానికి హక్కు లేదు. పూర్తి స్టేటుసోషలిజంలో అద్దె, వడ్డీ, ప్రత్యేక మిరాసీహక్కులు, లాభంకోసం చేసే వ్యాపారం, తేరగా వచ్చే ఆదాయం - ఇవన్నీ ఉండవు. పొలం, ఇళ్ళు, పరికరాలు, ప్రయాణసౌకర్యాలు అన్నీ ప్రభుత్వాధికారంకిందఉంటవి. కూలీలను ప్రభుత్వమేనియమిస్తుంది. అసలు ఖరీదుకే కొంటుంది అద్దెకిస్తుంది. పనిచేస్తామన్నవాళ్ళందరికి పని చూపిస్తుంది. తిని కూర్చుండే భాగ్యవంతులు కనిపించరు. ఎవడూ ధనవంతుడు కాడు. ఎవడూ పేదవాడు కాడు. కష్టఫలమంతా తిరిగి ఉత్పత్తి చేసినవారికే పోతుంది. కాని, నిజం ఆలోచిస్తే స్వత్వం దీనిక్కి ముఖ్యంగా ఉంది.

ఈ విభేదాలకు మూలకారణం ఐశ్వర్యకాంక్ష. ఇది వ్యక్తికీ ఉంది, జాతికీ ఉంది. డబ్బు సంపాదించిన పెట్టుబడిదారింకా డబ్బు కావాలనే అంటాడు. రాజ్యం సంపాదించిన సామ్రాజ్యాధికారి ఇంకొక రాజ్యం కావాలంటాడు. కాబట్టి వెంటనే ఆస్తి, కుటుంబము - ఈ రెంటినీ లేకుండా చేయడం మంచి మందనిపిస్తున్నది. కాని ఆస్తి, వివాహము, మతము ఈ మూటినీ రద్దు చేయ ప్రయత్నించిన రష్యా, ఇరవై రెండేండ్లు గట్టి అనుభవం సంపాదించినమీదట వాటిని పునరుద్ధరించవలసివచ్చింది. ఒక సినీమా బొమ్మలోని అంగవిక్షేపం, సరియైన భావస్ఫురణ కలిగించాలంటే దానితో పాటు నూరు బొమ్మలను చూపించవలసిఉంటుంది, వాటిలో

ఏ ఒక్కటీకూడా ప్రత్యేకంగా ఆభావాన్ని ఫరిస్ఫుటం చేయ లేదు. అలాగే మనం రష్యా విప్లవాన్నిగూర్చి సమగ్రంగా ఆలోచించాలి కాని, వివిధదశలనూ వేరు వేరుగా చూడ కూడదు. వ్యక్తిగత హక్కులు సంఘక్షేమంకోసం వినియోగ పడుతూన్నవా లేదా అని యోజించడమే చివరి పరీక్షగా ప్రపంచమంతా ఇంకా ఒప్పుకోవడం లేదు. సెంటు అంబ్రోజ్ ఇలా అన్నాడు.

> భూమండలం అంతా మనుష్యులందరికీ ఉమ్మడి ఆస్తిగా ఉండాలనీ దాని ఫలసాయం అందరూ అనుభవించాలనీ దేవుని కోరిక. దురాశ ఆస్తిపైన అధికారాన్ని సృజించింది, కాబట్టి మానవజాతికి ఉమ్మడిగా ఈయబడిన భూమిపైన సొంతహక్కు కావాలనే వాడు కొంతయినా పేదలకు పంచిపెట్టాలి. సొంతఆస్తి సమష్టి క్షేమంకోసం కాకపోతే దానిని సమర్థించడానికే వీలులేదు. సమష్టి సౌభాగ్యానికి సొంత ఆస్తి దోహదం చేస్తుంటేనే దాని ఉపయోగం. లోకంలో దేవుని శాసనానికి లోబడక యెవ్వడూ యే ఆస్తికీ సంపూర్ణ హక్కుభుక్తాలు కలిగి ఉండడానికి వీలులేదు. అందువల్ల తనహక్కులను చలాయించుకొంటూన్నందుకు ప్రతిఫలంగా దేవునికి తానేమీ ఋణపడి ఉండలేదనుకోవడం తప్పు.

సెంట్ థామస్ ఎక్వినాస్ ఇలా అన్నాడు.

> దేవుడు మానవునికిచ్చిన ఐహికపదార్థాలతని స్వాధీనంలో ఉంచుకోవడానికి హక్కున్నది. కాని, ఆయన అనుభవించగలిగినదానికంటె ఎక్కువగా ఉన్నప్పుడు, వాటి ప్రయోజనం పొందగలవారికే అవి పోవాలి.

కాబట్టి ఆ స్త్రీగలవాని కతని అవసరాలను తీర్చుకొనేటంత వఱకే ఆ ఆస్తిపైన హక్కున్నది. కాని న్యాయంగా తనకు కావలసింది దనుభవించిన పిమ్మట తక్కినవారి అవసరాలను ఆయన తీర్చాలి. "కలవానికి ధర్మాలు, లేనివానికి హక్కులు" అని చెప్పిన మాట చాలా సమంజసం.

"పేదవాళ్ళ కీయడం దాతృత్వం కాదు న్యాయ్యం"- సంఘన్యాయ్యం -ఇవి ధర్మకాలంలో మాటలు. మనకాలంలో "న్యాయ్యం చేయకపోవడం అయుక్తం. దానం చేసినంత మాత్రాన న్యాయ్యం చేసినట్లు కాదు." అన్నాడు పోప్ పియస్ xi (Pope Pius xi) న్యాయ్యం చేయనివాళ్ళు దానమూ చేయరు.

"సోషల్ ఆర్డరు" పత్రికలో ఒక విలేఖకు డిలా వ్రాస్తూన్నాడు.

> ఈకాలంతో తను జీవనం గడవడానికి తగినంత ప్రైవేటు ఆస్తియైనా యెంతమందికో లేదు. అంటే బహుతక్కువ ప్రైవేటు ఆస్తి మాత్రమే ఉందన్నమాట. ఇది గొప్ప లోపం. నైతికంగా ఆలోచిస్తే నిజానికి ప్రైవేటు ఆస్తి మాయమైపోయిందని చెప్పవచ్చు. ఎందుకల్ల ననగా యే ఆ స్తిమీద ప్రజలు జీవిస్తూన్నారో ఆ ఆస్తిపైన వారికి హక్కులేదు. అంతేకాదు, పాలకులకు ఉండవలసిన జవాబుదారీకూడా వారికి ఉన్నట్లుగా ఎవ్వరూ గుర్తించడంలేదు. అధికైశ్వర్యంగలవారు ప్రైవేటు ఆస్తిని ప్రజలక్షేమంకోసం వినియోగించకపోతే వారి క్షేమాన్ని వారే గుర్తించలేకపోతున్నారు. వారార్థులను దరిచేరనీయరు. వారెన్నడూ పిల్లికి బిచ్చం పెట్టరు. ఇందు

వల్లనే ప్రభుత్వం జోక్యం కలిగించుకోవడం తప్పనిసరి అవుతుంది. ప్రభుత్వం ఆ కర్తవ్యాన్ని పూనుకోక వీలులేదు. వ్యక్తులకు నైతిక బాధ్యతగా ఉండేది ప్రభుత్వానికి ధర్మం అవుతుంది. ప్రభుత్వ మా ధర్మాన్ని నిర్వర్తించక తప్పదు. ఆస్తికలవాళ్ళు ప్రజారక్షణ బాధ్యతను వహించకపోతే, ఆస్తిమీద అధికారం నశించితీరాలి.

ఇందువల్లనే గాంధీ ఆస్తి కలవాళ్లు కేవలం సంఘానికి ట్రస్టీలని నిరంతరం జ్ఞాపకం చేస్తూంటాడు. అంటే ఆస్తిపైన ఆస్తి కట్టుకోవడం, ఉన్న ఆస్తిని భోగలాలసులై వెచ్చించడం, వారికి కూడని పనులని గాంధీ అభిప్రాయం. తిరువాన్కూరు మహారాజావారు తిరువనంతపురం (త్రివేంద్రం) పద్మనాభస్వామివారి ట్రస్టీగా రాజ్యపాలనం చేస్తూన్న సంగతి చాలామందికి తెలియకపోవచ్చును.

## ప్రభుత్వ సామ్యవాద పద్ధతి

సమష్టియాజమాన్యాన్నిగూర్చి మన మొక్కొక్కప్పుడెక్కడలేని ఘాగడ్డలనూ వింటూంటాము. కాని పరిపాలనలో పరిశ్రమలలో, విద్యావిషయంలో కనిపిస్తూన్న అధికారభావమూ, ఒకే మోస్తరు పద్ధతీ, వీటితో సమష్టి యాజమాన్యసిద్ధాంతం ఎలా సమన్వయం కాగలదో ఆ సంగతి మాత్రం మనకు తట్టడంలేదు. ప్రభుత్వానికిగల మొట్టమొదటి అండ పోలీసు బలం, ఉద్యోగస్థులబలం. రెండో అండ పత్రికలపైన పెత్తనం. ఈ రెండూ అందులోనూ ఉన్నవి. ప్రజల అనుభవంకోసం కాక ఎగుమతిచేసేటందుకు మాత్రమే ఉత్పత్తి కావించే, పెద్ద పెద్ద పారిశ్రామిక ప్రభు

వులతో నిండిన పెట్టుబడిదారీ సంఘంలోని నిగూఢ బాని సత్వంవంటి ప్రచ్ఛన్నదాస్య భావమే, ప్రభుత్వ సోషలిజ మని పేరు పెట్టుకొన్న దానిలో కూడా ఉంది. వ్యక్తులవి సూదిపోట్లు, సంస్థలవి సమ్మెటపెట్లు. ఇంతే భేదం. ఆల్డస్ హాక్స్‌లీ(Aldaus Huxley) ఇలా అన్నాడు :

> ప్రభుత్వ సామ్యవాదపద్ధతి పరిపూర్ణంగా స్థాపించబడినప్పుడు, దానం చేయడం కేవలం అనవసరమే కాదు, అపరాధంకూడాను. ప్రభుత్వం సహాయపడవలసిన సందర్భాలలో ధైర్యంచేసి, తాము కల్పించుకొని తమకు తోచినట్లు దయజూపిన తప్పిదానికి, మంచి దాతలుకూడా శిక్షింపబడతారు.

కేవల ప్రజాపాలన పద్ధతికూడా ఈ సాంఘిక దురాచారా లన్నిటికీ చికిత్స కాజాలదు. ఉత్పత్తి చేయడం ధనంకోసమా లేక సేవకోసమా అనేదే మనం నిర్ణయించవలసిన ముఖ్య విషయం. ప్రభుత్వ యాజమాన్యం ఫాసిస్టు పద్ధతికి దారి తీస్తే ప్రజాపాలన విధానం తన ముసుగుకింద సామ్రాజ్య తత్వాన్ని దాచిపెడుతుంది. అప్పుడు ప్రజాపాలన పద్ధతి దానికి సహాయకారి మాత్రమే అవుతుంది. ఇంగ్లాండులో నున్న జ్యేష్ఠానుక్రమణశాసనమును బట్టి, మిల్లులు, ఉద్యాన వనాలు, మృగయా విహారభూములు, ఎస్టేట్లు, అన్నిఆస్తులూ కూడా పెద్దకొడుకుకే సంక్రమిస్తవి. ఇక చిన్నకొడుకులు మిల్లు యేజెంట్లుగానూ, వలస రాష్ట్రాలలో, అధినివేశాలలో స్వాధీనరాజ్యాలలో, గవర్నరులుగానూ ఉండి, వ్యాపారం తమ చేతుల్లో పెట్టుకొంటారు. ఇక మేనల్లుళ్లు, అల్లుళ్లాటోకు

వ్యాపార ప్రతినిధులుగానో, చిల్లర వ్యాపారస్థులకు సరుకులు సప్లయిచేసే వారుగానో ఉంటారు, బ్రిటనులో నూటికి 8 మంది మాత్రమే వ్యవసాయంవల్ల జీవించేవారు. తక్కినవారంతా పరిశ్రమలవల్లనే జీవిస్తూన్నారు, ఇంగ్లాండు స్కాట్లండు దేశాలు బ్రిటన్ ఇదంతా ఒక లిమిటెడ్ కంపెనీ. దీనిపేరు బ్రిటిష్ ఎంపైర్ లిమిటెడ్. ఈ కంపెనీ నియమ నిబంధనావళి ప్రకారం దీని ఆదర్శాలు, సామ్రాజ్య విధులు: ముడివస్తువుల సంపాదన, తయారైన వస్తువుల అమ్మకం, ఆధ్యాత్మిక, వైజ్ఞానిక, నైతిక, మానసిక, ప్రాదేశికయాజమాన్యములను సర్వతోముఖంగావహించి వాటిద్వారా కావలసినన్ని రాజకీయ, సైనికాధికారాలను చేతులలో ఉంచుకోవడం. ప్రభుత్వం గ్యారంటీలు, గ్రాంటులు, బోనస్సులు ఇచ్చి గుంపులు గుంపులుగా కార్మిక వర్గాన్ని సమకూర్చి మంచిపతకం వేసి పని సాగించినప్పుడు, దోపిడి మటీ యథాక్రమంగా నడుస్తుంది. ప్రతి దేశము తన అభ్యుదయాని కవసరమైనపద్ధతి నవలంబించవచ్చును. కాని అది బయటి దేశాలలో కల్లోలం కలిగించేదిగా ఉండకూడదు. అలా ఉన్నట్లయితే ఆ పద్ధతి అంతర్జాతీయ దోపిడీవిధానానికి దారితీస్తుంది.

ఒక పద్ధతిలోఉన్న సంఘాన్ని ఇంకొక పద్ధతిలోకి మార్చాలంటే కన్నుమూసి కన్ను తెరిచే సరికి సాధ్యమయ్యే పని కాదు. అలా సాధ్యం కావాలంటే దౌర్జన్యం రాకతప్పదు. దౌర్జన్యం ద్వారా కలిగిన అభివృద్ధి శరీరంలో పెరిగిన కణితివంటిది. అంతే గాని ఆహారంవల్ల పట్టిన బలంవంటిది కాదు. మొద

టిది అస్వాభావికము రెండోది స్వాభావికము. వెంట వెంటనే ఫలితాలు కలగవలె ననేవాళ్ళు యుద్ధ ప్రియులవలెనే సాహస కార్యాలకు పురికొల్పుతూ పెద్దపెద్ద ఉపన్యాసా లిస్తుంటారు. కాని తాత్కాలికోద్రేకం చల్లారేసరికి ఆ మనుష్యులు మళ్లీ మనకు కనబడరు, వారికి నిర్మాణకార్యవిధాన మంటే గిట్టదు. అందులో చాలా కష్టముందని తలంచి దానినిగూర్చి ఆలోచించనుకూడా ఆలోచించరు. ఇదివరకే హిందూ సంఘం తీవ్ర పరివర్తనాలకు గురియైనది. ప్రజాసేవను పరమధర్మంగా భావించే జాతి మనది. కాని నేడది అధోగతికి పోయింది.

సేవకు బదులుగా ఐశ్వర్యం అగ్రస్థానం వహించడం సంఘానికి మరీ వినాశకరం. మన భారతీయ పురాతన సంఘం సేవకు ప్రాముఖ్య స్థానమిచ్చింది. పాశ్చాత్యు లెప్పుడూ ధనాన్ని పూజిస్తూంటారు. యంత్రాలందుకు కారణం. డబ్బు సంపాదించడానికి వేసేఎత్తులు జూదపు ఎత్తుల వంటివి. నీ చేనుకు న్యాయంగా రావలసినదానికంటె ఎక్కువనీరు, చెరువుకు దొంగతూములుపెట్టి నీవు తీసుకొంటే, నీపక్కవాడూ, నీ ఎదటిచేనువాడూకూడా నీకు తెలియకుండా అదేపని చేస్తాడు, కాబట్టి నీవు చేసినమాయ ఎందుకూ పనికిరాకుండా పోతుంది. కావలసిన దానికంటె దేశంలో డబ్బు తక్కువ చేయడం వల్ల ఎగుమతి వ్యాపారం ఎక్కువగా సాగుతుంది. కాని ప్రతి దేశమూ అంతులేకుండా ఎగుమతులు చేయలేదు. నీ దేశంలో ఎంతవరకు ఎగుమతు లెక్కువవుతున్నయ్యో నీ

సరుకులను దిగుమతిచేసుకొనే దేశంలో అంతవరకు ఉత్పత్తి తక్కువవుతూన్నదని అర్థం. అందువల్ల ఈ పద్ధతి చిరకాలం సాగడానికి వీలులేదు. జాతీయత నేడు యుద్ధాలకు కారణమవుతూన్నది. అలా కాకూడదు. అది శాంతికి మూలమవ్వాలి. మన దేశాభివృద్ధికర కార్యక్రమంవల్ల మనకు లాభం కలగాలి నిజమే కాని ఇతర దేశాలకు హాని కలుగకూడదు. కాబట్టి ప్రతి దేశమూ తన క్షేమం తాను చూచుకోవాలి ముందు రష్యాగానీ ఇటలీ జర్మనీ దేశాలు కాని మనకు వరవడిగా ఉండకూడదు.

మన దేశపరిస్థితులను బట్టి మన మాలోచించుకోవాలి. అదే గాంధీ చెప్పేది. ఇండియాకు అనుగుణమైన సోషలిజమూ, అనుకూలమైన అభ్యుదయ కార్యక్రమమూ మనకు కావాలి. అందుకోసం మన సంఘ నిర్మాణమూ దాని ధర్మాలూ తెలుసుకోవాలి. వాటిలో ఇంత వరకు కలిగిన పరివర్తనాలను గ్రహించాలి. సంఘం ఎక్కడికక్కడికి స్వయం సంపూర్ణంగా ఉండే పూర్వ పద్ధతికి పోవాలి మనం. శాంతి కాలంలో అది అభివృద్ధి కారణమౌతుంది. శాంతి కాలమని ఎందుకంటూన్నామంటే, యుద్ధకాలంలో ఎక్కడెక్కడి పరిశ్రమలూ ఒకచోట కేంద్రీకరిస్తేనే గాని వీలులేదు. ప్రజాపాలనము, సైనిక సన్నాహాలు కలిసిమెలసి జరగడం అసంభవం. వాటి రెంటికీ బొత్తిగా పడదు. యుద్ధం ప్రారంభం కాగానే ప్రజాపాలనం గాలి కెగిరిపోతుంది. అలా మనం చూస్తూండగానే జరిగింది. ప్రజాపాలనమే పోకపోతే యుద్ధ ఫలితాలు పాడు

పోతాయి. చిన్న చిన్న స్వయం సంపూర్ణ స్వావలంబన ప్రదేశాలు కలసిన సమాఖ్యయే నిజమైన ప్రజాపాలన మనిపించుకుంటుంది. పూర్వం హిందూ దేశంలో ఉన్న పద్ధతి అదే ♦

## విశ్రాంతి - పని

మన దేశంలో ఇదివరకు నశించిన ఇప్పుడు నశిస్తూన్న చేతి పనులనూ, గృహ పరిశ్రమలనూ పునరుద్ధరిస్తే అందరికీ పని కల్పించవచ్చు నన్నప్పుడు, "పని కల్పించడ మొక్కటే ప్రధానం కాదు, అది తగినంత ప్రతి ఫలమిచ్చేదిగా కూడా ఉండాలి. అలా ఉండకపోతే ఆపని చేయనక్కర లేదు. అందరికీ ఆహారమూ, స్వస్థతా కలిగించి తద్వారా విశ్రాంతిని సంపాదించడం మాత్రమే ముఖ్యాశయంగా ఉండాలి." అంటారు సోషలిస్టులు, యల్. పి. జాక్సు విశ్రాంతిని ఇలా వ్యాఖ్యానం చేస్తూన్నారు.

> మనిషి ఆత్మను స్వాధీనపరచుకోవడానికి తెల్లదొరలమధ్య నల్లవాళ్ళ మధ్య, ఎప్పుడు తీవ్రతమమైన పోరాటం జరుగుతూంటుందో ఆ సమయమే విశ్రాంతి అతని జీవితంలో.

విశ్రాంతి వలన మనస్సుకు, శరీరానికీ కూడా సోమరితనం కలుగుతుంది. అది అనేక దుర్బుద్ధులకు హేతువౌతుంది. అదీ అసలు చిక్కు. శరీరకష్టానికి రెండుగంటలు, బుద్ధితో చేసేపనికి ఆరు గంటలూ ఏర్పాటుచేస్తే బాగుండునని ఒక్కొక్కప్పుడు కొందరు సూచిస్తూంటారు. అయితే బుద్ధితో చేసే పనిని

♦ ఈ విషయాలు 11 వ అధ్యాయంలో వివరంగా ఉన్నవి.

స్వలాభం కోసం వినియోగించుకోవచ్చునా లేక జాతీయ ప్రయోజనంకోసం వినియోగించాలా? అనే ప్రశ్న వస్తుంది. శరీర కష్టంతో చేసేపని లాభంకోసం చేయవలచుకొంటే రెండు గంటలు చేసినందుకు ప్రభుత్వం బాగా మజూరీ యిస్తేనే గాని లేకపోతే సాగనే సాగదు. నిరంతరం శరీర కృషి చేస్తూన్నందువల్ల చెడు ఊహలు కలగడానికి వీలుండదు. కేవలం శరీర కృషిగాని, కేవలం మానసిక కృషిగానీ విద్య అని చెప్పడానికి వీలు లేదు వట్టి దాస్యభావంతో అభిరుచిలేని పని చేస్తూన్న కొద్దీ మనిషిలోని సున్నిత భావాలు నశిస్తాయి. ఈ విధంగా చూస్తే గ్రామస్థుల జీవితం, జంతు జీవితం కంటె కనా కష్టమనిపిస్తుంది. చేస్తూన్న పనిలో మానసికానందం లేకపోతే, ఆపని పశువుచేసినట్లు చేయడమవుతుంది. కాబట్టి పనీ, బుద్ధి వికాసం - ఈ రెండూ కలిసి ఉండాలి. మానసికోత్సాహం కలిగి చేసే నిరంతర శరీరకృషి- ముఖ్యంగా కళా సృష్టిని ప్రదర్శించే చేతిపనులను చేయడం- బుద్ధిని మొద్దు బారకుండా చేస్తుంది. ఈ సందర్భంలో యంత్రంమీాద పనిచేసే పాశ్చాత్య కార్మికునికంటె ఇండియా లోని శిల్పకారు డెక్కువ అదృష్టవంతుడు.

సరియైన కాలంలో సరియైన సమస్యకోసం పనిచేస్తే మన ఉద్యమానికది యెక్కువ సహాయకారి అవుతుంది లేదా తప్పుదారిని పడి మన గమ్యస్థానమును చేరలేము. మనము పెట్టుబడిదారీ పద్ధతికి వ్యతిరేకంగా పోరాడు తున్నాము, పోరాడ వలసిందే. మన ఇండియాలో ఉన్న

నేటి పెట్టుబడిదారీ విధానం పాశ్చాత్య వర్తకం సృష్టించింది. దీనికి వెనుక పాశ్చాత్య ప్రభుత్వ సైన్యాలు అండగా ఉన్నవి. భారతీయ పెట్టుబడిదారీ విధానంతో మనం ఎంత తీవ్రంగా పోరాడుతూంటామో, అంత తీవ్రంగానూ దానికి వెనుక నున్న పాశ్చాత్య పెట్టుబడిదారుల విశాల ప్రయోజనాలకు కూడా దెబ్బ తగులుతూంటుంది. కాబట్టి మనకు విదేశీ ప్రభుత్వంతో విరోధం వచ్చి తీరుతుంది. దేశీయ వర్తకునికి తన ప్రయోజనాల కోసం, విదేశీ ప్రభుత్వంతోనూ విదేశీ వర్తకుడితోనూ కూడా చేతులు కలపాలనే బుద్ధి పుడుతుంది. ఈవిధంగా మనం ఏనుగు వంటి బ్రిటిష్ పెట్టుబడిదారుకూ, దోమవంటి ఇండియన్ పెట్టుబడిదారుకూ కూడని సఖ్యం కల్పించి స్వరాజిస్టునూ, సోషలిస్టునూ కూడా నలిపివేయ డానికి తగిన బలం వారికి చేకూరుస్తున్నాము. ఇది కష్ట జీవులకు చాలా నష్టం. స్వరాజిస్టు సోషలిస్టు లిరువురూ వారికి స్నేహితులుగా ఇంతవరకూ వ్యవహరిస్తున్నారు. కాని విదేశీ ప్రభుత్వాధికారం పూర్తిగా పోకపోయినప్పటికీ కొంత బిగువు తగ్గిపోతూన్న సమయంలో సరిగా పేదలకు క్షేమం కలగబోయేటప్పుడు ఇలా జరగడం మంచిది కాదు. ఇందు వల్ల మనం బలహీన పఊచ దలచుకొన్న పక్షం బలపడు తూన్నది. కాబట్టి మన పద్ధతులు మన ఉద్దేశాలను భగ్న పరచేవి కాకూడదు. విదేశీయులతో వ్యవహారం తేలిన తరువాత స్వదేశీ పెట్టుబడిదారులతో తేల్చుకోవడానికి తగిన బలమూ అవకాశమూ లేక పోతుందా మన సోష

లిస్టుకు. కాలం పరివర్తనస్థితికి వచ్చినప్పుడు సోషలిస్టు సత్యాగ్రహ పద్ధతుల నవలంబించినా, లేక పరంపరాగతములైన సాంఘిక, ఆర్థిక, రాజకీయ విగ్రహ పద్ధతుల నవలంబించినా, అతని బలాని కెదురుండదు.

## సోషలిజమును ఇండియా కనుగుణంగా చేయాలి

మన దేశాని కనుగుణంగా ఉండే సామ్యవాద సిద్ధాంతాన్ని మన మవలంబిద్దాము. జమీందారుల మరాశనూ వారసత్వం వల్ల వంశానుగతంగా సంక్రమిస్తూన్న వ రి నిరంకుశాధిపత్యాన్నీ కూడా మన మిక సహించలేము. పుట్టుక వల్లనే గొప్పవారుగానూ, నీచులుగానూ పరిగణించే భేదాలిక ఎంత మాత్రమూ పనికిరావు. ప్రపంచంలోని అయిదోభాగం జన సంఖ్య దాస్య భావంలో ఉండడం అసలే అంగీకరించడానికీ వీలు లేదు. మనం తాగుడును రూపుమాపి అంటరానితనాన్ని కనపడకుండా చేయాలి. అంతేకాదు, వీరందరికీ సంవత్సరం పొడుగునా కడుపునిండా అన్నం దొరికేటట్టు చేయాలి. గ్రామ కళలను, చేతిపనులను అభివృద్ధి చేయాలి. సోషలిజం పేరుతో పెద్ద పెద్ద కేకలు పెట్టి మన జీవితంలో ఎప్పుడూ విదేశీ వస్తువులనో, యంత్రముల మీద తయారైన వస్తువులనో కొంటూంటే పేదవాని కది ఏవిధంగా ప్రయోజనం కలుగుతుంది? నినాదాలతోనూ సానుభూతి తీర్మానాలతోను పాపం మన పేద సోదరులను పాతిపెట్టక, కొన్ని అణాలో అధమం కొన్ని కానులో సంపాదించుకోవడానికి సహాయపడి, వాళ్ళను ప్రాణాలతో ఉండనిద్దాము.

పేదవాళ్ళకు ప్రత్యక్షంగా ఉపకరించే రోజువారీ కార్య క్రమం ఉంటే సోషలిస్టుకి నాడే జయం కలుగుతుంది. "ప్రజలలో తిరుగుబాటు భావం కలిగించి విప్లవం లేవదీయడానికి వాళ్ళ ఆకలి బాధను అంతకంత కెక్కువ చేయాలి." అనే కమ్యూనిస్టు నినాదం క్రూరమేగాక అన్యాయం కూడాను. కాబట్టి ఖద్దరుకూ గ్రామ పరిశ్రమలకూ వ్యతిరేకంగా ప్రచారంచేస్తూ మిల్లు బట్టనో లేక విదేశీ వస్త్రమునో ఉపయోగించవలసిందని సోషలిస్టులు కోరుతూండడం విషాదకరం. "ప్రపంచ కార్మికులారా! ఏకము కండు! మీ సంకెళ్లు తప్ప మీకు పోయేదేమీ లేదు" అనే నినాద ముత్తమోత్తమమైనది. కాని ప్రపంచంలోని సగం మంది కార్మికులు తక్కిన సగం మందిని ఆర్థిక పారిశ్రామిక దాస్య శృంఖలాలలో గట్టిగా బంధించడానికి ఏకమవుతూన్నారు. దానికి మన మేమనాలి! సోషలిస్టు ఉద్దేశం మంచిది. కాని భాగ్యవంతుణ్ని ఇంకా భాగ్యవంతుడుగానూ పేదవాణ్ని ఇంకా పేదవాడుగానూ చేసే పనికి దేనికీ ఆయన పాల్పడకుండుగాక! సోషలిస్టులు గానీ, కాంగ్రెసు వాదులు గానీ ప్రజల సహకారం లేనిది యేమీ ఉపకారం చేయలేరు. మనస్సులో కలిగిన విశ్వాస భావాన్ని క్రియారూపంగా ప్రదర్శించడమే సహకారం. చిరకాలం శ్రమపడి చేసిన సేవాఫలితంగా ప్రజాసామాన్య హృదయంలో కలిగిన ఆకాస్త నమ్మకాన్ని పోగొట్టే పనిని దేనినీ మనం చేయవద్దు. వోట్లతోనూ వట్టి నినాదాలతోనూ పొట్టలునిండవు. సోషలిజంజయప్రదం కావా

లంటే దానిని వర్తింపచేసే సంఘంయొక్క పునాదులకూ, దేశసంప్రదాయాలకూ అది అనుగుణంగా ఉండి, అంగాంగీ భావంతో పనిచేయాలి. అంతేకాదు, దారిద్ర్యం తాండవ మాడుతూన్న ఈ పురాతన భారత దేశపు కుటీరాలలోని దుఃఖాన్నీ బాధనూ తొలగించే క్రియారూపకమైన కార్య క్రమం కలిగి ఉండా లది.

## గాంధీజం : సోషలిజం

సోషలిజం అందఱికీ సమానావకాశాలను కల్పించాలంటుంది. గాంధీజం ప్రతిమనిషికీ ఉన్నకాలాన్నీ అవకాశాలనూ ఉదా రాశయాలకోసం వినియోగించ మంటుంది. చాలా ఎక్కువ పన్నులను విధించి, అపరాధాలను అధికంగా వసూలుచేసి, హక్కులను తొలగించి, బలాన్ని ప్రయోగించి, ఆస్తిని విచ్ఛిన్నం చేస్తుంది సోషలిజం. ధనంకంటె దారిద్ర్యాన్నీ, ఐశ్వర్యంకంటె విద్యా విశేషాన్నీ ఉన్నతశ్రేణిలో చేర్చిన మన పూర్వ సంప్రదాయాల కనుగుణంగా మనస్సులకు నచ్చేటట్లుపదేశిస్తుంది గాంధీజం. సోషలిజం తన పనిని చక్క పెట్టుకోవడానికి ప్రభుత్వ సహాయం కావాలంటుంది. గాంధీజం తన విజయంకోసం ప్రజల సంస్కారాభివృద్ధిపైనా, విశుద్ధాంతఃకరణంపైనా ఆధారపడి ఉంటుంది. పైనుండి తెచ్చి, ప్రజలమీాద బలవంతంగా రుద్దిన సోషలిజం ఫలితాలు ప్రదర్శన యోగ్యములుగా కనిపించ వచ్చును. కాని అవి శాశ్వతంగా నిలిచేవికావు. హానికరములు కూడాను.

గాంధీజంవలన కలిగే ఫలితాలు చిన్నవిగా కనపడ్డప్పటికీ ప్రజల ప్రేమ భావాలలో శాశ్వతంగా వేళ్లు నాటుకొని ఉంటవి సోషలిజం కళ్ళముందు సోషలిస్టు నాయకులు సొంత సిద్ధాంతాలు, సొంత అధికారం, చెక్కు చెదరకుండా ఉంచు కోవడానికి నియంతలయినారు. గాంధీజం స్వార్థత్యాగ సిద్ధాంతాన్ని బుద్ధి పూర్వకంగా అవలంబించ మంటుంది. కనుకనే గోపాల్దాసు దేశాయి, ఠాకూర్ ఆఫ్ రాయిసాంగ్లీ; దర్బార్ ఆఫ్ ధస్సా, కలకంకర్ రాజాల (సం. రా.) ఔన్నత్యాన్ని చూడగలిగిం దాసిద్ధాంతం. వీరందఱు బుద్ధిపూర్వకంగా ఐశ్వర్యాన్ని త్యజించి దారిద్ర్యాన్ని స్వీకరించిన వారు - లేదా తమ భాగ్యాన్ని పేదలకోసం వినియోగించినవారు. చాలా మందికి సోషలిజం ఒక భావం, ఒక ప్రవృత్తి, అంతే. కాని గాంధీజం కళ్ళకు కట్టినట్లు కనపడే ప్రత్యక్ష నిదర్శనం, సేవా త్యాగములతో గూడిన రోజువారీ కార్యక్రమ విధానము. సోషలిజంలో నాయకు లితరులు చేయవలసిన పనులను ఉపదేశిస్తూంటారు. గాంధీజం ప్రతివాడూ యేమి చేయవలసి ఉంటుందో ఆకార్యక్రమమే నివేదిస్తుంది. సోషలిజం, ప్రజలలోని పాపష్యాన్ని రెచ్చగొట్టి మానవాభ్యుదయం కలిగించవలెనని ప్రయత్నిస్తుంది. సోషలిజం, కొన్ని భాగాలు ఊషర క్షేత్రాలుగా ఉన్న దేశంలో, పండిన పంటంతా ఒకచోట కూడబెట్టి పునర్విభజన చేస్తుంది. గాంధీజం చదునులో, సారంలో, శీతోష్ణస్థితిలో, తదితర పరిస్థితులలో, యే లోపమూ లేని విశాల భూమిగల దేశంలో ఎవనికి కావలసిన

అన్నం, వస్త్రం, వానినే ఉత్పత్తి చేసుకోమంటుంది. సోషలిజంలో పనిచీ ట్లిచ్చి అందఱూ ప్రభుత్వానికి పనిచేసే టట్టు నిర్బంధిస్తారు. గాంధీజం, స్త్రీ పురుషులు సంప్రదాయ సిద్ధంగా తమ తమ జట్టులలో కలసి పని చేస్తూన్నందువల్ల అందులోని ప్రతి ఒక్కరూ ఎలా ఉపకారశీలు రవుతున్నారో ప్రపంచానికి వెల్లడిచేస్తుంది సోషలిజం, కుటుంబాలలో సైతం సమత్వం లేని సంఘంలో ఇంగ్లండులో జ్యేష్ఠానుక్రమ శాసనం వలన పెద్దవాంకితప్ప తక్కిన వాళ్ళకు ఆస్తిలో భాగం లేదు, హిందువులలో మగబిడ్డలకు తప్ప ఆడపిల్లలకు భాగం లేదు. మహమ్మదీయులలో కొడుకులకు సమానభాగము, కూతుళ్లకు న్యాయ్యభాగము-ఇట్టి విపరీత భేదాలుగల సంఘంలో, ఆస్తిని సమంగా పంచిపెట్ట కోరుతుంది, సోషలిజం పాశ్చాత్య నాగరిక సంస్థలోని వ్యాధికి చికిత్స కావచ్చును. గాంధీజం వేల కొలదీ సంవత్సరాలకిందట మహర్షులు రూపమిచ్చిన సంఘ నిర్మాణమునకు, ధర్మములకూ వ్యాఖ్యానం. నేడా సంఘాన్ని మఱియొక మహర్షి పునః ప్రతిష్ఠాప పునరుద్ధరింప, పునరుజ్జీవింప జేయ ప్రయత్నిస్తున్నాడు. అందువల్లనే కరాచీలో "గాంధీ మరణించవచ్చును. గాంధీజం మరణించదు" అన్నాడు గాంధీ. ఆరోగ్యం, ఐశ్వర్యం, అభ్యుదయం - ఇవి మానవ వ్యవహారాలలో అగ్రస్థానం వహిస్తవి. ఇవి అనుభవరహితమైన వట్టి సిద్ధాంతంతో నియమించ తగినవి కావు. వెనుక జరిగిన పని, నేడు కలిగిన చిక్కు, భవిష్య త్ప్రయోజనం - ఇవన్నీ సమగ్రంగా పరిశీలించి నియమించాలి వీటిని. ఇంతకు మించిన

ఉత్తమ రాజనీతిశాస్త్రం లేదు. ఏ పేరుతోనైనా పిలవండి దీనిని. ఆరోగ్యమే ఐశ్వర్యమనండి; నూతన సంఘ వ్యవస్థ అనండి; కమ్యూనిస్టు ఆర్థిక నిర్మాణ మనండి. ఈ అన్నీ కూడా ఒకే ప్రధాన సూత్రాన్ని సూచిస్తవి. సత్యం పునాదిగానూ అహింస శిఖరంగానూ కట్టబడిన జాతీయ సౌధమును క్రమ పద్ధతిలో ఉంచే సూత్రమని. పాశ్చాత్యులకంటె ధర్మాలు ఉన్నతస్థానం వహించాలనే సూత్రం.

గాంధీజం బోధిస్తూన్న విషయాలను బట్టి, అది అపజయం పొందినట్లుగా భావించవచ్చును కాదా అని కొందరు ప్రశ్నిస్తూంటారు. అవుననీ చెప్పవచ్చు, కాదనీ చెప్పవచ్చు. దానికి జవాబు మన ఆలోచనా విధానంపైన ఆధారపడి ఉంటుంది. ప్రపంచంలోని ప్రత్యక్ష విషయాలను గమనించకుండా కేవలం ఆదర్శాలనుబట్టి ఆలోచిస్తే, యథార్థం ఎప్పుడూ అపజయం పొందిందనే అనవలసి వస్తుంది. ఆదర్శం యథార్థంగా మారుతూన్నప్పుడది సంపూర్ణ విజయ మనిపించుకోదు. కాబట్టి యథార్థ మెప్పుడూ ఆదర్శంకంటె పలచగా ఉంటుంది. కనుక విజయము, అపజయము అనే పదాల్ని ఆదర్శంకంటె యథార్థం ఎంత తక్కువ పల్చగా ఉన్నదో, దాని పరిమాణాన్ని తెలియచేస్తవి. ఆదర్శం మరీ పలచబడిపోయినప్పుడు, అందులో కల్తీ ఉందంటాము. మధ్యస్థంగా ఉన్నప్పుడు పరవాలేదంటాము. ఇవన్నీ తోసిపారేసి రాజీ లేదనుకొంటే అప్పుడది అపజయం పొందిందంటాము. కాబట్టి ఇటువంటి విషయాలను చర్చించేటప్పుడనేక రాజీపద్ధతుల

కొప్పుకోని - రాజీపద్ధతుల కేగాను - అనుకోకుండా అనేకం జరుగుతయి. వాటికి కూడా ఒప్పుకొని, క్షమించ తగిన తప్పులకు క్షమార్హములుగాని తప్పులకూ భేదం గమనించాలి.

## మనిషి - యంత్రము

మనిషి - యంత్రము ఒకరిస్థానంలో ఒకటి మారి పనిచేయు డానికి వీలుందా లేక పరస్పర సహాయకారులుగా ఉండాలా అనేదే నేటి పోరాటా లన్నిటికీ మూలమైన జీవిత సమస్య. దీనినే మరొక విధంగాకూడా అడగవచ్చును. యంత్రం మనుష్య ప్రయత్నానికి తోడుగా ఉండి, మానవునికి ప్రయో జనకారియైన పరికరంగా ఉండవలెనా? కొసకు మానవ కృషితో నిమిత్తం లేకుండా పని జరిగేటంత వరకూ అది అభివృద్ధి కావలెనా అని. ఇందులో ఏది ప్రపంచాభ్యుదయా నికి దారితీయగలదో మనమాలోచించాలి. పాశ్చాత్య దేశాల వారు మానవశరీర మొక యంత్రమనీ, సంఘం సంహిత యంత్రమనీ, (Composite Machine) ప్రభుత్వం మిశ్రమ యంత్ర (Complex) మనీ భావిస్తారు. ఇంతవరకు కనిపెట్టిన యంత్రా లన్నిటిలోకీ మనిషి అత్యంత శక్తివంతమైన యంత్రం. కాబట్టి ఈ విషయాన్ని బాగా పరిశీలించడంలో పాశ్చాత్య మానవునికెంతో శ్రద్ధ. ఈ రోజున యంత్రం కూడికలు, తీసివేతలు, ఎచ్చవేతలు, భాగారాలు చేస్తూ న్నది. రైళ్ళు, విమానాలు, నడిపిస్తూన్నది. రోడ్లమీద పోలీసువానివలె రాకపోకలను నియమిస్తూన్నది. ఫేజీలకు

నెంబర్లు వేస్తూన్నది. పత్రికలను అచ్చుగుద్ది, మడతలుపెట్టి కట్టలు కడుతూన్నది, వార్తలను మోస్తూన్నది. దూరపు నగరాలలోనుండి వచ్చిన వార్తలను పైపుచేస్తూన్నది. దూర శ్రవణం దూరదృష్టియంత్రాలు చేసే పనిచూస్తే, యేదో ఒక స్వప్నప్రపంచంలో ఉన్నట్లు తోచి, మానవ విజ్ఞాన భావ వికాసములలో నూతనప్రభావం రేకెత్తుతూన్నది. పారిశ్రామిక నాయకులు పరంపరగా తెలియకుండా వచ్చి పడుతూన్నారు. ఐశ్వర్యం అంతులేకుండా ఒక్కచోట పెరిగి పోతూన్నది. వ్యక్తులమధ్యా సంఘాలమధ్యనే కాదు, జాతుల మధ్యకూడా సోదరభావం పైకి కనపడుతూన్నది. కాని నిజానికి స్వార్థపరత్వమనే పెనుభూత మొకటి పుట్టింది. దానికి తోడుగా స్పర్థ అనే దానివంటి భూతమే మరొకటి తాండవమాడుతూన్నది. ఇందువలన ఆర్థిక వాణిజ్య వ్యవహారాలలో చాలా పరివర్తనం కలిగి, మధ్య విక్టోరియన్ యుగంలో మితవాదులచే ఉద్ఘాటింపబడిన స్వేచ్ఛా వ్యాపారసిద్ధాంతం ఆచరణలోకి వచ్చింది పెట్టుబడిదార్లు ఐశ్వర్యంఅభివృద్ధి చేసుకోవడానికి పరికరంగా వినియోగించుకొంటూన్న కార్మికవర్గంలో చైతన్యం కలిగి, ట్రేడ్ యూనియను ఉద్యమం ప్రారంభమయింది. అదే సోషలిష్టు ఉద్యమంగా పరిణామం పొంది చివరకు హింసమీద ఆధారపడ్డ కమ్యూనిష్టు ఉద్యమంగా పరమావధిని పొందింది. యంత్రం, మనిషిసుఖాలను కొంతవరకు పెంపొందించిన మాట వాస్తవమే. కాని ఆ సుఖాలతో పాటు చాలా దుఃఖాలనుకూడా తెచ్చిపెట్టింది. కార్మికులకు

వోటింగు అధికారమిచ్చి, కూలిసీ, బోనస్సులను పెంచీ, భీమా సదుపాయాలు చేసి, దినబత్తె మిచ్చి, ఇంకా అనేక ప్రయోజనాలు కల్పించి రాజకీయంగా, ఆర్థికంగా, సాంఘికంగా వారి దుఃఖాలను కొంతకొంత నివారిస్తూన్నమాట నిజమే. కాని ఇవేవీకూడా ఐశ్వర్యాన్ని ఉత్పత్తి చేసే ఆ అసలు మనుష్యులను వ్యామోహపెట్టలేకపోతూన్నాయి. సమ్మెలు కట్టడం, గేట్లుమూయడం (Lock-out) పనిముట్లు పాడుచేయడం, తుపాకులు కాల్చడం-ఇవన్నీ యంత్రాలతోనే ప్రారంభమైనవి. కాబట్టి మేము యంత్రాలను నిరసించడం మూఢవిశ్వాసం వలన కాదు. గ్రామాలను దస్యానికి గురిచేసి, మానవ వ్యక్తిత్వ కళాకౌశలములను నాశనంచేసి, పేదవాణ్ని మరీ పేదవాడుగాను, ధనవంతుణ్ని ఇంకా ధనవంతుడుగానూ చేసే స్వార్థపరత్వాన్ని పెంచి, దేశమంతటా గృహస్థులను, కుటుంబాలను ధర్మభ్రష్టులనుగా చేసి, జాతులకు జాతులకూ నిరంతర సాంగ్రామిక పరిస్థితులను కల్పించి, జీవితంపైన దండయాత్ర సాగిస్తూన్న యంత్రయుగపు అంతులేని అధికారాన్ని మాత్రమే మేమిక్కడ నిజంగా నిరసిస్తూన్నది.

## యంత్రాలనుగూర్చి గాంధీ

పారిశ్రామిక సభ్యతనుగూర్చీ, యంత్రాలనుగూర్చీ గాంధీకి నిశ్చితాభిప్రాయాలున్నవి. మిల్టన్ "నాజూకు లేనిముత్యాలూ బంగారం" భారత దేశంలో మూలుగుతూన్నవి అన్న నాటి ఐశ్వర్యాన్ని నేడు కూటికి లేక కుంగిపోతూన్న పేదరిక స్థితికి

తీసుకొనివచ్చిన బ్రిటిష్ ప్రభుత్వపు అమానుష పద్ధతినిగూర్చి గాంధీ అనేకసార్లు విపులంగా వ్రాశాడు. ఈరోజున ఈ దేశం లోని అధికవంతు జనులు దాదాపు పస్తులు చేస్తున్నారు. తక్కినవారు తగిన ఇళ్ళు, తగిన తిండి తగినబట్టా లేక బాధ పడుతూన్నారు. ఇక్కడి లక్షలాది ప్రజలకిదివరకు ఉండడా నికి ఇల్లు, తినడానికి తిండి, కట్టుకోవడానికి బట్ట ఈయగలి గిన ప్రకృతి సౌభాగ్యం, నేడు కొరవడినందువలన ఈదుస్థితి పట్టిందని చెప్పడానికి కారణాలేవీ కనుపించవు. పూర్వఋషు లచే వేలకొలది సంవత్సరాలకిందట నిర్మితములైన వర్ణాశ్రమ ధర్మాలవలన, గ్రామములు ముఖ్యజీవితావసరముల విషయ ములో స్వయం సంపూర్ణములు, స్వావలంబనములుగా నుండి అధికారైశ్వర్యములు రెంకునూ ఉచితరీతిని విభజింపబడి సంఘశాంతికి భంగము లేకుండెను. గ్రామీణులు తమపంట లను తాము పండించుకొని భుజించేవారు నూలు వడుకు కొని బట్టలను నేసుకొనేవారు. తమయిళ్లు తాము కట్టుకొని నివసించేవారు అందువల్ల భారతీయాదర్శముల ప్రకారం సంసారం గుట్టుగా నడవడానికి వీలుండేది. కుటుంబ జీవితం శిథిలం గాకుండా ఉండేది. అట్టివారి సర్వసాధారణ హస్త కౌశలం పోయి, ఇప్పుడది మరొక కొత్తమార్గంపట్టింది. అందు వల్ల లక్షలాది గ్రామస్థులు తమ గ్రామాలు, ఇళ్ళు, పొలా లను, పచ్చికబయళ్ళు, పచ్చని చెట్లు, కొలిమిపొయ్యి, మగ్గం రాట్నం, సుత్తి, ఉలి, ఆరోగ్యం, ఆనందం, అభ్యుదయం, సంతృప్తి, చల్లనివాగులు, సత్తువ కలుగజేసే గాలి, వెంచు

కొనే ఆవులు, ఎడ్లు, గొఱ్ఱెలు, మేకలు, కోళ్లు, బాతులు, చెఱువులు, తోటలు—ఈ అన్నిటినీ విడచి, రోగంతో, తాగుడుతో, క్రిక్కిరిసి కల్లోలంగా కనిపించే నగరాలకు చేరి, నానారకాల కూలిజనంతో కలసి ఇంగ్లీషు పెట్టుబడిదారుల కోసమో, భారతీయ పెట్టుబడిదారుల లాభాలకో చెమటోడ్చి పనిచేసేటందుకు అమ్ముడుపోవలసివచ్చింది. నేను భారతీయ గ్రామశిల్పుల, కర్మకారుల కళాకౌశల్యాన్ని తెలియజేసే అంగళ్ళెక్కడా కనిపించవు. అంతేకాదు; ఇదివరకున్న సమష్టిభావంపోయి స్పర్థ హెచ్చింది. స్వార్థం పెఱిగి సమష్టి ఐశ్వర్యోత్పత్తిభావాన్ని చంపివేసింది. కాబట్టి సమష్టికుటుంబంలో ఇదివరకున్న సహకార, సౌభ్రాతృత్వభావాలు, నేటి యంత్రయుగములోని వైషమ్య వైఖరివలన నాశనమైపోయినవి. భారతజాతీయతా పునర్నిర్మాణమునకై అప్పుడప్పుడూ ప్రకటింపబడే పథకాలన్నీ పారిశ్రామిక ధనస్వామిక పద్ధతుల మీద ఆధారపడిఉన్న పాశ్చాత్యదేశాల ఆర్థిక సాంఘిక నిర్మాణాల పదవ తరగతి అనుకరణాలు మాత్రమే. ఇవి సామ్రాజ్యవాదుల వ్యవహారములకు తోడ్పడుతూ, వారిచేత దోహదం చేయబడుతూన్నవి. సామ్రాజ్యవాదానికి బ్రిటిష్ జర్మను సైనిక సన్నాహపద్ధతులు సహాయకారులుగా ఉంటవి. కనుకనే ఈ రెండు దేశాలమధ్యా నిరంతర స్పర్థ. ఈ రెండూ ఎప్పుడూ ఒకదానితో ఒకటి యుద్ధానికి తయారుగా ఉండడానికి కూడా కారణ మదే. భారతదేశంలోని ఆర్థికశాస్త్రనిపుణులు, ఆచార్యులు, మంత్రులు, రాజకీయ

వేత్తలు అంతా పాశ్చాత్య విద్యాపద్ధతివలన ఉత్పత్తిఅయిన వారు. మార్షల్, ఫాసెట్టుల గురుపీఠాలను పూజించి దశాబ్దాలకొలది విద్యాభ్యాసంచేసినవారు. అందువల్ల హిందూ దేశంలో పారిశ్రామిక విప్లవం కావాలని కోరేవారుగా తయారయినారు. కాబట్టి వారు భారతదేశ పునరుజ్జీవనానికి జాతీయ పారిశ్రామిక ప్రణాళిక, కాలపరిమితి పథకము కావాలంటూన్నారు. ఈ సర్వసాధారణ చికిత్సలను నిర్దేశించడంలో మన సాంఘిక, ఆర్థిక వ్యవహారకోవిదమ్మన్యులు రోగిని, చికిత్సాసిద్ధాంతక్రమాలనూ అశ్రద్ధచేసి, రోగచిహ్నలకుమాత్రమే వైద్యంచేస్తూన్నారు. ఈ అశాస్త్రీయ చికిత్సాపద్ధతి ఆచరణలోకివచ్చి ప్రజామోదం పొందజూడడానికి కారణం కేవలం పారిశ్రామికాభివృద్ధియే గాదు. నేటివరకూ నడుస్తూన్న ఇక్కడి విద్యాపద్ధతిలో విద్యకంటె విద్యావంతులను అచ్చుగుద్ది తయారుచేయడం ఎక్కువ. ఈ దేశంలో ఆచార్యపీఠానికి ఆభరణాలయినవారంతా, విషమ, విదేశీయ జీర్ణపద్ధతులపైన నడపబడుతూన్న విశ్వవిద్యాలయాలలో ఉత్పత్తిఅయినవారు కావడమే దీనికింతకూ ముఖ్యకారణం. నూటికి 67మంది వ్యవసాయకులుగల ఈదేశంలో ప్రభుత్వ వ్యవసాయశాఖలు కేవలం భూసారం, శీతోష్ణస్థితులనుబట్టి పశువులు, చీడపురుగులు మొక్కల విషయమునేగాక, పూర్వ చరిత్రనూ, ప్రస్తుత పరిస్థితిసిబట్టి మానవుని విషయంకూడా పరిశీలించవలసి ఉంటుందని ఐ. సి. యస్. ఉద్యోగి మన శాంతి రామమూర్తిగారు చెప్పినమాట యథార్థం "భారతీయవ్యవసాయపద్ధతిలో మానవసంబంధం తెగిపోయిం"

దన్నా రాయన. ఒక వ్యవసాయంలోనేకాదు, విద్యలో, పరి శ్రమలలో, గృహపరిశ్రమలో, ప్రభుత్వ నిర్మాణంలో, గాని ప్రధానోద్దేశ నియమాలలో — అన్నిటిలోకూడా మానవ సంబంధం తెగిపోయింది.

ప్రపంచంలోని అన్ని ప్రభుత్వాలు ప్రపంచవాణిజ్య పరి శ్రమలపైన ఆధిక్యత సంపాదించి తమ దేశానికెక్కువ వర్తక లాభాలను చేకూర్చేటందుకే తమ యావచ్ఛక్తినీ వినియో గిస్తూన్నవి. అందువల్లనే అభివృద్ధిపొందుతూన్న దేశాలలో పరస్పర వైషమ్యం నిరంతరం పెచ్చుపెరిగిపోతూండడం. ప్రపంచంలోని అన్నిదేశాలకూ తామెగుమతిచేసే వస్తు వుల విలువ ఎక్కువగానూ, దిగుమతిచేసుకొనే వస్తువుల విలువ తక్కువగానూ ఉండాలంటే ఎలా సాధ్యమౌతుంది? ఈవిధంగా కొందఱికి లాభిస్తే మఱికొందఱికి నష్టం వచ్చి తీరాలి. కొందఱు కొడుకులను కట్నాలు పుచ్చుకొనేవారుంటే అల్లుళ్ళకు కట్నాలిచ్చి పెళ్ళిచేయగల ఆడపిల్లల తండ్రులు కూడా కొంద రుండాలి. ప్రపంచంలోని అందఱి తండ్రులూ కట్నాలు తీసుకొనేటందుకు సాధ్యమౌతుందా? ఎవ రిస్తారు? అదేవిధంగా ప్రతిజాతికి తమ ఎగుమతుల విలువ దిగుమతుల విలువకంటె ఎక్కువగానుండి లాభంచేకూరవలెనంటేసాధ్యం కాదు. ముడివస్తువులకోసం, తయారైన వస్తువుల అంగళ్ల కోసం, నిరంతరం పోటీపడుతూండడమే దేశాలమధ్యజరిగే ఈ యుద్ధాలకు కారణమై, యుద్ధపద్ధతియే పూర్తిగా మారి పోయింది. జరిగిన ఐరోపాయుద్ధంలో నిలబడి యుద్ధంచేయడం

కనపడింది. ఇప్పటి యుద్ధం ఆకాశంలోనూ, నీళ్ళపైనా, నీళ్ళలోనూ జరుగుతూన్నది. బాంబింగుతో, బ్లాకౌటుతో, బ్లాకేడు (వస్తువుల రాకపోకలను ఆపడం)తో జరుగుతూన్నది. వెనుకటి యుద్ధాన్నిగూర్చి మాకు తెలిసిన విషయాలివి:—

వెనుకటి యుద్ధంలో ప్రత్యక్షంగా అయిన ఖర్చులు 186,000,000,000 డాలర్లు. పరోక్షంగా అయిన ఖర్చులు 151,000,000,000 డాలర్లు. మొత్తం 337,000,000,000 డాలర్లు. అనగా షుమారు లక్షకోట్ల రూపాయలు. జరిగిన ఆ యుద్ధంలోనే 60,000,000 సైనికులు యుద్ధసన్నద్ధులయినారు. రంగస్థలంలో దెబ్బతిన్నవాళ్లు 33,000,000. వారిలో హతులుకానీ, రోగంవచ్చికానీ చనిపోయినవాళ్లు 8,000,000, గాయపడినవారు షుమారు 19,000,000 ఖయిదీలుగాతీసుకోబడ్డవారు 7,000,000. అందరిలోకీ ఈ విషయాల్లో ఎక్కువ దెబ్బతిన్నది రష్యా. అక్కడ హతుల సంఖ్య 9,000,000. జర్మనీలో 6,000,000. ఫ్రాన్సులో 4,500,000, బ్రిటిష్‌సామ్రాజ్యం 3,000,000. అమెరికాలో హతులయినవారిసంఖ్య చాలాతక్కువ. 3,000,000 మాత్రమే; కేవలం యుద్ధంవల్ల చచ్చిపోయినవారి సంఖ్య 40,000,000; యుద్ధంవల్ల తగ్గిపోయిన జననాలనుకూడా కలిపితే మొత్తంసంఖ్య 50,000,000 అవుతుంది. ఇంకొక దుఃఖప్రదకర విషయ మేమంటే యుద్ధంలో చచ్చిపోయిన సిపాయి ఒకడైతే సాధారణ పౌరు లయిదుగురు చనిపోయినారు యుద్ధకారణంగా. మరియొక దుఃఖకర విషయ మేమంటే, యూరపులో 15,000,000 కుటుంబాలు నిరుద్యోగ భరణాలను తీసుకొంటూన్నట్లు నిరుద్యోగకమిటీ నివేదిక తెలియచేస్తూన్నది. ఇందులో చాలావరకు కరెన్సీని నిరంతరం హెచ్చించుటమూలకంగానే చెల్లింపబడుతూన్నవి. యూరపు జన సంఖ్యలో, దిగుమతులు లేకుండా జీవించడానికి వీలులేని ఎక్కువ జన సంఖ్య అధమం 100,000,000

> మంది ఉన్నట్లు లెక్కల వలన తేలుతూన్నది. కాబట్టి వారు జీవించా లంటే కొత్తగా ఉత్పత్తిచేసి ఎగుమతులను ఆయా దేశాలకు పంపాలి. యంత్రంద్వారా ఎక్కువ ఉత్పత్తిచేయగలము కాని తుదకు యంత్ర మే బెడిసికొడుతుంది.

ఇండియాలోని రైతు, సాలీ, విద్యార్థి, పండితుడు, సరుకులను సప్లయిచేసే వ్యాపారస్థుడు, రాజకీయ వేత్త - వీరెవరు యంత్ర యుగము యొక్క ప్రయోజనాలను పొందకూడదని మేము సూచించడంలేదు. అలా అయితే గాంధీ నిత్యజీవితం, ఆయన సిద్ధాంతాలకు వాస్తవంలో విరుద్ధంగా ఉన్నట్లు భావించవలసి వస్తుంది ఆయన టార్చిలైటు ఉపయోగిస్తాడు. రైలు మెషీనుప యోగిస్తాడు. మోటారులో ప్రయాణంచేస్తాడు. (గంటకు 40 మైళ్లు నడుస్తూన్న మోటారువేగం చాలదంటాడు.) రైలు, పోస్టు, టెలిగ్రాఫ్‌లు ఆయనకు నిత్యమూ అవసరమే. ఆయన నిజంగా అసహ్యించుకొనే విషయ మేమంటే మనిషిని యంత్రంతో సమానంగా చేయడంనిజంగా మనిషి యంత్రా లలో పనిచేస్తూన్నప్పుడు ప్రాణంలేని యంత్రాలకు తాము చేస్తూన్న పనినిగూర్చి ఎంత తెలుసునో ఆతనికికూడా అంతే తెలుస్తూంది వాటికీ స్వతంత్ర సృజనశక్తిలేదు; వాటిలో పని చేసే ఈ మనిషికీలేదు. యంత్రాలలో తక్కిన లోహ భాగాల వంటివాడే ఈతడూను. మనిషి కూడా ఒక పనిముట్టు. మహా ఐతే "ఒక చెయ్యి" అయితే భారతీయ శిల్పులుకానీ, కర్మ కారులుగానీ అలాకాదు. కళానైపుణ్యం చూపించే పనులు చేస్తూన్నారు వారు. అంతేకాదు; కూలికి పనిచేయక వారు

చేసిన పనికి వారే హక్కుదారు లౌతూన్నారు. వారి ఇళ్లలో కూచొని కలకలలాడే భార్యాబిడ్డలతో కలసి పవిత్రకుటుంబ వాతావరణంలో సంపూర్ణహృదయంతో పనులుచేసుకొం టూన్నారు. స్త్రీల ప్రత్యేకత పోషింపబడుతూన్నది. నానా రకాల స్త్రీపురుషులు కలసి ఒకేచోట పనిచేయవలసిన అవ సరం లేదు.

## భారతీయ శిల్పి

భారతీయ శిల్పిచేసే పనిని వృత్తి అనిగానీ వ్యాపారం అనిగానీ పిలవడంకంటె 'ఋషి' అని పిలవడం మంచిది. ఎందువల్ల ననగా అతడు తన అభిరుచులనుబట్టి భవిష్యత్తును నిర్ణయించు కొంటూన్నాడు. అతడు కేవలండబ్బు ప్రధానంగాపనిచేయడు. మనస్సుకు ఉత్సాహం కలిగించే హితకరమైన పనిని చేస్తాడు. అతనిపనివల్ల నిత్యజీవితం ఆందోళన లేకుండా నడుస్తుంది. అవి నీతికరమైనపోటీతో అవసరంలేదు తనపనికి సరియైన మజూరీ నిర్ణీతమయ్యే ఉండడంచేత ధైర్యంగా ఉంటాడు. పెట్టుబడి దారులుగానీ, కళాపోషకులమని చెప్పుకొనేవారుగానీ, తదితర మధ్యదళారీలుగాని తన శిల్పనైపుణ్యాన్ని వారి సొంతలాభం కోసం వినియోగించుకోవడం లేదనే సంతృప్తి ఉంటుంది. అంతేకాక సంఘంలోవచ్చే పేరుప్రతిష్ఠలు, ఆత్మోన్నత్యమూ- ఇవికూడా అతనికి పనిచేయడానికి మానసికోత్సాహాన్ని కలి గిస్తవి. భారతీయ శిల్పికి ఇన్నిగంటలు పనిచేయాలి, ఇంత కూలి ఇస్తామంటే అర్థంకాదు. నేటి కార్మికోద్యమ భాష

అతనికి తెలియదు. అత నిష్టంవచ్చినప్పుడు వచ్చి, ఇష్టంవచ్చి నప్పుడు పోతూ, అతని కెంత పనిచేయాలని ఉత్సాహం ఉంటే అంతవరకే చేసిపోతాడు. అతని కేమీ నిర్బంధం లేదు. అతనిపని జీతంకోసం లెక్క చూపించ తగినదికాదు. అటు వంటి శిల్పకళలో వినియోగించే జీవితానికి సంఘంలో తగిన స్థానం లభించితీరాలి. అత డేరోజు కా రోజు పొట్టకోసం దేవు లాడవలసిన వాడు కాడు; ఇంగ్లండులోని కార్మికుని జీవితం అందువల్లనే కుంగిపోయి అతని ఆత్మ నలిగిపోతూన్నదని సర్ జార్జిబర్డ్ వుడ్ అన్నాడు. ఎప్పుడూ ఏదో ఒక ఆందోళనలో మునిగి తేలుతూండవలసిన అనసరం భారతీయ శిల్పికి లేదు. అతనుచేసే పని మతధర్మంగా తలుస్తాడు. అందువల్ల అతనికి సంతృప్తి ఉంటుంది. అతనికి కావలసినంత విశ్రాంతి. కేవలం తనవృత్తిని తాను నిలబెట్టుకోవలెనని చేసేపనిగనుక మనస్సు కానందంగా ఉంటుం దతనికి. ఇవన్నీ అతని కళాకౌశలానికి దోహదం చేసితీరతయి. చిన్నతనంనుండీ, పెద్దవాడై పనిలో నైపుణ్యం సంపాదించేటంతవరకూ, భారతీయ శిల్పి నేర్చు కొనేది వృత్తివిద్యయే. అతనికి గురువతని తండ్రిగానీ, అన్న గారుగానీ. అతను సంపాదించే విద్య పుస్తకాలలోనుండి కాదు. అతని తాత తండ్రులు సంపాదించిన అనుభవంనుండి. రంగులు కలపడం, వార్నిష్‌లు తయారుచేయడం, సున్నం, సీమెంటు సరియైన దామాషాలో కలపడం, ఇవన్నీ తన కుటుంబంలోనుండే కానువాయిగా తెలుసుకొంటా డతడు. ఎనీమాగానీ, ఇంజెక్షనునూదిగానీ, మూత్రంతీసే గొట్టంగానీ ఎప్పుడూ సొంతంగా ఉపయోగించకుండానే వైద్యవిద్యార్థి

అయిదు సంవత్సరాలు వైద్యకళాశాలలో చదువుకొనివచ్చి నట్టుండ దతని నేర్పు. భారతీయ శిల్పవిద్యార్థి కాలక్షేపం కోసమో, కేవలం ఉబుసుపోకకో విద్యాభ్యాసం చేయడు. అతను పొందే శిక్షణ అంతా అతని ఇంటిలోనే. కనుక పని నేర్చుకొంటూనే సంపాదించుకొంటూంటాడు. పాఠశాలకు పోనక్కరలేదు. పరాయి గురువుకు జీతాలు కట్టనక్కరలేదు. ఎవరి పనికి సరిపోయే శిల్పసూత్రాలు ఆపనివాళ్ల గృహాలలో ఉంటవి. రాజప్రాసాదాలు కట్టవలసివచ్చినప్పటికీ, గదియెంత వెడల్పుండాలో, కిటికీ లెక్కడెక్కడ ఉండాలో, స్తంభా లెలాఎలా ఉండాలో, అవి ఎంత మొత్తు ఉండాలో, దూలాలు స్తంభవుకొనలు ఎక్కడెక్కడ ఉండాలో ఈఅన్నిటినీ సరిగా, వారి దగ్గరఉన్నశాస్త్రం నిర్దేశిస్తూనే ఉంటుంది. ఈ నియమా లకు భిన్నంగా నడిస్తే శిల్పికి గొప్ప చెఱుపు కలుగుతుంది. బృహత్సంహితలో గృహనిర్మాణాన్ని గూర్చిన శాస్త్రం సమ గ్రంగా ఉన్నది. ఇటువంటి పరిస్థితులలోనున్న శిల్పిని తన ఇచ్ఛవచ్చిన భావాలను వెల్లడించే వ్యక్తిఅని తలంచకూడదు. దైవనిర్మితములైన చెట్లూ, పూవులూ, సహజసౌందర్య మునూ అకృత్రిమరచనా విలాసమునూ ప్రదర్శిస్తూన్నట్లే, శిల్పి అనంతసౌందర్యమునూ అవికార ధర మునూ నిర్దేశించే విశ్వాంశ సంభూతుడని తలంపవలెను.'' అన్నారు ఆనంద కుమారస్వామి. భారతీయ శిల్పికి ''విశ్వకర్మ'' ఉపాస్య దైవం. ''సౌందర్యం, లయ ప్రమాణం, భావం - ఇవన్నీ ఆదర్శ తలంలో పరిశీలించ దలచుకొన్నవాళ్ళకు సుస్థిరంగా కనిపిస్తూనే ఉంటవి

"వస్తువుల వాస్తవికత మనస్సుకు గోచరమైనంతగా కంటికి కనిపించే చిన్న చిన్న వివరాలలో గోచరం" అని కూడా ఆ గ్రంథకర్త వ్రాశాడు. శిల్పిచేసే పనిలో కొంత నిగూఢత ఉన్నది. దానిని వృత్తి అనడంకంటె మత ధర్మ మనడం ఎక్కువ సమంజసంగా ఉంటుంది. కాకపోతే పూర్వ గ్రంథంలో చిత్రకారుని కుండవలసిన గుణాలను వర్ణిస్తూ అతను "మంచివాడుగా ఉండాలి. సోమరిగా ఉండకూడదు. కోపి కాకూడదు, మతశాస్త్రంలో పండితుడుగా ఉండాలి. ఆత్మనిగ్రహం కలిగి ఉండాలి; భక్తుడుగానూ, దాతగానూ ఉండాలి. ఆశపాతకుడుగా ఉండకూడదు" అని ఎందుకు వ్రాస్తాడు? హిందూ శిల్పి ప్రతిసంవత్సరమూ దసరా పండుగ నాడో, వినాయక చవితినాడో ఆయుధపూజ చేస్తాడు. తానొక కర్మకార సంఘ సౌభ్రాతృత్వంలో-అనగా ప్రత్యేక హక్కులతోపాటు బాధ్యతలనుకూడా స్వీకరించినకులంలో ఒక సభ్యుడననే సంగతి మొట్టమొదట గుర్తించినవాడు భారతీయశిల్పి. తన పనిని తాను సరిగా నిర్వర్తించినందువలననే ప్రతి మనిషీ ఆధ్యాత్మికంగా అభివృద్ధి పొందగలడని నిర్దేశింపబడినది.

"శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః"

(భగవద్గీత 3. 35.)

నేటి పోటీ విధానం పూర్వాదర్శాలనూ పూర్వప్రమాణాలనూ పాడుచేసింది. అప్పు డప్పుడూ ప్రజల దేశాభిమాన

భావో(ద్రేకాలవల్ల ఆకస్మికంగా చేతితో తయారైన వస్తువులకు కలిగే గిరాకీ (demand) మూలకంగా ఆవస్తువుల నాణ్యము, ప్రమాణము తగ్గిపోతూండడం జరుగుతూన్నది. చేతితో వస్తువుల నుత్పత్తి చేయడంలో గొప్పనై పుణ్యము, నాజూకుదనమూ చూపించవలసి ఉంటుంది. ఈ వస్తువులకు ఎక్కువగిరాకీఉన్నప్పుడు తొందరగానూ చౌకగానూ తయారు చేస్తామని సాంప్రదాయసిద్ధంగా ఆపనులు చేయని ఇతరకులాల వారు పోటీపడి చేస్తూండడమే, వాటిలోని నాణ్యము ప్రమాణములు తగ్గిపోవడానికి కారణం. ఖద్దరు ఉత్పత్తి విషయంలో గానీ, లక్నోలో ఎక్కువ అభివృద్ధి పొందిన బంగారు జిలుగు పని సందర్భంలో కానీ ఇదే విధంగా జరుగుతూన్నది.♦ యంత్రం బెడిసికొట్టి సహజ మానవసామర్థ్యాన్ని స్తంభింప చేసింది: జాతీయ జీవనాళాలలో రక్తసంచాలనం నిలిపివేసింది. సంఘసభ్యతలో కల్లోలం కలిగించింది. ప్రజల హృదయాలలో వ్యాకులత హెచ్చించింది. అందువల్ల జాతీయ ప్రకృతికీ కృత్రిమోద్వేగానికీ లయ కలియడం లేదు. ఇలా శిథిలమైనజాతి అచిరకాలంలోనే జబ్బుపడి చివరకు మరణిస్తుంది కూడాను. అటువంటి జాలికరమైన చావుకు సంసిద్ధంగా ఉంది ఇప్పటికే మన దేశం. ఇంకా కొనఊపిరితో ఉండగానే గాంధీ అవతారమూర్తివలె ఈ నశించిపోతూన్న లోకంలోకి దిగిరావడం మన అదృష్టం. ఆయన, ఐశ్వర్యం వలన కలిగే అరిష్టా

♦ అనుబంధం 2 లో సర్ జార్జిబర్డు ఉడ్, హావెల్‌గార్లు వ్రాసిన వ్యాసాలు కలవు.

లను తొలగించి, సేవవలన కలిగే సుగుణాలను పునరుద్ధరించి, స్పర్థను నాశనమొనర్చి, సహకారాన్ని పునరుజ్జీవింపచేసి, మానవ హృదయాలలోని ద్వేషాన్ని నిర్మూలించి, ప్రేమను పునఃస్థాపనచేసి, ప్రపంచ కల్యాణానికి తోడ్పడగలదు.

యం.త్రం-కొట్టిన ఈ ఎదురు దెబ్బవలన సంఘంలో కలుగుతూన్న అంతిమ పరిణామం మరొకటి ఉన్నది. ఇంతవరకునూ సామ్రాజ్య దృక్పథంతో తమ సరుకులను తూర్పు దేశాలలోకీ ఆఫ్రికాఖండంలోకీ ఒక్కుమ్మడిగా దిగుమతి చేస్తూన్న జాతులు, నేడా దేశాలవారు తమ సరుకులను తీసుకోకపోవడం చేతను, తమకు ముడివస్తువులను సరఫరా చేయకపోవడం చేతను, తమ స్వశక్తిపైన తామాధారపడివలసివస్తూన్న ఆయా దేశ ప్రజలంతా ఇప్పుడు కళ్ళు తెరిచారు. తూర్పుదేశాల ఈతిరుగుబాటు వలననే యిక ఈ దోపిడీ విధానానికి తగినంత స్థానం లేకుండా పోయింది. జపాను పాశ్చాత్య ప్రపంచంలోని పారిశ్రామిక దేశాలలో అగ్రస్థానం వహించిన జాతులతో నిర్విఘ్నంగా పోటీచేస్తూన్నప్పుడు, చైనా యుగయుగాలనాటి తన మాంద్యాన్ని దులిపివేసికొన్నప్పుడు, ఇండియా నూతన జాతీయచైతన్యంతో విజృంభించినప్పుడు, ఆఫ్ఘనిస్థానము, పర్షియాలు నేటి అభ్యుదయజాతులతో అడుగు తప్పకుండా నడుస్తూన్నప్పుడు, సిరియా పాలస్తీనా దేశాలు పాశ్చాత్య దండయాత్రలను తట్టుకోగలిగి జీవిస్తూన్నప్పుడు, టర్కీ 'ఐరోపాఖండపు రోగి'

అనే అపఖ్యాతిని పోగొట్టుకొన్నప్పుడు, ఈజిప్టు విదేశీయుల ఆటవస్తువుగా ఉపయోగింపబడనప్పుడు, పాశ్చాత్యుల దోపిడీ విధానానికి స్థలమూ, సావకాశమూ కూడా చాలా తక్కువై పోయినమాట నిజము. పారిశ్రామిక, వ్యావసాయిక జీవితాలను ఉచితప్రమాణంలో నడుపుకొంటూన్న ఫ్రాంసు అదృష్టం మంచిది. ఇటలీ పారిశ్రామికంగాకంటె వ్యావసాయికంగా ఎక్కువ అభివృద్ధి పొందింది. కాని ఇటీవల ఆ దేశం పారిశ్రామికంగాకూడా అభివృద్ధిపొంది తన లోటును భర్తీచేసుకొని స్వయంపోషకంగానుండ ప్రయత్నిస్తూన్నది. రష్యా ఈ దేశాలన్నిటితోనూ ఒంటరిగా పోరాడి తన యంత్రాలకూ, యంత్రాలయాలకూ, తన యితర జీవితావసరములకు కావలసిన సామగ్రిని తయారుచేసుకోవడమే కాక, మాంసంకూడా యితర దేశాలనుండి దిగుమతిచేసుకోవలసిన అవసరం పట్టకుండా మొదటి ఐదుసంవత్సరాలలోనే కోటి కుందేళ్లను పెంచింది. విదేశీవ్యాపారం దేశంలోకి చొరబడకుండా తలుపులు బిగించి గట్టిగా గడియవేసుకొంది రష్యా. ఏ కొంచెం సరుకైనా ఎప్పుడైనా వస్తే అది వెల (barter) పెట్టి కొనుక్కోవలసిందే. ఎంతో తప్పనిసరియైతేనేగాని డబ్బుపెట్టి కొనుక్కునే పద్ధతిలేదా దేశానికి.

ఈవిధంగా పాశ్చాత్య దేశాలితర దేశాలమీద ఆధారపడకుండా కాలక్షేపం చేయవలసిన స్థితికి వచ్చినయి. జర్మనీ ఎగుమతులు దిగుమతులకు సరిపోయేటంత ధర తేలేకపోవడం చేత, ఆ దేశంలో వాడుకొనే వస్తువులకు రేషన్ ఏర్పాటు

చేయబడిందని తెలియవస్తూన్నది. కాబట్టి తూర్పు దేశాలలో తమ వస్తువులను కొనేవారు లేకపోయినప్పుడు, తమ దేశాలలో తాము పరస్పరము తమ్మ వస్తువులను విక్రయించుకోవడానికి వీలు లేనప్పుడు, పాశ్చాత్య దేశాలన్నీ స్వయంసంపూర్ణములుగాగానీ లేక స్వయంపోషకములుగాగానీ ఉండితీరాలి. ఆపరిపక్వస్థితి తటస్థించినప్పుడు ఎగుమతులకోసం చేసే ఉత్పత్తి ఆగిపోతుంది. ఎవరో ఒక మనిషి ఉత్పత్తిచేసేవాడుగానూ, లక్షలాదిగాఉన్న తామందఱూ తమ అవసరాలకు వానిపైన ఆధారపడి, వానికి లాభాలు, ఐశ్వర్యం, మేడలూ కట్టిపెట్టి తాము గుడిసెలలోనూ, గాలీ వెలుతురూ రాని మురికి కూపాలలోనూ ఉండి కాలక్షేపంచేయడానికి ప్రజలొప్పుకోరు. పెద్దఉత్పత్తిదారు మాయంకాగానే యంత్రములలో పనిచేసే కార్మికులకు పని లేకుండా పోవచ్చును. అప్పుడు సహకారోత్పత్తి సంఘాలద్వారా గానీ, తదితర సంఘపద్ధతుల ద్వారాగాని కూలిజనానికి పని కల్పించి లాభాలలో భాగమీయవలసివస్తుంది; లేదా వారు తిరిగీ పురాతన కుటీరపరిశ్రమలను అవలంబించవలసివస్తుంది. బహుశా మేము చాలా దూరం ఆలోచిస్తూన్నట్లు తోస్తుంది. జాతుల భాగధేయాలను, వాటి భవిష్యత్కార్యవిధానములనూ చూపించేటప్పుడు హ్రస్వదృష్టి కలిగిఉండడంకంటె దూరదృష్టి కలిగిఉండడమే యెక్కువ మేలు.

## యంత్రం నౌకరు - యజమాని కాదు

యంత్రం పాశ్చాత్య దేశాలలో నౌకరుగా లేదు. యజమాని అయింది. కేవలం యజమానియే కాదు. చండశాసనాధికారి అయింది. పెనుభూతంగా పరిణమించింది. రాక్షసి తిన్నట్లు తిని, రాక్షసిచాకిరీచేసి ఉత్పత్తిచేస్తున్నది. గాంధీ దానిని ఇండియాకు దాసీగా చేయదలచుకొన్నారు. ఎక్కువగా ఉత్పత్తి చేయడంవల్ల వస్తువులు చౌకయి, పోటీకి నావకాశం గలుగుతూన్నది. పోటీపడి తయారుచేసిన వస్తువుల అమ్మకానికి అంగళ్లు కావాలి. అంగళ్లు కావాలంటే రాజకీయంగా ఆయా దేశాలపైన పలుకుబడి రావాలి. ఆ పలుకుబడిని కాపాడుకోవడానికి సైనికబలం ఉండితీరాలి. అధికోత్పత్తికి తగిన ముడిసరుకునూ, తగిన అంగళ్ళనూ సంపాదించుకోవలెనన్నా, నిలుపుకోవలెనన్నా సామ్రాజ్యపద్ధతికిందతప్ప సాధ్యంకాదు. శాంతిసమయాలలో అది పారిశ్రామిక తత్వంగానూ, యుద్ధ సమయాలలో సైనికతత్వంగానూ పరిణమిస్తుంది. ఇదంతా కావలసినంత దౌర్జన్యంచే స్తేనేగాని జరగనిపని. అందువల్లనే యంత్రపరిశ్రమ 'హింసాసంచలనం' అని సంక్షేపంగానూ, సంపూర్ణార్థసహితంగానూ నిర్వచింపబడ్డది. ఖద్దరు ప్రధానాంగంగానుండే గ్రామపరిశ్రమలతో, సాంఘికైకమత్యంతో అస్పృశ్యతానివారణతో కూడిఉన్న కాంగ్రెసు నిర్మాణకార్యక్రమంగూడా అంత సంగ్రహంగానూ, అంత పూర్ణార్థయుక్తంగానూ, 'అహింసాచరణం' అని వివరింపబడింది. అయితే గాంధీ ఊహించే సంఘలక్షణం ఏతీరుగా ఉంటుంది అని

అడుగవచ్చును. అదృష్టవశాత్తు ఒకవేళ ముందున్నవాళ్ళను నలగతొక్కకుండా పోగలిగినప్పటికీ వెనుకనున్నవాళ్ళ నోళ్ళలో, ముక్కులలో, చెవులలో కళ్ళలో దుమ్ముకొట్టి పోయే మోటారుకార్లసంఘవ్యవస్థకాదు గాంధిభావిస్తూన్నది. అంతమాత్రంతో అది అతిపురాతనకాలంనాటిదో, మధ్యయుగపునాటిదో అయియుంటుందని ఊహించకండి. 1931లో లండనునుండి అమెరికాకు బ్రాడ్‌కాస్టు ఉపన్యాసంచేస్తూ ఆయన

"1900 మైళ్లు పొడుగూ, 1500 మైళ్ళు వెడల్పూగల భూభాగంలోని చుక్కలవంటి 700,000 గ్రామాలలో చెల్లాచెదరుగా నివసిస్తూ కడుపునిండా కూడులేని కోట్లకొలది జనులను గూర్చి అమెరికాకు తెలియపరిచాడు". అందులో ఆయన చెప్పింది దిది.

> నిరాడంబరులైన ఆ గ్రామవాసులు సంవత్సరంలో ఆరుమాసాలు పని లేకుండా ఉండవలసిరావడం మహావిషాదకరమైన విషయం. అది వారి తప్పిదం కాదు. ఇటీవలివరకు ప్రతిగ్రామమూ అన్నవస్త్రాలకు సంబంధించినంతవరకు స్వయం సంపూర్ణంగా ఉంటూవచ్చింది. మన దురదృష్టవశాత్తు, ఈస్టిండియాకంపెనీవారి దేశంలో అడుగుపెట్టి, నే నిక్కడ వర్ణించడానికి యిష్టపడని పద్ధతులద్వారా, గ్రామస్థుల ఆ ఉపవృత్తి కాస్తా నాశనంచేశారు. అందువల్ల ఇంతవరకే ఆధునిక యంత్రమూ తీయలేనంత నాజూకుగా దారం తీయగలరని కీర్తివహించిన లక్షలాదిగ్రామవాసుల అంగుళీకౌశలం నిరుపయోగమై పోయింది. ఉదారమైన వారి వృత్తి ఆకస్మికంగా మాయమయింది. ఆనాటినుండీ

భారతదేశం క్రమ క్రమంగా దరిద్రవంతమయింది. ఇది కాదని ఎవ రేమి చెప్పినా యేమీ ప్రయోజనం లేదు.

## పాశ్చాత్య దేశాలలో

ఇక మనం, పాశ్చాత్య కార్మిక పరిస్థితులలోనూ, ఐశ్వ ర్యాన్ని గూర్చిన ఆ దేశ ప్రజల భావాలనోనూ, యంత్రం యేవిధమైన పరివర్తనం కలిగించిందో విచారిద్దాము. చెపితే విస్తారంగా కనిపించవచ్చునుగాని, అక్కడ వినాశకర పద్ధ తుల వల్లనే ఐశ్వర్యం పెరుగుతూన్నది. యంత్రాలలోనూ యంత్రాలయాలలోనూ శ్రమతగ్గించుకోవాలనిచేసే అపూర్వ ప్రయత్నాల మూలకంగా నిరుద్యోగ సమస్య తీవ్రరూపం తాలుస్తూన్నది. వ్యవసాయం, యంత్రపరిశ్రమలముందు ఎందుకూ కొరగాకుండా పోతూన్నది. ఇంగ్లాండులో 91% పరిశ్రమలు. 8% మాత్రమే వ్యవసాయం. ఒకప్పుడు ఎక్కువగా వ్యవసాయ దేశాలుగానున్న ఇటలీరష్యాలు, పారిశ్రామిక దేశా లతో పోటీచేయడానికి జరిగిన ఇరవై సంవత్సరాలలో తమ యావచ్ఛక్తినీ వినియోగించినై. ఇంగ్లండులో ఉత్పత్తిఅయ్యే ఆహారపదార్థాలా దేశంలోని ప్రజలకు సంవత్సరంలో అయిదు వారాలకుమాత్రం సరిపోతవనేసంగతి మనకందరికీ తెలిసిందే. తక్కిన 47 వారాలలో వాళ్ళకు కావలసిన మాంసం న్యూజీలాండు ఆస్ట్రేలియా దేశాలనుండీ, గోధుమలు కనడానుండి, గుడ్లు డెన్మార్కునుండి, పాలు పాలద్రవ్యాలు, హాలెండు బెల్జియ ములనుండి, బియ్యం ఇండియా బర్మాలనుండి, కాఫీ సింహళం

నుండీ తెప్పించుకొంటారు. ఈ దిగుమతీ అయిన సరుకులన్ని టికీ గాను ఇంగ్లాండు, బొగ్గూ ఇనుమూ అయినా ఎగుమతి చేయాలి. లేదా విదేశాలనుండి ఆదేశానికి దిగుమతి అయిన ముడిసరుకులు-పత్తి, పత్తివిత్తులు, తోళ్ళు, చర్మాలు, వేరు సెనగ, జీడిపప్పు-మొదలైన వాటితో తయారుచేసిన వస్తువుల ఎగుమతిద్వారానైనా సొమ్ము సరిపెట్టాలి. వెనుకటి ఐరోపా యుద్ధంనాటి అనుభవాలను, యుద్ధం ముగియడంతోనే మఱచి పోయింది బ్రిటను. యుద్ధంజరిగిన 1914-18 సంవత్సరాలలో ఉద్యానవనాలను, మృగయా విహారభూములను పచ్చిక బీళ్ళనూకూడా కొంతవరకు పంటపొలాలుగా మార్చి యుద్ధం ముగియగానే అనగా 1919-30 సంవత్సరాలమధ్య, 25 లక్షల ఎకరాల పంటపొలాన్ని తిరిగీ పచ్చిక బీడుగా చేసింది ఇంగ్లాండు దేశం. ఇప్పుడది ఆహారంకోసం ఇతర దేశాలపైన ఆధారపడి ఉండవలసిందే.

పెద్దఎత్తున జరుగుతూన్న ఈ ఎగుమతి దిగుమతి వ్యాపారాలను సరిపుచ్చడానికి (International barter) అంతర్జాతీయ వస్తుమారక పద్ధతిద్వారా సాధ్యం కాకపోవడంచేత డబ్బును ఉపయోగించవలసిన అవసరం చాలా ఎక్కువయింది. అందువల్ల నాణెముల ఉత్పత్తి విషయంలో, కరెన్సీ విషయంలో, మారకంవిషయంలో, కృత్రిమ ప్రమాణాలను ప్రవేశపెట్టవలసి వచ్చింది. ప్రచారంలో నున్న కరెన్సీనోట్లను ఎచ్చించడం, కుంచించడం తటస్థించింది. మామూలుగా ఋతువులను బట్టీ పంటల ఎక్కువ తక్కువలను బట్టీ వస్తు

వుల ధరలలో కలుగవలసిన మార్పులు, కొత్తగా పుట్టిన కరెన్సీనోట్ల మూలమునను, ధనోత్పత్తి మూలకము లయిన యితర కారణముల వల్లనూ, కలుగుతూన్నవి. కాబట్టి అంగళ్ళను స్వాధీనపఱచుకొనే నిమిత్తమే యావత్తు ఉత్పత్తి జరుగుతూన్నది. అందువల్లనే ఖరీదులు నియామకం చేయబడు తూన్నవి. అది కారణంగా అంగడీలోనున్న వస్తువులోని ఆహారమూల్యం కాక దాని ఖరీదు మాత్రమే లకక్షిస్తూన్నది ఆయా దేశాల ప్రజలను. వింతగానూ విరుద్ధంగానూ తోస్తే తోచవచ్చును గాని ఆ స్థితి నాశనం చేసుకోవడం వల్లనే ఐశ్వర్యం వృద్ధి అవుతూన్నదనే మాట కివే నిదర్శనాలు.

ఈజిప్టుదేశంలోని పత్తిపండే భూమి విస్తీర్ణమును ప్రతి సంవత్సరం మూడోవంతు చొప్పున మూడేండ్ల వరకూ తగ్గిస్తూండవలసిందని 1926 లో ఈజిప్టు ప్రభుత్వం ప్రజలను కోరినట్లు వింటూన్నాము. అదే విధంగా 1927లో క్యూబా అధ్యక్షుడు 4½ మిలియనుల (45 లక్షలు) టన్నులను మించి పంచదార పండించకూడదని నియమం చేశాడు. బ్రేజిల్ 120 లక్షల బస్తాల కాఫీగింజలు అంటే (185,55,24,000 పౌనులు) 1931 లో నాశనం చేసింది; 1933 నాటికి తగులబెట్టికాని, సముద్రంలో ముంచికానీ 220 లక్షల బస్తాల కాఫీగింజలు నాశనంచేసింది; పాల ఖరీదును ప్రియంగా ఉంచేటందుకు జెర్సీ (Jersey) ఆవులను కృత్రిమంగా ఎండిపోయేటట్లు చేశారు. మెక్సికో అత్తిపళ్లను కుళ్ళబెట్టిందికూడా అటువంటి కారణాలకోసమే. యునైటెడ్

స్టేట్సులోని రైతులకు కావలసినంత గోధుమపంట ఉన్నది. కాని వంటచెఱకులేదు. అందువలన గోధుమలనే వంటచెఱకుగా వాడుతూన్నారు.* లక్షలాది బుషెలుల పళ్లను కోయకుండా చెట్లమీదనే విడచివేయడానికి పండించేవాళ్ళు ఒప్పుకొంటూన్నారనీ, ఫెడరల్ ఫారంబోర్డువారు నాలుగువత్తిచాళ్లకొకటివంతున దున్నిపారేయాలని ఆజ్ఞాపించారనీ, పండిన గోధుమలను నిర్దాక్షిణ్యంగా నాశనంచేస్తూన్నారనీ తెలిసినప్పుడు దేశం అన్నవస్త్రాలకు లోపంలేకుండా సుభిక్షంగా ఉన్నదనుకొంటాము. నిరుద్యోగ సమస్య నిర్మూలమయినట్లు భావిస్తాము. యంత్రాల వత్తిడివల్ల ప్రభుత్వం ఇటువంటి కృత్రిమ విధానాలకు పూనుకొన్నప్పటికీ, ప్రజలకు కడుపునిండా కూడూ, వంటినిండా గుడ్డా లేదు సరికదా చివరకు నిరుద్యోగుల సంఖ్యకూడా తగ్గలేదు.

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో 1919-౩౩ సంవత్సరాల మధ్య యంత్రసహాయంతో పనిచేసే కూలీల ఉత్పత్తి నూటికి 71 వంతున పెరిగింది కాని ఆ సంవత్సరాలలోనే నిరుద్యోగులైన వారిసంఖ్య 15 లక్షలనుండి 120 లక్షలకు పెరిగింది. "తరువాత అంతకంటె యెక్కువ శాస్త్రజ్ఞానం" వినియోగించినందుకు ఇంకో 40లక్షల నిరుద్యోగులెక్కువయినారు. ‡

హిందూదేశపు నిరుద్యోగుల సంఖ్య 400 లక్షలు. యంత్రసహాయంతో వ్యవసాయం చేయడం ప్రారంభిస్తే ఇంకా

* ౩౯, 40 పుటలు 'స్వదేశీ ఎందుకు?'క ర్త: అగర్వాలా.

‡ Page 36 "Why Swadeshi" by M. R. Agarwala

ఎక్కువమందికి పని లేకుండా పోయి గ్రామాలు విడచి పెట్ట వలసి వస్తుంది. ‡ నిరుద్యోగ సమస్య ఇండియాకు రావలసినది కాదు. కాని మన అర్థశాస్త్ర విధానం, శ్రమ తగ్గించుకోవడానికి తయారవుతూన్న యంత్రాలు, లంకాషైరు యంత్రనిర్మాణంలో ప్రతిరోజూ జరుగుతూన్న అభివృద్ధి- (ఈ కిటుకు బర్మింగ్ హాం యంత్ర నిర్మాతలకు మాత్రమే తెలుసు) భారత దేశంలో వట్టి భాషాజ్ఞానం తప్ప వృత్తి విద్య లేకపోవడం - ఇవన్నీ నిరుద్యోగసమస్యను సృజించి ఎక్కువ పెంపొందిస్తూన్నవి. ప్రపంచ వ్యాపారం(Markets) లో గలిగే మార్పులు కరెన్సీ, మారకం, ఎగుమతి దిగుమతీ, పన్నులు, రైల్వే రేట్లలో అవలంబింపబడే కృత్రిమ విధానాలు - ఇవన్నీ ఈ సమస్యకు మరింత దోహదం చేస్తూన్నవి. జనసంఖ్యగానీ, పనిచేసేవాళ్ళ సంఖ్యగానీ పెరిగినందు వలన పని లేకుండా పోదు. అమెరికా సామ్రాజ్య వ్యతిరేక దేశమయినట్లుగా బడాయి కొట్టుకొంటుంది. అక్కడి ప్రజలు ప్రజాపాలక, ప్రజాస్వామ్య సిద్ధాంతాలు కలవారంటారు. అయినా ఆ దేశంలో గల 130,000,000 జనాభాలో మూడవ వంతుకు సరియైన కూడు, గుడ్డ, ఇల్లూ లేదు. "చాలాకాలం కిందట పిచ్చిఆసుపత్రిలో చేర్చబడిన ఒక మనిషి నేటి ఫ్యాక్టరీల ఆరోగ్య పరిస్థితులనుగూర్చి కలగన్నాడంటారు. ఆలాగే నిరంతరం యంత్రాల యశోగానంచేసే మనంకూడా నూతన సంఘ వ్యవస్థనుగూర్చి కల గనే పిచ్చివాళ్ళుగా భావింపబడ

‡ Page 37Why Swadeshi byM. R.Agarwala

వచ్చును" యంత్రాలను వాటి హద్దులలో ఉంచండి. ముఖ్యంగా ప్రజలకు కావలసిన కూడు గుడ్డల విషయంలో పనిచేసే గ్రామస్థుల కార్యరంగంలోకి వాటిని చొరనీయకండి. అప్పుడు దేశంలో శాంతి సౌభాగ్యాలకు కొదవ ఉండదు. బ్రతుకుకోసం పోరాడవలసిన అవసరం ఉండదు. గ్రామాలలో నుండి పట్టణాలకూ నగరాలకూ పోయి, గాలిలేని యిరుకు సందులలో కాపురంచేస్తూ, కుటుంబ జీవితాన్ని భగ్నం చేసు కొని వీధులలో తిరుగుతూ రోడ్లమీద పడి నిద్రపోవలసిన దురవస్థ పట్టదు. జీవిత ప్రమాణాన్ని ఎక్కువ చేయాలని నిరంతరం ప్రయత్నిస్తూంటాము. కాని యంత్రాలవల్ల యే కొద్దిమంది జీవిత ప్రమాణమో పెరిగేమాట నిజమే. అయితే అందుకు బదులుగా నిస్సహాయులైన అనేక మంది జీవిత ప్రమాణం తగ్గిపోతుంది. ఇండియాలో జీవిత ప్రమాణం హెచ్చు చేయాలనే మాట ఒప్పుకోని తీరాలి. కాని అది ఎంతవరకు ? ప్రతిమనిషికీ తగిన కూడు, గుడ్డ ఇల్లు లభించే టంతవరకే. యంత్రంవల్ల తగిలిన ఎదురుదెబ్బతో రక్తనాళా లలో నెత్తురు గూడుకట్టి గ్రామమనే హృదయ కేంద్రానికి ఉద్వేగ మెక్కువై దౌర్బల్యం కలిగింది. అందువల్ల శరీరాన్ని వలె 35 కోట్ల జనసంఖ్యనూ పోషించగల రక్తవాహినీక్రమం (Arterial Sistem) పాడయిపోయింది. కాళ్ళలో నంజు, మొగంలో వాపూ ఉన్నమనిషి పైకి బాగా కనిపించవచ్చును. కాని అతడు జీవించడంకష్టం. అలాగే అత్యంతమైన ఐశ్వ ర్యం ఒకచోట గూడు కట్టుకొనిఉండి తక్కినచోట్ల

దరిద్రము తాండవమాడుతూంటే ఆ జాతికూడా జీవించదు.

యంత్రంవల్ల ఉపయోగాలనేకం ఉండవచ్చును గాక. కాని అది ప్రజలను బానిసలనుగా చేసింది. మానవనైపుణ్యాన్ని నాశన మొనర్చింది. సంసారంలో గుట్టు చెడగొట్టింది. కుటుంబనీతులను ధ్వంసం చేసింది. శిల్పకారుని స్వజనశక్తిని కుంచపరిచింది. అతని వ్యక్తిత్వాన్నీ స్వాతంత్ర్యాన్నీ కూడా చంపివేసింది. దేశాలపరస్పరసంబంధాలలో సహకారభావం పెంపొందింప చేయడానికి బదులుగా స్పర్ధాభావాన్ని పెంచి అంతర్జాతీయకల్లోలానికి కారణమయింది. అంతేకాదు, పారిశ్రామికతత్వ, సైనిక తత్వాల భయంకర దృశ్యములతో గూడిన సామ్రాజ్యతత్వాన్నికూడా రేకెత్తించిందది. కాలాన్నీ, దూరాన్నీ మాయంచేసి ప్రపంచంలోని దేశాలను దగ్గరకు తీసుకొనివచ్చినమాట నిజమే. కాని జాతులనుమాత్రం ఎంతోదూరం చేసింది. అది మనుష్యశరీరాలను దగ్గరకుచేర్చి ఆత్మలనూహృదయాలనూ దూరదూరంగావిసిరివేసింది. క్రైస్తవమతదృక్పథాన్ని సంకుచితపఱచి సామ్రాజ్యతత్వానికితోకగా చేసింది. పాశ్చాత్యపద్ధతులలో తయారై సోషలిస్టు, విశ్రాంతిఅని భారతీయసమస్యను మఱింత చిక్కుపఱుస్తున్నారు. భారతదేశపు శిల్పకారుడు తాను చేసేపనిలో మునిగిపోతాడు. అంతేకాని గంటలనుబట్టీ, కూలినిబట్టీ పని చేయడు. ఇక్కడ విశ్రాంతిసమస్య లేనేలేదు. పనీ, విశ్రాంతీ రెంటికీ ఇక్కడ ఒక్కటే అర్థం. శిల్పి పట్టి బండరాతిపైన జగన్మో

హిందీ కేశవస్వాముల బొమ్మలను, మనోహరంగానూ మహో ద్భుతంగానూ చెక్కుతూన్నప్పుడు, ఈతగాడుఉత్తుంగసముద్ర తరంగాలపైన ఈదుతూన్నప్పుడు పొందే ఆనందం పొందు తూంటాడు. ఇండియాలో పనే విశ్రాంతి. విశ్రాంతియే పని. పనియే శిల్పం. పని ఆనందమూ, వినోదము. శిల్పికి పని ఆత్మసాక్షాత్కారం. అదిఅతనికిఆత్మ శాంతి. ఇండియాలో నిజ మైన సమస్య విశ్రాంతి ఉన్నవాళ్ళకు పని చూపించడం. అంతేగాని పనివాళ్లకు విశ్రాంతిచూపించడం కానేకాదు.

ఇంగ్లాండులో విశ్రాంతి ఉపయోగమునుగూర్చి విచారణచేసే నిమిత్తం, 200 పై చిలుకు స్వతంత్ర సంస్థల ప్రతినిధులు, విద్యా శాఖాధికారులు, పారిశ్రామిక వ్యవస్థాపకులూ కలసి ఇటీవల ఒక కమిటీని ఏర్పాటు చేశారు.

సర్ విండం డీక్సు అధ్యక్షతవహించి ఇలా అన్నాడు : "పారిశ్రామి కులైన సోమరులుగా గాక, మానవులుగా తమ కిష్టమైన పని చేయ డానికి వీలుకలిగించే స్వతంత్ర కాలమే" విశ్రాంతి. పనిచేసే కాలం తక్కువే కాని లక్షలాది ప్రజల విషయంలో విశ్రాంతి అంటే పట్టి వెక్కిరింత అయిపోయింది.

పారిశ్రామిక మనస్తత్వ శాస్త్ర జాతీయ సంస్థలకు (National institute of Industrial Psychologe) చెందిన కెప్టెన్ జె. హెచ్. బ్లాస్కీ, జనసంఖ్యలో నూటికి 90 మంది తమ మేధా శక్తికి తక్కువయిన పనినే చేస్తూన్నారన్నాడు. ఇంకొక ఉపన్యాస కుడు ఇలా అన్నాడు : మనలో 10% మంది తప్ప తక్కిన వాళ్ళు తమ మేధాశక్తికి తగినంత పని చేయడంలేదు. దీని భావమేమో ఆలో చించండి. 6 వ ఫారం చదివే విద్యార్థిని 4 వ ఫారం వాడితోనో

సమర్థుడై అనుభవంగల డాక్టరును వైద్యవిద్యార్థితోనో కలిసి పని చేయమంటే ఎలా ఉంటుందో ఊహించండి.

సజీవంగా ఉన్న ప్రతి మనిషి నేర్చుకొని అభివృద్ధి పొందుతూ ఉండాలి. ఒకచోట నిలబడి పోయినట్లయితే ఆయనలో ఏదో మృతి పొందేమాట నిజము.

ఈ అధికోత్పత్తి పద్ధతులు కొంతకాలమైన పిమ్మట మనిషిలో ఇటువంటి పరివర్తనాన్నే కలిగిస్తాయి. అవి అతనిని అచేతనుణ్ణిగా చేస్తాయి. అతని మానసికాభివృద్ధిని నిరోధిస్తాయి. "కాని యువకులిలా క్రమంగా హత్యకావడానికే అలవాటు పడుతూన్నారు." అన్నాడు మరొకాయన.

కొంతమంది యంత్రం దుష్టవస్తువనుకొన ప్రారంభించారు. క్రిష్టమస్ పండుగ ఆనందాన్ని అనుభవించేవాని బైసికిల్ కంటె అది ఎక్కువ దుష్టవస్తువని అనకోము. ఒళ్ళు పై తెలియకుండా ప్రవర్తించే మనస్థితియే దీనికంతకూ కారణం. మన కేమి తటస్థిస్తూన్నదో మనం గ్రహించలేక పోతూన్నాము. యంత్రం మనను గోతిలోకి తోసే టట్లుగా చేసుకొంటున్నాము. అదీ మన చావుకు కారణం. పనిలేక పోతే జీతంలేదనే నియమం వలన కూలీల శ్రమ ఆత్మవినాశ హేతువైన విసుగుగా పరిణమిస్తుంది. విశ్రాంతి కాల మొక ఘోష్న అవుతుంది. ఇక విశ్రాంతి? ఈమాట చెబితే భయంవేస్తున్నది. నల్లమందు భాయీలు కలలు గనవలసిందే. కాని వాస్తవం గ్రహించలేరు. ఆలోచించుకొనేటందుకు మనకు సావకాశం మీయకపోవడమే మంచిది. నకనకలాడే కడుపుతో ఎక్కువ ధ్యానం చేయడం ఆధ్యాత్మికాభివృద్ధికికూడా కొఱగాని పని అని సెంటు కేధరన్ చెప్పినాడు, మనిషి తినాలి, తినాలంటే పని చేస్తేనే ఉండాలి.

# విష చక్రాలు

ఆధునిక నాగరిక పరిస్థితులలో సేవకంటె ఐశ్వర్యానికి ఎక్కువ ఆధిక్యత ఇస్తున్నాము. కాలాన్ని ధనంగా మార్చ ప్రయత్నిస్తున్నాము. కార్యకారణాలు రెండూ ఒకదాన్ని ఒకటి బలంచేసుకొంటూన్న దుష్టచక్రాల గొలుసు అయిపోయింది జీవితం. ఉదయం మొదలు సాయంకాలం వరకూ, సాయంకాలం మొదలు ఉదయంవరకూ తప్పులు చేయడం, దిద్దుకోవడంతో సరిపోతూన్నది. కాలం ధనంగా మారిన వెంటనే వేగగమనం, ఆధునికయుగంలో ఒక ముఖ్యశిల్పంగా తయారయింది. వేగగమనంవలన రోడ్లపైన దుమ్ము లేవడం ఎక్కువయింది. దుమ్ము లేవకుండా చేయడానికి రోడ్లకు తారు వేయవలసివచ్చింది. తారుకైన ఎక్కువ ఖర్చులను పూడ్చడానికి రేట్లూ, పన్నులూ పెరుగుతూన్నాయి. ఇది అసంతృప్తికీ, అధర్మానికీ కారణాలయినయి. ఈ రెండూ సాహచర్యాన్నీ, సుహృద్భావాన్నీ లోపింపచేసి దురాశనూ, లోభిత్వాన్నీ పెంచుతూన్నాయి. అందువల్ల మళ్ళీ మొదటికే వస్తున్నాము. అప్పుడు తిరిగీ వేగగమనం కావాలి. అది ఆకస్మికాపాయాలకు దారి తీస్తున్నది. వాటిని తప్పించుకోవడానికి పక్కని నడవలు వేయవలసివస్తుంది. ఆ ఖర్చులకోసం మళ్ళీ పన్ను లెక్కువచేయాలి. తిరిగీ ఎప్పటాకే కాటన్నా, వెనుక వల్లించిన పాతపాట మళ్ళీ పాడాలి.

ఇక రెండోది:-

పైకం కరెన్సీనోట్ల రూపంలోనో నాణెముల రూపంలోనో

ఉంటుంది. ఉత్పత్తిలోని పోటీవలన మీఎగుమతులు పాడయి పోతయి. మీ మారకపు విలువ తగ్గించుకొని అంగళ్ళను ఆక రించుకొంటారు. కట్టకు దొంగతూము పెట్టి చెరువులోని నీ రంతా తీసుకొన్నట్లే ఉంటుం దీపద్ధతి. మారకపుధర తగ్గితే ఎగుమతు లెక్కువ అయ్యేమాట వాస్తవమే కాని, అందుకు బదులుగా మీరీయవలసిన అంతర్జాతీయ ఋణాలు పెరుగు తయి. కాబట్టి మళ్ళీ మారకపుధరను పెంచవలసివస్తుంది. వెంటనే తిరిగి ఎగుమతులు పడిపోతయి. అప్పుడు ప్రతిష్టం భన ఏర్పడుతుంది. ఫ్రాన్సు అమెరికాకు చేసినట్లుగా అప్పు లెగబెట్టవలసివస్తుంది.

మూడో విషచక్రం:-

యుద్ధాలవల్ల సృజింపబడింది. యుద్ధాలలో చిక్కుకొన్న దేశాలలోని బంగారం అంతా అయిపోయింది. అందువల్ల వారు బంగారుప్రమాణాన్ని తీసివేస్తారు. బంగారం కరెన్సీ నోట్లకు వెనుక హామీ నిధిగా ఉండడమేగాక, అంతర్జాతీయ వ్యాపారంలోని ఎచ్చుతగ్గులను చదునుచేయడానికి కూడా వినియోగిస్తుంది. అమెరికా ఫ్రాన్సుదేశాలు బంగారం బాగా కూడబెట్టుకొన్నయి. కాని బంగారుప్రమాణాన్ని విరమించు కొన్నవారు అమెరికాయొక్క విదేశవ్యాపారానికి బలిష్ఠులైన పోటీదార్లయినారు. కాబట్టి అమెరికా ఎగుమతులు తగ్గిపో యినయి. అందువల్ల ఆదేశం తన దిగుమతులకుగాను బంగా రంలో సొమ్ము చెల్లించవలసివచ్చింది. కనుక అమెరికా కూడబెట్టిన బంగారురాసులు వాటంతట వే ఖర్చించిపోయి

నయి. బ్రిటను బంగారుప్రమాణాన్ని తీసివేసి నాలుగోచక్రాన్ని సృష్టించింది.

ఆ దేశం తన వర్తకాన్నీ, బడ్జెట్టునూ సరిపుచ్చుకొంది. ఆంతరంగికంగా అభివృద్ధి పొందుతూన్నట్లు చూపించింది. అంగళ్ళలో ఆ దేశపుకరెన్సీకి విలువ హెచ్చుగానే ఉంది. ఇదంతా నిజమేకాని మరొక కొత్త అపాయం వచ్చింది. కరెన్సీని దేనికీ ముడిపెట్టకుండా గాలిలో వదలివేశారు. అందువల్ల మనీమార్కెటులో సాహసవ్యాపారస్థుల ఆట బాగా సాగింది. వాళ్లసదుపాయాన్నిబట్టి కరెన్సీకి ధర తగ్గించడమో హెచ్చించడమో చేయగలిగినారు. దానితో జాతీయకరెన్సీ జారవిడువబడింది.

అయిదోచక్రం బ్యాంకురేటు:- బ్యాంకురేటు తగ్గిస్తే డబ్బు చౌకవుతూన్నది. పరిశ్రమలభివృద్ధి పొందుతూన్నయి. కాని డిపాజిట్లు తగ్గిపోతూన్నయి. డబ్బెక్కువయినకొద్దీ కోరికలెక్కువవుతూన్నయి. కాబట్టి డబ్బుమీద వత్తిడిని తగ్గించడానికి బ్యాంకురేటు హెచ్చుతూన్నది. ఇంతలో జాతీయఋణం చెల్లించవలసిన వాయిదా ఒకటి వస్తుంది. అప్పుడు బ్యాంకు రేటు పేపరురేటుకంటె తగ్గించబడుతుంది. దానిఫలితంగా సెక్యూరిటీల రేట్లు పేపరురేట్లు తగ్గించి అచ్చువేస్తారు. తిరిగీ అప్పుడు మళ్ళీ బ్యాంకురేటు హెచ్చింపబడుతుంది.

ఆరోచక్రం: పన్ను లెంతవరకెచ్చుచేయడానికి వీలుంటుందో అంతవరకూ హెచ్చుచేసి, బడ్జెట్టును సరిపుచ్చుతూంది. ఇంగ్లాండు అప్పుడు పన్నులను తగ్గించాలని ఆందోళన బయలు

చేరుతుంది. తగ్గింపు బడ్జెట్టును భగ్నం చేస్తుంది. స్టెర్లింగు విలువ మరీతగ్గిందా అది పతనచిహ్నం. అది మరీ పెరిగిందా మతిభ్రంశానికి దారితీసే జ్వరతీవ్రతకు సూచన అది. రెండూ మరణ హేతువులే.

అట్టావా ఒడంబడిక ఏడ్పోటానికి కారణమయింది. ఇంగ్లాండు తనకు కావలసిన గోదుమ ధాన్యమంతా అధినివేశ రాజ్యాలనుండి కొనగోరుతూన్నది. అంతకుపూర్వం రష్యా బ్రిటనునుండి యంత్రసామగ్రిని కొనుక్కొని గోదుమలను బ్రిటనుకు పంపేది. అట్టావా ఒడంబడికవలన ఇంగ్లాండుకు విదేశాల నుండి దిగుమతులు తగ్గిపోయినయి. పోనీ వెన్నవిషయం ఆలోచించండి. ఇంగ్లాండు సామ్రాజ్యంలోని దేశాలనుండి పౌ 23,000,000 వెన్న కొంటుంది. పరాయి దేశాలనుండి పౌ 24,000,000 ల వెన్నకొంటుంది. (మొత్తం 70 కోట్లరూపాయిలది.) బెల్జియం, హాలెండు దేశాలనుండి వెన్న కొనడం లేదు. కాబట్టి తన సామానులను నెదర్లాండుకు అమ్మకం చేయడం లేదు. అందువల్ల ఎగుమతులవిషయంలో చాలా దెబ్బతిన్నది.

వెనుకటి యుద్ధంలో జర్మనీని గెలిచినందువలన ఇంగ్లాండుకు ఎనిమిదో విషచక్రం తటస్థించింది. బ్రిటను అమెరికాకు పౌ 2,282,000,000 లు 62 సంవత్సరాలలో తీర్చివేసే పద్ధతిని బాకీపడింది. జర్మనీ ఈయవలసిన నష్టపరిహారాల మొత్తం పౌ 6,576,000,000 లు 58సం॥ రాలలో చెల్లించవలసి ఉండెను. జర్మనీ చెల్లించవలసిన బాకీ వస్తురూపంలో యిచ్చింది ఫ్రాన్సుకు. అందువల్ల బ్రిటను ఫ్రాన్సుకుపంపే ఎగు

వృత్తులు తగ్గిపోయినయి. జర్మను పరిశ్రమాలయాలు జోరుగా పనిచేస్తున్నాయి, అక్కడి కార్మికులకు కావలసినంత కూలి లభిస్తూన్నది. యుద్ధం ముగిసినతక్షణం ఇంగ్లాండులో నిరుద్యోగుల సంఖ్య 110 లక్షలకు పెరిగింది. ఇటువంటి విషచక్రాలనే గాంధీ జీవచక్రాలుగా మార్చ్పవలెనని కోరుతూన్నాడు.

రాజకీయం ఒకపెద్ద రైలువంటిది. నాయకుడు ఇంజన్ డ్రైవరు. ఈ రైలుఎక్కడతొందరగానడపాలో, ఎక్కడమందంగా నడపాలో, ఎక్కడ ఆపాలో, ఎప్పుడు బయలుదేరాలో, ఎక్కడపెట్టెలను తగిలించుకోవాలో, ఎలావిడచిపెట్టాలో, ఎప్పుడుబాటసారులను తీసుకువెళ్ళాలో, ఎప్పుడు సామానులను వేసికొనివెళ్ళాలో ఈ అన్నీ ఆయనకు తెలిసిఉంటవి. బాటసారులూ, సామానులూ కూడా కలిసివుంటే బరువు చాలా ఎక్కువవుతుంది. విడదీస్తే బాటసారులకు విసుగు పుడుతుంది, కాని లంకణాలు చేయడంకంటే నయమేకదా విసుగు పుట్టడం. సామానులు లేకపోతే నష్టముశాఖ వుండదు. ఈ విధంగా నాయకుడు ఒకప్పుడు వేగంగానూ మఱొకప్పుడు మందంగానూ ఇంకొకప్పుడు నాన్ కోఆపరేషన్, సివిల్ డిజొబీడియన్సులతో ఎక్స్ప్రెస్ లోనూ, ఇంకొకప్పుడు - హరిజన ఖద్దరు మధ్యపాన నిషేధ సాంఘికైక మత్యాలనే సామానుల సరఫరాశాఖతోనూ నడుపుతూన్నాడు మన రైలును. ముందు కొందఱు పాఱలూ, పలుగులూ పుచ్చుకొనిపోయి దుబ్బులు, పొదలు, కంపలు, చెట్లూకొట్టి అడవిలోనుండి దోవచేస్తూన్నారు. మళ్లీమార్గంలో మరణించినైనా వెనుకవాళ్ళుసుఖంగా

నడవడానికి వీలుకలుగిస్తూన్నారు. ఈ విధంగా వ్యాపారం దివ్యసందేశంగానూ, బంగారంపైనఉన్న అత్యాశ దైవాన్వేషణ తత్పరత్వంగానూ పరిణతిపొందింది.

# అధ్యాయము 11

## భారతదేశ గ్రామము

౧

పరరాజ్యాన్ని స్వరాజ్యంగా మార్చడమే హిందూదేశపు సమస్య. నేటి రాజ్యాంలో ఉన్న పరత్వ భావమేమిటి ? దేశీయ సంస్థలన్నిటిలోనూ పాశ్చాత్య భావం నిండి ఉండడమా లేక ప్రాచ్య తత్వానికి బదులుగా పాశ్చాత్యతత్వం స్థాపింప బడి ఉండడమా ? ప్రస్తుత పరిస్థితులలో మొదటి దానికంటె రెండోదే ఎక్కువగా కనిపిస్తూన్న మాట వాస్తవం. కాబట్టి మనం తిరిగీ ఇండియాలోని ప్రతి అంగుళమూ, ప్రతిరంగమూ, ప్రతి పరిపాలనాశాఖా, ప్రతిసంఘ విభాగమూ గెలుచుకో ప్రయత్నిస్తూన్నాము. కనుక నేడు ప్రజల కిందుకు తగిన నూతన చైతన్యం కలిగించడమే మన ప్రధానకర్తవ్యము. పూర్వ సదాచారాలు పూర్వపద్ధతులు, పూర్వబాంధవ్యాలు, పూర్వ ఆదర్శాలు - వీటిని గూర్చిన వివేకం కలగాలి ఇప్పుడు మన దేశీయులకు. నూటయాభై యేండ్ల పర పరిపాలనం వలన మనవాళ్ళు, కొత్తపద్ధతులను, కొత్తవ్యవస్థలకుకొ, త్తవేషభాషలకు, కొత్తకోరికలకు, కొత్త, భోగాలకూ అలవాటయినారు. సంఘక్షేమం కంటె వ్యక్తి క్షేమం యెక్కువగా పరిగణింప బడుతూన్నది. ధర్మాలు నశించి హక్కులు విజృంబిస్తున్నయి. ముందుసంగతి యేమైనా

సరే ప్రస్తుతం విషయం ఆలోచించు కొంటూన్నారంతా. కార్యసాధనోపాయం ముందు సిద్ధాంతం ఎందుకూ పనికి రాకుండా పోతూన్నది. సేవకంటె ఐశ్వర్యానికి ఆధిక్యత చూపిస్తూన్నారు ప్రజలు. పని తీరికగానూ సమగ్రంగానూ చేయడం కంటె తొందర తొందరగా పూర్తిచేయడం ప్రధాన మను కొంటూన్నారు. అనుకొన్న వేళకు పని పూర్తిచేయడం సుగుణం కావచ్చునుగాని, ఆకాల పరిమితి యెప్పుడూ పని యొక్క విశుద్ధతకు, పరి పక్వస్థితికీ అభ్యంతరం కలి గిస్తూండడం మాత్రం అన్యాయం. అన్నిటిలోకీ కాలపరిమి తియే ప్రధానమై నిజాయితీకి గాని సంప్రదాయ సదాచారా లకుగాని విలువ లేకుండా పోయింది "వస్తువు చౌకగా ఉంటే సరి పాడుగా ఉన్నా సరే" చలామణీ అవుతుంది ఈకాలంలో. ఇది యంత్ర పారిశ్రామిక పద్ధతిలో ఇమిడి ఉన్న అసలు రహస్యం. ఈ దుష్టపరిణామాలన్నిటికీ కారణమైన మూల తత్వాన్ని గ్రహిస్తేనే గాని తిరిగీ మన జాతి, తొలినాటి భారతీయ గ్రామజీవితాన్ని పునరుద్ధరించడానికి తగిన పునా దులను వేయజాలదు. "తిరిగీ గ్రామాలకు పొండి" అని అంద టికీ ఉపదేశిస్తూ ఉంటాము. మనం మాత్రం పట్టణాలలోనూ నగరాలలోనూ మన వృత్తులను చేసుకొంటూనే ఉంటాము. పంచాయితీల స్థాపననుగూర్చి గంభీరోపన్యాసం చేస్తాము. కాని మన దేశాచారాలకు సంబంధించక, అసలు తగాదా జరిగిన ప్రదేశానికి దూరంగా ఉండి, అబద్ధపు సాక్ష్యాలకు అసత్య ప్రమాణాలకూ తావలములైన కోర్టులలో వకీళ్లుగా

పనిచేస్తూంటాము. మానవ స్వాభాతృత్వంపైన మనసులు కఱిగేటట్లు మాట్లాడుతాము. కాని భర్త చని పోతూండగా సగం పిచ్చి పట్టినట్లు కనిపిస్తూన్న, కాబోయే వితంతువు కడ నుండి పదిరూపాయలు సంపాదించాలని ప్రయత్నించడంలో సిగ్గు పడము. మేడపైన చనిపోయిన వాని కళేబరం బయటికి పోకమునుపే కింద పెళ్ళిళ్లు చేసుకొంటాము. గ్రామ కళాకౌశలాన్నీ కుటీర పరిశ్రమలనూ కీర్తిస్తూనే మన పిల్లలను, ఆత్మ రహితమైన, యంత్రాను రూపమైన, విద్యాపద్ధతిలో ప్రవేశ పెడతాము, వితంతువులకు, తలిదండ్రులు లేని బిడ్డలకు సహాయం చేయాలని జాలిమాటలు చెబుతూనే దేశీయ వృత్తులనూ, జీవితాన్నీ నాశనంచేసిన యంత్రాలయాలకు దాసానుదాసులుగా పనిచేస్తూంటాము. భారతీయ గ్రామ జీవితాదర్శాన్ని పరమావధిగా ఉంచుకొని కూడా పట్టణాలలో తమ కాలాన్నీ శక్తిసీ వినియోగిస్తూన్న కొంతమంది జీవితంలోని ఈ పరస్పర విరుద్ధభావాన్ని వారు గ్రహించ వలసి ఉంటుంది.

కాబట్టి మన దేశాన్ని తిరిగీ మనం గెలుచుకోవాలంటే ఈ నూతన సంప్రదాయాలకు విరుద్ధంగా చిత్తపరివర్తనం కలగాలి మనకు. మన కుమాళ్ళకు కుమార్తెలకూ యిప్పుడు మనమిస్తూన్న శిక్షణకు వ్యతిరేకంగా దండయాత్ర సాగించాలి. కాని సంఘంలో మనం పెద్ద వాళ్ళనుగాచేసి గౌరవిస్తూన్న మన మంత్రుల, విశ్వ విద్యాలయోపాధ్యక్షుల,

అధ్యాపకుల, ఆచార్యుల, లాయర్ల, డాక్టర్ల, పారిశ్రామిక ప్రధాన పురుషుల, వాణిజ్య ప్రభువుల - భౌతిక ప్రయోజన పరత్వమునుండి బ్రతికి బయట పడగలుగుదుమా ? అనేది నేడు గమనించవలసిన విషాదకర పరిస్థితి. అందువల్ల మన ఆలోచనలనుగానీ అభిప్రాయాలను గానీ వీరి పెద్దతికానికి భయపడి దాచకూడదు. ఇప్పుడు జరుగవలసినపరివర్తనం వెను కవైపుకు పోవడమే. ఇంగ్లాండులో ఓటింగుఅధికారం విపులం చేయబడినప్పుడు 19 వ శతాబ్ది మధ్యలో రాబర్టులో 'మన గురువులకు చదువుచెప్పాలిమనమిప్పు' డన్నాడు. అదేనిజంగా మనంకూడా నేడవలంబించవలసిన పద్ధతి. ఏకొద్దిమంది సంస్కారులో అశిక్షితులైన అనేకమందికి చదువుచెప్పడం కాదిప్పుడు కావలసింది. గౌరవమందిరాలలో అధికారస్థానా లను అలంకరించి కూర్చున్న కొద్దిమంది వాక్చతురులకు లక్షలాది నోరులేని జనులు పాఠాలు చెప్పవలసిన తరుణమిది. కాబట్టి భారతదేశగ్రామోద్ధరణం కొండపైకెక్కడం వంటిది. ఆంగ్లేయులు మనదేశాన్నివిడచి వెళ్ళినతరువాత మనసంస్కృతిని పునరుద్ధరించుకోవడానికి, మనసభ్యతను పునరుజ్జీవింప చేసుకోనేటందుకు కొన్ని పురుషాంతరాలవరకూ మన యువకులకు చేతినిండా పనిఉంటుంది. కాబట్టి యీ సమస్యలోని ప్రధానవిషయాన్ని అర్థంచేసుకోనేటంత ఆత్మవికాసం ప్రజా సామాన్యంలో కలిగించటమే మన ముఖ్యకర్తవ్యం. అది జరిగిందా సమస్యాపరిష్కారం దానివెంటనే జరుగుతుంది.

# ౨

# భారతదేశపు గ్రామము - దాని నిర్మాణము

స్వరాజ్య ప్రభుత్వంలో, నవ్యభారతవర్షమున గ్రామనిర్మాణం యేస్థితిలో ఉండాలో, దాని ప్రాధాన్యత యేమిటో యోచించవలెనంటే నూటయాభై సంవత్సరాల క్రిందట మన గ్రామాలెలా ఉన్నవో ఏవిధంగా అభివృద్ధిపొందుతూ వచ్చినవో పరిశీలించవలసి ఉంటుంది, అందుకు 1814 ఏప్రిల్ 25 వ తేదీని "కోర్టు ఆఫ్ డైరెక్టర్లు" ఇంగ్లాండుకు పంపిన న్యాయ్యసభానివేదిక (Judicial despatch) లోని ఈ భాగం మనకు చాలా సహాయకారి కాగలదు. మనువుకాలంనుండి దాదాపు నేటివరకు భారతీయ గ్రామం చెక్కు చెదరకుండా ఎలా నిలచివున్నదో, కొన్ని రాష్ట్రాలలో ప్రవేశపెట్టబడిన రైత్వారీపద్ధతి దానినెలా చీకాకుపరిచిందో ఈ నివేదిక తెలియజేస్తున్నది.

దత్తమండలాలనుండి కల్నల్ మన్రో 1806 మే 15వ తేదీని పంపిన నివేదికలో మా కిలా వ్రాస్తున్నాడు. "ప్రతిగ్రామము తన పన్నెండు (Ayangadues) పాలెములతోనూ ఒక చిన్న ప్రజాస్వామ్యంగా (Republic) నడుస్తూయున్నది. దానికి నాయకుడు పటేలు. ఇండియా అంతా అటువంటి ప్రజాస్వామ్యాలతో అల్లుకొనిఉంది. యుద్ధసమయాలలో ప్రజలు ముఖ్యంగా వాళ్ళ పటేలుమీద ఆధారపడి ఉంటారు. రాజ్యాలు విచ్ఛిన్నమైపోయినా సరే, విభాజ్యమైపోయినా సరే వారికేమీ పట్టదు. వాళ్ళ గ్రామం వాళ్ళకు చెక్కు చెదరకుండా ఉన్నట్లయితే, అది ఎవరి అధికారం క్రిందకు పోయినప్పటికీ వాళ్ళకు లెక్కలేదు. దాని ఆంతరంగిక పరిపాలనలో యేమీ మార్పుండదు. ఇప్పటికీ పటేలే కలక్టరు, మేజస్ట్రేటు, పెద్ద కాపూను. మనువుకాలంనుండి యిప్పటివరకు సెటిల్‌మెంట్లు పటేలు ద్వారాగానీ, పటేలుతోనేగానీ, జరుగుతూవచ్చినయి. రాష్ట్రాన్ని

ఎవరు పాలించినప్పటికీ గ్రామ పరిపాలకుడుమాత్రం పటేలే అని ఆయన మరియొక నివేదికలో వ్రాశాడు. ఇండియాలోని గ్రామసంఘాలనుగూర్చిన ఈ నివేదికలోనివర్ణన, మీ రెవిన్యూబోర్డువారి 1808 ఏప్రిల్ 25వ తేదీ నివేదికలోని అభిప్రాయాలతో సరిపోతున్నది. భూగోళశాస్త్రప్రకారం ఆలోచిస్తే గ్రామమనగా కొన్ని వందలో, వేలో ఎకరాల వైశాల్యంగల పంటపొలముతోనూ, బంజరుపొలముతోనూ ఉండే భూఖండం. రాజకీయంగా ఆలోచిస్తే అది ఒక మున్సిపాలిటీనో, కార్పొరేషనునో పోలిఉంటుంది. దాని ఉద్యోగస్తులు, నౌకర్లు ఈ విధంగా ఉంటారు.

పటేలు లేక గ్రామపెద్ద :- ఈయన గ్రామ వ్యవహారాలన్నిటినీ తనిఖీ చేస్తూంటాడు. పోలీసుపనిచూస్తాడు. తన గ్రామంలో రెవిన్యూ వసూలు చేస్తుంటాడు ఈయనకు గ్రామస్థులతోను గ్రామవ్యవహారాలతోనూ సన్నిహిత సంబంధ ముండడంచేత ఈపని కీయన చాలా అర్హుడు.

కరణం:- ఈయన వ్యవసాయానికి సంబంధించిన లెక్కలు వ్రాస్తుంటాడు. రిజిష్టర్లు వ్రాస్తుంటాడు.

తలారి:- ఇతనికి చాలా దూరపు పను లున్నట్లు కనిపిస్తుంది. జరిగిన నేరాల భోగట్టా తెలుసుకోవడం, ఒక గ్రామమునుండి మరొక గ్రామమునకుపోయే బాటసారులకు తోడుగా వెళ్లుతూ వాళ్ళను కాపాడడం వీని ముఖ్యధర్మాలు.

తోటీ:- ఇతనిపని చాలావరకు గ్రామానికి సంబంధించే ఉంటుంది. ఇతడు పంటలను కావలికాయడం వాటికొలతలలో సహాయంచేయడం.

పొలిమేర కాపు: ఇతను గ్రామాలపొలిమేరలను కాపాడుతూంటాడు తగాదాలు వచ్చినప్పుడు సరిహద్దులనుగూర్చి సాక్ష్యమీయడం ఈతని ధర్మం.

చెఱువులను, పంట కాలవలను తనిఖీచేసే మనిషి:- వ్యవసా

యాకిని కావలసిన నీరు సక్రమంగా వదలి పెడుతూంటాడు.

పూజారి బ్రాహ్మణుడు:— గ్రామ పూజాపురస్కారాలను నిర్వహిస్తుంటాడు.

బడిపంతులు:— పిల్లలచేత ఇసుకలో అక్షరాలు వ్రాయించి చదివిస్తుంటాడు.

పంచాంగం బ్రాహ్మణుడు విత్తనాలు నాటడానికీ, మహానూల్ చేయడానికీ మంచికాలాలను చెబుతాడు.

కమ్మరి, వడ్రంగి వ్యవసాయానికి కావలసిన పనిముట్లు తయారుచేసి రైతులకు ఇస్తూ కట్టిపెట్టుతారు.

కుమ్మరి, చాకలి, మంగలి, గొల్ల, వైద్యుడు, దేవదాసి (ఈమె ఉత్సవాలలో హాజరవుతూంటది) పాటకుడు, కవి: ఈ ఉద్యోగులూ, నౌకర్లను గ్రామసిబ్బందీ అంటే. కాని కొన్నిచోట్ల ఇంతిమంది ఉండరు. పైన చెప్పిన పనులు కొన్నికొన్ని ఒక్కమనిషే నిర్వహిస్తుంటాడు. మరికొన్నిప్రదేశాలలో ఈ పైనచెప్పినవారికన్న ఇంకా ఎక్కువమంది ఉంటారు.

ఈ నిరాడంబరమైన మున్సిపల్ పరిపాలనాపద్ధతిక్రింద గ్రామస్థులు అనాదికాలంనుండీ ఉంటూన్నారు. గ్రామపొలిమేరలలో ఎన్నడూ మార్పురాదు. యుద్ధం, కరువు, రోగాలు వీటివలన గ్రామాలు పీడింపబడినప్పటికీ చివరకుపాడుపడినప్పటికి కూడా ఆ పేరులు, ఆ పొలిమేరలూ, ఆమిరాసీలు, ఆకుటుంబాలూకూడా అలాగే తరతరాలవఱకూ నిలచిఉన్నాయి. రాజ్యాలు విచ్ఛిన్నంకానీయండి విభాజ్యంకానీయండి తమగ్రామం చెక్కుచెదరకుండా ఉన్నంతవరకు గ్రామస్థులకు చీమకుట్టదు. ఆ గ్రామం ఎవరిపాలనలోనికి పోయినా వారికి లెక్కలేదు. ఎవరుదానికి ప్రభువైనాఒకటే. దాని ఆంతరంగిక వ్యవహారనీతి కేమీ

మార్పుండదు. పటేలే ఆగ్రామస్థులకు పెద్దగా ఉంటాడు. వాళ్ళకాయనే చిన్న జడ్జి, మేజిస్ట్రేటు, కలెక్టరు, పిల్లజమీందారూను.
దేవాలయసిబ్బందికీ, స్థానికగవర్నమెంటు ఉద్యోగులకు, గ్రామసౌకర్యములకు వారివారి ధర్మాలను నిర్వహించేటందు కొసంగబడిన భూములుగాక గ్రామాలలో పండిన పంటలో కొంతభాగంకూడా ప్రతిసంవత్సరమూ పారితోషికంగా లభిస్తుండేది. ఈ పారితోషికం రైతులు ప్రభుత్వానికి ఈయవలసిన భాగంఈయకముందే ఆ యా ఉద్యోగస్థులకు ప్రత్యేకించి ముట్టచెబుతూండేవారు. కాని ఇటీవల ప్రభుత్వానికి చెల్లించవలసినభాగం చెల్లించబడిన తరువాత యిస్తున్నారు. ముసలితనము వలనగానీ, ఆకస్మికంగా సంభవించిన అపాయంవలనగానీ అశక్తులైన ప్రజాసేవకులకు (Public Servants) పైన ఉపహరింపబడిన పద్ధతి ప్రకారం పేదో కొంత జీవనాధారం కల్పించినట్లు కన్పిస్తున్నది. రెవిన్యూఉద్యోగస్థులూ, గ్రామసేవకులూ, వారివారి ఉద్యోగధర్మాలను నిర్వహిస్తున్నందుకు తీసుకొనే ప్రతిఫలంలో కొంత కాయకు (దేశీయ వస్తువులపై సరకులపైపన్ను) సముద్ర భూమార్గాలనుండి దిగుమతియైన సుంకములద్వారానూ లభించిన ద్రవ్యంలోనుంచి ముట్టుతూఉంటుంది.

ఇండియాలో అష్టాదశ శిల్పు లున్నట్లు (౧౮) వింటూన్నాము. పారశీకులు 32 మంది ఉన్నట్లు చెబుతూన్నారు. పార్శీ అగ్నులు 33 అనిన్నీ - 32 అగ్నులూ 32 వృత్తులకు సంబంధించినవనీ మిగిలినవి మెఱుపునుండి పుట్టిన మొదటి అగ్నిఅనీ- ఆ మొదటిఅగ్నిని వేయి సంవత్సరాలకిందనట ఇండియాకు వచ్చిన మొట్టమొదటి పారశీక యాత్రికులు తెచ్చినారనీ ప్రతీతి. 32 మంది శిల్పులను వరుసగా ఇక్కడ పేర్కొన ప్రయత్నించెదము గాక.

౧. వడ్రంగి ౨. కమ్మరి ౩. రజితకారుడు ౪. స్వర్ణకారుడు ౫. కుమ్మరి ౬. చెప్పులు కుట్టేమనిషి ౭. చాకలి ౮. ముచ్చి ౯. కలంకారీపనిచేసేమనిషి ౧౦. కుట్టుపనిచేసే మనిషి ౧౧. కంచరి ౧౨. రైతు ౧౩. పౌరోహితుడు ౧౪. వైద్యుడు ౧౫. మంగలి ౧౬. కాటికాపరి ౧౭. ముచ్చి ౧౮. తాపీమనిషి ౧౯. కరణం ౨౦. మున్సిఫ్ ౨౧. కోమటి ౨౨. ఈడిగ ౨౩. జ్యోతిష్కుడు ౨౪. నూలువడికేమనిషి ౨౫. పాకీమనిషి ౨౬. నాట్యకత్తె ౨౭. పాటగాడు ౨౮. సాలి ౨౯. ఊరికాపరి ౩౦. సీటికాపరి ౩౧. మల్లు ౩౨. జదుగార్ (Jadugar).

## గ్రామాలలో

ఒకతుణం గ్రామాలలోకి పూర్వ పరిస్థితులనూ, నూతన పరిణామ ప్రభావఫలితంగా కలిగిన నేటి సంఘపరిస్థితులనూ పరిశీలన చేదాము. ఇటీవలివరకు గ్రామమొక సమష్టిసంఘం. ఇప్పటికికూడా ఒకవిధంగా అంతే. కొన్ని శతాబ్దాలక్రిందట సమష్టిఉత్పత్తి, సమష్టిహక్కులూకూడా ఉండేవి. నేడలా లేకపోయినప్పటికీ గ్రామం ఇప్పటికీ స్వయంసంపూర్ణ స్వావలంబన జాతీయతాకేంద్రంగానే ఉంటూన్నది. భారతజాతి తన వ్యక్తిత్వాన్నీ సంపూర్ణతనూ కోల్పోకుండా ఉండాలంటే గ్రామం ఇదేవిధంగా ఉండితీరాలి, గ్రామాని కవసరమైన సామగ్రి అంతా దాని సరిహద్దులలోనే లభిస్తూండడంచేత దానిని 'సూక్ష్మాకారజగత్తు' అనిచెబితే తప్పుకాదు. వడ్రంగి, కమ్మరి, వాస్తుశాస్త్రజుడు, స్వర్ణకారుడు, చెప్పులుకుట్టేమనిషి,

కాపు, మంగలి, చాకలి, వర్తకుడు, షాహుకారు, నూలు వడికేమనిషి, సాలి, పురోహితుడు, వైద్యుడు- అంతా గ్రామములో ఉండవలసినవారని ఇదివరకే చెప్పిఉన్నాము. గ్రామాన్ని తక్కిన ప్రపంచంతో కొంతకాలం సంబంధం లేకుండా చేసినాకూడా పోయేదేమీ లేదు. మనిషికి కావలసిన ప్రధానవస్తువులు- అన్నవస్త్రాలక్కడఎప్పుడూసిద్ధంగాఉంటవి. ఇతరగ్రామాలతో సంబంధం కేవలం సంఘ సంతోషంకోసం తప్ప అవసరంలేదు. ఒక పట్టణాలతో సంబంధంకలగడం, లాయర్లద్వారా, డాక్టర్లద్వారా, కమీషన్ ఏజంట్లద్వారా పల్లెటూళ్ళధనం పట్టణాలలోకీ, అక్కడనుండి నగరాలలోకీ చివరకు ఖండాంతర దేశాలకూ పోవడానికి మాత్రమే వినియోగపడుతుంది. పూర్వంకూడా మనదేశాలలో పెద్ద పెద్ద నగరాలుండేవి. కాని అవి భారతదేశపు కళాకౌశలాన్ని ప్రదర్శించే విపణివీధులుగానూ ప్రపంచవర్తకులకు వ్యాపార స్థానాలుగానూ ఉండేవి. మనం ఉత్పత్తిచేసిన ఉత్తమోత్తమ వస్తువులను ప్రపంచానికి సప్లయి చేశాము. మన అన్నవస్త్రాలకెన్నడూ మనం ఇతరులపైన ఆధారపడలేదు. దురదృష్టవశాత్తు అదంతా మారిపోయింది. మనం కేవలం బానిసలంగా తయారయినాము. ఒకప్పుడెంతో గొప్ప సభ్యజాతిగా నుండి బంగారంపండే భారతవర్షం నేడు ఇంగ్లాండుదేశానికి ఉపగ్రహంగా మారిపోయింది.

జాతిహృదయాలను ఆకర్షించి మనస్సును జయించేటందుకు ఆంగ్లేయులు రెండోకంటివానికి తెలియకుండా నడిచప్పుడూ

లేకుండా, ఇంతపని చేయగలిగారు. సిపాయి తిరుగుబాటుని ఆంగ్లే యులచేత పిలువబడే భారతస్వాతంత్ర్య ప్రథమసంగ్రామం అప జయంపొందినప్పటికీ తంతో భారతీయ స్వాతంత్ర్య ప్రయత్నాలు నిలచిపోలేదని వారికి తెలుసును. కనుక "తిరుగుబాటు" జరిగిన మరుసంవత్సరమే 1858 లో వారు బొంబాయి, మద్రాసు, కలకత్తానగరాలలో విశ్వవిద్యాలయాలను స్థాపించారు. 1860లో హైకోర్టులను, 1861లో శాసనసభలనూ స్థాపించారు. కళాశాలలు, హైకోర్టులు, శాసనసభలు- ఈ మూడుసంస్థలు ప్రజల దృష్టిని ఆకర్షించి ఇండియాలో బ్రిటీష్ రాజ్యాధికా రానికి అభయహస్తమిచ్చినవి. ఇంగ్లీషుభాష ప్రచారంలోనికి వచ్చింది. ఇంగ్లీషులో చదువుచెప్పడం, ఇంగ్లీషులో పరీక్షలు చేయడం ప్రారంభమయింది. ఉద్యోగస్థులంతా ఇంగ్లీషులోనే వ్యవహరించడం మొదలుపెట్టారు. ఇంగ్లీషున్యాయచట్టం దేశం లోకి దిగుమతీ అయింది. వాది, ప్రతివాది, ఇద్దరిపక్షపు ప్లీడర్లు, జడ్జీ, జ్యూరీ, సాక్షులు ఈ అందరూ తెలుగువారే అయిన ప్పటికీ సాక్షిని ఇంగ్లీషులో అనువాదకునిద్వారా ప్రశ్నలడిగి సమాధానాలు పుచ్చుకోవడం ఆచారమయింది. తీర్పులన్నీ ఇంగ్లీషులోనే వ్రాస్తున్నారు జడ్జీలు. కోర్టులలో "సత్యమే చెబు తాను. అంతా సత్యమే చెబుతాను. సత్యంతప్ప ఏమీ చెప్పను" అని చేస్తున్నప్రమాణం "అసత్యమే చెబుతాను అంతా అసత్యమే చెబుతాను. అసత్యంతప్ప ఏమీ చెప్పను" అనిఅర్థంగా పరిణమిస్తూన్నది. నేరంగానీ, వివాదంగానీ జరి న ప్రదేశానికి పదులకొలదీ మైళ్ళదూరంలో కోర్టులుండటం

చేత, జంకూకొంకూ లేకుండా అబద్ధం చెప్పి స్వేచ్ఛగా తప్పించుకోవడానికి వీలైన జూదపుటిళ్లా అనిపిస్తూంటవవి. మానవుల నిత్యానుభవంలో ఉన్నవిషయాలు, రోజూ కళ్ళారా చూస్తున్న ప్రత్యక్షసందర్భాలూ కూడా కోర్టులో నిస్సందేహంగా కాదనేస్తారు కొందఱు సాక్షులు. అనేక అప్పీలు కోర్టు లుండడంచేత అదృష్టంమీద ఆధారపడే వ్యాజ్యాల కోరలు తయారవుతూన్నారు. కోర్టులమూలాన కొత్తవర్గమొకటి బయలుదేరింది. వారిని 'టౌట్లు' అంటారు వ్యాజ్యాల కోర్లకూ క్లీడర్లకూ సంబంధం కలుపుతూంటారు వారు. వ్యాజ్యం కేవలం ఇద్దరికీ సంబంధించిన వివాదవిషయంగా కాక, కసితీర్చుకోవడానికీ, పగసాధించడానికీ మార్గాంతరంగా పరిణమించింది. దాని దుష్ఫలితాలు చెప్పతరంగాదు. భాగ్యవంతులు పేదవాళ్ళను చావకుండానూ, బ్రతకకుండానూపెట్టే యాతననే వ్యాజ్యమనాలి. స్వరాజ్యంలో ఇటువంటివంతా రూపుమాసిపోవాలి. పంచాయతీలుఆచరణలోకిరావాలి, గ్రామ పంచాయతీ, ఊరిఆరోగ్యరక్షణ, సహకారసంఘం, న్యాయవిచారణ-ఈవిషయాలలో పనిచేయదగినదిగా ఉండాలి. అడవులను పంటబోదెలను కాపాడుతూ ఉండాలి. లైబ్రరీని నడిపించాలి. గ్రామపరిశ్రమలను, కళలను పునరుద్ధరించాలి. ఈపైన చెప్పిన అన్ని ప్రయోజనకరములైన పనులు చేస్తూ సర్వతోముఖ కార్యనిర్వాహణ సంస్థగా ఉండాలి. ఒకపంచాయితీయే ఈపనులన్నిటినీ ఒక్కసారిగా సాధించలేకపోవచ్చును. ఆసందర్భంలో చాలినన్ని పంచాయితీలను స్థాపించవచ్చును. న్యాయ్యవిచా

రణకు సంబధించినంతవరకు ఏ సందర్భములోనూకూడా గవర్నమెంటుప్లీడరు అంగీకరిస్తేనేగాని అప్పీలు చేయడానికి వీలుండకూడదు.

## గ్రామపంచాయతీ సంఘం

గ్రామస్థులు కలహప్రియులు. కక్షలుకట్టి వాటితో కిందా మీదాపడుతూంటారు అందువల్ల పంచాయతీలు పనికిరావని కొందఱభ్యంతరపెడతారు. గ్రామాలలో కక్షలు పెఱిగిపోయిన మాట కాదనము కాని వాటికి కారణం నేటి కోర్టులు, వాటి న్యాయవిచారణాపద్ధతీని. లాయరువృత్తి విరోధంపెంచడానికే గాని ఐకమత్యం కలిగించడానికి ఉపయోగపడడంలేదు. కోర్టు న్యాయ్యం చేయడానికికాక చట్టాన్ని అమలుపరచడానికి విని యోగిస్తూన్నది. న్యాయ్యం ప్రజామోదకరంగా ఉండాలంటే తొందరగా జరగాలి.; చౌకగా లభించాలి; అసందిగ్ధంగా ఉండాలి; ఇది పంచాయితీలోనే సాధ్యమౌతుంది. మేజస్ట్రీటు కోర్టులుఉండి క్రిమినల్ కేసులు పెట్టడానికివీలవడంవల్లనే సివిల్ క్రిమినల్ వ్యాజ్యాలు పెంచుకొని పరస్పరం పగసాధించుకోవ డానికి వాటిని పరికరాలుగా ఉపయోగిస్తూన్నారు కొందఱు. 'లా'రిపోర్టులనుతగులపెట్టి, కేసు'లా'ను గమనించడంమానివేసి అప్పీళ్ళకు పరిమితి యేర్పాటుచేస్తే అప్పుడు కొత్తయుగం ప్రారంభమవుతుంది. సమాన ప్రతిపత్తిగల గ్రామస్థులారు మంది నేరంకానీ, వివాదంకానీ జరిగినచోట కూచొని న్యాయ్య విచారణ చేయడానికి వీలున్నప్పుడు గ్రామపెద్దలు యే విధమైన కష్టమూ లేకుండా వచ్చి సాక్ష్యమిస్తూంటే,

గ్రామస్థు లందరికీ తెలిసిన విషయంలో అబద్ధం చెప్పడానికి సాధ్యమౌతుందా? అప్పుడు నోటితో చెప్పిన మాట లేదని అనగలడా? అందువల్ల ప్రజల నిజాయితీ తిరిగీ అభివృద్ధి పొందుతుంది. అబద్ధంవల్లనే కలహాలు వస్తూన్నయి. అబద్ధాన్ని ఆపగలిగినప్పుడు వ్యాజ్యాలే ఉండవు. ఈ పనిని చేయగలిగిన సంస్థ పంచాయితీ ఒక్కటే. కొత్తమార్పు వచ్చేటప్పుడు కొన్నిలోపాలు జరిగితే జరుగవచ్చును. ఆ లోపాలురావడం మనరాష్ట్రీయ స్వపరిపాలనలో, మన జిల్లా బోర్డు మున్సిపాలిటీలలో, గ్రామపరిశ్రమల నిర్మాణములో, జాతీయవిద్యా కార్యక్రమంలో, హరిజన ఉద్యమంలో, అన్నిటిలోనూ తప్పనిసరి.

ఇండియాను మనం క్రొత్తగా జయించుకోవాలి. ప్రతి శాఖను పునర్నిర్మాణం చేయాలి. జాతీయ జీవితంలోని ప్రతి విషయాన్నీ తిరిగీ ఒక క్రమంలోకి తీసుకొనిరావాలి. జాతీయ విద్యనుగూర్చి ఇంకొక అధ్యాయంలో వ్రాశాము. నిరంకుశాధికార సంస్థలోగాని, ప్రొఫెసర్లు, జడ్జీలు, కార్యనిర్వాహకోద్యోగులు, మంత్రులు - వీరిలోగానీ మనుష్యులు మారినంత మాత్రాన మనకు స్వరాజ్యం రాదు. హృదయంలో, ఉద్దేశ్యంలో, దృక్పథంలో మార్పురావాలి. అప్పుడు సగుణ సంపన్నమైన స్వరాజ్యం మనకు లభించి గ్రామాలు తిరిగీ స్వయంసంపూర్ణా లవుతయి. ఇదే గాంధీజంయొక్క ప్రథానాదర్శం.

## ఎదిరి వాదం

మనపూర్వులు కేవలం గ్రామాలలోనే నివసించారేమో విచారిద్దాము. చరిత్ర అందుకు వ్యతిరేకంగా చెబుతూన్న దంటారు. నగరాలు నశించకూడదనీ పైపెచ్చు గ్రామాలు నగరాలుగా అభివృద్ధి కావాలనీ నిశ్చితాభిప్రాయం గలవారు కొంతమంది ఉన్నారు. నగరాలు మురికిగానూ, ఇరుకుగానూ ఉండవని అంగీకరిస్తారు వారు. పల్లెప్రజలు సొమ్ముకు ఆశ పడక నగరాలవైపుకు చూడకుండా ఉంటే మంచి దేనంటారు. కాని అది ఒకవిధమైన మందకొడి వ్యవహారమని వారి దృఢాభిప్రాయం. అది ఆదర్శ మానవజీవితంకాదట; అజ్ఞానం వలనకలిగే ఆనందమట.

"పరాయిరాజుల దండయాత్రల విషయంలోగానీ, అంత రంగిక కల్లోలముల సందర్భములోగాని ఆ గ్రామాలు స్వసం రక్షణ చేసుకోలేవు. కాబట్టి అవి నగరాలు కావాలంటారు" వారు. పూర్వరాజులు గ్రామాలనేఎక్కువశ్రద్ధగా కాపాడుతూ వచ్చారనే సంగతి మేము విశ్వసించము. మన దేశము 'గ్రామాలదేశము' అనేమాట వాస్తవమే. కాని పూర్వం ఎక్కువగా అనేకవస్తువులను నగరాలకు ఎగుమతి చేస్తూఉండేవి మనగ్రామాలు. మనదేశంలో సన్యాసులూ, సాధువులే ఉన్నారంటే ఎంతనిజమో- గ్రామాలే ఉన్నవి కాని నగరాలు లేవంటే అంతేనిజం. ఋషులు అడవులలో ఆశ్రమాలు కట్టు కొన్నంతమాత్రాన గ్రామముల ప్రాముఖ్యత ఋజువుకాదు'

పూర్వం అడవులూ, గ్రామాలూ, నగరాలూకూడా ఉన్నవి. 'గ్రామ్య' అనేమాట 'నాగరిక' అనేమాటకు వ్యతిరేకంగా నిందాభావంలో ఉపయోగపడుతూన్నదిగనుకనూ 'నాగరికం' అనేమాటసంస్కారార్థంలో ప్రయోగింపబడుటచేతనూ, నగరం నీతిలోగానీ సంస్కృతిలోగానీ గ్రామాలను అతిక్రమిస్తూన్న దని అర్థంచెప్పకూడదు. నగరాలలో పైకి కనుపించే నాజూకు నేటికికూడా గ్రామాలలో కొఱవడి ఉన్నమాట నిజమే కావచ్చును. 'నగరాల చెకుగులను కళ్ళార చూస్తూన్న కారణం చేత గ్రామాలకుపోనలెవనిపించేమాట నిజమే. ప్రకృతి పూజ, పసిబిడ్డల అమాయకత్వము రూపోను ఆకర్షించినట్లుగా మనను పురాణయుగము ఆకర్షించవచ్చును. కాని అది సరియైన దృక్పథం కాదు. అది పసిబిడ్డల విద్యకుమాత్రం ఉపయోగపడుతుందని' అంటారు పై పక్షపువారు. ఋషిదృష్టితో ప్రకృతి సౌందర్యాలను చూడగల శక్తినిస్తుందది. గ్రామాలవైపుకు మనం తిరిగి చూచినప్పుడు వాటికి మనం నిజంగా సహించరానంత గొప్ప అన్యాయ్యం చేశామనీ, తత్కారణంగా అవి కూలిపోయినవనీ అర్థమవుతుంది. ఈసంగతి తెలియచెప్పడం గ్రామాల అజ్ఞానాన్ని తొలగించేటందుకు మనం సహాయపడడం. కాని బుద్ధిమంతులెవ్వరూ రెండు అసత్యాలను పట్టుకొని వాటిమధ్య ఊగులాడుతూ ఉండకూడదు. నిజమెక్కడున్నదో తెలుసుకొని, అక్కడనుండి ఆలోచించి పనిసాగించాలి. గ్రామాలను సమృద్ధములుగా చేయమనడం పట్టణాలను పాడుచేయమనడంకాదు. అలా చేసినట్లయితే తలకా

యని నరుకుకొని కాళ్లమీద నిలబడ ప్రయత్నించినట్లవుతుంది. నిజానికి మంచిగ్రామాలు నగరాలకు పుష్టి కలుగజేస్తాయి. దేశక్షేమంగోరే నగరాలు గ్రామాలరక్తం పీల్చవు. పైపెచ్చు తమ అధికైశ్వర్యంవలన గ్రామాలను తిరిగి సమృద్ధములుగా చేస్తాయి. నేటి నగరాలు విదేశీ వస్తువులను గ్రామాలకు దిగుమతీ జేస్తున్నాయి. అది గొప్పతప్పు. న్యాయ్యానికి గ్రామకళా నైపుణ్యాం నగర ప్రాసాదాలను అలంకరించాలి. గ్రామాలలో తయారైన చేతి పరిశ్రమలను ఎగుమతీచేయాలి నగరాలు.

సాంఘిక సమస్యలను పరిశీలించి పరిష్కరించాలి కాని విడిచిపెట్టి ఊరుకోకూడదు. సుహృద్భావం గలిగిన సహకార ప్రయత్నాలవలన ఆపని సులభసాధ్యం కావచ్చును. మొట్ట మొదట కొంత నిర్బంధముగా కనుపించినప్పటికీ పోనుపోను, బిడ్డ నడకకు అలవాటు పడ్డట్టుగా బుద్ధిపూర్వకంగా చేసే సహకారప్రయత్నం స్వభావంగా మారిపోతుంది. అందువల్లనే సమష్టి కుటుంబ మొక సహకార సంఘంగానూ, కులం ఒక కో-ఆపరేటివ్ ఫెడరేషన్ గానూ, గ్రామ మొక కో-ఆపరేటివ్ కాలనీగానూ వ్యవహరిస్తూన్నవి. గ్రామాలలో పని సమిష్టి ప్రయత్నంవలన జరుగుతూన్నది. వాణిజ్యం వస్తు మారకంవలన నడుస్తూన్నది. పరస్పర సుహృద్భావంవలన శాంతి ఉన్నది.

గ్రామ పునరుద్ధరణం గ్రామాలను ధనవంతాలుగా చేయడంవలన జరగాలి. ఇందుకు గ్రామస్థులు పట్టణవాసులను అనుకరించడం మాన్పించాలి. కోర్టులు, కళాశాలలు గ్రామా

లకు పట్టణాలకూ సంబంధం కలిగిస్తూన్నవి. వాటిని పునర్ని ర్మాణముచేయాలి. న్యాయ్యము, సంస్కృతీపరిశ్రమలూకూడా రాజకీయాలు పోయినట్లుగానే గ్రామాలకు పోవాలి. కొత్త విషపుకోరలుగలఅభిప్రాయాలు దౌష్ట్యమునుండితప్పించుకొని గ్రామాలు నూతన భావాలకూ నవచైతన్యానికీ కేంద్రాలు కావాలి. మార్క్స్ యిలాఅన్నాడు "సాంఘికవిప్లవం పాత జమీందారీ వ్యవస్థను నాశనం చేసింది. అది హిందూనేత గానిని, వడుకువానినిగూడా రూపుమాపింది". మార్క్స్‌కు గ్రామసంఘవ్యవస్థలంటే అంత సరదాలేదు, ఆయన వాటిని గూర్చి ఇలా అన్నాడు.

"గ్రామం ప్రాచ్యదేశాల నిరంకుశాధికారానికి గట్టి పునాది. మానవ బుద్ధిని సాధ్యమైనంత సంకుచిత పరిధిలో బంధించి మూఢవిశ్వాసాలకు ఎదురులేని పరికరంగా వినియో గిస్తూన్నారు; అంతేకాదు చారిత్రకశక్తులకూ మహావైభ వానికీ దూరంచేసి సాంప్రదాయ నియమాలతో దానిని నిరో ధిస్తూన్నారు. కాని గ్రామాల కావ్యదృశ్యాలను సాంఘిక విప్లవం నాశనం చేసినందువలన చాలా నష్టము కలిగిందని ఆయన ఒప్పుకున్నాడు.

## 3
## స్వయం సంపూర్ణత

ఈ స్వయం సంపూర్ణత ఆదర్శాన్ని అర్థంచేసుకోవడానికి ముందు మనం హిందూసంఘనిర్మాణాన్నిగూర్చి దాని ధర్మా

లనుగూర్చి పరిశీలించాలి. హిందూసంఘంలోని ప్రతిమనిషికీ అన్నవస్త్రాలను తప్పకుండా అందించే రక్షణాలు, ఆధారాలు నిష్కరుణంగా ఎలా భగ్నం చేయబడినవో యోజించాలి. ఇండియా ఈరోజున ప్రాదేశికంగా, సాంఘికంగా, వృత్తి విషయికంగా (Professionally) చీలిక లేర్పాటు చేయబడినవి. స్వతంత్ర రాజ్యాలకూ రాష్ట్రాలకూ పడదు. హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, సిక్కులు, ఇండియాలో కాపురమున్న పర దేశీయులు-వీరెవరికీ పరస్పరం పడదు. గ్రామాలకూ పట్టణాలకూ పడదు. గ్రామాలలోని రైతులకూ పట్టణాలలోని కూలీలకూ పడదు. అయితే ఈ పురాతనభూమి ఇలా చీలికలు చేయబడడంవలన కలిగిన అపకారం చాలా తక్కువని చెప్పాలి. అసలు సంఘపునాదులే అగపడకుండా నాశన మొనర్పబడినప్పుడు డా అపకారమెంతటిది! జర్మనీని ఉదాహరణంగా తీసుకొని స్వయంసంపూర్ణత అని చెప్పడం ఒక వేషం అయిపోయింది. కొంతమంది గవర్నరు లర్థంలేకుండా అలా మాట్లాడడం ప్రారంభిస్తూన్నారు. ఇప్పుడువారు చెబుతూన్న స్వయంసంపూర్ణత భారతీయసంఘానికి శతాబ్దాలనుండీ పునాదిగాఉంది. గ్రామం జాతీయ జీవితానికి ప్రమాణంగా ఉంది. ఆగ్రామం ఎటువంటిది? జీవితాన్ని సంపూర్ణంగానూ, ఆనందమయంగానూచేసే అన్నివృత్తులతోనూ నిండిఉన్న గ్రామం. జీవితానికి ప్రయోజనకరములై సౌందర్య నిలయములైన చేతిపనులుగల గ్రామం. కాని పాశ్చాత్య నాగరికతాస్పర్శఅటువంటి గ్రామాన్ని, దాని మనోహరములైన ఉత్పత్తిపదా

ర్థాలను ఎడ తెగని వృత్తులను, ప్రధాన జీవితావసర వస్తు నిర్మాణశక్తిని నాశనంచేసింది. ప్రతిరోజూ దేశంలోని మూరు మూల గ్రామాలలో కూడా వీధులవెంట అందచందాలు లేక మిడిసిపడుతూన్న చౌకవిదేశీసరుకులను మూటలు వేసికొని అమ్మే చిల్లరవర్తకులు, పట్టణాలలోని టోకువ్యాపారస్థులు గ్రామాలదుస్థితికి కారణమయినారు. చిట్టచివరకు గ్రామం లోని మంగలి జర్మనీదేశపు కత్తినీ, వస్త్రం నేసే విదేశీ మర మేకనూ ఉపయోగించవలసినఅవస్థ రావడంతో ఊళ్లోకమ్మరి వృత్తి పూరేగింది. కమ్మరి విదేశిబట్ట వినియోగించడంతో, సాలీలపని చప్పబడ్డది. సాలి, జపాను చెప్పులుపయోగించడంతో వాని వృత్తి మాయమయింది. చెప్పులుకుట్టే మాదిగ పింగాణీ బొచ్చెలు వాడడంతో కుమ్మరివృత్తి కూలిపోయింది. ఈవిధంగా ఒకరి వృత్తిని మఱొకరు నాశనం చేసుకొన్నారు. పర్యవసానానికి గ్రామమంతా పాడయింది. గ్రామంనాశనంకావడంచేత స్వయంసంపూర్ణత పల్లెలలోనూ పట్టణాలలోనూకూడా లేకుండా పోయింది. నాటినుండీ జాతీయ సామర్థ్యం చచ్చి నిరుద్యోగత హెచ్చింది. ఒకప్పుడు సమష్టిసౌభాగ్యము, సంఘక్షేమములను పునాదిగా కలిగిన హిందూసంఘం నేడు వ్యక్తిద్వేషాలకు, పరస్పరస్పర్ధలకు, నిరంతర సంఘట్టనలను, తావలమై అవినీతికరమైన, నీచమైన జాతీయ లక్షణానికి యే విధంగా దారి తీస్తున్నదో పైన వివరించిన విషయాలను బట్టి తెలియగలదు.

దేశంలోని ప్రతి భూభాగమూ ప్రతి గ్రామమూ స్వయంసంపూర్ణంగాఉండే పురాతన సంఘనిర్మాణంగల దేశం ఇండియాఅని

ఇంతవరకూ చెప్పిఉన్నాము. పాశ్చాత్య పారిశ్రామిక దండ యాత్రలవలన ఆ సంఘవ్యవస్థ సర్వనాశన మయింది. పోటీ ఖరీదులపైన, అధికోత్పత్తిపైన ఆధారపడిఉందిపాశ్చాత్య పారిశ్రామిక విధానం. కాబట్టి పోటీపడి ఉత్పత్తి చేస్తూన్న జాతుల తగాదాకు ప్రపంచ వ్యాపారస్థలాలు కారణాలైనవి. పూర్వపు ఐరోపాఖండ యుద్ధానికీ నేడు జరుగుతూన్న యుద్ధానికీకూడా ఒక కారణమదే. పాశ్చాత్య పారిశ్రామికజాతులకు కావలసిన వ్యాపార స్థలాలు ప్రాచ్యఖండంలో స్థాపించబడినవి. అయితే దేశాల కంత కంత కాత్మస్మృతి గలిగి వాటికి తటస్థించిన బానిసత్వాన్ని గుర్తించినవి. తూర్పు దేశాలు, జపాను మొదలు ఈజిప్టువరకూ తమ అంగళ్ళపైన విదేశీవస్తువులు చేస్తూన్న దండయాత్రల కెదురు తిరిగి నిలబడ్డవి. కాబట్టి ఇప్పుడు రెండుపనులు జరగాలి. తూర్పు దేశాలు తమ ఉత్పత్తులను ఎక్కువ చేసుకొని కోరికలను తగ్గించుకోవాలి. పశ్చిమ దేశాలు తమ ఉత్పత్తిని తగ్గించుకొని, తమకు కావలసిన ముడి సరుకులను, ఆహారాన్ని ఎక్కువగా పండించుకోవాలి. అప్పుడు తూర్పు పడమరల కలయిక సాధ్యమవుతుంది. ఇప్పుడు రెండూ చెరొక వైపుకూ పోతూన్నవి. ఈసందర్భంలో ముందు తూర్పు దేశాలు వరవడిపెట్టాలి. పడమర దేశాలు గట్టిగా దెబ్బ తింటేనేగాని ఏ సంగతీ నేర్చుకోవు. ఇప్పుడు దెబ్బతిని నేర్చుకోవడం ప్రారంభించినవవి. ఈ ప్రధానసూత్రాలను ఒకసారి అర్థంచేసుకొన్న తరువాత పని ఎలా ప్రారంభించాలి అనే వివరాలలో ఆలస్యముండనక్కరలేదు. ఇండియాలో ఈ పనిని

మొట్టమొదట ప్రారంభించిన జాతీయ మహాసంస్థ కాంగ్రెసు. కాంగ్రెసు ఖద్దరు సిద్ధాంతాన్ని ప్రతిపాదించిననాడే జాతీయ పునర్నిర్మాణమునకు అంకురార్పణ జరిగింది. భారత దేశపు అంగళ్లలోనుండి దేశీయవస్త్రాలు, విదేశీబట్టలను వెళ్లగొట్ట గలవని చాలామంది అనుకొని ఉండరు. ఈ పని దాదాపు జరగనే జరిగింది. ప్రబుద్ధ జాతీయ చైతన్యం నిజమైన యుక్తాయుక్తవివేకాన్ని రేకెత్తిస్తుంది. శాసనాలు, ఎగుమతి దిగుమతి పన్నులు, కోటాలు, సరిహద్దుల ప్రభుత్వ గ్రాంటులు, కరెన్సీల తగ్గింపులు-వీటన్నిటినీ మించిన శక్తిగలిగిన దది. ఖద్దరు గ్రామ పరిశ్రమలకు రాజు. అది దాని ధర్మాన్ని చక్కగా నిర్వర్తించింది. కాని గ్రామ పునరుద్ధరణానికి మార్గదర్శకమైన ఆ పరిశ్రమ తదితర పరిశ్రమల అభివృద్ధికి దోహదంచేయాలి. కాంగ్రెసు ఆదేశానుసారంగా అఖిలభారత గ్రామ పరిశ్రమల సంఘంద్వారా గాంధీ ఆ పనికి పూనుకొన్నారు.

అధ్యాయం 12

# ఆర్థికాభివృద్ధి

## ఖద్దరు

ఇండియా జనసంఖ్య ప్రపంచంలో ఆరోవంతు. ఇండియా సభ్యత అతి పురాతనము. అటువంటి దేశం విదేశప్రభుత్వ యాజమాన్యంకిందవిద్యాభ్యాసంచేయడం, వారు తయారుచేసి యిచ్చిన వస్త్రాలను ధరించడం, వారికి దోసిలొగ్గుతూ వారి పరిపాలన కింద ఉండడం-ఈ అపూర్వదృశ్యం ప్రపంచంలో ఎవ్వరూ ఇంకెక్కడా కనీ వినీ ఉండరు. ఇండియాలోని అతి ప్రాచీన ప్రతిష్ఠగల బ్రహ్మాండమైన ప్రాచ్యజాతి, ఒక స్వల్పాతి స్వల్పమైన ఆధునిక ద్వీపానికెదురుగా నిలబడవలసి వచ్చింది. అయితే ఈ చిన్నలంక తన ఆయుధబలాన్ని, తన సాహసాన్ని, తన రాజనీతిచతురతను, అన్నిటినీ వినియోగించి తన బ్రతుకు తెరువుకోసం, తన ఆహారసమస్యాపరిష్కారంకోసం, చారిత్రిక పరిస్థితులను అవకాశంగా చేసికొని 'రవి అస్తమించని' సామ్రాజ్యాన్ని ఎలాగో స్థాపించుకో గలిగింది.

ఒకప్పు డీ దేశంలోని ప్రజలు చేతితో వడికిన నూలుతో చేతితో నేసిన బట్టలను మాత్రమే ధరిస్తూండేవారనే సర్వసాధారణవిషయంకూడా చాలామందికి తెలియదు. ఈస్టిండియా కంపెనీవారు కేవలం కోస్తా పట్టణాలలో తయారయిన బట్టలను

పోగుచేసుకొని పోవడానికి ఫ్యాక్టరీలను, అంటే 'గోదాము' (Godowns)లను స్థాపించారనికూడా తెలియదు వారికి. మనమిప్పుడు చూస్తూన్న ఫ్యాక్టరీలను స్థాపించడానికి కావాడు ఇంజన్లు లేవు. 1682 నాటికి ఆవిరిశక్తి (Steam Power) లేనేలేదు. కాబట్టి అప్పుడు ఫ్యాక్టరీలని వాడిన పదానికి 'డిపో' లనిగానీ, 'గోదాము' లనికానీ అర్థం. ఈ విధంగా పోగుచేసికొనిపోయిన బట్టలను ఇంగ్లాండులో లాభానికి అమ్ము కొంటూండేవాళ్ళు. అక్కడి ప్రభుత్వం ఆ బట్టలను ఉపయోగించరాదని నిషేధిస్తే ఇతర దేశాలకు తీసికొనిపోయేవాళ్ళు. ఈ వ్యాపారం చేసేవర్తకులు పెద్ద పెద్ద లాభాలు తీసేవాళ్ళు. నూటికి 400వరకు కూడా లాభాలు సంపాదించేవాళ్ళు. ఒకప్పు డింగ్లాండులో ధనవంతుల ఇండ్లలోని నేలపై పరచబడిన ఈ వస్త్రాలు కొద్దికాలంలో రాణుల కటిసీమలను అలంకరించినవి. దేశీయసరుకుల అమ్మకాన్ని తగ్గించినవి. ఈ వ్యాపారంచేసే కంపెనీని గురించి అక్కడివారు అవహేళనం చేయ ప్రారంభించారు. తరువాత కొంతకాలానికి ముర్శిదాబాదు పట్టు ఇంగ్లీషు సంఘాన్ని ఆవరించింది. ఇంగ్లీషుప్రభువులు, జమీందారుల బిరుదాంకితులు అందరూ-ఈ సిల్కుసూట్లు వేసికొని తిరుగుతూండేవారు. అదిచూచి 'ముర్శిదాబాదు బట్టలు వేసికొని సాటోపంగా సంచరిస్తున్నారు మీరంతా. అందువల్ల మన మాతృదేశపు వర్తకం ఎంత తగ్గిపోతున్నాదో తెలుసునా ?' అని డానియల్ డిఫో గట్టిగా మందలించాడు వారిని.

ఇండియాదేశపు పట్టు బట్ట ధరించిన ఇంగ్లీషు దేశీయునకు

5పౌనులు జరిమానా వేయుబడునని 1700 లో శాసనం చేయ బడిన సంగతి అందఱికి తెలిసినదే. 1735 లో ఇండియాపట్టును అమ్మిన ఇంగ్లీషువానికి 25పౌనులు జరిమానా వేయుబడునని మఱొకచట్టం చేయుబడినది. అంతేకాదు. వారింకా దూరం పోయినారు. ఇంగ్లాండులో శవాన్ని ఉన్నిబట్టతో కాక మఱే బట్టతో కప్పినప్పటికీ 5పౌనులు జరిమానా వేయుబడునని ఇంకొకశాసనం చేశారు. ఇండియాపట్టు ఇంగ్లాండులోకి దిగుమతికాకుండా ఉండేటందుకు వారు పన్నులను విధించారు. ఈ విధంగా విదేశీబట్టల దండయాత్రనుండి తమ దేశాన్ని రక్షించుకోవడానికి ఈపనులన్నీ చేశారు. ఈలోగా 1783 లో స్టీమ్ ఇంజన్ కనిపెట్టబడింది. అప్పుడుమగ్గానికీవడుకురాటానికీకూడా ఆవిరి శక్తిని ఉపయోగించ ప్రారంభించారు. అందువల్ల గవర్నమెంటువారి పన్నులవిధానంకంటే ఎక్కువ లాభప్రదమైన అద్భుతమైన ప్రయోజనాలు కలిగినవి.

నాటినుండి ఇంగ్లాండులో దూదిబట్టలఉత్పత్తి పెరిగిపోవడం మొదలుపెట్టింది. మిల్లుల ఉత్పత్తి గజాలలెక్కలో ఉండదు. బేళ్ళలెక్కలో ఉంటుంది. అవి పెద్ద రాక్షసులు; అవి తినే తిండి తులాలలోనూ పౌనులలోనూ ఉండదు. హండ్రెడ్ వేయిట్లలోనూ టన్నులలోనూ ఉంటుంది. 1803 లో మొదటిసారి ఇంగ్లాండునుండి ఇండియాకు బట్టలు దిగుమతీ అయినవి. ఆ సంవత్సరంవచ్చింది 3 లక్షల రూపాయిాల విలువగల బట్టమాత్రమే. 1829లో 29లక్షల రూపాయిాల బట్ట దిగుమతీ అయింది. 1929 లో 66 కోట్ల రూపాయిాల నూలు దిగింది.

ఈవిధంగా లంకాషైరుకూ ఇతర దేశాలకూ ఇండియా చక్కని వ్యాపారస్థల మయింది. కాబట్టి ఇండియాలోని బ్రిటిషు సామ్రాజ్యం శాసనకర్మాలవలనగానీ, విశ్వవిద్యాలయ బోధనాపద్ధతివలనగానీ, కోర్టులు, కళాశాలలు, కౌన్సిళ్ళు, బిరుదాంకితుల వలనగానీ స్థాపించబడలేదనీ నూలువడికి బట్టలునేసే లంకాషైరు ఆవిరిశక్తి (స్టీమింజన్)వలన మాత్రమే స్థాపించబడిందనీ అర్థం చేసుకోవాలి.

అందువలననే 1908 మొదలు 1915 వరకూ జరిగిన మితవాద కాంగ్రెసులలో కూడా బట్టల పరిశ్రమకు, అనధికార జాతీయ పారితోషికం (founty) ఈయవలెననే సిద్ధాంతాన్ని అంగీకరించి తీర్మానాలు చేయబడినవి. ఇటీవలి సంవత్సరాలలో చేనేతపరిశ్రమను ప్రోత్సాహపరిచి నిలబెట్టడానికి ఏడాదికి 15లక్షల రూపాయీలవరకు కేంద్రప్రభుత్వంవారు గ్రాంటులిస్తూన్నారు. కాంగ్రెసున్నూ, కాంగ్రెసుపక్షాన ప్రాతినిధ్యం వహించిన అఖిలభారతచరఖాసంఘమున్నూ ఇంకొక అడుగు ముందుకువేసి నూలుకూడా చేతితో వడికిందిగానే ఉండాలన్నారు. ఖద్దరు ఉత్పత్తిని అభివృద్ధిచేసి వ్యాపకం చేయడానికి వారు కొన్ని ముఖ్య నియమాలను చేశారు. ఖద్దరనగా చేతితో వడికి చేతితో నేసిన బట్టమాత్రమే కాదు. ఖద్దరుబట్టను ఉత్పత్తిచేసే పనివారందరూ అనగా దూది ఏకేవారు, నూలువడికేవారు, నేసేవారు రంగులద్దేవారు, రంగులు వేసేవారు, తెలుపుచేసేవారు,-ఈఅందరూ అఖిలభారత చరఖా సంఘంవారేర్పాటుచేసిన మజూరీ పొందితీరాలి. అలా తయా

రయిన బట్టయే ఖద్దరని నిర్వచనం చేశారు. కాబట్టి ఖద్దరనే పదానికి న్యాయశాస్త్రసంబంధమైన నిర్వచన మేదైనప్పటికి పనివాళ్ళందరూ-- మొదటినుంచీ చివరవరకూ అ.భా.చ.సం. వారు నిర్ణయించిన మజూరిలను పుచ్చుకొని తయారుచేసిన బట్టకు మాత్రమే రాజకీయంగానూ, ఆర్థికంగానూ ఖద్దరని అర్థం, అందువలననే సర్టిఫైడు షాపులనుండి మాత్రమే ఖద్దరు కొనవలెనని మేము ప్రజలను హెచ్చరిస్తున్నాము.

## రాటమూ ఒక యంత్రమే

ఈ ప్రాచీన పరిశ్రమను పునరుద్ధరించడం గడియారం ముల్లును వెనుకకుతిప్పడమని మామూలుగా ఆక్షేపణ చేస్తూంటారు. అందుకు గ్రెగ్గు సరియైనజవాబిచ్చాడు. అది గడియారాన్ని నడిచేటట్టుచేస్తుంది. అంతేకాని వెనుకకుతిప్పదన్నాడు, రాటమూ చిన్నయంత్రమే — అయితే అది ప్రతియింటికి తీసికొనిపోదగినయంత్రం. 'మనం గ్రామస్థుణ్ని పరిశ్రమ దగ్గరకు తీసికొని పోవాలా? లేక పరిశ్రమను గ్రామస్థుని కడకు తీసికొని రావాలా? అని బార్కరడిగిన ప్రశ్న బహు సమంజసంగా ఉంది. మొదటిప్రశ్నకర్థం మిల్లులలో పనిచేయుడం. రెండోప్రశ్న కర్థం రాటంమీద పనిచేయడం. జాతి కేవలం భాగ్య వంతంగానే గాక నిజంగా బలిష్ఠంగా కూడా కావాలంటే కష్టజీవుల క్షేమంపైన, వారి తెలివిపైన వారి పరిశ్రమలకు చేసే సహకారంపైన ఆధారపడి ఉన్నది. ఇదే జాతికి అసలైనఐశ్వర్యం. ప్రతి దేశంలోనూ అధిక సంఖ్యాకులు పేదవాళ్లు కాబట్టి దేశం పేదవాళ్లది. ఇదే గాంధీ

ఉపదేశాలలోని సారాంశం. జాతినిబట్టీ రంగునుబట్టీ హక్కులు ఉండవనే అపోహను తొలగించుకోవాలని ఆయన పదే పదే చెబుతూంటాడు. 'మానవుడికిగల ఆంతరంగిక శక్తులనుబట్టి హక్కు లేర్పడతాయి. ప్రజలను స్వాతంత్ర్యార్హులనుగా చేయడానికి మార్గం, వాళ్లకు స్వాతంత్ర్యమియ్యడమే. రాజకీయాధికారా లిస్తేనే గాని వాటిని ఎలా ఉపయోగించాలో వాళ్లకు తెలియదు. ఇదే అసలు రహస్యం. స్వాతంత్ర్య సమాన ప్రతిపత్తులు ఒకరు ప్రసాదించేవి మరొకరు గ్రహించేవి కావు. శక్తిఉన్న వాళ్లకవి దేవునినుండే లభిస్తయి. అంతేకాని ప్రజాపీడకుల నుండీ, ప్రజాప్రతిపక్షులనుండీ, అవి లభిస్తవనుకోవడం పట్టి పొరపాటు' అని గాంధీజీకి గట్టినమ్మకం. 'గాంధీ తనదేశానికి అతి సన్నిహితంగా కావలసిన అకృత్రిమ అవసరాలను అర్థం చేసుకొన్నవిధానాన్ని సూచిస్తుంది ఆయన రాటం'అన్నాడు. అర్నెస్టుబార్కర్ (P. 61. M. Gandhi) మగ్గము దానికి కావలసిన నూలును సప్లయిచేసే రాటము-ఈ రెండిటివల్ల లక్షలాది కుటుంబాల కయ్యే ఖర్చులో అయిదోవంతుగాని ఆరోవంతు కాని పూడ్చుకోవచ్చునని గ్రెగ్గులెక్కవేసి చూపిస్తున్నాడు. ఇండియాలో అడవులలోను పొలాలలోనూ పనిచేసే మూడో వంతు ప్రజకు దాదాపు సంవత్సరంలో నాలుగునెలలు మొదలు ఆరునెలలవరకూ పనిఉండదు. ఈలెక్కలేని ప్రజాసమూహానికి దినమునకు ఒక అణాగాని, రెండణాలుగాని ఆదావచ్చే మరొక పని చూపించగలరా అని యంత్రపూజాపరాయణులైన వారినీ నాగరిక వైజ్ఞానిక ప్రపంచాన్ని అనేకసార్లడిగాను.

ఈ ప్రశ్నకు జవాబు రానంతవరకు, ఈ యుగంలోకెల్ల గొప్ప అర్ధిక శాస్త్రజ్ఞు డాయనేఅని ఒప్పుకోక తీరదు. గాంధీ వట్టిమూఢ విశ్వాసానికి గానీ, పూర్వాచారపరాయణతకు గానీ, పాశ్చాత్య విజ్ఞాన ద్వేషమునకుగానీ బలికాలేదు. ఆయనకు విజ్ఞానశాస్త్రం పైన చాలా పక్షపాతం. ఆయన వైజ్ఞానికదృష్టికి సమన్వయం కాని పనిని దేనిని నమ్మడు, అంగీకరించడు, చేయడు. ఆయన ప్రతివిషయంలోనూ చాలా లోతుకు దిగి ఆలోచిస్తాడు. తనకు తెలిసిన విషయాలకు భిన్నంగా ఉన్నా, తన సందేహాలను నివృత్తి చేయలేకపోయినా యేసిద్ధాంతాన్నీ నమ్మడు. శాస్త్ర విరుద్ధంగా ఉన్నదని అసహ్యించుకొని తృణీకరింపబడుతూన్న చరఖాను ప్రతి సూక్ష్మాంశములోనూ శాస్త్రప్రమాణానికి సంపూర్ణానుగుణంగా ఉండేటట్టు చేశాడు. దాని నిర్మాణములోనేమి, ఉత్పత్తిలోనేమి చెప్పుకోదగిన అభివృద్ధి కావించాడు. కాని గ్రామంలో మరమ్మతు చేయడానికి వీలులేని కొత్తచిక్కులను వేటినీ అందులో కల్పించలేదు. గాంధీకి విజ్ఞానశాస్త్ర నైపుణ్యమునందు, నిర్దోషత్వమునందూ గల పక్షపాతానికి చిహ్నంగా ఎరవాడా రాటాన్ని చూపవచ్చును. గాంధీ దాదాపు విజ్ఞాన శాస్త్రవేత్తలకు 'విరోధి' అనే నిందారోపణకు ప్రత్యుత్తరంగా ఆర్. బి. గ్రెగ్ వ్రాసిన దానిలోని ముఖ్యభాగాన్ని (మహాత్మా గాంధీ-సర్ రాధాకృష్ణ పేజి 80) ఇక్కడ ఉదాహరిస్తూన్నాము.

## గ్రెగ్గు చెప్పిన మాటలు

ఆయన సాంఘికవిజ్ఞాన శాస్త్రవేత్త. అందువల్లనే ఆయన సాంఘికసత్యాలను శాస్త్రదృష్టితో పరిశీలించి సహజ జ్ఞాన, ఋషణా, తర్కములతో ఆలోచించి

ప్రయోగరీత్యా పరీక్షిస్తేనేగాని అనుసరించడు. పాశ్చాత్య శాస్త్ర వేత్తలుచాలామంది తమమూలసిద్ధాంతాన్ని తమమీద ప్రయోగించుకొని పరీక్షచేసుకోని కారణంచేత వారు పండితులైనట్లుగా భావించనని ఒకప్పుడాయన నాతో అన్నాడు. కాని ఆయనమాత్రం ప్రతిమూల సిద్ధాంతాన్నీ ముందు తనమీదనే ప్రయోగించుకొని పరిశీలిస్తేనేగాని ఇతరులకు చెప్పడు. ఆధ్యాత్మం, ఆహారం, ఆరోగ్యం, రాటం, సంఘసంస్కారం, సత్యాగ్రహం - వీటిలో దేనికి సంబంధించిందైనా కావచ్చు. కనుకనే ఆయన స్వీయచరిత్రకు 'నా సత్యాన్వేషణ ప్రయోగాలు' అని పేరుపెట్టుకొన్నాడు.

ఆయన మామూలు శాస్త్రవేత్తకాడు. గొప్ప శాస్త్రవేత్త. ఆయన ఏరీకోరి నిర్ణయించుకొన్న సమస్యలు, వాటిని పరిష్కరించే పద్ధతులు, వాటిని సూక్ష్మాతిసూక్ష్మంగా పరిశోధించడంలో చూపే పృథక్ప్రసక్తి, ఆయనకు గల పరేంగితజ్ఞానము-వీటన్నిటివలన అంత గొప్ప శాస్త్రవేత్త అయినాడు. ప్రజల సంస్కృతికి, భావ వికాసమునకు, ఆర్థిక సంపత్తికీ, కళానైపుణ్యమునకూ, సన్నిహితంగా ఉండే పద్ధతులను అవలంబించడంలోనే సమాజ విధాతగా కూడా ఆయన గొప్పతనం వ్యక్తమవుతుంది. దేనిని త్యజించవలెనో దేనిని అవలంబించవలెనో దేనిని పరిక్షించాలో, విచక్షణ చేసుకోవడంలో కూడా ఆయన గొప్పతనముందని నా తలంపు. అంతే కాదు; సంస్కరణలను ప్రవేశపెట్టడంలోనూ, సాగించడంలోనూ, ఆయన చూపించే వేగపరిమితినిబట్టి కూడా ఆయన గొప్పతనం అర్థమవుతుంది. ప్రతిసంఘానికీ ఆయా దశలలో ప్రత్యేకపరిణామం సహజంగా కలుగుతూంటుందనే సంగతి ఆయనకు తెలుసును. సంఘంలో కొన్ని పరివర్తనాలు చాలాకాల గర్భస్థంగా ఉండి ఆకస్మికంగా ఆవిర్భవించవచ్చుననీ, మరికొన్ని మార్పులు రావడానికి కనీసం మూడు తరాలైన పడుతుందనీ, దీనికి కారణం పరంపరాగతములైన సంప్రదాయములనూ

ఆచారాలనూ దులిపివేసుకొని, కొత్తవాటికి అలవాటు పడడంలో సంభవించే గుంజాటన అనీ ఆయన ఎఱుగును. ఆయన చేయబూనుకొన్న ప్రతి సంఘసంస్కరణమునూ సమష్టితతో ఆచరణలో పెట్టేనిమిత్త మొక గట్టిసంస్థను స్థాపిస్తాడు. ఇదికూడా ఆయన సంఘ సంవిధానంలో ఒక గొప్పతనం. సంస్థానిర్మాణంలోగాని, పరిపాలనా విధానంలోగాని, వివరాలను నిర్ణయించడంలో ఆయన అందెవేసిన చేయి. వివిధరంగాలలో ఆయన నిర్వర్తించిన పనుల ఫలితాలు ఇప్పటికిప్పుడే ఆయన గొప్పతనాన్ని ఘోషిస్తున్నవి. ఇప్పటికిప్పుడే ఆయన పని మొదలు పెట్టిన చోట్ల కలుగపోయే ఫలితాలనుబట్టి ఆయన గొప్పతనాన్ని ముందుచరిత్రయే చాటగలదు.

గాంధీజీ ఖద్దరు స్వదేశీల సిద్ధాంతం ఇండియాకు ఆచరణ యోగ్యమైన కార్యక్రమాన్ని సూచిస్తున్నది. అంబహాంకింకం ఎన్నో ఏండ్లకింద చెప్పినమాట కూడా ఇదే. 'నాకయితే అర్థశాస్త్రమంత ఎక్కువగా తెలియదు. కాని ఇంతమాత్రం తెలుసు:— 'మనం విదేశాలలోని సరుకులను కొంటే మనకు సరుకులు లభిస్తాయి. విదేశస్థులకు సొమ్ము లభిస్తుంది; మనదేశపు వస్తువులనే మనం కొనుక్కొంటే సొమ్ము మనకే ఉంటుంది. వస్తువులూ మనకేవుంటవి.'

## నిర్మాణకార్యక్రమం : సత్యాగ్రహం

గాంధీ ఇటీవల ప్రారంభించిన సత్యాగ్రహంలో(1940 నవంబరు) తిరిగీ నిర్మాణ కార్యక్రమంయొక్క ముఖ్యావశ్యకతను ప్రకటించాడు. వినోబాభావే నిర్బంధంగానీ జవహరలాల్ నిర్బంధంకానీ, యెట్టి శాసనోల్లంఘన ప్రారంభమునకూ సంకేతంగా భావింపరాదని దానికి తగిన జాగ్రత్త వహించాడాయన. ఆయన ఉత్తరువులకు భిన్నంగా చేయబడిన శాసనోల్లంఘనము శిష్టసమ్మత మనిపించుకోదు. ప్రజా

సామాన్యం అత్యుత్సాహంతో నిర్మాణకార్యక్రమాన్ని సాగించడమే ఈ ఉద్యమానికి సహాయంచేయడమని ఆయన వివరించాడు. బ్రిటిష్ ప్రభుత్వమువారిచే ప్రకటింపబడిన ఏ జిల్లా పూర్వచరిత్రను చూచినప్పటికీ, ఆ జిల్లాలోని ఖద్దరక్కడి ప్రజలకు సరిపోగా, మిగిలినది ఈస్టిండియా కంపెనీవారు పైకి ఎగుమతి చేస్తూండేవారనీ, నేడది అపరూపమైపోయిందనీ బోధపడుతుంది. ఇందులోని సత్యం మాయా జిల్లాలకు పోయి చూచినప్పుడు ప్రత్యక్షంగా కనిపిస్తుంది. మచీ తూర్పుగోదావరిజిల్లా అంకెలు మనకళ్లు తెరిపిస్తూన్నవి. 1803 లోను తరువాత నూకోరింగా, కోమరగిరిపట్నం, నీలపల్లి మొదలగు కోస్తా పట్నాలనుండి ప్రతిసంవత్సరము 15 లక్షల రూపాయల విలువగల ఖద్దరుసరుకు ఎగుమతీఅవుతూండేది. ఈఎగుమతులు 1825 నాటికి 10 లక్షలకు దిగిపోయినవి. 1845 నాటికి రెండు లక్షలైతరువాత అసలే లేకుండాపోయినవి. గ్రామస్థులకీ సంగతి బాగా తెలుసు. తమ కోస్తావ్యాపారం పడిపోవడం మూలాన, తమకు కావలసిన బట్టలను పైనుండి దిగుమతీచేసుకోవడం మూలాన, ఈ దరిద్రం పట్టిందని గ్రామస్థు లెరుగుదురు. నేటి ధనప్రవాహం తలక్రిందులయింది. నదులు సముద్రంలో పడే టప్పుడు, మంచినీరంతా సముద్రంలోకి పోతుంది. తిరిగీ సముద్రపు నీరుతో నదీముఖద్వారాలు నిండిపోతవి. ప్రాంతీయ గ్రామాలవారికి నది దగ్గరగా ఉన్నప్పటికీ తాగడానికి మంచి నీరు లభించదు. అలాగే ఇప్పుడా గ్రామాలవారు సీమబట్టలనూ ఉప్పునీరునూ పుచ్చుకోవలసివచ్చింది.

ఇండియాలో ఇప్పుడు కావలసిన 632 కోట్లగజాల బట్టలో 410 కోట్లగజాల బట్ట ఇండియాలోని దేశీయ మిల్లులలోనే తయారవుతూన్నది. 152 కోట్లగజాల బట్టమాత్రం మిల్లు నూలుతో చేమగ్గంమీద తయారవుతూన్నది. 70 కోట్ల గజాలబట్ట విదేశాలనుండి దిగుమతీ అవుతున్నది. ఖద్దరుబట్ట 1 1/2 కోట్లగజాలు మాత్రమే తయారవుతూన్నది. కాబట్టి లంకాషైరు బట్టలదిగుమతి తగ్గిపోవడంవల్ల ఆదావచ్చిన 44 కోట్ల రూపాయిలు గ్రామాలకు పోలేదు. ఆసొమ్ము ధన వంతులను ఇంకా ధనవంతులనుగా చేయడానికీ, పేదవాళ్ళను మఱీ పేదవాళ్లుగా చేయడానికీ మాత్రమే ఉపయోగించింది. విదేశీబట్టల దిగుమతి ఆగిపోయినందున గ్రామస్థుల కుపకారం కలుగలేదు; నగరాలే బాగుపడ్డయి. ఈ సంగతికూడా గ్రామ స్థులు చక్కగా తెలుసుకొన్నారు. కాబట్టి ఖద్దరు ఉత్పత్తికి కావలసిన అన్నిదశలలోనూ - అంటే ఏకడం, ఏకులుతీయడం, వడకడం, నేయడం - ఈ అన్నిటిలోనూ పునరుజ్జీవనం కలిగిం చాలని వారు పట్టుదల చూపిస్తూన్నారు. గాంధీ సత్యాగ్ర హాన్ని మొట్టమొదట్లో ఇద్దరికేమాత్రమే వర్తింపచేయడం వలనకూడా ప్రజలలోని సృజనశక్తి తీవ్రరూపం దాల్చింది. ప్రజలు రాటం చేబట్టినారు. ప్రతివారూ రాట్న పరిశ్రమను పునరుద్ధరించ కోరుతూన్నారు.

## ప్ర జో త్సా హ ం.

ఒకానొకపట్టణం (మచిలీపట్టణం) లోని స్త్రీలు, 50 మంది ముసల్మాను స్త్రీలు, 150మంది తదితర స్త్రీలు రాటాలు తిప్పుతూ

మంచి మజూరీ సంపాదిస్తూన్నారు. కొంతమంది వారు వడి కిన నూలువల్ల వారానికి రు. 0-15-3 లు సంపాదిస్తూన్నారు. ఒక స్త్రీ ఇంట్లోకూర్చొని వారానికి 0-15-3 సంపాదించ గలిగితే, భారత దేశపు ఆదాయం దాదాపు రెట్టింపు అయిం దని చెప్పవచ్చును. ఈ పట్టణంలో సత్యాగ్రహోద్యమ మూల కంగా వేయిరాటాలు పనిచేస్తూన్నవి.

ఎవరి ఏకులు వారు చేసుకొని వడుకుకోవడం ఎవరిఅన్నం వారు వండుకొని తినడంలాంటిది. అంగడిలోకొన్న ఏకులలో చాలా నలకలు, దుమ్ము, గాలి ఉంటుంది. అందువలన బాగా దారం రాదు. ఏకులు అంగడీలో దొరకవు కూడాను. మన బజారులో కావలసినన్ని ఐరోపా అమెరికా దేశాల సరకులు దొరుకుతయిగాని, ఏకులుచేయడానికి ఒకపీశెకు పత్తికావల సినా, నూలు వడకడాని కొక పీసెకు ఏకులు కావలసినా దొరకవు. కాబట్టి మా అంతట మేమొక పనిచేయదలచు కొన్నాము. వేలకొలదీ నూలువడికేవారు మంచినూదీ, ఏకులు కావాలని రోజూవస్తూంటే ఏంచేయాలి? పత్తిలో గింజలు దీయడం, శుభ్రపరచడం, ఏకడం, ఏకులుచేయడం - ఇవన్నీ ముఖ్యంగా పిల్లలూ ఆడవాళ్ళూ చేయదగిన పనులు. మేము కొంతమంది స్త్రీలకీవిషయంలో తగిన శిక్షణ యిచ్చాము. కాని దేశమంతకూ వారు సరిపోరు. మే మెక్కడికిపోయినా వారి స్త్రీలకీవిషయంలో తగిన శిక్షణ యిప్పించవలసిందని కోరడం ప్రారంభించారు. అది జరిగేలోపుగా, హరిజన్ పాఠ శాలలలోని చిన్నపిల్లలు గ్రామాలలో పనిలేకుండా తిరిగే

పిల్లలూ ప్రత్తిని శుభ్రపరచడం మొదలుకొని నూలు తీసేటంత వరకూ అంతపనినీ ఒక్క నెలలో చక్కగా నేర్చుకోవచ్చును. ఒక్కొక్క పిల్లవాడప్పుడు దినానికి నాలుగణాలు సంపాదించగలవాడవుతాడు. ఇది చిన్నవిషయం కాదు. 'సవర్ణ' విద్యావంతులలో నిరుద్యోగతను సృజించిన చదువునే హరిజన బాలురుకూడా చాలా శ్రమపడి జిల్లా ముఖ్యపట్టణాలలోనూ తదితర గ్రామాలలోనూ చదువుతూన్నారు. హరిజనులు మన సానుభూతిని తప్పుగా అర్థంచేసుకుంటారేమో ననే భయంచేత మనముకూడా నిరుద్యోగానికి దారితీసే అర్థంలేని ఆ చదువునే వారినిచదువనిస్తూన్నాము. కాబట్టి హరిజనసంఘాలు తమరక్షణకిందఉన్న హరిజన బాలబాలికలకు వృత్తిని చేకూర్చి పోషించగల విద్యాపద్ధతిని ఆలోచించవలసినతరుణం వచ్చింది. ఏకడం, ఏకులుచేయడంలో ఒకనెలరోజులు శిక్షణయిస్తే ప్రతి బాలుడు, బాలికా నెలకు ఏడెనిమిది రూపాయీలకు తక్కువ లేకుండా సంపాదించగలరు. అయితే ఈ పిల్లల సంపాదన కంటెకూడా గ్రామస్థులకు కావలసిన మంచిపనులను తయారు చేసి యివ్వడం అవసరం కొంతకాలానికి గ్రామస్థులే ఈపనిని నేర్చుకొంటారు. విదేశీబట్టలవల్ల 50 లక్షల మగ్గాలకు పని లేకుండా పోయింది. అంటే ఈ మగ్గాలకు దారం వడికిఇచ్చే 10 కోట్ల రాటాలకు, 25 లక్షలమంది దూదేకేవారికి, 50 లక్షల మంది చాకళ్ళకు, అద్దకంపనివారికి, రంగువేసేవారికి, నేతకు సంబంధించిన తదితర వృత్తులుచేసే మరొక యాభై లక్షల మందికి పనిలేకుండా పోయిందని అర్థం. పూర్తిగా చేతితో

తయారైన బట్టమాత్రమే ఇండియా ప్రజలు ధరించినందువలన తక్షణం 12 కోట్లమంది దేశీయులకు వృత్తి లభిస్తుందని ఈ పై అంకెలనుబట్టి తెలుస్తూన్నది. వారు పెట్టవలసిన పెట్టుబడి ఆయా పనుల ననుసరించి నాలుగణాలనుండి మూడు రూపాయీల వరకూ ఉంటుంది.

వినడానికి వింతగా కనిపిస్తే కనిపించవచ్చునుగాని, ఆధునిక సభ్యత ఎక్కువ అవుతూన్నకొద్దీ నిరుద్యోగత కూడా పెరుగుతూన్నమాట వాస్తవం. అమెరికా సంయుక్తరాష్ట్రాలలో యంత్రసహాయంతో పనిచేసే కూలీల ఉత్పత్తి 1919, 1933 సంవత్సరాల మధ్య నూటికి 71 వంతున పెరిగితే నిరుద్యోగుల సంఖ్య 15 లక్షలనుండి 120 లక్షలవరకూ హెచ్చినట్లు తెలుస్తూన్నది. అనగా నూటికి 800 వంతున పెరిగిందని అర్థం. ఎక్కువగా శాస్త్రజ్ఞానం (Scientific knowledge) వ్యాపించినందువలన మరొక 40 లక్షలమంది నిరుద్యోగులు పెరిగారు. అనగా నాగరికత పెరిగి నూటికి 1250 మంది నిరుద్యోగులను ఎక్కువ చేసిందని అర్థం. భారతీయ నిరుద్యోగులలో వ్యవసాయ నిరుద్యోగుల సంఖ్య 40 లక్షలుంటుందని అంచనా వేయబడింది. ఇప్పుడు మనవాళ్లంతా వ్యవసాయానికి యంత్రాలను ఉపయోగించాలంటూన్నారు. అప్పుడు నిరుద్యోగుల సంఖ్య ఇంకా ఎక్కువ పెరుగుతుంది. నూలు వడికే పని, చేతిమగ్గపు నేత—ఈ రెంటినీ పునరుద్ధరించినందువలన 12 లక్షల మందికి వృత్తి లభిస్తుందని ఇంతకు పూర్వమే చెప్పిఉన్నాము. అదే విధంగా చేతితో దంచిన

బియ్యం, చేతితో విసిరిన పిండి—వీటిని ఉపయోగించినందు వలన రెండు కోట్లమందికి పొట్ట నిండుతుంది. ఇక అఖిల భారత గ్రామపరిశ్రమల సంఘంవారి సిద్ధాంతాన్ని అనుస రించి మనం చేతితో వడికిన నూలు, చేతితో నేసిన బట్ట, చేతితో దంచిన బియ్యం, చేతితో విసిరిన పిండి, చేతితో చేసిన బెల్లం, గానుగలో తయారైన నూనె, చేతితో తయా రైన కాగితం ఉపయోగిస్తే ఇండియాలో నిరుద్యోగ సమస్య ఉండనే ఉండదు. అప్పుడు గ్రామాలు స్వయం సంపూర్ణ ములై నూతన సంఘ వ్యవస్థ ప్రారంభ మవుతుంది. ఈపైన పేర్కొనబడిన ఏడున్నూ జాతీయ పునరుజ్జీవనానికి, గ్రామ పునర్నిర్మాణానికీ 'సప్తాక్షరి'.

## చేతినూలు - మిల్లునూలు

మిల్లునూలుతో, చేతినూలు సన్నదనంలో ఎంతవరకు పోగలదని ఒక స్నేహితుడడిగాడు.

ఈవిషయం చారిత్రక కౌతుకాన్ని రేకెత్తించి చేనూలు పరిశ్రమ ఉచ్ఛదశలోనుండి, జనసంఖ్య నానాటి కభివృద్ధి అవుతూన్న తొలిరోజులను జ్ఞాపకం చేస్తుంది. పాఠకు లీవిషయం తెలుసుకోవలెనని కుతూహలపడుతూంటారు.

దేశంలో కొంతవరకు మిల్లులు స్థాపించబడి, చేతితో ఉత్పత్తి అయిన సరుకులను సాగనంపి మిల్లుబట్టలు ఆంగళ్లను ఆక్రమించిన పిమ్మటనే ఒకప్పుడు మిల్లునూలుతో చేతి నూలును పోల్చిచూడడ మనే ప్రశ్న ఉదయించింది. ఆరోజు

లలో మజ్లిన్ల నూలువంటి సన్ననూలును మిల్లులు తయారు చేయగలవని అనుకొంటూండేవారు. మజ్లిన్లను అనుకరించాలనికూడా ప్రయత్నాలు జరిగినయి. కాని అపజయం పొందారు. మిల్లు మజ్లిన్లను, అసలు మజ్లిన్లను పోల్చిచూచిన ఫలితాలు వాట్సన్ వ్రాసిన 'టెక్స్టయిల్ మ్యానుఫ్యాక్చరర్స్' లో ఉదాహరింపబడినవి. దానిని 1866లో ఇండియా కార్యాలయంవారు ప్రచురించారు.

వాట్సన్ మూడు మజ్లిన్ ముక్కలను పరీక్షించి వివరించాడు. ఒకటి థామస్ హోల్డ్సువర్త కంపెనీవారు తయారు చేసిన ఫ్రెంచి మజ్లిన్ 440 నెంబరుది. ఇది 1862 అంతర్జాతీయ ప్రదర్శనంలో ప్రదర్శింపబడింది. రెండోది 1851 అంతర్జాతీయ ప్రదర్శనంలో ప్రదర్శింపబడిన ఇంగ్లీషు మజ్లిన్. దాని నెంబరు 540 అనిఅన్నారు. మూడోది ఇండియన్ మ్యూజియంలోనుండి తీసిన అసలు డక్కా మజ్లిన్ 404 నెంబరు 'మల్మల్ ఖాస్' ఇంగ్లీషు మజ్లిన్ ముక్క 540 ఉండదని తగాదావచ్చింది. "ఈ నెంబరు యధార్థతనుగూర్చి సందేహించడానికి మంచి కారణముం" దన్నాడు వాట్సన్.

## డక్కా నూలు

కాని ఈ నెంబర్లను గూర్చిన నిర్ణయాలు అంత్య నిర్ణయాలని చెప్పడానికి వీలులేదు. ఇవి నూలును పరిశీలించి నిర్ణయించినవి కావు. నేసినబట్టను పరీక్షించి నిర్ణయించారు. నేసేటప్పుడు నూలుకు గంజి పెడతారు. తరువాత ఉతుకు

లలో గంజితోపాటు నూలు చిక్కదనంకూడా కొంతపోతుంది. అందువల్ల మొట్టమొదటి నూలు బరువు కొంత తగ్గవచ్చును. ఉతికిన తరువాత బట్టలకు మళ్ళీ గంజి పెట్టవచ్చును. కాబట్టి ఈ అన్ని దశల ఫలితాలను వివిధ విధాలుగా మార్పుచేస్తవి. అందువల్ల నెంబరు కనుక్కోవడానికి మామూలుగా ప్రయోగించే ఉపాయాలవల్ల నిజం తేలడం కష్టం. నూలు నమూనాలను సూక్ష్మదర్శినీ పరీక్షకు పంపి దారపు వ్యాసం, (diameter) దారంలోని యేసుల (filaments) సంఖ్యనూ పరిశీలించవలెనని సూచించబడింది అలా చేసిచూచినప్పుడు 'ఢక్కాసూలు వ్యాసం అత్యంత సున్నితమైన ఐరోపా ఖండపు నూలు వ్యాసం కంటె' తక్కువగా కనిపించింది. 'ఐరోపాఖండపు దారంలోని యేసుల సంఖ్యకంటె ఢక్కాదారంలోని యేసుల సంఖ్య చాలా తక్కువ' అని కూడా తేలింది. ఢక్కాదారంలో ౭ యేసులుంటే మిల్లుల దారంలో 14 యేసు లున్నవి. కాని, ఒకే యేసుగల ఢక్కాదారం వ్యాసం ఎక్కువ పెద్దది. ఈ ఒకే యేసు దారాలు మిల్లుబట్టలను నేసే 'సీ-ఐలెండు' పత్తి దారాల యేసులకంటె ఎక్కువ బలవత్తరములుగా ఉంటవి. 'ఢక్కాదారంలో తక్కువ యేసు లుండడమే అది ఎక్కువ సన్నంగా ఉండడానికి కారణం; వడికే పద్ధతివలనకూడా ఆ దారం ఎక్కువ గట్టిగా నొక్కుకొంటుంది. కాని, అందువలన విశేష ఫలితం కలుగుతుందనుకోవడానికి వీలులేదు' అని పరిశోధకులు నిర్ణయించారు. అయితే దీనితో సరిపోయిందనుకోకండి. మిల్లుల

మీదకూడా సన్నంగా దారం వడికి నేయవచ్చునని చూపించ డానికి మాత్రమే మిల్లుమగ్గాలు ప్రదర్శింపబడినవి. కాని అవి చాలా ముగ్గులంగా ఉండడంచేత ధరించడానికి పనికి రావు. 'ధరించడానికి ఈ సన్నని యూరోపియను మిల్లు మజ్లి నులు ఏమాత్రమూ పనికిరావు. ఇండియాలో చేతితో తయా రయినవి చిరకాలం ఉపయోగించడమేకాక, చాలా ఉతుకు లకు కూడా ఆగుతయి. ఇంగ్లీషు మజ్లినులుగానీ, తదితర యూరోపియన్ మజ్లినులుగానీ ఆగవు.'

డక్కాపత్తిలోని గుణమే డక్కానూలు ఆధిక్యతకు కొంత కారణమని పరీక్షకులు నిర్ణయించారు. సీ-ఐలెండుపత్తి లోని యేసులు ఎక్కువ పొడుగు, ఎక్కువ సన్నమూను. డక్కాపత్తి యేసు (fibres) ఎక్కువ పొట్టి, ఎక్కువ మంద మూను. ఒకేనెంబరుగల రెండు దారాలను పరీక్షచేస్తే డక్కాదారం ఆధిక్యత వహించింది.

బహుశా ప్రయోగ ఫలితాల వల్లనే డక్కా మజిలిను లను అనుకరించాలనే ప్రయత్నం విరమింపబడిం దనుకొం టాము. సీ ఐలెండు పత్తితో మిల్లుమీద తీయగలిగిన దారం 300 నెంబరుకు మించదని తెలుసుకొన్నారు. కాబట్టి మిల్లు మీద 300 నెంబరుకంటె ఎక్కువ సన్నంగా తీయడం సాధ్యం కాదనీ, చేతితో 400 నెంబరు దారంకూడా తీయ వచ్చుననీ తెలిసింది మన కిప్పటికి. కాని ఇదే డక్కానూలు సన్నదనానికి పరమావధి అనుకోకండి! డక్కా నూలు 700 మొదలు 1,000 నెంబరువరకుకూడా ఉన్నట్లు చదివాను. ఇది

నిజం కావచ్చుకూడా. 9 యేసులు గల డక్కా దారం 400 నెంబరుకు వచ్చిందంటే 5, 4, 3 యేసులుగల దారం 600 మొదలు 1000 నెంబరువరకూ రావడం ఎందుకు సాధ్యం కాదు.

అయితే డక్కా మజిలిన్ కుపయోగించిన దూదిని మిల్లులు కూడా ఉపయోగిస్తే అంత మంచి నూలూ రావచ్చునని కొందరు వాదించవచ్చును. కాని అది నిజం కాదు. డక్కా మజిలిన్ దూది మిల్లులలో ఉపయోగించి చాలా ఆశాభంగం పొందారు.

## మిల్లునూలులో మఱీ సన్నని నూలు

ప్రస్తుతం సీ ఐలెండు పత్తినుండి తీసిన మిల్లునూలులో మఱీ సన్నని నూలు 300 నెంబరుకు మించిలేదు. ఇది సాధించడానికి తగిన పరిమితి మొదటి రకపు పత్తిఅయితేనే ఈ నెంబరు వరకూ నూలు తీయడం. సాధ్యం. సీ ఐలెండులో కొంచెం తక్కువ రకపు పత్తి లేక ఫ్లోరిడా పత్తి, సీ-ఐలెండులో 'జార్జియా' రకం పత్తి, ఈజిప్టుదేశపు అతి నాజూకు పత్తి (the finest) — ఈ రకాలను ఉపయోగిస్తే పడుగు నూలుకు 100 లేక 70 నంబరు తయారవుతుంది. పేకకు 120 నెంబరు వరకూ తయారవుతుంది.

(The world's cotton crops, 1923 : Todd.)

డక్కాలోనే కాకుండా ఇండియాలోని ఇతర ప్రదేశాలలోకూడా స్థానికంగా పండిన పత్తివలన ఎక్కువ సన్నని

నూలు తయారయింది. అయితే డక్కా నూలు సన్నదనాని కెక్కడా సాటిలేదు.

1867 నాటి బీరారు మధ్యరాష్ట్రాల పత్తిశాఖా కార్య దర్శి నివేదిక నుండి (The report of the Operations of the Cotton Department of the Central provinces, Berar 1867) ఈ భాగం ఉదాహరిస్తున్నాము.

> నాగపూరు, జబ్బల్‌పూరు, అకోలా పట్టణము లందలి ప్రదర్శనాలలోని నూలు, అక్కడ ఎదురుగా కనిపిస్తూన్న ముత్తాతలనాటి మోటు రాట్నం మీద గ్రామస్థులు చేతితో వడికినదని చెప్పి ఒప్పించడం కష్టమై పోయింది. అకోలాలో నేను ప్రదర్శించిన పల్లెటూరి చేతినూలు అత్యంత సున్నితంగా ఉంది. అటువంటిది ఒక పౌను దారం 117 మైళ్ళ పొడవు ఉంటుందని లెక్క కట్టాను.

పౌను నూలు పొడుగు 117 మైళ్ళుంటే, నూలు నెంబరు 240–250 ఉంటుంది. ఈ సంగతి అనుగుణ పరాలో ఉదాహరింప బడింది. అందులో ఇంకా కొంత భోగట్టాకూడా ఉంది.

> 400 నెంబరు నూలు వడికినట్లుగా రికార్డులో ఉంది......పైన ఉదాహరించిన చాందా నమూనా, ఇంగ్లీషు లెక్క ప్రకారం 244 నెంబ రవుతుంది. ఇది ఢేరులు ఉత్పత్తిచేశారు. సన్నని ధోవతులకు పనికి వచ్చే 140 నెంబరు నూలు నాగపూరులోనూ, ఓమ్రాయర్‌లోనూ సాధారణంగా వడుకుతూనే ఉంటారు.

ఆ ఢేరు లెక్కడికి పోయినారు? ఆ పత్తి, ఆ ధోవతులూ యేమయినవి? డక్కా మజిలీవలెనే యంత్రాల దండయాత్రతో అవన్నీకూడా తుడిచిపెట్టుకొనిపోయినవి. 1867 నివేదికలో ఉదాహరింపబడిన నాగపూరు ప్రదర్శనాలు నిజానికి

బ్రిటిష్ మిల్లుబట్టలను ప్రచారం చేయడాని కేర్పాటు చేయబడ్డవి. మధ్యరాష్ట్రాల ప్రజలకు కావలసిన బట్ట అంతా దాదాపు అక్కడే తయారవుతూండేది. అందువల్ల మిల్లులు ఎక్కువగా పోటీచేయవలసి వచ్చింది.

1864 డిశంబరు నివేదికనుబట్టి జమూరుఘాటులో (చాందా) వారం వారం జరిగే సంతకు వివిధ తరగతుల వర్తకులవి 521 దుకాణాలు వచ్చేవనీ, అందులో 5 మాత్రమే సీమబట్టలను అమ్ముతూండేవనీ ఈ దిగువ వివరాలనుబట్టి తెలియగలదు.

| | | |
|---|---|---|
| ౧ | ఖరీదుగల తలపాగాలు, ధోతీలు, శాలువలు మొదలయినవి - దేశీయులు తయారుచేసినవి అమ్మే దుకాణాలు ... ... | 25 |
| ౨ | సీమబట్టలు అమ్మే దుకాణాలు ... | 5 |
| 3 | కోష్టీలు-సన్నని దేశీయ వస్త్రాలను నేసేవారు | 110 |
| ౪ | రంగ్ రేజ్ - రంగులు వేసేవారు, రంగులు అద్దకాలు వేసిన దేశీయ బట్టలదుకాణాలవారు | 26 |
| ౫ | స్త్రీలకు కావలసిన రంగు బట్టలమ్మే సేల్వారు దుకాణాలు ... | 5 |
| ౬ | ఢేకులు సొంతంగా తయారుచేసికొన్న ముతక బట్టల దుకాణాలు ... | 350 |
| | మొత్తం | 521 |

ఇందులో 44 మంది వ్యాపారం వృత్తిగాగల పెద్ద వర్తకులు. వారు సంతకు బళ్లమీద సరుకులు తెచ్చుకొని రెండు రోజులు నిలవ ఉండేవారు. మిగిలినవారు పేదవాళ్లు. వాళ్లు చిన్న చిన్న మూటలను

వీపులమీద మోసుకొని వచ్చేవారు. వారి అవస్థకూడా తక్కువేనే.

దేశంలో తయారయిన ఆ ఖరీదుగల తలపాగాలను ధోవతీలను అమ్మే వర్తకు లేమయినారు? చాందాజిల్లా, చిమ్మూరు పరగణాలోని జమూరుఘాటా వారి సంతలకు వస్తూండే ఆ 'కోష్టిల' 'రంగరేజ్' 'సేల్యారుల' 'ఢేరుల' దుకాణా లేమయినవి?

రాష్ట్రవాణి 31—10—40

## నూలు వడకడమే తుది శరణ్యం

హరిజన్ నుండి :

నిన్న మొన్నటివరకూ నిరంతర దారిద్ర్యబాధనుండి ఎలాగో తప్పించుకొని, ఏరోజు కారోజు కావలసిన అన్నం సంపాదించుకోవడానికి నిరుపేదలకు నూలు వడకడం తుది శరణ్యంగా ఉండేది. ఇది ఒక ఇండియాలోనే కాదు. అరేబియాలోను, పశ్చిమ ఆశియాఖండమునందలి తదితర దేశముల లోనూకూడా ఇంతే. అరబ్బీభాషలో వ్రాయబడిన ఒక భక్తుని కథ నుండి (అలీఫ్ లాయలావాలాయలా) ఈ సంగతి చక్కగా వ్యక్తమవు తుంది. సర్ రిఛార్డు బర్టన్ నేటి కనుగుణంగా కొద్ది మార్పులతో ఆ కథకు వ్రాసిన అనువాద మిది:-

> ఒకప్పుడొక భక్తుడైన యూదు డుండేవాడు. అతని కుటుంబం నూలు వడుకుతూండేది. ప్రతిరోజూ ఆయన బజారుపోయి నూ లమ్మి, దూది కొనుక్కొని మిగిలిన డబ్బుతో కుటుంబానికి కావల సిన ఆహారం కొనుక్కొంటూండేవాడు. ఒక ఉదయం మామూలు ప్రకారమే ఆయన బజారుపోయి ఆనాటి నూలు అమ్మిన తరువాత

తనవంటి నిరుపేద సోదరుడే కనపడి ఆక లవుతూందన్నాడు. అప్పు డానూలు విక్రయించిన డబ్బు ఆయన కిచ్చివేసి ఇంటికి వట్టిచేతులతో వచ్చాడు. అప్పుడు కుటుంబంలోవారు "దూదేమయింది? మన ఆహార మేమయింది"? అన్నారు. "మనవంటివాడే ఒక సోదరుడు కనబడి ఆకలిగా ఉందన్నాడు. ఆయన కానూలు డబ్బిచ్చివేశాను" అని జవాబుచెప్పాడు. 'ఇప్పుడు మన మేమి చేయాలి? అమ్మటందు కైనా ఇంకేమీలేదే' అన్నారు వారు.

(హరిజన్ 11 జనవరి 1936)

## మిల్లుబట్ట - ఖద్దరుబట్ట

ఖద్దరు స్వదేశీ ప్రదర్శనాలలో మిల్లుబట్టను ఎందుకు వెలి వేయవలసి వచ్చింది? మిల్లుబట్టకూడా స్వదేశీయే కదా! కాంగ్రెసు సంఘాల కార్యకర్తలను మిల్లుబట్టల నెందుకు కట్టుకోనీయరు? అని అనేకమంది ప్రశ్నిస్తూంటారు. మిల్లుబట్ట ధనవంతుల పెట్టుపోతలలో పెరుగుతూన్నది గనుక, మన పేదల ప్రదర్శనాలలో దానికి ప్రకటన అనవసరం. కాంగ్రెసులో ఎన్నికస్థానాలకు నిలబడేవారు ఖద్దరు కట్టితీరాలి అనే నిర్బంధమున్నమాట నిజమే. ఖద్దరువల్ల పేదలకు అన్నం దొరుకుతుంది; ఖద్దరువల్ల నగరాలలోని డబ్బు పట్టణాలకూ, అక్కడనుండి పల్లెటూళ్లకూ పోతుంది కనుక ఆ నియమ మేర్పాటుచేయబడింది.

కాని కొంతమంది బాధ్యతగల మనుష్యులే ఇటీవల మిల్లు బట్టను ఉపయోగిస్తూన్నారు. మిల్లుబట్టల ఉపయోగంలోని,

ఆర్థిక నైతిక భావాలను చాలామంది అర్థంచేసుకోవడంలేదు. 'అది మాత్రం స్వదేశీకాదా' అని అడుగుతారు వారు. 'అవును స్వదేశీయే' కాని స్వదేశీ అయినదల్లా పేదవాడికి ఉపయోగకారికాదు. బ్రిటిష్‌సామ్రాజ్యతత్వంనుండి దేశాన్ని రక్షించుకొనేటందుకేగాక భారతీయ పెట్టుబడిదారులనుండి తప్పించుకోవడానికికూడా తగినట్లు మన సంఘవ్యవస్థ పునర్నిర్మాణం కావాలి.

మిల్లులన్నీ గొప్పగొప్ప ధనవంతులవి. వాటిలో పని చేయడానికి గ్రామాలనుండి కూలిజనంవస్తారు. పల్లెటూళ్లలో ఉన్నప్పటి వారి జీవితాన్ని మిల్లులలో పనిచేసే నాటి జీవిత పరిస్థితులతో పోల్చి చూస్తే, ఆ భేదం మీకు దుఃఖం కలిగించక తప్పదు.

మిల్లుకూలీలకు చేతులు తప్ప—తలకానీ హృదయంకానీ ఉంటుందనుకోరు. అందువల్లనే వారిని 'మిల్ హ్యాండ్సు' అంటారు ఇంగ్లీషులో—వారికి కల్పనాశక్తి నశిస్తుంది. వాళ్లేవస్తువునూ మొదటినుండి చివరదాకా తయారుచేయరు. వాళ్లు యంత్రానికి సరుకు లందించడమో; దారం తీయడమో; ప్యాకెట్లు లెక్క పెట్టడమో, పనిముట్టుకు నూనె రాయడమో, తిప్పడమో, చుట్టడమో యేదో చేసేసరికి రోజు గడుస్తుంది. సాయంకాలానికి వాళ్ళు మజూరీకోసం యెదురుచూస్తూంటారు కాని చేసిన పనివంక చూడరు. నిర్జీవమైన వస్తువుకు దేనికీ సరియైన చక్కని రూపమిచ్చి సజీవంగా తయారుచేసే భాగ్యంలేదు వారికి.

ఒక శిల్పిని తీసుకోండి. ఆయన ఒక కఱకు రాతిముక్క పుచ్చుకొని దానిలో చక్కని విగ్రహాన్ని చెక్కుతాడు. లేదా పూవులూ, లతలూ చిత్రిస్తాడు. సాలీని తీసుకోండి. సాయంకాల మయ్యేసరికి చక్కని బట్టను నేసుకొంటాడు. అది అతనిది. అతను కట్టుకోవచ్చు. అమ్ముకోవచ్చు. తాకట్టు పెట్టుకోవచ్చు. కొడుకు పెళ్ళికి దాచుకోవచ్చు. మిల్లుకూలీ దినమంతా అసంతోషదాయకములగు అసహజ పరిస్థితులలో పనిచేసి తన కూలిలో సగమో, ముప్పాతికో తాను పడ్డ కష్టం తెలియకుండా ఉండేటందుకు తాగి ఇంటికి పోతాడు. మానవచిత్తానికి ఆనందం కలిగించేది కేవలం కూలిడబ్బు కాదు. చేసే పనివల్లనే కలుగుతుంది ఆనందం. మిల్లుకూలీకి ఆ ఆనందం ఎలా ఉంటుందో తెలియదు.

ఇక నైతికదృష్టితో ఆలోచిద్దాము. మిల్లులో పనిచేసే కూలీలలో ఒకే కుటుంబంలోని స్త్రీపురుషులు చీలిపోవడము, వేరువేరు కుటుంబాలలోని స్త్రీపురుషులు కలసి పనిచేయవలసి రావడమూ తటస్థిస్తుంది. మిల్లులలోని కూలీల కుటుంబాలు కళాకౌశలాన్ని ప్రదర్శించేటందుకు శ్రుతికలసి పనిచేసే ఒకే వర్గంగా ఉండదు; కేవలం విచ్ఛిన్నమైపోతుంది. తల్లులఒడి లోని బిడ్డలవిషయంలోకూడా అంతే. మిల్లులలోని కూలీలు కూడా సరుకులవలెనే ఒకే మూసలో తయారవుతారు. కుటీరపరిశ్రమలలో గృహమర్యాదలకు భంగం రాకపోవడమే కాక ఎవరు తయారుచేసుకొన్న వస్తువు వారిదే అవుతుంది.

మిల్లుబట్ట చౌక అని చెప్పుకొంటారు జనం. కాని ఈ చౌకదనంలోనే తమ ప్రక్కనున్న పేదల చావు ఉందని వారికి తెలియదు. మిల్లు 15000 చదరపు గజాల బట్టను ప్రతి రోజూ తయారుచేస్తుందని సంతోషిస్తారే కాని 1,000 మంది సాలీలవృత్తి నాశనమయిందని గమనించరు. సాలీలు పని లేని జనంలో చేరారు. ఇండియాలో వ్యవసాయం తరువాత పెద్ద పరిశ్రమ నేత. జీవితానికి ఆహారం తరువాత బట్టేకదా కావలసింది. కాబట్టి మీరు ఆహారపదార్థాలను, వస్త్రాలను దిగుమతీచేసుకోవడం ప్రారంభించినప్పటినుండీ మీ ముఖ్య పరిశ్రమలు రెండూ పాడయిపోయినయి అందువలననే మేము దేశంలో పండిన పంటను తిని, చేతితో నేసిన బట్టను కట్టుకోవలసిందని ప్రజలకు సలహా యిస్తున్నాము.

చేతితో నేసిన బట్టను ఉపయోగించడం ఉచితమైతే మిల్లుబట్టను ఉపయోగించడంకూడా ఉచితమే అంటారు కొంతమంది. మేమది ఒప్పుకోము. చేతితో నేసిన బట్టలను ఉపయోగించినందువలన సాలివానికి వృత్తి లభిస్తుంది. కాని గ్రామాలలో దిక్కులేకుండా ఉన్న అనేకమంది వితంతువులకు పోషణ జరగదు.

పైగా మిల్లు యజమానులయొక్కయు, మిల్లుయేజెంట్లయొక్కయు ఐశ్వర్యం, వారి పెట్టుబడి, వారి ఉత్పత్తి, వారి కమీషను, వారి లాభాలు, వారి బంగళాలు, వాళ్ళ క్రీడా సరోవరాలు, వాళ్ళ మోటార్లు, గుర్రాలు, వాళ్ళ వేసంగి ప్రయాణాలు, ఖండాంతర యాత్రలు, వాళ్ళ భోగాలు.

వాళ్ల దుబారాఖర్చులు—ఇవన్నీ చూస్తే మీరిలా అనరు. గ్రామాలలో కడుపు నిండా అన్నం, వంటినిండా బట్టా లేని వాళ్లను అన్యాయ్యంచేసి వీళ్లకా మీరు సహాయం చేస్తారు? వీళ్లకు మీ సహాయం కావాలా అసలు?

## మిల్లుబట్ట - చేనేతబట్ట

మిల్లు పరిశ్రమ ఇండియాలోని చేనేత పరిశ్రమకు పోటీ. ఈ పోటీని తగ్గించడమునకే స్వచ్ఛమైన మిల్లుబట్టల దుకాణదారులను మద్రాసులోని కాంగ్రెసు ప్రభుత్వం లైసెన్సులు తీసుకోవలసిందని కోరింది. ఈ చట్టంవలన గొప్ప ఫలితాలు కలిగినవని మేము చెప్పడంలేదు. కాని ఈ రెండు రకాల బట్టలకు పోటీ ఉందని మాత్రం హెచ్చరించడాని కది ఉపయోగపడుతుంది. ఈ సందర్భంలో మిల్లుయజమానుల అభిప్రాయాలు, చేనేత పరిశ్రమను ప్రోత్సహించవలెనన్నవారి అభిప్రాయాలు ఒకచోట పెట్టి పోల్చిచూడవలెనని కుతూహలపడుతూన్నాము.

> చేనేత పరిశ్రమను సంరక్షించవలెనన్న సందర్భంలో, ఇండియాప్రభుత్వంవారికి బెంగాలు మిల్లుయజమానుల సంఘంవారు వ్రాసిన ఉత్తరమునందు చేనేత పరిశ్రమ చక్కగా సంస్థాపింపబడలేదన్న అభిప్రాయాన్ని వెల్లడించారు. దేశీయవస్త్రపరిశ్రమపైన అప్పుడప్పుడు వేస్తూవచ్చిన పన్నులభారమును పరిశీలిస్తే ఇక కొత్తపన్నులు వేయడానికి సావకాశం లేదని ఆ సంఘం మొఱపెట్టుకొన్నది. మిల్లులో తయారైన దేశీయవస్త్రాలపైన యేమైనా పన్ను వేసినట్లయితే అందు

వల్ల కలిగే నష్టాన్ని భరించడానికి, దేశంలోకి దిగుమతిఅయ్యే, అటు వంటి సరుకు లన్నిటిమీద సముభారపు పన్ను వేయవలసి ఉంటుం దని ఆ సంఘం కోరింది. దీని ఫలితంగా అన్ని బట్టలకు — చేనేత బట్టలుకానీ, మిల్లుబట్టలుకానీ — స్థానికంగా తయారైన బట్టకానీ — దిగుమతి అయిన బట్టకానీ — ధర పెరుగుతుంది. ప్రజలకు కొనుక్కొనే తాహతు లేనందువలన అసలు బట్టల ఖర్చే చాలా తగ్గి పోతుంది; బెంగాలు మిల్లులు వివిధ రకాల బట్టను తయారుచేయడం లేదు. రెండు మూడు రకాలను మాత్రమే తయారుచేస్తున్నవి. అందువల్ల అవి ఆర్థికంగా అంత లాభదాయకం కాని స్వల్పద్రవ్యంతో పనిచేయవలసివస్తూన్నది. అటువంటప్పుడు ఉత్పత్తి చేసే రకాలనుబట్టి పరిమితిని యేర్పాటుచేయడమంటే స్థానిక మిల్లులను మూసివేయమని చెప్పడం. అంతేకాక నూలుపైన పన్నును తగ్గించనట్లయితే దేశీయ మిల్లులను విదేశసరుకుల పోటీకి గురిచేసి అభివృద్ధిపొందుతూన్న దేశీయపరిశ్రమను చేతులారా చంపడమవుతుంది.

ఇక చేనేత పరిశ్రమ ముడిసరుకులను సంపాదించుకొంటూన్న నరతులు దానికి లాభకరమైనవికావు. ఆ పరిశ్రమ కేవలం షాహు కారు దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి ఉంది. దానికి తగిన పెట్టుబడిలేదు. తగిన అంగళ్ళు లేవు. అంతేకాదు, కావలసినంత కాలం, శ్రమ, బలం నూలు చేయడంలోనే వృథాఅయిపోతూన్నది. 'గవర్నమెంటు తనిఖీకింద సహకార క్రయ సంస్థ స్థాపింపబడి నేత గాళ్ళకు ఉచితమైన ఖరీదులలో ముడిసరుకులను సప్లయిచేయడానికి సహాయపడినట్లయితే వాళ్ళకు కొంత ఉపకారం కలుగవచ్చును. 'చేనేతపరిశ్రమకు ప్రథమంలోచేయవలసిన పనులను నిర్వర్తించడానికి అక్కడక్కడా ఆవిరియంత్ర కేంద్రాలను నిర్మించడం మంచిది' అని ఆసంఘం సూచిస్తున్నది.

## ఖాదీనిగూర్చి గుల్జరీలాల్ నందా

హిందూదేశపు యంత్రాలు 50 కోట్ల విలువగల బట్టను ఉత్పత్తి చేస్తవి. ఇందులో షుమారు 10 కోట్ల రూపాయిలు కూలికింద ఖర్చు అవుతుంది. అంతే ఖరీదుగల ఖాదీ 35 కోట్ల రూపాయీలు కూలికింద వెచ్చించవలసివస్తుంది. అదే పరిమాణంగల ముడిపత్తితో తయారైన ఖాదీ ఇప్పటి పరిస్థితులలో నూరు కోట్ల రూపాయీలకు అమ్మవచ్చును. అందులో 70 కోట్లు కూలికి వెచ్చించబడుతుంది. బట్ట ఖరీదు 50 కోట్లు పెరిగితే కూలికింద యిచ్చే వైకం 60 కోట్లు పెరుగుతూన్నది. అంటే ఖాదీలో పనిచేసే కూలీల సంఖ్యకంటె చాలా తక్కువమంది కూలీలను నియమించి పనిచేస్తూన్న మిల్లులు కూలీలో మిగిల్చే 60 కోట్ల రూపాయీలలోను 50 కోట్లుమాత్రమే కొనుక్కునేవాళ్ళకింద వినియోగపడుతూన్నదనీ, మిగిలిన 10కోట్లు అధిక బాడుగలు, వడ్డీలు, లాభాలకింద పోతూన్నదనీ అర్థం. అంతే కాదు; ఖాదీకి తీసికొంటూన్న ఎక్కువ ధరవలన దేశమంతటిలోనూ కొనుక్కొనేవాళ్లు కొనుగోలుశక్తి తగ్గిన 50 కోట్లున్నూ తేరగా వచ్చే లాభాలనుండీ, పన్నులనుండీ 10 కోట్ల రూపాయిలున్నూ— ఈ మొత్తం అంతా ముఖ్యంగా పల్లెటూళ్ళలో కూడులేని కూలీలకు, రైతులకు చేరుతూన్నదనికూడా తెలుసుకోవాలి. ఎక్కువ ధరపెట్టి కొనడంవలన పట్టణాలలోని ధనవంతులు ఖాదీకి వెచ్చించిన అధిక మొత్తమున్నూ, మిల్లుబట్టల ధరలలో చేర్చబడిన లాభాలు వడ్డీలు వగైరాలు మిగిలిపోయినందున కనపడే ఆదా 10 కోట్ల రూపాయలునూ గ్రామస్థుల కొనుగోలు శక్తిని ఎక్కువచేస్తూన్నవి. అయితే మిల్లుబట్టకు బదులుగా ఖాదీబట్టను ఉపయోగించడంవల్ల గ్రామస్థుల కర్యే బట్టలవ్యయం పెరిగేమాట వాస్తవమే. కాని ఖాదీ ఉత్పత్తి

వలన వారికి పుట్టే ఎక్కువ మజూరీ వారి ఖాదీబట్ట కయ్యే ఎక్కువ వ్యయం కంటె అధికంగానే ఉంటుంది. నిజానికి బట్టల విషయంలో తిరిగీ వారు స్వయం సంపూర్ణతను పొందడానికి ఈ మార్పు చక్కగా ఉపకరిస్తుంది. మిల్లుబట్టనుండి ఖాదీ బట్టలకు మారినందువలన పట్టణస్థుల కొనుగోలు శక్తి కొంత తగ్గి గ్రామస్థుల కొనుగోలుశక్తి కొంత హెచ్చుతుంది. అనగా పట్టణాలలో భోగాలకు తమాషాలకు వెచ్చించే డబ్బు గ్రామాలలో ఆరోగ్యానికీ, సత్తువకు కావలసిన వస్తువులను, నిపుణులను సంపాదించుకోవడానికి ఉపకరిస్తుంది. ఖరీదు హెచ్చడంవలన బట్టలు కొనడం కొంత తగ్గుతుంది నిజమే కాని అందువల్ల దేశంలో కావలసిన బట్టకంటె ఎక్కువ బట్టలను ఉపయోగించే అలవాటు చాలావరకు పోతుంది. అంటే ఈవాదం విదేశబట్టలవిషయంలో ఇంకా ఎక్కువగా వర్తిస్తుంది. విదేశీబట్టలు తయారుకావడంలో పుట్టిన కూలి అంతా ఇండియాలో కూడులేని కష్టజీవుల కడుపుగొట్టి వా రెరుగని భోగా లనుభవిస్తూన్న విదేశీ కూలీలకే ముడుతూన్నది. మిల్లు పరిశ్రమలో వెచ్చించబడే కూలి రోజుకు సగటున ఒక్కొక్కనికి 10 అణాలవంతున 4 లక్షల మందికి పుట్టుతూన్నది. ఖాదీ రోజు 1కి సగటున మనిషికి 0-3-0 చొప్పున షుమారు కోటిమందికి 70 కోట్ల రూపాయీలు మజూరీకింద యిస్తూన్నది. అంతేకాదు. మిల్లుకూలీకి పుట్టిన ప్రతి రూపాయలోనూ చాలా భాగం వడ్డీకిందగానీ, అద్దెకిందగానీ, లాభంకిందగానీ తిరిగీ ధనవంతులకే చేరుతూన్నది. గ్రామానికి పుట్టిన ప్రతిరూపాయి జీవనాధారములయిన వస్తువుల ఉత్పత్తికి సహాయంచేసి స్థయిర్యాన్ని చేకూరుస్తున్నయి.

ఖాదీ అంతర్జాతీయశాంతికి ముఖ్య సాధనమని ఆయన చెప్ప బోతూన్నాడు చూడండి:—

> మిల్లుబట్టకలన పని లేకుండా పోయిన ఇండియాలోని కష్టజీవులందరూ యంత్రోత్పత్తికి పూనుకొన్నట్లయితే, ఇండియాకు ఏడాది పొడుగునా కావలసిన బట్ట తయారుకాగా, ప్రపంచ మంతటికి చాలా ఏళ్ల వరకు సరిపోయేటంత బట్ట సిద్ధమవుతుంది. ఇండియాలో మిగిలి పోయిన బట్టను ప్రపంచంలోని యితర దేశాలమీద రుద్దగలిగినట్లయితే ఆయా దేశాలలోని లక్షలాది ప్రజల పని పోయి వారికి బ్రతుకు తెరువుండదు. యంత్రోత్పత్తివలన యేదో ఒక జాతిలోని కొంతమంది వ్యక్తులకో, కొన్ని సంఘాలకో జీవనం పోవడమే కాదు, జాతుల ఐక్యత, రక్షణ, స్వాతంత్ర్యం, ఆనందం ఇవన్నీ నశిస్తాయి.

ఇక ఆయన ఖాదీ సంస్కృతినిగూర్చి ఇలా అన్నాడు.

> చేతి పనిచేసే బతుకు తన వస్తువులలో తన సహజ ప్రకృతిని ప్రవేశ పెడతాడు. యంత్రం దూరదేశాలకోసం ఉత్పత్తి చేస్తుంది. ఉత్పత్తి దారుడూ, కొనుక్కునేవానికి పరస్పర సంబంధంగానీ మొగమోటం గానీ ఉండదు. కాబట్టి యంత్రంలో తయారైన వస్తువులు ఆత్మరహితములు.

ఖాదీ అర్థశాస్త్రంపైన ఆయన వ్రాసిన విషయాలుకూడా చాలా ఆకర్షవంతాలుగా ఉన్నవి. ఆయన 'కేవల మూల్య సిద్ధాంతం' (Absolute price theory) అసంగతమని తోసి పారేశాడు.

> ఇండియాలో ప్రభుత్వంవారు మిల్లుబట్టల విషయంలో అవలంబించే విధానానికీ, మహాత్మా గాంధీ ఖాదీవిషయంలో అవలంబించే విధానానికీ పరిమాణంలోనూ (degree) పద్ధతిలోనూ మాత్రమే భేదం. (సిద్ధాంతంలో భేదంలేదు.) మిల్లుబట్ట రక్షణకోసం విదేశీ సరుకులు కొన్నింటిమీద ప్రభుత్వంవారు నూటికి 50 వంతున దిగుమతి పన్ను

నిషేధించి వాటిని మిల్లుబట్టకంటె నూటికి 40 వంతున ఎక్కువ ఖరీదులో కొనుక్కోవడానికి వీలులేకుండా ఆటంకపరుస్తున్నారు. మహాత్మా గాంధీ మిల్లుబట్టకు వ్యయంచేసే దానిలో నూటికి నూరు వంతున ఎక్కువ ఖర్చు అయినా ఖద్దరునే కొనవలసిందని ప్రజలను పదేపదే హెచ్చరిస్తున్నారు. చౌకబట్టల దండయాత్రలకు తట్టుకొని పరాయి సహాయంలేకుండా తమ కాళ్ళమీద తాము నిలబడేటందుకు ఖద్దరు కానీ, మిల్లుబట్టలుకానీ శక్తికలవి కావు. ఆ విధంగా రెండూ ఆర్థికంగా సమర్థనీయములు కావు.

ఖాదీకి పెట్టే ఎక్కువ వెల నిరుద్యోగుల కిచ్చే దినబత్తెములకంటె చెడిపోయినదా? అని ఆయన అడుగుతూన్నారు. దానికీ దీనికీ పోలికే లేదు. నిరుద్యోగుల దినబత్తెములవల్ల ప్రజాద్రవ్యం ప్రయోజన రహితముగా వినియోగింపబడుతూన్నది. ఖాదీలో అలా కాదు.

ఖాదీనుండివచ్చే ఆదాయం అత్యల్పమా? ఫ్యాక్టరీవిధానం క్రింద వచ్చే కుటుంబపు మొత్తపు ఆదాయంకంటె కుటీర పరిశ్రమ పద్ధతివలన లభించే కుటుంబాదాయం ఎక్కువమాట నిశ్చయం.

అమెరికా సంయుక్తరాష్ట్రాలు కావలసినంత ధనసహాయం చేసి పత్తిపంటను సంరక్షిస్తూన్నప్పుడు, ఇండియా ప్రభుత్వం 1924 ఉక్కుపరిశ్రమల రక్షణచట్టంక్రింద, గొప్ప ద్రవ్యసహాయంచేసి ఆ పరిశ్రమను నిలబెడుతూన్నప్పుడు, ఖాదీకి ధనమిచ్చి, విదేశీవస్త్రాలను దేశంలోకి రాకుండా పూర్తిగా నిషేధించి మిల్లుబట్టల ఉత్పత్తికీ వ్యాపారానికీ పరిమితిని ఎందు

కేర్పాటు చేయకూడదు? రాజకీయ వాతావరణం ఇంతకంటె బాగున్న సమయంలో జరుగవలసిన పని యిది.

చేతితో చేసే పనివలన తగినంత ఉత్పత్తి కాగలదనే నమ్మకం ఉందా? అని ప్రశ్న. మిల్లులలో పనిచేసే కూలీలు చేతితో పనిచేసే కూలీలకంటె 50 రెట్లెక్కువ పనిని, సగం ఖరీదులో చేయగలరని నందా చెప్పిన మాటలనుబట్టి దేశంలో నూరురెట్లైశ్వర్యం ఎక్కువయినట్లుగా భావించ కూడదు. 50లో ఒక్కనికిమాత్రమే మిల్లులలో పని దొరుకు తూన్నది. తక్కిన 49 మందీ ఏవిధమైన ఐశ్వర్యోత్పత్తీ చేయడం లేదు.

నందా తన వివరణాన్ని ఈవిధంగా ముగించాడు.

> ఖాదీనుండి మిల్లుబట్టకు మారినందున ఖాదీ ఖరీదుకంటె మిల్లుబట్ట తక్కువ ఖరీదు కాబట్టి 50 కోట్ల రూపాయీలు లాభం కనిపించే మాట నిజమే. కాని గ్రామవాసుల పని లేని దినాలను లెక్కకడితే సంవత్సరానికి కనీసం 800 కోట్లు తేలతయి. ఈ రోజులు లాభం వచ్చిన పైకము కంటే యేమాత్రమూ తక్కువ ఖరీదు కలవి కావు. ఈ రోజున ఖాదీ ఉత్పత్తికి ఇస్తూన్న రేట్లనుబట్టి, ఈ కూలిజనపు కాయకష్టపు ఖరీదు 70 కోట్లు (ఏడావతి). [హరిజన్ 1936 మే 7.]

ఖాదీ ప్రదర్శనాల స్వభావంకూడా ఇటీవల కొన్ని సంవత్స రాలనుండి మారిపోయింది. లక్నోప్రదర్శనంలో మహాత్మా గాంధీ ఇలా ఉపన్యసించాడు.

> మీ కన్నులకు చెవులకు భోగేచ్ఛ ప్రేరేపించి ఆకర్షించే సినీమా ప్రదర్శనాలు కావివి. విద్యావిషయలేని ప్రతి వస్తువును ఈ ప్రదర్శనం

నుండి బహిష్కరించడానికి ప్రయత్నించాము. ఈ ప్రదర్శనాన్ని మేము పరమ పవిత్రమైన పుణ్యక్షేత్రంగా మాకు కన్నులపండువుగా, వీనుల విందుగా, మీ భావాలను అకలంకంగా చేయగల ఆధ్యాత్మిక సంతర్పణగా నొనర్చవలెనని కృషిచేశాము. ఇదంతా ఎందుకోసమో చెబుతాను. మీరు ఒరిస్సాను, అక్కడి బొమికల పోగులను ఎరుగుదురుగదా! సరే, అయితే! ఆకలితోనూ దారిద్ర్యంతోనూ అల్లాడుతూన్న ఆ అస్థిపంజరాల దేశంలోనుండి, బొమికలతోనూ, కొమ్ములతోనూ, వెండితోను అద్భుత కల్పనలను శాసించినవా రిక్కడకు వచ్చారు. వెళ్ళి ఆ వస్తువులను చూడండి. తయారైన వస్తువులే కాదు; తయారవుతూన్నవికూడా ఉన్నవి. ఆకలితో చిక్కిపోయిన మానవ శరీరం లోని ఆత్మకూడా నిర్జీవములైన లోహాలకు, కొమ్ములకు, ఎలా ఊపిరి పోస్తున్నదో చూడండి. మట్టిలోనుండి అలౌకిక సృష్టిచేశాడు పాపమా పేద కుమ్మరి. నేను కొన్ని అణాల ఖరీదుంటవనుకొన్న వస్తువులు ఒకటో రెండో రాగి డబ్బుల ఖరీదట; అయితే యేమి అవి సుకుమార శిల్పకళారేఖలు. ఒక ప్రియసోదరి నిన్ననే దంతపు బాలకృష్ణుణ్ని కొనుక్కొన్నది. ఆమెకు కృష్ణభగవానుణ్ని ఇదివరకు పూజించే అలవాటు లేదు. ఇప్పుడీ మనోహర బాలరూపాన్ని పూజచేయడం ప్రారంభించిందట.

ఈ ప్రదర్శనం కేవలం కౌతుకాత్మక దృశ్యం కాదు. ఒక విధమయిన స్వర్గధామము. కాని మన అభిరుచు లధోగతికి పోయినవి. అందువల్ల మన కళ్ళయెదుట ఉన్న అద్భుత దృశ్యాలను ఈసడించి అవతలనుండి వచ్చిన అల్పవస్తువులను చిత్తాకర్షక శిల్పకళగా ఆనందిస్తాము. దూరంగా ఉన్న ఐరోపాఖండంలోని అర్థంకాని ఏదో పేరుగల సాన నీరు మనసు అద్భుతంగా ఆకర్షిస్తుంది. అఘరహితమనీ

సహజప్రాతిపారమనీ ప్రసిద్ధిగల గంగా పవిత్రజలం మనకు మురికి గుంటలోని నీరు.

## డివేలరా ఆర్థిక సిద్ధాంతం

ప్రపంచ ఆర్థికమహాసభ జరగడానికి కొన్ని వారాలు ముందుగా, 1933 జూను నెలలో ప్యారిసునగరమునందు అమెరికన్ క్లబ్బువారు డీవెలరా గౌరవార్థ మొక విందుచేశారు. అందులో ఆయన తన ఆర్థిక సిద్ధాంతాన్ని స్పష్టంగా వివరించాడు. స్వేచ్ఛావాణిజ్యపద్ధతి ప్రపంచంలోని చెడుగులన్నిటిలోకీ గొప్పచెడుగు. 'దేశంలో కాగా మిగిలిన ఉత్పత్తులను మాత్రమే ఎగుమతిచేయవలెననే పరిమితిని యేర్పాటుచేస్తేనే తప్ప, లేకుంటే నిజాగా అంతర్జాతీయవ్యాపారమే క్రూరం. (ఉదా: ఇటీవల పునరుద్ధరింపబడిన 1935 జనవరిలోని రాక్షసి బొగ్గు, పశువులనుగూర్చిన ఒడంబడిక) 'స్వేచ్ఛావ్యాపార' మనే పేరుతో ఇంగ్లాండు — ఐర్లాండు పరిశ్రమలను చంపి, ఆ దేశాన్ని జనసంఖ్య తక్కువగల ఆహారపదార్థనిలయంగా తయారుచేసింది. తనను లాంగదీసి అధికోత్పత్తిచేస్తూన్న పక్కదేశంపైన ఆధారపడిఉండే పద్ధతినుండి బయటపడడమే ఇప్పు డయిర్లాం డవలంబించవలసిన రాజనీతి.

డివేలరా వాదంలో చాలా అర్థముంది. 90 సంవత్సరాల కిందట ఇప్పటి 'సార్‌స్టాట్ ఐరీన్' (Saorstat Eireann) ప్రదేశంలో 670,000 ఎకరాల గోదుమపంట ఉండేది. ప్రతి దేశము ఆ ఎకరాల అభివృద్ధికి కారణమయింది. ఐర్లాండు

తనకు కావలసిన పంటను పండించుకోవడమేగాక ఇతర దేశాలకుకూడా ఎక్కువ ఉంటే ఎగుమతిచేస్తూండేది. ధాన్యపుచట్టాలను corn laws) రద్దుచేసి, 1847లో స్వేచ్ఛా వ్యాపారసిద్ధాంతాన్ని ఇంగ్లండుకు వర్తింపచేసిన పిమ్మట అమెరికానుండి చౌక సప్లయిలతో అంగళ్ళు నిండిపోయినవి. ఇంగ్లండు గోధుమపొలాలు పశుపోషక స్థలాలుగా మారిపోయినవి. కుటుంబాలు లేచిపోయినవి. పంటపొలాలు పచ్చికబీళ్ళయినవి. 1931 నాటికి పంటపొలం 21,000 ఎకరాలకు క్షీణించింది. నేడు (1935 పంట) ఎన్నోవిధాల ప్రోత్సాహమిచ్చి ప్రచారంచేస్తే తిరిగి 170,000 ఎకరాలకు పెరిగింది. గోధుమకాక ఇతర ఆహార ధాన్యాలపంట అంత ఎక్కువ వేయడం లేదక్కడ. కాని పశువుల దాణాకింద దిగుమతి అయ్యే సరుకులను నిరోధించడంచేత, ఇంకా కొంత భూమి దున్నవలసి వచ్చినది. మొక్కజొన్న పిండితో తయారుచేసే ఆహారంలో కొంతభాగం దేశంలో పండిన ధాన్యం వినియోగింపబడవలెనని నియమం చేయబడింది. మొక్కజొన్న పంటను ఆహారరూపంలో ఎగుమతిచేయడం పూర్తిగా నిషేధింపబడింది. ధాన్యరూపంలోని ఎగుమతికి లైసెన్సుపద్ధతి కింద పరిమితి యేర్పాటు చేయబడింది. ఈ నీతిని అవలంబించడంవలన 100,000 ఎకరాలలో పండిన ధాన్యాన్ని దేశంలోనే భుజిస్తూన్నారు.

## గ్రామ సౌభాగ్యాన్ని గూర్చి 'సర్ ఆలమ్‌పిమ్'

ఇంగ్లాండులోని భారతీయ గ్రామసౌభాగ్యసంఘు (Indian Village Welfare Association) పక్షాన సర్ ఆలమ్‌పిమ్ ఒక చిన్ని పుస్తకాన్ని ప్రచురించాడు. అందులో గ్రామాల ఆర్థిక సాంఘిక వ్యవస్థలనుగూర్చి విలువగల విషయాలు దొరికి నవి మాకు. జనసంఖ్య పెరిగి పొలం తక్కువగావడం, ఋణాలు హెచ్చడం—ఈ రెండే ఎక్కడచూచినా గ్రామస్థు లను ఎక్కువగా చీకాకుపరుస్తూన్న సమస్యలు.

ఇండియాలో ఇవి మరీ ఎక్కువ. మన జనసంఖ్య చదరపు మైలుకు 248. నేడు కేవలం వ్యవసాయదేశంగా పరిణమించిన ఇక్కడ ఈ జనసంఖ్య చాలా ఎక్కువ. అందువలన సగటున ఒక్కొక్క పొలం యొక్క విస్తీర్ణం చాలా తక్కువ. వివిధ రకములైన పంటలు పండించడానికి వీలుండి, అంగళ్ళకు దోవలుండి, కోఆపరేటివ్ వ్యాపార పద్ధతి ఉండి, తీరిక కాలంలో ఇంకొక ఉపవృత్తి ఉంటే ఈ చిన్న చిన్న పొలాలలో ఒక కుటుంబం కొంతవరకు మర్యాదగా జీవితం గడపవచ్చునని సర్ ఆలమ్‌పిమ్ ఉదాహరిస్తూన్నాడు. జపానులో నూటికి 25 మంది మాత్రమే $2\frac{1}{2}$ ఎకరాలకంటె ఎక్కువ పొలం ఉన్నవా రున్నారు. అన్ని విధములైన వ్యవసాయసంస్థలు యేర్పాటు చేయబడినవి. ఎక్కడా దుబారా అనేది లేదు. పొలాలను చిన్న చిన్న ముక్కలుగా చీల్చడం చాలావరకు నిషేధింపబడింది. పట్టు పురుగులను పెంచడంలాంటి ఉపవృత్తులలో చాలామంది పనిచేస్తు న్నారు. ఇండియాలోని గ్రామస్థుల నిరుద్యోగతను తగ్గించే ఆశా కిరణం మహాత్మా గాంధీ 'చరఖా ఉద్యమం' లోనే ఉన్నది. నిజ మైన లోటును పూరించే ప్రయత్నాని కది చిహ్నం. చైనాలో సగ

టున ఒక్కొక్క కుటుంబానికి ఒక ఎకరం పొలం ఉంది. ఇండి యాలో ఐదెకరాలు.

## ఖాదీ ఆర్థికంగా లాభదాయకమేనా?

'మిల్లుబట్టతో పోల్చిచూస్తే ఖాదీ ఆర్థికంగా లాభదాయకమా?' అనే విషయంపైన గాంధీకీస్నీ సుప్రసిద్ధ ఆర్థికశాస్త్రజ్ఞులకున్నూ జరిగిన చక్కని సంవాదాన్ని ప్యారీలాలు చెబుతూన్నారు. ఆ సందర్భంలోనే చేతి పరిశ్రమల విషయం కూడా యాదృచ్ఛికంగా చర్చింపబడింది. ఇండియా దేశపు ప్రస్తుత పరిణామదశలో ఖాదీయున్నూ తదితర గృహపరిశ్రమలున్నూ పనిలేనివారికి పని కల్పించి కొంతవరకు సహాయపడడానికి ఉపకరించేమాట నిజమే. అందువల్ల వాటి నిప్పుడు ప్రోత్సాహపరచవలసిందే. కాని జాతీయపరిశ్రమల నిర్మాణ కార్యక్రమంలో వాటికి ప్రధాన స్థానమీయడానికి వీలులేదని అర్థశాస్త్రజ్ఞమిత్రులు అభిప్రాయపడ్డారు. వారి భావం ప్రకారం ఆర్థికంగా లాభప్రదములుగాని 'ఖాదీని ఇతర చేతి పనులును' యంత్రములమీద ఉత్పత్తిఅయ్యే సరుకులకు పోటీగా ప్రోత్సాహపఱచి, యంత్రోత్పత్తులకు నష్టం కలిగించడం సిద్ధాంతంలో తప్పు అని; అందువల్ల దేశముయొక్క ఉత్పత్తిశక్తి క్షీణించిపోతుందని వాదించారు. ఈ రోజున నిజానికి చేతిపరిశ్రమలకు నష్టదాయకంగా యంత్రము లనేక విధముల సంఘముచేత ఎలా ప్రోత్సహింపబడుతూన్నవో గాంధీ వ్యక్తంచేశాడు. అందు కుదాహరణంగా రైల్వేలో

తక్కువ రేట్లకు సరుకులను చేరవేయడం, మున్సిపాలిటీవారు ప్రత్యేకసౌకర్యాలుచేయడం, అనేకముఖ్యపరిశ్రమలు ఫ్యాక్టరీ ఉత్పత్తికి సహాయపడడం. బ్యాంకింగు భీమా యేర్పాట్లను చేయడం, అనేకమంది శాస్త్రనిపుణులకు శిక్షణ ఇప్పించడం ఇవన్నీ ఫ్యాక్టరీపద్ధతికి సహాయపడి దానిని జయప్రదంగా చేస్తూన్నవని చూపినాడు. ఇవి ఎంతో వ్యయంచేస్తేనేగాని జరగని పనులు. కాని సంఘం గునియకుండా ఒప్పుకుంటూ న్నది. అందుకు కారణం ఈ అన్నిటికీ ఆనుషంగికంగా, వేగ ప్రయాణ సౌకర్యాలు, మోటారు కారులు, సినీమాలు, రేడియోలు, ఎలెక్ట్రిక్ దీపాలు, ఇంకా అనేకం మన నాగరిక విద్యాధిక సంఘనాయకుల కిష్టమైనవి లభించడమే. వీటికీ స్టూఅర్టుఛేజ్ 'నాగరిక క్రీడావస్తువు' లని పేరుపెట్టినాడు. ఇక చేతిపనులు వేరువిధమైన ఆర్థికపద్ధతిపైన ఆధారపడి ఉన్నవి. గ్రామపక్షపాతంగల సంఘం యేదైనా వీటికి సహాయపడినట్లయితే ప్రపంచంలో యేశక్తీ వీటితో పోటీ చేయజాలదు. అయితే వారు, పల్లెటూరి పరిసరాలు ఈయగల నిరాడంబర జీవితంతోనూ, అకృత్రిమ ఆనందంతోనూ సంతృప్తిపడిఉండాలి. అంతేగాని అన్నిగ్రామాలకు 'ఆధునిక సౌకర్యాలు' చేకూరుతయ్యనే ఊహాప్రపంచంలో విహరించేవారుగా ఉండకూడదు. ఈరోజున ఫ్యాక్టరీ ఉత్పత్తిని చేతిపనులతో పోల్చి లాభదాయకంగా ఉందనడం కేవలం ఫ్యాక్టరీపద్ధతిలోఉన్న సహజగుణంవలనకాదు, కానినేటి సంఘా

నికి ఇష్టమైన ప్రమాణాలనుబట్టి విలువకట్టడంవలన దాని కా లక్షణం ఆపాదించబడేదని. ఒక వృత్తిగానీ, ఉత్పత్తి విధానంగానీ లాభదాయకమా కాదా అనే సంగతి విచారించాలంటే మార్కుపెట్టి చేసే మంచి పరీక్ష ఒక్కటే — అది జీవిత ప్రధానావసరాల కెంతవరకు ప్రయోజనకరం? ఉత్పత్తిదారు విషయంలో ఆ పని ఎటువంటి పరిణామం కలిగిస్తుంది? అని ప్రశ్నించుకోవడమే.

## ఎల్లెన్ హెచ్. ఈటన్ అభిప్రాయం

ఎల్లెన్ హెచ్. ఈటన్ 'దక్షిణోన్నత ప్రదేశాల చేతి పనులు' (Handicrafts of Southern High Lands) అను పేరుతో రస్సెల్ సంస్థా సంపుటం (Russel Foundation Volume) ఒకటి ప్రచురించాడు. అందులో పైన ఉదాహరింపబడిన అభిప్రాయా న్ననుసరించి చేతిపరిశ్రమల స్థితిగతులను పరిశీలించాడు. దాని ప్రతి ఒకటి గాంధీగారి కాయన పంపినాడు. రస్సెల్ సేజి సంస్థను 'అమెరికా సంయుక్తరాష్ట్రాలలోని సాంఘిక, జీవిత విధానాభివృద్ధికొరకు' రస్సెల్ సేజి 1909లో స్థాపించాడు. దాని ఉద్దేశాలను నిర్వర్తించే నిమిత్తం ఆ సంస్థ ప్రత్యేకం ఒక సిబ్బందిని పోషిస్తూన్నది. వారు జనరల్ డైరెక్టరు అధికారం కింద సాంఘిక పరిస్థితులను పరీక్షించి, అవసరమైన కొత్త భోగట్టాను సంపాదించి, దానిని విమర్శించి, వ్యాఖ్యానంచేసి, అభివృద్ధి కనుగుణము, ఆచరణ యోగ్యమూ అయిన కార్యవిధానాన్ని సూచిస్తూంటారు.

అప్పుడప్పుడు వారి పరిశోధనాఫలితాలను పుస్తకంగా గాని, కరపత్రంగా గాని ప్రకటిస్తూంటారు.

## చరఖా 'మేరో రాయ్ రంగీలో'

ఒకప్పుడు రాటం భారతదేశానికి ప్రాణప్రదంగా ఉండేది. యాభై సంవత్సరాల కిందట కూడా చరఖావల్ల జీవిస్తూన్న ముదుసలి వితంతువు 'నాప్రసన్న ప్రభూ!' అని రాటాన్ని పిలుస్తూండడం అసాధారణ విషయంకాదు. కాని తరువాత మిల్లుబట్టల మెఱుపులో రాటం కనిపించకుండా పోయింది. జరిగిన ఇరవైయేండ్లనుండి గాంధీ దానిని పునరుద్ధరించే ప్రయత్నాలు చేస్తూన్నాడు.

ఖాదీ గ్రామపునర్నిర్మాణానికీ, పవిత్రతకు, జాతీయతకూ చిహ్నం. 1938 లో అఖిలభారత చరఖాసంఘం చేసిన పనిని పరిశీలిస్తే ఖాదీ అభివృద్ధి అర్థమవుతుంది.

అఖిలభారత చరఖాసంఘం చేసిన పనిని 40,000 కదుళ్లు, 1000 మగ్గాలు, తెలుపుచేసి రంగులువేసే యంత్రనిర్మాణమూ గల మిల్లుపనితో పోల్చి పరిశీలిద్దాము.

| | అ.భా.చ.సం. | మిల్లు |
|---|---|---|
| పెట్టుబడి | రు 29,54,717 | రు 50,00,000 |
| ఉత్పత్తి అయిన బట్టల మొత్తం విలువ | 55,10,525 | 22,50,000 |
| ,, చదరపు గజాలు | 1,25,82,499 | 1,70,00,000 |
| ఉపయోగించిన గ్రామాల సంఖ్య | 13,265 | |

| | అ.భా.చ.సం. | మిల్లు |
|---|---|---|
| ఉత్పత్తి కేంద్రాలు : | | |
| అ. భా. చ. సం. శాఖలు | 666 | |
| సర్టిఫైడ్ సంస్థలు | 2,17,883 | |
| ఉపకారం పొందిన వడుకు పనివారు | 2,81,880 | 200 |
| నేత పనివారి సంఖ్య | 18,632 | 500 |
| ఇతర కర్మకారుల, కూలీల సంఖ్య | 9,324 | 650 |
| ప్రయోజనం పొందిన జనుల సంఖ్య | 3,09,836 | 1350 |

మిల్లు ఉత్పత్తిదారు వినియోగించే పెట్టుబడిలో నూటికి 60 వంతున మాత్రమే అ. భా. చ. సం. ఉపయోగిస్తాన్నది. కాని మిల్లు ఉత్పత్తిలో నూటికి 70 వంతున ఉత్పత్తిచేస్తూన్నది. మిల్లు పోషిస్తూన్న భారతీయులలో నూటికి 24,000 చొప్పున పోషిస్తూన్నది. మిల్లులో పెట్టినంత పెట్టుబడిని అ. భా. చ. సం. లో పెడితే, ఈరెండో సంస్థలో మిల్లువల్ల ప్రయోజనంపొందే వారికంటె 400 రెట్లుమందికి ప్రయోజనం చేకూరుస్తుంది. అనగా 5,00,000 మందికి లాభంచేకూరుస్తుందన్నమాట.

## ఖద్దరు ఆర్థికంగా నిలబడుతుందా ?

ఖద్దరు ఆర్థికంగా నిలబడుతుందా అని చాలామంది అడుగుతూంటారు. అసలీ ప్రశ్న వేసే పద్ధతిలోనే మొట్టమొదటి తప్పున్నది. బజారులో బహిరంగంగా విక్రయానికి పెట్టినప్పుడు, చక్కగా సంస్థాపింపబడిన పరిశ్రమ, బాగా స్థాపింప

జనని పరిశ్రమను రూపుమాపగలరు. అందులో అనంతమైన పెట్టుబడితో, ప్రభుత్వ గాంటులతో ప్రోత్సహింపబడుతూన్న మిల్లుపరిశ్రమ తన వస్తువులను తాత్కాలికంగా కొంత నష్టానికికూడా విక్రయించగలిగి ఉన్నప్పుడింక చెప్పవలసిందేమిటి? బ్రిటిష్‌వాళ్ళు చలిచీమలులాగున చప్పుడు లేకుండా మన దేశంలో ప్రవేశించిన విధానమే మిల్లు సరుకులవలన మన గృహపరిశ్రమలు, చేతిపనులు చల్లగా సమసిపోవడానికి సాధనమయింది. ఇది కారణంగా దరిద్రులు మరీ దరిద్రులైనారు. భాగ్యవంతులు మరీభాగ్యవంతులైనారు. కాని గాంధీమాత్రం ధైర్యంగా ఇలా అన్నారు. 'భారతదేశంలోని ప్రతి గ్రామంలోనూ పదహారేళ్లకుపైబడి శరీరసౌష్ఠవంగల స్త్రీ పురుషులకు తగినప్రతిఫలంతో పొలములోనో, పాకలోనో చివరకు గ్రామ కార్ఖానాలోనో పనిచూపించగలిగే విధానందొరికేటంతవరకు గానీ, లేదా మంచి నియమబద్ధమైన జీవితానికి కావలసిన సౌకర్యాలను, సంతోషాలను గ్రామస్థులకు చేకూర్చేటందుకు చాలినన్ని నగరాలను గ్రామాలకు బదులుగా నిర్మించగలిగేటంత వరకుగానీ, లక్షలాది గ్రామస్థుల విషయంలో ఖాదీ ఒక్కటే నిజమైన ఆర్థికప్రణాళిక.' 'పనిచేసేటందుకు,ఆలోచించేటందుకు చివరకు జీవించేటందుకుగూడ ఇచ్ఛ లేకుండా పోతూన్న లక్షలాదిగ్రామస్థులకు పని చూపించడ మొక పెద్ద సమస్య' అంటూన్నాడు గాంధీజీ. ఖాదీ వారికి పని చూపిస్తూన్నది; పరికరాల నిస్తూన్నది; సరుకులను కొనే అంగడిని సంసిద్ధం చేసింది. నిన్న మొన్నటివరకూ నిరాశగా ఉన్నవారికి నే

డాగాజ్యోతి కనిపిస్తూన్నది. ఖాదీ 12 కోట్లమందికి వస్త్రసంపత్తి, పింజీ విసరడం పనులు మాత్రే రెండు కోట్లకు వృత్తికల్పిస్తూ న్నవి.

## ఖద్దరు - మనోభావము

సాధారణ అర్థికశాస్త్రానికీ ఖద్దరు అర్థికశాస్త్రానికీ భేద మందనేమాట ఖద్దరుధారులు తెలుసుకోవాలి. మొదటి దానికి మూలం స్పర్థ. అంతేకాని దేశభక్తి, మానవసౌభ్రాతృత్వం, భావ వికాసం—ఇవేవీ లేవు దానిలో. రెండో దానిలో స్పర్థ లేదు. దేశభక్తి, మానవ సౌభ్రాతృత్వం, భావ వికాసం—ఈ అన్నీ ఉన్నవి. ఇటీవల హెచ్చించిన మజూరీలవలన ఖాదీ ఖరీదు పెరిగినమాట నిజమేకాని మజూరీ హెచ్చుదలకు, దామాషాగా ఖరీదు పెరుగలేదు. ప్రభుత్వము వారు గ్రాంటు లిచ్చి పోషించకపోయినప్పటికీ ఖాదీధారు లిస్తూన్న గ్రాంటు అని చెప్పాలి. ఖాదీ చాలావరకు మధ్య తరగతి పేదలచేత మాత్రమే పోషింపబడుతూన్నదని ఒక ఆరోపణ ఉన్నమాట వాస్తవమే. కాని ఖాదీ కిచ్చిన ద్రవ్యం తిరిగీ మరొక వస్తురూపంలో మాత్రమే బజారుకు పోతూన్నది గదా అని వారికి కొంత చిత్తశాంతి. అమ్మకపు సొమ్ము మరొక వస్తురూపంలో అమ్మినవానికే చేరే పరిస్థితి ఉండడం అవసరం. అప్పుడు స్థానికంగా పరస్పర వ్యాపారమూ పరి శ్రమలు వర్ధిల్లి ఆప్రదేశం భాగ్యవంతమవుతుంది. అక్క డిక కఱువు, నిరుద్యోగతలు ఉండనే ఉండవు.

ఖాదీ అహింసకు మూలంగానూ ప్రతిబింబంగానూ భావించబడుతూన్నది. నిజమైన ఖద్దరుధారి అబద్ధం చెప్పడు. హింస, మోసం, అపవిత్రత అతనికి పనికిరావు. గ్రామంలో జరిగే కాంగ్రెసు మహాసభ రు 5,000 లతో పూర్తి అయ్యేటట్లుండాలి. కాని విఠల్‌నగరం 7½ లక్షల రూపాయిల వ్యయంతో నిర్మింపబడింది. గాంధీ ఫైజ్‌పూరు, హరిపురా కాంగ్రెసులకు తనను కాలినడకను తీసికొని వెళ్లలేదనీ, తనను భూమిపైన అడుగైనా పెట్టనీయలేదనీ అసంతుష్టిని వెల్లడించాడు. 'నన్ను రెండెడ్ల బండీలోకూడా తీసికొనిపోలేదు' అన్నాడాయన,

> కాంగ్రెసు ప్రదర్శనస్థలాలు మనకు కాశీ మక్కాలవంటి పుణ్యక్షేత్రాలు. అక్కడ స్వాతంత్ర్య పూజలుచేసి మాతృదేశ సేవకు ఆత్మార్పణం చేసుకోవడానికి మన మంతా వచ్చాము. పేదరైతుల నెత్తిపైన కూర్చోవడానికి రాలే దిక్కడికి మనం. వారి దినకష్టంలో పాల్గొంటూ మన పిండి మనం విసురుకొని, మన బట్టలు మనం ఉతుక్కొని, మన మలుగు దొడ్లను మనం శుభ్రపఱచుకొని వారికి కష్టం కలిగించకుండా మెలగడ మెలాగో తెలుసుకోవడానికి వచ్చాము. జనసామాన్యంపైన ఎక్కికూర్చున్నట్లుగా వారు మనలను భావించకూడదు. ప్రజా సేవకులలో అగ్రగణ్యులు కావడంచేతనే ప్రజాదరణకు పాత్రులై నాయకులు నాయకులుగా ఉన్నారు. కాంగ్రెసు రంగం పుణ్యక్షేత్రం. ఇక్కడ అంతా ఒక టే. అందఱూ ఆ జగన్నాథుని ప్రసాదంలో పాల్గొనాలి.

చేతితో చేసే పనివలన, బుద్ధితో చేయవలసిన పనికి శక్తి నశిస్తుందని భయపడేవారికోసం ఆర్. బి. గ్రెగ్గు అభిప్రాయ

మిక్కడ ఉదహరిస్తున్నాము. 'ఖాదీ అహింసాకార్యవిధానంలో భాగం' 'మానవ పరిణామదశలో హస్తవికాసం మేధావికాసానికి తోడ్పడ్డది' అని వ్రాశాడాయన. 1936 లోని యూరపుఖండ పరిస్థితి నెదుర్కొనేటందుకు ఇంగ్లాండులోని, క్యానన్ షెప్పర్డు, జార్జి లాన్సుబరీ, లార్డు పోన్సన్బీ మొదలయిన యుద్ధవ్యతిరేకులు గాంధీసహాయం కోరినసంగతి మీకు జ్ఞాపకముండియుండవచ్చును. అహింసావర్తనము, బుద్ధితో చేసేపని—ఈ రెండూ అత్యంత సన్నిహిత విషయాలు. కొన్ని బుద్ధిజాడ్యాలకు చేతితో చేసే పనులను. ముఖ్యంగా— నేత, వడ్రంగం, కుమ్మరిపని, మేదర పని—వీటిని 'వృత్తిచికిత్సా విధానంగా' నిర్దేశించారు. ఈ వృత్తులు జీవితానికి ఉత్సాహము, ఆనందము, ధైర్యము, చిత్తస్వాస్థ్యము కలిగిస్తవని అంటారు.

# అఖిలభారత గ్రామ పరిశ్రమల సంఘం

1934 లో బొంబాయి కాంగ్రెసు జరిగినప్పుడు అఖిల భారత గ్రామ పరిశ్రమల సంఘం స్థాపింపబడింది. దాని తరువాత సాంవత్సరిక నివేదికలన్నిటిలోనూ తెలుసుకోదగిన విషయాలు చాల ఉన్నవి. వాటిలో కుటీర పరిశ్రమల యొక్కయు, గ్రామవృత్తుల యొక్కయు అభివృద్ధిని గూర్చిన విషయాలే కాక గ్రామ పరిశుభ్రత, ఆరోగ్యరక్షణ, ఆహార గుణవృద్ధి, చచ్చిపోయిన, చచ్చిపోతూన్న పరిశ్రమల పునరుజ్జీవనం- ఈఅన్ని విషయాలూ కూడా ఉన్నాయి. ఈ సంస్థ పెట్టుబడి లేకుండా పని చేసింది. మొదటి సంవత్సరంలో ఎక్కడనో రు 45.000 చందాల ద్వారా సంపాదించింది, మొట్టమొదట పరిశుభ్రతను గూర్చి పని ప్రారంభించింది. పట్టణాలలోను గ్రామాల లోను గూడా వీధులను- వీధులనే కాదు మైదానాలను ఏటి సెజ్జలను మరుగు దొడ్లుగా ఉపయోగించే శతాబ్దాలనుండీ వస్తూన్న దురభ్యాసాన్ని రూపుమాపడానికి దండయాత్ర సాగించింది. మానవుల మలమూత్రాలు మంచి ఎరువు; కాని ప్రజలలో వ్యాపించిన మూఢ విశ్వాసము, అవిమర్శా భావము,-ఇవి పోతేనే గాని ఈ చిన్న విషయాన్ని వారు గ్రహించలేరు. వారి వెనుక దొడ్లో ఉన్న బంగారుగనిని గమనించ లేనంత అమాయకులు వారు. కాకపోతే వారు పశువుల ఎరువును పిడకలు చేసి పొయిలో పెట్టుకుంటారా ! ఇవి

ఆర్థికంగా ఎంతో గొప్పనష్టం జరుగుతోంది. కొన్ని ప్రాంతాలలో మానవుల మల మూత్రాలు ఎరువుగా ఎంత విలువ గలవో చూపించడానికి ప్రదర్శనా ఏర్పాటు చేయబడ్డవి. మరుగు దొడ్లను శుభ్రంచేసే పని సంఘంలోని చివరి తరగతులవారికి వృత్తిగా ఏర్పాటు చేయడంవలన ఈకీడు వాటిల్లినది. పై తరగతులవారికి పని మంచివృత్తి అనుకొని చేయ ప్రారంభించినప్పుడు జాతిలో కలిగిన తరతరాలనాటి ఈ తప్పు ఊహా తొలగిపోయి మనుష్యుల మల మూత్రాలను ఎరువుగా ఉపయోగించడాని కలవాటవుతారు. సంఘ కేంద్రాలున్న ప్రతిప్రదేశంలోనూ, రోడ్లు తుడవడం, ముళ్ళు, పాకలు, కంచెలు తీసివేయడం, పనికిమాలిన చెత్తచెదారం లేకుండా చేయడం ఈపనులన్నీ నిత్యమూ జరుగుతూన్నవి. నగరవాసులకు గ్రామాలలో పనిచేయుట మొక శిష్టాచారం కిందకు వచ్చింది. సంవత్సరంలో ఒకరోజు నిర్ణయించి ఆనాడు పెద్దఉద్యోగస్థులు జిల్లా అధికారులు కూడా గ్రామాలకు పోయి రోడ్లు తుడుస్తున్నారు. పంజాబులోని కొన్ని గ్రామాలలో ప్రతి ఏకాదశిరోజున గ్రామస్థులే రోడ్లు ఊడ్చుకోవలెనని నిర్ణయించుకొన్నారు.

## గాంధీ సలహాలు

ఆదర్శ గ్రామసేవకునకు గాంధీ యిచ్చిన సలహాలు చాలా ముఖ్యంగా గమనింపదగినవి. కనుక ఇక్కడ ఉదాహరిస్తూన్నాము:—

నే నీ రోజున సేవాజీవితాదర్శములనుగూర్చి మీకు చెప్పదలచుకొన్నాను. వాటిని మీరు మనస్సులో ఉంచుకొని పనిచేయ కోరుతున్నాను. నేటికాలంలో స్వార్థంకోసం పనిచేసుకోవడం అభివృద్ధిగా భావిస్తున్నారు. మీ రిక్కడకు వచ్చినందుకు గాదు. ఈనాడు మనిషి విలువ రూపాయీల అణాలు పైసలలో లెక్క వేస్తున్నారు. మనిషి చదువుకొన్న చదువు వర్తకపు సరుకు క్రిందకు వచ్చింది. ఆ కొలతతో మీ రిక్కడకు వచ్చినట్లయితే మీ కాశాభంగం కలుగక తీరదు. మీ చదువు పూర్తి అయిన తరువాత పది రూపాయీల గౌరవవేతనంతో మీ జీవితం ప్రారంభమై దానితోనే పూర్తి కావచ్చును. ఒక కంపెనీ మానేజరో లేక ఒక పెద్ద ఉద్యోగియో పొందుతూన్న జీతంతో దీనిని పోల్చి చూడకూడదు. నేడు చలామణిలో ఉన్న ప్రమాణాలను మనం మార్చితీరాలి. మీకు ఏవిధమైన లౌకికాభ్యున్నతినీ మేము వాగ్దానముచేయజాలము. అటువంటి పెద్దపెద్ద కోరికలనుండి మిమ్ములను తప్పించాలనికూడా మా ఆశయము. మీ భోజనపు ఖర్చు నెలకు ఆరురూపాయీలకు మించకూడదని మా వాంఛ. ఐ. సి. యస్. ఉద్యోగి భోజనపు ఖర్చు నెలకు రు 60 లు ఉండవచ్చును. అందువలన ఆయన శారీరకంగా గానీ, వైజ్ఞానికంగాగానీ నైతికంగాగానీ మీ కంటె అధికుడని అర్థం కాదు. ఆయన ఎంత భోగపరాయణుడుగా జీవించినప్పటికీ ఈ అన్ని విషయాలలోను మీ కంటె తక్కువకూడా కావచ్చును. మీరు మీ యోగ్యతను లోపాంతో విలువకట్టుకోవడంలేదు. కనుక నే మీ రిక్కడకు వచ్చారని భావిస్తున్నాను. మీరు నామమాత్ర వేతనంతో దేశసేవ చేయకోరుతున్నారు. స్టాక్ ఎక్స్ఛేంజిలో ఒక మనిషి వేలకొలది రూపాయీలను సంపాదిస్తూండవచ్చును. కాని ఆయన మన పనులకెందుకూ పనికిరాడు. వారు మన దరిద్రపరిసరాలలో ఆనందంగా ఉండలేరు. వారి పరిసరాలలో మనం ఆనందంగా ఉండలేము. మన

దేశక్షేమంకోసం మన కిప్పుడు ఆదర్శకష్టజీవులు కావాలి. వారికి లభించిన ఆహారంతో సరిపెట్టుకోవాలి. వారు సేవించే గ్రామస్థు లిచ్చే ఆతిథ్యం వారికి మహద్భాగ్యంగా ఉండాలి. అవసరాలకు కేవలం దేవునిపైన ఆధారపడిఉండాలి. వారికి కలిగే కష్టపరంపరలను సంతో షంతో సహించాలి. 7,00,000 గ్రామాలున్న మన దేశంలో ఇది తప్పనిసరి. జీతాలిచ్చి సిబ్బందిని ఏర్పాటుచేయలేము. వారి కష్ట సుఖాలు ప్రమాణాలైన ప్రావిడెంటు ఫండులైన పింఛనులైన ఉంటుంది. గ్రామస్థులకు నమ్మకంగా సేవ చేయడంలో ఒక విధమైన ఆనందముంది. మీలో కొంతమంది గ్రామస్థులకుకూడా ఇదే ప్రమాణమా అని అడుగవచ్చును. ఎంతమాత్రమూకాదు. ఇదిసేవ కులమైన మనకు గాని యజమానులైన గ్రామస్థులకుకాదు. ఇన్నాళ్ళ నుండీ మనం వాళ్ళ మెడలమీద కూర్చున్నాము. ఈ రోజున మనం బుద్ధిపూర్వకంగా పేదరికాన్ని చేపట్టి మన యజమానుల జీవితం ఇంతకంటె ఎక్కువ సౌభాగ్యవంతంగా చేయదలచుకొన్నాము. ఈ రోజున వారు సంపాదిస్తున్న దానికంటె ఎక్కువ సంపాదించుకొనే ఉపాయాలు వారికి చెప్పాలి. అది ఈ గ్రామ పరిశ్రమల సంఘా దర్శం. నే నిప్పుడు వర్ణించిన సేవకుల సంఖ్య నానాటికీ పెరుగుతూం టేనేగాని మన సంఘం అభివృద్ధికాదు, మీరట్టి సేవకులగుదురుగాక.

## యంత్రం - హింసాప్రవృత్తి

నిర్మాణ కార్యక్రమం అహింసాప్రవృత్తియైనట్లు గానే యంత్రపరిశ్రమ హింసాప్రవృత్తి అని చూపడానికి అఖిల భారత గ్రామపరిశ్రమల సంఘం చాలా కృషిచేసింది. కేంద్రీకరణోత్పత్తి విధానమే హింస. దాని పుట్టుకకు పోషణకు

అభివృద్ధికి కారణమైన ఆర్థిక నిర్మాణముయొక్క మూలము లోనే హింస ఇమిడి ఉన్నది. ఉపయోగంకోసంగాక ఎగుమతి కోసం చేసే అధికోత్పత్తికిగాను అమ్మకానికి అంగళ్ళు కావలసి వస్తవి. వాటిని సంపాదించుకోవడానికి రాజకీయాధిపత్యం కావలసివస్తుంది. దానిని నిలబెట్టుకోవడానికి సైనికాధిక్యత కావాలి. అనగా కేంద్రీకరణోత్పత్తి విధాన మవలంబించిన జాతి, ఎగుమతికోసం చేసే ఉత్పత్తి కేవలం ఆర్థిక రాజకీయ జీవితంలో ఆజాతి చేయగల హింసమీదనే ఆధారపడిఉంటుం దని అర్థం. అటువంటి విధానంలో స్పర్థ ఉండకతీరదు. అదే హింసకు మూలమవుతుంది. అక్కడ కాలం డబ్బు ఎంత తక్కువ కాలంలో ఎంత ఎక్కువ ఉత్పత్తి అయితే అంతఖర్చు తగ్గిపోతుంది. అందువల్ల వస్తువులు ఎక్కువ చౌకవుతయి. చౌకయినకొద్దీ వ్యాపకమెక్కువవుతుంది. వస్తువులు త్వరగా అంగడికి చేరవలెనంటే వేగప్రయాణసౌకర్యాలు కావాలి అవి ఉండడంతోనే ఇంకా ఎక్కువ ఉత్పత్తి చేయవలసి వస్తుంది.ఎక్కువ ఉత్పత్తి కితగిన గిరాకీ (demand) ఉండాలి. ఇందుకోసం 'వెనుకబడి ఉన్న జాతులను నాగరికులనుగా చేయాలి.' ఆవిధంగా అంగళ్ళపైన రాజకీయాధికారం సంపా దించాలి, ఈ పద్ధతిని హింస అనక మరేమనాలి? సాధ్యమై నంత తక్కువ కూలీతో పనిచేయించుకోవడానికి యంత్రాల యాధికారులు యత్నించక తప్పదు. ఐశ్వర్యాన్ని దోచు కోవడానికి వారు వేసే పెద్ద కన్నమదే!

గ్రామపరిశ్రమాభివృద్ధి విషయంలో కాంగ్రెసు ప్రారంభించి చేసిన పని 1939 నాటికి ఇండియా ప్రభుత్వ దృష్టిని ఆకర్షించినది. వారు మన గ్రామాలలో ఉన్న నూనె గానుగలను గూర్చి చేతితో తయారుచేసిన కాగితమును-ముఖ్యంగా ఖాదీ ప్రతిష్ఠానం వారు చేసిన కాగితమును గూర్చి ఒక పెద్ద నివేదికను ప్రచురించారు. ఈ సంఘం కాగితమును చేసేటందుకు 96 మందికి శిక్షణ ఇచ్చింది. 52 మందికి నూనె గానుగ ఆడించడంలో, 2 మందికి వ్యవసాయంలో, 18 మందికి తాటిబెల్లం చేయడంలో 10 మందికి పప్పు దంచడంలోనూ పిండి విసరడంలోనూ శిక్షణ ఇచ్చింది. ఈ సంఘ యాజమాన్యం కింద పని చేసే నిమిత్తం బీహారులోనూ మధ్యరాష్ట్రాలలోను 38 కేంద్రాలు స్థాపించబడినవి. మద్రాసు బొంబాయి ఒరిస్సా రాష్ట్రాలలో నూనెగానుగ ఆడడం, తాటిబెల్లం చేయడం, తేనె తీయడం కాగితాలు చేయడం మొదలైన పనులను నేర్పడానికి ప్రత్యేక ప్రయత్నాలు చేసింది గ్రామపరిశ్రమల సంఘం. ఉద్యోగభవన స్థాపన ఆసంవత్సరం జరిగిన ముఖ్యసంఘటనం. 1938 లో గాంధీ దానిని లాంఛనంగా ప్రారంభించాడు. అందులో అన్ని శాఖల కార్ఖానాలూ ఉన్నవి. కిటికీతోడు మగన సంగ్రహాలయమనే పేరుతో ఒక మ్యూజియం ఉన్నది. అది అ. భా. చ. సం. యొక్కయు అ. భా. గ్రా. ప. సం. యొక్కయు సమిష్టి యాజమాన్యంకింద నడుస్తూంటుంది. అక్కడ వివిధ కుటీర పరిశ్రమల పనినిగూర్చి ఛోగట్టా అంతా లభిస్తుంది. ఒక్కసారి

మన మీా సంస్థకు పోయిచూస్తే మన యొక క్రొత్త ప్రపం
చంలో ఉన్నట్లు తోస్తుంది. జాతీయపునర్నిర్మాణం కింద
స్వరాజ్య మెలా ఉంటుందో తెలుస్తుంది. నూరు సంవత్స
రాల కిందటి హిందూదేశంతో పోలిస్తే ఇప్పటి మనదేశాన్ని
ఏవిధంగా ఆనవాలు పట్టలేమో, అలాగే రాబోయే స్వరాజ్యం
లోని ఆ దేశాన్నికూడ ఆనవాలు పట్టలేమని అర్థమాతుంది.
అన్ని శాఖలలోకంటె పరిశుభ్రతకు సంబంధించిన శాఖలో
పని చాలా తక్కువ జరుగుతూండడం చిరాకు కలిగిస్తూ
న్నది. మనుష్యులలో చాలా అశ్రద్ధ పెచ్చుపెరిగి ఉండడం
చేత ఎవరి సలహాను వారు సరిగా వినడంలేదు. వీధులను
తమ చేతులతో స్వయంగా తుడవవలెననే పాఠాన్ని వారు
గ్రహించి ఇంకా ఆచరణలో పెట్టడంలేదు. అయినప్పటికీ
1939లో ఒక పద్ధతిని అవలంబించి నూరుమంది గ్రామస్థులు
వారి వీధులను వారు ఊడ్చుకొన్నారు. 27 గ్రామాలలో
నూతులు, చెఱువులు పూడికతీయబడి పరిశుభ్రం చేయ
బడ్డవి. 16 కేంద్రాలలో గ్రామోత్పత్తి వస్తువిక్రయశాల
లేర్పాటు చేయబడినవి. బెంగాలులో ముఖ్యంగా కూరలు
కాయించడం అభివృద్ధిచేశారు. మద్రాసు రాజధానిలో
అనేకచోట్ల వడ్లు దంపేటందుకు, పిండి విసిరేటందుకూ
కేంద్రాలు నిర్మింపబడినవి. ఒక్క గుంటూరు జిల్లాసంఘమే
రు 41,000 విలువగల దంపుడు బియ్యం అమ్మింది. సాధ్యమై
నంత ఎక్కువ నూనె తీయడానికి వీలుగా గానుగలను అభివృద్ధి
చేశారు. సంఘ కేంద్రస్థానంలోనే అన్ని రకాల గింజలలో

నుంచి మొత్తం 28,370 సేర్ల నూనె తయారయింది. బెల్లం చేయడం అంతకంతకు ఎక్కువ వ్యాపకమవుతూన్నది. పంచదారకు బదులుగా ప్రజలు బెల్లం వాడడం ప్రారంభించారు. అందువల్ల బెల్లాన్ని ఇంకా ఎక్కువ బాగా పరిశుభ్రంచేస్తూన్నారు. మద్రాసులోని టీపికల్లు నిబంధనలు ఇండియాలోకల్లా ఎక్కువ బాగున్నవని ఈ సందర్భంలో అనుకొంటూన్నారు. చాలా ఇతర రాష్ట్రాలలోని ఉత్పత్తి పన్నుల విధానం లోపభూయిష్టంగా కనిపిస్తూన్నది. తేనెటీగలను పెంచే పని విస్తారంగా వ్యాపిస్తూన్నది. చాలామంది యువకుల కది ఉత్సాహజనకంగా ఉంటూన్నది. ఈ వృత్తి హిందూదేశమంతా పాకుతూన్నట్లు కనిపిస్తుంది. ప్రతి సంవత్సరం కాగితంచేసే కేంద్రాలు పెరుగుతూన్నవి. కాగితం చేయడంలో పనివాళ్ళకిచ్చే మజూరీ చాలా ఎక్కువ కావడంచేత కాగితం ఖరీదెక్కువవుతూన్నది. ఇండియాలో ఉత్తమోత్తమమైన కాగితం తయారుచేస్తూన్నా మనుకొనే కేంద్రాలలోకూడా అది వ్యాపార సరళిలో సాగడంలేదు. సబ్బులు చేయడంలో చాలా మార్పు వచ్చింది. సబర్మతీకార్యాలయంలో దిగుమతి అయిన కాస్టిక్ సోడాను సబ్బుపరిశ్రమకు ఉపయోగించడం మాని 'మహువా' నూనెను ఒండుమట్టినీ వాడుతూన్నారు. 1937లో 33,590 పౌనుల సబ్బు తయారయింది. 1938లో 83,813 పౌనులకు పెరిగింది.

చెఱుకుగడలను నిలవచేయడంలో కొంత అభివృద్ధి జరిగింది. చెఱుకుగడలకు చెక్కుదీసి చిన్నచిన్న గుండ్రనిముక్క

ముగా కోసి ఎండబెట్టి కుండలలో ఉంచుతారు. అవసరమైన వప్పుడు వాటిని నీళ్లలో నానవేసి ఉపయోగిస్తారు. కొత్తగా కోసి తెచ్చిన చెఱకుగడను నిలవచేసిన చెఱకు ముక్కలతో పోల్చి పరీక్ష చేయగా రెండింటిలోనూ సమానమైన గుణమే ఉన్నట్లు తేలింది. కాకపోతే రెండోదానిలో ఆహారవస్తుగుణా లెక్కువగా ఒకచోట గుమికూడి ఉన్నట్లు తెలిసింది, నిలవ చేసిన చెఱకులో ఇనుమెక్కువ ఉండడానికి కారణం, ఇనప పాత్రలో నిలవచేయడంవల్లనని ఊహిస్తూన్నారు.

వడ్లు దంచడానికి చక్కీలు ప్రచారంలోకి వచ్చినయి. మహారాష్ట్రదేశంలోని ఒక్కొక్క చక్కీ గంటకు 80పౌనుల వడ్లు దంచుతుంది. దాని ఖరీదు రు 6.

తాటికల్లు పులుపును తీసివేసి తీపి చేసేటందుకూ వేసిన సున్నాన్ని తొలగించడానికీ ఒక విధమైన రాతి వడపోత యోగ్యమైనదని మద్రాసు గవర్నమెంటువారి పారిశ్రామిక రసాయనశాస్త్రజ్ఞుడు సూచించాడు. అది చాలా ఉపయోగ కరంగానే ఉన్నట్లు గ్రామపరిశ్రమల సంఘంవారు గమనించారు.

కాగితాల పరిశ్రమలో గడ్డపేలికలు, జనపనార, అరటి, తూట, జనపనార సంచులు వెదురుచెత్త —ఇవన్నీ ఉపయోగపడుతూన్నవి. బోద గడ్డి, మారుల్ నార (Marul fibre) బాగా ఉపయోగపడుతున్నాయి. ఈ పరిశ్రమకు చిత్తు కాగితాల వర్గీకరణంలోకూడా మంచి పద్ధతులు కనిపెట్టబడి

నము. మన్ను వేయడం, తొక్కడం, కడగడం — ఈ పద్ధతు లన్నీ బాగా శ్రద్ధగా పరిశోధించబడుతూన్నవి.

## అ. భా. గ్రా. ప. సం. పరిశోధన

అ. భా. గ్రా. ప. సం. అన్వేషణ పరిశోధనా విషయా లలో చేస్తూన్న పని రసాయనశాస్త్ర పద్ధతులమీద నడుస్తూ న్నదని వారి సర్క్యులర్లనుబట్టి తెలుసుకోవచ్చును. బెల్లం లోని విలువగల లోహపదార్థాలు పోనికారణంచేత బాగా తయారయిన పంచదారకంటెకూడా ఎక్కువ ప్రయోజన కారి కాగలదు. ఉడకబెట్టిన పండుగాని, పానకంలో నిలవ చేసిన పండుగాని, పచ్చికాయ లేక సహజంగా పండిన పండు ఉన్నట్లుండదనేమాట మాత్రం నిజం. మనకు లభించే వస్తువు లలో తేనెకు బదులుగా ఉపయోగించదగిన ఉత్తమోత్తమ వస్తువు బెల్లం. కాని తీపిలో భేదమున్నది. జీర్ణం కావడం ఎక్కువ కష్టం. శరీరమునకు తేనె తగి ఉన్నట్లు బెల్లం తగి ఉండదు. ఆల్కలీని మందుగా ఉపయోగించవలసినచోట్ల సోడా బైకార్బనేటు తాత్కాలిక చికిత్సగా ఉపయోగపడు తుంది. కాని పండ్లలోను, ప్రకృతి ధాన్యాలలోను ఉన్న సహజక్షారాలకు అది యెంతమాత్రమూ సరిపోదు. వెన్న సహజస్థితిలో పులుపూ (ఆమ్లము) కాదు. క్షారమూ కాదు. కాచిన పాలలో పులుపు చేరుకొంటుంది. జీవబిందువులోని క్షారాన్ని (Tissue) తొలగించడానికి కది ఉపయోగపడు తుంది. పాలను కాచడమే ఇప్పటికి మన కందుబాటులో

ఉన్న సురక్షిత పద్ధతి. పెరుగులో స్థాళివలె తయారయ్యే పుల్లని క్షారాలు ఎక్కువగా ఉంటవి. పెరుగులో నాలుగు వంతులు క్షారపదార్థాలు, ఒకవంతు పులుపు పదార్థమూ ఉండడం ఉచితం. నేయి సహజంగా ఆమ్లపదార్థం కాదు. కాని దానితో కొన్ని వస్తువులను వండినప్పుడది కొన్ని క్షారపదార్థాలను తొలగిస్తుంది. ఆవిధంగాతయారైనఆహారం సహజంగా పులుపు కాకపోయినప్పటికీ పులుపుగుణాలనుకలిగి ఉంటుంది. ఇటువంటి ఉపయోగకరములైన విషయాలన్నీ చదువరులకు తెలిసేటందుకు కొంద అడిగే ప్రశ్నలకు జవాబుగా 'హరిజన్' లో ప్రచురింపబడుతూంటవి. ఈ జవాబులన్నీ డాక్టరు మెంకెల్ వ్రాస్తూంటారు.

పాశ్చాత్య సంప్రదాయాలలో శిక్షణపొందిన అర్థశాస్త్రజ్ఞులున్నూ, మన కళాశాలాధ్యాపకులున్నూ ప్రజల జీవిత ప్రమాణాన్ని హెచ్చించాలని తరుచుగా అంటూంటారు. జీవిత ప్రమాణాన్ని హెచ్చించడమంటే జీవితావసరాలకు ఉపయోగపడే వస్తువుల విక్రయం వృద్ధిచేయడమని వారర్థం చేసుకొన్నట్లు కనిపించదు. వేషంకోసం ఉపయోగించే వస్తువులద్వారానే తరచుగా ద్రవ్యం పట్టణాలకు నగరాలకు అక్కడ నుండి విదేశాలకు పోతూన్నది. కాబట్టి జీవిత ప్రమాణాన్ని వృద్ధిచేసే వస్తుసముదాయంలో ఇవి చేరకూడదు. అ. భా. గ్రా. ప. సం. వారి ఉద్దేశం డబ్బు స్థానికంగా తిరుగుతూండాలనీ అప్పుడా అమ్మకపుసొమ్ము స్థానిక వ్యాపారానికీ పరిశ్రమలకూ ప్రోత్సాహకరంగాఉండి, ఎక్కువఉత్పత్తికావడానికి

దారితీస్తుంది. పనివాళ్ళకు కొనుగోలుశక్తిని పనులను సృష్టి
చేసే, తెలిసిన ప్రదేశంలోనే వస్తువుల అమ్మకపు డబ్బు తిరు
గుతూండాలని కుమారప్ప చెప్పినమాట బాగావుంది. విదేశీ
వస్తువులను ఎక్కువగా కొనడంకంటే ముడివస్తువులను ఆహార
పదార్థాలను ఎక్కువగా ఎగుమతి చేయడమన్నమాట. అంతే
కాదు; విదేశాల కొనుగోలుశక్తి ఎక్కువచేసే మన దేశంలో
నిరుద్యోగాన్ని, దారిద్ర్యాన్ని పెంచుకోవడం. 'మనిషి ఆకలిగా
ఉన్నప్పుడు కోరికలను పెంచుకోవడం ఆకలిమంటను ప్రజ్వ
లింప చేసుకోవడమే' అని కుమారప్ప సత్యాన్ని సంగ్ర
హంగా చెప్పినాడు. జీవిత ప్రమాణాన్ని హెచ్చించడమంటే
మనవాళ్ళ అర్థమేమిటో తెలుసునా? జపాను చాపలు, పారసీ
కపు తివాచీలు. ఆస్ట్రియన్ లాంతర్లు, అమెరికన్ పొయ్యిలు,
బర్మింగ్‌హామ్ కాఫీపొడిచేసేయంత్రం, సీమ కప్పులు, సాసర్లు
జర్మన్ ఫోర్కులు, చంచాలు, జెకోస్లోవేకియా మూడు మడ
తల బల్లలు, లాంకషైరు టేబిల్ బట్ట, ఆస్ట్రియన్ మడత
కుర్చీలు, అయిరోపా బ్యాట్లు, బంతులు, లండన్ బిలియర్డు
బల్లలు ,కుర్చీలు. రీడింగు బిస్కట్లు, ఆస్ట్రేలియన్ పాలు జావా
పంచదార, ఫ్రెంచి కాఫీ, ఇంగ్లీష్ పండ్ల మురబ్బాలు ఇవన్నీ
కొనడం, దీనికర్థం విదేశాలకు డబ్బు దోచిపెట్టడం. ఈదేశం
లోని లక్షలాది జనులు దాదాపు పస్తులు పడుకొంటూన్న
సంగతి అందరికీ తెలిసినదే. వారి నికృష్టజీవిత ప్రమాణం అభి
వృద్ధి కావలసిందే కాని మధ్యతరగతుల విషయంలోనూ,
ఉన్నతో మధ్యతరగతుల సందర్భంలోనూ, ఈపని తలపెట్టడం

అన్న వస్త్రాలు దొరకక బాధపడుతూన్న కోట్లకొలది ఉన్న జనసామాన్యాన్ని నాశనం చేయడం.

## ఆర్థిక విజయం

భారత దేశంపైన బ్రిటిష్‌వారి ఆర్థిక విజయాన్ని మన విద్యావంతులుకూడా సరిగా గ్రహించలేరు. బ్రిటిష్‌విజయం కేవలం ప్రాదేశిక విజయమే కాదు. సాంఘిక, ఆర్థిక, నైతిక, ఆధ్యాత్మిక లేక అనాధ్యాత్మిక విజయమనాలి. ఇండియాలో బ్రిటిష్ పరిపాలనకు నిజంగా మూలమని చెప్పదగిన ఈస్టిండియా కంపెనీ, అత్యంతాభివృద్ధిపొంది ఇంగ్లీషువాళ్ళను ధనవంతులనుగా చేసిన మొట్టమొదటి జాయింటు స్టాకు కంపెనీ డచ్చివాళ్లు మిరియాల ధరను పౌను మూడు షిల్లింగులనుండి 6 షిల్లింగుల 8 పెన్నీలకు పెంచి విశేషలాభాలు తీయడమే ఈస్టిండియా కంపెనీ పుట్టుటకు కారణం.

క్లైవు కాలంలో కావలసినంత ధనం ఇంగ్లాండుకు తీసికొని వెళ్ళారు. ఒక్క బెంగాలునుండి ఈస్టిండియా కంపెనీ వారు, వారి నౌకర్లు 1757—1766 ల మధ్య లంచాల రూపంలో పౌ 6,00,000 గుంజుకొన్నట్లు తెలుస్తూన్నది, 1767లో బ్రిటిష్ ప్రభుత్వం ఈ దోపిడీలో ప్రత్యక్షంగా భాగం కావాలని పట్టు పట్టింది. అందువల్ల కంపెనీ ప్రతి సంవత్సరము 4,00,000 పౌనులు ప్రభుత్వ ఖజానాకు జమకట్టుటు ఒప్పుకోక తప్పింది కాదు. ఇంగ్లాండు భారత దేశాన్ని ప్రత్యక్షంగా దోచుకొం

టూండడంవల్లనూ, సముద్రవ్యాపారంలో పోటీ అనేది లేకుండా వ్యాపారం యావత్తూ తమ ఒక్కరిచేతులలోనే ఉంచుకోవడం వల్లనూ వేగంగా పోగైన పెట్టుబడియే అక్కడి పారిశ్రామిక విప్లవానికి కారణమయిందని ఆర్థిక చరిత్రకారులు వ్రాస్తూ న్నారు. 1813లో ఈస్టిండియా కంపెనీ వారి ఏకాధిపత్య వర్తక పద్ధతిని రద్దుచేయడమే బ్రిటను భారతదేశము పట్ల అవలంబించిన దోపిడీ విధానానికి ఒక కొత్త దశ. 1803 లో మొదటిసారి ఇండియాకు లాంకాషైరు బట్ట దిగుమతి అయింది. 1803లో దిగుమతి అయిన బట్టల విలువ మూడులక్షలే. 1820లో 2 కోట్ల విలువగల బట్టలు దిగుమతి అయినవి. ఆవర్త కమే ఇండియాలోని చేనేత పరిశ్రమను నాశనం చేసింది. "దరిద్రమైన భారతీయ నేతపనివాని వలపోత వింటే అంతు లేని జాలి వేస్తున్నది. అతను అన్నంలేక పస్తులుపడుకొంటూ న్నాడు. ఇందుకు ముఖ్యకారణమేమిటి? ఇంగ్లండులో తయా రైన చౌకబట్టల దిగుమతి. సాలీలలో అనేకులు ఆకలితో చని పోయినారు. మిగిలినవారు నేతపనిని వదిలిపెట్టి వేరేవృత్తి చూచుకొంటూన్నారు. ముఖ్యంగా వ్యవసాయంలోకి దిగారు. నాజూకుతనానికీ, అందానికీ ప్రపంచమంతటా పొగడ్తకెక్కిన ఢక్కామజిలినులందువల్లనే అపరూపమై పోయినవి.''1 అని డాక్టరు బౌరింగు 1835లో వ్రాశాడు. భారతదేశపు బట్టల పరిశ్రమకు ప్రధాన కేంద్రమైన ఢక్కాజనసంఖ్య 1815-1837 సంవత్సరాల మధ్య 150,000 నుండి 20000 కు తగ్గిపోయింది.

1 ఢక్కా మజిలినుల దీర్ఘవిషాద వృత్తాంతం మరొకచోట ఉన్నది.

ఈ విధంగా పారిశ్రామికంగానూ వ్యావసాయికంగానూ కూడా భాగ్యవంతంగా ఉన్న ఇండియా దేశం, కేవలం వ్యవసాయ దేశమై ఇంగ్లాండుకు ముడిపదార్థాలను, ఆహారాన్ని సరఫరాచేస్తూ, ఆ దేశంనుండి యిదివరకు తాను సొంతంగా తయారుచేసుకొంటూండే సరుకులను తెప్పించుకొంటూ న్నది యిప్పుడు:-

భారత నౌకావ్యాపార కథకూడా ఇంత విషాదగాథా అవును. తన 'ఇండియా చరిత్రలో' మెడో టేలరు ఇలా వ్రాశాడు.

> ఇండియాదేశపు ఉత్పత్తులతో ఇండియాలో చేయబడిన నౌకలు లండన్ రేవుకువచ్చినప్పుడు అచటి ఏకాధిపత్యంగల నౌకావ్యాపారస్తులకు థేమ్సునదిలో శత్రునౌకాదళం దిగినప్పటికంటె ఎక్కువ భయ సంభ్రమాలు కలిగినవి. లండన్ రేవులోని నౌకా నిర్మాతలు కొంపమునిగి పోయినట్లుగా గోలచేయడం ప్రారంభించారు. వాళ్ళ వ్యాపారం అపాయంలో పడ్డదన్నారు. నౌకానిర్మాతల కుటుంబాలు అన్నమోరామచంద్రా, అని దుఃఖించేరోజు వస్తూన్నదన్నారు.

హిందూదేశంలో తయారైన నౌకలు ఇంగ్లాండు ఇండియాదేశాల మధ్య జరిగే వ్యాపారంలో వినియోగ పడకూడదని 1801 జనవరి 17 వ తేదిన ఈస్టిండియా కంపెనీ డైరెక్టర్లొక నివేదికను తయారు చేశారు. అందులో వారు చెప్పిన వాదాలలో ఈ దిగువ వాదం ముఖ్యంగా తెలుసుకోదగినది.

> ప్రాచ్య దేశాలలోని 'నేటివ్లు' మనకు లోబడ్డ ప్రజల నావలను మన రేవు పట్నాలకే తీసికొని వస్తూండడం వలన మన దేశానికెంతో సేవచేసిః ఆ హైన్యశాలురలో ఏ ఒక్కడూ ఆహారం లేకుండా పోవలెనని ఏ బ్రిటిషు వ్యాపారమూ కోరదు. కాబట్టి మన నౌకా వ్యాపారంలో ఎక్కువగా ఈ భారతీయ నావికులను చేరనీయడం వలన కలిగే ఫలితాలు, ఆర్థిక, నైతిక, వాణిజ్య, రాజకీయ దృష్టితో విచారించినప్పుడు తెలుస్తూనేవున్నవి. భారతీయులచే నడుప బడుతూన్న నౌకలకు ప్రత్యేక సౌకర్యములు చేయబడవలెననే సూచనకిది మతీమొక బలమైన అభ్యంతరం.

"ఆర్థిక, ఆదాయ వ్యవహార నిర్మాణంలో ఇండియా, సామ్రాజ్యానికి కేంద్రమూ కొలికిపూసా అయింది" అన్నాడొక బ్రిటిష్ చరిత్రకారుడు. అటువంటి మహోన్నత శిఖరం నుండి పాతాళంలో పడిపోయింది ఇండియా నేడు. నిర్మాణ కార్యక్రమమంటే ఇండియా పునర్నిర్మాణంకోసము, పునర్విజయంకోసమూ ఏర్పాటైన కార్యక్రమం కాబట్టి దానిని మనం జాగ్రత్తగా పరిశీలించాలి.

## నిర్మాణ కార్యక్రమము – అహింస

గాంధీ సేవాసంఘు మహాసభ 1939లో బృందావనంలో జరిగినప్పుడు గాంధీ ఇలా ఉపన్యసించాడు.

> నిర్మాణ కార్యక్రమానికీ అహింసకూ సంబంధమేమిటి? వాటిని రెంటినీ ఎందుకంత సన్నిహితంగా జోడిస్తున్నారు? అనే ముఖ్య ప్రశ్నలకు నేను మీకు జవాబీయవలసి ఉన్నది. మంచిది; హిందూ మహమ్మదీయుల సంఘీభావము, మద్య నిషేధము, అస్పృశ్యతానివారణమూ—ఇవి అహింస లేకుండా జరిగే పనులు కావని స్పష్టంగా

తెలిసిన విషయమేననుకొంటాను. ఇక చరఖా విషయం మిగిలింది. అది అహింసకు చిహ్నం ఎలాఅవుతుంది? ముఖ్యంగా మీ భావనను బట్టీ, మీరు దాని కాపాదించే గుణములనుబట్టీ అది మీకు ప్రత్యక్షం అవుతుందని ఇదివరకే మీకు చెప్పిఉన్నాను. క్వినైను మాత్రను గూర్చిన మీ భావం అలా ఉండగా దానికి కొన్ని సహజ గుణాలున్నవి.అటువంటిదికాదు రాటం. దానిలో అలాటి సహజ గుణ మేమీ లేదు. గాయత్రీ మంత్రం తీసుకోండి. నా పైన దానికున్న ప్రభావం హైందవేతరులపైన ఉండదు. కల్మా ముసల్మాను హృదయంలో కలిగించే పరివర్తనం నా హృదయంలో కలిగించలేదు. అదే విధంగా అహింసను బోధించే శక్తిగానీ, స్వరాజ్యాన్ని తెచ్చేశక్తిగానీ, రాటంలో స్వత స్సిద్ధంగాలేదు. కాని మీరు దానికా గుణాలను ఆపాదించి భావిస్తే అది సరిగా అలాగే ప్రత్యక్షమౌతుంది. పేదలను సేవించడమే దానిలోఉన్న విలువ అనే సంగతి స్పష్టమే. అందువల్ల అది అహింసా చిహ్నమనిగానీ, స్వరాజ్య సంపాదనకు తప్పనిసరి అనిగానీ, అర్థంచేసుకో నక్కరలేదు. కాని 1920 నుండీ నేను రాటాన్ని స్వరాజ్యంతోనూ అహింసతోనూ ముడిపెట్టాను. ఇక ఆత్మ పరిశుద్ధతకు సంబంధించిన కార్యక్రమంఉంది. దానితో కూడా రాటం సన్నిహిత బాంధవ్యం కలిగిఉంది. ఇంట్లో వడికిన ముతకనూలుబట్ట నిరాడంబర జీవితాన్నీ తద్వారా పవిత్రతనూ సూచిస్తుంది. రాటం, హిందూ మహమ్మదీయ సఖ్యత, అస్పృశ్యతా నివారణము- ఇవిలేకుండా శాసనోల్లంఘనంలేదు. శాసనోల్లంఘనం అన్నప్పుడు, మనంతట మన మేర్పాటు చేసుకొన్న నియమాలకు హృదయపూర్వకంగా మనం కట్టుబడి ఉండాలనే భావం ఇమిడిఉంది. అది లేకపోతే శాసనోల్లంఘనమొక క్రూర పరిహాసం. ఇదినాకు 'రాజ

కోటి ప్రయోగాలలో కలిగిన దృఢనిశ్చయ విశ్వాసం. ఉపకరణులన్నీ ఒక్క పనికి నిర్ణయించినప్పటికీ ఆయన ఒక్కడే స్వరాజ్యాన్ని తీసుకొని రావడానికి చాలడు. నేను అట్టి సత్యాగ్రహిని కావడానికి ఇంకా ఎంతో దూరంలో ఉన్నాను. రౌలట్టు చట్టానికి వ్యతిరేకంగా సత్యాగ్రహ సన్నాహాలు సాగించవలెనని కోరుకొన్నప్పుడు కూడా నేనీ మాటలే చెప్పినాను. ఆ సత్యాగ్రహం ప్రారంభించబడినప్పుడు కొద్ది మందిమే ఉన్నాము. ఆ కొద్దిమందిలో నుంచే చెప్పుకోదగిన సంస్థను స్థాపించాము. నేను అసంపూర్ణ సత్యాగ్రహిని కావడం చేత మీ సహకారం కోరుతూన్నాను. మీ సహకారాన్ని అభిలషించ డంలోనూ, సత్యాగ్రహ సంవిధాన ప్రయత్నంలోనూ నిరంతరం ఆత్మపరీక్ష చేసుకొంటూ [illegible] నేను అభివృద్ధి కాగలను. నేను మీ కిస్తున్న ఇంత సావకాశమూ మన ఉభయుల క్షేమంకోసమే. మీ క్షేమంకోసం కాకపోతే అది నా క్షేమంకోసం. నేను ఆత్మపరీక్ష చేసుకొంటూన్న కొద్దీ పెరుగుతూన్నాను; క్రమపరిణామం పొందుతూన్నాను; ఎవ్వరూ పెరగడానికి వీలులేనంత పెద్ద వాళ్లు కారు- ముఖ్యంగా నేను కాను. ట్రాన్సువాలులో సత్యాగ్రహం పుట్టింది. కాని అక్కడ కొన్ని వేలమంది మాత్రమే దానిని ప్రయోగించారు. ఇక్కడో లక్షలాది ప్రజలు ప్రయోగించారు. 1919 ఏప్రిల్ 6 వ తేదీని మద్రాసు నుండి నేను పిలవగానే లక్షలాది ప్రజలు ఒక్కటిగా లేచి నిలబడతారని ఎవరనుకొన్నారు ? కాని అంత్య విజయానికి నిర్మాణ కార్యక్రమం ముఖ్యావసరం. ఈనాడు అహింసా చిహ్నమైన రాట్నంపైన చేయవలసిన పనిని మనం సరిగా నిర్వర్తించక పోయినట్లయితే మన జాతికి అన్యాయం చేస్తూన్నామని నేను నిజంగా అనుకొంటూన్నాను. ఎంత కాలమైనా కానీయండి ఈ పని చేసి తీరవలసిందే.

## మధ్యరాష్ట్రాలలో పారిశ్రామిక విచారణ సంఘంవారి అపూర్వనివేదిక.

మధ్యరాష్ట్రాల ప్రభుత్వంవారు 1938 డిశంబరు 15 వ తేదీని నియమించిన పారిశ్రామిక విచారణసంఘం 1939 మే 20 వ తేదీని ''ఒక అపూర్వనివేదికను'' ప్రచురించింది. ''అది శాస్త్రవిషయిక విచారణ కాదు, ప్రచారక విచారణ కాదు, రుగ్ణవిషయిక (Clinical) విచారణ కాదు. కాని రోగి ప్రాణాలను కాపాడతగిన మందును సూచించేనిమిత్తం స్వల్పకాలంలో ముగించబడిన రోగనిదానవిచారణ-అది జాతీయ భావి నిర్ణయసూచిక - మన కార్యరంగంలో మనకు లభించే ముడి వస్తువులనుబట్టి వ్యక్తుల ఆర్థిక క్రియా విధానమున్నూ సూచిస్తూన్నదది'' అన్నారు. ఆచార్య కుమారప్ప దానినిగూర్చి అందులోని విషయాలను సంగ్రహంగా మనవి చేస్తాము.

### 1. ప్రభుత్వ విధులు

ప్రతి సాంఘికసంస్థా, పెద్దజాతి కానీయండి, ఒకరాష్ట్రీయ రాజకీయ కేంద్రం కానీయండి, సంకుచిత విశాలదృక్పథాలకు తగిన సమాధానం కుదర్చగలిగి ఉండాలి. వ్యక్తిప్రయోజనం సాధారణంగా సంకుచితంగా ఉంటుంది. అది జాతీయక్షేమానికి విరుద్ధంగా ఉన్నప్పుడు, ఉభయు క్షేమాలను ఉచితపద్ధతిని సమన్వయపఱచడం సంస్థాపితసంఘధర్మం. అందువల్ల సంఘం మొత్తానికి అపాయము కలుగకుండా ఉంటుంది. అదే విధంగా గ్రామస్థుల ఆర్థికవ్యవస్థకు, పారిశ్రామికుల ఆర్థికవ్యవ

స్థకు ప్రయోజనాలలో విరోధం కలిగినప్పుడు, మొత్తంపైన జాతీయక్షేమంకోసం రెండువ్యక్తులకు సమాధానం కుదర్చడం అవసరం. ఈ పని చేయడానికి తగినసంస్థ ప్రభుత్వంకంటె మరొకటి లేదు. కాబట్టి రాజ్యపరిపాలనలో ఉన్నవారు అందరి క్షేమంకోసం ఈసందర్భంలో జోక్యం కల్గించుకోవడం న్యాయం. దుర్బలులహక్కులను ప్రభుత్వం రక్షించితీరాలి. అంతే కాదు వ్యక్తిచేయజాలని పనులు కొన్ని ప్రభుత్వం చేసి తీరవలసినవి ఉన్నవి. ప్రజల అవసరాలను పరిశీలించి వ్యాపార సౌకర్యాలను యేర్పాటు చేయడం వ్యక్తులకు సాధ్యమైనపని కాదు. అందుకు తగిన కాలంగానీ ధనంగానీ వారు వెచ్చించ లేరు.

## 2. పన్నులు - ఖర్చులు

ప్రజలనుండి పన్నులద్వారా లభించిన ద్రవ్యంవలననే ప్రభుత్వం నడుస్తున్నది. ప్రభుత్వం ప్రజలకోసమే ఉన్నట్లయితే, ప్రజల ఆర్థిక క్షేమానికి విరుద్ధంగా ఎన్నడూ పన్నులను విధించకూడదు. కాబట్టి పరిపాలకులు పన్నులను వెచ్చించే విధానం మొత్తంపైన జాతీయైశ్వర్యాన్ని పెంపొందించేటట్లు చూచుకోవలెను. పేదలనుండి పన్నులను వసూలుచేసి ధనవంతులను ఇంకా ధనవంతులనుగా చేయడానికి వినియోగించినట్లయితే, జాతీయైశ్వర్యవిభజనలో మానవవ్యక్తికి తగిన విలువ ఈయలేదని అర్థం. అతికఠినమైన ఆర్థికవిధానం గల ఇండియావంటి పేద దేశం సందర్భంలో ఈ విషయం

ఇంకా ఎక్కువగా వర్తిస్తుంది. వస్తువులను చౌకధరలో కొనమని బోధించడమే అర్థశాస్త్రము యొక్క ఉద్దేశం కాదు. ఎందువల్లనంటే ప్రభుత్వం కేవలం ధనసృష్టిలోనే వెచ్చించకపోవచ్చును. విదేశీవస్తువులకంటె స్థానికంగా తయారైన వస్తువు లెక్కువ ప్రియంగా ఉన్నప్పటికీ, వాటికి ఎక్కువ ప్రోత్సాహమివ్వాలి. అందువల్లఅక్కడిద్రవ్యం ఆరాష్ట్రంలోనే తిరుగుతూంటుంది ; వస్తువుధర పౌరుని పన్నులను భరించే శక్తికి భంగం రానీయదు ; ఐశ్వర్యం ఒక్కచోట గూడు కట్టుకొని ఉండక చక్కగా విభజింపబడుతుంది. స్థానిక వ్యాపారంఅభివృద్ధి అవుతుంది. విదేశీవస్తువులను కొన్నట్లయితే మారకం స్వేచ్ఛగా జరగడానికి వీలు లేకుండా కొనుగోలుశక్తి దేశసరిహద్దులను దాటిపోతుంది. ఎగుమతి దిగుమతి పన్నులు మారక నిర్ణయాధికారము సరుకుల రాకపోకల రేట్లనిర్ణయం-మొదలైన అడ్డగోడలను కట్టుకొంటూన్నంత వరకూ స్వేచ్ఛా వ్యాపారం వలనకలిగే పరస్పరక్షేమం కలుగుతుందని అనుకోవడానికి వీలు లేదు.

నేడు మన ఆర్థికవస్తుసముదాయం కృత్రిమ పద్ధతులతో శాసింపబడుతూన్నది. ప్రజలు ఉత్పత్తి చేసిన వస్తువుల చలామణికి ప్రభుత్వవ్యయం ఎలా తోడ్పడుతూన్నదో తెలుసుకోవడానికి నిరంతరం కన్నువేసి చూస్తూండాలి. వస్తువుల చౌకదనమే ప్రధానంగా పెట్టుకొని విదేశీసరుకులను కొనే ప్రభుత్వం, తనరాజ్యంలో నిరుద్యోగతను సృజించిన నేరానికి తానే గురి అవుతుంది. స్థానికోపయోగంకోసం ఉత్పత్తి అయిన

వస్తువు స్థానిక ప్రజలకు పని కల్పిస్తుంది. ఇక ఇతరరాష్ట్రం నుంచీ వస్తువులను తెప్పించుకొన్నట్లైతే ఆ వస్తువుల గిరాకీవలన కల్పించబడిన పని అంతా సరుకులను దిగుమతి చేసుకొన్న రాష్ట్రానికి లేకుండా పోయినట్లే. కాబట్టి ప్రభుత్వం పన్నులను వ్యయంచేసే విధానాన్నిబట్టి ప్రజలకు పని కల్పించనూవచ్చు పోగొట్టనూవచ్చు. దిగుమతి చేసుకొన్నవస్తు వెంత చౌకగా ఉన్నప్పటికీ, ప్రజలకు పోయినపనినిబట్టి చూస్తే దానిఖరీదు చాలా ఎక్కువే. కనుక చౌక అనే కారణంతో పైనుండి సరుకులను దిగుమతి చేయించుకొనే ప్రభుత్వం తన ప్రజలకు అపకారం చేస్తూన్నదనేమాట స్పష్టం.

### 3. పెట్టుబడి - రెక్కలకష్టము

మన ఆర్థికవిధానానికి పాశ్చాత్యుల ఆర్థిక విధానానికి కావలసినంత భేదమున్నది. పెట్టుబడికి కొఱత ఉండదనే భావంతో వారిసంస్థలు నిర్మింపబడినవి. పారిశ్రామిక పరివర్తనానికి ముందు తూర్పుదేశాల ఐశ్వర్యం పశ్చిమదేశాలకు ప్రవహించింది. అప్పటినుండీ వస్తువులను ఉత్పత్తి చేయడంలో కూలిఖర్చులను తగ్గించి మధ్య దళారీలకు ఎక్కువ ప్రతిఫలం ముట్టేటట్టు ప్రయత్నాలు చేస్తూన్నారు వారు.

మనదేశంలో ఏ గ్రామానికి పోయి చూచినా కూలిజనం ఎక్కువగా నున్నట్లు పెట్టుబడి తక్కువగా ఉన్నట్లు అర్థమవుతుంది. కాబట్టి మన అభ్యుదయవిధానం పెట్టుబడి లభించడం పైన ఆధారపడి ఉండకూడదు. కూలిజనం కావలసినంత ఉన్నదనే జ్ఞానంపైన ఆధారపడి ఉండాలి. పెద్దపెద్ద పెట్టుబ

డులు కావలసిన ముఖ్యపరిశ్రమల విషయంలోనూ, ప్రజోప యోగ కార్యముల సందర్భంలోనూ, ప్రకృతి సౌభాగ్యాన్ని ప్రజా క్షేమానికోసం వినియోగపరచడంలోనూ, ప్రజల పక్షాన ప్రభుత్వమే పనిచేయవలసి ఉంటుంది. ఈ ఇతర సందర్భాలలో ఈ ప్రమాణం పనికిరాదు. మనసందర్భంలో మన ఉత్పత్తి పరికరాలు కారు చౌకగా ఉండాలి. ఏదైనా సరుకును ఉత్పత్తి చేసేటందుకు కూలికింద ఎక్కువఖర్చు అయిందంటే ఆ సరుకు ఉత్పత్తిలోనే ద్రవ్యవిభజన సరిగా జరిగిందని అర్థం.

సాధారణంగా ప్రభుత్వానికి ఆదాయం ప్రజల సాంవత్సరిక ఉత్పత్తివలననే వస్తూన్నది. అది వారి పెట్టుబడినుండివచ్చే ఆదాలో భాగం. కాని ఒక్కొక్కప్పుడు చాలాకాలం మనుతుందనే ఉద్దేశంతో కూడా ప్రభుత్వంవారు విదేశీవస్తువును తెప్పిస్తూంటారు. ఇదికూడా ఆర్థికశాస్త్రరీత్యా తప్పు. ప్రజల సంవత్సరాదాయములనుండియే ప్రభుత్వానికి సొమ్ము వస్తూన్నది గనుక ప్రభుత్వంచేసే ఖర్చులుకూడా తమ సంవత్సరాదాయముపైననే ఆధారపడి ఉండాలని మా అభిప్రాయం. ఇందుకొక ఉదాహరణ మిస్తూన్నాము. మన గ్రామాలప్రక్కనూ అడవులలోనూ గూడా రైలుమార్గాల దరినున్న టెలిగ్రాఫ్ స్తంభాలు ఉక్కువి. దేశంలో ఎంతో కొయ్య ఉండగా ఆ ఉక్కుస్తంభా లెందుకు వేయాలి. పైగా ఉక్కు విదేశం నుండి దిగుమతీ అయింది. కొయ్య స్వదేశీది. భాగ్యవంతములైన అమెరికా ఇంగ్లండు దేశాలలో కూడా ఆ స్తంభాలు కొయ్యవే. ఇనుపస్తంభాలు వేయడానికి (కారణం) ఏమి చెబు

తారంచే కొయ్య చెడిపోతుంది, పుచ్చిపడుతుంది, ఉక్కు చాలాకాలం మనుతుందని చెబుతారు. దేశక్షేమానికి విరోధంగాఉండే ఖర్చులుచేసి ప్రభుత్వంగాని మఱొక ప్రజాసంస్థగాని యెన్నడూ అటువంటి కుంటి కారణాలుచెప్పకూడదు. కొయ్య ఉపయోగించినట్లయితే కావలసినంత మందికి పని దొరుకుతుంది. కొయ్య కొద్దికాలం మనేమాట నిజమే కాని చాలా చాకకూడాను ఎక్కువసార్లు కొత్తవి వేయవలసివస్తే మన పన్నులలోనుంచి వెచ్చించబడిన ఆ సొమ్ము దేశంలో ఇంకా ఎక్కువసార్లు తిరగడానికి సావకాశం కలుగుతుంది. ప్రజలనుండి తీసుకొన్న పన్నులను సాధారణంగా ప్రభుత్వం పెట్టుబడిగా వినియోగించకూడదు. అందువల్ల డబ్బు తిరగడానికి అడ్డంకు కలుగుతుంది. ఒక్కొక్కప్పుడు ప్రజల నిరుపేదతనానికికూడా కారణం కావచ్చును. పన్నులు చెల్లించే ప్రజలు దాదాపు జీవితావసరములను సంపాదించుకోగలిగిన వారుగా మాత్రమే ఉంటారు. అటువంటి వారి దగ్గరనుండి డబ్బు పుచ్చుకొని ఎప్పటికో భావికాలానికి దానిని దాచి ఉంచడం సరియైన ఆర్థికవిధానం కాదు. కాబట్టి అటువంటి సొమ్మును పెట్టుబడికింద కాకుండా, రెవిన్యూనుండి ఖర్చుబడేటట్టుగా చూడడమే సరియైన పద్ధతి.

ఈ పద్ధతివలన మఱొక ప్రయోజనంకూడా ఉన్నది. తాముపయోగించిన సామగ్రి త్వరలో శిథిలమైనట్లయితే ప్రభుత్వం తిరిగీ ప్రజలదగ్గరకు డబ్బుకోసం పోవలసివస్తుంది. అందువల్ల ప్రభుత్వం లావాదేవీలను గూర్చి ప్రజలకు తెలియు

జెప్పక తీరదు. అప్పుడు ప్రజాపరిపాలనా సంస్థలలో హద్దు పద్దు లేకుండా డబ్బు ఖర్చుపెట్టడానికి వీలుండదు.

ప్రతిసంవత్సరము గ్రామంనుండి ప్రభుత్వం తీసుకొన్న ఆదాయమూ, ఆగ్రామంమీద ప్రభుత్వం పెట్టిన ఖర్చూ తెలియ పరుస్తూ ఒక నివేదికను తయారు చేసి దానివి గ్రామములో నలుగురికీ కనబడే చోట - పోస్టాఫీసుకో ఆసుపత్రికో పాఠ శాలకో అంటించాలని కూడా కమిటీవారు సిఫారసు చేశారు.

మన ఆర్థిక వ్యవస్థలో సాధారణంగా అందరికీ అర్థంకాని విషయ మొకటున్నది. అది తెలుసుకొంటేనే గాని అసలు సంగతి తెలుసుకొన్నట్లుకాదు. ఇండియాలో బాగా వ్యాపించ వలసిన పరిశ్రమలు పెట్టుబడి మీద ఆధారపడేవిగా గాక పనిమీద ఆధారపడేవిగా ఉండాలని ఇదివరకే చెప్పిఉన్నాము. కేంద్రీకరణ పద్ధతులలో తయారైన విదేశీ వస్తువులతో పోటీ చేసేటంతవరకూ మన కుటీర గ్రామపరిశ్రమలను మనం పాడు చేయదలచుకో లేదు. గ్రామంలోకి పోయి ఒక్కసారి పరిశీలిస్తే అన్నంలేని పేదవాళ్ల ఇళ్లన్నీ మట్టితోనూ తడికల తోనూ కట్టి ఉన్నట్లూ, షాహుకారుల ఇళ్లు వ్యాపారస్తుల ఇళ్లు (మాల్ గుజార్లు) రాయి, సున్నం, పెంకులతో కట్టి ఉన్నట్లూ తెలుస్తుంది. ఇది కేవలం దరిద్ర చిహ్నమే కాదు; శతాబ్దాల తరబడి పరిస్థితులకు పరిసరాలకు అనుగుణంగా సరిపుచ్చుకొని వస్తూన్న ఆర్థిక వ్యవస్థలో ఒక భాగమని కూడా అర్థమవుతుంది. గట్టి ఇంటికి మరమ్మతు చేయడానికి బయట నుండి తాపీమనిషి రావాలి. పాకల విషయంలో అలాకాదు.

ఇండ్లూ వాళ్లే పడిపోయే గోడలకు అండలు వేసుకొని మోస్తు కొంటారు. కాబట్టి వాటితో కట్టిన ఇళ్లను మరమ్మత్తు చేయడానికి డబ్బు కావలసివచ్చి సాధారణంగా మరమ్మత్తు లేకుండానే ఉంటున్నాయి. ఆ ఇళ్లే మట్టితో కట్టిన ఇళ్లు - హరిజన వాడలలోని ఇళ్లుకూడా పరిశుభ్రంగా చూడ ముచ్చటగా ఉంటున్నాయి. దీనికి కారణం వాళ్ల రెక్కలకష్టమే వాళ్లకు డబ్బు.

## 4. డబ్బు - వస్తుమారక పద్ధతి

ఈ సందర్భంలో, ఒక ప్రమాణం ఏర్పాటుచేసుకొని, ఆ ప్రకారం కొంతసొమ్మును వస్తురూపంలో ముట్టచెప్పేపద్ధతి కూడా తగినదే నని మా అభిప్రాయం. డబ్బు ఉపయోగాన్ని కూర్చి పదేపదే నొక్కినొక్కి మాట్లాడుతూంటారు చాలా మంది. దీనికి ప్రభావం పాశ్చాత్య ఆర్థిక నిర్మాణం వలన కలిగింది. అక్కడిపరిశ్రమలకు కావలసిన ముడిసరుకులను దూర ప్రదేశాలనుండి తెప్పించు కోవడం ముఖ్యావసరం గనుక డబ్బుతో పని పట్టింది వారికి. ముడిసరుకులకోసం దూరం పోయిన కొద్ది డబ్బుతో అవసర మెక్కువ కలుగుతుంది. డబ్బుకు వచ్చిన ఈ ప్రాముఖ్యత వలన గ్రామస్థులు విదేశీ వ్యాపారస్థుల దయా దాక్షిణ్యాలకు తలలొగ్గ వలసి వచ్చింది. వారు తమ వ్యాపార స్థలాలను ఎక్కువ చేసుకొని అక్కడ నుండి తమ దేశపు సరుకులను తీసికొని వచ్చి అమ్ముతూంటే ఇక్కడి వారు ఆపడాని కధికారం లేక గుడ్లు మిటకరించుకొని చూడవలసి వస్తూన్నది. డబ్బు జీవితానికి కావ

లసిన ముఖ్య అవసరాలను వేటినీ తీర్చగలిగిన సరుకు కాదు. కాబట్టి మనిషి కేవలం డబ్బుతో బ్రతకలేడు. కాని డబ్బుకు వచ్చిన ప్రాముఖ్యతను బట్టి డబ్బు కలవాడు ఇతర సరుకులు కలవాడి కంటే మిన్నగా ఉంటాడు. అందువలన బేరంలో సరుకు గలవాడి కంటే డబ్బున్నవాడి చేయి పైగా ఉంటుంది. కాబట్టి డబ్బు ఇతరుల జీవితాలను చేతిలో పెట్టుకోవడానికి మనిషికి గల శక్తిని నిరూపిస్తుంది. బంగారం దానంతటది తరిగిపోదు. కాని దానికి మారుగా లభించే సరుకులు చాల వరకు సహజంగా కాలం గడచినకొద్దీ తరిగి పోతూంటాయి. కాబట్టి మనం నాణెముల ఆర్థిక విధానాన్ని విరివిగా గ్రామాలలో ప్రవేశ పెట్టినట్లయితే, పేదలను భాగ్యవంతుల చేతి కప్పగించడమే. డబ్బు లోహరూపంలో ఉండడం మంచిదని ఎంత చెప్పినప్పటికీ, కుళ్లిపోయే సరుకున్న పేదవానికీ కుళ్లిపోని లోహము గల భాగ్యవంతునికీ పోటీ వచ్చినప్పుడు పోల్చి చూస్తే అందులో ఉన్న అన్యాయం అర్థమవుతుంది. కనుక గ్రామస్థులు ప్రపంచ వాణిజ్యం జోలికిపోక తమ ఉత్పత్తి శక్తుల మీద ఆధారపడి ఉండడం ఎక్కువ మంచిది.

## 5. వస్తు మారక పద్ధతి - ప్రభుత్వ నిధులు

ప్రభుత్వ వ్యయం కోసం ప్రజల నుండి తీసుకోబడుతూన్న కొనుగోలు శక్తిలోని మానవ మూల్యమును తగ్గించే వైఖరి ఈ సందర్భంలో ఎక్కువగా కనబడుతుంది. జీవితావసరము లను కూడా సంపాదించుకొనే శక్తి లేనివారు పెద్ద పెద్ద జీతాలు పుచ్చుకొనే ప్రభుత్వోద్యోగులను భరించ వలసి

వస్తూన్నది. ఈ కమిటీ సభ్యులు గ్రామస్థుల అతిథులుగా ఉండవలసి వచ్చినప్పుడు మట్టినేల మీదనో వసారాలలోనో, లేక అనారోగ్య భూయిష్ఠమైన పశువుల చావడి దగ్గరనో నిద్రించ వలసి వచ్చినది. ఇది గ్రామస్థుల ఆతిథ్యలోపం వలన కలిగిన చిక్కు కాదు - పేదవాళ్ల హృదయాలు పెద్దవిగా ఉంటవి - కాని పాపం వాళ్ళ జాక్కానాలు చిన్నవి. అతిథుల కోసం వేరే ఒక చిరిచాప వాళ్ళింట్లో లేదు. ప్రభుత్వానికి వచ్చే పైకం చాల వరకీ ప్రజలనుండే వస్తూన్నది. కాని ప్రభుత్వ వ్యయ పద్ధతిని బట్టిచూస్తే వారాసంగతిని గమనించి నట్లే తోచదు ఒక్క అసెంబ్లీ విశ్రాంతి గృహం 1,32,000 ఖరీదయింది. భూమి మీద మంచి మంచి తివాచీలు పఱచి ఉన్నవి. గదులన్నీ మహావైభవంగా మనోహరములైన ఉప కరణాలతో నిండిఉన్నవి. మన శాసన సభ్యులందరు సంవత్స రానికి రు. 15 ల ఆదాయం గల గృహస్థులకు అతిథులు. కాని ఒక్కొక్క యం. ఎల్. ఎ. ఉండే గది ఖరీదు రు. 3,300. ఇటువంటి రాజ హర్మ్యాల వలననే మానవ మూల్యంలో జాతీయైశ్వర్యం తగ్గి పోతున్నది.

ప్రభుత్వం వారి రెవిన్యూ కొంతవరకైనా వస్తురూపంలో వసూలు చేయబడినట్లయితే, కొంత ఉపయోగ కరంగా ఉంటుందని మా అభిప్రాయం. అందువల్ల వారు వసూలు చేసిన వడ్లు కానీ, గోధుమలు కానీ స్థానికోద్యోగుల జీతాల కింద ఈయవచ్చును. ఈ ధాన్యాలను అమ్మడంలో గ్రామస్థులకు పట్టణస్థులకు కలిగే పోటీ కూడా కొంత తగ్గుతుంది. ప్రభు

త్యానికి ధాన్యం వసూలు చేయడంలో కష్టమున్న మాట నిజమే కాని అందువల్ల ప్రజలకు కలిగే లాభాలను యోజించి నట్లయితే ఆ కష్టమొక లెక్కలోనిది కాదు. పూర్తిగా వస్తు రూపంలోనే పన్నులన్నీ పుచ్చుకోవలెనని మేము సిఫారసు చేయడంలేదు. కాని సరియైన పద్ధతిలో వస్తు రూపంగా కొంత వరకు పన్నులను వసూలుచేసే విధానాన్ని ఆచరణలో పెట్టినట్లయితే చాలా వరకు ప్రజల కష్టాలు గట్టెక్క గలవని మా అభిప్రాయము.

## 6. ముడి పదార్థాలు - ఉత్పత్తి లాభం

మరొక ముఖ్య విషయం కూడా ఆలోచించాలి. సాధారణంగా ముడి పదార్థం ఉత్పత్తి అయిన స్థితిలో శ్రమకు ముట్టే ప్రతిఫలం కంటే, వస్తు రూపంలో అమ్మకం కోసం తయారు అయిన స్థితిలో శ్రమకు ముట్టే ప్రతిఫలం ఎక్కువగా ఉంటుంది. దీనికి కారణం కొనేవారు ఆ ఖర్చును భరించ గలిగిన శక్తి వంతులుగా ఉండడమే. ఈ సంగతి చాలా మంది సరిగా గ్రహించడం లేదు. తక్షణం ఉపయోగించడానికి వీలుగా తయారైన వస్తువు రు. 100 లకు అమ్మితే తేలికగా రు. 5 ల లాభం ఉండవచ్చును. అదే వస్తువును చేసేటందుకుపయోగించిన రు. 10 ల ముడి పదార్థంలో దామాషాగా 0-8-0 లాభం రావచ్చును. కాని రు. 5 లు లాభం ఉండదు. కాబట్టి ముడి పదార్థం ఉత్పత్తి చేసిన వానికంటె, దానిని వస్తు రూపంలో తయారు చేసిన కర్మకారునకు ఎక్కువ ప్రతిఫలం ముట్టుతుంది. కొన్ని ప్రదేశాలలో, ఈ రెండు పనులూ,

ఒక్కరే చేస్తాండవచ్చును. అందువలన సంఘం మొత్తం మీాద మేలు కలుగుతుంది. కాని ప్రస్తుత సంఘ వ్యవస్థలో కొంత మంది సరుకులను తయారు చేసేవారు, మరి కొంత మంది ముడి వస్తువులను ఉత్పత్తి చేసేవారు. ఈ రెండో వారు మొదటి వారికి కొన్ని వేలమైళ్ల దూరంలో ఉండడం వీరిరువురి మధ్య అనేక కృత్రిమ ప్రతిబంధకాలుండడం తటస్థిస్తూన్నది. మొదటి వారు నిరంతరం హాయిగా తగినంత సంపాదించుకోవడం, రెండో వారు నిరంతరం తగినవిలువ రాక బాధపడడం జరుగుతూన్నది. ముడి వస్తువుల ఎగుమతి పేదరికాన్ని నిరుద్యోగతను, కల్పించడానికి కారణమవుతూంటుంది. ముడి పదార్థాలను ఉత్పత్తి చేయడం వరకే అయినట్లయితే మొత్తం మీాద వ్యవసాయం లాభదాయకం కాదు. ప్రతి ప్రభుత్వం మొత్తం సంఘమంతటికీ యేది ప్రయోజనకరమో ఆలోచించాలి; ఆహార పదార్థాలు ప్రజలకు ఎక్కువగా క్షేమం చేకూర్తుస్తవనీ, డబ్బు కానీ, ఇతర వాణిజ్య సస్యాలు కాని ప్రజలను దరిద్రులనుగా చేస్తవనీ, గ్రహించాలి. కిందటి తరం నుండీ వాణిజ్య సస్యాలను వృద్ధి చేయాలని ఒక అనవసర ప్రచారం బయలుదేరింది. దాని దుష్ఫలితం గ్రామాలలో ఇప్పుడు ప్రత్యక్ష మాతూన్నది.

ఫ్యాక్టరీల కోసం వాణిజ్య సస్యాలను వేస్తూన్న రైతుకూ ఫ్యాక్టరీ కూలీలకు భేదం లేదు. ఈ రైతు కూడా తన స్వాతంత్ర్యాన్ని కోల్పోతున్నాడు. ఫ్యాక్టరీల వారితో తనకు లాభదాయకంగా ఉండేటట్లు బేరమాడుకోనే శక్తి అతనికి లేదు.

కాబట్టి అతని ముడి పదార్థానికి బహుతక్కువ విలువ లభిస్తూన్నది. రైతు స్వతంత్రాభిలాషి అని ప్రతీతి కాని అతను ఆహారపదార్థాలను ఉత్పత్తి చేయడమూ, తానూ తన ఇరుగు పొరుగువారూ కలిసి, ప్రజలకు ఉపయోగకరములైన సరుకులను తయారుచేసేటందుకు తగిన పంటలను పండించడమూ మానివేసిన కారణముచేత, అతని సంప్రదాయసిద్ధమైన స్వాతంత్ర్యప్రియత్వాన్ని పోగొట్టుకొంటూన్నాడు.

ఈ మార్పువలన రైతుకు కలుగుతూన్న దుష్ఫలితాలను మన వ్యవసాయశాఖవారి విధానంకూడా ఇంకా ఎక్కువ చేస్తూన్నవి. వారి పరిశోధనలన్నీ ముఖ్యంగా వాణిజ్య సస్యాలను అభివృద్ధి చేసేటందుకే జరుగుతూన్నవి. ఇది కేవలం హ్రస్వదృష్టితో చేస్తూన్నపని. గృహపరిశ్రమద్వారా పంచదార చేయడానికి తగినతాడిచెట్లు పుష్కలంగా దేశంనిండా ఉన్నవి, కాని వాటిని పూర్తిగా నిర్లక్ష్యంచేసి ఫ్యాక్టరీ పంచదారకోసం చెఱుకుపంట పండించమని రైతులకు పదే పదే సలహా యిస్తున్నారు వారు. అందువలన చక్కగా గోధుమలు పండేభూమి కావలసినంత చెఱుకుపంట కుపయోగించబడుతూన్నది. ఇది రైతుల కెక్కువ వ్యయప్రయాసలకు కారణమవుతూన్నది. ముడిపదార్థాలను ఆహారసామగ్రిగా తయారుచేసేటందు కేమీ ఆలోచనలు జరగడమే లేదు. హిందూదేశంలో నూనె ధాన్యాలూ బాగా ఉత్పత్తి అవుతవి. కాని ఈదేశంలో వాటిని ఉపయోగకరపదార్థాలుగా తయారుచేయడంలేదు; అవి విదేశముల కెగుమతి చేయబడుతూన్నవి.

అక్షి పదార్థాల కీదేశంలో ఎక్కువ అవసరం కూడా ఉన్నది. నూనెతో తయారైన సామగ్రికి తగిన అంగళ్లు ఎక్కువగా ఉన్నట్లయితే, మనం మన పంటనూనెలు వెలగడానికి తగిన దీపాలను తేలికగా కనిపెట్టగలిగి ఉండే వాళ్లము. అప్పుడు మనకు వేలకొలది గ్యాలనుల కిరసనాయిలును దిగుమతి చేసుకోవలసిన అవసరం ఉండేది కాదు.

## 7. పరిపాలనా దక్షత లేక సృజన శక్తి

పరిపాలనాసామర్థ్యం అనే పేరుతో ప్రభుత్వం బహు సంకుచితంగా పరిణమించింది. కొన్ని హద్దులను దాటినట్లయితే సామర్థ్యం కూడా అపాయకరంగా పరిణమిస్తుంది. పెద్ద ఉద్యోగస్థులు, ఆఫీసు కట్టువాళ్లు చేయగల రోజువారీ పనితో మునిగి తేలుతూన్నారు. వాళ్లకు ఆలోచించడానికి గాని, తమంతట తామేదైనా పని ప్రారంభించడానికి గాని సావకాశం లేదు. దాని మామూలు కర్మకాండతో 'పరిపాలనా దక్షత' కరుడుగట్టుకొన్నది. సృజన శక్తులు పూర్తిగా నశించినవి. నష్టమూ వద్దు లాభమూ వద్దు అనే సూత్రానికనుసరించి ప్రభుత్వ వ్యయం నడుస్తూన్నట్లు తోస్తూన్నది.

### ఉత్పత్తికి అడ్డంకులు

ప్రభుత్వానికి డబ్బు చేకూర్చవలెననే ఆతురతతో వస్తువుల ఉత్పత్తిదశలన్నింటిలోనూ అనేక రకాల పన్నులు విధింపబడుతూన్నవి. వాటి వలన ఉత్పత్తికి అడ్డంకు లేర్పడుతూన్న సంగతి వారాలోచించడం లేదు. ముడి పదార్థానికి

ఈ పన్నెంత సన్నిహితంగా ఉంటే ఉత్పత్తి కంత ఆటంకం కలిగిస్తూన్నది. ఒక పరిమాణంగల ముడి పదార్థాలపైన మొట్ట మొదటి దశలో వేసిన ఎనిమిదణాల పన్ను, చివరిదశలో వేయవలసి వచ్చినట్లయితే, పడవలసిన ఎక్కువ పన్నును సాధారణంగా పడకుండా చేస్తుంది. కాని ప్రస్తుత పన్నుల పద్ధతి కల్పవృక్షాన్ని కట్టెపుల్లలకు వినియోగిస్తూన్నట్లున్నది. గవర్నమెంటువారి పన్నుల భారం పరిశ్రమలను అణచి వేస్తూండగా పైపెచ్చు మాల్గుజార్లు, స్థానిక సంస్థలు వాటి స్థితిని దుర్భరం చేస్తూన్నారు. ఈ లోపాన్ని సవరించడానికి తక్షణం తగిన చర్య తీసుకోక పోయినట్లయితే పరిశ్రమలు చాలా తొందరలోనే ప్రమాదావస్థలోకి రాగలవు. మాల్గు జారులు డబ్బులాగుతూన్న పద్ధతిని ప్రభుత్వంవారు జాగ్ర త్తగా పరిశీలన చేయాలి. అవసరమైతే వారినుండి ప్రజలను రక్షించడానికి తగిన శాసనాలు చేయాలి. పెద్ద గ్రామాల లోని మున్సిపాలిటీలు అవలంబించే ధన సంపాదనా పద్ధతి యెంత మాత్రమూ శాస్త్రసమ్మతంగా లేదు. కావలసిన డబ్బు వసూలు చేయడమే వారి ముఖ్యాభిప్రాయం. గ్రామా లనుంచి వచ్చే సరుకులపైనను, తదితర వస్తువులపైనను అనా లోచితంగా సరిహద్దు పన్నులను విధించే మున్సిపాలిటీల మూలకంగా అనేక పరిశ్రమలు నాశనమవుతూన్నవి. కొన్ని జిల్లా మున్సిపాలిటీలు కూడా ఈ పనినే చేస్తూన్నవి. పాపం గ్రామస్థులకు తాము చెల్లించే పన్నులలో ఉన్న మెళుకువ లేమీ తెలియవు. అప్పుడప్పుడూ అజ్ఞానంవల్ల తాము చెల్లించ

తగిన వాటి కంటె కూడా ఎక్కువ పన్నులను చెల్లించు తూంటారు. కాబట్టి ఈపన్నుల విధానం శాస్త్రసమ్మతంగా ఉన్నదో లేదో విచారించడం ప్రభుత్వంవారి విధి. ఇందువలన వారు గ్రామ పరిశ్రమలకు సహాయం చేయ లేకపోయినప్పటికీ అధమం అపకారం చేయకుండా ఉన్నవా రవుతారు.

ఇక ప్రస్తుత పన్నుల పద్ధతి వలన ముడి పదార్థాల ఖరీదెక్కువవుతూన్నది. పరిశ్రమల పరిస్థితిని గమనించకుండా విడదీసి ఆలోచిస్తే, పన్ను తక్కువగానే కనిపిస్తూంది. కాని పన్నులను విధించడంలో దేశ కాల పాత్రాలు సరిగా గమ నింపబడడం లేదు.

గ్రామాలలోని అంగళ్లన్నీ విదేశీసరుకులతో నిండిఉన్నవి. విదేశాలు మన ఉత్పత్తి అవకాశాలను ఉపయోగించు కోవడంవలన మన దేశంలో యెంతమందికి పని దొరకకుండా పోతూన్నదో తెలుసుకోవడానికిది మంచి నిదర్శనం. గ్రామా లకు దిగుమతీ చేయబడుతూన్న ఈ విదేశీసరుకులపైన ఎక్కువ అమ్మకంపన్ను విధించి, స్థానికోత్పత్తులపైన పన్నులను తీసి వేస్తే మున్సిపాలిటీలు గొప్ప ఉపకారం చేసిన వవుతవి. ప్రధాన జీవితావసరములుకూడా గ్రామాలలోకి నేడు దిగు మతి అవుతూన్నవి. ఇవి ఎంత ఎక్కువగా గ్రామాలలోకి వస్తే అంత ఎక్కువమందికి గ్రామాలలో పని ఉండకుండా పోతుంది. వస్తువుల రాకపోకలను కూడా తెలివిగా ఏర్పాటు చేయవలసి ఉన్నది. ఈ పనులన్నీ పరిశ్రమల శాఖవారు చేయ వలసినవి. అధమం గ్రామాలలోనైనా విదేశీవస్తువులు కన

బడకుండా పోవాలి. కాని అందుకు విరుద్ధంగా జరుగుతూన్న దిప్పుడు. కాబట్టి గ్రామ ఆర్థిక విధానానికి అపాయకరములైన వస్తువు లేవో జాగ్రత్తగా పరిశీలన జరగాలి.

ఈ నివేదికనుగూర్చి కొన్నిమాటలు సంగ్రహంగా చెప్ప దలచుకొన్నాము. ఇది మన ఆర్థికవిధానానికీ పాశ్చాత్య ఆర్థికవిధానానికీ గల భేదాన్ని విశదంగా నిరూపిస్తూన్నది. పాశ్చాత్య దేశాలలో పెట్టుబడి పుష్కలంగా ఉన్నది. ఉత్పత్తికర్యే కూలిఖర్చులను తగ్గించి దళారి వ్యాపారస్తులకు ప్రతిఫలం ఎక్కువ ముట్టేట్టుగా చూడడం వారి ఉద్దేశం. మన దేశంలో పెట్టుబడి తక్కువ. కాని కూలిజనం ఎక్కువ. సాధారణంగా ప్రభుత్వానికి ఆదాయం ప్రజల సాంవత్సరిక ఉత్పత్తివల్లనే లభిస్తూన్నది. అది వారి పెట్టుబడినుండి వచ్చే ఆదాలో భాగం. ప్రజల సంవత్సరాదాయములనుండే ప్రభుత్వానికి సొమ్ము వస్తూన్నది గనుక ప్రభుత్వం చేసే ఖర్చులు కూడా తమ సంవత్సరాదాయముపైననే ఆధారపడి ఉండవలెననే సిద్ధాంతాన్ని ఇండియా గవర్నమెంటు గ్రహించాలి. అయితే ఇండియాలో కొయ్య టెలిగ్రాఫ్ స్తంభాలు వేయడానికి వీలుండగా, పైనుండి ఉక్కుస్తంభా లెందుకు తెప్పించాలి? అమెరికా, ఇంగ్లాండు దేశాలలోవి కొయ్యస్తంభాలనే మాట నిజమేకదా? నార్వే, స్వీడనులలో కూడా కొయ్య వేనే. కొయ్య జీర్ణించిపోతుందనే వాదం సరియైనది కాదు. మన అడవులలో కొయ్య నిరంతరం పెరుగుతూనే ఉంటుంది. ఇక గృహనిర్మాణమునుగూర్చి ఒక మంచి ఆర్థికవిషయం సూచింప

జరిగింది. ఒక గట్టి ఇంటిని మరమ్మతు చేయడానికి మట్టిఇల్లు
మరమ్మతుకంటె చాలా ఎక్కువ సొమ్ము ఖర్చవుతుంది.
అందువలననే గ్రామస్థుల రెక్కలకష్టానికి ఎక్కువ విలువ
ఉండడం. రాతిఇళ్లకంటె గ్రామస్థుల మట్టిఇళ్ళెక్కువ పరి
శుభ్రంగానూ మహాముచ్చటగానూ ఉంటవి. డబ్బు మనిషి
యొక్క ముఖ్యవాంఛలను దేనినీ సంతృప్తిపరచలేదు.
కాబట్టి డబ్బున్నంతమాత్రంతో మనిషి జీవించజాలడు.
డబ్బు విదేశాలనుండి ప్రవేశపెట్టబడిన సరుకు. అది ఒక
చోట గూడుకట్టుకొని పోతుంది. మరొకచోట మాయ
మౌతుంది. కరెన్సీపైనా, మారకంపైనా గల సర్వాధికారాల
వలన బజారులో డబ్బు ఎక్కువచేయవచ్చు, తక్కువచేయ
వచ్చు. ఖరీదులను పెంచవచ్చు, తగ్గించవచ్చు. ఇవన్నీ
వ్యాపార శాంతికి ఎప్పటికప్పుడు భంగం కలిగించే పరిస్థితులే.
కాబట్టి గ్రామఆర్థికస్థితి వస్తు మారకపద్ధతిపైన ఆధారపడి
ఉండాలి. నాణెముల ఆర్థికపద్ధతి (Money economy) ని
ప్రవేశపెట్టడమంటే పేదవాళ్లను భాగ్యవంతులచేతి కప్పగిం
చడం. కుళ్లిపోయే వస్తువును కుళ్ళిపోని వస్తువుకు పోటీగా తుల
తూచవలసివచ్చినప్పుడు, అందులోని అన్యాయం అర్థ
మవుతుంది. ముడిపదార్థాలను ఉత్పత్తి చేసే వానికంటె,
వస్తురూపంలో సరుకులను తయారుచేసేవానికి ఎక్కువ ప్రతి
ఫలం ముట్టుతుంది. కారణం ముడిపదార్థం కొనే మనిషికంటె
తయారైన వస్తువు కొనే మనిషికి, ఆ ఖర్చు భరించగలశక్తి
ఎక్కువ వుండడమే. ఈ సంగతి ఎవ్వరూ సరిగా గమ

నించడం లేదు. ఇందుకు ఫలితంగా కొంతమంది నిరంతరం హాయిగా తగినంత సంపాదించుకోవడమూ, మఱికొంత మంది తగిన విలువ రాక నిరంతరం బాధపడుతూండడం జరుగు తూన్నది. ముడిపదార్థాల ఎగుమతి దేశంలో దరిద్రవ్యాప్తికీ, పని లేకపోవడానికీ కారణ మవుతూన్నది. ఫ్యాక్టరీలకోసం డబ్బు పంటలను పండించే రైతు ఫ్యాక్టరీకూలీకంటె అధికుడు కాడు. పారిశ్రామిక సస్యములకంటెను, ఆహారసస్యముల కంటెనూకూడా వాణిజ్యసస్యముల అభివృద్ధినిగూర్చియే మన వ్యవసాయశాఖవా రెక్కువగా పనిచేస్తూన్నారు, వారు తాడిచెట్లమాట మఱిచేపోయినారు. చెఱకుపంటకు చేయ వలసిన కృషి చాలా ఎక్కువయినప్పటికీ, మిల్లులకు ముడి పదార్థం సప్లయి చేసేటందుకు వారావిషయంలో చాలా శ్రద్ధ తీసుకొంటూన్నారు. దక్షత అనేదానిని ప్రభుత్వంవారు పరమ దైవంగా పూజిస్తూన్నారు. కాని 'దక్షత' అనే పేరుతో హద్దులు దాటి డబ్బు ఖర్చుపెట్టడం అపాయకరమని వారు గ్రహించి నట్లు కన్పించదు. పరిపాలనా దక్షత మామూలు కర్మ కాండలతో పాషాణరూపం తాల్చింది. సృజనశక్తులు చచ్చి మంచువలె గడ్డకట్టుకొని పోయినవి.

కమిటీవారు 606 గ్రామాలనుగూర్చి విచారణచేసి తేల్చిన విషయాలు ఆశ్చర్యాన్ని కలిగిస్తూన్నవి. గ్రామస్థుని సగటు ఆదాయం సంవత్సరానికి రు 12 లను మించి ఉండదని వ్రాశారు. భారతీయుని సగటాదాయం సంవత్సరానికి 65 మొదలు 80 వరకూ వుంటుందని ఇదివరకు కొంతమంధి

రాజకీయవిశారదులు పరిపాలనాదక్షులు చెప్పగా విన్నాము. అయితే 65 మొదలు 80 వరకూ వుంటుందన్న సగటాదాయం ఇండియాలోని ప్రజలందరికూ సంబంధించింది. అందులో జమీందారులు, కోటీశ్వరులు, మధ్యతరగతుల వారూ కూడా వున్నారు. నేతపరిశ్రమవంటి కళాకౌశలం చూపవలసిన పనులుచేసే వారి కుటుంబాదాయంకూడా సంవత్సరానికి 50 మొదలు 70 వరకూ మాత్రమే వుంటుంది. మన పరిశ్రమలు పారిశ్రామిక పరిశ్రమలు కాకపోయినట్లయితే సరియైన ఆహారం ఎలా ఏర్పాటు చేయడం? పనివాళ్ళు తినే ఆహారం బియ్యంగానూ సరిగదా ఇంకేధాన్యము కూడ కాదు. వారు నూకలగంజి త్రాగుతూన్నారు. దానిలో ఎంత ఎక్కువ నీరుంటే అంతకొందరగా పొట్ట నింపుతుందని దానినే ఆశిస్తూన్నారు వారు. దీనికితోడు మరబియ్యం దాపరించినవి. అవి ఆరోగ్యానికీ భంగమే, ఆర్థికంగానూ నష్టమే. ఒక బియ్యపుమర 7,000 మంది అన్నం తీసివేస్తుంది. పత్తివిత్తులు తీసేమర రోజు 1 కి 90 కుటుంబాలకుగానీ లేక 400 మంది వ్యక్తులకు గానీ లభించే అన్నం తీసివేస్తుంది. నేసేమర రోజుకు 1,000 కుటుంబాల అన్నం లేక 5,000 మంది మనుష్యుల అన్నం తీసివేస్తుంది. నేతవృత్తికి సన్నిహితంగా వుండే ఇతర వృత్తులనుకూడా అది నాశనం చేస్తుంది. అందువల్ల మరి 200 కుటుంబాలకు గానీ, లేక 1,000 కడుపులకు గానీ అన్నం తీసివేస్తుంది. గ్రామాలను పునరుజ్జీవింపచేయవలెనంటే అక్కడి వృత్తులను పునరుజ్జీవింపచేయాలి, గోధుములు

ఆస్ట్రేలియానుండీ, నూకలు సయాంనుండీ రావడం అలా ఉండగా, ఉరలగడ్డలు ఇటలీనుండీ, చూపిల్సు జపాను నుండీ వస్తూన్నవి. డబ్బులేనిరోజులలో పన్నులు వసూలు చేయబడుతూన్నవి. ఇంతకంటె పన్నుల క్రింద వడ్లు ఎందుకు పుచ్చుకోకూడదో తెలియడం లేదు. వయోజన విద్యను గూర్చి ప్రతివారూ మాట్లాడుతూన్నారు. గ్రామాలకు రేడియోలు వస్తూన్నవి. కాని ఇవన్నీ గ్రామస్థుల పొట్టలు నింపవు.

గ్రామాలకు క్రొత్త భావాలను తీసికొనిపోవడం లేదు. క్రొత్త పనిముట్లు, పరికరాలు వారికి సప్లయి చేయబడడం లేదు. గ్రామనాయకులకు, ఉద్యోగస్థులకు సజీవమైన సన్నిహిత సంబంధం లేదు. కేవలం మ్యాజిక్ లాంతర్ల ఉపన్యాసాలవల్ల గ్రామస్థులకు విజ్ఞానం కలుగదు. చిన్నచిన్న పరిశ్రమలను మొదటినుండి చివరవరకూ, పనిచేసి చూపినందువలన అన్నం లేక అల్లాడుతూన్న కోట్లకొలదీ ప్రజలకు అవి ఏవిధంగా పనిని కల్పిస్తవో అర్థమౌతుంది. ప్రభుత్వానికి వచ్చే ఆదాయంలో చాలాభాగం అధికార్ల జీతాలకే అయిపోతూన్నది. మధ్యరాష్ట్రాల ఆదాయం 4.75 కోట్లు. ఈ పైకం వసూలు చేసే ఖర్చుల క్రింద, ఉద్యోగస్థుల జీతాల క్రింద 3.65 కోట్లు అయిపోతూన్నది. షుమారు ఒక కోటిరూపాయలు మాత్రమే నిర్మాణ కార్యాలకు మిగిలిపోతూన్నది. గ్రామాలలో ఎక్కడా చెప్పుకోదగిన రోడ్లు లేవు. ఆసుపత్రులు, పశువైద్య శాలలు, పోష్టుఆఫీసులు, విద్యాసౌకర్యాలు, ఆరోగ్యరక్ష

ణకు తగిన ఏర్పాట్లు, అంటుజాడ్యాలు రాకుండా వుండే సదు పాయాలు లేవు సరిగా చీట్లు చివరకు నీటి వసతులుకూడా లేని గ్రామాల కిచ్చిన్న మొత్తంతో ఏమి ఉపకారం జరుగుతుంది. రేడియోవల్ల ఈపరిస్థితులన్నీ చక్కబడవు. ఆకలితో అల్లాడు తూన్న ఈప్రజలకు గ్రామపరిశ్రమలుమాత్రమే ఆహారంచేకూ ర్చగలవు. మనుష్యులు త్రాగేనీరు ఎంతో అపరిశుద్ధంగా ఉంటుంది. వ్యవసాయానికి తోడుగాఉండే తాడువేనడం లాటి పరిశ్రమలు విదేశీవస్తువుల దిగుమతితో పాడయి పోయినవి. కమిటీవా రీదిగువ గ్రామపరిశ్రమల విషయంలో జాగ్రత్త తీసి కొనవలెనని సిఫారసు చేస్తున్నారు:

'వడ్లదంపు, పిండి విసరడం, నూనె గానుగ ఆడడం, బెల్లం చేయడం, పంచదారపరిశ్రమ, తేనె తయారుచేయడం, కుండలు చేయడం, గ్లాసుపని, సబ్బులుచేయడం, పత్తితో చేసేపనులు (అనగా పత్తి వలవడం, గింజలు తీయడం, ఏకడం, వడకడం, నేయడం, ఉతకడం, రంగువేయడం) ఉన్ని వడకడం, ఉన్ని నేయడం, గొర్రెలను పెంచడం, వడ్రంగం, కమ్మరిపని, పట్టు తయారుచేయడం, చాప అల్లడం, తాడు పేనడం, తోలు ఊనడం, మృతకళేబరాలనుతగులబెట్టడం లేక పాతివేయడం, చేపలను పెంచడం, కోళ్లనుపెంచి అభివృద్ధిచేయడం, పాల ద్రవ్యాలను తయారుచేయడం, కంచర పని, బొమ్మలు చేయడం, కాగితం తయారుచేయడం, రాకపోకల ఏర్పాట్లు చేయడం, లక్కపరిశ్రమ, వెదురు, నిప్పుపుల్లలను తయారు చేయడం, బీడీ పరిశ్రమ.

## ఎడ్ల బండ్లు

పొలంలో చేసేపనికీ కొద్దిదూరం ప్రయాణం చేయవలసి నప్పుడూ యంత్రాలను ఉపయోగించడంకంటె జంతువుల నుపయోగిస్తేనే తక్కువ ఖర్చువుతుంది. కాబట్టి ఈ రెండు సందర్భాలలోనూ జంతువులు యంత్రాలతో పోటీచేయగలవు. ఈ రోజులలో జంతువుల నుపయోగించడం పూర్తిగా మాని యంత్రాల నుపయోగించడం ఆచారంకిందకు వస్తూన్నది.

ఇందుకొక ఉదాహరణం: నూరు రూపాయిల బండీ, రెండు వందల రూపాయిల ఎడ్లు ఉన్నవనుకోండి. ఈ ఎడ్లు గ్రామాలలో, మిట్టపల్లాలుగా ఉన్న ఇసుక రోడ్ల మీద 16 బెంగాలు మణుగుల బరువు వేసుకొని రోజుకు 15 మైళ్ళ చొప్పున ఆ బండిని ఈడ్చుకొనిపోగలవు. ఇందువల్ల 0-12-0 ఎడ్లకు, 0-6-0 బండి వానికీ, 0-4-0 బండీ అరుగుదలకు మొత్తం రోజుకు రు. 1-6-0 ఖర్చువుతుంది. ఒక టన్ను మోసే మోటారు లారీ ఈ 15 మైళ్ళే ఈడ్చుకొని పోవడానికి ఒక గ్యాలను పెట్రోలు, కొంత క్రూడ్ ఆయిల్, పోషణ ఖర్చులు ఎన్నో మరమ్మతు ఖర్చులు పెద్దజీతం తీసుకొనే డ్రైవరూ కావాలి 15 మైళ్ళునడవడానికీ ల్యూబ్రికేటింగుఆయిలుఖరీదు పెట్రోలుఖరీదు రు. 1-12-0. రోజుకు 8 గంటలకు 0-6-0 చొ॥ పోషణ ఖర్చులు 0-12-0. డ్రైవరు, క్లీనరు, లారీపైన సామాను లెక్కించి దింపే మనుష్యులకూ కూలి 0-8-0 కాబట్టి మొత్తం ఖర్చులు 2-12-0. 16 బెంగాలు మణుగుల బరువు మోయడానికి బండికి రు.1-6-0 మాత్రమే అవుతుందన్న మాట. ఒక్క ఎద్దులబండీ

ఒక రోజులో గ్రామంలో నుంచి అరమైలు దూరాన ఉన్న పొలానికి 7, 8 బళ్ళ ఎరువు తీసికొనిపోతుంది. అందువల్ల రు. 1-6-0 బండి ఖర్చులును, ఎరువు బండిలో పోయడానికి తీయడానికీ కావలసిన పైమనిషికి 0-6-0 మొత్తం 1-12-0 అవుతుంది. ఈ పని చేయడానికి మోటారు లారీని ఉపయోగించినట్లయితే తక్కువ ఖర్చు కాదు. మంచి కంకర రోడ్డు పైన ఒక్క నాడే చాలా దూరం పోవలసివచ్చినట్లయితే మోటారు లారీలు ఎక్కువ లాభదాయకం. అటువంటి సందర్భాలలో చాలా నెమ్మదిగా నడిచే ఎడ్లబండ్లు అందువల్ల లాభదాయకం కాదు. అంతేకాక ఒకే పర్యాయం జంతువులను చాలా దూరం నడిపించడం వలన వాటి బలము, శక్తి నశిస్తుంది.

అధ్యాయం 14

# విద్యా పునర్నిర్మాణం

## జాతీయ విద్య

నేటి సంఘటనలు అపూర్వ లక్షణంతో అత్యంత వేగంగా నడుస్తున్నవి. మన పిల్లలు పెరుగుతూన్నప్పుడు వారి అవయవ శాఖాల్లో కలిగే మార్పులను చూస్తూన్నప్పటికీ ఏలా గమనించలేమో అలాగే దేశంలో కూడా, సాంఘిక నిర్మాణంలో, సిద్ధాంతాలలో ప్రజా సంస్థలలో అతి వేగంగా కలుగుతూన్న సంపూర్ణ పరివర్తనాలను కూడా గమనించలేకుండా ఉన్నాము. దీనికి కారణం, రోజురోజూ, గంటగంటా జరిగే అభివృద్ధిని చూస్తూండడమే, ఈ మార్పు యాభై సంవత్సరాలనుండీ మన కళ్లయెదుట జరుగుతూన్నది.

ఈ సంగతి భారత రాజకీయ పోరాటాల విషయంలోనూ, నిర్మాణ కార్యక్రమ శాఖల విషయంలోనూ కూడా యథార్థంగా వర్తిస్తుంది. రాజకీయాలు బహిరంగంగా ప్రజల దృష్టిని ఆకర్షిస్తవి. నిర్మాణ కార్యక్రమం నిశ్శబ్దంగా తెలియకుండా జరుగుతూంటుంది. హిందూస్థాన్ తాలిమీ సంఘం మొదటి మూడు సంవత్సరాలలో నిర్వర్తించిన కార్య విస్తీర్ణతను గమనించినప్పుడు మాకాశ్చర్యం గలిగినందున పైమాటలు చెప్పవలసివచ్చింది. గాంధీజీ, విద్యా విషయంలో గానీ ఆర్థిక విషయాలలో గానీ, నైతిక రాజకీయ విషయాలలో గానీ చెప్పిన అభిప్రాయాలు కొత్తవికావు. కాని ఆయన వాటిని

బోధించిన విధానం మాత్రం ప్రపంచాని కాశ్చర్యం కలిగిం చింది. మీ రొక రోగానికి చికిత్స చేయవలెనంటే యే పద్ధతుల మీద ఆ చికిత్స ఉండాలో ముందు నిర్ణయించుకోవాలి. రోగంలోని ప్రతి గుణానికీ ఔషధాన్ని నిర్ణయించేవాడు చేత కాని వైద్యుడై యుండాలి. ముందు రోగనిదానం చేసి, చికిత్సా విధానాన్ని నిర్ణయించుకొన్న వైద్యుడు, రోగం కుదర్చగలడని చెప్పవచ్చు. ఇప్పుడు ఇండియా అనుభవిస్తూన్న వ్యాధి యేమిటి? పట్టణాల ముందు గ్రామాలు నిర్లక్ష్యం చేయబడడమా? గ్రామ పరిశ్రమలు పోయి యంత్రాలు పైకెక్కడమా? స్వదేశీ వస్తువులకు బదులుగా విదేశీ సరుకు దిగుమతి కావడమా? దేశీయ సంస్కృతి నశించి విదేశ సంస్కారం వ్యాపించడమా? స్వయంసంపూర్ణత అడుగంటి ముడి పదార్థాలకోసం అంగళ్లకోసం పాకులాడే అడియాస అధికం కావడమా? ఆత్మసంతృప్తిగల జాతీయత, సర్వభక్షకసామ్రాజ్యతత్వంచేత కుంగిపోవడమా, చట్టం ముందు న్యాయ్యం అడుగంటడమా, పంచాయితీలుపోయి వ్యాజ్యాలు పెచ్చు పెరగడమా, సత్యం మాయమై లా కోర్టులలోని మోసపు మాటలకు విలువ హెచ్చడమా, ధర్మాలను గమనించకుండా వాక్కుల కోసం పోరాడడమా, ఐకమత్యం కంటె కక్షలను ప్రధానంగా భావించడమా, నిషేధం లేకుండా మత్తు పదార్థాలను పుచ్చుకోవడమా? సహకారం కంటె స్పర్థకు చోటియడమా, ఆనందంగా జీవనం చేయడం మాని పరస్పర హత్యాబుద్ధితో రక్తపిపాసులై సంచరించడమా? — ఇవన్నీ

పోగలక్షణాలు. అహింసపైన హింస ఆధిపత్యం వహించడం అసలు పోగం. కాబట్టి గాంధీసిద్ధాంతంలోని అసలు పనితన మంతా ఆయన నిర్మాణ కార్యక్రమంలో ఇమిడి వున్నది. అదే ఆయన రాజకీయ పోరాట విధానానికీ ఆయన నిర్మాణ కార్యక్రమానికీ రెండింటికైన్నూ. నిర్మాణ కార్యక్రమాన్ని మాట్లో సంగ్రహంగా చెప్పవలసివస్తే, క్రియా రూపకమైన అహింస అని చెప్పాలి. ఒకచోట ప్రాథమిక విద్యా విధానం సంస్కరింప బడవచ్చును. మరొకచోట ఖద్దరుద్వారా ఆర్థిక నిర్మాణం పునరుద్ధరింపబడవచ్చును. ఇంకొకచో అస్పృశ్యతా నివారణ మూలకంగా జాతీయైక్యతకోసం ప్రయత్నాలు జరుగవచ్చును. ఈ అన్నిటిలోనూ అహింసాక్రియ మూర్తీ భవించి ఉంది. ఎందువల్లనంటే విదేశీవస్తువుల దిగుమతి మూలకంగా అన్నంలేక అల్లాడుతూన్న గ్రామస్తులకు ఖద్దరు ఆహారం కల్పిస్తుంది. హరిజనుల ఆత్మగౌరవానికీ,మర్యాదకూ భంగకరంగా ఉన్న అంటరానితనం రూపుమాయడంవలన వారికి సాంఘికౌన్నత్యం కలుగుతూన్నది. విదేశీ ప్రభుత్వానికి దాసులనుగాజేసి వారి నైతిక సాంఘికవిజయాలకు ద్రోహదం చేసిన ప్రస్తుత విద్యావిధానానికి బదులుగా జాతీయ విద్యా సంస్థాపనం వలన దేశంలో సర్వతోముఖంగా అభ్యుదయ బీజాలు అంకురిస్తూన్నవి.

## బిడ్డ - జాతి

విద్య జాతీయావసరముల కనుగుణంగా బిడ్డను అభివృద్ధిచేసే ఒక కళ, ఒక శాస్త్రం. అది యువకులను సాంఘిక యంత్రనిర్మా

ణంలో తగిన భాగాలుగాచేసే విధానమనికూడా కొందరం టారు. పుట్టిన ప్రతిబిడ్డ కేవలం తల్లిదండ్రుల సొత్తుకానీ కుటుంబానికి ఆధారం కానీ కాదు. అది జాతిధనం. కాబట్టి ఆబిడ్డకు ఇచ్చేశిక్షణ జాతీయాదర్శాలకూ, వాంఛలకూ అనుగుణంగా ఉండాలి. ఏమిటీ ఆదర్శాలు? అవి ప్రాచ్యపాశ్చాత్య దేశాలకు వేరువేరుగా ఉన్నవి. పాశ్చాత్యదేశాల వారికి అధికారం కావాలి. వారి పరిశ్రమలు అభివృద్ధి కావాలి అందుకు తగిన ముడిపదార్థా లొకమూలనుండి రావాలి. మరొకమూల వారి వస్తువుల అమ్మకానికి తగిన అంగళ్లు ఉండాలి. ఇవన్నీ ఉన్నప్పుడు వారి వారి శ్రామి కౌన్నత్యమును నిలుపుకోవడానికీ, సాగించుకోవడానికీ రాజకీయాధిక్యతను కోరడం సహజం. ఇదంతా శాంతి సమయంలో అనగా తక్కిన దేశాలు వారికి బలికావడానికి నోరెత్తకుండా ఒప్పుకొంటూన్నప్పుడు జరిగే పని. ఏ నాడా దేశాలిందు కంగీకరించవో ఆనాడే యుద్ధం వస్తుంది. కాబట్టి శాంతిసమయంలోనే యుద్ధానికి సన్నాహాలు జరుగుతూండాలి కనుక ప్రతియుద్ధము శాంతితో అంతమైనట్లు, ప్రతిశాంతి స్థాపనము యుద్ధానికి భావిసూచకంగానూ సన్నాహంగాను పరిణమిస్తూన్నది. పాలక దేశాల యువకులు సామ్రాజ్యతత్వము నందును, పాలిత దేశాల యువకులు బానిసత్వము నందును శిక్షణపొందవలసివస్తూన్నది. అందువలననే విద్యాపరిశ్రమలు సాంఘికైకమత్యము, స్వయంసంపూర్ణత — వీటిలో పాలక పాలిత దేశాలకు సంఘట్టనం, కలుగుతూన్నది. పాలిత పాలక దేశాల ఆదర్శాలు భిన్నంగాఉండితీరాలి. గాంధీ ప్రారం

భించిన ప్రాథమిక విద్యావిధానం చూడగానే స్వప్నవృత్తాంతంగా తోచవచ్చును. కాని స్వపరిపాలిత దేశాలలోని విద్యావిశారదులు ఇంతవరకూ అవలంబిస్తూన్న 'లాబ్యాకు' పద్ధతికీ దీనికీ ఏమీ భేదం లేదు. బ్రిటనులో గ్రామ, కుటీరపరిశ్రమలు ఎక్కడో మారు మూలలలో ఒకటి ఒకటి ఉంటవి. కాని మిల్లులు, ఫ్యాక్టరీలు, యువకులకు నిజమైన శిక్షణాలయాలు. ఇక ఏ కొద్దిమంది యువకులో విశ్వవిద్యాలయ శిక్షణపొంది బ్రిటిష్‌సామ్రాజ్యంకింద ఉన్న 62 దేశాలలోనూ పరిపాలకులుగా తయారవుతారు. మన దేశంలోని జనసంఖ్యలో నూటికి 80 మంది గ్రామాలలో నివసించే వారే. కాబట్టి పురాతన గ్రామ పరిశ్రమలను అణగదొక్కే యంత్ర నాగరికత నూటికి 80 మందికి వినాశహేతువుగా పరిణమిస్తుంది. కాబట్టి మన ప్రాథమిక విద్య మన జాతీయ జీవితానికనుగుణంగా యువకులను తయారు చేసే పద్ధతిలో ఉండాలి.

క్రైస్తవ ధర్మోపాధ్యాయునికి అన్ని ఆత్మలూ విలువగలవే.
జడ్జికి అన్ని హక్కులూ రక్షింపబడ దగినవే.
కాని ప్రొఫెసరుకు అందరు బుద్ధులు సమానమైనపదును గలవి కావు.
ధర్మజ్ఞానంలోను న్యాయశాస్త్రంలోనూ అంతా ఒకటే అని చెప్పితే చెప్పవచ్చును కాని యూనివర్సిటీలోమాత్రంఅలాచెప్పడానికి వీలులేదు. అక్కడ మధ్యరకపు తెలివి తేటలు పనికిరావు. సోదరమానవులకు మార్గదర్శకమైన అఖండ పాండిత్యం ఉండితీరాలి.
తెలివిగల భాగ్యవంతులు కష్టజీవులకంటె అధికులుగా ఎన్నడూ పరిగణింపబడకూడదు.

— జాక్ డ్యూయీ

విద్య పరిసరాల ఫలితం. మనం స్వయంపోషణ, ఆత్మ గౌరవం, తెలివితేటలు గలిగి పనిచేయాలి. పారిశ్రామిక జీవితంలోవలె సాంఘిక, ప్రాకృతిక సిద్ధాంతజ్ఞానంలో స్పర్థ ఉండదు.

విద్య సంఘక్షేమంకోసమే వినియోగింపబడవలె నని గాంధీ అభిప్రాయం. ఇప్పుడది వ్యక్తుల కోరికలను తీర్చుటాని కుపయోగపడుతూన్నది.

నేటి యూనివర్సిటీవిద్య పెట్టుబడిదారీ విధానానికి చెలికత్తె. అది పెద్దపెద్ద పరిశ్రమలకోసం భౌతిక శాస్త్రజ్ఞులనూ ఇంజనీయర్లనూ తయారుచేస్తుంది. కాని రాటంవంటి గృహపరిశ్రమలకేమీ ఉపయోగపడదు. కాబట్టే గ్రామాల సహాయార్థం వార్ధా విద్యావిధానం ప్రారంభించబడినది.

ఇటీవల భారతజాతీయ మహాసభకు మఱియొక అంగంగా, అఖిల భారత జాతీయవిద్యాసంఘం ఒకటి, అ. భా. చ. సంఘమునకూ, అ. భా. హరిజనసంఘమునకూ సమానప్రతి పత్తిలో ఉండేపద్ధతిని స్థాపింపబడినది. ఈ విధంగా మన నిర్మాణకార్యక్రమం అ. భా. చ. సం. ద్వారా పారిశ్రామిక జీవితానికీ, హరిజనసంఘం ద్వారా నైతికజీవితానికీ, జాతీయ విద్యాసంస్థద్వారా ఆర్థిక సాంఘికజీవితానికీ నూతన రూప మిస్తూన్నది.

జాతీయ విద్యా సంఘ ఆదర్శాలను, కార్యక్రమాన్ని ఇండియాప్రభుత్వమునకు చెందిన విద్యాశాఖాధికారి మిస్టరు

సర్జెంటున్నా, మద్రాసు విద్యాశాఖా డైరెక్టరు మిస్టరు స్టాతెమున్నా, ఇంకా అనేకమంది విద్యాశాఖాధికారులున్నూ విద్యా విశారదులున్నూ శ్లాఘించారు. 30 సంవత్సరాలు చేసిన ప్రయత్న ఫలితంగా వ్యతిరేక మార్గాలను నడుస్తూన్న రెండు విద్యా విధానాలను — ప్రభుత్వ, జాతీయవిద్యా విధానాలను — ఒకేచోటకు తీసికొని రాగలిగినాము. ఈ ఉభయ విధానాల కలయిక వలన పొంగి పొరలెత్తిన భావతరంగాలు, సంఘ నివేదికల రూపంలో బయల్వెడలి జాతీయ సంస్కృతీ వాహినిని విశాలం చేస్తూన్నవి. అవి కేవలం విద్యా ప్రపంచానికే గాక, జాతీయాదర్శాల కనుగుణంగా శిక్షింపబడిన యువకుని సామర్థ్యంమీద ఆధారపడవలసిన భావిభారత భాగ్యోదయానికి కూడా ఎంతో అమూల్య సేవ చేస్తూన్నవి.

## జీవిత విశ్వవిద్యాలయం

స్వేచ్ఛా వాతావరణంలో, సంఘటనా విద్వత్పరిషత్తులలో, మానవ సంభాషణా విద్యా మందిరాలలో, సద్గ్రంథ సాహచర్యంలో, ఉదార భావపూరిత కార్యకలాపనియతితో మన జనసామాన్యం బుద్ధివైభవం, ధైర్య వివేకాలు సంపూర్ణ ఆత్మ నిగ్రహం సంపాదించి నరేంద్ర మండలిలో మెలగుతూ వారికి మకుటాయమానంగా ఉండగలగాలి. నేటి విశ్వవిద్యా పరిషత్తుల సంకుచిత విరుద్ధ సిద్ధాంతాలు ఆ విధానాన్ని పరమ దైవంగా భావిస్తూన్నవి. వాటిని విడిచివేయ వలసిన తరుణ

మానసన్నమయినది. పరీక్షా ఫలితాలు పరమావధిగా ఉండ
కూడదు. పద్ధతులు మంచివిగా ఉండాలి. పాండిత్యం బుద్ధి వైభ
వానికి దోహదం చేయాలి. విద్యాపద్ధతి అంతకూ శీలం అలం
కరణంగానూ, సంస్కృతి ఆదర్శంగానూ ఉండాలి. నిష్కళంక
మైన దృక్పథమూ, స్పష్టమైన ఊహ, ఉచితమైన భావం, ఉదార
మైన సంకల్పము కలిగించి ప్రజలను తమ దేశసౌభాగ్యంకోసం
పనిచేసే ప్రవీణులనుగా తయారు చేయగలిగి ఉండాలి విద్య.
ఈ విశ్వాసంతో పని చేస్తూన్న జాతి ప్రస్తుత పరివర్తనాలలో
గాని, రానున్న పరిణామాలలోనూ, పోరాటాలలోనూ గాని,
లక్షలాది ప్రజల ప్రేమకూ కృతజ్ఞతకూ పాత్రమై, కనీసం
పదమూడు వేల సంవత్సరాల నుండి ప్రపంచ సభ్యజాతు
లలో సగర్వంగా నిలబెట్టి హిందుస్థానాన్ని నిష్కళంకితంగా
తమ భావి సంతానానికి సమర్పించ గలదు. ఇదే మన విద్యా
విధానాన్ని గూర్చి గాంధీ ఆశయం - ఇదే ప్రజా సమూ
హంలో ఆకారం తాల్చిన ఆదర్శం - ఇదే విశ్వాసమనే
అగ్నిలో పుటంగా కాల్చబడి జీవితానుభవము లనే సమ్మెట
పెట్లతో రూపం పొందిన సిద్ధాంతం. - ఇదే ప్రజలను తన
వెంటరమ్మని ఆదేశిస్తూన్న దృక్పథం, ఆ ఆదర్శంకోసం
ఆసిద్ధాంతం కొఱకు, ఆ దృక్పథం నిమిత్తం స్వార్థాలను త్యజిం
చడం వలననే, గాంధీకి, గాంధీతో ఉన్న కొంత మందికీ,
ఆకీర్తి ఆ దక్షత కలిగినవి. డిగ్రీలను బట్టి, ఆస్తిని బట్టి, మరణ
కాలంలో విడిచి వెళ్ళిన ఐశ్వర్యాన్నిబట్టీ మనుష్యుల విలువను
గొప్పతనాన్నీ కొలుస్తూండడం మాకసహ్యం. మనిషి స్వప్ర

యోజనం కోసం జీవిస్తూన్నారా! లేక ప్రజాక్షేమం కోసం జీవిస్తూన్నారా అనేదే మనిషి గొప్పతనానికి సరియైన పరీక్ష. వారు చదువుకొన్న చదువు స్వార్థం కోసం ఉపయోగ పడు తూన్నాదా? ప్రజాసేవలో వినియోగ పడుతూన్నదా? అనే ప్రశ్నకువచ్చే ప్రత్యుత్తరాన్నిబట్టి విద్యాపద్ధతి మంచిదా కాదా అని నిర్ణయించాలి. ఆర్థిక, జాతీయ సంస్కృతులకు సంబంధించి, జాతీయ విద్యా విధానాన్ని పరిశీలించవలసి యున్నది. ముందు ఆర్థిక విద్యాస్వరూపాన్ని విచారిద్దాము.

## (1) ఆర్థిక దృష్టి

ప్రతి కాలంలోనూ, ప్రతి యుగంలోనూ, ప్రతి శకం లోనూ కూడా ఏదో ఒక విషయంపైన ప్రజలలో తీవ్రవిభే దాలూ, వాద ప్రతివాదాలూ చెలరేగుతూనే ఉంటవి. ఒక కాలంలో వ్యక్తిగత నిరంకుశాధికారము, మరొక యుగంలో మధ్యతరాలనాటి జమీందారీ విధానం, మరొక శకంలో జాతీయ తత్వమూ విజృంభిస్తూ ఉండినవి. ఈ విశాల దృక్పథ ములే అనేక స్థానిక శాఖావిభేదాలుగాను, సాంఘిక విభా గాలు గానూ, వివిధ వర్గాలు గాను, విభిన్న సంప్రదాయ సమూహాములు గానూ పరిణమిస్తూంటవి. ఆ పరివర్తన కాలం లోనే వ్యాపారం లాభాలకోసం చేయాలా ప్రజా క్షేమం కోసం చేయాలా? పరిశ్రమలకూ శిల్పానికీ సంబధం లేకుండా చేయవచ్చునా? యంత్ర సామగ్రి కళాభివృద్ధికి దోహదం చేస్తుందా; అభ్యంతరం కలిగిస్తుందా? కళాకౌశలమునకు

పాండిత్యమూ, జ్ఞానమూ, అవసరమా ? విద్య ప్రైవేటు వ్యాపారంగా, ప్రభుత్వపరంగా ఉండాలా లేక సామాజికంగా ఉండాలా? పాఠశాలలు స్వతంత్రంగాను, స్వచ్ఛందంగానూ ఉండాలా; లేక అచ్చును గుద్దినట్లు దేశమంతా ఒకే పద్ధతిని నడుస్తూండాలా? పరీక్ష, తప్పకుండా ఉండవలసిన భాగ్యమూ లేక తప్పించుకోవడానికి వీలు లేని పాప ఫలితమా? ఉద్యోగాలూ వివాహ సంబంధాలూ పరీక్షా ఫలితాలనుబట్టీ, డిగ్రీలను బట్టీ లభించ వలసిందేనా? ఎవడి అంతరాత్మకు తోచినట్లు వాడు నడుచుకోవడంలో జీవితం సుఖప్రదంగా ఉంటుందా లేక శాసనమును బట్టి ప్రజాభిప్రాయమునుబట్టీ నడుచుకోవడంలోనా? — అనే ఈ ప్రశ్నలన్నీ రాజనీతి విశారదులను, రాజకీయ ధురంధరులను, విద్యా ప్రవీణులను, సంఘ సంస్కర్తలను, ఆర్థిక శాస్త్రవేత్తలను, భౌతిక శాస్త్రజ్ఞులను, ఎటు చూసినా దేశంలోని స్త్రీ పురుషుల తీరిక సమయాలలో తీవ్రవాద ప్రతివాదములకు కారణము లవుతూన్నవి.

## అక్షర జ్ఞానము : సంస్కృతి

విషయాన్ని విచారించడంలో, చదువుకోనివాళ్ళంతా సంస్కారం లేనివాళ్ళనీ, చదువనూ వ్రాయనూ తెలిసిన వాళ్ళుమాత్రమే సంస్కారం కలవాళ్ళనే సర్వసాధారణాభిప్రాయాన్ని ముందుగా మన మనస్సులలోనుండి మనం తొలగించుకోవాలి. హిందూదేశంలోని మన గొప్పగొప్ప పండితుల్లలోనూ, ఉలేమాల్లలోనూ అనేకమందికి అక్షర

జ్ఞానమే లేని సంగతి మనకు తెలుసు. ఇది వింత విషయమే. కాని వారు చక్షురక్షరసంయోగం లేకుండా శాస్త్రం కంఠస్థం చేసుకొన్నమాటమాత్రం నిజం. సంస్కారానికి అక్షరజ్ఞానం ప్రధానం కాదు. యుగయుగాలనుండీ కూడా ఇదే విధంగా భారతీయ విజ్ఞానం నిలబడి వ్యాపిస్తూ వస్తున్నది. ఒక్క విజ్ఞానమే కాదు సంస్కృతికూడా తండ్రినుండి కొడుకుకు పరంపరగా వస్తూనే ఉన్నది. ప్రతి ఇల్లూ పాఠశాలయే. ప్రతి తండ్రీ ఉపాధ్యాయుడే. ప్రతి కుటీరమూ కర్మాగారమే. ప్రతిరోజూ చేసే పనియే శిక్షణ. పనిలోని ప్రతి పరిణామ విధానమూ ఒక పరీక్ష. ఉత్పత్తిచేసిన ప్రతి వస్తువూ ఒక డిగ్రీ. ఈవిధంగా ప్రతి కర్మకారుడు జీవిత విశ్వవిద్యాలయంలో మానవ పరిశ్రమ కళామందిరంలో సుప్రసిద్ధ శిల్పాచార్యుల, లేక శాస్త్రవేత్తల సాహచర్యంలో, సంబామణా పరంపరలలో ఒక పట్టభద్రుడవుతూన్నాడు.

మనదేశంలో చదువుకు మొదలు పట్టి పినుగువచ్చే పాఠ్యక్రమా (syllabuses) లేర్పాటుచేయబడినవి. అవి అందరికీ ఒక్కటే. విద్యార్థుల యోగ్యతలతో, అభిరుచులతో, తెలివితేటలతో, సంఘ మర్యాదలతో, సభ్యతలతో, జీవితావసరాలతో,నివాసప్రదేశాలతో యేమీసంబంధ ముండదు వాటికి. అది విద్యకాదు- ముద్రణాయంత్రం; సంస్కృతి కాదు - అర్థం లేనిచదువు; పరీక్ష కాదు - జూదం; విజయంకాదు - గాలిపాటు. ఇంతా అయితే అతనికి అన్ని వైపులా శూన్యం, ఎక్కడ చూచినా పెద్ద గొయ్యి. కింద అంతులేని అగాధం,

మైన అంటురాని ఆకాశం. విశ్వవిద్యాలయాలు స్థాపించబడి నప్పటినుండి ఈనాటివరకూ ఈ మార్గాలలో 80 సంవత్స రాలు గడిపాము. ఇంకా ఎంతకాలం ఈ అస్పష్ట ప్రయ త్నంలో మన జీవితాన్ని వృథాచేయాలి.

## జీవితము - విద్య

మనం పుట్టిన దినంనుండీ రోజూ నేర్చుకొంటూనే ఉన్నాము. ఏకష్టమూ లేకుండా ముందు ఊపిరి పీల్చడం తరువాత కారణంలేని చిఱునవ్వులు నవ్వడం, పిదప పాల కోసం ఏడవడం, పిమ్మట ఉయ్యాలలో పొర్లడం, చివరకు కూర్చోవడం, నిల్చుండడం, నడవడం, పరుగెత్తడం, పడడం లేవడం, ఉరకడం, ఆడడం అన్నీ నేర్చుకొంటూన్నాము. మూడేళ్ళ బిడ్డ చిట్టిపొట్టి మాటలు చెప్పడమే కాదు పెద్దపెద్ద వాక్యాలు దొర్లిస్తుంది. ఐదేళ్ళ బిడ్డ నీతో వాదించి తప్పు పట్టుకొంటుంది. ఏడేళ్ళ అల్లరిపిల్లకాయ భౌతికశాస్త్రంలోని ఆశ్చర్యకర విషయాలనుగూర్చి ప్రశ్నించి మనకు తెలియదని పిస్తాడు. పదేళ్ళ బిడ్డకు స్వతంత్రాలోచన ప్రారంభమవు తుంది. పదునాలుగేళ్ళవాడు పనిచేయడం ప్రారంభిస్తాడు. 18 ఏండ్లవాడు కళాకౌశలం సంపాదించి తనకు కావలసిన గృహోపకరణాలను, జీవితావసర వస్తువులను తయారు చేయడం మొదలుపెడతాడు. శిల్పకళావస్తువుల నమూనా లను గీసుకొని ఆ ప్రకారం తయారుచేస్తాడు వాటిని. ఇళ్లను మనోహరంగా అలంకరిస్తాడు. ప్రకృతి దృశ్యాలను చిత్రి

స్తారు. బొమ్మలు వేస్తారు. బట్టలు నేస్తారు. నగలు చేస్తారు. పరిసరాలను సౌందర్యవంతింగా చేస్తారు, వంట చేస్తారు, రోగుల శుశ్రూషం చేస్తారు, ఇళ్లు కడతారు, పనిముట్లను తయారు చేస్తారు, పంటలు పండిస్తారు, తోటలు వేస్తారు పశువులను మేపుతారు, దున్నుతారు, విత్తనాలు వేస్తారు, కలుపు తీస్తారు, కోతకోసి ధాన్యం నూరుస్తారు.

## వృత్తి పక్షపాతం

వేలకొలదీ వృత్తులు, కళలు, శిల్పవిద్యలు, వ్యాపారాలు ఉన్నవి ఇండియాలో - వీటిని బోధిస్తున్న వారెవరు? పరీక్షలలో జయాపజయాలను నిరూపిస్తున్నదెవరు? గెలిచిన వారికి బహుమానాలు, తప్పినవారికి శిక్షలూ యెవరు నిర్ణయిస్తున్నారు? - కుటుంబం తల్లి దండ్రులు, మేస్త్రీ, ముఠా నాయకుడు, సంఘం - వీరి మూలమున భారతీయ సంస్కార రేఖలు చెక్కు చెదరకుండా అనేక రూపాలలో విరాజిల్లుతూ న్నవి. కాబట్టి ఇప్పుడు మనకు కావలసినది ఒక విధమైన విద్యా మందిర పద్ధతి. ఆపద్ధతి ప్రకారం పురాతన శిల్పకళల యెడల వృత్తుల యెడల, పరిశ్రమల యెడల పక్షపాతం వహించి శిల్పాన్ని ప్రయోజనంతో సమ్మేళనం చేయగల దక్షత చేకూర్చడమే మన కర్తవ్యము. ప్రతి వస్తువూ ఉపయోగ కరంగా కళానైపుణ్యంతో ముద్దులు మూటగట్టుతూ ఉండాలి. ఇటువంటి సంఘ నిర్మాణం గలిగినందువలననే హిందూదేశ మొక పెద్ద సహకార సంస్థవలె - అనేక సమష్టి కుటుంబాలనే

కార్మిక సంఘములతో కూడిన కోఆపరేటివ్ ఫెడరేషనుగా ఉండేది. ఇందువలన భారతదేశమే గాక దాదాపు దేశంలోని ప్రతి గ్రామమూ కూడా స్వయం సంపూర్ణంగా ఉండేది. నేటి పాశ్చాత్య యంత్రోత్పత్తుల మూలమున కలిగిన నిరుద్యోగత కిది ఒక్కటే నివారణోపాయము.

కాబట్టి భావి భారతదేశంలోని విద్యా విధానం చాలా ప్రాముఖ్య స్థానం వహించగలదు. మన యువకులకు, ఎవనికి వారు తగియుండేటట్లుగా మనం శిక్షణ ఈయాలో నిర్ణయించుకోవాలి. పోటీపడి ఉత్పత్తిచేసే విధానం మన కక్కరలేదు. మనకు కావలసినది స్వయం సంపూర్ణత. అందుకు గాను మన పురాతన వృత్తులపైన వారికి పక్షపాతం కలిగించి తగిన శిక్షణ ఈయాలి. అప్పుడు హిందూ దేశపు మారుమూలలు కూడా స్వయం సంపూర్ణాలుగా ఉంటవి. వార్ధా ప్రణాళిక లోని విద్యా విధానమిదే. కాలం గడచినకొద్దీ దానిలోని ఆదర్శాలింకా వెల్లడియై ప్రజలసందేహాలకూ ప్రభుత్వోద్యోగుల విమర్శనలకూ సమాధానం కుదురగలదు. ఖద్దరు విషయంలో జరిగిందంతే కదా ? ఇరవై సంవత్సరాల నుండి అవిశ్వాసంతో అభ్యంతరాలు పెట్టినవారు నేడు ఆహాహా అంటూన్నారు.

## నూతన వ్యవస్థ

ఖద్దరు అర్థశాస్త్రంలో ఒక కొత్తపంథాను చూపిస్తూన్నది. విద్య, ఆర్థిక విషయాలు - ఈ రెండు ఒక దానిపైన ఒకటి

ఆధారపడి ఉంటాయి. కాబట్టి ఖద్దరు తదితర గ్రామ పరిశ్ర
మలూ ప్రచారంలోకి రాగానే, విద్యావిధానంలో వాటి కను
గుణమయిన మార్పును కాంగ్రెసు అవలంబించ వలసి
యున్నది. బ్రిటీషువారి విద్యావిధానమిప్పుడు పనికిరాదు. అది
వారవలంబించిన ఆర్థిక విధానాని కనుగుణంగా ఉంది. మన
ఆర్థిక విధానాన్ని కనుగుణంగా మన విద్యా పద్ధతి ఉండాలి.
ఇందులో మాత్రం ఏమీ పొరపాటుపడకూడదు. మన మిప్పుడు
ప్రతి విషయంలోనూ సంపూర్ణపరివర్తనం కోరుతూన్నాము.
పాత పద్ధతులు మూటాముల్లె కట్టుకొని పోవచ్చునిక. ప్రతి
ప్రవృత్తిలోనూ నూతన విధానం ఆరంభం కావాలి.

అయితే మనకు కొన్ని చిక్కులు లేకపోలేదు. మనమంత్రు
లకూ పెద్ద పెద్ద పర్మనెంటు ఉద్యోగస్థులకూ కూడా పూర్వ
పక్షపాతాలూ పూర్వ వాసనలూ పోలేదు. మన విరోధి
విధానమునుండి ఉత్పత్తి అయిన సరుకది. కాబట్టి అందుకు
భిన్నంగా వారుండజాలరు. కనుక వారి సభలను, వారి
తీర్మానాలను గమనించేటప్పుడు మనమాసంగతి మాత్రం
మఱచిపోగూడదు. మొదలు సత్యాగ్రహం దుస్తరమనిపిం
చింది. పిదప సత్యాగ్రహ ఫలితాల కనుగుణంగా పున
ర్నిర్మాణం చేయ ప్రారంభించినపుడు మాకది ఏటికి ఎదురీత
వలె కనిపించింది. కాని తరువాత సులభమైనది. అదే విధంగా
వార్ధా విద్యా విధానంక్రింద నడచే పాఠశాలలు కూడా కేవల
ప్రదర్శ కేంద్రాలుగా గాక జాతీయ పునర్నిర్మాణ మహా
కార్యక్రమంలో మార్గదర్శకము లయ్యేరోజు తొందరలోనే

సాగలము. వాటిని ఆర్థిక సంస్థలనండి, విద్యా సంస్థలనండి. రెండిటికీ అవినాభావ సంబంధమే.

## సంస్కార దృష్టి

కాంగ్రెసు మంత్రులు అధికారంలోకి వచ్చిన తరువాత కూడా ఇంకా జాతీయ విద్యనుగూర్చి మాట్లాడుతూనే ఉంటారు; ఇప్పుడా విద్యా విధానాన్ని ఆచరణలోకి తీసికొని రావచ్చును గదా ? దాని స్వరూపమేమిటో ఇప్పుడేల వెల్ల డించ రాదని మమ్మల్ని చాలా మంది అడుగుతూంటారు. ఇది నిజమే కాని మా మంత్రుల అధికారం నామ మాత్రం. వారు ఉద్యోగంలో ఉన్నారు. కాని సంపూర్ణాధికారాలు చలాయించ లేకుండా ఉన్నారు. నిజమైన అధికారాలన్నీ ఆయా శాఖల ఉన్నతోద్యోగుల చేతులలో ఉన్నవి. వారు పూర్తిగా కాదు సరిగదా కొంత వఱకైనా మంత్రుల ఆజ్ఞ లకు లోబడడం లేదు. అంతే కాదు మంత్రుల ఆశయాలతో గాని, భావ ప్రవృత్తులతో వారికే మీా సానుభూతి లేదు. మన మింకా గానుగ ఎద్దువలె ఆ పూర్వపు గాడిలోనే అడుగు తప్ప కుండా చుట్టుతిరుగుతూన్నాము. బళ్ళో వేసినప్పటి నుండి చదువు ముగించే వరకు మాతృ భాషలో మన బాలురకు పాఠాలు చెప్పించ లేకుండా ఉన్నాము. పరీక్షలపైన వ్యామోహం పూర్వం ఎంత ఎక్కువగా ఉన్నదో ఇప్పుడూ అంత ఎక్కువగానూ ఉన్నది. కేవలం భాష నేర్చుకోవడమే విద్య అనే దురభిప్రాయం నేటికీ, ఉపాధ్యాయులలో గాని,

బాలురలో గాని, తల్లిదండ్రులలో గాని పోలేదు. అందువలన పనికిరాని జనం ఎక్కువ కావడం తప్ప ప్రయోజనం లేదని తెలిసి కూడా ఆ దరువు మాన లేకుండా ఉన్నాము. ఒక వంక ఎంతో డబ్బు ఖర్చుపెట్టి నిరుద్యోగతను చేతులారా తెచ్చు కొని మరొక వంక దేశం నిరుద్యోగ సమస్యతో పీడింపబడు తూన్నదని గోల చేస్తూన్నాము. ఈ రోజున యువకులకు కూడా విశ్వవిద్యాలయ పట్టపరీక్షలపైన వ్యామోహం పోలేదు. వారికి పరిశ్రమలపైన శిల్పకళలపైన వర్తకంపైన మోజు కలిగి నట్లయితే గౌరవంగా జీవించ వచ్చును గదా? అయితే మన బాలురకు మనము నేర్పగల పరిశ్రమగానీ, వృత్తి గానీ వ్యాపారం గానీ యేమిటని మళ్ళీ ప్రశ్న వస్తుంది. మన యువకులు భావిభాగ్య సూచకమైన జాతీయ విద్యా సమస్య కూడా దేశంలోని పౌరుల భవిష్యద్భాగధేయమన తగిన జాతీయ స్వాతంత్ర్య సమస్య వంటిదే. మనకు సంపూర్ణ స్వాతంత్ర్యం ఉంటేనేగాని మన జాతీయాభ్యుదయమునకు కావలసిన, వాణిజ్య, పారిశ్రామిక, శాస్త్రీయఅధికారాలను వినియోగించడానికి వీలు లేదు. అనగా పరాయి దేశాల వారి శ్రేయస్సు కొఱకేర్పడిన పారిశ్రామిక వాణిజ్యరక్షణలు లేని సంపూర్ణ స్వారాజ్యంలోనే తప్ప భారత దేశ క్షేమాభ్యుదయాలు చిరస్థాయిగా ఉండవు.జాతీయ విద్య సర్వతోముఖంగా నిర్వర్తించవలసిన అవసరమిదే. కాబట్టి విదేశపరిపాలనా దాస్యమునుండీ విదేశ పారిశ్రామిక వాణిజ్యశృంఖలముల నుండీమన దేశాన్ని విముక్తి చేసే ప్రయత్నా లేక కాలమందు జరగాలి. ఇందుకు గాను మన జాతీయ సంస్కృతి యందు, దేశీయ శిల్పకళా కౌశ

లము సందూ మన యువకుల హృదయాలులో ఆసక్తి కలిగిం చాలి. ఇదే జాతీయ విద్యా సమస్యలోని కీలకము ఇందుకే బ్రిటిష్ విజయం కేవలం రాజకీయ విజయమే కాదు. వాణిజ్య, వైజ్ఞానిక, ఆధ్యాత్మిక విజయమని మేమంతా నెత్తిని నోరు పెట్టుకొని చెప్తూన్నది. యువకుల మనస్సులను, బ్రిటిష్ వారికి అనుకూలంగా ఉండే పద్ధతిని ఒకే అచ్చులో పోత పోస్తూండడం ఇండియాలోని ఇంగ్లీషు వారి స్వప్రయోజనం కోసం. అందువల్లనే ఇంగ్లీషు విజ్ఞానానికీ, ఇంగ్లీషు డిగ్రీలకు, బిరుదులకు, అధికారాలకు, పదవులకు, పింఛనులకు పొంగి బోర్లపడే శిక్షణ ఇస్తూన్నారు వారు మన యువకులకు. మన వాళ్లకు ఇంగ్లీషులో మాట్లాడడమంటే చాలా సరదా. ఇంటికి ఇంగ్లీషులోనే ఉత్తరాలు వ్రాస్తూంటారు. శుభలేఖలు ఇంగ్లీషులో అచ్చు వేయిస్తారు. ఇంగ్లీషు రాజభాషఅని కొంత మందీ, కోర్టులలో, కళాశాలలలో, గాన సభలలో, ఉప యోగిస్తూన్న భాషఅని కొంత మందీ, ప్రభుత్వంవారి ఆర్డర్లు రూల్సు, రెగ్యులేషనులు, స్టాండింగు ఆర్డర్లు, అన్నీ ఇంగ్లీషు లోనే ఉంటూన్నవని కొంత మందీ, ఇంగ్లీషుకు ఎక్కడలేని ప్రాముఖ్యతా అంటగట్టారు. అందువల్ల ప్రజలలో అన్ని తర గతులవారికీ తమలో తాము మాట్లాడుకొనేటప్పుడు కూడా ఇంగ్లీషు భాషను ఉపయోగించడమే సంస్కృతికి ప్రధాన చిహ్నమనే అపోహ బాగా వ్యాపించింది. శాసన సభలలో, కళాశాలలలో కోర్టులలో మన మాతృభాషలోనే మాట్లాడ వలసిందని మామిత్రులను ప్రోత్సహించడం మాకు చాలా

కష్టమనిపిస్తూన్నది. మాతృభాష ద్వారా విశ్వవిద్యాలయాలలో యావత్తు సాహిత్యమూ బోధించ వచ్చునని, దేశంలోని రాష్ట్రాలు భాషలను బట్టి విభజించ బడవలెననీ, కోర్టు వ్యవహారాలు కక్షిదారులకు తెలిసిన భాషలో జరిగే యెడల న్యాయ్య పరిపాలన ఎక్కువ సౌష్ఠవంగా ఉంటుందనీ ఎంతో కాలం నుండీ మేము వాదిస్తూన్నాము కాని చాలా మంది కేంద్రాలలో విదేశీ భాష నుపయోగించడం వింతగా తోచడం లేదు.

## శిల్పపు గనులు

భాషస్థితి ఇలా ఉండగా ఇక సంస్కృతికి సంబంధించిన స్థితి ఇంతకంటే దుర్భరంగా ఉంది. ఈ దేశంలో చిత్రలేఖనమే లేదని నమ్మేటంత వరకూ చదువుకొన్నాము మనం. శిల్పం ఏలాఉంటుందో ఇక్కడి ప్రజలెరుగనే ఎఱుగరనీ, పడమర నుండి వెలుగు రావాలి గాని తూర్పు నుండి రానే రాదనే, మనకు నేర్పిన విద్యలోని సారాంశము. వస్తువుల యథార్థ స్వరూపాలను అనుకరించవలెననే ఉత్సాహం, ఆధ్యాత్మిక చిత్రాలను రచించవలెననే కోరికను మఱుగు పరుస్తూన్నది. దేశంలో శిల్పకళయే విపరీతంగా మారిపోయింది. జయపూరు, ఉదయపూరులను, ఆగ్రా, ఢిల్లీ నగరాలను, జాబీపూరు ఔరంగాబాదులను, మధుర తంజావూరులను అలంకరించిన పురాతన శిల్పకళా విన్యాసములను చులకనగా చూస్తూన్నారు. ప్రాచీన దేవాలయ శిల్పనైపుణ్యం, ప్రతిమా

నిర్మాణ కౌశలం, చిత్రకళా విన్యాసం - ఇవన్నీ పరిశీలించేవారు లేక పాడయిపోతూన్నవి. ఇప్పటికైనా ఈ కళలలో అభిరుచి కలిగించడానికి మన మంత్రులకు అధమం అయిదువేల రూపాయలైనా ఖర్చు పెట్టడం అవసరంగా కనిపించ లేదు. తంజావూరు గ్రంథాలయంలోని వ్రాతపుస్తకాలు శతాబ్దాల నుండీ అశ్రద్ధ చేయడంవలన జీర్ణించి పోతూన్నవి. అవి పునరుజ్జీవనం పొందే శుభముహూర్తమెప్పుడు వస్తుందో తెలియదు. ఆ తాటాకు ముక్కల కుప్పలోనూ జీర్ణించి పోతూన్న పాత కాగితాలలోనూ ఉన్న విజ్ఞాన సర్వస్వమును వెలికి దీయవలెనంటే ఎంతో మహత్ప్రయత్నంచేసి, వ్రాత ప్రతులన్నిటికీ తిరిగీ నకళ్ళు వ్రాయించవలసి ఉన్నది. అందుకు రాష్ట్ర ప్రభుత్వాలు ఇంకా కొంత ఎక్కువ పైకం వెచ్చించక తప్పదు.

## భారతీయ శిల్పం

దేశంలో ఏమూలకైనా వెళ్ళండి, ఆ పురాతన శిల్పకళల ఔన్నత్యం, వైభవం, ప్రతిష్ఠ, అన్నీ కళకళ లాడుతూ చెక్కు చెదరకుండా ప్రత్యక్ష మౌతూంటవి. కాలంగానీ, విదేశీయుల దౌష్ట్యము గాని వాటిని రూపుమాప లేకపోయినవి. ఈ అత్యద్భుత విషయాలను పరిశీలించడానికి ఎక్కడ ప్రారంభించాలి? ఎక్కడ ముగించాలి? అత్యంత శ్రద్ధాభక్తులతో శతాబ్దాల తరబడి చేసిన కృషి ఫలితంగా రాతిలోనూ రంగులోనూ, ఇటుకలోనూ చిత్రించబడిన ఈ పురాతన

ఆదర్శ స్మృతి చిహ్నాలనుగూర్చి వేగంగా సింహావలోకనం చేయదలచుకొన్నాము. కులశేఖర మంటపం, బయలు దేరి తిరువేంకటం దేవాలయ వితానములపైని మిస మిసకగా కస పసుతూన్న చిత్రములను చూచి మధురలోని అనంత శిల్ప కళా కౌశలాన్ని దర్శించి, తంజావూరి ప్రతిమా నిర్మాణ కోమల విన్యాసములను వీక్షించి, అక్కడ నుండి రాతి చెక్కడములతో రమణీయములైన బేలూరు హాలిబీడులను హొయసలకచ్చిలోని వెండి బంగారు నాజూకు తీగల నగిషీ అల్లికలను స్మరించి, తంజావూరు, మైసూరు, బేలూరు, హాలిబీడులలో మహోత్కృష్టములని ప్రసిద్ధిగాంచిన నందిమూర్తులను పరస్పరం పోల్చుకొని పరిశీలిస్తూన్నప్పుడు, ఇంత పని చేయడానికి ఎంత కాలం పట్టిందో, ఎంత ధనం వెచ్చింపబడిందో అని ఆశ్చర్య పడతాము. లేపాక్షి దేవాలయ వితానములన్నీ మనోహరములైన చిత్రాలతో నిండి ఉన్నవి. అవి నాలుగైదు వందల ఏండ్ల నాటివి. వాటిలో రాజుల యొక్కయు మహోద్దీపక చరిత్రలలోని కొన్ని దృశ్యాలు, రాతిలో చెక్కి, రంగులతో తీర్చి దిద్దబడినవి. ఇవి కాక లేపాక్షిలో అనేక అద్భుత శిల్పకళా విషయాలు కలవు. పెద్ద పెద్ద స్తంభాలు పైనుండి కిందకు వ్రేలాడుతూంటవి. కాని కింద ఆనవు. అంతే కాదు; కొన్ని స్తంభాలు గిరగిరా తిరుగుతూంటవి. తాడిపత్రి, పెనుగొండలో ఎక్కడ చూచినా దేవాలయాలే. దీనిని బట్టి ఒకప్పుడు కళాశిల్పములకోసం మన పూర్వు లెంత శ్రమపడ్డారో ఎంతసొమ్ము వెచ్చించారో

అర్థమవుతుంది. ఈ రోజున వాటి శిథిలావస్థకు కారకులయిన అధికారవర్గంవారి అశ్రద్ధ నిందార్హం. రచనా విన్యాస ప్రాచీనతలో నేమి నిర్వహణ కౌశలములో నేమి సూక్ష్మాంశా పరిశీలనా నైపుణ్యములో నేమి, వంకబెట్ట వీలులేని పనితనములో నేమి, భావపోషణ ప్రకటనలలో నేమి, శిల్ప సౌందర్యంలో శాస్త్రమును మేళవించుటలో నేమి. గర్భగుళ్లలో కన్ను పొడుచుకున్నా కానరాని చీకటి కోణాలలో అత్యంత మనోహరములయిన చిత్తరువులను, చెక్కడములను ఘటించుటలో నేమి ఈ సంస్థలన్నీ ఇండియాలో అగ్రస్థాన మలంకరిస్తున్నవి. బేలూరు హాలిబీడుల మండపాలలోని రాతిస్తంభాలను తడిబట్టతో కొంచెం చెమ్మగిలచేస్తే చుట్టూ ఉన్న వస్తువులన్నీ అందులో అనేక విధాలుగా ప్రతిబింబిస్తూంటవి. ఒక ప్రతిబింబం ఒక రాతిలో కనిపించే తీరుగా మరొక రాతిలో కనిపించదు. వేరువేరుగా కనిపిస్తూంటుంది. లేపాక్షి దేవాలయంలోని కటిక చీకట్లో వీరభద్రస్వామి మూర్తిని దర్శించవలెనంటే, తీక్ష్ణమైన విద్యుద్దీపంతో గాని వీలుకాదు. అప్పుడు కూడా ఆ మహత్తమ రూపాన్ని పూర్తిగా చూడజాలము. భాగాలు భాగాలుగా మాత్రమే చూడగలము. ఆ విగ్రహము పొడవు ఒక కొననుండి మరొక కొనవరకు 35 అంగులు. ఇంకా కొంచెం పడమరకుపోతే బీజాపురం విస్మరింగు గ్యాలరీ ఉన్న పెద్దగుమ్మటం కనబడుతుంది. ఆంధ్ర దేశంలోని ఉండవల్లి గుహాలను, కన్నడ దేశంలోని బాదామీ గుహాలను ఇటీవలనే కనుగొన్నారు. బీజాపూరు

గుమ్మటంలోని శబ్దగ్రహణ గుణంగానీ, బేలూరు హాలిబీడుల లోని స్తంభాల బింబ గ్రహణ గుణంగాని శిల్ప చాతుర్యం వలన కలిగినవా లేక కాకతాళ న్యాయ్యంగా తటస్థించినవా అని ఆశ్చర్యంతో ప్రశ్నించుకుంటూంటాము. ఈ మహోత్కృష్ట దేవాలయ శిల్పమున్నూ, అంతులేని ఎల్లోరా అజంతా గుహాలలో చెక్కబడిన శిలా ప్రతిమలున్నూ, ఊహాతీతమయిన విస్తీర్ణతగల ఎలిఫెంటా గుహాలున్నూ వాటికవే సాటి. అజంతాలోని 27 గుహాలను నిర్మించడానికి ఏడుశతాబ్దాలు పట్టిందట. వీటికోసం ఎంతసొమ్ము వెచ్చించ బడిందో ఊహించగలమా? తూర్పు గోదావరి జిల్లాలోని ర్యాలీ గ్రామంలోనున్న కేశవ జగన్మోహన విగ్రహానికి ఇండియాలోని ఏ శిలావిగ్రహమూ సరిపోలదు. అది రాతిలోని రత్నం. వాటి నిర్మాణంలో డబ్బు లెక్కేమిటి? ఎంత శ్రమపడితే ఆ బొమ్మ అంత చక్కగా తయారయిందో ఆలోచించండి. ఈ పని అంతా అసలు శిల్పి కానీ తక్కిన పనివాళ్లు కానీ టెండర్లు పెట్టి, కాంట్రాక్టు పుచ్చుకొని, కాలపరిమితి నేర్పాటు చేసుకొని, ప్లానులు గీసికొని చేశారా? వాళ్ల ఆత్మలను పాటలో, రాతిలో, రంగులో మేళవించితే అయిన పని అది. ఆ తయారైన రూపమే వాళ్ల ఆనందానికి ప్రతిబింబం. పూర్వకాలంలో శిల్పులు డబ్బు కోసం పనిచేసినవారు కారు; తమ ఆత్మోపలబ్ధికోసం చేశారు. ఆ రోజులలో జ్ఞానాన్ని వాణిజ్యవస్తువుగా ఉపయోగించేవారు కారు. పుస్తకాలమ్ముకొని ప్రతికేవృత్తి

అవసరము లేదు. పాండిత్యము, సంస్కారమూ కలిగి ఉన్నందుకు ఫలం డబ్బు సంపాదించడం కాదు. ఇంకా ఉత్తరానికి పోతే అహమ్మద్ నగరం తగులుతుంది. అక్కడి మశీదు శిఖరాలు ఊగుతూండడం ఆశ్చర్యం కలిగిస్తుంది మనకు. ఒకదాని కొకటి 40 అడుగుల ఎడంగా రెండు శిఖరాలున్నవి. ఒక్కొక్క దాని వ్యాసం 6 అడుగులు. ఒక దానిలోపలికి పోయి గట్టిగా చేతితో చతురస్రం కదలగా, రెండోదికూడా దీనితో సానుభూతి చూపిస్తూన్నవా అన్నట్లు కదులుతుంది. బ్రిటిష్ ఇంజనీయర్లు పరిశోధన చేయడానికి ఇందులో ఒక దానిని పడగొట్టి మళ్ళీ కట్టినారు. కాని ఆ ఊగడం ఆగిపోయింది. అహమ్మదాబాదులో ఇంకా కొన్ని చిత్రాలున్నాయి. అక్కడి పెద్దనూయి గొప్ప అద్భుత విషయం. మైసూరు రాజ్యంలోని శ్రావణబేలగులలో నున్న గోమటేశ్వర విగ్రహం అద్భుతం కాదు అలౌకిక విషయం. ఇక చిట్ట చివరకు ఆగ్రా ఢిల్లీ రాజప్రాసాదాల రమణీయదృశ్యాలను పరిశీలిద్దాము. ఆగ్రాలోని తాజ్ మహాల్ కు చలువరాతిలోని స్వప్నమని పేరు. తాజ్ సౌందర్యం మనోహరం. దానిలోని అభిరుచి అతి లలితం. ఆకళా వస్తువులో ప్రతిసూక్ష్మాంశమూ తీర్చిదిద్దినట్లు కనిపిస్తుంది, ఆనిర్మాణానికి మూలమైన భావనా పటిమా, కృషీ అందులోని శిల్పరహస్యాలను విశదీకరించ పూనుకొన్న ప్రయత్నాలను భగ్నంచేస్తూన్నవి. ఆబూపర్వతంపైన కనిపించే వాస్తు నిర్మాణరీతులకు గానీ శిల్పాప్రతిమా విన్యాసములకు కానీ అంతులేదు. అమృతసర స్వర్ణ దేవా

లయసౌందర్యాన్ని గూర్చి వేరే చెప్పనక్కరలేదు. దీనికిపోటీ అజంతాలోనే కనిపిస్తుంది. ఇంక తూర్పునపోతే జగన్నాథ భువనేశ్వర కోణార్క దేవాలయాలు కనిపిస్తవి. వాటిప్రత్యేకత వాటి కున్నది.

ఈ జ్ఞానానికి మూలమేమిటి? ఇటువంటి భావోద్రేకం ఎక్కడనుంచి కలిగింది? వీటిని రచించిన శాస్త్రకోవిదు లేమైనారు? వీటిని నిర్మించిన పనివాళ్ళెక్కడ? ఈ సంగతులన్నిటినీ పరిశీలించడమే నిజమైన జాతీయ విద్యావిధానం. వైద్యం, చిత్రలేఖనం, కవిత్వం, నాటకరచన: ఈ అన్నిటిలోనూ ఇటువంటి అద్భుతాలు కనిపిస్తూనే ఉన్నవి. మననాటకం ఇంగ్లీషునాటకంకంటె అథమం 800 సంవత్సరాలైనా ముందు పుట్టిఉండాలి. వైద్యవిషయంలో పాశ్చాత్య పండితులు, భౌతిక శాస్త్రజ్ఞులూ ఇటీవల 60 సంవత్సరాల కిందట కనిపెట్టినవిషయాలు, మనపూర్వులు వేలకొలదీ సంవత్సరాల కిందటనే గ్రహించినట్లు తెలుస్తుంది.

## భౌతికశాస్త్ర కళారహస్యాలను వెల్లడిచేయాలి

ఈ భౌతికశాస్త్ర కళారహస్యాలనూ, మన ఇంజనీరింగు వైద్యం, న్యాయశాస్త్రం, సాహిత్యం వీటిలోని నిగూఢతత్త్వాలనూ వెల్లడిచేయాలి. అదే నిజమైన జాతీయవిద్య. జాతీయ విద్యా పట్టభద్రులమైన మనము మనవృత్తులను చూచుకోవడమేగాక, ప్రాచీనకాలంలోనే ప్రసిద్ధతగడించి, కొన్ని శతాబ్దాలకిందట అభివృద్ధి ఆగిపోయిన ఈ శాస్త్ర విజ్ఞానాలను బాగా పరిశోధించాలి. విదేశీ పరిపాలనక్రింద మనసాహిత్యా

నికీ, మన శిల్పకళలకు కూడా ప్రజాసంస్థలకు, సాంఘిక శాసనాలకు రాజకీయాలకువలెనే. ప్రభు ప్రోత్సాహం లేకుండా పోయింది. రాజు కేవలం భోగాసక్తుడుగానుండి విలాసజాలసుడుగానూ ఉండకూడదు. శాంతి, శాసనాలను కాపాడుతుండడమొక్కటే అతని పనికాదు. ఆచార సంప్రదాయ విషయాలలో ప్రజలకు పదుపదేశకుడుగాను, శిక్షకుడుగానూ ఉండాలి. ఆచారంలో మార్పుజరుగకపోతే ఒక్కొక్కప్పుడు అభివృద్ధికి ఆటంకంగా ఉంటుంది. విదేశ పరిపాలకులు ఆచారపరంపరగా వస్తూన్న శాసనాలను మార్చడానికి ఇష్టపడకపోవడంవలన సాంఘిక విషయాలలో అభివృద్ధి ఆగిపోయి భారతదేశం బాధపడుతూన్నది. పూర్వముండిన ప్రజాభిప్రాయాని కిప్పుడు అక్కడక్కడా చిహ్నాలు మాత్రం కనిపిస్తూన్నవి. నిజానికి అది ఆచరణలో లేదని చెప్పడమే న్యాయ్యం. అందువలన ఆచారం కరుడుగట్టుకొని మార్పులేకుండాపోయింది. విజ్ఞానము, శాస్త్రము, ఎదుగు బొదుగులు లేనివైనవి. విదేశీ సభ్యతవలన నూతన వేషభాషలు ఆచరణలోకి వచ్చినవి. అంతేకాదు, పూర్వ విజ్ఞానమంటే అసహ్యమూ, ఆక్షేపణా ఎక్కువయింది. శతాబ్దములకొలదీ అవిచ్ఛిన్నంగా ప్రవహించిన విజ్ఞాన, పరిశోధనా, సాహిత్యస్రవంతులు, వ్యతిరేక స్రోతస్సులవలన ఆగిపోవడమేకాక, ఇంకి పూడికూడా పోయినవి. ఇప్పుడా పూడికనుతీసి, నాడు నిరాటంకంగా జరిగిన అభివృద్ధిని గ్రహించి, అప్పటి ఆశ్చర్యకరాభ్యుదయ హేతువులను పరిశీలించడం మన మొదటికర్తవ్యం. ఈ సందర్భంలో

సర్ వాల్టర్ ర్యాలి ఇలా అన్నాడు. "విశ్వవిద్యాలయం పరం పరాగతా జ్ఞానరక్షణకోసం ఏర్పడిన సంస్థ. అది ప్రధాన ప్రాచీన భావాలనన్నిటినీ పునర్విమర్శచేసి మార్పులుచేస్తూంటుంది. అది పునాదినుంచీ ప్రారంభించి నిర్మాణం చేస్తుంది. పాతపొలాలను దున్ని కొత్త పైరులను వేస్తుం దది. విజ్ఞాన సీమలను అతి నిరంతరం బహుజాగరూకతతో కాపాడుతుంది. వెనుకటి అభివృద్ధి ఆగిపోవడానికి కారణం అజ్ఞానమూ, స్వప్రయోజన పరత్వమూను. విశ్వవిద్యాలయాలలో పరీక్షలకు తప్ప ఇంక దేనికీ ప్రాముఖ్యత లేకుండా పోయినందువలన కొంతమంది విద్యా విశారదులు, పరిపాలనాధికారులు, వ్యాపారస్థులు, ప్రస్తుత విద్యావిధానముయొక్క నిష్ప్రయోజకత్వమునూ దౌష్ట్యమునూ నిస్వార్థ బుద్ధితో వెల్లడిస్తూన్నప్పటికీ యేమీ ఉపకారం కలగడం లేదు. బాలుర అజ్ఞానం వలన తల్లిదండ్రులు జడత్వమువలన, ఉపాధ్యాయులు జీవనోపాధికోసమూ ఈ విద్యాపద్ధతినే అవలంబిస్తున్నారు. మన విద్యాశాఖామంత్రులే ఈ జీర్ణ విద్యావిధానమువలన ఉత్పత్తి కావడంచేత, అభివృద్ధి నిరోధకులుగా ఉంటారు. ఆధునిక భావాలు, నవీన సంస్కృతీ, ఇవి మన దేశీయనాయకులచిత్తాలను అజాతీయాలుగా చేసివైచినవి. అందువలన వారు జాతీయ సంస్కార నిరంతరవాహినియే జాతీయ సభ్యత- అన్నప్రాథమిక సూత్రాన్నే విస్మరిస్తూన్నారు. జాతీయ సంస్కృతి భూత వర్తమాన భవిష్యత్కాలములలో జీవనదివలె ఎడతెగక జాలువారుతూంటూం దనీ, ప్రతిజాతి భూతకాలంనుండి వర్త

మాన కాలానికి, వర్తమానంనుంచి భవిష్యత్తుకు నడుస్తూనే ఉంటుందనీ కూడా వారు గ్రహిస్తున్నట్లు లేదు. భూత కాలపు లక్షణాలు వర్తమానంలో ఉంటవి. వర్తమానం భవిష్యత్తును సూచిస్తూంటుంది. మన నైతిక ప్రమాణాలు స్మృతులూ అన్నితరతరాలనాటి అనుభవముల కలయిక. అదేవిధంగా మన సభ్యతకూడా భూతవర్తమానముల సమ్మేళనమే కాక ప్రాచ్యపాశ్చాత్య నాగరికతల మిశ్రమమని చెప్పవచ్చు. అంతర్జాతీయ సంబంధాలు వాణిజ్యరూపంలోనేకాక సంస్కారరూపంలోకూడా వ్యాపిస్తున్న కాలంలో సభ్యతకు అనేక ముఖాలూ అనేక వైపులూ ఉంటవి. ప్రతి ముఖంనుండి ప్రతివైపునుంచి వెలిగక్కుతూన్న వివిధసంస్కృతుల తేజోకిరణాల సమ్మేళనమే ఆ సభ్యత. నేటినాయకులు తమ నింత వాళ్ళనుగా చేసిన తమ నవీనసంస్కారమునకు ఇంకా మురుసుకొంటూనే ఉన్నారు. వారి మనస్సులు సరియైన మార్గాలనుబట్టి అభివృద్ధి పొందేటంత వరకూ, మనజాతీయ సంస్థలు జాతీయతాచ్ఛాయలలో అణగిమణగి కాలక్షేపం చేస్తూండాలి. తమ కష్టసుఖాలలో మార్గదర్శకంగా ఉన్న వెలుగు, జాతీయ స్వాతంత్ర్య యాత్రలో తమ దేశీయుల త్రోవనుకూడా ప్రకాశవంతంగా చేసి తీరుతుందనే ఆశతో జీవించి ఉండాలి అవి.

## అధ్యాయం 15

# సంఘసాన్నిధ్యం

సంఘసేవ చేసేనిమిత్తం ఇండియాలో అనేక వ్యవస్థలు కలవు. వివేకానంద మఠము, రామకృష్ణ ధర్మ ప్రచారమండలి (Ramakrishna Mission) మత,విద్యా, సంస్కార, విషయాలలో హిందువులను సేవిస్తూన్నవి. 40 యేండ్ల కిందట గోఖలే 'భారత సేవక సంఘం,' (Servants of India Society) అనే పేరుతో ఒక సంస్థను స్థాపించాడు. అది విద్యార్థికుల వ్యవస్థ. పేదరికాన్ని స్వీకరించి ప్రజాసేవచేయడం వారిమతం. కాని వారు రాజకీయవాంఛలకు లోబడకూడదని ఎక్కడా నిషేధం లేదు. తరువాత ఇరవైసంవత్సరాలకు ప్రసిద్ధ పాంచాలదేశ పండితుడు లాలా లజపతిరాయలు 'ప్రజాసేవక సంఘం' (Servants of the People's Society) అనే పేరుతో మఱొక సంస్థను స్థాపించాడు. అందులో ఉన్న సభ్యులు కూడా గొప్ప సంస్కారులు, కాని వారికి కూడా 'స్వార్థ నిరసన వ్రతం' లేదు. తరువాత గాంధీ కూడా మఱొక నూతన వ్యవస్థకు మూలపురుషుడైనాడు. అందులో ఆయన మొదటి సేవకుడు. దీనిని స్థాపించడంలో ఆయన హృదయవైశాల్యమూ, ఉదార దృక్పథమూ వెల్లడి అవుతూన్నవి. "మానవ సేవకులలో ఆయన అగ్రగామి."

అయంనిజో పరోవేతి

గణనా లఘుచేతసాం

ఉదార చరితానాం తు
వసుధైవ కుటుంబకం'

"నా వాడు, పరాయివాడు అనే భావం లఘు బుద్ధులకు, ఉదార చరితులకు లోకమే కుటుంబం" అని ఆయనమతం. కాని అంతమాత్రంతో ఆయన విశ్వమానవ సౌభ్రాతృత్వ జాలంలో చిక్కుకోలేదు. జాతీయత సర్వ జాతీయ సమ భావమునకు సోపానం. వ్యక్తులు గానీ, జాతులు గానీ, సమత్వ, సాహచర్య భావపూరితులు కానియెడల సౌభ్రాతృత్వమనే మాట వట్టికల్లగా పరిణమిస్తుంది. కాబట్టి గాంధీ హిందూదేశానికి సంపూర్ణ స్వరాజ్యం కోరడం న్యాయ్యం. భారత దేశం సంపూర్ణ స్వాతంత్ర్యమును పొందినప్పుడే ప్రపంచ జాతుల సుహృత్సమితిలో సమాన స్థానమాక్రమించ గలదు. అంతే కాని ఇండియా ప్రపంచానికి వెలిగా ఉండ వలెనని కానీ, లేక తన నూతన స్థితిని ఇతర జాతులపైన అధికారం చలాయించేటందు కుపయోగించ వలెనని కానీ గాంధీ అభిప్రాయం కాదు. అందుకొరకే ఆయన దేశంలోని పరస్పర సంఘట్టనలను, శోషణలను, మత పోరాటాలను సాంఘిక స్పర్థలను, నిర్మూలింప చూస్తూన్నాడు. భారత జాతీయతకు కళంకంగా, మానవత్వమునకు మచ్చగా, దైవ ద్రోహంగా కనిపిస్తూన్న అంటరానితనాన్ని తుడిచి వేయ వలెనని ప్రయత్నిస్తూన్నాడు. పురుషుని అభ్యుదయానికి త్యాగమునకూ కారణమైన స్త్రీని, ఆమె తొలినాటి ఉన్నత స్థానమునకు కొనిపోవలెనని కోరుతూన్నాడు. వ్యభిచారం

వృత్తిగా గల కలాన్ని, మద్యపాన పిశాచాన్ని, పుట్టుకవలన వచ్చిన ఎక్కువ తక్కువలను, కనపడ కుండా చేయవలెనని కృషి చేస్తూన్నారు. మనుష్యులలో 'అధమాధముని' యందు ఆయనకు సానుభూతి. ముందు జన్మలో తానంటరానివాడుగా జన్మించకోరుతున్నానని చేసిన ప్రకటనయే ఇందుకు ప్రబల నిదర్శనం.

జీవితంలో పతితులైనవారిని లేవనెత్తవలెనంటే మనం వంగితేనే కాని లేవనెత్తలేము. నీళ్లలో మునిగి పోతూన్న మనిషిని గట్టుమీద కూర్చొని పైకి లాగలేము. మనం కూడా నీళ్లలో దిగాలి. అతనిని రక్షించడానికి. గాంధీ యెన్నడూ తాను నమ్మిన అనుచరులు, తనను ఒంటరిగా విడిచి వేసినట్లు అనుకోలేదు. ఆయన కవిశ్వాసం కానీ అధైర్యం కానీ యెన్నడూ కలుగలేదు. వారు దిగినప్పుడు వారితోపాటు తానూ దిగి తిరిగీ వారిని పైకి లేవనెత్తే స్వభావమాయనది. నిజంగా నాయకుడు చేయవలసిన పనిఅదే. ఆదర్శానికీ వాస్తవికతకూ సమన్వయం చేసుకోగల చతురత ఉందాయనకు. నిరంతరం తమ ఉన్నతాదర్శాలలోనే అణగి మణగి ఉండే వారు తమతమ చుట్టూవున్న ప్రపంచంలోని వాస్తవిక విషయాలనుగుర్తించలేక, రాజీకి ఎప్పుడు ఒప్పుకోరు. రాజీ అనగానే తమఆదర్శాలు క్షీణించిపోయినట్లు నీతిభ్రష్టమై పోయి నట్లు భావించి నిరంతరం కుంగిపోతుంటారు.

# అంటరానితనం

ఇండియా జనసంఖ్యలో ఏడవవంతు ప్రజలను అంటరాని వాళ్ళుగా పరిగణిస్తున్నాము. ఆ ఒక్క కారణంచాలు భారత దేశం పరాయి ప్రభుత్వాంకింద బానిసగా ఉండతగిన దేశమని నిరూపించడానికి. ఆర్యులిండియాలో స్థిరనివాసమేర్పరచుకొని 13,000 ఏండ్లయినప్పటికీ దేవుడు సృజించిన ఈ 7 కోట్ల మందిని వారిలో కలుపుకొనలేక పోయినప్పుడు, 350 కోట్ల మంది భారతీయులను బ్రిటిష్‌వారు అంటరాని వాళ్ళుగా, దరిచేరరాని వాళ్ళుగా, కలవరాని వాళ్ళుగా భావిస్తే హిందువులు వారినే మొగం పెట్టుకొని నిందించగలరు? తరతరాల నాటి ఈ దురాచారం, జాతీయ కళంకమేగాక దైవద్రోహం గూడానని భావించి, నిరసించిన సంఘసంస్కర్త లనేకమంది ఇదివరకే గడ్డమీద జన్మించారు. కాని ఖద్దరు, సాంఘికైక మత్యము, మద్యపాననిషేధములతో సమాన ప్రతిపత్తిగల కాంగ్రెసు కార్యక్రమంగా అస్పృశ్యతా నివారణమును కూడా అంగీకరింపచేసే పని గాంధీ వంతుకు వచ్చింది.

అంటరాని తనమును నిర్మూలించ వలెననేది కొత్త అభిప్రాయంకాదు. కాని దానిని రాజకీయనిర్మాణకార్యక్రమంలో ముఖ్యాంగంగా చేయడం కొత్తసంగతి. నిజానికి గాంధీజీ నిర్మాణ కార్యక్రమంలో ఒక్క ఖాదీ పునరుద్ధరణం తప్ప ఇంకేదీ కొత్తదిలేదు. సాంఘిక, ఆర్థిక, నైతిక విషయాల సమ్మేళనమే ఆయన కార్యక్రమ స్వరూపం. ఆయన ఈ దేశంలో ఒకకొననుండి మరొకకొనకు అనేకసార్లు సంచారం

చేశాను. అసంఖ్యాకులైన దీనులాయనకగపడి శరణాగతులైనారు. కొన్నిచోట్లపతితస్త్రీలు, మరికొన్నిచోట్ల అస్పృశ్యులు ఆయన దయకు పాత్రులైనారు. దిక్కులేక ఆకలితో అల్లాడుతూన్న భిక్షలను, తాగుబోతుల, వ్యభిచారుల నిస్సహాయ కుటుంబాలను ఆయన ఎక్కడెక్కడో చూచాను. ఆయన చుట్టూ ఏమూలచూచినా దుఃఖమూ దైన్యమూ ప్రత్యక్షమైనవి. కాని ఆయనకు నిరాశ జనించలేదు. కమ్మ వేదాంతి వలె అడవులకుపోయి తపస్సుచేసుకొన బుద్ధిపుట్టలేదాయనకు. ఆయన నిజమైన మానవుడు. ఆపాదమస్తకమూ ఆయనలో మానవత్వము పరిపూర్ణతను పొందింది. కాబట్టి పతితస్త్రీలను అస్పృశ్యులను, దిగంబరులను, పానప్రమత్తులను, వ్యభిచారులను క్షుధాతురులను, రక్షించేటందు కుపాయాల నన్వేషింప ప్రారంభించాడు. ఆయనకు అనుభవం కలిగినకొద్దీ ఆలోచన చేసినకొద్దీ అనేక ఉపాయాలు స్ఫురించినవి. వాటి ఫలితమే జాతీయనిర్మాణ కార్యక్రమం. అస్పృశ్యతనివారణకు మూల మిది.

## పూర్వ చరిత్ర

నూరు సంవత్సరాల కిందట రాజా రామమోహనరాయలువారీ విషయంలో చాలా కృషిచేశారు. పిదప ఆయన అనుయాయులు - ముఖ్యంగా బ్రహ్మసమాజమును నడుపుతూన్నవారు - ఆయన ప్రారంభించిన ఈ మహత్కార్యము నిర్విఘ్నంగా సాగిస్తూవచ్చారు. వారి యాజమాన్యం కింద

అనేక మంది హరిజన బాలికలు పతనం గాకుండా రక్షింపబడ్డారు; అనేక హరిజన బాలురు పెరిగి పెద్దవారై విద్యాబుద్ధులను గడించి గౌరవనీయులైన ఇతర పౌరులవలెనే ఆరోగ్యంగానూ, ఆనందంగానూ, జీవిస్తున్నారు. పూర్వచరిత్ర లేకుండా ఏ మహోద్యమమూ ఒక్క సారిగా ఆకాశంనుండి ఊడిపడదు. రామానుజుని వంటి మహాత్ములతో ప్రారంభమైన మతసాంఘికోద్యమం, అక్కడక్కడా అప్పుడప్పుడూ ఈ విధంగా జరిగిన నూరు సంవత్సరాల పనివలన బలిష్ఠమయింది. ఇదంతా నేటి తరంవారికి పైతృకధనంగా లభించి గాంధీకి భావోద్రేక కారణమయింది. అందువలననే ఆయన అంటరాని వాళ్ళని వ్యవహరింప బడుతూన్న వారికి హరిజనులని నామకరణం చేసి వారి సాంఘిక ఆర్థికాభివృద్ధికి జాతీయ కార్యక్రమంలో స్థానం కల్పించాడు.

కాంగ్రెసుయొక్క ఈ నూతన కార్యక్రమ ఫలితంగా, హిమాలయము మొదలు కన్యాకుమారివరకు ఒక ఉత్తుంగ భావతరంగం వ్యాపించింది. సవర్ణులనుకొనేవారు 'అవర్ణులకు' సహాయం చేయడం ఒక ధర్మంగా భావించ ప్రారంభించారు. ఆ భావం కార్యరూపంలో అనేక విధాల వెల్లడింప బడింది. హరిజన విద్యార్థులకు హైస్కూళ్లలో ఉచిత వేతనాలీయడం వాళ్ళవృత్తులకు- అనగా చెప్పులుకుట్టడం, చొక్కాలుకుట్టడం తోలుఊనడం, మ్రదంగం, నేత, హోమియోవైద్యం, ఆయుర్వేదం, చాపలల్లడం, రంగుల అద్దకం, వేముపని, కళాయి వేయడం, మాట్లువేయడం, ఈపనులన్నీ నేర్పడం, చిన్నచిన్న

ప్రాథమిక పాఠశాలలను స్థాపించడం, హాస్టల్సును కట్టించడం, వైద్యసహాయ కేంద్రాలనేర్పాటుచేయడం, వైద్య పరీక్షచేయించడం, కొత్తగా నూతులు తవ్వించడం, ఫ్యాక్టరీలలో కంపెనీలలో షాపులలో ఇళ్ళలో వాళ్ళకుద్యోగా లిప్పించడం, పత్రిక లమ్మించడం, మంగలిపని, చాకలిపని నేర్పించి సవర్ణుల గ్రామాలలో ఉంచడం, హరిజనగ్రామాలకు పక్లను సప్లయిచేయడం, హరిజన కూలీలను ఎక్కువగా ఏర్పాటు చేసుకోవడం, కూలిఎక్కువచేయడం, పుస్తకాలయాలను క్లబ్బులను స్థాపించడం, హరిజనపిల్లలకు మస్తులు, పెద్దవాళ్లకు కంబళ్ళూ యీయడం, ఇవన్నీ ధర్మమనుకొని గాంధీజీచేత సంస్థాపింపబడిన హరిజనసంస్థ నిర్వహిస్తూన్నది.

ఇంక హరిజనులపైన పూర్వంనుండీ సవర్ణులు కొన్ని ఆంక్షలు పెట్టారు. గరవాల్జిల్లాలలో హరిజనులు పెళ్ళిఊరేగింపులలో పాలకీలుకాని, డోలీలుగానీ ఎక్కకూడదని ఒక ఆంక్ష ఉన్నది. అలహాబాదు హైకోర్టులో హరిజనులకు ఆహక్కు స్థిరపరపబడింది. మధ్యహిందూ దేశములో పాకీవాళ్ళను బస్సుడ్రైవర్లు బస్సులలో ఎక్కించుకోవడానికి నిరాకరిస్తూండే వారు. షాజాపూరు పాకీవాండ్లు ఈ హక్కును సంపాదించారు. ఈ మార్పంతా ఎలాకలిగింది. అక్కడక్కడా సంఘ సంస్కర్తలు చేస్తూవచ్చిన పనివలనకాదు. ఆర్థిక శాస్త్రవేత్తలు, మతాధిపతులు చేసిన మహోపన్యాసముల వలన కాదు. 77 కోట్లమంది హిందువులనుండి 4 కోట్లమంది హరిజనులను ప్రత్యేకించ కూడదనే ఉద్దేశంతో, ప్రాణాన్ని తృణ

ప్రాయంగా అర్పించదలచుకొని ప్రాయోపవేశం చేసిన మహా నాయకుని తపశ్శక్తియే జాతి అంతటిలోనూ ఇంతమహత్తమ చైతన్యాన్ని కలిగించింది.

## లోకోత్తరోపవాసము

నేడు రాజకీయరంగంలో ప్రధాన పురుషులుగా నున్న వారు తమ పనిని ముగించుకొని కాల గర్భంలో కలిసి పోయి నప్పుడు, నేటి రాజకీయ సమస్యలన్నీ సర్వంగా పరిష్కరింప బడి భవిష్యత్తులో చరిత్రాత్మక విషయాలుగా మారిపోయి నప్పుడు, నేటి ఇండియా జనసంఖ్యలో ఒయిదోవంతు అంట రానివాళ్ళున్నారనే సంప్రదాయమునే ప్రపంచం మరచి పోయినప్పుడు, భారత భావిసంతానం శతాబ్దములవరకూ జ్ఞాపకం ఉంచుకోగలిగిన విషయమొక్కటే. అదిగాంధీ 1932 సెప్టెంబరు 20 తేదీని ప్రారంభించిన ప్రాయోపవేశవ్రతం; భారత స్వాతంత్ర్య సమరస్వరూపాన్ని సంపూర్ణంగా మార్చి వైచిన లోకోత్తరవ్రతమది. సంఘంలోని ఒక చెడుగును సావ కాశంగా తీసికొని రాజకీయ స్వార్థదృష్టితో హిందూ సమా జంలోని అల్పసంఖ్యాకులనబడే హరిజనులకూ, అధిక సంఖ్యా కులనబడే ఎడ తెగని చీలిక కలిగించే ప్రయత్నాన్ని భగ్న పరచేటందుకే అది ఉద్దేశింపబడింది. ఆ ప్రయత్నమే కొనసాగి నట్లయితే తరువాత హరిజనులకు ప్రత్యేకరాజకీయ సమూ హంగా నిర్దేశించి ఉండేవారు ప్రభుత్వంవారు. ఇది 'చీలదీసి పాలించు' అనే సామ్రాజ్య తత్వ మూలసిద్ధాంతానుగుణంగా

నడుస్తూన్న రాజకీయతంత్రం. ముసల్మానులను సిక్కులనూ హిందువులనుండి ఈలాగే చీలదీశారు. ఇప్పుడు హరిజనులను చీలదీయ ప్రయత్నిస్తూన్నారు. ఈ రాజకీయ కైతవం గాంధీని అపారమనస్తాపం కదలించివైచింది. అస్పృశ్యులను ప్రత్యేకతరగతిగా విభజించే పద్ధతి కాయన అంగీకరించలేదు. 'సిక్కులు మహమ్మదీయులు శాశ్వతంగా ఉంటే ఉందురు గాక! కాని అస్పృశ్యత జీవించి ఉన్నదంటే హిందూమతం మృతిపొందినట్లుగా భావిస్తాను' అన్నాడు ఆయన రెండో రౌండుటేబిలు మహాసభ జరిగినప్పుడు. మరొకసందర్భంలో 'హిందూదేశ స్వాతంత్ర్య సంపాదనకోసం కూడా అస్పృశ్యుల ప్రధాన ప్రయోజనాలను విక్రయించ జాలను' అన్నాడు.

గాంధీ తన సమద్యమంలోనూ, హిందూ సంఘంలోనూ, మానవ ప్రకృతిలోనూ, ప్రభుత్వోద్యోగులలోనూ సంపూర్ణ విశ్వాసంతో ఆ ఉపవాసవ్రతం ప్రారంభంచేశాడు. పరమ పవిత్రము, నమ్రదేశజనితము, ఉన్నతాదర్శ పూర్వకమూ అయిన ఆ ఉపవాసవ్రతం జయప్రదం అయితీరాలి. కాకుంటే జరిగిన నాలుగు సంవత్సరాలలో హరిజన సేవాసంఘం అంత పని ఎలా చేయగలిగి ఉండేది?

ఎక్కడ చూచినా హరిజన మహాసభలు, హరిజనులలో మతవిషయిక విద్యాప్రచారమూ, హరిజన భజనసంఘాలు, హరిజన కర్మకాండంలో వేదపఠనలు, హరిజన కేంద్ర విచారణసంఘాలు, హరిజన పారిశ్రామిక, వృత్తివిద్యామందిరా

బూనగా, దేశంలో ఒక నూతన వాతావరణం చెలరేగింది. హరిజన సంఘక్షేమంలో ఒక నూతనాసక్తి ప్రజ్వలించింది. మహాత్ముని తన సబర్మతీ ఆశ్రమాన్ని హరిజనోద్యమానికి ధారపోయడం, దేశీయులను హరిజనాభ్యుదయ భావ ప్రేరితులనుగా చేసింది. గాంధీసొంతమని చెప్పుకోదగినదా సబర్మతీ ఆశ్రమ మొక్కటే. దానిని హరిజనుల కిచ్చివేయడంతో 'గాలిలో తిరిగే పక్షులకు గూళ్ళూ, పొలాలలో తిరిగే పురుగు బుట్టలకు కలుగులూ అయినా ఉన్నవి గాని మనిషికి తల దాచుకొనే చోటుకూడా లేదు.' అని చెప్పినమాట గాంధీ యెడల అక్షరాలా నిజమైనది.

## జాతీయాపచారాన్ని తొలగించాలి

మనం హరిజనులను తాకినంతమాత్రంతో మనపని పూర్తి అయినట్లుగా భావించకూడదు. ఇంకా ముందుకు పోవాలి. వాళ్ళను మన కుటుంబాలలోకి తీసికొనివచ్చి వాళ్ళ ఆర్థికస్థితిని చక్క చేయాలి. హరిజన స్త్రీపురుషులను సోదరీ సోదర భావంతో చూడాలి. జాతీయ స్వాతంత్ర్యోద్యమంలో వారి సేవలను గ్రహించాలి. అప్పుడు మనభారత స్వరాజ్యం ఇతర మార్గాలకంటె తొందరగా చేకూరగలదు. తిరువాన్కూరుమహా రాజు లతీసంస్థానాధిపతులు హరిజన దేవాలయ ప్రవేశాని కంగీకరించడం మహద్విషయమే. కాని ఆర్థికంగా వారికి జరిగే అన్యాయ్యాని కది ప్రతిఫలం కాజాలదు. హరిజనోద్య మంలో ఆత్మపరిశుద్ధత, సాంఘికోపకారమూ, ఈ రెండూ

ఇమిడి ఉన్నవి. అంతేకాదు, అందులో ఆర్థిక, సాంఘిక నైతిక, మతవిషయిక సమస్యలు లీనమై ఉన్నవి. కాబట్టి ఈ జాతీయాపచారాన్ని తొలగించి మన సోదరులను పౌర సత్వములలోను, రాజకీయ స్వాతంత్ర్యంలోను, మనతో పాటు సమాన భాగస్వాములనుగా చేయవలసిఉంది. 'మనసు మారితేనేగాని అంటరాని తనం పోదు. డబ్బుఖర్చు పెట్టడం వివేకం గావచ్చును గానీ అంతమాత్రంతో మన స్సులు మారవు. మనకు తగినవంతవుంది ఆధ్యాత్మికచింత గల నిస్వార్థపరులైన మనుష్యులు దొరికినప్పుడామార్పు వస్తుంది' అన్నారు గాంధీజీ,

## హరిజనోద్యమం

హరిజనోద్యమం యొక్క అసలు లక్షణాన్ని పాఠకులు తెలుసుకోవడం అవసరం. హరిజనోద్యమానికి వెనుక రాజ కీయోద్దేశమేమి లేదు. అంటరానితనాన్ని పోగొట్టవలెననే ప్రయత్నం యేవిధంగానూ రాజకీయం కాజాలదు. అంతే కాదు. కేవల వారి ఆర్థికాభివృద్ధికీ, సాంఘిక పునరుద్ధరణము నకూ చేసే పనికూడా కాదు. ఇలా అనడంవలన కోట్లకొలదీ ఉన్న ఈ ప్రజల ఆర్థిక సాంఘికౌన్నత్యంకొఱకు పనిచేయడం మా అభిప్రాయంకాదని భావించకూడదు. కాని మాలక్ష్యం వేరు. 'అంటరానితనం హిందూమతానికి కళంకం. దానిని తొలగించి తీరాలి. అది దైవద్రోహంకూడాను. అది విషం. తొందరలో నిర్మూలించకపోతే హిందుమతాన్ని నాశనం

చేస్తుందని అంటారు మహాత్మాజీ. హరిజనులు త్రాగుడూ చచ్చిన జంతువులను తినడమూ మాని పరిశుభ్రంగా ఉంటే, అంటరానితనాన్ని తొలగిస్తా మంటారు సవర్ణహిందువులు. వారిలో ఎన్ని లోపా లున్నప్పటికీ వారిని మనం ప్రేమతో కౌగిలించుకోవాలి. హరిజనుల శరీరాలకంటె సవర్ణుల మనస్సులు ముందుగా పరిశుభ్రం కావాలి. 'మీరు అంటరానితనాన్ని నిర్మూలించ నైనా నిర్మూలించాలి. లేదా నాశనమైనా కావాలి' అన్నప్పుడు గాంధీ హృదయమెంత క్షోభించిందో!

## దేవాలయ ప్రవేశం

హరిజనోద్యమానికి ఆర్థికమూ నైతికమూ కూడా హరిజనుల దేవాలయ ప్రవేశాన్ని అంగీకరించడం హిందువుల ధర్మం. ఆ ధర్మాన్ని గుర్తించినప్పుడే హిందూమతంలోని కళంకం పోతుంది. 1939 జులై 8 న దక్షిణ భారతదేవాలయాలలోకెల్ల పెద్దదయిన మీనాక్షి దేవాలయంలో హరిజనులను ప్రవేశింపచేయడం లోకోత్తర విషయం. తిరువాన్కూరు రాజ్యంలోని దేవాలయాలన్నిటిలోనూ హరిజన ప్రవేశాన్ని అంగీకరించడం కూడా మహత్కార్యమే. కాని ఆ పని ఒకమహారాజూ ఆయన దివానూ తలచుకొన్నంత మాత్రంతో జరిగింది. మహారాజు, మహారాణి, దివాన్ ఈ ముగ్గురికే దక్కింది ఆకీర్తి. మధురలో జనసామాన్యం చేసిన పని అది. ప్రజాభిప్రాయాన్ని నిరోధించలేక ధర్మకర్తలు

మధుర దేవాలయద్వారాలు హరిజనులకు తెఱవవలసి వచ్చినది. అస్పృశ్యతా నివారణ చరిత్రలో తిరువాన్కూరు సర్కారువారు 1936 నవంబరులో చేసిన ఈ ప్రకటన ఎక్కువగా ఎన్నదగిన సంఘటనము.

> మామతంలోని సత్యప్రామాణ్యములయందు గాఢప్రత్యయం గలిగి, అది దైవ ప్రేరణపైనా సమ్యగ్జ్ఞాన భావంపైనా ఆధారపడి ఉన్నదనే నమ్మకంతో, శతాబ్దముల తరబడి కాలపరివర్తనాల కనుగుణంగానే అది ఆచరణలో నడుస్తున్నదనే విషయాన్ని గ్రహించి మా పౌరులలో ఎవ్వరూ పుట్టుకవలన గాని, కులంవలనగాని, సంఘంవలనగాని, హిందూమతముయొక్క సాంత్వన సమాశ్వాసములకు దూరం చేయబడకూడదనే తలంపుతో, మాస్వాధీనంలోనూ మా ప్రభుత్వ స్వాధీనంలోనూ ఉన్న దేవాలయాలలో ప్రవేశించి పూజ చేసేవిషయంలో, పుట్టుకవలనగాని మతంవలనగాని, హిందువైన యెవ్వనికీ అభ్యంతరం కల్గించరాదని నిర్ణయించి, ఇందుమూలకంగా ప్రకటిస్తూన్నాము, నిర్దేశిస్తూన్నాము, ఆజ్ఞాపిస్తూన్నాము. అయితే ఈ ఉత్తరువు ఆదేవాలయాలలో సముచిత వాతావరణమును నిలబెట్టేటందుకున్నూ, విధ్యనుష్ఠానములనూ, ఆచారములనూ పోషించేటందుకున్నూ, మేముచేసే నియమాలకూ కట్టుబాట్లకు లోబడి అమలు జరుగుతూంటుంది.

కళావస్తువనదగిన హిందూమతం కొన్నివేల సంవత్సరాలకిందట పుట్టినట్లు తెలుస్తుంది. అది పుట్టిపెరిగిన ఇంత కాలంలోనూ అనేక దురదృష్టములకు గురియైనది. ముఖ్యంగా విదేశీ సభ్యత చేసిన దండయాత్రలకు తట్టుకోవలసి వచ్చింది. ఇక ఆచార వ్యవహారాలు, విధ్యనుష్ఠానాలు, సాంఘిక శాస

నాలు, సౌరవ్యవస్థలు, ఇవన్నీ నానాటికీ విశ్వాసం లేని బాహ్యాడంబరాలుగా పరిణమించినవి. శ్రద్ధాభక్తులు కలవారికి ఇవన్నీ, సజీవములుగానూ శక్తివంతములుగానూ ఉండేవి కనుకనే గాంధీ వర్ణాశ్రమాలను గూర్చి వివరిస్తూ హిందూ సంస్కృతికి పునాదులన్నారు.

> శాస్త్రాలు నేటి అంటరానితనాన్ని సమర్థించే పట్లయితే, నేను హిందువునని చెప్పుకోవడం మానివేస్తానని చెప్పినమాట నా మనస్సులో నిశ్చయించుకొన్నదే. అదేవిధంగా మనకు నేడు ప్రస్తుత రూపంలో కనిపిస్తున్న కులాన్ని అది సమర్థించేపక్షంలో అంతర్భోజనాలకు అంతర్వివాహాలకూ అభ్యంతరం లేని నేను హిందువునని పిల్చుకోను; హిందువుగా ఉండను.

## శ్రీమతి రామేశ్వరి నెహ్రూ హరిజన సేవ

అస్పృశ్యులను ఇతరమతాలలో కలుపుకోవలెననే పిచ్చి దేశమంతటా బాగా వ్యాపించింది. దక్కన్ హైదరాబాదులో మహమ్మదీయ మతప్రచారకులు, కేరళరాష్ట్రంలో క్రైస్తవ మతోపదేశకులు చేస్తున్న పని ఇదే. కేరళ దేవాలయ ప్రవేశోద్యమం నడుస్తూన్న రోజులలో ఎఝూవాలకు గుంపులు గుంపులుగా మత మిప్పించడం చూచి మాధవనగరంలో శ్రీమతి రామేశ్వరీనెహ్రూ ఇలా ఉపన్యసించింది.

> ప్రతి మతప్రచారకుడూ ఎఝూవాలను తమమతంలో కలుపుకోవచ్చునని ఉద్దేశంతో తిరువాన్కూరుకు పరుగెత్తుకొని రావడం చూస్తే నాకాశ్చర్యం కలుగుతూన్నది. ఇది చాలా విచారకరము. అవమాన

కనమూ అయినదృశ్యం. ఇండియాలోని వివిధభాగాలనుండి తిరువాన్కూరు కింతమంది మతోపదేశకులెందుకు వస్తున్నారు? ఎఝవాలు తేలికగా తమవారి క్రింద కావడానికి తయారుగా ఉన్నారనా? ఎఝవాలు తమతమ మతాలలో కలసినంతమాత్రంతో వారికి కావలసిన ఉపకారాలన్నీ చేయబడవేగాక, ఆయా సంఘాల నాయకత్వం కూడా వారి కీయగలమని ఉత్తరహిందూస్థానం నుండి కొంతమంది మతప్రచారకులు చేసిన ప్రకటనను నేడే పత్రికలలో చదివినాను.

ఇదెంతో గొప్ప వాగ్దానం. దైవచింతగలవారు చేయరాని వాగ్దానమది. అటువంటి వాగ్దాన దైవభక్తుల కోరికల నెవ్వరు తీర్చగలరు? అటువంటి వాగ్దానాల నెవ్వరు చెల్లించుకోగలరు? ఆవిధంగా చేయబడిన వాగ్దానా లిదివరకెప్పుడూ చెల్లించబడలేదు. ఇకముందు చెల్లించబడవు. క్రైస్తవులలో కూడా కులభేదాలు అస్పృశ్యత ఉన్నవని నాకు తెలుస్తూన్నది. పాంచాల దేశంలో హరిజనులేదో ఒకమతంలో కలిసివున్నప్పటికి వారు వెలిగానే వుండవలసివస్తూన్నది. మీరు హిందూమతంలోనే విశ్వాసంతో నిలిచి ఉన్నందుకు అటువంటిగొప్పవాగ్దానాలేవీ నేను చేయజాలను. జరిగినదానికి హృదయపూర్వక పశ్చాత్తాపమూ, భవిష్యత్తుకు నిరంతర సేవా, ఇవి మాత్రమే నే వాగ్దానం చేయగలిగినవి. ఇవి మీకు సంతృప్తికరంగా ఉంటే సరే. లేకపోతే ఇంతకంటె ఎక్కువ ఆకర్షణ లేవీ నాకడ లేవు నేను మీకు వాగ్దానం చేయడానికి. అయితే ఎఝవాలుగానీ హరిజనులు గానీ, మాతో ఉన్నా సరే; మాలోనుండి వెళ్లిపోయినా సరే; అంటురానితనమునూ తక్కువ ఎక్కువ అనే భేదాలనూ, హిందూమతానికీ హిందూసంఘానికీ చెడుగులుగా భావించి వాటిని రూపుమాపే పవిత్రకార్యం మాత్రం విడచిపెట్టము.

# అధ్యాయం 16

# సాంఘిక సామరస్యం

## హిందూ మహమ్మదీయ ఐకమత్యం

ఈ ప్రాచీన భూమిలో నివసిస్తున్న వివిధ సంఘాలమధ్య గల జాతీయ సంబంధాన్ని సరిగా అర్థం చేసుకొన్నవారికి, హిందూ మహమ్మదీయ ఐకమత్య సమస్య తక్కిన సాధారణ జనానికి తోచినంత కష్టతరంగా కనిపించదు. ఈ సందర్భంలో ముందుగా విచారించవలసిన విషయం, అసలిండియాకు మొట్టమొదట ఎంతమంది మహమ్మదీయులు వచ్చారు. ఇప్పుడెంతమంది ఉన్నారు? అని ఇప్పటి ముసల్మానులలో ఎక్కువ మంది, ఈ పవిత్ర భారత వర్షంలో పుట్టినవారే. అంతేకాదు, మన పురాతన మతావలంబకులు కూడా. కాని అనేక కారణాల వలన తమ మొదటి మతాన్ని మార్చుకొన్నారు వారు. ఒకప్పుడీదేశాన్ని మహమ్మదీయులు పరిపాలించారనే కారణ మొక్కటి చాలును పరిపాలకుల మతంలో కలియడానికి (ప్రజలకు ఎక్కువ మోజు ఉండడం సహజమని చూపడానికి). మహమ్మదీయ రాజ్యకాలంలో, ఇస్లాము మతసిద్ధాంతములపైన కలిగిన విశ్వాసమే గాక పరిపాలకుల మతస్థుల మనిపించుకోవడం కూడా ప్రజలు ఘనతగా భావించి ఉండవచ్చును,

కాబట్టి ఈ సమస్యకు అట్టడుగున ఏదో నైతిక కారణము న్నట్లుగా మతోన్మాదం వలన భావింప బడుతూన్నదే కాని ఇది అనుకొన్నంత కష్టసమస్య కాదు. పరిసరాలలోని ముసల్మాను దేశాల నుంచి తండోప తండాలుగా జనం ఇండియాకు వచ్చిపడిన మాట నిజమే. కాని అంత మాత్రంతో ముస్లిములను ప్రత్యేక జాతిగా పరిగణించి పరిష్కరించ వలసిన సమస్య కాదిది. పూర్వకాలంలో బ్రిటనునుంచి వచ్చిన ఆంగ్లేయుల సంతానం గనుక ఆంగ్లో ఇండియనులు ప్రత్యేక జాతి అని ఎలా అనడానికి వీలులేదో ఇదీ అంతే. అనేక మతాల సమ్మేళనము, అనేక ప్రయోజనాల సమన్వయమే జాతీయత. భారత దేశంలోని ఇతర జన ప్రయోజనాలకు భిన్నములైన ప్రయోజనాలు ప్రత్యేకంగా మహమ్మదీయుల కేమున్నవి? ఉభయ సంఘాల ఆర్థిక ప్రయోజనాలూ ఒక్కటే కాబట్టి ఉభయుల రాజకీయ వాంఛలూ కూడా అభిన్నంగానే ఉండాలి. కొంతమంది అత్యుత్సాహ పరులైన మహమ్మదీయ మిత్రులు ముసల్మానులకు ప్రజాపాలన ప్రభుత్వం అంటే ఇష్టం లేదంటారు. అయితే వారి కెటువంటి ప్రభుత్వం కావాలి? బ్రిటిష్ అధికారం కింద నడిచే నిరంకుశ పరిపాలన కావాలా? అదే అయితే ప్రపంచంలోని ఇతర దేశాల మహమ్మదీయులు వారిని చూచి నవ్వుతారు. అనాగరికులుగా భావింప బడుతూన్న ఆఫ్గనులు కూడా భారతీయ ముసల్మానులు ప్రజా ప్రభుత్వాన్ని ఆశిపోసు కోవడం అంగీకరించరు. స్వతంత్రులమని సగర్వంగా తలలెత్తుకొని తిరిగే పారసీకులు ప్రజా పాలన లేని ప్రత్యేక జాతిగా ఉండవలెనని సూచిస్తూన్నట్లు భావిం

పడుతున్న భారతీయ ముసల్మానులతో సానుభూతి గలిగి ఉంటారనుకోవడానికి వీలు లేదు, స్వాతంత్ర్యంకోసం 50 సంవత్సరాల పైచిలుకు కాలం పోరాడిన ఈజిప్టు దేశీయులు, భారతీయ ముసల్మానులు స్వాతంత్ర్యాన్ని అభిలషించడం లేదంటే అర్థంచేసుకోలేరు. ఇప్పుడే కాంగ్రెసుకు వచ్చిన వాఫ్డిస్టు ప్రతినిధివర్గంవారీ సంగతి స్పష్టంగా వెల్లడించారు. ప్రపంచ జాతుల సుహృత్సంఘంలో సమాన ప్రతిపత్తితో తల ఎత్తుకొని తిరుగుతున్న తురుష్కులు, ఇండియా ముసల్మానులు కోరుతున్నట్లు కనిపించే ఈ తాత ముత్తాతలనాటి పద్ధతిని ఒప్పుకోరు. బస్రా, బుషైరు, ఇస్తాంబుల్ ఖాండహార్, ఖాలత్, కుస్తుంటూనియాలలోని మహమ్మదీయులు, భారతదేశంలోని అయిదవవంతు జనసంఖ్య ప్రజాప్రభుత్వాన్ని కోరకపోవడ మనే అజ్ఞానవృద్ధివిరోధకతత్వాన్ని ప్రోత్సాహపరచరు సరికదా, వహించనుకూడా సహించరు. ఈ మిత్రుల చరిత్ర వారి మాటలకు విరుద్ధంగా కనిపిస్తున్నది. సురేంద్రనాథ బెనర్జీ, గోపాలకృష్ణగోఖేల శిష్యగణంలోవాడ నని చెప్పుకొనే జిన్నాగారు జాతీయవాదులలో కెల్ల జాతీయవాదిగా ఉండినవాడు. 1928 వరకూ ఆయన గొప్పస్వారాజ్యవాది. నెహ్రూరిపోర్టు ప్రచురించబడిన వెంటనే ఆయన అకస్మాత్తుగా మారిపోయి, అందులోని రాజ్యాంగప్రణాళికకు తాను విరోధినని ప్రకటించుకొన్నాడు. అప్పటినుంచి స్వరాజ్యమంటేనే ఆయనకు రోత. ఈ కొత్తగా పుట్టిన స్వరాజ్యద్వేషంలో నానాటికి ఆయన ఆరితేరుతున్నాడు. చిట్టచివ

రకు ముస్లింలీగుతో రాయబారాలు నడిపేటందుకు కాంగ్రెసు నియమించిన ఉపసంఘంలో, ఒక్క మహమ్మదీయుడున్నప్పటికీ సహించనని ఏమరుతిరిగేటంతవరకు వచ్చిం దాయన స్వారాజ్య ద్వేషం.

## మహమ్మదీయులు ప్రత్యేకజాతిగాదు

పాలస్తీనాలోని యూదులూ, అరబ్బులవలెనే ఇండియాలోని మహమ్మదీయులుకూడా ఒక ప్రత్యేక జాతి కాబట్టి వారికి మనదేశంలో ప్రత్యేక భూభాగము కావలెననే సూచన దాదాపు పాకిస్థానం అభిప్రాయానికి దారి తీస్తూన్నది. మొదట కొంత తమాషాగా కనిపించవచ్చునుగాని, నిజానికి ఈ సూచనలో చాలా సాహసం ఉంది. ఇటువంటి సూచన చేయబడడానికి భారత దేశచరిత్రలో ఇదే ప్రథమము. 1923 లో కాకినాడ కాంగ్రెసు అధ్యక్షుడుగా ఉన్న మౌలానా మహమ్మదాలీ, దీనికి సన్నిహితంగా ఉండే సూచనను తన అధ్యక్షోపన్యాసంలో చేసినట్లు మాకు జ్ఞాపక మున్నది. కాని దానిని గూర్చి ఆయన ఆ కాంగ్రెసులోగానీ తరువాతగానీ, అంతపట్టుదల వహించ లేదు. మొదటి రౌండు టేబిలు మహాసభ కాయన జబ్బుగా ఉండి డోలీలో హాజరయినాడు. అప్పుడుకూడా ఆయన కాకినాడ కాంగ్రెసులో చేసిన సూచననుగూర్చి యేమీ మాట్లాడ లేదు. అయితే జిన్నాగారు తనకు తెలియకుండానే ఈ రాజకీయ భావాన్ని ఆ జాతీయ నాయకునికడనుండి పొందినట్లున్నాడు. కాని మౌలానా

మహమ్మదాలీ జీవించి ఉన్నప్పుడుమాత్రం మాయసనాయకత్వాన్ని జిన్నా ఎన్నడూ అంగీకరించలేదు.

ఒకవైపునుంచి ఎవరైనా, ఏదైనా విషయాన్నిగూర్చి ఎక్కువగా మాట్లాడితే మరొకవైపునుంచి అంతకంటెనూ ఎక్కువగా మాట్లాడటం మానవసహజం. కాకి తెల్లగా ఉన్నదని అన్నప్పుడు రాక్షసిబొగ్గువలె నల్లగా ఉన్నదనాలనిపిస్తుంది. అటువంటి మానసిక ప్రవృత్తి మంచిది కాదని చెప్పదలచుకొన్నాము. ముఖ్యంగా హిందువు లిటువంటి తోవలను తొక్కకుండా జాగ్రత్త వహించవలెనని మా కోరిక. సత్యాగ్రహంవల్ల పూర్తిగా మన మనస్సులు మార్దవం కాలేదు. ప్రత్యపకారబుద్ధి ఇంకా మనలో చాలామందిలో ప్రజ్వరిల్లుతూనే ఉన్నది. మన మందరమూకూడా తాత్కాలిక విషయాలను ఆలోచిస్తామేకాని దూరప్రయోజనాలను చూచుకోము. ఒక్కొక్కప్పుడు ఉపాయాలకు ప్రాముఖ్యమిచ్చి, సిద్ధాంతాలను జారవిడుస్తాము. తాత్కాలికంగా కసిదీర్చుకొనే ప్రయత్నం చేస్తాముకాని శాశ్వత న్యాయ్యంకోసమాలోచించము. కనుక తీవ్రచర్యలకు దిగడంగానీ, ముసల్మానులపైన కత్తిదూస్తామని బెదిరించడంగానీ మనకు కూడనిపనులు. అందువలన ఇరుసంఘాలవారూ నాశనమైపోవడమేకాక మనమిన్నాళ్లనుండీ పోరాడుతూన్న మూడోవాడు మన నెత్తినెక్కి కూర్చుంటాడు. మన శాయుధబలంకానీ, మందుగుండుసామానులుకానీ, వాయువిమానాలూ, భాంబులుకానీ లేకపోయినప్పటికీ కేవలం మన సంస్థబలం

వలనను తీవ్రబాధానుభవం వలనను వానిని కొంతవరకు అదుపులో ఉంచగలుగుతూన్నాము.

> తే శతం హి వయం పంచ పరస్పర వివాదనే
> పరైస్తు విగ్రహే ప్రాప్తే వయం పంచాధికం శతః॥

అని కురుపాండవుల కాలంలో పాండవు లన్న ఈ మాటలను జ్ఞాపకం ఉంచుకోండి.

## హిందూమహమ్మదీయ సామాన్యానికి విరోధం లేదు

ఈ చివరి వివరణమునుబట్టి కూడా ఈ సమస్య ఇంకా తేలికగా కనిపిస్తూన్నది. ముస్లిము ప్రజాసామాన్యం ఈ ద్వేషాలకు బలికావడం లేదు. వారు తమ హిందూసోదరులలో కలసి మెలసి ఉంటూన్నారు. గ్రామాలలోని సాంఘిక ఆర్థిక జీవితమునుబట్టి చూస్తే హిందూ మహమ్మదీయ విభేద మక్కడ ఉన్నట్లే కనిపించదు. ఇది నగరజీవితంలోనూ విద్యావంతుల మనుకొనేవారిలోనూ కల్పింపబడిన కృత్రిమ విభేదం. అయినప్పటికీ దీనిని గణించకుండా ఉండడానికి వీలు లేదు. జాతీయచైతన్య మెప్పుడూ అట్టడుగునుండి కలగాలి. కాంగ్రెసులోని విద్యావంతుల రాజకీయచైతన్యాన్నీ, కోరికలనూ, స్వరాజ్యతృష్ణనుకూడా మధ్యతరగతులవారు స్వార్థదృష్టితో కల్పిస్తూన్న కపటాందోళనమని ఇంగ్లీషు విమర్శకులు తృణీకరించారు. స్వార్థపరత్వ మున్నది. ఉంటుంది కూడాను. మొదట్లో పూర్తిగా ఉండి. క్రమక్రమముగా తగ్గుతూ చివర కేమీ లేకుండా పోతుంది. ఈరోజున ప్రజా

సామాన్యంలో కలిగిన విశేష చైతన్యం స్వయంపరిపోషిత నాయకుల కృత్రిమస్వార్థపరత్వము నెంతమాత్రమూ సహించదు. మహమ్మదీయ ప్రజాసామాన్యంలో కూడా అదేవిధంగా చైతన్యం రావాలి. ప్రాతా అయితే రాష్ట్రిలలో గలిగే చిక్కులేమిటి? పశ్చిమోత్తర సరిహద్దురాష్ట్రాలు; సింధు రాష్ట్రమూ మాత్రమే మహమ్మదీయు లధిక సంఖ్యాకులుగా నుండి, హిందువు లల్పసంఖ్యాకులుగా ఉన్న రాష్ట్రాలు. అక్కడ అల్పసంఖ్యాకుల సమస్య హిందువులదిగాని మహమ్మదీయులది కాదు. బెంగాలు పంజాబురాష్ట్రాలలో మహమ్మదీయులు దాదాపు అధికసంఖ్యాకులంటే నూటికి 50కంటెఎక్కువ.

వంగరాష్ట్రంలో యూరోపియనుల ఉనికివలన ఈ సమస్య మరింత చిక్కులో పడ్డది. హిందూమహమ్మదీయ లిరువురి మధ్య వారేవైపుకు మొగ్గితే వారివైపు బలమవుతుంది. అందువలన వారక్కడ ప్రధానస్థాన మలంకరిస్తూన్నారని చెప్పవచ్చును. నిజానికి తక్కినచోట్లకంటె వంగరాష్ట్రంలోని ఈ ప్రమాదకర పరిస్థితిని తొలగించడం ముఖ్య కర్తవ్యం. పాంచాలంలో మహమ్మదీయుల అధికసంఖ్య వలన, మన సిక్కులఅభిలాషలవలన, క్రైస్తవులు, జమీందారులు, వాణిజ్య సంఘాలు, హరిజనులు వీరందరివలన అక్కడి హిందువులు కేవలంఅల్పసంఖ్యాకులైపోయినారు. హరిజనులు హిందువులలోని వారేననేమాట నిజమే. అలాగే సిక్కులనుకూడా హిందువులలోనివారుగా గణించవచ్చును. ఈ పృథగ్భావాలను నకాలంలో తుంచివేయాలి. బొంబాయి, మద్రాసు, మధ్య

రాష్ట్రాలలో ఈసమస్య లేనేలేదు. అనగా ఈ సమస్యను నిర్లక్ష్యం చేయాలని మాభావంకాదు. కాని కాదనడానికి వీలులేనిపద్ధతిని ఈ సమస్య పరిష్కరింప బడింది. ఈరాష్ట్రాలలో మహమ్మదీయులు నూటికి 6 మొదలు 7 వరకూ ఉంటారు. కాని వారిసంఘంలోనుండి ఒక మంత్రిఉన్నాడు. ఇక్కడ సంఖ్యాబలంకాదు ప్రధానం. జాతీయసంస్థయెడల విశ్వాసంతో మెలగడమే మనకు కావలసింది. ఇక బీహారు సంయుక్త రాష్ట్రాలలో నూటికి 12 మొదలు 15 వరకూ మహమ్మదీయులు ఉంటారు. కాని అక్కడి మహమ్మదీయులలోగల చైతన్యము, విద్య, కోరికలు, అహంకారము, అభిలాషలు, నిష్కారణ రాగద్వేషాలు, ఇవన్నీగమనిస్తే దక్షిణ భారతదేశంలోని బ్రాహ్మణులను పోలిఉన్నట్లు తోస్తుంది. ఇక్కడి బ్రాహ్మణులవలెనే అక్కడి మహమ్మదీయులుకూడా అల్ప సంఖ్యాకులైనప్పటికీ కొంత పలుకుబడి గలవారే. కాబట్టి సంయుక్తరాష్ట్రాలలోనూ బీహారులోనూ హిందూమహమ్మదీయ విభేదాలను పరిష్కారం చేసుకొన్నట్లయితే హిందూ దేశంలో చెప్పుకోదగిన ముస్లిం సమస్యయే లేదు.

## ప్రకృతి సమానౌదార్యమే చూపుతూన్నది

మతం మనలోని ప్రతివ్యక్తికి ప్రత్యేకంగా సంబంధించింది. ఎవరి మతధర్మాలను వారు 'తూ' 'చా' తప్పకుండా అనుసరింపవచ్చును. అయినప్పటికీ సాంఘిక ఆర్థిక విషయాలలో సమరసభావం ఉండాలి. సామరస్యమేకాదు, అందరి

ప్రయోజనాలూ ఒక్కటేననేభావం ఉండాలి. వరదగానీ ఉప్పెనగానీవస్తే యేవిధమైన భేదభావమూ లేకుండా అన్ని కులాలవారి అన్ని మతాలవారి ఇళ్లు, పొలాలు, గొడ్లు గోద అన్నీ నాశనం కావడంలేదా? ప్రపంచంలో నివసించే జను లందరియందు సమానంగానే తన ఔదార్యాన్ని చూపిస్తూం టుంది ప్రకృతి. నిరంతరం తన ప్రేమసౌభాగ్యాన్ని ప్రకృతి దేవత పక్షపాతంలేకుండా ఎలా పంచిపెడుతుందో, అలాగే అప్పుడప్పుడూ దేశాలలో ఉత్పాతాలూ, అనర్థాలూకూడా కలిగిస్తూంటుంది. కాబట్టి ఈవిభేదాలు ప్రకృతిసిద్ధాలుకావు. మానవకల్పితాలు. పౌరులకూ, పౌరులకూ విరోధాలు కల్పించి, భారతదేశమంతా తగాదాలతో నింపి ఉన్నదనడం న్యాయ్యమా?

## చీలదీసి పాలించడం

రెండువందల సంవత్సరాల బ్రిటిషు పరిపాలన తరువాత భారత ప్రజలు గట్టిగా తెలుసుకొన్న విషయ మేమంటే తమలో తమకే చీలికలుఉన్నవని, విదేశీ ప్రభుత్వంచేత కల్పింపబడిన కృత్రిమ ప్రమాణాల మూలకంగా ఈప్రాచీన భారతవర్షంలో విభేదాలేర్పడినవని అనేక పర్యాయాలు ప్రజలదృష్టికి ప్రత్యక్షంచేయుబడింది. హిందూ దేశంలో నాలు గోవంతు జనసంఖ్యా మూడోవంతు వైశాల్యమూగలప్రదేశం భారతసంస్థానాలనే పేరుతో వేరుచేయబడింది. ఇవి అన్నీ ఇంగ్లాండులోని బ్రిటిషురాజుతోటి సంధులు, సనదులు, వాగ్దానాలు, వీటివలన సంపాదించిన స్నేహబాంధవ్యాలు

కలిగిన స్వతంత్రరాజ్యాలని ప్రపంచానికి చాటబడుతూన్నవి. నిజానికి సంస్థానాధిపతులు బ్రిటిష్‌రాజు చేతులలో కీలు బొమ్మలు. ఆయన అనుగ్రహమున్నంత కాలమే వారి రాజ్యాలుంటవి.

మరొకప్రక్కను దేశం రాష్ట్రాలుగా విభజింపబడింది. వోటింగు అధికారాలను నిర్ణయించడంలోనూ, ఎన్నికలను నడపడంలోనూ ప్రజాభిప్రాయం ప్రకటనకావడానికి వీలులేని పద్ధతిని గట్టి ప్రయత్నాలు జరిగినవి. కాని నిజంగా 'దైవవాణయే ప్రజావాణి' అయింది. బ్రిటిష్‌వారు వేసిన అంచనా ఇందులో తప్పింది. ప్రాదేశికంగా విభజించిన తరువాత సంఘాలుగా కూడా ఇండియాను విభజించారు. హిందువులు, మహమ్మదీయులు, సిక్కులు, క్రైస్తవులు, హరిజనులు, వీరందరికీ దాదాపు ప్రత్యేక నియోజకవర్గాలేర్పాటయినవి. క్యుములేటివ్ వోటింగ్ పద్ధతి (ఇద్దరినిగానీ ముగ్గురినికానీ ఎన్నుకోవలసిన నియోజకవర్గాలలో అన్నివోట్లూ వొకరికే వేయవచ్చును.) యేర్పాటు చేయబడింది. ఇందువలన ఒకే పార్టీ అభ్యర్థులకు ఎన్నికలలో మనస్పర్థలు కలగవచ్చును. తరువాత మంత్రివర్గ నిర్మాణంలో ప్రతిసంఘమూ ప్రత్యేక హిరణ్యాత్మకరాలు కోరేటట్టుగా ప్రోత్సాహం చేశారధికార వర్గంవారు. ఇదిచాలక ప్రయోజనాలనుబట్టికూడా వర్గాలుగా విభజించారు దేశాన్ని. పల్లెటూళ్లనూ పట్టణాలను వేరువేరుగా విభజించారు. బ్రిటిష్‌గవర్నమెంటువారు పల్లెప్రయోజనముల కంటె పట్టణాలప్రయోజనాలనుఎక్కువగా ప్రోత్సాహపరుస్తూ

న్న సంగతీ, పల్లెటూరివారినుండి వసూలుచేసే పన్నుల పద్ధతి కంటె, పట్టణస్థుల పైన విధించబడే పన్నుల పద్ధతి ఎక్కువ సుఖ వుగానూ సౌకర్యంగానూ ఉంటున్న సంగతీ అందరికీ తెలి సిందే. ఇంతటితో ఊరుకోక ఏజన్సీ ప్రదేశాలనీ మైదాన ప్రదే శాలనీ, దేశాన్ని తృప్పవచ్చినట్లు వంకరకోతలుకోసి చీల్చారు. ఏజన్సీ ప్రదేశాలలో సామాన్య పౌరసత్వాలకూ, సామాన్య న్యాయాన్నికి సంబంధించిన నియమాలూ కట్టుబాట్లూ వర్తిం చవు. ఏవ్యవహారమైనా అప్పటికప్పుడు జరిగిపోవలసిందే. మైదాన ప్రదేశాలలో లేని నిరంకుశత్వంయొక్క జాడ ఎక్కువగా ప్రత్యక్షమౌతూన్నది. ఇవిగాక తోటల యజమానులు, యూరోపియన్ వర్తకులు, విశ్వవిద్యాలయ పట్టభద్రులు, వివిధసంఘాలలోని స్త్రీలు వీరందరికీని ప్రత్యేక నియోజక వర్గాలేర్పాటుచేయబడినవి. ఈవివిధ విభాగాలవలన హిందూ దేశ మొక 'పావురాళ్ళ గూడు' కింద తయారయింది. 35 కోట్ల జనసంఖ్యనూ చీల్చి, వేరు వేరు అరలలో ఒకరికొకరికి సంబంధం లేకుండా ఉంచారు, ఒకరిగాలి ఒకరికి తాకకుండా, ఒకరివోటు ఒకరికిపోకుండా, ఒకరిఅభిప్రాయాలొకరికందకుండా, చాలాబందోబస్తుగా యేర్పాటుచేశారు ప్రతిఅరనూ. కాబట్టి ఎవరివాంఛలువారివే; ఎవరిఅభిప్రాయాలు వారివే; ఎవరి చిత్తప్రవృత్తివారిదే.

హిందూదేశం వివిధవర్గాలుగా విభజింపబడిన విధానమూ పుట్టుపూర్వోత్తరమూ ఇది. ఇదిజరిగిన పిమ్మట హిందూ దేశంలోని ప్రజలు 250 భాషలు మాట్లాడుతారు; అక్కడ

అనేకమతాలవారున్నారు. ఇక కులాలకూ, కులాలలో శాఖలకూ మితిలేదు. కాబట్టి హిందూదేశ మొకజాతి కాదని ప్రచారం ప్రారంభమయింది. ప్రభుత్వం వారెరగనట్లుగా, అతిశ్రద్ధగా కావించిన ఈ ప్రచారాన్ని నిజమేననుకొని నిశ్శబ్దంగా ఉండడమేగాక, మనలో నిస్పృహాకూడా వ్యాపించింది. శాసన సభలలో ఎన్నికసభ్యులసంఖ్య, గణింపదగనంత చిన్నదిగా ఉన్నంతకాలమూ విభాగాలు దేశంలోని రాజకీయజీవితంలో లెక్కలోకి రానేలేదు.

భారత కేంద్ర రాష్ట్రీయశాసనసభలలో మొట్టమొదటిసారి ఎన్నికసభ్యులు ప్రవేశించింది 1893లో. అంతవరకు ప్రభుత్వ నియోజితులైన అధికార అనధికార సభ్యులే శాసనసభలలో ఉంటూవచ్చారు. 1893లో మద్రాసులోని ఎన్నికసభ్యులసంఖ్య ఏడు. 1908లో అది 28 కి పెంపుచేయబడింది. అప్పుడు సంఘ విభేదాలు చెలరేగేటట్టుగా చేయబడినవి. నిజానికి 1905 లో వంగరాష్ట్రాన్ని రెండుగా విభజించడానికిది యొకకారణం. ఈవిభజన వలననే మొదటిసారి మహమ్మదీయులలో తామొక ప్రత్యేక సంఘమనే భావం అంకురించింది. అంత వరకూ హిందువులను బ్రిటిషువారు చాలా ప్రోత్సాహ పరుస్తూండేవారు. కాని అసంఖ్యాకులైన హిందువులలో జాతీయ భావాలు వ్యాపించిన సంగతి తెలుసుకొని, జాతీయాభ్యుదయానికి అడ్డంకు కలిగించే ఉద్దేశంతో, తూర్పుబంగాళా దేశంలో మహమ్మదీయరాష్ట్రాన్ని ప్రత్యేకంగా సృష్టించారు. ఓట్టచివరకు 1911 డిశంబరులో ఢిల్లీదర్బారునాడు, చక్ర

చక్రవర్తి ప్రకటనద్వారా విభజన రద్దుచేయబడింది. కాని అందువలన కలిగిన క్షేమభావం మాత్రం, ఆ సంఘాల మనస్సులలో పనిచేస్తూనేఉన్నది. 1908 లో ఉత్పన్నమైన ద్వేషభావం, కోపంవలనా కసివలనా నానాటికీ పెరుగుతూనే ఉన్నది. అప్పటినుండీ భారతీయ సంఘవ్యవస్థ హిందూ మహమ్మదీయ విభేదవిషాదస్మృతులతో కళంకితమౌతూన్నది.

కాని ప్రజలు చాలావరకు జాగ్రత్త వహిస్తూనేవచ్చారు. 1916 లో ఈ మహాపచారానికి తగిన ప్రతిక్రియ చేయడానికి ప్రయత్నాలు జరిగినవి. కాని నాటి లక్నో హిందూమహమ్మదీయ సమాఖ్యప్రకారం సమష్టినియోజకవర్గాలకు బదులుగా ప్రత్యేక నియోజకవర్గాలేర్పాటు కావడంవలన, అప్పటినుండీ ప్రతివిషయంలోనూ పృథగ్భావమే ప్రస్ఫుటమౌతూన్నది. కాని 1921 లో, ఖిలాఫతుఉద్యమం తలయెత్తినప్పుడు ఈ విభేదాలు పూర్తిగా విస్మరించబడినవి. తరువాత ఖలీఫలకు పుట్టినిల్లయిన టర్కీయే, ఖిలాఫత్తును రద్దుచేసి, ఖలీఫా అధికారాలనుకూడా తొలగించిన వెంటనే ఈ ఐకమత్యభావం అంతరించి, అంతవరకూ అణచిపెట్టుకొన్న అహంకారాలు దౌర్జన్యరూపంలో చెలరేగ ప్రారంభించినవి. 1924 నుండి నేటివరకూ హిందూ మహమ్మదీయులొక్కొక్కప్పుడు ఎదురుపడి కొట్టుకోవడం, మరొక్కప్పుడు తమతమ స్పర్థలను మనస్సులలో దాచిపెట్టుకోవడమూ జరుగుతూన్నది. కాని ఈ విభేదాలు, ఆంగ్ల విద్యాధికులు తమతమ వ్యక్తిప్రయోజనాల కోసం తెచ్చిపెట్టినవనీ, ఇవి జాతీయ

క్షేమానికి భంగకరములనీ కూడా, ప్రజలు గ్రహిస్తూనే ఉన్నారు. కాంగ్రెస్ ఈసంగతి 1931లోనే కనిపెట్టింది. రెండో రౌండుటేబిలు మహాసభనుండి గాంధీ రాగానే చెప్పిన విషయమిదే. ఈపర్యాయం హిందూదేశ రాజ్యాంగ విషయంలో జరిగే రాయబారాలన్నీ హిందూ మహమ్మదీయ సామరస్యం పైన ఆధారపడి ఉండాలనీ, తాను రౌండుటేబిలుసభలో అనేక విభేదాలు కలుగవచ్చు ననుకొన్నప్పటికీ, హిందూ మహమ్మదీయుల మధ్యనూ ఇతివారకాంగ్రెసు ప్రతినిధుల మధ్యనూ ప్రదర్శితములయిన విభేదాలు తన కాశ్చర్య విషాదములు కలిగించినవనీ గాంధీ కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యులకు విశద పరిచాడు.

'ఒక విషయాన్ని భావించడం' లోనూ, 'ప్రత్యక్షంగాచూడడం' లోనూ భేదమున్నదన్నాడాయన. రెండో రౌండుటేబిలు మహాసభలో కొంతమంది చూపిన కాఠిన్యము ద్వేషము, మొండిపట్టుదలా జాతి కళ్ళు తెరిపించినవి. తాత్కాలిక లాభాలకోసం శాశ్వత ప్రయోజనాలనూ, అవసరంకోసం సిద్ధాంతాన్నీ, స్వసంఘలాభంకోసం జాతీయ క్షేమాన్నీ, తృణీకరించగల మహానుభావులీ దేశంలో ఉన్నారని అప్పుడు బాగా అర్థమయింది.

హిందూదేశంలో ఏ గ్రామానికైనా వెళ్ళిచూడండి. కుల భేదాలు మతభేదాలు కనిపిస్తే కనిపించవచ్చును. కాని వివిధ మతాలకూ వివిధసంఘాలకూ చెందిన ప్రజలందరి ఆర్థిక ప్రయోజనాలూ ఒక్కటేననీ, అన్ని కులాలవారూ,

అన్ని మతాలవారూ - హిందువులూ మహమ్మదీయులు కూడా - భ్రాతృ భావంతో మెలగుతున్నారని మాకు స్పష్టమౌతుంది ఇది చూచినప్పుడు, భారత దేశంలో సవర్ణులకూ అవర్ణులకూ, హిందువులకూ మహమ్మదీయులకూ, పైకులాల వారికీ దిగువకులాల వారికీ, తీరని మనస్పర్థ, మతకలహాలు, పోరాటాలూ ఉన్నవని, ఐరోపా యాత్రికులు వ్రాసిన వ్రాతలలోని ఆ యథార్థం ఆశ్చర్యం కలిగించక పోదు. గ్రామాలలో హిందువులూ మహమ్మదీయులూ బుజాలు రాచుకొంటూ తిరుగు తూంటారు. వారిరువురికీ వేఱొక మతమనే జ్ఞానమే వారికున్నట్లుతోచదు. సంఘం పై మెట్లులో ఉన్నవారెవరో కల్పిస్తూన్న కృత్రిమ వైషమ్యాలను వారు గమనిస్తూన్నట్లే కనిపించదు.

కొంతమంది కుడిపక్షంవారు సాంఘిక విభేదాలు కల వారనీ ఎడమపక్షంవారి కవి లేవనీ అంటారు. ఇందులో సగం మాత్రమేనిజం. అవకాశాలు ఉంటేనేగాని ఆశపుట్టదు. పళ్ళచెట్టుకు దగ్గరగా ఉన్నవానికే పళ్ళకోసుకో వాలెననే ఆశ పుడుతుంది. దూరంగా ఉన్నవారికది పుట్టనే పుట్టదు.

ప్రకృతిని పరిశీలించినా ఈ విషయం తెలుస్తుంది. నది పుట్టినచోట నీరతినిర్మలంగా ఉంటుంది. ప్రవహించేటప్పుడందులో కొన్ని ఉప్పులూ కొంతబురదా కలిసేమాట నిజం. సముద్రంలో కలిసిన చోటగానీ, కలవడానికి 30 మైళ్లదూరంలోగానీ, నీరు మరింత ఉప్పగా ఉంటుంది. కుడిపక్షం వారు సంకుచితభావంతో ప్రవర్తించడానికి కారణ

మేమిటో, ఈ సిద్ధాంతాన్ని అర్థం చేసుకుంటే తెలుస్తుంది. జీవితంలో వాస్తవిక విషయాలను సన్నిహితంగా ఎదుర్కొన్నవలసిన తరుణం వచ్చినకొద్దీ, సంకుచితభావం అంతకంతకు వెల్లడి అవుతూవుంటుంది. అందువల్లనే మొట్టమొదట్లో హిందువులు, మహమ్మదీయులు అనుకొనే మనం, బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులూ అనుకొంటాము. తరువాత మళ్ళీ బ్రాహ్మణేతరులలో రెడ్డి, వెలమ, కమ్మ, కాపు విభేదాలు వస్తవి. అటుపిమ్మట ఇంటి పేర్లనుబట్టి విభజన లేర్పాటవుతవి. మనం అడుగుకు పోయినకొద్దీ అనురాగాలుకూడా తగ్గిపోతూంటవి. ఈ సంకుచిత బాంధవ్యాలలో నుండి బ్రతికి బయటపడితేనేతప్ప జాతీయత లేదు మనకు. ఈ సందర్భంలో మనం ఇంగ్లాండును సాదృశ్యంగా తీసుకోవాలి. అక్కడ క్యాథలిక్కులు ప్రొటెస్టెంట్లూ, యూదులూ, క్రైస్తవులూ ఈ అందరూకూడా జాతిక్షేమంకోసమే పనిచేస్తారు.

ఎడమపక్షంవారు సిద్ధాంతాలు చెబుతారుగాని పనిలోకి దిగరు. కుడిపక్షంవారు ముందుస్వసంరక్షణ చూచుకొంటారు. ఈరెండూ పనికిరావు. మధ్యస్థంగాఉండి విజయంకోసం ప్రయత్నించాలి. ముసల్మానులతో పోరాటం లేకుండా ఉండేటందుకు గాంధీ యెంతదూరం పోయినాడో చూడండి. మహమ్మదీయులు బలప్రయోగం చేస్తారనే ఆరోపణలను గాంధీ నిరాకరిస్తూ హరిజన్‌లో ఇలా వ్రాశాడు. 'కాంగ్రెసును నేను ఒప్పించ గలిగేటట్లయితే మహమ్మదీయులు బలప్రయోగం చేయవలసినంత శ్రమ వారికి ఈయను. నేను

వారిచే పరిపాలింప బడుతాను. అది భారతీయ ప్రభుత్వమే గనుక నా కా విషయంలో అభ్యంతరం లేదు. అనగా ప్రతి విషయంలోనూ కాంగ్రెసు అహింసావద్ధతినే అవలంబించి పరిష్కరిస్తుందని అర్థం' కాని బ్రిటిషువా రవలంబించినపద్ధతి వేరుగా ఉన్నది. బ్రిటిషు ప్రధాని నిర్ణయం రోగ చికిత్స కాదు. రోగ లక్షణ చికిత్స. ఆయన చేసిన సాంఘిక పరిష్కారం మన కిష్టం లేదు గనుక అంగీకరించే స్థితిలో లేము. శక్తి లేదు గనుక నిరాకరించే స్థితిలోనూ లేము.

మన దురదృష్టమేమో మొదటినుండి చివరవరకూ, మన ఆంతరంగిక విభేదాలతోనే మనం కృశించిపోతూ న్నాము, మహమ్మదుఘోరీ దండయాత్రనాడే పృథ్వీరాజుతో తక్కిన హిందూ రాజులంతా ఎందుకు కలియలేదు ? 1526 లో ఉత్తర హిందూస్థానంలోని పఠానులూ రాజపుత్రులూ, ప్రజాకంటకుడైన ఇబ్రాహిం లోడీని ఢిల్లీ సింహాసనమునుండి లాగివేయడానికి కాబూలునుండి బాబరును ఆహ్వానించారు. 1756 లో వంగరాష్ట్రంలోని హిందూ ముస్లిము సర్దారులు సిరాజుద్దౌలామీద దండయాత్ర చేయడానికి ఇంగ్లీషు వారిని ఆహ్వానించేటందుకు కుట్రచేశారు. మన కమ్యూనిస్టుసోదరుల ద్వారా ఇక రష్యనులనుకూడా ఆహ్వానించుదామా, ఇప్పుడు? ఇది నట్టేట్లో పుట్టిముంచుకోవడ మవుతుంది. బ్రిటనుచేత ఇండియా స్వాతంత్ర్యం అంగీకరింప చేయాలి. అప్పుడే హిందూ మహమ్మదీయులకు సఖ్యత కుదురుతుంది, క్రీ. శ. 410 లో 'అలరిక్ ది గోథ్' రోమును ముట్టడించి నప్పుడు

హానోరి యస్ చక్రవర్తి, రోమనులుగా మారిపోయి శాంతంగా కాలక్షేపం చేస్తూన్న క్రైస్తవ బ్రిటనులకు 'మిమ్ములను మేమిక రక్షించలేము. మేము వెళ్ళిపోతూ న్నాము. మీరక్షణ మీరే చేసుకోవాలి' అని చెప్పినట్లుగా, బ్రిటను మన కిప్పుడు చెప్పితే మన మేమి చేయాలి? ఐక మత్యంలోనే మన బలము, మోక్షమూ ఇమిడి ఉన్నవి.

అధ్యాయము 17

# నైతికోన్నత్యము : మద్యనిషేధము

## పాపపు డబ్బు

### తాగుడు

రాష్ట్రప్రభుత్వాలకు వచ్చే ఆదాయంలో 17 కోట్లు త్రాగుడువలన లభిస్తూన్నది. ఇండియా ప్రభుత్వానికి 6 కోట్లు ఉప్పువలన, ఒకకోటి నల్లమందువలన లభిస్తూన్నది. మొత్తం 24 కోట్లు. ఉప్పుసత్యాగ్రహసమయంలో తాగుడు, నల్లమందు, ఉప్పు వీటివలన లభించే పాపపుడబ్బు రద్దుకావాలని గాంధీ పట్టుపట్టాడు. ఈ నష్టాన్ని సరిపుచ్చడానికి సైనికవ్యయము 48 కోట్ల సగానికి తగ్గిస్తే ఆ 24 కోట్లు కలసివస్తుందని సూచించాడు. గాంధీ నిర్మాణకార్యక్రమంలో ప్రాముఖ్యస్థానం వహించిన ఈ విషయాలను ఒక్కొక్కదానినే పరిశీలిద్దాము.

తాగుడు సప్తవ్యసనాలలో ఒకటి. కోట్లకొలదీ దరిద్రులూ వేలకొలదీ భాగ్యవంతులూ ఈ పిశాచానికిబలియై, ఐశ్వర్యం ఆరోగ్యం, ఆనందం, ఈ అన్నిటిని కోల్పోయినారు. పాశ్చాత్యనాగరికతలో తాగుడు తప్పుకాదు. తాగి తందనాలు తొక్కడం తగనిపని; కాని మన దేశంలో ఒక్కరుకూడా తాగుడు ఒప్పుకోరు. పూర్వాచారమునుబట్టి తాగుడలవాటు ఘనవర్గాలవారుకూడా గౌరవం కలవారెవరూ దానిని బహి

రంగంగా అంగీకరించరు. కాని పాశ్చాత్యసంపర్కంకల కొత్త వర్గమొకటి సంఘంలోని ధనవంతులలోనుండి తయారయింది. వారు చాలా కొద్దిమంది. వారు తాగుడు కలవాటయినారు. ముఖ్యంగా విదేశీసారాల కలవాటుపడ్డారు. పూర్వకాలంలో మన దేశమున తాగుడులేదని మేము చెప్పడంలేదు. పురాణాలలో కొందరు మద్యం సేవించినట్లుగా తార్కాణాలు కనబడుతూ వేఉన్నవి. తరువాత శంకరాచార్యులవారు దానిని నిషేధించారు. 'తాగుడు కలవాటయినవారు పాపాత్ములు' అన్నాడాయన.

ఈ దేశప్రజనసంఖ్య 35 కోట్లు. అందులో హిందువులు 24 కోట్లు, మహమ్మదీయులు 8 కోట్లు. హిందువులలో 4కోట్లమంది 'అంటరానివాళ్లు' అని పిలువబడేవాళ్ళున్నారు. వీరిలో నూటికి 80 మొదలు 90 వరకూ మగవాళ్ళు తాగుడు పిశాచాని కలవాటయి కృశించి పోతూన్నారు. వీళ్ళుకాక కాయకష్టం చేసేవర్గాలలో కొందరూ, బిచ్చమెత్తుకొంటూ తిరిగేవారిలో కొందరూ, వాళ్ల సంపాదనలో చాలాభాగం తాగుడుకు వెచ్చిస్తూంటారు. ఇక వ్యవసాయకులలో ఉన్నత వర్గాలకుచెందిన కొంతమందికూడా పాపం తాగుడుకలవాటై కీర్తిప్రతిష్ఠలనూ శీలాన్నీ, వ్యక్తిక్షేమాన్నీ, కుటుంబసౌఖ్యాన్నీ నాశనం చేసుకొన్నారు. ఈదేశంలోకి బ్రిటిష్‌పరిపాలన వచ్చినతరువాత తాగుడుకు చాటుపోయి బహిరంగ భోగలాలసత్వంగా పరిణమించిందది. ప్రభుత్వంవారావ్యాపారానికి బహిరంగంగా లైసెన్సులీయసాగించారు. అంతేకాదు

ప్రభుత్వంవారికి చాలాకాలంవరకు తాగుడుమీద వచ్చే ఆదాయం, ముఖ్యాదాయాలలోఒకటిగా ఉండేది. దొంగతనం జూదములాటి నేరముల క్రింద పరిగణించవలసిన తాగుడుకు మాన్యుయల్ అనే ఒక గ్రంథాన్ని ఆధారంగాచేసికొని లైసెన్సు లిస్తూండడం చూస్తే, [illegible] విచారమూ వేస్తూంటుంది. బహిరంగంగా హోటలుపెట్టుకుందుకూ, రహస్యంగా వ్యభిచారగృహాలు నడిపేటందుకూ లైసెన్సులీయడంకంటె కల్లు సారాయిదుకాణాలు పెట్టుకొనేటందుకు లైసెన్సు లీయడం తక్కువ ఘోరంకాదు. ఈపని సంఘక్షేమానికి వ్యతిరేకం. పూర్వ సంప్రదాయములను బట్టి మన దేశంలో ప్రజలు తాగుడు జూదములను ఎంతహీనంగా చూస్తున్నారో, అంత హీనంగా ప్రభుత్వంవారు వాటిని చూడడంలేదు. ఇదిచాలా దురదృష్టం. హిందూమతస్థులవలెనే మహమ్మదీయమతస్థాపకులూ, గురువులూకూడా తాగుడును ఖండితంగా నిరసించారు. దురదృష్టవశమున ఇప్పుడు హిందూసంఘంలోవలెనే మహమ్మదీయ సంఘంలో కూడా తాగుడు వ్యాపించింది. ఈ ఘోర దురాచారాన్ని రూపుమాపే నిమిత్తం సంఘ శ్రేయోభిలాషులు కొంత మంది మతసిద్ధాంతాలను కాంగ్రెసు ఆదేశాలనూ నిరంతరం ప్రచారంచేయడం తమ ధర్మంగా భావిస్తున్నారు.

## 17 కోట్ల ఆదాయం

ఈ హేయదురాచారము వలన భారతదేశం మొత్తం మీద 17 కోట్ల ఆదాయంతీస్తున్న ప్రభుత్వాన్ని గూర్చి

ఒక్కసారి యోచించండి. మద్రాసు రాష్ట్ర ప్రభుత్వాదాయం మొత్తం 16 కోట్లు. అందులో నాలుగో వంతు ఆబ్కారీవలన లభిస్తూన్నది. మగవాళ్లు తాగుడ కలవాటు పడినందువలన ఎన్నో పేదకుటుంబాలు అన్నం లేక అల్లాడుతూంటే తద్వారా వచ్చిన ప్రభుత్వాదాయంవల్ల విద్యావిలాసాలతో ధనవంతులు కాలక్షేపం చేస్తూండడం దైవచిత్రమనాలా? విషాద సంఘటనమనాలా? ఇది కాకులనుకొట్టి గద్దలకు వేయడం కాదా? అంతకన్న కూడా చెడ్డది. నలుగురు కొడుకులున్న తండ్రితో నీ పెద్దకొడుకుకుమందు, నీ రెండోకొడుకుకు చదువూ కావలెనంటె తక్కిన ఇద్దరుకొడుకులూ తాగాలి. అందువలన లభించిన 4 కోట్లలో అప్పుడు రెండు కోట్లు ఆసుపత్రులకూ రెండు కోట్లు కళాశాలలకూ ఖర్చుపెట్టడానికి వీలవుతుందని చెప్పడంవంటిది ఇది.

వృత్తికళానైపుణ్యంగల కుటుంబా లెన్నో తాగుడువలన తమ బ్రతుకుతెరవునే పాడుచేసుకొన్నవి. తాగుడు ఎక్కువైన కొద్దీ హస్తకౌశలం నశిస్తుంది; నెత్తురు క్షీణిస్తుంది; అనేక రోగాలు వ్యాపిస్తవి; తాగుడు కలవాటు పడ్డవాళ్ళకు రోగాలను రాకుండా కాపాడుకొనేశక్తి ఉండదు. ఈ సంగతి అందరికీ తెలిసిందే. తాగుడు యుక్తాయుక్త వివేకాన్ని పోగొడుతుంది. తాగుబోతు లనేకవ్యసనాలకు బలియై తద్వారా అనేక నేరాలకు పాల్పడుతారు.

తాగుడుమానితే కష్టజీవుల దరిద్రం సగం తగ్గుతుంది. అంతేకాదు, రెట్టింపుఆరోగ్యమూ రెండింతల సంస్కారమూ

కలుగుతుంది. దేశంలో నేరాలు చాలావరకు తగ్గిపోతవి. అందువలన వాటిని నిరోధించేటందుకు గాక, కనిపెట్టే నిమిత్తంగాని వెచ్చించవలసిన ప్రభుత్వవ్యయంకూడా చాలా తగ్గిపోతుంది. సఖ్యత కలుగుతుంది. నైతిక వర్తకం అభివృద్ధి అవుతుంది, ఉత్పత్తికి ప్రోత్సాహం కలుగుతుంది. వీటన్నిటి వలన జాతిలో నిర్మాణశక్తి పెరుగుతుంది. జరిగిన 17 సంవత్సరాలనుండీ గాంధీ ఈసంపూర్ణ మద్యనిషేధ సిద్ధాంతాన్ని కాంగ్రెసు యాజమాన్యం క్రింద ప్రచారం చేస్తూన్నాము. తాను ఒకటిన్నర దశాబ్దములనుండీ ప్రజాసామాన్యానికి బోధపరుస్తూన్న ఈకార్యక్రమాన్ని కాంగ్రెసుమంత్రు లధికారంలోకిరాగానే తమతమరాష్ట్రాలలో ఆచరణలో పెట్ట నిశ్చయించు కొన్నారు. ఒకేసారి తాగుడును నిలిపివేసినందు వలన రాష్ట్రప్రభుత్వాలఆదాయం చాలావరకు పడిపోయే మాట నిజం. కాబట్టి మద్రాసురాజధానిలో మొట్టమొదట సేలం, చిత్తూరు, కడప, ఉత్తరార్కాటు జిల్లాలలోనూ, బొంబాయిరాష్ట్రంలో అహమ్మదాబాదు బొంబాయినగరముల లోనూ, ఇతర రాష్ట్రాలలో అక్కడక్కడా కొన్నినిర్ణీతప్రదేశములలోనూ మాత్రమే కాంగ్రెసుమంత్రులు మద్యనిషేధ సిద్ధాంతాన్ని ఆచరణలోకి తీసుకొని వచ్చారు ఇది ఈసందర్భములో వారు తీసుకొనిన మొదటిచర్య. మద్యనిషేధం కొనసాగుతుందా లేదా అని పరీక్షకోసంచేసిన పనిగా దిది. దానిని కొనసాగించడానికి కావలసిన పనులెన్నో తరువాత సంవత్సరాలలో చేసి ఉండేవారు. బడ్జెట్టును సరిపుచ్చుకోవల

సిన బాధ్యతకూడా ఉందికదా ప్రభుత్వాలకు; కాబట్టి అందుకు తగ్గించతగిన ప్రభుత్వవ్యయాలను తగ్గించాలి; జాగ్రత్తగా పరిశీలించి కొత్తకొత్తవిధాల ఎక్కువకుదా వచ్చే మార్గాలను అన్వేషించాలి; కనుక కొంత కాలయాపన తప్పనిసరి.

## మద్యనిషేధము ; గాంధి

బొంబాయిలో మద్యనిషేధ ప్రారంభమునుగూర్చి గాంధీ ఢిల్లీనుంచి 26-3-39 ని వ్రాసిన విషయాలను ఇక్కడ ఉదహరించడం ఉచితం.

> 'చక్కగా చేసినపని చక్కగానే ఉంటుంది' అనేది మంచి సామెత. బొంబాయిలో మనోహరస్థలాలు చాలా ఉన్నవి కాబట్టిన్నీ పోవ్చుటకు మంచిమార్గం ఉన్నదికాబట్టిన్నీ బొంబాయినగరం చక్కని దనడం న్యాయ్యం కాదనీ నే ననేకసార్లు చెబుతూఉంటాను. ఆ నగరంలో మురికి బారకీచులు, జనసంకీర్ణమూలైన ఇరుకుసందులు, నివాస యోగ్యములుకాని హరిజనుల గుడిసెలూ ఉన్నంత కాలమూ నేనలా చెప్పక తప్పదు. కాని బొంబాయి మద్యాన్ని మానివేసినప్పుడు. నేను చెప్పిన కళంకాలు ఉన్నప్పటికీకూడా ఆ ఒక్క మనోజ్ఞ కృత్యంవలననే అది రమణీయనగరం అనిపించుకుంటుంది. బొంబాయి నగరంలోని కష్టజీవులలో తాగుడ వ్యసనాన్ని తప్పించినట్లయితే వారిస్థితి బాగుపడుతుంది. అప్పుడు బొంబాయి పురపాలకసంఘం పేదలకు వాసయోగ్యములైన గృహాములను నిర్మించేటందుకు చులకనగా ప్రయత్నించవచ్చును. బొంబాయి ప్రభుత్వంవారు అందులో ముఖ్యంగా డాక్టరు గిల్డరు, యింతధైర్యంగా తమ ధర్మాన్ని నిర్వర్తించ గలిగినందుకు, బొంబాయి నగరమేకాదు, రాష్ట్రమంతా వారికి

అక్షీణింపజేయవలసి ఉంది. ప్రాంతీయ వ్యవహారమైననే ఆధారపడి ఉన్న అనేకమంది పార్సీలవృత్తి యింతమూలాన పోతుందని నాకు తెలుసు. బొంబాయి పార్సీలకు కూడా. మందిరీపు ప్రాశస్త్యంగా మద్యం త్రాగుమానడం సర్వత్ర అమలైతే నవనాగరికులు కూడా బొంబాయిలో చాలామంది ఉన్నారు. వారంతా కూడా తమకోసం కాకపోయినా, తమ దేశసోదరులకోసమైనా ఈ సంకల్పానికి తమ సుముఖంగానే ప్రవర్తిస్తారని నా ఆశ. అందువలన వారు బొంబాయి నగరం ఇండియాలోకెల్ల రమణీయనగరమనే కీర్తినేగాక ప్రధాన నగరమనే ఖ్యాతి తెచ్చి, భారతదేశానికి మార్గదర్శకులు కాగలరు.

బొంబాయిలోని మద్యనిషేధం వలన ప్రభుత్వాదాయం చాలా పడిపోయే మాట నిజం. ఆర్థికమంత్రి బడ్జెటును పరిపుష్టం చేయవలసి ఉంది. ఆయనకు డబ్బు కావాలి. కాబట్టి కొత్త పన్నులను వేయవలసివస్తుంది, వాటిని భరించేవారు గునుస్తూనే ఉంటారు. ఎంత ధర్మమైన పన్నయినా ఎవ్వరికీ ఇష్టముండదు. ఆర్థికమంత్రి న్యాయమైన ఆక్షేపణలన్నిటినీ గమనిస్తారన్నట్టే వింటూన్నాను. ఈ పన్నులిచ్చేవారు ఒక మహోద్యమానికి సహాయపడే సదవకాశం లభించిందని ఎందుకు గర్వపడకూడదు? ప్రజలందరి సంతోష ధ్వానములతో మద్యనిషేధోద్యమం ప్రారంభించబడిన రోజు, బొంబాయినగరం గర్వించతగిన రోజు. దీనిని పైవారెవరో బలవంతంగా ప్రవేశపెట్టినట్లు భావించకండి. ప్రజలకు బాధ్యత వహించిన ప్రభుత్వం ప్రవేశపెడుతూన్నది దీనిని. 1920 నుండీ యిది జాతీయకార్యక్రమంలోని ప్రధానాంగాలలో ఒకటిగా ఉంది. ఇరవయి సంవత్సరాలకిందట స్పష్టంగా ప్రకటింపబడిన జాతీయాభిప్రాయాన్ని ఆచరణలోకి తీసుకొని రావడమే ఇప్పుడు చేస్తూన్న పని.

# తాగుడుకు కారణాలు

ఈ సందర్భంలో కాయకష్టం చేయవలసిన వాళ్లకు తాగుడల వాటు కావడానికి కారణాలను పరిశీలించడం మంచిది. న్యూ యార్కు నగరంలోని ఒక ఆసుపత్రిలోనున్న రోగులనుబట్టి కొన్ని లెక్కలు తయారు చేయబడినవి. వాటి ప్రకారం వారనేక కారణాలవల్ల తాగుడును అలవాటు చేసుకొన్నారని తెలుస్తుంది. సాంఘిక కారణాలవలన నూటికి 52.5 వంతున తాగుడు కలవాటయినారు. కుటుంబ కష్టాలను మరచిపోవడానికి నూటికి 13 మంది, వైద్య కారణాలవలన నూటికి 9.3 మంది, వృత్తిగా నూటికి 7 మంది, పెద్దవాళ్ళ బోధల వలన నూటికి మరొక 7 మంది, చేసే పని లేక నూటికి 5 మంది, ఆటలలో హుషారుగా ఉండేటందుకు నూటికి 1.2మంది తాగుడును ప్రారంభించారు. నూటికి ఇంకో అయిదుగురు మాత్రం తమకు తాగుడెందు కలవాటయిందో కారణాలను చెప్పలేకపోతున్నారు.

తాగుడువలన సాంఘికంగా తటస్థించే చెడుగులనుకూడా ఆలోచిద్దాము. తాగి తెచ్చుకొన్న కుటుంబ కలహాల వలన చాలా మంది భార్యా భర్తలు విడాకులు పుచ్చుకోవలసి వచ్చింది. 1887-1906 సంవత్సరాలమధ్య అమెరికాలో 1,84,568 వివాహాలు విడాకులు పుచ్చుకోవడంవలన రద్దయిన వనీ, ఇందులో నూటికి 45 వివాహాలు రద్దవడానికి కారణం తాగుడేననీ తెలుస్తున్నది. నగరాలలో వ్యభిచార గృహా

లను గూర్చి తెలుసు కుంటూ ఉంటాము. ఈ వృత్తి చేసే వారిలో నూటికి 80 మంది తాగుడు ప్రభావం వలననే అందుకు లోబడుతూన్నారు. మన దేశంలోని పశ్చిమోత్తర సరిహద్దు రాష్ట్రంలో తాగుడు కింద ఖర్చు తల 1కి సగటు రూ. 0-3-8 లని, బొంబాయిలో రెండు రూపాయల పైన అని, తక్కిన రాష్ట్రాలలో ఈ రెండు అంకెల మధ్యనూ ఉంటుం దని తెలుస్తూన్నది.

## తాగుడు ఫలితాలు

తాగినందువలన పనిచేసే శక్తిలో కలిగే మార్పును కూడా విచారించాలి. తాగిన విలుకాడు చేతులు వణికి, గురి తప్పుతాడు. ముద్రణా యంత్రశాలలో అక్షరాలు కూర్చ లేడు కంపొజిటరు. మల్లుడు వ్యాయామ సమయంలో తన అవయవాలు దుర్బలంగా ఉన్నట్లు తోస్తుంది. వారమంతా పనిచేసి, ఆదివారం సెలవు తీసుకొని, ఆనాడు పూర్తిగా తాగుతారు కొంతమంది పనివాళ్ళు. సోమవారంనాడు వాళ్ళు పనిచేయలేరు. మాట వచ్చింది గనుక చెబుతు న్నాము. మేము వైద్య విద్యార్థులంగా ఉన్నప్పుడు జనరల్ ఆసుపత్రిలో డాక్టర్లు సోమవారంనాడు మాట్లాడ వీలుగా ఉండేవారు కారు. ఇక పనిసంగతికి వద్దాము. శనివారంనాడు నూటికి 80 సార్లు గురి తప్పకుండా లక్ష్యాన్ని కొట్టగల విలు కాడు, సోమవారం నాడు 70 సార్లే కొడతాడు. శనివారం నాడు 8 స్టిక్కులు కూర్చగల కంపొజిటరు, సోమవారంనాడు

ఆరు స్ట్రిక్కులే కూడుస్తారు. శనివారంనాడు 10 అనుగులు ఊరకగల మనిషి, సోమవారం నాడు 8 లేక 9 అనుగులు మాత్రమే ఉడుకుతారు. సోమవారం నుండి, మంగళవారం, మంగళవారం నుండి బుధవారం, బుధవారంనుండి గురు వారం క్రమక్రమముగా హెచ్చుతూ గురువారం సాయం కాలానికి పని వాళ్లకు మళ్ళీ యెప్పటి శక్తిసామర్థ్యాలు వస్తవి. శుక్రవారంనాడు శనివారంనాడు చక్కగా సలక్షణంగా పనిచేస్తారు. కాని ఆదివారం తాగినప్పటినుండీ మళ్ళీ క్షీణదశ ప్రారంభమౌతుంది.

ఈ విధంగా వారం వారం తెచ్చి పెట్టుకొన్న ఈ క్షీణదశ క్రమ క్రమంగా మనిషిని ఎందుకూ కొరగాకుండా చేస్తుంది. తాగుడుకు వ్యతిరేకంగా అనేకం చెప్పవచ్చును. నైతికంగా చూచుకొంటే అది దైవ ద్రోహం సాంఘికంగా చూచు కొంటే సభ్యతకు కళంకమనాలి దాసిని. శారీరకంగా, అది మనను దుర్బలులనుగా చేసి మన రోజువారీ పనుల కాటంకం కలిగిస్తుంది. ఈ నాగరిక ప్రభుత్వం ఇంత కాలంనుండీ దీనిని తమ ఆదాయమున కొక మార్గంగా వ్యవహరిస్తూండడం అన్నిటి కంటే ఆశ్చర్యం.

తాగుడును మానినందు వలన దక్షిణ ఇండియాలోని ప్రజలు ప్రభుత్వం వారికిచ్చే నాలుగుకోట్లను ఆదా చేసుకో వడమేకాక, తాగుడుకయ్యే అసలు ఖర్చు 17 కోట్లరూపా యాలనూకూడా నిలువ చేసుకోగలరు. సేలం జిల్లా అనుగు జాడలలో రాజధానిలోని 28 జిల్లాలూ నడిచేయెడల, ప్రజల

ఏటా సంవత్సరానికి 21 కోట్లకు పెరుగుతుంది. ప్రభుత్వాదాయమును పూరించడానికి అనేక విధాలుగా వారు సహాయపడవచ్చును. ప్రభుత్వ వ్యయంకూడా చాలావరకు తగ్గడానికి వీలున్నది, ఈవిధంగా నిలవచేసుకోగలిగిన ప్రజలు కొనుగోలుశక్తి పెరిగి, ప్రభుత్వానికీ సంఘానికీ సహాయ పడగలరు. ఆనందమూ అభ్యుదయమూ తాండవ మాడుతూండే నూతన శక ప్రారంభం కాగలదు. అయితే కాంగ్రెసు వాదులు ఈ ప్రశస్తమైన మహోదార ప్రయత్నానికి, ఈ పుణ్యకార్యానికి హృదయపూర్వకంగా పూనుకోవాలి.

## అనుబంధం

(ఇది అస్సాము మాజీ ప్రధానమంత్రి గోపీనాథ బార్డోలాయ్ పత్రికలకు పంపిన వ్యాసం)

౧

ఘనత వహించిన ఢిల్లీ మొగలాయి చక్రవర్తి, అస్సాము రాజు స్వర్గదేవ అహోముకు బహుమతులు పంపుతూ అందులో ఒక నల్లమందు అచ్చుకూడా పంపినట్లు వింటూన్నాము. ఈ కానుకలను తీసికొని వచ్చిన రాయబారి, దేవర వారికీ, ఆయన ఆస్థానంలోవారికి దాని ఉపయోగమును దాని విశేష గుణాలనూ పూర్తిగా వివరించారు. ఢిల్లీలోని మొగలు చక్రవర్తులు అస్సాముపై దండయాత్ర చేసి జయించవలెనని నూరేండ్లపైచిలుకు ప్రయత్నించారు. అస్సాము

పొలిమేరలలోనుంచి వారు పదిహేను పర్యాయములు దాడి పోవలసివచ్చింది. కాని చిట్టచివరకు మొగలుసేనా దండయాత్రలు చేయలేక పోయి, ఈ నల్లమందుఅమ్ము చేసినట్లు కనిపిస్తున్నది. శైత్యవాహనాలు కల అహోముపైన నల్లమందుకు విజయం లభించింది. మొగలాయీలే ప్రయోజనం పొందకుండానే అప్పటి కప్పుడే మరుగుపడి పోయినారు. కాని నల్లమందు వాడకపు దురభ్యాసంమాత్రం క్రమక్రమంగా అస్సామీసు సంఘంలోని దిగువ జాతులకు దిగింది. 1826 లో బ్రిటిష్ వారు (బర్మా దండయాత్ర తరువాత) వాళ్ల మామూలు ధోరణిని, ఆర్తత్రాణ పరాయణత్వమనే పేరుతో అస్సామును స్వాధీనం చేసుకొన్న నాటికి అస్సామీసు జాతియావత్తూ ఈ నల్లమందు రాక్షసికి బలియై పోయింది.

అక్షీణ వాణిజ్య స్వభావంగల బ్రిటిష్ వారు, ఈ మానవ దౌర్బల్యాన్ని ఆధారంగా చేసుకొని లాభం పొందే ప్రయత్నాలు చేశారు. రాష్ట్రంలోని గసగసాల పంటను ఆపివేసి, బీహారునుండి నల్లమందును గవర్నమెంటు ఖజానాల ద్వారా వ్యాపింపచేయడం ప్రారంభించారు. నల్లమందు తినేవాళ్ళూ కొంతమంది అస్సాము ప్రజానాయకులూ, ఈ కొత్తపద్ధతికి అయిష్టతను వెల్లడించారు. అనేక స్థలాలలో కొట్లాటలు జరిగినవి. కాని అవి తేలికగా అణచివేయబడ్డవి. నల్లమందు ఖాయీల వ్యసనముందు వాళ్లకు డబ్బంటే లెక్క లేకుండా పోయింది. అప్పటినుండీ అస్సాము చరిత్రలో ఒక విషాద

ఘట్టము ప్రారంభమయింది. ఆ రోజుల్లో నల్లమందు ఎక్కువ చౌకగాను (సేరు రు 20 మొదలు రు 30 ల వరకు ఉండెను.) ఉండడంవల్లనూ, అమ్మకానికి యేవిధమైన నిరోధమూ లేనందువల్లనూ పాపము అమాయక ప్రజలకు నల్లమందే సర్వరోగనివారిణి అయింది. ఈ విశ్వాసానికి మన ప్రభువులు మరింత దోహదం చేశారు. నల్లమందు కమీషన్ముందు ఇండియా పెట్టిన సాక్ష్యంలో, నల్లమందు చాలారోగాలకు మంచిమందనడమే గాక, బలవర్ధక ఔషధమనీ మలేరియా కాలాజ్వరంవంటి అనేక రోగాలను రాకుండా ఆపుతుందనీ కూడా ఋజువుచేయాలని ప్రయత్నించిన సంగతి అందరికీ బాగా తెలిసినదే.

నల్లమందుభాయీల సంఖ్య నానాటికి పెరగవలసినంతగా పెరుగుతూనేఉన్నది. 1910-15 సంవత్సరాలలో అస్సాముజన సంఖ్యలో నూటికి 10 మంది ఈ నల్లమందుకలవాటుపడ్డారు. మనిషికి సంవత్సరానికి వచ్చే ఆదా లెక్కవేస్తే రు 30 లు మొదలు రు. 35ల వరకూ ఉంటుంది. అంతకెక్కువఉండదు. కాని దురదృష్టవంతులైన ఈ నల్లమందు వ్యసనపరులు సగటున ఒక్కొక్కరు ఏడాదికి రు. 20 లు చొప్పున ఒక్కనల్లమందుకే వ్యయంచేయవలసివచ్చింది. దీని దురదృష్ట ఫలితాలు వెంటనే కనిపించినవి. కుటుంబాలకు కుటుంబాలు, గ్రామాలకు గ్రామాలు, పరమ దరిద్రంతో బాధపడవలసిన గతి పట్టింది. మనుష్యులు సిగ్గులేని స్వార్థంతో పశువులుగా పరిణమించారు; నల్లమందుకోసం పెళ్ళాం బిడ్డల బట్టలను

అమ్ముకొని, వాళ్ళను దాదాపు బానిసలుగా చేశారు. ఇక లెక్కల ఆర్థికసంగతి చెప్పనేలా? తాము నల్లమందు పొగ త్రాగుతూ, భార్యనూ వయసుకొచ్చిన కూతుళ్ళనూ జీవనంకోసం బిచ్చమెత్తుకోవడానికి పంపేవారు. ఇంటి మగ వారు; ఒక్కొక్కప్పుడు వాళ్ళింటి భంగానికి కూడా సిగ్గుపడే వారుకారు. ఈ తృష్ణను తృప్తి చేసుకోవడానికి పెరిగి పెద్ద వాళ్ళవుతూన్న కొడుకులు రెస్టారెంట్లో బానిసలుగాచేసి చిల్లర డబ్బులు సంపాదించుకొంటూండేవారు. నల్లమందు పిచ్చివాళ్ళ ఇరుగుపొరుగు వారికెప్పుడూ శాంతి లేదు. ఇళ్ళలోనుండి వాళ్ళపాత్రసామగ్రీ, తోటలోనుండి కూరలూ పండ్లూ పోతూం డేవి. నల్లమందువలన దిక్కులేకుండా పాడయినవానికి దొంగ తనమూ మోసమూచేయడం సహజమైపోతుంది. నల్లమందు మనిషిని క్షీణబలుడుగా చేయడమే కాదు, వట్టిసోమరిగా కూడా చేస్తుంది. అతనికి నీళ్లంటే ఒకవిధమైన భయం పుడు తుంది. అందువలన స్నానంచేయడమంటేనూ, పరిశుభ్రంగా ఉండడమంటేనూ అతనికి గిట్టదు. నిరంతరం నల్లమందు తింటూండడంవలన అతని శరీరానికి నల్లమందు రంగు వస్తుంది. అస్సాము సాంఘికవ్యవస్థలో ఎక్కువ పేదరికం గానూ, ఎక్కువ అనాగరికంగానూ ఉన్నసంఘం, ఎక్కువగా నల్లమందుకు అలవాటుపడుతూన్నదన్న విషయం బాగా గ్రహించవలసిన సంగతి. కనుక ఆదిమ నివాసులు, అడవిజాతు లవారు, ఏదో ఒకవిధంగా 'అహోములు' ఈ నల్లమందు పిచ్చుకు అత్యంతం గురికైనారు.

ఈ విధంగా మన ప్రజలలో చాలామంది శారీరక, నైతిక, ఆర్థిక పతనమును పొందుతూండగా, బ్రిటిష్ ప్రభుత్వంవారి ధన రాసులు పెరుగుతూ వచ్చినవి. ఈ శతాబ్దమునందలి మొదటి రెండు దశాబ్దములలోనూ అస్సాము ప్రభుత్వంవారి మొత్తంఆదాయం 2½ కోట్లలో అంతకు కొంచెం తక్కువో ఉండేది. ఇందులో మామూలు రైతులనుండి పుచ్చుకొనే భూమిశిస్తు ఒకకోటి ఉండేది. దాదాపు 50 లక్షలో అంతకు కొంచెంఎక్కువో ఎక్సైజు పన్ను ఉండేది. ఈపన్నులలో నూటికి 70 లేక 75 వరకూ నల్లమందు పన్నే. అందువల్ల పెద్దపెద్ద యూరోపియన్ తోటలయజమానులు ఎకరానికి రు 1-2-0 భూమిశిస్తు చెల్లించేవారు. ధనవంతులయిన జమీందారులు యకరానికి 0-5-0 చెల్లిస్తూండేవారు. దరిద్రుడైన అస్సాముగ్రామస్థుడు సగటున యకరానికి రు 2 8-0 చెల్లించవలసి వచ్చేది.

అయితే ఈ కీలకమును తెలుసుకొన్న విద్యావంతులు ప్రభుత్వంవారి ఈ పన్నుల విధానాన్ని గూర్చిగానీ, నల్లమందు దురభ్యాసపరుని దుస్థితినిగూర్చిగానీ అశ్రద్ధవహించి ఊరుకోలేదు. అస్సాము జనసంఖ్యలో అనేకమందికి నల్లమందుభాయీలపైన సానుభూతి లేదు సరికదా పైపెచ్చు అసహ్యం. 'కనియా' అంటే 'నల్లమందుభాయి' అక్కడ ఆ మాటకే అసహ్యాకరమైన అర్థం వచ్చివేసింది. కాని ఇటీవల చాలామంది ప్రజానాయకులీ ఘోరదురభ్యాసాన్ని ఎదుర్కొనేటందు కెంతో పనిచేశారు. 'సిపాయి తిరుగుబాటు' రోజుల

నాటికే, నల్లమందునుప్పూర్తిగా రద్దుచేయవలెనని ప్రజలలో ప్రచారంచేసి బ్రిటీష్ ప్రభుత్వాన్ని పేరేపించిన వారు మోసీ రాంగ్‌సివారు. ఆయన అస్సాములోని బ్రిటీష్ ప్రభుత్వాన్ని సింహాసనమునుండి తొలగించవలెనని కుట్రచేసినట్లుగా తలంప బడి, ఉరికి పాత్రులైనారు. జనసామాన్యం నల్లమందుకు వ్యతి రేకులు [illegible]. ఉష్ణదేశాలలో నల్లమందు పర్యాలోగ [illegible], [illegible] సామర్థ్యాలను, యూరో పియన్ పరిపాలనాధికారులు, వారికి లోబడిన భారతీయోద్యో గులు. ప్రజాసేవకుల మనుకొంటూ అసలు ప్రజలచేత 'జోహు కుమ్'లు గా పరిగణింపబడే పెద్దమనుష్యులు కొందరూ అనేక విధాల కీర్తిస్తూండేవారు. కీ॥ శే॥ శ్రీ ఘోసిష్ఠోర్ చలిహా అసి స్టెంటుకమీషనరుపనిచేసి రిటైరై 1916లో అస్సాముకౌన్సిలు సభ్యుడుగా ఉన్నారు. ఆయన ప్రభుత్వంవారి నల్లమందు విధానాన్ని కౌన్సిలులో తీవ్రంగా విమర్శించాడు. ఎంతో మంది ప్రజల శారీరక, నైతిక పతనానికి హేతువైన నల్ల మందుపైన ఆదాయంతీయడం, ప్రభుత్వానికెంతమాత్రమూ న్యాయ్యంకాదని ఆయన కచ్చితంగా చెప్పినాడు. అప్పటి ఛీఫ్ కమీషనర్ సర్ నికోలస్ డాడ్సు బీట్సన్ బెల్, 'నిజంగా గౌరవనీయ సభ్యుడు చలీహాగారు నల్లమందునుండి వచ్చే ప్రభుత్వాదాయమంత పాపభూయిష్ఠమైనదని నమ్మకంకలిగి ఉంటే ఆయనపింఛను అందులోనుండే వస్తూన్నది గనుక దానిని పుచ్చుకోకుండా మానివేయడం మంచిదని ప్రత్యుత్తర మిచ్చాడు. (ఈజవాబిచ్చిన మహానుభావుడే తరువాతక్రైస్తవ

మతోపదేశకుడైనాడు.) దీనిని దేశమంతా అవమానంగా భావించారు. యువకులీ అవమానకర ప్రసంగానికి తగిన ప్రత్యుత్తరంకోసం ఆలోచించడం ప్రారంభించారు.

అందుకు తగినఅవకాశం రానేవచ్చింది; రాజకీయస్వాతం త్ర్యానికి ఆత్మపరిశుద్ధత, సాంఘికవిశుద్ధత అవసరమని మహాత్మాజీ ఘంటాపథంగా చెప్పినమాటలు; అస్సాముప్రజల ఆర్ద్రహృదయాలను బాగా ఆకర్షించినవి. కనుకనే 1922 లో ఇంపీరియా ప్రభుత్వంవారు, అసహాయోద్యమ ఆందోళన ఇక్కడ, అస్సాములో మాత్రమే ప్రజాసామాన్యంలోకి బాగా పాకిందని, భారత రాజ్యాంగ కార్యదర్శికి వ్రాసిన నివేదికలో ఒప్పుకోక తప్పినదికాదు. అప్పటి ప్రజానాయకులు కీర్తిశేషులు నోబిన్‌చంద్రబార్డోలాయ్, తరుణరాం ఫూకన్‌గార్లు మత్తుపదార్థనిషేధం ముఖ్యంగా నల్లమందు నిషేధాన్ని ఎక్కువగా ప్రచారంచేశారు. మత్తుపదార్థాల దుకాణాలు విస్తారంగా పికెటు చేయబడినవి. ఈసందర్భంలో నౌగాంగ్ జిల్లాలోని జాగీలో నల్లమందు దుకాణాన్ని పికెటుచేసిన వలంటీరుదళమే మొట్టమొదటనిర్బంధింపబడింది. అనేకచోట్ల ఇల్లిల్లూ తిరిగి ప్రచారంచేశారు కాంగ్రెసు స్వచ్ఛందసైనికులు. అనేకచోట్ల నల్లమందు దురభ్యాసపరులే స్వయంగా నల్లమందు పొగతాగే పీకెలను మావలంటీర్లకిచ్చి పెద్దపెద్ద భోగిమంటలు వేసి కాల్పించారు. మహాత్మా పేరులో యేదోమహాత్తు ఉండిఉంటుంది. గ్రామాలలోని నల్ల మందుభాయీలు ప్రజలవత్తిడి కాగలేక, ఆవనిముట్లను వలం

ట్రీస్టు [illegible] చేసేవారు. ఈ ఉద్యమ ఫలితం [illegible] కారుల కల్లోలాలనే [illegible]. ఎక్సైజు ఆదాయం దాదాపు సగానికి తగ్గిపోయింది. నల్లమందు అమ్మకం 2100 మణుగుల నుండి 1500 మణుగులకు, [illegible] పడిపోయింది [illegible] గజగజలాడినవి. అప్పుడు [illegible] ప్రభుత్వోద్యోగులనూ [illegible] కల్పితారోపణ మైన, [illegible] ప్రకటించేశారు ప్రభు [illegible]. 1921 [illegible] 1922 [illegible] నెలలమధ్య, వలం టీర్లుగాని నాయకులుగాని ఒకవేయిమంది, మూడు నెలల మొదలు 18 నెలలవరకూ కారాగార శిక్ష విధింపబడ్డారు. ఈ ఘాతాన్ని పూర్తిగా చంపక, అంగవైకల్యం మాత్రమే కలిగించిన కారణాన, ఉద్యమం సన్నగిల్లుతుంటోనే మళ్ళీ తల యెత్తింది. అందులోని విషం పూర్వమంత శక్తివంతంగా లేక పోయినప్పటికీ అసలుపో లేదు. పాతవాళ్ళు మళ్ళీ ఆ దురభ్యా సాని కలవాటుపడ్డారు. నల్లమందు అమ్మకం రోజురోజుకూ మళ్ళీ పెరుగుతూవచ్చింది.

కాని కాంగ్రెసువాదు లింతటితో ఆగిపో లేదు. దీనబంధు ఆండ్రూసు, వారికిశరణ్యమైనారు. అస్సాములోని నల్లమందు అలవాటునుగూర్చి, ఆవిషయంలో ప్రభుత్వంవా రవలంబించే విధానాన్నిగూర్చి విచారించడాని కొక కమిటీని నియమించ వలసిందని వారి కాయన సలహాయిచ్చాడు. వెంటనే ఆప్రకార మొక కమిటీ స్థాపింపబడింది. దానికి శ్రీ కె. షి. చలిహా

(శ్రీ: శ్రీ: ఫాసినోర్ చవిహాక తగినబిడ్డ) అధ్యక్షుడు. ఆయన
నేటికేంద్ర శాసన సభాసభ్యుడు. శ్రీ: శ్రీ: శ్రీ రోహిణీ కాంత హెచ్
బారువా కార్యదర్శి. ఈ సంఘంవారు అస్సాము రాష్ట్ర
మంతా సంచారంచేసి, సాక్ష్యంసంపాదించి, మంచి నివేదికను
తయారుచేశారు. ఇండియా ప్రభుత్వంవారు, భారత దేశంలో
ముఖ్యంగా అస్సాములో అవలంబిస్తూవున్న నల్లమందు విధా
నాన్ని నానాజాతిసమితిలో పరిచయంచేయడానికి, దీనబంధు
దాసుని బాగా ఉపయోగించారు.

శాసనసభామండలానికి వెలుపలా, లోపలాకూడా ఈ
విధానమునకు వ్యతిరేకంగా చట్టసమ్మతాందోళనం చేయ
బడుతూ వచ్చింది. అందువల్ల అప్పటి ఎక్సైజు మంత్రి రెవ
రెండు నికోలస్‌రాయి, ఈ దురలవాటును మాన్పించుపద్ధతు
లను విచారించే నిమిత్తం ఎక్కువమంది శాసనసభ్యులుగల
మరొక సంఘాన్ని నియమించడాని కంగీకరించాడు. తరువాత
ప్రభుత్వంవారు తమ నివేదికను తయారుచేయడానికి రెండు
సంవత్సరాలు (1927-28) పట్టింది. నివేదికలోని సూచనలు
సంగ్రహంగా ఇవి. '(౧) 50 సంవత్సరాలకు లోబడిన
వయస్సుగల యావన్మంది నల్లమందు దురభ్యాసపరులను ౧౦
ఏండ్లలో ఆ అలవాటును మానేటట్లు చేయాలి. ఈకాలంలో
నల్లమందు తినేవాళ్ళందరినీ రిజిష్టరుచేసి, వాళ్ళకు చీట్లిచ్చి, ఆ
చీట్లప్రకారం నల్లమందు యిస్తూండాలి. వాళ్ల కిచ్చే నల్ల
మందు ప్రమాణం యేటేటా తగ్గిస్తూ, పదియేళ్లలో పూర్తిగా
మాన్పించేపద్ధతిని ఉండాలి.' ఈప్రణాళిక నవలంభించుటలో

ప్రభుత్వంవారికి తమ ఆదాయమును గూర్చిన చింతయే లేనట్లు సూచించబడింది. కాని ప్రజలక్షేమం వారికున్న ఆలోచన అది ఒకటే అన్నట్లుగా కనబడుతూండేది అప్పటికింకా నిరంకుశాధికారమును చలాయిస్తూన్న ప్రభుత్వంవారు ప్రజలపైన మాత్రంగా నల్లమందు కలవాటుపడిన వృద్ధజనంపైన-ఎక్కడ లేని సహకారమూ జాలువారుస్తూన్నట్లు కనిపించేవారు. అప్పటికప్పుడూ యూరోపియన్ జిల్లా ఉద్యోగులు కరుణామోహితులైన కారణాన, రిజిష్టరులోకి కొత్తగా నల్లమందు కలవాటుపడిన వారి పేర్లు ఎక్కుతూండేవి. కాని నల్లమందు అమ్మకం ప్రమాణంలో తగ్గిపోతూన్నకొద్దీ, ఖరీదులో పెరుగుతూవచ్చింది. 1938-39 నాటికి పై ప్రణాళిక ఆచరణలోకి వచ్చి తొమ్మిదేండ్లయినప్పటికీ. ప్రభుత్వంవారికి నల్లమందుమీదవచ్చే ఆదాయం పదిన్నర లక్షలు కనపడింది. నల్లమందు తినేవారిసంఖ్య రిజిష్టరుల ప్రకారం [illegible]1,000 ఉన్నది. సరిగా ఈ సమయంలోనే కాంగ్రెసు సంయుక్తమంత్రివర్గం అస్సాము ప్రభుత్వ బాధ్యతను వహించింది.

౨

అస్సాము కాంగ్రెసువారు ఈ ఘోర దురభ్యాసాన్ని రూపుమాపడానికెన్నో కష్టాలు పడ్డారు. ఇప్పుడు వారి కందుకు తగిన అవకాశం లభించింది. కాంగ్రెసు సంయుక్త మంత్రివర్గం దాన్ని వినియోగించుకోవడంలో యేమీ లోపం చేయలేదు. ఈ నల్లమందు రేషను పద్ధతి యెంత చెడ్డదో వారికి బాగా తెలుసు. వ్యసనాని కలవాటు పడిన మనిషి

దానిని బుద్ధిపూర్వకంగా విడిచిపెడతాడని మరి ఉన్నవా డెవడూ నమ్మడు. ఒక మద్యపానాన్ని మోతాదులలో క్రమక్రమంగా తగ్గిస్తూన్నట్లు కాగితాలమీద కనిపింప చేసి సంతృప్తి పడినా, ఆ వ్యసనాని కలవాటుపడిన మనిషి పది మైళ్లలో బాగుపడతా డనుకోవడం కంటె, తగ్గింపబడిన నల్లమందు మోతాదులను మరొక చోటినుంచి దొంగిలి స్తున్నా డనుకోవడం ఎక్కువ ఉచితం. సరిగా ఇంతే జరిగింది కూడాను. నల్లమందు రేషన్లు తగ్గినకొద్దీ దాని చౌర్యం ఎక్కువయింది. ఎక్సైజు డిపార్టుమెంటు కంటె పెద్దది కాకపోయినా అధమం దానితో సమానమైన ఒక సంస్థ యేర్పాటయింది. ఈ చౌర్యానికి, గొప్పగొప్పవాళ్లకు, ఎక్కువగా రాష్ట్రేతర వర్తకులకు, ఈ అవినీతికర వ్యాపారంతో సంబంధమున్నదని ఒక జిల్లా ఉద్యోగి అన్నాడు. నల్లమందు షాపులలో తప్పు తూనికలు తూచినందువలన మిగిలిన నల్లమందున్నా, దొంగతనంగా తెచ్చిన నల్లమందూకూడా ఈ అంగళ్ళవారే అమ్ముతూన్నారని నిజం దాచలేని కొంతమంది ఎక్సైజు ఉద్యోగులే ఒప్పుకొన్నారు. మామూలు జనం దృష్టిలో ఎక్సైజు ఉద్యోగులన్నా, లంచగొండితన మన్నా ఒకటే అర్థం. ఈ శాఖలోని పెద్ద ఉద్యోగులుకూడా 'వృద్ధనారీ పతివ్రతా' అన్నట్లు పరిగణింపబడుతూండేవారు. ప్రభుత్వవ్యయమును తగ్గించే నిమిత్త మేర్పాటయిన కమిటీవారి సూచనలన్నీ, ఈ శాఖకు సంబంధించి నంతవరకు పై అభిప్రాయాలపైన ఆధారపడి చేయబడినవే.

కాంగ్రెసు సంయుక్త మంత్రివర్గం తొలగించదలచుకొన్న చెరుగులలో, పైన సూచింపబడినవి చాలాకొద్ది. ఎక్కువ వ్యయకారణమైన ఏ ప్రయత్నం చేయడానికీ, అస్సాము ప్రభుత్వాదాయం తగినంత సమృద్ధిగా లేదు. కిందటి ప్రభుత్వం 1938-39 సంవత్సరానికి 2½ లక్షలు నష్టం వస్తుందని అంచనా వేసింది. అస్సాము లోయలలో వచ్చిన వినాశహేతువులగు వరదల మూలకంగా ఇంకొక 8 లక్షలెక్కువ నష్టం రావచ్చును. కాబట్టి నల్లమందు ఆదాయమును తగ్గించడమంటే కొత్తపన్నులను వేయడమనే స్థితి వచ్చింది. సాధారణ జనంమీద కొత్తపన్నులు పడడానికీ వీలు లేదు. నిరంకుశ ప్రభుత్వ మిదివరకే వారు భరించలేనంతవరకు పన్నులను విధించింది. కాబట్టి నల్లమందు పిచ్చి మరీ ఎక్కువగా వ్యాపించిన జిల్లా విషయం ముందాలోచిద్దామని తోచింది. మా పార్టీ సమావేశంలో ఈ దురభ్యాసాన్ని నిర్మూలించవలెనంటే అత్యంత శ్రద్ధతో పనిచేయవలెననీ, నల్లమందు దొంగతనానికి మూలమై, ఎక్కువగా నల్లమందు పిచ్చి వ్యాపించిన జిల్లాలోనే ముందుగా పని ప్రారంభించవలెననీ ఏకగ్రీవంగా అభిప్రాయ పడ్డాము. ఇంక తక్కిన జిల్లాలలో కూడా రెండేండ్లలో, అనగా 1941 నాటికుండీ సంపూర్ణ నిషేధమునకు సంసిద్ధమయ్యేటట్లు, నల్లమందు అమ్మకాన్ని తీవ్రంగా తగ్గించివేయవలెననికూడా నిర్ణయించాము. అయితే మొదటి ప్రదేశంలో పనిచేసే ప్రచారకులకు తీరిక కాగానే, అనగా 1940 నుండీకూడా ఈ ప్రణాళికకు సంబంధించిన పని

ఈ స్థలాలలో ప్రారంభం కావాలి. ఈ నూతన ప్రయత్నము నకు మొదట శిబుఘుర్, సిబసాగర్ సబుడివిజనులు, తగిన ప్రదేశాలని నిర్ణయించుకొన్నాము. వీటి వైశాల్యము దాదాపు 2,000 చదరపు మైళ్ళు. ఇక్కడి నల్లమందు దురభ్యాసపరుల సంఖ్య 10,700. అస్సాము మొత్తంమీద ఉన్న దురభ్యాస పరులలో మూడోవంతు. సంపూర్ణనిషేధం వలన ఈ ప్రదేశం లో వెంటనే తగ్గిపోయే ప్రభుత్వాదాయం 4 లక్షలు, తక్కిన ప్రదేశాలలో తీవ్రంగా నల్లమందు అమ్మకమును తగ్గించి నందు వలన పోయే ఆదాయం రెండులక్షలు. ఇదికాక ఈ ప్రణాళికను ఆచరణలోకితీసికొనివచ్చే నిమిత్తం కావలసిన వ్యయం లక్షా ఇరవై అయిదు వేలు. ఈ ప్రణాళికను అమలుపరచుచున్నప్పుడు కలిగే అవసరములకు తగినట్లుగా కావలసిన శాసనమూ తయారుగా లేదు. ఇక ఈ విషయంలో నేరస్థులయిన వారిని శిక్షించడానికా ఇదివరకున్న చట్టం మీదనే ఆధారపడవలసి వచ్చింది.

కాబట్టి కాంగ్రెసు సంయుక్త మంత్రివర్గం ప్రారంభించిన ఈ పనిని యుక్తియుక్తంగానూ, ధైర్యసాహసములతోనూ నడపవలె ననడాని కెంత మాత్రమూ సందేహం లేదు. పన్నుల విధానంలోని అన్యాయ్యం కాంగ్రెసుపక్షంవారు మంత్రి వర్గాలలోకి పోకమునుపే వారిదృష్టిని ఆకర్షించింది. ధనవంతులయిన జమీందారులకు తేయాకుతోట యజ మానులకూ మాత్రం వర్తింపచేసే, వ్యవసాయ ఆదాయపు పన్నును విధించిన యెడల ఈ అన్యాయ్యం కొంతవరకు తగ్గు

తుంచవని వారనుకున్నారు. ఆర్థిక మంత్రి యఫ్. ఏ. అహమ్మదుగారీ విషయంబాగా ఆలోచనచేశారు. ఇతర కాంగ్రెసు ప్రభుత్వాలు విధించిన పెట్రోలు ల్యూబ్రికేటింగ్ ఆయిలు విక్రయపు పన్నులునూ, భోగవస్తువులపైనా విలాసములపైనా విధించిన పన్నులునూ, అన్నింటిలోకూడా విధించిన మొదలు ప్రభుత్వాదాయమును హెచ్చించవచ్చునని నిర్ణయించారు. ఒక్క వ్యవసాయ ఆదాయపు పన్నే 30 లక్షలు రాబట్టవచ్చునని ఇతర పన్నులు అన్నీ కలిసి 5 లక్షలుండవచ్చునని అంచనా వేయబడినది. ఈ పన్నులచట్టం పిదప రెండు శాసనసభలలోనూ అంగీకరింపబడింది. వ్యవసాయిక ఆదాయపు పన్నుచట్టం రెండు శాసనసభల సమష్టి సమావేశంలోకూడా అంగీకరించబడింది. అందువలన నల్లమందు నిషేధంవలన పడిపోయిన ఆదాయం పూరింపబడడమేగాక ఆ ప్రణాళికను ఆచరణలోకి తెచ్చేటందుకయ్యే వ్యయములనుకూడా ప్రభుత్వం భరించగలదని విశ్వసించుకొన్నాము. అవసరమైతే ఈ ఆదాయమును ఆధారంగా చేసుకొని ప్రభుత్వం ముందుగా అప్పుతీసుకొనగలదని కూడా మా ఆర్థిక మంత్రి అహమ్మదుగారు వెల్లడించారు.

మా నిషేధ ప్రణాళికను వివరించబోయేముందు అది అన్ని వర్గాల ప్రజలలోనూ అపూర్వోత్సాహమును కలిగించిందని చెప్పితీరవలెను. ఈ ప్రయత్నానికి మంత్రివర్గాన్ని అభినందిస్తూ వందలకొలదీ సమాజాలు, సంఘాలూ తమసంపూర్ణ కారాన్ని వాగ్దానం చేసినవి. కాని ఎసెంబ్లీలో వ్యతిరేక

పక్షనాయకుడు సర్ మహమ్మద్ సాదుల్లా కీర్తిప్రసంగా ఖండించి వెనకటి ప్రణాళికను శ్లాఘించి, ఈ ప్రణాళికకు వెచ్చించే అదనపుల రూపాయలను ప్రాథమిక విద్యకు ఖర్చు పెట్టి నట్లయితే ప్రజలీదురభ్యాసాన్ని మానుకోవడం ఎక్కువ బాగా నేర్చుకొంటారని సెలవిచ్చారు. యూరోపియన్ నాయకుడు మిస్టర్ హాకెన్‌హాలు ఒక సంవత్సరంపాటు ఈ ప్రణాళికను ప్రయత్నించి చూడవలెనని సూచించియున్నారు. దీనిని ఆచరణలో పెట్టినందుకు మహాత్మాగాంధీకి, రాష్ట్రీయ ప్రధాన మంత్రులకు, రాష్ట్రీయ గవర్నర్లకు, రాష్ట్రీయ నాయకులను మా రాష్ట్రాలోని ప్రధాన మత పీఠాధిపతులను ఆశీర్వాదములు పంపవలసిందని ప్రార్థించాను. వారందరూ మా మంత్రి వర్గాన్ని అభినందిస్తూ ఆశీర్వదించారు. నల్లమందు సురభ్యాసపరుల కష్టనివారణకు కొన్ని ఉపాయాలను కూడా మహాత్మాజీ దయతో సూచించారు. ఆయన తరువాత కూడా వాటిని గూర్చి విచారణ చేశారు. కలకత్తాలో నేను వారిని 1939 ఏప్రిల్ 30 న కలుసుకొన్నప్పుడు వారికి వివరాలన్నీ చెప్పి సంతృప్తిపరిచాను. యూరోపియన్ నాయకుడు కూడా తేయాకు తోటలనుండి కావలసిన సహాయం చేస్తానని వాగ్దానం కావించాడు. కాని సంపూర్ణ నిషేధంలో తనకు నమ్మకం లేదని ప్రొటెస్టెంటు బిషప్పు ఈ ప్రయత్నాన్ని ఆశీర్వదింప నిరాకరించాడు. ఉన్నత పదవిలో ఉన్న ఒక ఆంగ్లస్త్రీ నా ఉత్సాహానికి ఆనందించింది; కాని, ఈ ఉద్యమం జయప్రదమాతుం దనుకోవడం అడియాస కాదా, అని అడిగింది.

ఉంది. అందువలన ఈపనికాయన తగినవారని ప్రత్యేకం పిలి పించుకొన్నాము. ఆయన తనసిబ్బందిని ఏర్పాటుచేసుకోవడం లోనూ, కొత్తవాళ్లను నియమించుకోవడంలోనూ, నిజంగా చాలా జాగరూకత వహించారు. నల్లమందు తెచ్చే దొంగల గుంపు చాలా పెద్దదికావడంచేత, గస్తీసంఘాలు, ప్రత్యేక కాపలామనుష్యులు, కొత్తరకపు గూఢచారులూ కావలసి వచ్చారు.

ఎక్సైజు కమీషనరు బాధ్యత చాలా ఎక్కువైనమాట నిజమే. కాని వైద్యచికిత్సకు సంబంధించినపని మరీ కష్ట మని పించింది. మొదటి విచారణలోనే నల్లమందు తినేవాళ్ళసంఖ్య ఈరెండు సబ్ డివిజనులలోనూ, 13,600 అని తేలింది. రిజిష్టరులలో కనబడే సంఖ్య 10 700 మాత్రమే. గ్రామంలో యింతసంఖ్యకు కొద్దినెలలలో వైద్యచికిత్స చేయించడమంటె అమోఘ మనిపించింది మొట్ట మొదటిరోజులలో. ఆరోగ్యశాఖ వారూ, వైద్యశాఖ వారూ కూడా ఉత్తమోత్తమమైన చికిత్సా పద్ధతికోసం అంచనాలు వేసుకుంటూండేవారు. 'మార్ఫియా' చికిత్సా పద్ధతిని అవలంబించినట్లయితే శరీరంమీద గాయంచేయవలసి ఉన్నది. అది వారికి సహజంగా అసహ్యమనిపిస్తుంది. అంతే కాదు, ఆసుపత్రి సౌకర్యాలన్నీ ఉంటేనేగాని అపద్ధతిసరిగా ఉపయోగపడదు. పైపెచ్చుఎక్కువఖర్చుకూడాను. 'స్కూల్ ఆఫ్ ట్రాపికల్ మెడిసిన్సు' కు ప్రిన్సిపాలుగా నున్న కర్నల్ చోప్రా, నల్లమందు దురభ్యాసపరులకు 'లెసిథిన్' గ్లూకోసు చికిత్సలను ప్రయోగిస్తున్నట్లుగా విని ఆయనకు వ్రాయగా

ఆయన, తన అసిస్టెంటు డాక్టరు చోప్రాను, అసాము ప్రభుత్వ సహాయార్థం కొంత కాలం పంపడాని కంగీకరించారు. ఆయన యున్నా, డిబ్రుఘరులోని 'బెర్రీవైటు మెడికల్‌స్కూలు' ప్రిన్సిపాల్ కర్నల్ అల్లెన్‌యున్నా కలసి ఈ చికిత్సావిధానం ఉత్తమోత్తమమైనదని నిర్ణయించారు, నల్లమందు దురభ్యాస పరులకు దానిపైన ఉండే ఆసక్తి కేవలం మానసికమనీ, వారిని మామూలు మనుష్యులుగా చేయడమునకు, నరములపుష్టికి మందిస్తే చాలునని ఋజువుచేయబడెను. ఈ పని యావత్తు ఆరోగ్యశాఖా డైరెక్టరు, కర్నల్ హెస్టర్‌లోకు అప్పచెప్పి నాము. అనేకమంది డాక్టర్లను నియమించాము. తేయాకు తోటలవారుకూడా కొంతమంది డాక్టర్లను యిచ్చారు. స్థానిక సంస్థల డాక్టర్లందరినీ ఈ పనికి ఉపయోగించుకొన్నాము. అనేకమంది ప్రైవేటుడాక్టర్లు ఉచితంగా పనిచేయడాని కంగీకరించారు. వీరందరికీ కొద్దికాలమే శిక్షణఇయ్యబడింది. డాక్టరు హరికృష్ణదాసు, డాక్టరు భువనేశ్వర బారువలవంటి సుప్రసిద్ధ వైద్యశిఖామణులు, వివిధగ్రామ కేంద్రాలలో జరుగుతూన్న పనిని పరిశీలించడానికి వందలకొలదీ మైళ్ళు ప్రయాణం చేశారు.

ప్రతిమనిషీ ఈపనిని జయప్రదంచేయడానికి ప్రయత్నించినట్లు కనిపించింది. ప్రజలు, ముఖ్యంగా మార్వాడీలు ఉచితంగా ఆహారపదార్థాలను, దుప్పట్లనూ సప్లయిచేశారు. సబ్‌డివిజనల్ కమిటీలు, స్థానికకమిటీలు, వారి స్వచ్ఛందసైనికులు అంతాకలసిమెలసి ఎంతో మంచి సహకారంచేశారని

ఆరోగ్యశాఖా డైరెక్టరూ, ఎక్సైజు కమీషనరుకూడా తమ తమ నివేదికలలో యెంతో ప్రశంసించారు. కర్నల్ ఎల్లిస్ చేసిన సహకారఫలితంగా యూరోపియన్ యాజమాన్యం కింద పనిచేసే తోటలనుండికూడా సహకారం లభించడం సామాన్యవిషయం కాదు. మేము రాజీనామాలిచ్చిన నవంబరు నెలనాటికి ఎక్సైజు కమీషనరున్నూ ఆరోగ్యశాఖా డైరెక్టరున్నూ పంపిన నివేదికలు, అప్పటికే ఉద్యమంపొందిన విజయాన్ని పూర్తిగా ఉద్ఘోషిస్తూన్నవి. అసాంలో ప్రొహిబిషన్ కమీషనరు అంచనానుబట్టి, అది ఇంకనూ, ఎక్కువవిజయం పొందినదనిపిస్తూన్నది. ఎక్సైజు సూపరింటెండెంటు నివేదిక ఎక్కువ మితంగాఉన్నది. అందులోకూడా డిబ్రుఘుర్ సబ్ డివిజన్‌లో నూటికి 70 మంది, ఈనల్లమందుపిశాచంనుండి తప్పించుకొని పూర్తిగా బయటపడ్డారని వ్రాయబడింది. శివసాగర్ సబ్ డివిజన్‌లో ఇంకా ఎక్కువమంది బాగుపడ్డారట. నల్లమందు దొంగలెక్కువగా పట్టుపడుతూన్నారని, డిబ్రుఘురులో ఈ కేసులవిచారణకు మరొక మేజస్ట్రీటును వేయించవలసిఉంటుందనీ, ముందటి సంవత్సరాలకంటెకూడా ఎక్కువ దొంగనల్లమందు పట్టుపడుతూన్నదనీ ఆయన చెప్పినారు. కాని ఈ దొంగనల్లమందు వ్యాపారం అసాము లోయలోనే కాక, అసాము సరిహద్దులుకూడా దాటి వ్యాపించినందున కాంగ్రెసు సంయుక్తప్రభుత్వం ప్రారంభించిన ఈ ఉద్యమం, అసాంలోయ అంతటిలోనూ ప్రవేశపెట్టబడవలెనని ఆయన సలహాయిచ్చాడు. కర్నల్ హెట్సెరులో వ్రాసిన నివేదిక అనేక

వివరాలను తెలియచేస్తూ మంచి ఉత్సాహజనకంగా ఉన్నవి. 10,300 మందికి పైగా చికిత్స చేయబడింది. వారిలో 20 ఏళ్ల యువకులు మొదలు 70, 80 ఏండ్ల వృద్ధులదాకా ఉన్నారు. ఈ చికిత్సలో ఒక్క మరణంకూడా కలుగలేదు. నలుగురైదుగురు చచ్చిపోయినట్లు తెలిసింది. కాని వారు ఈచికిత్సనుండి విముక్తులైన కొన్నాళ్ళకు మరొకరోగంతో చనిపోయినారు. నూటికి 70, 80 మందికి మళ్ళీ నల్లమందు అలవాటుచేసుకోవడమంటే పూర్తిగా అసహ్యం పుట్టింది.

అలవాటు-పోయిన నల్లమందు తినడం మానినందువలన శరీరంలో కలిగే వికారాలు ఒక వారం రోజులవరకూ ఉండేవి. ముఖ్యంగా మూడోరోజున, నాలుగోరోజున, విరోచనాలు, వణకుతో వళ్ళుకుంగడం మరీ ఎక్కువగా ఉండేవి. 10 రోజులలో రోగికి మంచి హుషారు కలిగి కొంచెం కండకూడా పట్టేది. సాధారణంగా నల్లమందు లక్షణమైన ఒడలి నలుపు మారిపోతూండేదికూడాను.

మేము రాజీనామా ఇచ్చిన తరువాత వచ్చిన సర్ సాదుల్లా మంత్రివర్గం, వెనుక మాకు ప్రతికూల పక్షంలో నున్న నాటి విమర్శననే తిరిగీ వారి బడ్జెట్టు ఉపన్యాసంలో చేశారు. కాంగ్రెసుకూ ఆ ఉద్యమానికీ వ్యతిరేకంగా నేటి యూరోపియన్ పక్షనాయకుడు మూరుగారు, అనవసర అపనిందలను ఆరోపించారు. కాబట్టి వారు కాంగ్రెసు కార్యక్రమాన్ని మానివేస్తారనే మాట నిశ్చయం. కాని ఈమంత్రి వర్గంలో కొంతమంది కాంగ్రెసు సంయుక్త మంత్రివర్గానికి

అక్కడక్కడా గ్రామాలలో మూడు మూలల నక్కినక్కి ఉంటుందేమోనని మాకొక భయం.

౩

## ఉప్పు

హిందూదేశపు సముద్రతీరం పొడవు 48,00 మైళ్ళు. సింధుశాఖనూ రాజపుతానాలోనూ ఉప్పుగనులూ, గుట్టలూ ఉన్నవి. సముద్రతీరంలోని పల్లపు ప్రదేశాలలో సహజంగానే ఉప్పుగాసులు తయారవుతవి. పాంచాలలో ఉప్పుకోటి మాగాణులు కద్దు. దేశంలో అనేకచోట్ల చవిటినేలనుండి గ్రామస్థులు ఉప్పును తయారు చేయగలరు. అటువంటి ఈ దేశంలో పశు, మానవ జీవితాల కత్యవసరమైన ఉప్పుమీద పన్ను విధించబడడం ఆశ్చర్యకరంగా లేదా?

ఉప్పుపన్ను మొట్టమొదట 1836 లోని సాల్టు కమీషన్ నియామక ఫలితంగా విధించబడింది. హిందూదేశమునకువచ్చే సీమపడవలకు తగినబరువు లేక, ఒక్కొక్కప్పుడవి ఆరువారాలు కూడా లివర్పూల్ హార్బరులో ఆగిపోవలసివచ్చేది. వాటికి అధమం సముద్రతరంగాలమీద తలక్రిందులుగాకుండా సవ్యంగా ప్రయాణంచేయడానికి తగినంత బరువైనా చూపించేటందుకే కమీషన్ పార్లమెంటు సభ్యులతో యేర్పాటు చేయబడింది. బ్రిటను ఓడ లప్పటికప్పుడే ఇండియానుండి ముడిసరుకులను తీసికొనిపోను, తయారయిన వస్తువులను ఇండియాకు దిగుమతీ

చేయడం ప్రారంభించినవి. కాని ముడిసరుకులను తీసుకొని పోయే పడవలు తయారైన వస్తువులను తీసికొనివచ్చే పడవల కంటె ఎక్కువ వైశాల్యంగా ఉంటవి. ఒక వేళ పత్తి ఒక పెట్టెకు పట్టేదే అవుతుంది. ఒక బండెడు జీడిమామిడి గింజలు వేసినంత కాయలు, బిస్కట్లుగా తయారుచేస్తే చిన్న పెట్టె లోకి సరిపోతవి. కనుక బ్రిటను నుండి వచ్చే తయారైన వస్తువులు ఓడలలో ఆక్రమించే స్థలం, బ్రిటనుకు పోయే ముడి సరుకులు ఆక్రమించే స్థలం కంటె చాలా తక్కువగా ఉండేది. మొదటి దానికి రెండోది కేవలం 10 రెట్లు ఉండవచ్చును. కాబట్టి ఇండియాకు వచ్చే 10 ఓడలలో తొమ్మిది, సరుకు లేమీ లేకుండా ఉత్తంగా సముద్ర తరంగాలపైన ప్రయాణం చేస్తూ రావలసివచ్చేది. వట్టి పడవ అలా సముద్రంపైన రావడం చాలా ప్రమాదకరం. కనుక 1836 వరకు, లండను కోస్తాలోని మట్టిని బరువుగా వేసుకొని కలకత్తాకు వచ్చేవారు. ఈ మట్టితోనే హుగ్లీనుండి కాళీఘట్టము గుడికి పోయేకాలువ పూడ్చబడినదని ప్రతీతి. అంతేకాదు చౌరంఘీ రోడ్డుగానీ, లేక చుట్టురోడ్లలో ఒకటిగానీ, లండనుమట్టితోనే వేసి ఉంటారనికూడా వింటున్నాము. అయినప్పటికీ ఈ పని వట్టి దండుగ అని తేలింది. కాబట్టి 1836 లో నియమింప బడిన సాల్టు కమీషను వారు ఈ సంగతులన్నిటినీ గమనించి, లండనునుండి మట్టి తీసుకొనిరావడం కంటె ఉప్పు తీసుకొని రావడం ఉపయోగకరమని, చెషైరు లివరుపూలు కోస్తాల నుండి తెచ్చిన ఉప్పు ఇండియాలో అమ్ముడుపోవలెనంటే

ఇండియన్ ఉప్పును ప్రభుత్వం వారి సర్వాధికార యాజమాన్యం కిందకు తెచ్చి, మణుగు 1 కి రు 2-8-0 చొప్పున పన్ను విధించవలెనని సిఫారసు చేశారు. ఇంపీరియల్ కౌన్సిలులో ఈ అన్యాయపు పన్నును గూర్చి మొట్టమొదట నోరెత్తి మాట్లాడింది గోఖలే. అప్పుడు మణుగుకు రు 2-8-0 విధింపబడిన పన్ను రు 1-4-0 కు తగ్గించబడింది. అప్పటినుండీ మణుగుకు ఒకరూపాయి, రెండురూపాయిలమధ్య పన్నువిధింపబడుతూవస్తున్నది. ఈపన్ను ఫలితాలను గూర్చి విచారిద్దాము.

౧ సముద్రం దగ్గర నివసించే పల్లెవాళ్ళు తమ గంజిలోకి అక్కరపడే ఉప్పు తీసుకొనివెళ్ళడానికి వీలులేదు. అందువలన వాళ్ళు ఒకగడ్డి మోపును ఉప్పునీళ్ళలో తడిపి, దానిని ఇంటికి తీసికొనిపోయేలోగా ఎండబెట్టి ఇంటిదగ్గర దానిని నిప్పులోకలబెట్టి, ఆబూడిదను వాళ్ళ గంజిలో వేసుకొనేవాళ్ళు. ఈ నేరానికి వాళ్ళు రు 500 జరిమానాకు 6 నెలల కఠినఖైదుకూ గురికావలసి వచ్చింది.

౨ సముద్రపు ఒడ్డునగల మట్టితో ఎండిన ఉప్పుచేపలను తయారు చేసే పల్లెకారీలు, ఆపని చేయడానికి వీలులేకుండా లైసెన్సు లేర్పాటుచేశారు. అందువలన లైసెన్సులవారు, లైసెన్సుగల ప్రదేశాలలో మాత్రమే ఉప్పుచేపలను తయారుచేసుకోవడాని కర్హులైనారు.

3 పశువుల మేతకు కావలసిన ఉప్పు, ఖరీదెక్కువ కావడంవలన లేకుండా పోయింది.

౪ ప్రతి మనిషి తినే ఉప్పు సగటున తగ్గిపోయింది. గోఖ్లేగారికృషి ఫలితంగా పన్ను తగ్గినందువలన మళ్ళీ హెచ్చింది.

౧ 1836 కు పూర్వం కోరమండలం కోస్తానుండి పడవలు, బెంగాలుకు ఉప్పు తీసుకొని పోతూండేవి. బెంగాలునుండి తిరిగి బియ్యం తెచ్చుకొంటూండేవి. 1836 తరువాత బెంగాలుకు చౌకగా వచ్చే ఇంగ్లీషు ఉప్పు పోయింది. దక్షిణదేశానికి బెంగాలు బియ్యం రావడం తగ్గింది.

౨ సముద్రం ఉచితంగా నీరిస్తుంది. కోస్తాలో ఉన్న పల్లపు ప్రదేశాలు కూడా అడ్డదేమీ లేకుండా సముద్రపు నీరును నిలవచేసి పెడతవి. వసంతకాలపు సూర్యుడు ఉచితంగానే ఆ నీటిని ఎండకడతాడు. తెల్లగా తళతళలాడే ఉప్పుగడ్డలు తయారవుతవి. వీటిని బురదలో కలిపి పాడుచేసేటందుకు ఒకచోట దాదాపు సంవత్సరానికి రు 8000 ల వరకూ గల పెద్దపెద్ద మొత్తాలను సాల్టుడిపార్టుమెంటువారు ఖర్చు చేశారు. 1836 పూర్వం సముద్రపుఒడ్డున ఉన్న గ్రామస్థులు ఉచితంగా ఉప్పుసాగుచేసుకొని, వాళ్ళకు కావలసింది ఉపయోగించుకొంటూ మిగిలింది చుట్టుపట్ల గ్రామాలలో అమ్ముకొంటూండేవాళ్ళు. ఇప్పుడా వృత్తి పోయింది వాళ్ళకు.

౩ స్థానికంగా ఉప్పు తయారుచేసుకొనేవారు, పంజాబు నూతులలోని ఉప్పునీటిని తోడివేస్తూన్నందువలన, చుట్టుపట్ల భూములలో ఉప్పుపోయి భూసారం బాగుపడుతూండేది. ఉప్పుచట్టం, అలానీరు తోడి ఉప్పుచేయడం నిషేధించింది. కనుక ఉప్పునీరు నూతులలోనే ఉండిపోతూన్నది. అందువల్ల ఆ నీరు పొంగుతూన్నకొద్దీ చుట్టుపట్ల భూములు వ్యవసాయానికి పనికిరాకుండా చవుడుకి పోతూన్నవి.

సింధులోని ఉప్పుగని ప్రపంచ మంతటికీ 250 యేండ్ల వరకూ కావలసిన ఉప్పును సప్లయిచేయగలదనీ, ఒక్క ఇండియాదేశానికే అయితే 1250 సంవత్సరాలవరకూ అది

సరిపోతుందని అంచనా వేయబడింది. పాంచాలంలోని ఉప్పు కొండలో ప్రపంచానికి వేయి సంవత్సరాలకు సరిపోయే ఉప్పు ఉన్నది. అటువంటి దేశంలో బ్రిటన్ దేశపు నౌకా వ్యాపారలాభం కోసం ఉప్పు పన్ను విధించబడినది. ఉప్పువలన ఇండియాగవర్న మెంటుకు 6 కోట్ల రూపాయిల ఆదాయవస్తుంది. ఓడలలో తూకం కోసం, కేవలం ఉప్పుఒక్కటే రావడంలేదు. పాతవార్తాపత్రికల బేళ్ళు, పింగాణీ పెంకులు, ఇటాలియన్ చలువరాళ్ళు, ఉరలగస్తలు, ఇటీవల జపానునుండి యాపిల్సు, సయామునుండి నూకలూకూడా వస్తూన్నవి. ఇవన్నీ ఇండియా ఆర్థిక స్థితిని కల్లోలపఱచి లక్షలాది ప్రజల వృత్తులను నాశనం చేసినవి.

అందువలననే ఉప్పు, నల్లమందు, తాగుడుల వలన ప్రభుత్వానికి వచ్చేడబ్బును పాపపుడబ్బనడం. స్వరాజ్యంలో ఈ పద్ధతి ఒక్కరోజుకూడా కొనసాగకూడదు.

# అధ్యాయం 18

## స్వరాజ్యంలో ఇండియా దృశ్యం

స్వరాజ్యంలో ఇండియా ఎలాఉంటుందిఅని ఊహించడం ఒక మోజుగా కనిపిస్తుంది. స్వపరిపాలనలో ఇండియా స్థితిని భావించడమనగా ఇండియా స్వరూపాన్ని భావించడంకాదు. ఇండియాపరిణామాన్ని భావించడం, మనిషిరూపంలోగానీ రాజ్యాంగలక్షణాలలోగానీ, సభ్యతా విశేషములలోగానీ కలిగేమార్పులు దృష్టిగోచరములుకావు. నిరంతరమూ కలసి మెలసిఉంటూన్న స్నేహితుల వయోపరివర్తనాన్ని గ్రహించడం కష్టం. సంఘంలో సంచరిస్తూన్నవారు, వివిధసాంఘిక సంస్థలలో కలుగుతూన్న నిరంతర క్రమాభివృద్ధిని కనిపెట్టలేరు. ప్రభువులుగానీ, ప్రజలుగానీ ఒక రాజ్యంతో సన్నిహిత సంబంధం కలిగి, అందులో కలుగుతూన్న అవస్థాంతరాలను కళ్ళారా చూస్తూన్నవారు, శకాంతరములలో కానవచ్చే విశాల వివర్తనములను ఒక్కసారిగా ఊహించనుకూడా ఊహించజాలరు. కాని మార్పులు మాత్రం ఉండనేఉంటవి. వాటి ప్రాబల్యంకిందనున్న దేశాన్నీ, సంఘాన్నీ సభ్యతనూ సింహావలోకనం చేయగలిగినవారి కవి గోచరమౌతూనే ఉంటవి.

స్వరాజ్య మొక ఫలితమనడం కంటె పరిణామవిధాన మనడం ఎక్కువ ఉచితమని మే మిదివర కనేక పర్యాయ

ములు చెప్పిఉన్నాము. కాని స్వరాజ్యం స్థాపించబడిందని చెప్పి ఒకరోజు వస్తుందని మేము భావించగలము. ఆరోజు నుండీ స్వరాజ్య ప్రాబల్యము స్వరాజ్యసంస్థలూ ప్రారంభమవుతవని చెప్పవచ్చును. యుక్తవయస్సు వస్తూవస్తూన్నప్పుడు, వచ్చినప్పుడూ మనిషియొక్క శారీరక లక్షణాలలోగాని మానసిక ప్రవృత్తులలోగానీ భేదం కనిపెట్టలేనట్లే ఒక దేశం స్వాతంత్ర్యం పొందేముందు, పొందినప్పుడూ కల గుణ భేదాలనుకూడా గ్రహించడం చాలాకష్టం. అయినప్పటికీ మనం స్వరాజ్యవాంఛలతో జీవిస్తూన్నప్పుడు, ప్రజలకు స్వరాజ్యం వలన కలిగేలాభాలనుగూర్చి నిరంతరమూ ప్రబోధిస్తూన్నప్పుడు స్వరాజ్యంలో వివిధ ప్రభుత్వ వ్యవస్థలలోనూ శాఖలలోనూ కలుగబోయే మార్పులనుగూర్చి కానీ, అధమము ఏయే సంస్థలలో యేయే శాఖలలో మార్పులు రావచ్చునో ఆసంగతిగానీ వివరించి చెప్పడం మనధర్మం.

నూతన స్వరాజ్య ప్రాబల్యంకింద కు రావలసిన దాదాపు మొట్టమొదటిసంస్థ గ్రామం అయిఉండాలని మాఆశయం నేను భారతీయ గ్రామనిర్మాణం, సంపూర్ణంగా సంక్షుభితమై విచ్ఛిన్నమైపోయింది. దాని నిక భారతీయసభ్యతకుగానీ, భారత రాజ్యాంగమునకుగానీ పునాది అనడానికి వీలు లేదు. హిందూ మహమ్మదీయుల శీలస్వభావాలకుగానీ, వ్యక్తిత్వ వైజ్ఞానిక లక్షణాలకుగానీ, మనము గ్రామజీవితపద్ధతులను ఉదాహరణంగా తీసుకోవడంలేదు. పల్లెలనుండి ఒక్కుమ్మడిగా పట్టణాల కెక్కిన జనసమూహానికి పట్టణజీవితపద్ధతు లలవాటు

కావడంవలన వారి వ్యక్తిజీవితంలోనేగాక, జాతీయజీవితం లోకూడా ఎంతో మార్పువచ్చింది. ప్రజలు పట్టణాలంటే చాలా మోజుపడుతూన్నారు. పట్టణస్థుల వేషభాషలు పల్లెటూరివారికి అనుకరణాలైనవి. భోగాసక్తివలనగానీ వృత్తి కోసంగానీ, పల్లెలనుండిపట్టణాలకు జనం నిరంతరప్రవాహంగా వస్తూపోతూ ఉన్నారు. ఈపట్టణాలచుట్టూ తిరిగేవారే పల్లెటూరి ప్రజలకు పరపడి, వీరికి పట్టణాలే తమ సొంతఊళ్ళని చెప్పుకోవడంఇష్టం. గ్రామాలలోని తమఇళ్లంటేఅసహ్యమూ అశ్రద్ధా, అందువల్ల వీరికి ఏమైనా పొలఆదర్శాలు ఉన్నప్పటికీ వారి శక్తిసామర్థ్యాలనూ అభిమానాన్ని వారు నివసిస్తూన్న పట్టణశ్రేయస్సుకోసం వినియోగిస్తారు. కాబట్టి గ్రామాలు విద్యలోనూ ఆరోగ్యంలోనూ సహకారంలోనూ వెనుకబడిపోతూన్నవి.

ఒకప్పుడు మన దేశంలో దాదాపు ప్రతిగ్రామంలోనూ ఒక పాఠశాల ఉండేది; ఒక్క వంగరాష్ట్రంలోనే 80,000 పాఠశాల లున్నట్టు ఋజువయింది. అటువంటి ఈ దేశంలో నూటికి ఏడుగురుమాత్రం అక్షర జ్ఞానం గలిగి తక్కిన తొంభై ముగ్గురు నిశానీదారులుగా ఉండే దుస్థితి పట్టింది. ప్రాచీన ఆయుర్వేద యూనానీ వైద్య పద్ధతులు పూర్తిగా అశ్రద్ధ చేయబడడంవలన, గ్రామస్థులు దేశీయ వైద్యసహాయము కోల్పోయి, చిన్న జబ్బుకుగానీ, పెద్దజబ్బుకుగానీ పట్టణాలకు పరుగెత్తుకొని పోవలసి వస్తూన్నది. కాలువలు విస్తారంగా తవ్వించడం వలన వ్యవసాయానికి ఉపయోగంగా

ఉన్న మాట నిజమేకాని, పశ్చిమం నుండి కలిగే అంటుజాడ్యాల్లా దేశమంతా వ్యాపించి, తగిన వైద్య సహాయం లేనందున, ఎక్కడా ఆగకుండా తాలూకాలకు తాలూకాలు. జిల్లాలకు జిల్లాలు నాశనమవుతున్నవి. రైలుమార్గాల నిర్మాణం పూర్వం నుండీ ముసుగుపడి పోతున్న మామూలు దారుల కష్టం కలిగించినందున బెంగాలువంటి రాష్ట్రాలలో ఎక్కువ నీరు నిలవ ఉండి నిరాటంకంగా మలేరియా చెలరేగడానికి వీలు కలుగుతూన్నది. ఆరోగ్యమూ, విద్యా ఈ విధంగా లోపించినవి. ఇక కోర్టులు న్యాయస్థానాలని అనేపేరుతో ప్రవేశ పెట్టిన కైతవ, సంఘర్ష భావాలవలన, దేశంలో కలహాలెక్కువై గ్రామ ప్రజలలో సహకార తత్వం సర్వనాశనమయింది. వ్యాజ్యమొక కాలక్షేపంగా పరిణమించింది. ఇక కోర్టులకు పోయగా మిగిలిన డబ్బునూ కోర్టులచుట్టూ తిరుగగా మిగిలిన కాలమునూ అప్పుడప్పుడూ వచ్చే ఎన్నికలలో వినియోగించడం మరిగారు గ్రామస్థులు. పాశ్చాత్య ప్రజాస్వామ్య పద్ధతిలోని దురాచారాలు లంచగొండితనమూ ఇంత తొందరగా ఈ దేశంలో వ్యాపించడం చాలా దురదృష్టం. మనకు లభించిన ప్రజాపరిపాలన నిజానికి చాలా తక్కువ. కాని అందువలన మనకబ్బిన దురభ్యాసాలు మాత్రం చాలా ఎక్కువ.

ఆధునిక కృత్రిమ నాగరిక జీవిత పరిస్థితుల వలన దేశంలోని సంఘజీవితం లోపించి ప్రజల భౌతిక వాంఛలకూ శారీరకాభివృద్ధికీ తగిన పని జరగడం లేదు. 30 కోట్ల

ప్రజలకు 9 కోట్ల టన్నుల ఆహారము కావలసి ఉంటే 6 కోట్ల టన్నులు మాత్రమే సప్లయి చేయబడుతూన్నది. అనగా నూటికి 40 వంతులు తక్కువ ఆహారం సప్లయిఅవుతూన్నది. ఇందువలన వ్యక్తుల శక్తి యెంతో క్షీణిస్తూన్నది. ప్రతి మనిషి 1.8 మిలియనుల క్యాలరీల ఉష్ణం కలిగిఉండడానికి బదులు .87 మిలియనులు క్యాలరీల ఉష్ణమును మాత్రమే పొందగలుగుతూన్నారు. ఇంగ్లాండులోని మనిషి సగటున 58 సంవత్సరాలు జీవిస్తూన్నారు. ఇండియాలో 24, ఫ్రాన్సు, జర్మనీలలో 48, ఇండియాలో మనిషి 1 కి సగటాదాయం సంవత్సరానికి దాదాపు రు 40, అమెరికాలో 2,250, ఇంగ్లాండులో 750. జరిగిన యాభై, అరవై సంవత్సరాల నుండీ ఇండియా జనసంఖ్య క్షీణిస్తూన్నదని తెలుసుకో వలెనంటే జనన, మరణముల, లెక్కలను పోల్చిచూస్తే అర్థమవుతుంది. ఇండియాలో సంవత్సరంలోపు పిల్లలు నూటికి 20 మంది వంతున చనిపోతూన్నారు. ఇది మరీ ఘోరం. యూరపు దేశాలలో సంవత్సరంలోపు పిల్లల మరణసంఖ్య చాలా తక్కువ.

ఇక మన భూముల పంటవిషయం: వరి పంటగాని, ప్రత్తి పంటగాని ఆలోచిద్దామా అంటే ఇంగ్లాండు, జర్మనీ, ఫ్రాన్సు, జపాను, బెల్జియం, పోలెండు దేశాలలో పండేపంటకంటెచాలా తక్కువ. ఈ అన్ని కారణాలు ముఖ్యంగా ఈ 20వ శతాబ్దంలో అనేకక్షామములకు హేతువులయినవి. వీటి వలన లక్షలాది ప్రజలునశించారు. వేలకొలదీ చదరపుమైళ్ళదేశం పాడుపడింది.

అంటు జాడ్యాల వలెనే కఱువులుకూడా ఇండియాలో అప్రతి హతంగా వ్యాపిస్తూన్నవి. కఱువులను, రోగాలను కలుగచేసే వివిధ కారణాలు విజృంభిస్తూన్న సంగతి తెలిసికూడా ప్రభుత్వంవారు తెల్లమొగంవేసి చూస్తూ ఊరుకొంటున్నారు. సర్ ఛార్లెస్ ఇల్లియట్, సర్ విల్లియం విల్సన్ హంటరుగార్లు ఇండియాలోని అయిదోవంతుజనులు రోజుకొకసారిమాత్రమే భోజనం చేస్తున్నారని వ్రాసినప్పటికీ, 1929 లో ఎంపైరు మార్కెటింగు బోర్డువారున్నూ, ఇండియా హైకమీషనరు సర్ అతుల చటర్జీగారున్నూ, కావలసినదానికంటె ఇండియాలో ఎక్కువబియ్యం ఉన్నవని చెప్పడం సాహసం. అదే నిజమైతే ఆయా దేశాలవారు మనబియ్యం తీసుకొని అందుకు సరిపోయేబట్టను ఇక్కడకు దిగుమతిచేశారని అర్థంవస్తుంది. మన బట్టను మనం తయారుచేసుకోగలిగి, ఆసొమ్మును పరాయిదేశాలకు పంపకుండా ఉంటే, దానితో మనదేశపు ఆకలిగొన్న ప్రజకు మనబియ్యం కొనుక్కొనేశక్తి కలిగించ వచ్చునన్నసంగతి తేలికగా గ్రహించతగినది. అందువలన మన బియ్యంకూడా ఎగుమతికానక్కరలేదు. మనదేశంలో నిరంతరం ప్రవహించే జీవనదులఒడ్డున ఉన్న కొన్నిపట్టణాలకు తాగేటందు కొక చుక్కయినా నీరులభించడంలేదు. ఏమిటి దీనికి కారణం? ఎక్కడఉన్న దీదోషం? ఈదోషం మున్సిపాలిటీలదన్నారుకొందరు. సరే! పోనీయండి! లక్షలాదిప్రజలు అన్నంలేక అల్లాడుతూంటే కోట్లకొలదీ విలువగల బియ్యం ఎగుమతీ అవుతూన్నవి. ఈ తప్పెవరిది? ఈతప్పుతప్పకుండా

ప్రభుత్వానిది, కొన్ని చోట్ల ఆకలితో బాధపడుతూన్న జనం ఉండగా బియ్యం పైకిపోనియ్యడం తప్పు వారిది కాక మరెవ్వరిది? మనుష్యులకు కావలసిన ముఖ్యపదార్థాలు అన్న వస్త్రాలు. విలాసవస్తువులను దిగుమతీ చేసుకొంటూన్నప్పటికీ అన్నవస్త్రాలను దిగుమతీ చేసుకోవడాని కంగీకరించిన దేశం మాత్రం పూర్తిగా క్షీణించకతప్పదు. ఆహారపదార్థాలను దిగుమతీ చేసుకొనే ఇంగ్లాండు దేశమే కానీయండి వస్త్రాలను విదేశాలనుండి దిగుమతీ చేసుకొనే ఇండియా కానీయండి, ఈ రెండూకూడా శిథిలం కాకతప్పదు ఈ రెండు దేశాలు కూడా ఆహారంవిషయంలో ఒకప్పుడు స్వయం సంతృప్తి కల దేశాలే. రెండు దేశాలూకూడా వ్యాపారంలో సరుకులు తిరుగుతూండడంచూచి నిజమైన ఐశ్వర్యంగా భ్రమించినవి. సంకట స్థితిలో ఈదేశాలు తాముచేసిన ప్రమాదానికి తగిన ప్రతిఫల మనుభవించక తప్పదు. ఇంగ్లాండు దేశంలో విస్తీర్ణములైన అడవులను వ్యవసాయయోగ్యము లయిన భూములుగామార్చినప్పుడు ఆ దేశంలో ఆహారానికికొదవ ఉండదు. అలాగే ఇండియాలోని లక్షలాది రాటాలు, మగ్గాలూ పనిచేసినప్పుడూ ఈదేశంలో బట్టలకు కొదవఉండదు.

కాబట్టి స్వరాజ్యస్థాపన కాగానే మొట్టమొదట ప్రభుత్వం చేయవలసినపని, ఇండియానుండి ఆహారపదార్థాలను వెలుపలికి పోకుండానూ, వస్త్రాలను ఇండియాలోకి దిగుమతి కాకుండానూ ఆపి, మగ్గాలను, రాటాలనూ ప్రాచీనౌన్నత్యస్థితిలోకి దెచ్చి, నేసేవాళ్ళకూ, వడికేవాళ్ళకూ జీవనాధారం

కల్పించడం, గ్రామపాలనను పునరుద్ధరించి, గ్రామంలోని తగాదాలు అక్కడే పరిష్కరించబడేట్లు చూడాలి? గ్రామ వృత్తులకు పూర్వప్రాముఖ్యాన్ని, గ్రామపరిశ్రమలలో పూర్వపు నైపుణ్యాన్నీ ఉండేటట్టుచూడాలి. బ్రిటిష్ ప్రభుత్వంకింద పాడుపడిన చెరువులనూ, తదితర నీటి సరఫరా మార్గాలనూ పునరుద్ధరించి, వ్యవసాయమునకు తగి ఉన్నప్పటికీ బంజరుగా నిలచిపోయిన 45% భూమినీ పంటభూమిగా చేయాలి. వంతెనలు లేకుండా కాలువలు త్రవ్వి బ్రిటిష్ ఇంజనీర్లు చేసిన అపచారాన్ని సరిచేయాలి. గ్రామ రహదారీలను, రాకపోకల సౌకర్యాలను బాగుచేయాలి. అందువలన సరుకులు ఒకచోట నుండి మరొక చోటికి తేలికగానూ, తొందరగానూ పోవడానికి వీలవుతుంది. వాగులలో వంతెనలను విశాలంచేసి, మురుగు కాలవల అడ్డంకులను తీసివేయాలి. సాధ్యమైనంత వరకు వ్యాజ్యాలు తగ్గించే సదుపాయం చేయాలి. గృహ పరిశ్రమలను అభివృద్ధిచేసి, వ్యవసాయకులకు తీరిక కాలంలో లాభప్రదంగానూ, గౌరవప్రదంగానూ ఉండే ప్రవృత్తులను కల్పించాలి. ప్రజాసామాన్యాన్ని విద్యావంతులనుగా చేయడంలో శ్రద్ధవహించాలి. అందుకుగాను సంచార గ్రంథాలయాలు, సంచార సినిమాలు, సంచార ప్రదర్శనాలూ యేర్పాటు చేయాలి. వీలుంటే పరీక్షలను రద్దుచేయాలి. నేటిపట్టణ విద్యావిధానం వలన హానింపబడుతూన్న గ్రామస్థుల ఆరోగ్యైశ్వర్యములను రక్షించి, వాళ్ల క్షేమాన్నీ శక్తి సామర్థ్యాలనూ అభివృద్ధిచేయాలి. ప్రతిగ్రామంలోను ఒక

పాఠశాలా ఒక సహకారసంఘము, ఒక కోఆపరేటివ్
స్టోర్సు ఉండాలి. భూమితనఖాబ్యాంకింగు సమవాయాలుం
డాలి. గ్రామస్థులను షాహుకారుచేతులలో చిక్కకుండా
చూడాలి. జరిగినయాభై యేండ్లనుండీ వట్టి భాషాజ్ఞానం
వలన కలిగిన దుష్ఫలితాలను తొలగించాలి. ప్రజలలో సుహృ
ద్భావంపోయి వట్టి భౌతిక సిద్ధాంతం వ్యాపిస్తూన్నది; దానిని
నిర్మూలించి ప్రజలకు మంచిభావాలు, మంచి ఊహాలూ
అభివృద్ధి అయ్యేటట్టు చేయాలి. ప్రజల జాతీయ సంప్రదా
యాలకూ, తత్వశాస్త్రానికీ, మతవిశ్వాసానికీ సన్నిహిత
సంబంధం కలిగి ఉండాలి వారి జీవితం. సాంఘిక కలహాలు
పోనగడానికి వీలున్నచోట్ల పంచాయితీ సంఘాలను నియ
మించి, సంఘాంతర సుహృద్భావాన్ని పెంపొందించాలి.
ఆసుపత్రులను ఆరోగ్యమందిరాలనూ దేశమంతటా నిర్మిం
చాలి. వాటిలో రోగం రాకుండా ఆపే మందులశాఖకూడా
ఉండి, ఆరోగ్యసూత్రాలను, ఆరోగ్యరక్షణ మార్గాలనూ
రేడియోలో ప్రచారం చేస్తూండాలి. పేదవాళ్ళపైన పన్నుల
భారం తొలగేటట్లూ, చిన్నరైతులపైన ఎక్కువ పన్ను పడ
కుండా ఉండేటట్లూ, భూమి పన్నులవిధానం న్యాయ్య పద్ధ
తిని సంస్కరించబడాలి. భీమా విధానాన్ని జాగ్రత్తగా
ప్రభుత్వంవారు పరిశీలనచేయాలి. సాధారణభీమా, పశువుల,
పంటలభీమా, జీవితఆరోగ్యభీమా, రుజువర్తనము, విశ్వాస
ములభీమా, భవనముల, నౌకలభీమా, దొంగతనాల,దురదృ
ష్టముల (accidents) భీమా-వీటన్నిటినీ యేర్పాటుచేసి

ప్రజలలో పరస్పర సహకార భావాన్ని పెంపొందించాలి. ఋణంచేసిన వారికీ ఋణమిచ్చిన వారికీకూడా సౌకర్యకరమైన పద్ధతిని బ్యాంకింగు ఏర్పాటు చేయాలి. అనగా అప్పిచ్చే పని కేవలం సహకారసంఘాలకు వదిలివేయాలి. అప్పులిచ్చే వ్యక్తులను లైసెన్సు తీసుకోమనాలి. చేతిపనులూ - వృత్తి విద్యలూ పోటీని సామాజిక సంస్థల స్వాధీనంచేసి సాంప్రదాయమునకు చట్టమునకూ అనుగుణంగా పనిచేసే గంటలను నేర్పరితనమును పోటీవిధానమును ప్రోత్సహించాలి. భారతీయశిల్ప సౌందర్యాలు తిరిగి ప్రాచీనౌన్నత్యమును పొందాలి. పరిపాలనా వ్యవహారములుగానీ విద్యాబోధనము గానీ భారతరాష్ట్రీయభాషలలోనే జరగాలి. హిందీ, హిందూస్థానీ భారత జాతీయభాషగా ఉండాలి. అన్ని సంఘాలవారూ దేవాలయాలలో ప్రవేశించడానికి హక్కు గలదని తీవ్రంగా ప్రచారంచేసి బోధించాలి. అప్పటికీ అంటరానితనం పోకపోతే, ఆ మచ్చను ఒక్కసారిగా శాసనంచేసి తుడిచి వేయాలి. అహింసాత్మక రాజ్యాన్ని ఆచరణలోకి తీసుకొని రావడానికి వీలుగా, నేటిహింసాత్మక సైన్యానికి బదులుగా, శాంతిసైన్యమును సమకూర్చాలి. నౌకా వ్యాపారం యావత్తూ దేశీయ పెట్టుబడితో నడవాలి. ముఖ్య పరిశ్రమ లన్నీ జాతీయ ప్రభుత్వ వశంకావాలి. గ్రామాలలోకాని పట్టణాలలోకాని పనిదొరకని వారంటూ ఉండకూడదు. అందుకుగాను గ్రామ పరిశ్రమలను, పెద్దపెద్ద పరిశ్రమలనూ కూడా స్థాపించాలి. శిల్పకళకు చోటులేని పెద్ద పరిశ్రమలన్నీ

యంత్రముల ద్వారా ప్రభుత్వ గ్రాంటులతో పెంపొందాలి. కనీసపు కూలీ అందరికీ గ్యారంటీచేయాలి పొలంలేనివాళ్లకు పొలమీయాలి. దేశాన్ని అంతకంతకు పేదరికంలోకి దించుతూ, ప్రతిసంవత్సరమూ విదేశాలకు పోతూన్న 60 కోట్ల రూపాయిలను పోనీయకుండా, భావిదేశాభ్యుదయాని కనుగుణంగా సాధ్యమైనంత తొందరలో అరికట్టాలి. 'పాపపుడబ్బు' మూలాన కలిగిన నైతిక పతనాన్ని వెంటనే తుడిచివేయాలి. సాంఘిక సమస్యల విషయంలో అప్పుడు విదేశీ శాసనసభలకు జోహారుచేయవలసిన అవసరముండదు. సంఘంలోని పెద్దలకే అందుకు తగిన అధికారాలిచ్చివేసిన యెడల సంఘ సంస్కరణవిషయంలో ఎన్నో మంచిపనులుజరుగ గలవు. స్త్రీలస్థితిని అభివృద్ధి పరచడం ప్రభుత్వానికి ప్రథమ కర్తవ్యం. విడాకులు పుచ్చుకునే హక్కు స్త్రీలకుండవలసిందే. కాని బహుజాగ్రత్తగా పరిశీలించి విడాకుల చట్టంలోని షర తులను తయారుచేయాలి. వారికి సాంఘిక ఆర్థిక సౌకర్యా లను సమకూర్చాలి. స్త్రీ పునర్వివాహాలను సర్వజన సమ్మ తంగా ఉండేటట్లు ప్రచారం చేయాలి. స్త్రీలకు భర్తల ఆస్తి లోనూ, తల్లి దండ్రుల ఆస్తిలోనూ కూడా భాగముండాలి. పిల్లలను హింసించడం దేశంలో ఒక ఆచారమై పోయింది. అది నిర్మూలింప బడాలి. తప్పుచేసినవాళ్ళు దయాపాత్రులను కోవాలి. కాని వాళ్ళనుచూచి అసహ్యించుకో కూడదు. తాగుడును నిర్మూలించి, నేరాలను నిరోధించి, నేరంచేసిన వాడు సాంఘికంగా పాపి అనుకోవడంకంటె, మానసిక

రోగిగా భావించి చికిత్స చేయడం మంచిది. అంతర్జాతీయ సంస్కార వాణిజ్యములవల్ల ప్రయోజనములనుగూర్చి ప్రజలకు బోధించాలి. ప్రపంచంలోని ప్రతిదేశమూ తదితర దేశాల పండితులను ఆచార్యులను పిలిపించుకొని, ఆయా దేశాల సంస్కృతితో సన్నిహిత సంబంధం కలిగి ఉండాలి; స్వరాజ్యంలో, ఆంగ్లేయులు మన దేశంలోని తక్కిన జనంతో ప్రభుభావంతో గాక, భ్రాతృభావంతో మెలగడానికి వీలున్నదనుకోవాలి. అప్పుడతను పెట్టిన పెట్టుబడికి ముప్పుండదు. కరెన్సీలోనూ, నాణెములు వేయడంలోనూ, చేసేమార్పులు అంతరంగిక వర్తకానికీ అంతర్జాతీయ వ్యాపారానికీ భంగం కలిగించేవిగా ఉండకూడదు. ఇండియా, ఒకేపెడరేషన్, ఒకేచట్టాలు, ఒకేనాణెం, ఒకేపోస్టేజిస్టాంపు ఉండేపద్ధతిని 'స్వారాజ్యసమిష్టి ప్రజాతంత్రమును' (common wealth of nation) స్థాపించడానికి ఇండియా ఎక్కువగా కృషిచేయాలి. అప్పుడే మారవృత్తమైన, దైవసంఘటమనదగిన, సార్వజనీన శాసనసభ (Parliament of Man) ప్రపంచసమాఖ్య (Federation of the world) లాచరణలోకి వేగంగా రాగలవు.

ఈ విధంగా నూతనసాంఘిక వ్యవస్థా ప్రారంభంతో క్రొత్తశకం వస్తుంది. అప్పుడు భాగ్యవంతుల పరిపాలనఉండదు. ప్రజా పరిపాలన అనగా, ఏవో కొన్నికుటుంబాలు గుమికూడి చేసే గూడుపుఠాణీరాజ్యం అనిపించదు. ప్రభుత్వం కొన్ని ప్రాచీనవంశముల సొంతసొత్తు అనుకోవడానికి వీలులేకుండా

పోతుంది. రాజుల యశస్సుకోసంగానీ సిపాయీలకు పని కల్పించడానికిగానీ యుద్ధాలు ఉండవు. ప్రభుత్వం కేవలం శాంతి భద్రతలను కాపాడేనిమిత్త మేర్పడిన పరికరంగా ఉండదు. కార్మికవర్గంతో సంపూర్ణంగా సహకారంచేస్తూ వారికి కావలసిన ఆహారాన్ని సకాలంలో సప్లయి చేస్తుంది. దేశంలో ప్రతిచోట ఆహారోత్పత్తిగానీ, ఆహారమును కొనుక్కునేటందుకు ద్రవ్యంగానీ కొరవడకుండా చూస్తూంటుంది. ప్రభుత్వ శాఖలుగానీ, ప్రజాసంస్థలుగానీ ధనవంతులకూ సాహసికులకు చేతిలోని పనిముట్లుగా ఉండవు; అవి దేశంలోని నలువైపులనుండీ ప్రజాభిప్రాయాన్ని ప్రతిధ్వనింప చేస్తూంటవి; బాధితుల కష్టనివారణకు ప్రయత్నిస్తూంటవి; దాష్ట్యాన్ని రూపుమాపి, ప్రతియింటినీ ఆరోగ్యానందములకు నిలయంగా చేసి, అందఱికీ అన్నం, వస్త్రం, ఇల్లూ లభించేటట్లు చూస్తవి.

# అధ్యాయము 19

# ముగింపు



## ఏకాజీవిత విధిపరంపర

జీవితం అనేక హద్దులలో పనిచేస్తూంటుంది. అది మామూలుకంటికి సాధారణంగా కనిపించదు. కంటిలోని పాప వెలుతురునూ దూరాన్నీ సరిపుచ్చుకోవడానికి నిరంతరమూ చిన్నదిగానూ పెద్దదిగానూ అవుతూంటుందని శారీరక శాస్త్రజ్ఞునకు తెలుసును. సూక్ష్మదర్శినీ యంత్రం (Microscope) తో పనిచేసే భౌతికశాస్త్ర విద్యార్థిగానీ, వైద్యవిద్యార్థిగానీ అతిసున్నితమైన సమాహారమధ్యము (Focusser) ను ఎప్పుడూ సరిచేసుకొంటూనే ఉంటాడు. రేడియో వినే మనిషీ అంతే. మోటారు కారును రోడ్డుమీద తిన్నగానడిపించేటందుకుగానీ ఎడమప్రక్కగానడిపేటందుకుగానీ డ్రైవరు చేతులెప్పుడూ స్టీరింగుమీదనే పనిచేస్తూ ఉంటవి. హృదయం నిమిషానికి 72పర్యాయములు కుంచించుకొని విస్తరిస్తూంటుందనీ ఊపిరితిత్తులు నిమిషానికి 17సార్లు ముడుచుకుపోయి వికసిస్తూంటవనీ తెలుసుకొన్నప్పుడు, జీవబిందువుల నిరంతరనిర్మాణ నిర్మూలన క్రమములవలన వాటిలో కలిగే మార్పునూ, తద్వారా శరీరస్థితిలో కలిగే పరిణామాన్నీ

గ్రహించ గలిగినప్పుడు, మెదడులోని జీవనాడులు ఒకప్పుడు వివిధభావాలను ప్రేరేపించి మరొకప్పుడు భావసామంజస్య మును కలిగిస్తవనీ, ఒకప్పుడు విస్మయానంద దుఃఖలక్షణాలను గ్రహించి, మరొకప్పుడు విజృంభింప చేస్తవనీ, ఊహించగలిగి నప్పుడు, పేగులలోని అంతర్భాగాలు జీవద్రవాలను లీనం చేసుకొంటూన్న విధానమునూ, సంచలిస్తూన్న రక్తం ప్రాణవాయువును గ్రహించి, ప్రాణవాయు మిశ్రిత ద్రవ్య ములను త్యజిస్తూన్న పద్ధతులనూ చిత్రించుకొన్నప్పుడు, ఆకాశంలోని గ్రహమండలాలు, ఒకదాని కొకటి ఎంతో దూరాన ఆకర్షణ సూత్రానుగుణంగా ఉన్నచోటనే ఉండడం మాలోచించుకొన్నప్పుడు ఈ చిన్నిమానవ శరీరము, మహా విశ్వంలోని సంకీర్ణత విభాగములను కలిగియుండడమే కాక, అణువులోని అత్యల్పాంశములన్నీ ఇందులో ఉన్నవని అర్థంచేసు కోగలము. రాగినాణెములో వదిలక్షలలో ఒకవంతుమాత్రమే ఘనపదార్థాణువులు ఉన్నవనీ తక్కినదంతా అంతరమనీ (space) మనం చూడగలమా? మహామేధాశాలియొక్క క్రియా రంగం పరిమితంగానే ఉండవచ్చును. కాని విశాల హృదయం గల మనిషియొక్క గ్రహణశక్తి విస్తృతంగా ఉంటుంది. 'అణోరణీయాన్ మహతో మహీయాన్' అనే ఉపనిషద్వా క్యానుగుణంగా, మహాకన్న పెద్దదిగానూ, అణువుకన్న చిన్నదిగానూ ఉంటుంది. అందువల్లనే గాంధీ ఒకప్పుడు ఉన్న తాకాశ పథములలో విహరిస్తూ, మరొకప్పుడు రాటంవంటి భిన్న విషయాలనుగూర్చి ఆలోచిస్తూంటాడు. ప్రపంచ

సమస్యల పరిష్కారమునుగూర్చి భావించనూగలడు. సేవా గ్రామంలో ఇటీవల డాక్టరు ఫ్రీక్ మన్ కనిపెట్టిన ధనుష్ చక్రాలోని లోపాన్ని తెలుసుకోనూ గలడాయన. మన ప్రాచీన ఋషులు నిర్మించిన భారతీయ గ్రామంలో ఆయన కత్యంతిక విశ్వాసం. అందువలన ఆయనను సంకుచితవర్గ స్ఫూర్తి కలవానిగా భావించకూడదు. నిజంగా ఆయన అటు వంటి వాడే అయితే భారత జాతీయ నాయకత్వంతో సమాధానపడే ఉండేవాడు. అంత జయప్రదంగా ఉన్న ఆయన నాయకత్వాన్ని అనేక పర్యాయములు తనంతటతాను విడిచి పెట్టుకోవలసిన అవసరమే తటస్థించేదికాదు. ఆయన కెన్నడూ ప్రతికక్షి అంటే ద్వేషంలేదు. అంతేకాదు ప్రతి పక్షుల అభిప్రాయాన్ని ఎల్లప్పుడూ ఆయన గమనిస్తూనే ఉంటాడు. తన విశ్వాసాన్ని సిద్ధాంతాలనూ ఎదుర్కొంటూన్న భారత రాజకీయవేత్తల విషయంలోనేగాక భారత జాతికే "శత్రువైన" ఆగ్లేయుని విషయంలోకూడా ఇంత దాక్షిణ్యంగానూ ఉంటాడాయన. భావిసంతానానికాయన ఒకదివ్య తేజస్సు. అంతేకాదు, ఒక దేశానికీ ఒక జాతికీ మాత్రమేగాక ప్రపంచమంతకూ సంబంధించిన మతప్రవక్త.

## గాంధీజ మొక జీవిత విధానం

అందువలననే 'నేటి కల్లోల ప్రపంచమున, గాంధీ జీవిత కాలంలోనే, ఆయన పేరు ఒక వ్యక్తిఅర్థంలోగాక ఒక జీవిత విధానార్థంలో ప్రయోగింపబడుతూన్నది' అని ఫెరల్ బక్కు

అన్నది. ఆయన మాటిమాటికీ బ్రిటిష్‌వారి స్నేహితుడననీ, వారియెడల తనకు ద్వేషం లేదనీ, వారి కష్టకాలంలో సత్యాగ్రహోద్యమాన్ని ప్రారంభించి వారిని చీకాకు పరచననీ అంటూండడం, సామాన్యులైన ఆయన అనుచరులకు చాలా కష్టంగా ఉంటుంది. 'తత్త్వవేత్త పక్షపాతిగా ఉండరాదు. ఆయన కలహాలకు అతీతుడుగా ఉండాలి' అని హోకింగు అన్నాడు, ప్రతిపక్షి యెడల ఆయనచూపే ఈ దాక్షిణ్యమే అతనిని నిరాయుధుడుగా చేస్తూన్నది. గాంధీ ఆత్మచరిత్రలో జనరల్ స్మట్సు చాలా వరకు తన మార్గాలవైపుకు ఆకర్షింపబడినాడని నిరూపించాడు. స్మట్సు కార్యదర్శులలో ఒకరు గాంధీతో అన్నమాట లిదివరకే మేమొకచోట ఉదహరించి ఉన్నాము.

1934 అక్టోబరులో గాంధీ నాలుగణాల సభ్యుడుగా చేరడం మానుకొన్నంత మాత్రాన కాంగ్రెసులో ఆయన కభిమానం క్షీణించలేదు. ఈ ఆరుసంవత్సరాలూ ఆయన కాంగ్రెసుకు అనధికార మధ్యవర్తిగా, న్యాయాధ్యాధిపతిగా, సచివుడుగా వ్యవహరించాడు. స్వరాజ్య ప్రభుత్వంలో హిందూదేశరక్షణ అహింసాత్మకంగా ఉండవలెనన్న విషయంపైన, 1940 జూన్‌లో వార్ధాలోనూ, 1940 జులైలో ఢిల్లీలోనూ తనకూ వర్కింగు కమిటీకి వచ్చినభేదాభిప్రాయాలనూ, 1940 జూలైలో వార్ధా, ఢిల్లీ వర్కింగు కమిటీ నిర్ణయాలను బలపరుస్తూ పూనాలో అఖిలభారత కాంగ్రెసు సంఘం, కొన్ని షరతులతో యుద్ధానికి భౌతిక సహాయంచేయడాని కంగీకరించిన

తీర్మానమునూ గాంధీ ఉపేక్షించి ఉండవచ్చును. కాని ఆయన అలా ఊరుకోలేదు. ఆయనకు హింసమీద ఆధారపడ్డ నాయకత్వమేకాదు స్వరాజ్యంకూడా అక్కరలేదు. ఆయన ఒక నూతనమతానికి మూలపురుషుడు. ప్రపంచప్రవక్త. ఆయన తత్వాన్ని సిద్ధాంతాలనూ సంపూర్ణంగా అనుసరించ గలిగిన సంస్థద్వారా వాటిని లోకంలో వ్యాపకం చేయదలచుకొన్నాడు. అంతేకాని రాజకీయపరిహద్దులలో అణగిమణగి ఉండలేదు. కమిటీలు, కాన్ఫరెన్సులు, కాంగ్రెసులు వీటిని అతిక్రమించి అభివృద్ధి అవుతున్నాడాయన. ఆయనకి ప్రపంచంలో సొంతమని చెప్పుకోదగిన సొత్తు లేదు. సబర్మతీ ఆశ్రమం ఆయనకు ముద్దుబిడ్డ. 1933 లో హరిజనాభివృద్ధికి దానిని ఆయన ఇచ్చివేసిన సంగతి ఇదివరకే చెప్పి ఉన్నాము. 1930 లో ప్రభుత్వంవారు స్వాధీనపరచుకొన్న యంగిండియా ముద్రాశాలను మళ్ళీ కావాలని ఆయన కోరనేలేదు. ఆయనకు ప్రేమాస్పదమైన గాంధీసేవాసంఘ సభ్యత్వసంఖ్య 180 నుండి 9 కి తగ్గించివేశాడు. వారుకూడా నేడు సత్యాహింసల పరిశోధనతో తమ యావత్కాలాన్నీ వినియోగిస్తూన్నారు.

గాంధీ సిద్ధాంతం యేదో ఒక దేశక్షేమంకోస మేర్పడినది కాదు. ఏదో ఒక స్థానిక కష్టానికి నివారణోపాయంగా అది భావింపబడ లేదు. విశ్వకల్యాణార్థ ముద్దేశింపబడిన చికిత్సావిధానమది. అవసరంకోసం యెప్పుడూ తన శాశ్వత సిద్ధాంతాలను ఆయన వదులుకోలేదు. అంతమాత్రంతో ఆయన నిఘంటులలో రాజీ అనే మాట లేదని అర్థంచేసుకోకూడదు.

సత్యాగ్రహంలో మెప్పుతూ ఉన్నది రాజీ. కాని ఆయన తత్వంకానీ సిద్ధాంతాలు కానీ నైతిక వ్యవహారాలలో మేళిధ మైన రాజీని అంగీకరించవు. "ఇతరులు వ్యక్తిగత శిక్షణగా ఉపదేశించిన విషయాన్నే గాంధీ ప్రపంచ మోక్షంకోసం సాంఘిక కార్యక్రమంగా చేశాడు" అన్నాడు హోమ్సు. ఇటువంటి మహోద్యమంలో కొంతమంది లఘుబుద్ధులకు, కొంత విప్రతిపత్తి, కొంత అసాంగత్యతా కనుపించవచ్చును. కాని సోఫియా వాడియా చెప్పినట్లు "ఆయనను 'ఆత్మ' గా గ్రహించ గలిగినప్పుడు, తన హృదయానికీ బుద్ధికీ మధ్య స్థంగా నడుచుకోవడానికి ఆయన ఇష్టపడడని తన అంత రాత్మకు విరుద్ధంగా ఆయన పోడని ఆయన అన్ని సంఘట నలనూ ప్రాపంచిక దృష్టితో గాక తన విషయంలో ఆత్మ జ్ఞాన పథములుగానూ ఇతరుల విషయంలో ఆత్మోపకార మార్గములుగానూ భావిస్తాంటాడని గమనించగలిగినప్పుడు మనకు కనపడే ఈ అసందర్భాలూ అసంభావ్యాలూ చక్కగా అర్థం కాగలవు.

## స్వప్రయోజన పరులతో పోరాటం

గాంధీ కార్యక్రమం అనేకమంది స్వప్రయోజన పరు లకు గాంధీకీ కాంగ్రెసుకూ విరోధులనుగా చేసింది. వారికి ఈ దిగువ ఉదాహరింప బడిన విధంగా వివిధ వర్గాలతో-

అస్పృశ్యతా నివారణోద్యమంవలన సవర్ణ హిందువులతోనూ,
సనాతన బ్రాహ్మణులతోనూ,

విశ్వవిద్యాలయ సంస్కరణలవలన ప్రొఫెసర్లతోనూ,
మద్య నిషేధంవలన కుండీల వారితోనూ,
జాతీయ విద్యవలన ఉపాధ్యాయులతోనూ,
పంచాయతీలవలన లాయర్లతోనూ, కోర్టులతోనూ,
ఖద్దరువలన మిల్లు యజమానులతోనూ,
అమ్మకపు పన్నులవలన వర్తకులతోనూ:
ఆస్తి పన్నువలన ధనవంతులతోనూ,
కనీస పరిశ్రమలవలన పెట్టుబడిదారులతోనూ,
ఋణవిమోచన చట్టంవలన ఋణదాతలతోనూ,
కౌలాయితీ చట్టాలవలన జమీందారులతోనూ,
దంపుడుబియ్యంవలన వడ్లమరల యజమానులతోనూ,
కార్మికాభివృద్ధివలన భూఖామందులతోనూ,
జీతాల తగ్గింపువలన ఉద్యోగస్థులతోనూ,
భారతీయోద్యోగ నియామకంవలన యూరోపియనులతోనూ,
హిందీవలన జస్టిసు పక్షంతోనూ,
బిరుదులను నిరాకరించడం వలన ధనికవర్గంతోనూ,
మతసంస్థల యాజమాన్యంవలన పీఠాధిపతులతోనూ, మహాంతుల
తోనూ, విరోధంవచ్చింది.

## కాని గాంధీ ఉచిత జీవితం అందరినీ సమాధానపరిచింది

తన ఆదర్శాలను జంకూ గొంకూ లేకుండా ప్రకటిస్తూ అవసరమైనప్పుడు రాజీకంగీకరిస్తూ, యావద్భారత జాతినీ సంకుచిత స్వప్రయోజనముల కతీతులనుగాచేసి జాతీయ స్వాతంత్ర్యమార్గమునకుగల ఆటంకములను తొలగించుటలో

గాంధీ విజయము పొందాడు. ఉచిత జీవిత సిద్ధాంతములను సరిగా గ్రహించడం వలననే గాంధీ కావిజయం కలిగింది.

ఉచిత జీవితమనగా ఎలా ఉండాలో కొంచెమాలోచిద్దాము. రాజకీయంలో కుడిపక్షమంత పూర్వాచార పరాయణులుగానూ ఉండకూడదు. ఎడమపక్షమంత తీవ్రవాదమూ పనికిరాదు. దీనినే ఇంకోవిధంగాకూడా చెప్పవచ్చు; ఎప్పుడూ అధికారవర్గంతో కలసిఉండడమూ పనికిరాదు; వెనుకపడి ఉండి వినేదిక్కు లేకుండానూ ఉండకూడదు; రెండు వ్యతిరేక పక్షాలను సమన్వయ పరచగలిగిన స్థితిలో ఉండాలి. ఇందుకు యుక్తాయుక్త వివేకంగల నిరాకుల చిత్తవృత్తి కావాలి. ఒక్కొక్కప్పుడు మనిషికిగల సుగుణాలే అవగుణాలుగా పరిణమిస్తవి. నూతనభావాలు కలిగిఉండడం సుగుణమే. కాని ప్రతిపక్షితో సమాధానం కుదుర్చుకో లేకపోవడం అవగుణం. ఒకమనిషి తన అభిప్రాయాలకు అంటిపట్టుకొని ఉండడం సుగుణము కావచ్చును; సిద్ధాంత ప్రకారంచూస్తే నూటికి నూరుపాళ్ళు అతనిది ఒప్పే కావచ్చునుకూడా. కాని సంఘంలో అతనొక్కడే మనిషి కాదు. అలాగేఅయితే అభిప్రాయాల లనేవే ఉండవు. అభిప్రాయాలనగా మనుష్యులయొక్కగానీ విషయాలయొక్కగానీ, లేక మనుష్యులూ విషయాలయొక్కగానీ బాంధవ్యాన్నిగూర్చిన సిద్ధాంతాలు. కాబట్టి, అభిప్రాయాలు అనే మాటలోనే సంఘజీవితం అనేది ఇమిడి ఉన్నది. సంఘజీవితంలో, రాజీలు, సమాధానాలు, 'ఇచ్చి పుచ్చుకోవడాలు' ఉండకతీరదు.

మనిషికి యదార్థగ్రహణశక్తి ప్రమాణజ్ఞానం, ఉచితజ్ఞతా ఉండాలి. నీవెక్కడ ఏపరిస్థితులలో ఎంతవరకు మాట్లాడాలి. అని గ్రహించడానికి సుశిక్షిత బుద్ధికావాలి. మనిషి దాతగా ఉన్నంతమాత్రంతో దుబారాఖర్చు చేసేవాడుగా ఉండకూడదు. లెక్క ప్రకారం ఖర్చుపెట్టేమనిషి కటికిలోభిగానూ ఉండకూడదు. స్వాతంత్ర్యాభిప్రాయాలు కలవాడు పెంకెతనంగా ప్రవర్తించరాదు. పరిపక్షితో సమాధానపడిన మనగా అతనికి లొంగిపోవడంకాదు. విధేయత ఎన్నడూ దాసత్వం కాజాలదు. ఆత్మగౌరవం దౌష్ట్యమనిపించుకోదు. తనకులోబడిన వారిపైన దాక్షిణ్యంచేసే మనిషి సాధారణంగా తనకంటె పైవానికి బానిసగా ప్రవర్తిస్తాడు. నూరురూపాయిల రైలుటిక్కెట్టు కొన్న మనిషి, భోజనానికి అర్థరూపాయి వెచ్చించడానికి గానీ, కూలీకి పావలా ఈయడానికిగానీ లోభిస్తాడు. కాబట్టి మనిషి జీవిత మనేక విచిత్ర విరుద్ధ మార్గాల నడుమ్నూంటుంది. వీటిని సమన్వయం చేసుకోవడమే జీవితలక్షణం.

## గాంధీ పూర్ణపురుషుడు

ఒక ప్రత్యేకశక్తి అభివృద్ధి పొందినప్పుడు తక్కినశక్తులు తగ్గిపోవడం మన అందరి అనుభవంలోనూ ఉన్నది. ఈ విషయం శారీరకశాస్త్రంలో ఎక్కువగా బుజువౌతూన్నది. కుంటివాని చేతికండలూ, తక్కినశరీరమూ లావుగాఉంటవి. ఒకచేయి లేకపోయినట్లయితే రెండోచేయి రెండింతలు

బలంగా ఉంటుంది. మనిషి తన వాక్కౌశలముతో బుద్ధినైపుణ్యమునూ, భావోద్రేకమును అభివ్యక్తపరచుకొన్నట్లే, పాముకున్న శ్రవణశక్తి, వేటకుక్కలకుగల పసిపట్టే శక్తి పక్షుల అవలోకనాశక్తి అతనికి లేకుండా పోయినవి. అదేవిధంగా శారీరకంగా బాగా బలిసినమనిషికి బుద్ధి మాంద్యం ఉంటుంది. కృశీభూత శరీరంలో అత్యుదాత్తము లైన ఆధ్యాత్మిక శక్తులు కనిపిస్తవి. గాంధీ శరీరాన్ని కఠిన నియమాలలో పెట్టుకొంటూన్నప్పటికీ దానిని నిరాహారంగా ఉండనీయడు. ఆయన బుద్ధి భావోద్రేకా లను నియమంతో ఉంచుతుంది. భావోద్రేకాలు బుద్ధిని సునిశితంగా చేస్తవి. ఈరెంటింటి పరస్పర సంయోగ సంఘట్టనము ఆయన ఉచితజ్ఞత్వమునకూ పూర్ణత్వమునకూ తోడ్పడుతూన్నవి. ఇదీ గాంధీవ్యక్తిత్వంలోని గొప్పతనం. ఆయన నియమాలు కఠినములుగా ఉండేమాట నిజమే. కాని వాటిలో ప్రత్యపకారబుద్ధి యొంతమాత్రమూ ఉండదు. తప్పుచేసినవానిపైన ఆయనకు చాలా దయ. కాని దానిని చిన్నదిగా చేయడంకానీ, యేదోసాకుచెప్పి తోసివేయడం కానీ ఆయనకు పనికిరాదు. ఆయన ఔదార్యంగా ఉంటాడు; కాని లోబడడు. గట్టిగా ఉంటాడు; కాఠిన్యం వహించడు. ప్రపంచాన్ని జయించగల తన సంకల్పంతో స్వర్గాభిలాషి యగు తన ఆత్మను తేలికగా జోడించగల డాయన. ఆయన జీవిత విధానం సత్యబద్ధమై ఉంటుంది. తన సునిశిత సత్యం వలన తగిలిన గాయాలను శమింపచేయడానికి ఆయన శత్రుల

పైనను మిత్రులపైననూకూడ అహింసా పాతనుండి అను రాగామృతధారలను జాలువారుస్తాను. సత్యం కఠినంగానూ భయావహంగానూ ఉంటుంది. అహింస మృదువుగానూ ఆర్ద్రంగానూ ఉంటుంది. సత్యనిష్ఠ గలవాడు కదా అని ఆయనను క్రూరుడనుకోకూడదు; అహింసాపరుడుకదా అని అతిసౌమ్యుడనుకోనూకూడదు. ఈ రెండు గుణాల ఉచిత సమన్వయమే సత్యాగ్రహాన్ని ఆదర్శపూర్వక సిద్ధాంతంగా చేస్తూన్నది. మానవోదారభావమున్నూ, నిరంతర దైవచింతనమూన్నూ కలసి దాదాపు పూర్ణ పురుషుడనతగిన మొట్ట మొదటి సత్యాగ్రహి గాంధీ అయినాడు. దైవ మానుషగుణముల మిశ్రమమే గాంధీని ఇంతవానిగా చేసినది. బార్కరు అన్నట్లుగా "ఆయన భార తీయ తత్వశాస్త్ర సంప్రదాయముల యొక్కయు, పౌర, రాజకీయస్వాతంత్ర్యానుగుణములైన పాశ్చాత్య సంప్రదాయ ముల యొక్కయు మిశ్రమము."

గాంధీ ఇతరులను గౌరవించి ఆత్మగౌరవాన్ని ఆర్జించు కొన్నాడు. డాక్టరు బెసెంటు ఆయన కడకు వచ్చినప్పుడెల్ల ఆమె కెదురుపోయి తీసుకొనివచ్చేవాడు. ఈనాటి వరకూ ఆయన గోఖేల్ పేరును గురుభావంతోనే మన్నిస్తూంటారు. పండిత మదనమోహన మాలవ్యా ఆయనకు కులపతి. ఆయన సలహాను గాంధీ అమూల్యంగా భావిస్తాడు. ఆలీసోదరులంటే ఆయన కత్యంత గౌరవం. వారి పేరును తలపెట్టినప్పుడల్లా వలీ రసూలులకు చూపేటంత గౌరవం చూపిస్తాడు. పెద్దల

యెడ ప్రాజ్ఞభావము, సమానులయెడ గౌరవము, చిన్న వాళ్ళ యెడల అనురాగమూ కలిగి ఉండడమే దాక్షిణ్యమని గ్రంథాలు చెబుతున్నవి. జీవిత రమణీయతలను ఇంత శ్రద్ధగాను, పరిపూర్ణహృదయంతోనూ గమనించే మరొక ప్రజానాయకుణ్ని చూడజాలము.

ఆయన సిద్ధాంతంలో ఆయన కచంచలవిశ్వాసం. అందువలన తానొక యువకుడనని అనుకుంటాడు. ఆయన అత్యంత సన్నిహితానుయాయులలో కొందరు, ఆయనలో వృద్ధత్వ చిహ్నములు కనిపిస్తున్నవనీ, ఆయన అభిప్రాయాలేతప్ప యితర అభిప్రాయాలను ఆయన గమనించడం లేదనీ అన్న మాట అనాలోచితంగా అన్నమాట. నిజానికాయన చిరంజీవత్వమును కనుగొన్నాడు. తాను చేస్తున్నపని విశ్వమానవాభ్యుదయంకోసమనీ, తన ఆదేశాలు ఆదర్శానికి మార్గములనీ ఆయనకు దృఢ ప్రత్యయం. అదే ఆయన జీవితమును నిలబెట్టి కృషిని కొనసాగింప చేస్తున్నది. గాంధీ డెబ్బైయేండ్ల భక్తి జీవితమును గడపికూడా భావికార్యక్రమాన్ని నిర్ణయిస్తూనే ఉన్నాడు. అది రేపే ఫలించవచ్చును. లేదా ఎంతో కాలానికిగాని ఫలించక పోవచ్చును. స్వాతంత్ర్యయాత్ర మొదటికంటె రానురాను సుకర మవుతుందని ఆయనవిశ్వాసం. సత్యాగ్రహికి మొట్టమొదట దూరం దూరంగా పోతున్నట్లు కనిపించిన ఆదర్శం, రాను రాను ఎదురుగా వస్తున్నట్లు తోస్తుంది. అహింసా సిద్ధాంతంలో విశ్వాసమున్న సత్యాగ్రహికి ఆత్మవిశ్వాసమెప్పుడూ,

కొలవడదు. హింసా వ్యాపారంలో నమ్మకమున్న మనిషి తన దౌర్బల్యాలు, తన సందేహాలు, తన చిక్కులు, తన చంచలత్వమూ ఈ అన్నీ ఇతరులకుకూడా ఉన్నట్లు భావిస్తాడు.

న్యూయార్కు 'కమ్యూనిటీ' చర్చికి సంబంధించిన జె. హెచ్. హోమ్సు చెప్పినదానికంటె ఎక్కువ సుకరంగాను వివరంగాను, గాంధీనిగూర్చి మరొకరెవ్వరూ చెప్పజాలరు. ఆయన ఇరవైఏండ్లకిందటనే అమెరికా ప్రజకూ ప్రపంచానికి కూడా 'గాంధీ లోకోత్తర పురుషుడని' ప్రకటించాడు. ఆయన ఇంకా యిలా అన్నాడు. 'ఆయన వినయసంపన్నుడు. సౌమ్యస్వభావుడు; దయార్ద్రహృదయుడు; ఆయనహాస్యం అమోఘం. ఆయన నిరాడంబర ప్రకృతి ఆకర్షవంతము. పరమ శాంతమూర్తి. ఆయనపద్ధతు లతిమార్దవములు; దృఢ సంకల్పమూ అచంచల ధైర్యమూ కలవాడాయన. ఆయన ఋజువర్తనము నిష్కల్మషం. ఆయన సత్యవ్రత మతికఠోరము. ఆయనకు పోగొట్టుకొనేది ఏమీ లేదు. కనుక ఆయనను ఎదుర్కోవడం అత్యంత దుర్లభం. ఆయన అన్నీ త్యజించిన వాడు గనుక ఇతరులను ఏదైనా అడుగగలడు. భౌతికా లోచనలు, ప్రాపంచిక సుఖదుఃఖాలూ, వాంఛలూ, ఎన్నడో ఆయన జీవితంలోనుండి వైదొలగిపోయినవి. ఆయన సత్యప్రేమల మూర్తి. నామతం దైవసేవ-అనగా మానవసేవ అన్నాడు, గాంధీ. ఆయన సేవకు అర్థం పవిత్రత, ప్రేమ.'

ఆ పేద (తెల్లవానిని) రైతు పరలోకంనుంచి దిగివచ్చి నట్టుగా భావిస్తాడు; ఆయనకు ప్రకృతిని జయించగల దైవశక్తులున్నా యని తలుస్తాడు. ఆయనను చూచి భయభక్తులతో దాదాపు దాసుడు లాగున గజగజలాడుతూ వినయవిధేయతలు గలిగి ప్రవర్తిస్తాడు. తెల్ల వానిని చూచినప్పుడు కలిగే ఈ భయభ్రాంతిని పోగొట్టడమే గాంధీ తన సోదర దేశీయులకు ప్రసాదించిన పారితోషికమని అన్నమాట బహు సమంజసంగా ఉన్నది. ఆయన భారతీయునికి ముఖ్యంగా భారతీయ రైతుకు, తెల్లవానియెదుట ధైర్యంగా నిలబడి అతని ఉత్తరువులు దేశాని కనర్థదాయకములని తోచినప్పుడు వాటిని లెక్క లేకుండా తృణీకరించడం బాగా నేర్పినాడు. భయం అంటుజాడ్యం నిర్భయత్వం కూడా అలాగే పాకుతుంది. గాంధీ అభయమూర్తి. అంతేకాదు, తన నిర్భయత్వాన్ని ఇతరులకు వ్యాపింప చేయడంలో ఆయన శక్తి అద్భుతం. అన్యాయ్యంగా బాధింపబడిన భూమిపన్నులను, జిల్లా ఉద్యోగస్థుల చర్యలను లెక్కపెట్టకుండా నిరాకరించగల శక్తి కలిగించాడాయన భారతదేశపు రైతుకు. భయాన్ని జయించ డంలో ఆయన వ్యక్తిత్వ మెంత ఆశ్చర్యంగా పనిచేసిందో ఇండి యాను ఎఱిగిఉన్న వారందరికీ బాగా బుజువయ్యే ఉంటుంది.

ఇంద్రియ నిగ్రహం గలవారికి సంపూర్ణ సమభావం కలుగు తుంది. వారి మనస్సు నిరాకులంగానూ ప్రసన్నంగానూ ఉంటుంది, వారికి ధైర్యోత్సాహాలూ, శౌర్యసాహసాలు ఉంటవి,

అగ్ని పర్వతంవంటి ప్రచండ శక్తితో తమ అభిప్రాయా లనూ, ఆదర్శాలనూ, సిద్ధాంతాలనూ, వారెంత మారణమైనా విజృంభింప చేయగలరు. వారి ఆత్మశక్తికి ప్రశాంత, ప్రచండ గుణములు ఉన్నవి. వారి ప్రేమ అనంతము. దానిని గూర్చి 'రూఫస్ యమ్. జోన్సు' వ్రాసిన మాట లివి. "ఆ ప్రేమ ప్రత్యుపకారమును కోరదు. దానికి పూజా గౌరవములతో పనిలేదు. సర్వతోముఖంగా వ్యాపించడమే దాని కోరిక తనను కావలెనన్నవారంటికీ అది శుభానందములను చేకూరు స్తుంది. కాబట్టి అది క్రోధ పాపములను, ద్వేషపోరాటము లనూ, వెలుతురు చీకటిని ఎదుర్కొన్నట్లుగా ఎదుర్కొం టుంది. శత్రుని కోపము గానీ, మిత్రుని ద్రోహము గానీ, తదితర దోషములు గానీ, ఆ ప్రేమ భావము పెంపొంది ఇంకను ఎక్కువ శ్రేయోదాయకమై జయము పొందే టందుకే దోహదం చేస్తున్నవి." గాంధీ మన నౌకా మార్గదర్శకుడు. ఆయన చుక్కాని దగ్గర ఉన్నాడు. మన మాయన యాత్రి కులము. వర్కింగు కమిటీ మెంబర్లు మన పడవను ముందుకు నడుపుతూన్న నావికులు. ప్రశాంతంగా లోపల కూర్చొని పడవ దిగమన్నప్పుడు దిగడమే యాత్రికులమైన మనము చేయవలసిన పని. మనము కంగారు పడి పడవను అటూ ఇటూ ఊగేటట్లు చేయకూడదు. ఎటువంటి భావోద్రేకాలు

కలగడానికి కారణమున్నప్పటికీ కదలకుండా మన స్థలాలలో నెమ్మదిగా ఉండాలి. లేకుంటే మనమ తలక్రిందులై అందఱమూ మునిగిపోతాము. చుట్టుపట్ల చాలా దూరంవరకూ లోతు గాను గట్టిగానూ వేళ్లుపాతుకొని జొంపాలూ, కొమ్మలూ, పూవులూ, కాయాలుకల పెద్ద చెట్టువంటివాడు గాంధీ. ఆయన నాయకత్వాన్ని, ఆయన అనుచరులు మహాబలిష్ఠంగా చేశారు. వర్కింగుకమిటీ సభ్యులు వేళ్లవంటివారు. అందులో కొన్ని మఱీ ముఖ్యమైన వేళ్లు. అవి మానుకు మఱింత ఎక్కువ స్థైర్యాన్ని చేకూరుస్తూన్నవి. ప్రజాసామాన్యమూ కాంగ్రెసు ప్రతినిధులు, ప్రేక్షకులు, వోటర్లు, అనుచరులు, ప్రశంసకులు, ఆశ్రితులు, సభ్యులు —వీరంతా జొంపాలు, రెమ్మలూ కొమ్మలూ, చిగుళ్ళు, ఆకులూ, మొగ్గలూ, పూవులూ, పిందెలూ, కాయాలూను.

౨

## గాంధీమతము ఎక్కడ ఉన్నది?

గాంధీమతమంటే ఏమిటి. అది ఎక్కడ ఉన్నది? మానవ జీవితంలో పైకి కనబడుతూన్న రూపాలలో అనగా దేశ భాషలలో ఎక్కడా లేదు. ఆశ్రమాలలో గానీ కాంగ్రెసు వేదికలలోగానీ లేదు. నదీ తీరములలోగానీ ప్రాచీన విపిన భూములలోగానీ లేదు. అది హృదయంలో ఇల్లు కట్టుకొన్నది. అది ఇరువైభాషలలో మాట్లాడుతుంది; కాని ఒక్కటేజిహ్వతో మాట్లాడుతుంది. ఒకే గమ్యస్థానమును చేరడానికది ఒక వంద ఉపాయాలను సూచిస్తుంది; ఒకే ఆదర్శం కోసం నవ్యాన

విధాల పనిచేస్తుంది. అది గ్రామాలలో వసిస్తున్నది--కాని ప్రాచీన నిర్మలత్వంతో కాదు—ఆధునిక సభ్యతా కళంకంతో.

పట్టణాలన్నీ పాశ్చాత్యీకృత పల్లెటూరిజనంతో నిండి ఉన్నవి. వారు తమ కట్లనూ వాకిళ్లనూ విడిచిపెట్టుకొని రావడమే గాక ప్రాచీన జాతీయాభిమానాలను కూడా జారవిడుచుకొన్నారు. గ్రామవాసులు పట్టణవాసులైన పిమ్మట గ్రామాల యెడల వారి వైఖరి మారింది. వారి వేషభాషలూ, వారి వృత్తులూ, వారి అభిరుచులూ, వారి దృక్పథం, వారి సంఘ నిర్మాణమూ, వారి ఆచారాలూ అన్నీ మారినయి. అయినప్పటికీ ఇంకా గ్రామాలలో భారతజాతీయత కనుపిస్తూనే ఉన్నది. దానిలోని ఉత్తమోత్తమ లక్షణాలను పునరుద్ధరించడమే గాంధీ సిద్ధాంతముయొక్క ప్రధానోద్దేశం. భారతదేశమిప్పటికీ అయిదు పాళ్లలో నాలుగుపాళ్లు, రచన నిర్మాణములలో గానీ ఆదర్శంలో గానీ గ్రామీణమని చెప్పవచ్చును. తరతరాలనుండీ భారతీయ సభ్యతా సంస్కార వాహినులు నిరంతరాయంగా ప్రవహిస్తూన్నవి. మధ్యలో అనేక ఉపనదులు కలసి వాటిని అత్యంత విశాలములుగా చేసినవి.

గాంధీ ఇరవయ్యోశతాబ్దంలో అవతరించిన లోకోత్తర పురుషుడు. ప్రపంచంలో న్యాయ్యస్వాతంత్ర్యములను, ప్రజాధర్మమానవత్వములను నిలబెట్టటానికి నలభైయేళ్లు కృషి చేసిన మహానుభావుడు. ఒక పక్కను పరాధీన దేశముల మోక్షంకోసమూ మరొక వంక అల్పసంఖ్యాక జాతుల

రక్షణకొరకూ పడరానిపాట్లు పడ్డారు. ఈ రోజున యూరోపు ఖండము అంతనూ ఒక్క కుటుంబముగా భావించు కొన్నట్లయితే అందు పేదచుట్టాలు చుట్టుకొనిఉన్న ఐశ్వర్యవంతులెందరో కనిపిస్తారు. కాని వారిని భాగ్యవంతులు బయటకు తోసివేస్తూన్నారు. అయితే ఇండియాకు సంబంధించినంత వరకు బ్రిటిషువారి యాజమాన్యము నుంచి స్వాతంత్రతను సంపాదించ వలెనని మాత్రమే గాంధీ ఉపదేశిస్తూన్నాడు.

అటువంటి ఉపదేశకుని నాయకత్వం కింద, కాంగ్రెసు సేవా ఆదర్శంతో రాజకీయాలను ప్రస్ఫుటం చేయడానికి ప్రయత్నించింది. ఉన్నతవర్గాలలో ఇంకనూ ఎక్కువ దేశాభిమానమూ, విశాల సంస్కృతీ ఉండవలెనని నచ్చచెప్పినది. గ్రామ నాయకత్వాన్ని స్థాపించడానికి కృషిచేసింది. విడిగా కాంగ్రెసొక నూతన మతాన్ని స్థాపించింది. —అది రాజకీయ మతము. మానవ సమస్యయేదీ కూడా మతమునకు దూరంగా ఉన్నదనడానికి వీలులేదు. అలా అనడం మతద్రోహం. మతమొక ప్రత్యేక సిద్ధాంతాన్ని గానీ ప్రత్యేక పూజావిధానాన్ని గానీ ఉపదేశించదు. అదిఉదారజీవితమునూ, త్యాగబుద్ధినీ, ఆత్మార్పణ చింతనూ ప్రబోధిస్తుంది, మేము రాజకీయ మతమని అన్నప్పుడు నేటి క్షుద్ర రాజకీయాలను పవిత్రంగానూ నేటి ప్రత్యేక రాజకీయాలను సమగ్రంగానూ నేటి స్పర్థా రాజకీయాలను సహకార భూయిష్ఠములుగానూ చేయడమని అర్థం.

ఈ దృష్టి, చిత్తవృత్తి కల మేము భారతజాతీయతకు సత్యమూ ధర్మమూ పునాదులుగా ఉండాలని వాంఛించాము. మానవ జీవితంలో చాలా పర్యాయములు అసత్యం తేలికగానూ, తొందరగానూ విజయం పొందింది. కపట వృత్తమూ, ఆడంబరమూ, న్యాయధర్మములపైన తఱచుగా ఆధిక్యతను పొందినవి. క్రూరపరతానూ, తర్క, చట్టములు జీవితాన్ని స్వాధీనపరచుకొన్నవి. కాని ఇటువంటి విజయాలు సంపూర్ణములూ కావు. శాశ్వతములూ కావు. పైపెచ్చు విజేతలకు క్రొత్త చిక్కులు తెచ్చిపెట్టినవి. వెనుకటి ఐరోపా యుద్ధంలో గెలిచినవారికి, ఓడినవారిపైన శాశ్వతవిజయం కలుగలేదు. ఇండియాను జయించినా మనుకొనే ఇంగ్లీషు వారికిగూడా నిరంతరానందం చేకూరలేదు. బ్రిటిష్ రాజకీయవేత్త లేర్పాటుచేసిన రౌండుటేబిలు సమావేశముల వలన, ఇండియా ఇంగ్లాండుకు శాశ్వతంగా మొగసాలయై పోలేదు. వారినిర్బంధవిధానములవలన ప్రజలలో నిరోధ శక్తులు విజృంభించి, శాసనోల్లంఘనోద్యమ రూపంలోనూ అంతకంటెనూ తీవ్రతరరూపంలోనూ ప్రజ్వలిస్తున్నవి. మన అసహాయోద్యమం అపజయం పొందిన దనడం, వారికోరికను తెలియచేస్తున్నదే కాని వివేకాన్ని తెలియ చేయడంలేదు. ప్రతి అపజయమూ విజయానికొక మెట్టు. అనేక అపజయాల అంతిమ పరిణామమే విజయం.

ఈ దృక్పథంతోనే మనము కాంగ్రెసు కార్యక్రమాన్నిగూర్చి ఆలోచించాలి. ఆ కార్యక్రమం రెండు

విధాలు. పోరాట విధానంలో మనము బ్రిటిష్ ప్రభుత్వం పైన సాగించిన దండయాత్రలను కాదనగల నాగరిక ప్రభుత్వం లేదు. త్రికరణ శుద్ధిగా అహింసావలంబకులమై పోరాటాన్ని సాగించాము. ఇండియాలో శాంతిరక్షణకు గాంధీ అగ్రగామి అనిపేరు పొందాడు. ప్రభుత్వంవారాయన సత్యాగ్రహ సిద్ధాంతానికి అయుష్టతను వెల్లడించ వచ్చునుగాక; కాని ప్రజల అనురాగములపైన సత్యాహింసలకున్న పలుకుబడిని యెవ్వరు నిరసించగలరు? రాజకుటుంబాలు నిర్మూలింపబడి చక్రవర్తిత్వాలు తలక్రిందులై ప్రజాప్రభుత్వాలు పాడయిపోతూన్న ఈ కాలంలో, పాతకాలంనాటి వివిధ రాజకీయ పక్షాలకూ స్థానంలేకుండాచేసి రాజకీయ ప్రతికక్షులను ఎన్నికలలో ఓడించడానికి బదులుగా కేవలం హత్యచేస్తూన్న ఈ రోజులలో, అహింసనుగూర్చి మాట్లాడడం హాస్యాస్పదంగా తోచవచ్చును. ఇటీవల మనకు కలిగిన అనుభవాలను బట్టి రక్తపాతంతో పొందిన విజయాలు రక్తపాతంతోనే రక్షింపబడుతూ ఇంకనూ ఎక్కువ రక్తపాతంతో నాశనమౌతవని అర్థమయింది. అంతేకాదు, రెండుజాతుల మధ్య వచ్చిన విభేదాలను పరిష్కరించడానికి దౌర్జన్యం తప్ప గత్యంతరం లేక పోయినప్పుడు, రెండు సంఘాలమధ్యగానీ చిట్టచివర కిరువురు వ్యక్తులమధ్యగానీ వచ్చిన తగాదాల విషయంలోకూడా, పశుబలమే అధిష్ఠాన దేవత కావచ్చునని తోస్తూన్నది. దీనిని మనము నవకాలంలో గమనించ దగిన సదుపదేశముగా భావించాలి.

ఇక కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమం అతినిరాడంబరం. విదేశీ ప్రభుత్వాన్ని సేవిస్తూ, విదేశీభాషలోనే మాట్లాడుతూ, విదేశీ వస్త్రాలను ధరిస్తూ, పట్టణాలలోనూ నగరాలలోనూ నివసిస్తూన్న కృత్రిమ నాగరికులకిది నచ్చక పోవచ్చును. పట్టణాలలో నివసించే వారిలో సగంమంది జీవనమూ, అభివృద్ధీ, కీర్తీ అన్నీకూడా విదేశీ ప్రభువుల దయాదాక్షిణ్యములపైన ఆధారపడి ఉన్నవి. పట్టణాల జనాభా లెక్కలను పరిశీలిస్తే ఈ సంగతి విశదమౌతుంది. కాని ఇటు వంటి సంగతులను తొందరగా తెలుసుకోవడం కష్టం. ఎందువల్లనంటే మనపైన నిజముగా అధికారం చెలాయిస్తూన్న దెవరో మనకే తెలియదు. పోలీసుజమాన్ మొదలుకొని ఎక్సైజు ఇన్స్పెక్టరు, బ్యాంకు ఏజెంటు, ఇంగ్లీషు దర్జీవాడి వరకూ ఏదో ఒక విధంగా మనపైన యాజమాన్యం వహిస్తూ నేడున్నారు. పి. డబ్ల్యు.డి. లస్కరు, రెవిన్యూ కలెక్టరు, బెంచి మేజిస్ట్రేటు, బిల్లు డిస్కౌంటరు- వీరంతా బ్రిటిష్ ఎంపైరు లిమిటెడుకు జీతమూ బత్తెమూ లేని ఏజెంట్లు. ఇండియా ప్రభుత్వంవారు ఆకంపెనీకి స్థానిక డైరెక్టర్లు. రాష్ట్రీయ ప్రభుత్వాలన్నీ వారి సబ్ ఆఫీసులు. సైన్యము, పోలీసు తదితర ఉద్యోగులు, కోర్టులు, కౌన్సిళ్ళు కళాశాలలు, స్థానికసంస్థలు, బిరుదాంకితులు - అనే ఈయేడు ప్రాకారాలమధ్య బ్రిటిష్ ప్రభుత్వం సురక్షితంగా ఉన్నది. గ్రామాలలోని నూటికి 80 వంతుల జనసమూహమూ, రెవిన్యూ ఉద్యోగులంటే భయభక్తులతో ప్రవర్తిస్తూంటారు.

పట్టణాలలో ఉండే తక్కిన 20 వంతులూ మున్సిపాలిటీలు లోకల్ బోర్డులు, ఇన్కంటాక్సు ఆఫీసర్లు ఎక్సైజు పోలీసు ఉద్యోగుల భయంతో బ్రతుకుతూన్నారు.

కాబట్టి బలాన్ని అధికారాన్ని చూచి భయపడే స్వభావాన్ని పోగొట్టి దానికి బదులుగా నిజమైన అహింసా ప్రేమ నుండి ఉద్భవించిన ఆత్మస్థైర్యాలను ప్రతిష్ఠించాలి. అందుకోసం కాంగ్రెసు వాదులకు ప్రజాసామాన్యంలో సన్నిహిత సంబంధం కలుగజేసే నిర్మాణకార్యక్రమ మేర్పాటు చేయబడింది. కనుక మన ఖద్దరు పేదల కొక ఉపవృత్తిని జీవనోపాధిని కలిగించడమేకాక, వారి నావేశించి ఉన్న బాని సత్వమును పారద్రోలి, ఆత్మగౌరవమును పెంపొందించుకొనేటందుకు కూడా అవకాశాన్ని కల్పిస్తూన్నది. అంతేకాదు పనివాడు తన కుటుంబ మర్యాదకు భిన్నం లేని పద్ధతిని జాతీయ సభ్యతా చిహ్నమనదగిన తన వృత్తిని చేసుకొంటూ తన పనితనము వలన కలిగినఆనందాన్ని అనుభవించగలడు. ఎక్కువ వెల పెట్టి ఖద్దరును కొంటూన్నవారు జాతీయ పరిశ్రమకు ప్రభుత్వం చేయవలసిన ధనసహాయం చేయకపోవడం వలన, తమంతట తాము ఆర్థికంగా దానికి తోడ్పడుతూన్నట్లు భావించకోరుతూన్నాము. ఈ సందర్భంలో మేము ప్రబోధిస్తూన్న నిరాడంబర జీవితంద్వారా, ప్రజలలో ఉదారాశయాలూ, ఆత్మగౌరవ, స్వయంసంపూర్ణ స్వయంపోషక, స్వయంవర్ధక భావాలూ వ్యాపిస్తూన్నవి. ఖద్దరు ద్వారా ఆర్థికరంగంలో సాధించదలచుకొన్న ఫలితాలవంటి

ఫలితాలనే మద్య నిషేధంద్వారా నైతికరంగంలోనూ, అస్పృశ్యతా నివారణద్వారా సాంఘికరంగంలోనూ సాధించ వూనుకొన్నాము. ప్రజల మద్యనిషేధ ప్రచారమున కష్టు తగిలే ప్రభుత్వంలో, ఏదో చెప్పడానికి వీలులేని చెడుగు ఉండి తీరాలి. దీనిని తెలుసుకోవడ మంతకష్టమైన పనికాదు. భారత దేశంలో ఉన్న రెండు ముఖ్యమతాలవారూ, హిందువులూ, మహమ్మదీయులూ కూడా మద్యపానం మంచిది కాదని నిషేధించేవారే. వారి మత సిద్ధాంతాలు తాగుడును ఒప్పుకోవు. ఈ సత్యాన్ని ఆధారం చేసుకొనియే దేశంలో మిత పానోద్యమం నడుస్తూన్నది. కాని కాంగ్రెసు తీరా దీనిని జాతీయ కార్యక్రమంలో భాగంగాచేసి పికెటింగు ప్రారంభించేసరికి, ప్రభుత్వం మాదపైన తోడేలుపడ్డట్టు పడుతూన్నది. కాంగ్రెసు ప్రభుత్వాలు మద్యనిషేధమును ప్రవేశ పెట్టినప్పుడు ముఖ్యంగా ఆయా కుటుంబాలలోని ఆడవాళ్ళే కాక ఆబాలగోపాలమూ సంతోషించారు. కాని కాంగ్రెసు మంత్రులు విరమించిననాటినుండీ, బొంబాయి, బీహారు, మద్రాసు రాష్ట్రాలలో 'ఎప్పటాటే కాటన్నా' అయింది.

అస్పృశ్యతా నివారణ విషయంలోకూడా ప్రభుత్వపై ఖరి ఇలాగే బయటపడింది. హరిజనులను ప్రత్యేక నియోజక వర్గంలో చేర్చాలని బ్రిటిష్ ప్రధాని నిర్ణయించాడు. భారత దేశ మహానాయకుని 'ప్రాయోపవేశము' అవాంఛనీయ నిర్ణయమునుండిహిందూసంఘైకమత్యమును కాపాడగలిగింది. బ్రిటిష్‌ప్రధాని నమాఖ్యను మార్పుచేశాడు. కాని ఇంకనూ

అందులో కొంత విభజన లేకపోలేదు. హరిజనుల దేవాలయ ప్రవేశానికి గల అడ్డంకును తొలగించవలెనని మేము ప్రయత్నించినప్పుడు, అందుకు పరిసర ప్రదేశాలలోని ప్రజలు, తమ అంగీకారమును తెలిపి దేవాలయ ధర్మకర్తలను బలపరచినప్పటికీ, ప్రభుత్వంవారు మధ్యలో జోక్యం కలిగించుకొని, ప్రతిబంధకరంకాని ఆ సంఘసంస్కార శాసనము మొగ్గలోనే తుంచివైచినారు.

'విభజించి పరిపాలించు' అనే మానసికప్రవృత్తితోనూ 'పరిపాలించి విభజించు' అనే రాజనీతితోనూ వ్యవహరిస్తూన్న బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఎదుర్కోవడం ఇండియాకు చాలా చిక్కు సమస్య. వారు గ్రామాలకు పోటీగా పట్టణాలను నగరాలను, ప్రజాసామాన్యమునకు ఎదురుగా ఉన్నత వర్గాలనూ ప్రోత్సాహపరుస్తూ, ఖద్దరుకు సాంఘిక సామరస్యమునకూ, నైతికాభివృద్ధికీ, ఈ అన్ని సామాన్య సంస్కరణములకూ అడ్డుతగులుతూన్నారు. దీనినిబట్టి ఆంగ్ల విద్యాసంపన్నుల వలనగాని, పారిశ్రామిక వర్తక ప్రముఖులవలనగాని, రాజ్యం సాధన అసంభవమని స్పష్టంగా తేలిపోయింది. కాబట్టి మన దృక్పథమును మార్చుకోవలసి వచ్చింది. గ్రామాలలోనున్న ప్రజాసామాన్యంలో జాతీయ చైతన్యమును పెంపొందించి, జాతికి బలం చేకూర్చవలసి వచ్చింది. వట్టి ఉపన్యాసములతోనూ, పత్రికావ్యాసముల తోనూ గ్రామస్థుల విశ్వాసమును చూరగొనజాలము. జనసామాన్యమునకు నిరంతరము సేవచేయడంవలననే వారికి

మనలో నమ్మకం కలుగుతుంది. ఒక్కనాటి వాటికి నమ్మకం కలిగిందంటే, దేశభక్తికి కాంగ్రెసు ఏర్పాటుచేసిన కార్యక్రమమును అక్షరాలా అనుసరిస్తారు. కాని ఇంతమాత్రంతో స్వరాజ్యం చెట్టునుండి ముగ్గిన పండువలె చేతిలో ఊడి పడకపోవచ్చును. కాని మనంచేసిన ప్రజాసేవ స్వరాజ్యమునకు శంఖుస్థాపనమై మన సాంఘిక ఆర్థిక సంస్థలలో ఒక్కొక్క లోపం తొలగింపబడినప్పుడు ఒక్కొక్క అంతస్థు మన స్వరాజ్య సౌధానికి పెరుగుతూంటుంది. ఈ పని ఒక్కనాటిగా జరుగదన్నమాట నిజమే. కాని దీని ఫలితాలుమాత్రం నిశ్చయమైనవీ శాశ్వతమైనవి. ఇది గ్రహించి కాంగ్రెసు, గ్రామాలలోకి గాంధీ సందేశాన్ని తీసికొనిపోయి, మే మిది వరకు చెప్పిన గ్రామనాయకత్వాన్ని స్థాపించింది.

3

## గాంధీ ప్రాచీన వస్తు శాస్త్రజ్ఞుడు

గాంధీ కేవలం ఋషీ, తత్త్వవేత్తా అనడానికిగానీ, ఆర్థిక శాస్త్ర విశారదుడు రాజకీయవేత్తా అనడానికిగానీ, లోక హితాభిలాషి, మానవసేవాపరతంత్రుడూ అనడానికిగానీ, వీలులేదు. ఆయన చరిత్ర, భూ తత్త్వశాస్త్రం, ప్రాచీన వస్తు శాస్త్రం, ఇవన్నీ తెలుసుకొంటూను. తరతరాలనుండీ భూగర్భంలో, బంగారు, వెండి, వజ్రాలగనులవలె అణగిమణగి, చెక్కుచెదరకుండా ఉజ్వలంగా ఉన్న అమూల్య భారతీయ సంస్కృతినిక్షేపములను తవ్వి పైకితీశాడాయన. గాంధీ కేవలం

చరిత్రపరిశోధకులు మాత్రమే అవకాశానికివీలు లేదు. ఆయన ప్రాచీన చరిత్రను పునస్సృష్టి చేసి నూతన వ్యాఖ్యాన మిస్తున్న ఆధునిక చరిత్ర విధాత. ఆయన సృజిస్తూన్న చరిత్ర - తేదీలతో, సంఘటనలతో, రాజులతో రాజవంశాలతో, యుద్ధాలతో, సంధులతో, సంబంధం లేని చరిత్ర - అవన్నీ సత్యాహింసల ముత్కృష్టితములు. "ఆత్మబలముయొక్క లేక ప్రేమశక్తియొక్క ఒడిదుడుకులు లేని కార్యవిధానమున కష్టం కలిగించిన విఘ్నపరంపరలను వివరంగా చూపే చరిత్ర" అది. మేము దానిని "శరీరమునకూ రాగద్వేషాలకూ సంబంధించిన చరిత్ర" అంటాము. భావోద్వేగములకు భోగలాలసత్వమునకూ లోనుగాక, సుశిక్షితచిత్తంతో ఆత్మనిగ్రహం కలిగి ఉండడమే, సభ్యతా, సంస్కృతీ అని చెప్పవచ్చును. వేద వేదాంగములు, శాస్త్రషడ్దర్శనములు, ఇతిహాసపురాణములు, యోగపురుషులగాథలు, మహర్షుల కథలు, మతప్రవక్తల తత్త్వవేత్తల, మహావీరుల స్వధర్మార్థత్యక్తజీవనుల చరిత్రయే, అత్యుదార భారత చరితము. ఈ జాతీయ జీవన నిష్కళంక తత్త్వప్రబోధకులలో గాంధీ ఉత్తమోత్తముడు. అతి నవీనుడు. గాంధీ యెంత పరిపూర్ణుడో ఆయన ఉపదేశా లంత ఉదాత్తములు. అయినప్పటికీ తానొక సామాన్య మానవుడని గాంధీఅభిప్రాయం. ఆయన తన సమానులలో ప్రథముడు. కాని క్రియారూపమైన సత్య మనదగిన యుగయుగాలనాటి సంస్కారమాయనకు లభించింది. దానిని సత్యాహింసల తత్త్వాన్వేషణకు మార్గదర్శకంగా ఉపయోగించుకొంటూన్నాము. కనుకనే

"గాంధీజీ మనే కొత్త మతాన్ని ఆచరణలోకి తెచ్చాడని" ఎడ్వర్డ్ థాంప్సన్ ఆయనను గూర్చి అన్నారు. ప్రపంచ మహాపురుషులు కొందరు ఆయన సహచరత్వమును కోరినవారున్నారు. గాంధీ రెండవ రౌండు టేబిలు మహాసభకు ఇంగ్లాండుకు పోయినప్పుడు ఆహ్వానింపబడి అనేక పాఠశాలలను, విద్యాలయాలను, సెటిల్ మెంట్లను, ఫ్యాక్టరీ సెంటరులను, క్రైస్తవ దేవాలయాలను ధర్మసంస్థలనూ దర్శించారు. డాక్టర్ మేరియా మోంటెస్సోరీ పాఠశాలలోని పిల్లలు ఆయనను ఆహ్వానించి గౌరవించారు. అనేకమంది పెద్దకుటుంబాలలోని స్త్రీలు చలిగా ఉన్నప్పటికీ ఆయన ఉదయ ప్రార్థనలలో పాల్గొన్నారు. లండను తూర్పుకొసలో ఉన్న ఆయనబసకు కింగ్స్లీ హాలుకు, తండోపతండాలుగా ప్రేక్షకులు వచ్చేవారు. శాంకీ ప్రభువు తన ఎడమ ప్రక్కను ఆయనకు మొదటి స్థానమిచ్చి, అత్యంత గౌరవంతో చూచారు. 'గాంధీ విశేషంగా అంతర్వాణి ఆదేశానుసారంగా నడుచుకొంటున్నట్లు తోస్తుంది' అన్నాడాయన. గిల్బర్టుముర్రే, సర్ మైకేల్ శాడ్లర్, పి. సి. లయాన్ వంటి విద్వాంసులాయనను మూడు గంటలసేపు తర్కించారు. ఆయనమాత్రం నిరాకులంగానే ఉన్నారు. రోములలో, ఇటలీరాజు కనిష్ఠకుమార్తె ఆయనను ప్రత్యేకంగా సందర్శించింది. 'నాజీవిత తత్వంలోను, నాజీవిత విధానంలోనూకూడా గాంధీ ప్రభావం చాలా ఉన్నది.' అన్నాడు హార్వర్డ్ కళాశాలాధ్యాపకుడు డాక్టరు రూఫస్ యమ్. జోన్సు (పెన్సిల్వేనియా). ఇంగ్లాండురాజు, గాంధీని

ఆయనమామూలు దుస్తులతోనే ఆహ్వానించి సత్కరించారు.
సీమలోనిపేదలు ఆయన చుట్టూమూగారు. లంకాషైరు లోని
నూలువడికేవారు, బట్టలు నేసేవారు, గుమికూడి తమవస్త్రాలను
ఇండియాలో కొనిపించవలసిందని కోరారు. ఎవరికితగినట్లుగా
వారికాయన ప్రత్యుత్తరమిచ్చారు. బకింగ్‌హాం మందిరంలో,
ఆయన ఆస్థాన మర్యాదలను మన్నించి రాజుగారితో ప్రతి
వాదంచేయలేదు. మాంచెస్టరులో పనిలేక బాధపడుతు
న్నవారితో మంచిమాటలాడారు. "సోక్రటీస్ తరువాత ఇంత
ఆత్మనిగ్రహం కలిగిన మనిషిని ప్రపంచం చూడలేదు" అని
ఎడ్వర్డుథాంప్సన్ అన్నమాటలో ఎంత సత్యమున్నది!

గాంధీకిమతం ప్రధానమని మేమిదివరకే అనేకసార్లు
చెప్పిఉన్నాము. అయితే ఆయనమతము ఇతర మతాలన్ని
టినీ సమానంగా మన్నిస్తుంది. అహింస సత్యముయొక్క ఆత్మ
అనీ, అది ఉత్తమోత్తమమైన మతమనీ, గాంధీ అనేకసార్లు
ఉపదేశించారు. ఈ దిగువ వాక్యాలలో ఆయన ధర్మోపదేశం
సంక్షేపించబడింది.

"నీవు నీ ప్రేమను అనగా అహింసను నీ శత్రువనుకొన్న
వానిపైన మాసిపోనంతగా ప్రసరింప చేసినట్లయితే, అతను
మరల అటువంటి ప్రేమను నీ పైన చూపించి తీరుతాడు."
ఇటువంటి మత విశ్వాసం గల గాంధీని గూర్చి ల్యూయిలిన్
పోదిన్ 'అవమానించినా, ప్రహరించినా, బెదిరించినా, గుద్దినా
చిట్టచివరకు దర్బార్ తెల్లమూక ఆయనను దాదాపు ప్రాణా
వశిష్టుణ్ణిగా చేసినా, ఆయన ఆగ్రహ పడలేదు' అని

వ్రాశాడు. అంత చిన్న శరీరంలో అంత పెద్ద ఆత్మ ఉన్నందుకు నిజంగా ప్రపంచం ఆశ్చర్యపడక తీరదు. గాంధీని అనేకమంది పాశ్చాత్య మతోపదేశకులు పూజిస్తారు. మిస్. మాడేరాయిడెన్ "నేను ఎరిగిన శ్రేష్ఠమైన క్రైస్తవుడొక హిందువు" అన్నది ఆయననుగూర్చి. "ఒకే ఒక క్రైస్తవుడుండేవాడు. ఆయన శిలువమీద మరణించాడు." అన్న నీషే (Neitzche) వాక్యానికి అనుకృతి తెలుపుతూ, ఇంగ్లాండు దేశీయుడు ల్యూయిలిన్ పోవిస్,(Llewylyn powys) నీషే ఇంతవరకూ జీవించి ఉన్నట్లయితే, "పూర్వమొకే ఒక క్రైస్తవుడున్నాడు ఆయన శిలువమీద మరణించాడు. ఇప్పుడూ ఒకే ఒక క్రైస్తవుడున్నాడు. ఆయన సేవగ్రామంలో జీవించియే ఉన్నాడు." అని వ్రాసి ఉండేవాడన్నాడు.

క్రీస్తు మరణించిన 1900 సంవత్సరాలకు క్రైస్తవ నాయకులలోని పలుతావులనుండి వారొక యాత్రికులుగా వచ్చి గాంధీకడ జ్ఞానోపదేశం పొందకోరడం కంటె అద్భుత దృశ్యమే మున్నది? అంతర్జాతీయ యుద్ధాలలో చిక్కుకొన్న క్రైస్తవ జాతులకు, క్రీస్తు ఉపదేశాన్ని ఎలా వర్తింపచేయవలెనో, ఆయన దగ్గరనుండి తెలుసుకోగోరుతున్నారువారు. "క్రైస్తవుడ నయిన నేను అంతర్జాతీయ శాంతికి ఎలా తోడ్పడగలను? శాంతి స్థాపనకు అహింస ఏవిధంగా ఫలప్రదం కాగలదు?" అని ప్రశ్నిస్తే "మీరు క్రైస్తవులుగా అహింస జయప్రదం కావడానికి ఎంతో పని చేయవచ్చును.

అయితే మీరు మీ సర్వస్వమూ వదులుకోవడానికి సంసిద్ధంగా ఉండాలి. పెద్ద రాజ్యాలు ఆయుధ విసర్జనం చేస్తేనే గాని శాంతి లేదు ప్రపంచానికి. ఇటీవల సంఘటనలనుచూస్తే పెద్ద రాజ్యాలవారే పని చేయకతప్పదన్నట్లు కనిపిస్తోన్నది.'' "అహింసను యాభై సంవత్సరాలు ఎడతెగకుండా ఆచరణలో పెట్టిన నాకు, అహింస వలననే మానవలోకమునకు రక్షణ ఉందనే విషయం, మరింత ఎక్కువ ప్రకాశవంతంగా ప్రత్యక్షమౌతూన్నది నేడు. బైబిలులోని సారాంశమదేగదా! అథమం బైబిలునుండి నేర్చుకొన్నదది.'' అని ప్రత్యుత్తరమిచ్చాడు గాంధీ. గాంధీ నల్లవాడు కావడంచేత ఆయనను అవమానించి ఒకసారి మూలస్టేషనులో రైలునుండి దింపివేసినప్పుడు చలితో బాధపడుతూ, తెల్లవాళ్ళకింద ఉన్న క్రైస్తవ దేశంలో తనకు జరిగిన ఈ అపచారాన్నిగూర్చి తీవ్రంగా ఆలోచించినందువలన సత్యాగ్రహం ఆయనకు స్ఫురించింది.'' ఆయన మొట్టమొదట ఈ సిద్ధాంతాన్ని తన భార్య పెంకెతనమును మాన్పడానికి ప్రయోగించి చూచాడు. తరువాత స్థానిక కష్టాలకు నివారణోపాయంగా చాంపరాన్, బోర్సాదు, కైరాలలో దానిని ఉపయోగించాడు. అహమ్మదాబాదు మిల్లుకూలీల కోరికలను మన్నింపచేయడానికి ప్రాయోపవేశం ప్రారంభించినప్పుడది ఆయన చేతులలో రాటుతేలింది. పిదప జాతీయ సమస్యల విషయంలో క్రమక్రమంగా దేశముయొక్క చిట్టచివరి పొలిమేరలకుకూడా దాని ప్రయోగాలను విస్తరింప చేశాడు.

ఈ అన్ని సందర్భాలలోనూ ఆయన కొంత విజయం పొందు తూనే ఉన్నాడు. కాని ప్రపంచం మాత్రం ఈ సిద్ధాంతాన్ని ఒక రాజకీయ విధానమనిగానీ, శక్తి ప్రదర్శనమనిగానీ గూఢార్థ భాషణమనిగానీ మతవ్యామోహమనిగానీ అనుకోక శాస్త్రీయ శిల్పంగా భావిస్తూన్నది. ఆయన చికాగోకో లండనుకో దయచేసినట్లయితే, ఆయన పాదాలకడ క్రైస్తు ఆ దేశాలను గ్రహించ కోరుతూన్నాడనడంకంటె క్రైస్తవ పీఠాధిపతులుగానీ క్రైస్తవ మతోపాసకులుగానీ ఆయనను ఎక్కువగా ప్రశంసింప గలిగిన దేమున్నది? ఆయనకు మానవదృష్టికి గోచరంగాని ఒకానొక మహోన్నత శక్తిలో అచంచల విశ్వాసమున్నది. అందువలన పేదరికమును బుద్ధి పూర్వకంగా స్వీకరించి, అనంతమైన ప్రేమతో నిరంతర మానవసేవ చేయగలుగుతూన్నాడు. కనుకనే ప్రపంచ గురు పీఠ మాయనకు లభించినది. గాంధీ భూమండలానికి అధిపతి అయినాడు - కేవలం ఆయన వినయసంపన్నత వలన అయి నాడు. ఆయనకు ప్రాపంచకాధికారమేమీ లేదు. కాని అధి కారంగల వానివలె ఆదేశిస్తాడు. లక్షలాది ప్రజలాయన అడుగుజాడల ననుసరించడంవలన ఆయనకంత అధికారమూ ఉన్నట్లే. గాంధీ యెన్నడు ప్రతిష్ఠకు లొంగిపోలేదు. 1919లో సత్యాగ్రహాన్ని ప్రారంభించడంలో హిమాలయ పర్వత మంత ప్రమాదం చేశానని అంగీకరించాడు. తన రాజకోట ప్రాయోపవేశం హింసాకళంకితమైనదని ఒప్పుకొన్నాడు. తన లోపాలను ఒప్పుకోవడమే కాకుండా తన అనుచరుల తప్పు

లను బయటపెట్టడంలోకూడా ఆయన ఎన్నడూ సందేహించ లేదు. మన దేశములో అప్పుడప్పుడు జరిగే కొట్లాటలను దౌర్జన్యాలను ఎప్పటికప్పుడాయన విమర్శిస్తూ ఖండిస్తూనే ఉన్నాడు. జలియన్ వాలా బాగ్ మరంతములకు కారణ మైన అమృతసరపు మూకల అరాచకత్వము, 1922 ఫిబ్ర వరిలో చౌరీచౌరాలో ఒక సబిన్స్పెక్టరూ 21 మంది పోలీసుజవానాలతో సహా పోలీసుస్టేషను తగులబెట్ట బడిన ఘోరకృత్యము, కోహాట్, ముల్తాన్, సహారన్పూరు, కాశీ, కాన్పూరు, కలకత్తా, ఢిల్లీ, బెంగుళూరు, గుల్బర్గా, సికందరాబాదు, అల్లహాబాదు, బొంబాయి మొదలయిన అనేక ప్రదేశాలలోనూ, ఇటీవల బన్ను, సుక్కూరు పట్టణ ములలోనూ జరిగిన హిందూ మహమ్మదీయ కొట్లాటలు, ఈ అన్నీ ఆయన అసందిగ్ధ విమర్శనలకు గురియైనవి. 1919 లో అమృతసరం కాంగ్రెసువిషయ నిర్ధారణసభ, మూకల దౌర్జన్యాన్ని నిరసిస్తూ తీర్మానించడాని కంగీకరించలేదు. అప్పుడా తీర్మానంచేస్తేనేగాని తాను కాంగ్రెసులో ఉండ నన్నాడు గాంధీ. అందువలన ఆవిషయ నిర్ధారణసభ తననిర్ణ యాన్ని మార్చుకోక తప్పిందికాదు. ఆలీ సోదరులు, 1921 లో హింసాహింసలకు మధ్యస్థంగా ఉండే ఉపన్యాసం చేసి నప్పుడు, వారికి హింసా ఉద్దేశం లేదని ప్రకటన చేయ మన్నాడు గాంధీ. ఆయన ఎన్నడూ శత్రువుల కష్టాలవలన ప్రయోజనం పొందవలెనని ఆలోచించడు. అంతేకాదు. తన అనుచరులలోని లోపాలను ప్రకటించిన యెడల శత్రు

వృత్తులు లోకువ అవుతాయని కూడా ఆలోచించడు. 1934 ఏప్రిల్ 7వ తేదీన శాసనోల్లంఘనమును నిలిపివేస్తూ ఆయన చెప్పినమాటలు గమనించండి:-

> 'ప్రజాసామాన్యం సత్యాగ్రహ సందేశాన్ని సరిగా అర్థం చేసుకో లేదని నా అభిప్రాయం. దీనికి కారణం వారికది చేరడంలోనే కొంత కల్తీతో చేరింది. ఆధ్యాత్మిక మార్గంద్వారా ఆత్మిక సాధనాల ప్రయోగాలను బోధించబడేటప్పుడు వాటిశక్తి తగ్గిపోతుంది. కాబట్టి ఆత్మిక సందేశాలు వాటంతటవే వ్యాపించాలి.'

గాంధీ తన అనుచరుల పొగడ్తలేగాక తన విమర్శకుల స్తోత్రములను, ఆమోదములనూ కూడా పొందగలగడం చాలా అదృష్టం. ఆయనను శ్లాఘించినవారిలో యోగిపుంగవులు, తత్త్వవేత్తలు, మతాధిపతులు ఇంకా ఎందరెందరో ఉన్నారు. అయితే ఆయనతో పాటు పోరాటాలలో దుమికిన అనుచర వర్గమున్నూ, నిష్పాక్షిక సాక్షీభూతులుగా ఉన్న వారున్నూ ఆయనపైన ప్రశంసావాక్యాలను గుప్పించడ మొక ఎత్తు. ఇండియా ప్రభుత్వం బహిరంగంగా ఆయన గొప్పతనాన్ని శ్లాఘిస్తూ ప్రభుత్వ పత్రికలలో ప్రకటించడం మరొక ఎత్తు.

ఇండియా గవర్నమెంటువారు ప్రకటించిన 1919 ''ఇండియా'' లోని ఈదిగువ వాక్యాలను పరిశీలించండి:-

> గాంధీజీ ఉన్నతాదర్శములూ, సంపూర్ణ స్వార్థత్యాగబుద్ధీకల టాల్‌స్టాయి వర్గములోని వాడని ప్రతీతి. ఆయన దక్షిణ ఆఫ్రికాలో భారతీయుల పక్షాన నిలబడ్డనాటినుండి, సర్వసంగ పరిత్యాగిగా

ప్రతిఘటించిన మహాత్ముని రోజుల్లో, ప్రాచ్య దేశీయులు సంప్రదాయ
సిద్ధంగా చూసే యూరోపియనుగానూ హిందూ దేశపు నాయకుల
చూపుతూనే వున్నారు. ఈయన విషయంలో ప్రత్యేక విశేషం కూడా
ఉన్నది. ఈయనను శ్లాఘించేవాళ్లో పలువురు ప్రత్యేకించి మతమునకు
చెందినవారు ఈయన మాత్రమే నాకు విశ్వాసపాత్రుడు అన్నారు. ఈయన
అహింసా వ్రతాదులలో అనగా నైతిక సిద్ధాంతాలు అనేక సాంఘిక సమ
స్యలతో సన్నిహిత, సంబంధం కలిగి పనిచేస్తున్నారు. ఒక వ్యక్తి గాని
ఒక వర్గంగాని పీడింప బడుతున్నట్లు తోచినప్పుడు, ఆయన కత్తి
దూయక మానడు. అందువలననే భారత దేశంలోని ప్రజాసామాన్యానికి
ఆయన అంటే అంత ప్రేమ. బొంబాయి రాజధానిలోని పట్టణములలో
గాని గ్రామములలోగాని ఆయన పలుకుబడి అప్రతిహతం. ఆయనను
అక్కడ దైవంగా కొలుస్తారని చెబితే ఎంతమాత్రమూ అతిశయోక్తి
కాదు. భౌతిక శక్తి కంటె ఆత్మశక్తి బలవత్తరమైనదని ఆయన విశ్వాసం.
ఆ విశ్వాసంతోనే, తాను దక్షిణ ఆఫ్రికాలో జయప్రదంగా
ప్రయోగించిన సాత్విక నిరోధమును, రౌలట్టు శాసనానికి వ్యతి
రేకంగా ప్రయోగించడం ధర్మమని ఆయన అభిప్రాయపడ్డాడు.
రౌలట్టు చట్టం అంగీకరింప బడినట్లయితే తాను సత్యాగ్రహం
ప్రారంభింపబోతున్నానని ఫిబ్రవరి 24 వ తేదీని ఆయన ప్రకటించాడు.
గాంధీజీ భౌతిక బలప్రయోగమును స్పష్టంగా ఖండించాడు. సివిల్
చట్టాలను శాంతంగా ఉల్లంఘింపజేసి, ప్రభుత్వాన్ని రౌలట్టు శాసన
మును రద్దు చేసే టట్టుగా నిర్బంధించ వలెనని ఆయన విశ్వాసము.
మార్చి 18 వ తేదీని రౌలట్టు శాసనమును గూర్చి ఆయన ఈ క్రింది
ప్రమాణ పత్రమును ప్రకటించాడు. 1919 ఒకటో నెంబరు
ఇండియన్ క్రిమినల్ లా అమెండుమెంటు బిల్లున్నూ 1919 రెండో
నెంబరు క్రిమినల్ లా ఎమర్జన్సీ పవర్సు బిల్లున్నూ- అధార్మికములు

న్యాయమ్ము, స్వాతంత్ర్య సిద్ధాంత విరుద్ధములు. సాధారణ వ్యక్తి స్వాతంత్ర్య వినాశన కరములు. కాబట్టి అవి యావద్భారత దేశ క్షేమమునకూ ప్రభుత్వ క్షేమమునకూ కూడా భంగకరములు. ఇది మా దృఢ విశ్వాసం. రెండు బిల్లులూ శాసనం చేయబడినట్లయితే, అవి రద్దయ్యే అంతవరకూ శాసనములనూ, మరియు నియోగింపబడే కమిటీ వారిని ఈ విషయంలో తోచిన ఇతర శాసనములనూ శాంతంగా ఉల్లంఘించగలమనీ, పోరాటంలో సత్యాన్ని అక్షరాలా అనుసరిస్తూ, ప్రాణానికీ జీవానికీ ఆస్తికీ ఏ విధమైన హాని కలిగించమనీ కూడా ఇందు మూలంగా ప్రమాణం చేస్తున్నాము.

గాంధీ ఎల్లప్పుడూ మన పురాణాలలో వర్ణించబడిన ధర్మయుద్ధమే చేశాడు. కనుక ఆయనను శత్రువులు ఆక్షేపించక పోవడంలో ఆశ్చర్య మేమున్నది? కాని మిత్రు లాయనను అనేకవిధాల ఆక్షేపించారు. అందువల్లనే గిల్బర్డు ముర్రే "అంతజన సమూహంపైన నిరాయుధుడైన ఒక మనిషికి అటువంటి ఆధ్యాత్మికాధికారం ఉండడమే ఆశ్చర్యం. అందులో హింసను త్యజించడం పైగా శత్రువులకు కష్టకాలంలో సహాయం చేయడం, మానవమాత్రుడుగా తాను చేసిన తప్పును ఒప్పుకోవడం, ఇవన్నీ తెలిసిన ప్రపంచం ఆయనను స్తుతించక తీరదు"

గాంధీ విజయం కొలబద్దతో కొలవదగినదికాదు. సత్యాగ్రహంలో జయాపజయములు సంబంధవాచకములు. గీతాశాస్త్ర ప్రకారమవి గణింపదగినవే కావు. విజయం యావత్తూ కాలంపైన ఆధారపడి ఉంటుంది. మన ఉద్యమం మంచిదనే

విశ్వాస ముండడమే మనకు ముఖ్యం. అటువంటి విశ్వాసం తోనే ఆయన అన్ని పోరాటాలలోనూ అగ్రగామియైనాడు. రాజీపడడంలో ఆయన మధ్యస్థుడుగా ఉంటాడు. "జాతి యావత్తూ ఒకే అభిప్రాయాన్ని అనుసరించవలెనంటే ఒక్క నాటిగా జరుగదు. క్రమక్రమంగా జరగాలి. ప్రాచీనకాలంలో ఒక చోటినుండి మరొక చోటికి కదలిపోతూ ఉండే కొండ గుంపుల గమనంవలె ఉంటుంది జాతినడక. సంసారపు చిక్కులు, సామానులు ఎన్నో ఉంటవి. అనుకోని కొత్త యిబ్బందు లనేకం రావచ్చు. ఒకప్పుడసలు ప్రయాణమే ఆగి పోవచ్చు. లేదా మొట్టమొదట ఉద్దేశించిన తోవనుగాక మరొక తోవకు పోవలసి రావచ్చు. ఏదైనా అభ్యంతరం కలగడంవలన గానీ లేదా తాత్కాలిక సౌకర్యము నపే క్షించిగానీ, అనుకొన్న గమ్యస్థానానికి చాలా యివతలనే నిలచిపోవచ్చు. నడిపేవాళ్ళు లేకనో, ఐక్య సంకల్పం లేక పోవడం వలననో అసలు గుంపే చీలిపోవచ్చు. కాని అను భవమునుబట్టి చూస్తే నడిపేనాయకుడు మాత్రం ప్రతి ఉద్య మంలోనూ, చివరగానీ మధ్యగానీ ఉండవలెగాని ముగను ఉండకూడదని గ్రహించాలి. మధ్యస్థంగా ఉండగలిగిన వాని నాయకత్వమే శాశ్వతంగా ఉంటుంది." ఈ విషయాలను గాంధీ అహింసా పోరాటాలలో గమనించ లేదనడానికి ఆయన వాటన్నిటిలోనూ అగ్రగామిగా ఉండడమే సాక్ష్యం. కాని పోరాటాల అనంతరంవచ్చే రాజీలలో ఆయన దీనిని గమ

నిస్తూనే వచ్చారు. అందువలననే ప్రతిరాజీలోనూ ఆయన మధ్యస్థుడుగానే ఉన్నారు.

గాంధీ మాతృదేశ విమోచనంకోసం జన్మించిన అవతార పురుషుడు. భయమునుండీ, కోరికనుండి ముందుగా ఆయన విముక్తిపొందినారు. హింసలోనూ యుద్ధంలోనూ చీకాకు పడుతూన్న లోకంలో నేడాయన యేసుక్రీస్తు వంటి వారు.

హిందూమతంలోని నాలుగు వర్ణములు, నాలుగు ఆశ్రమములు. ఆయన జీవితంలో న్యాయ్య సంయోగమును పొందినవి. భక్తిజ్ఞాన కర్మలకు కేంద్రస్థానమయిన త్యాగమే ఆయనకు మోక్షసాధనము. ఆయన మహర్షి. కాని కొండలు, నదులు, సముద్రతీరాలు, అడవులూ కాదు ఆయన తపోభూములు. జనసంకీర్ణమైన ప్రపంచంలో శౌచ దాన ధర్మ దయా క్షమా గుణాలతో తాపస జీవితమును గడుపుతూన్నా డాయన.

చెడుగును జయించేటందుకు చేసే యుద్ధాలలో ఆయనకు సత్యాం వ్యూహాంః అహింస సాధనము. కాబట్టి ఆయనకు సాధన ఫలితాలు రెండూ ఒక్కటే. జయాపజయములు సమాన సుఖదుఃఖాలక్షేపములు. ఆయన ప్రజల ఆత్మలను విజృంభింపచేస్తారు. అందువల్లనే ఐరోపాఖండపు యుద్ధనాయకులను, సుప్రసిద్ధ రాజకీయవేత్తలను, ప్రపంచ ఖ్యాతిగడించిన కవులను, మతోపదేశకులను ఆకర్షించ గలిగినారు. ఆయన సహచరు లాయన సిద్ధాంతాలను దివ్యవిశ్వాసంతో గ్రహించి

జనసామాన్యమునకు లౌకిక హేతువాదముతో ప్రచారం చేస్తారు. ఈ విధముగా సత్యాహింసలపైన ఆధారపడిన నూతన సత్యాగ్రహ కార్యక్రమాన్ని ఆయన సాగించ గలిగినారు.

గాంధీ అహింసా రూపమెట్టిదో వివరించవలసిందని అడుగుతూంటారు కొందరు. అహింస ఒకమార్గం; అంతే కాని గమ్యస్థానంకాదు. అహింస ఒక దృక్పథం అంతేకాని సిద్ధికాదు. సత్యాగ్రహంలో వెలుతురే కాని చీకటి ఉండదు. అసత్యం ఉండదు సత్యమే ఉంటుంది. కసికి స్థానంలేదు ; క్షమాగుణమే ఉంటుంది: గాంధీ చేస్తూన్న భారతజాతీయతా వస్త్రమునకిది పడుగు, రాజకీయాలు పేక. ఇకముందు రాజకీయమును సాహస క్రియగా భావించకూడదు. అది ఒక మతం, ఒక తత్వశాస్త్రం, ఒక భౌతిక శాస్త్రం, ఒకశిల్పం, ఒక పూజాపద్ధతి, ఒక సేవావిధానం.

గాంధీకి 71 యేండ్లు నిండినవి. ఆయనలో ఉత్తమ మానవ లక్షణాలెక్కువగా కనిపిస్తవి. ఆయన క్రియాశూరుడు. బుద్ధిశాలి, హాస్యవినోదచతురుడు, ఋజువర్తనుడు, సర్వతోముఖ ప్రజ్ఞాశాలి. వేయేల ఆయన పూర్ణపురుషుడు. ఆయన పదవ అవతారం. అన్ని అవతారాలలోకి ఉత్తమోత్తమమైన అవతారం. పునరుద్భవించిన బుద్ధుడు. పునర్జన్మ మెత్తిన యేసుక్రీస్తు; గీతలోని స్థితప్రజ్ఞుడు. ఉపనిషత్తులలోని పూర్ణపురుషునికి అత్యంత సన్నిహితుడు. ఆయన యుగంలో జీవించి ఉన్నవారు అదృష్టవంతులు. ఆయన సిద్ధాంతాలను జీర్ణించుకొన్న

వారు రెంటింతల అదృష్టవంతులు. ఆయనతత్వ ప్రచారం చేసినవారి అదృష్టం చెప్పనే అక్కరలేదు గాంధీ మృతి పొంద వచ్చును. గాంధీజం శాశ్వతంగా ఉంటుంది, కాదు, గాంధీజం మరణించవచ్చును. గాంధీ చిరంజీవి.

# అనుబంధము ౧.

## గోసంరక్షణ

మానవ పరిణామంలో గోసంరక్షణ అద్భుత లోకోత్తర విషయమని నా అభిప్రాయం. మానవుణ్ణి అది తన జాతి భేదాన్ని అతిక్రమింప చేస్తుంది. ఆవు అంటే మానవలోకానికి దిగువనున్న యావత్తు ప్రపంచము అని నా అర్థం. ఆవు ద్వారా మానవుడు సర్వజీవైక్యభావమును పొందవలెనని ఆదేశింపబడినది. ఆవుకే ఎందువలన దైవత్వమాపాదింపబడినదో నాకు స్పష్టంగా అర్థమవుతూన్నది. భారత దేశంలో గోవు సాహచర్యం ఉత్తమోత్తమము. ఆమె ఐశ్వర్య ప్రదాత. అది పాలీయడమే కాదు వ్యవసాయానికి సావకాశం కల్పించింది. ఆవు కరుణాగీతం. ఆ సాధు జీవిలో కరుణ ముద్రితమై ఉంది. కోట్లకొలదీ భారత ప్రజలకది మాతృదేవి. గోసంరక్షణ అంటే దేవుడు సృజించిన నోరులేని యావత్తు జీవలోకాన్నీ సంరక్షించడమన్నమాట. ఆ ప్రాచీన ద్రష్ట యెవ్వడోగాని ఆయన లోకసంగ్రహావృత్తం ఆవుతో ప్రారంభమయింది. నోరులేని జంతువులను గూర్చి చేసిన ప్రబోధము మరింత శక్తివంతంగా ఉంటుంది. గోసంరక్షణ, హిందూమతం ప్రపంచాని కర్పించిన పారితోషికం. గోసంరక్షకు లున్నంత కాలమూ హిందూమతం సజీవంగా ఉంటుంది—

(యంగిండియా అక్టోబరు 6, 1921.

నేనిదివర కీపుటలలో వివరించినట్లుగా మానవ లోకానికి దిగువమెట్టులోనున్న ప్రపంచంలో అవుకంటే పరమపవిత్రమైన జాతి మఱొకటి లేదు. ప్రాణులలో అగ్రస్థానమలంకరిస్తూన్న మానవుడు, తనకు దిగువ మెట్టులోనున్న యావత్తు జీవలోకము నెడలను న్యాయ్యంగా ప్రవర్తించవలెనని, ఆవు మన అందరికీ అడుగుతూన్నది. అది మనతో తన కళ్లతో మాట్లాడుతూన్నట్లు కనిపిస్తుంది. (పాఠకులు వాటిని దృష్టితో చూడవలసి కోరిక) "మమ్ములను చంపి మా మాంసమును భుజించేటందుకు గానీ, మమ్ములను మఱొక విధంగా హింసించే టందుకుగానీ నీ వేర్పాటు కాలేదు. మాకు మిత్రముగానూ రక్షకునుగానూ ఉండాలి నీవు" అంటూన్నది చూడండి! (యంగిండియా జూన్ 26, 1924)

గోసంరక్షణకు కావలసిన నియమాలను ఇది వరకు నేను వ్రాసినవి యిక్కడ ఉదాహరిస్తూన్నాను.

1. అటువంటిసంస్థ ప్రతిదీ బహిరంగ ప్రదేశంలో ఉండాలి. కావలసినవి సమృద్ధిగా దొరకాలి — అనగా పశువులకు కావలసినంత పచ్చిక పెరిగేటందుకు, అవి కాలికొద్దీ తిరిగే టందుకూ వేలకొలదీ ఎకరాల భూమి ఉండాలి. ఈ గోశాలల పైన నాకు యాజమాన్యం ఉంటే, ఇప్పుడున్న భూములలో చాలా భాగం లాభానికమ్మివేసి, దగ్గరలోనే తగిన పొలాలు కొంటాను. మొదట చేర్చుకొనేటందుకు పనికివచ్చే కొన్ని చోట్లు మాత్రం అమ్మకుండా అలాగే ఉంచుతాను.

2. ప్రతి గోశాలా ఆదర్శ ప్రాయమైన (Dairy) క్షీరోత్పత్తిశాల గానూ తోళ్లు ఊనే పరిశ్రమాలయం గానూ ఉండాలి. చచ్చిపోయిన ప్రతి పశువు తలకాయను నిలవచేసి శాస్త్ర ప్రకారం ఉపయోగంలోకి తీసికొని రావాలి. తోలు, బొమికలు, పేగులు, అన్నీ కూడా ఉపయోగ పడేటట్టు చూడాలి. చచ్చిన పశువుల చర్మం నేను పవిత్రంగా భావించి ఉపయోగిస్తాను. కటికి వాళ్లు చంపిన పశువుల చర్మం మానవుల ఉపయోగమునకు, అధమం హిందువుల ఉపయోగానికి పనికి రాదని నా భావం.

3. గోమయ గోమూత్రములను చాలా గోశాలలో పారవేస్తున్నారు. ఇది క్షమించరాని తప్పిదం.

4. గోశాల లన్నీ శాస్త్రీయ పద్ధతుల ప్రకారం, నడపబడాలి.

5. జాగ్రత్తగా వ్యవహరిస్తే ప్రతి గోశాలా స్వయం పోషకంగా ఉండడానికి వీలుంది. ప్రజల దగ్గరనుంచి తీసికొన్న చందాలను దానిఅభివృద్ధికి ఉపయోగించవచ్చును. ఈ సంస్థల నుంచి లాభంతీసే ఉద్దేశం ఉండనే కూడదు. లాభాలుతో, అంగ వైకల్యం పొందిన పశువులను ఎత్తు పడిన పశువులను, కటికి దుకాణాలకు పోతూన్న పశువులనూ కొనడానికి ఉపయోగించాలి.

6. గోశాలలు, బఱ్ఱెలూ, మేకలూ వగైరాలను కూడా చేర్చుకొన ప్రారంభించినట్లయితే ఈ పని చాలా కష్టమవుతుంది. హిందూదేశంలో అందఱూ శాకాహారులైతేనే గాని

గొఱ్ఱెలూ మేకలూ కటికివాని కత్తికి ఎఱ కాకుండా ఉండవని నా అభిప్రాయం. ఇందుకు భిన్నంగా జరగడం నాకెంతో యిష్టం. గేదెపాలు తాగకుండా ఆవుపాలే త్రాగవలెననే నియమం పెట్టుకొంటే, గేదెలను రక్షించవచ్చును. కాని బొంబాయిలో ఏందువల్లనో ఆవుపాలకు బదులుగా బఱ్ఱెపాలు తాగడం అభ్యాసం. బఱ్ఱెపాలకంటే ఆవుపా లెక్కువ శ్రేష్ఠమని వైద్యులంతా ఏకగ్రీవంగా ఒప్పుకొంటూన్నారు. పాల విషయం బాగా తెలిసినవారు, జాగ్రత్తగా వ్యవహరిస్తే ఆవుపాలను ఇంకా శ్రేష్ఠంగా చేయవచ్చునంటూన్నారు. ఆవులనూ గేదెలనూ కూడా కాపాడవచ్చునని నా అభిప్రాయం. బఱ్ఱెలు అభివృద్ధి కాకుండా ఆపివేసినట్లయితేనే ఆవు సంరక్షింపబడుతుంది. ఎక్కువ విస్తీర్ణమైన వ్యవసాయానికి బఱ్ఱెజాతి పనికి రాదు ఈ జాతి ఇంకా అభివృద్ధి కాకుండా జాగ్రత్తపడితే ఉన్నంత వరకూ రక్షించ డానికి వీలవుతుంది. ఆవులనుగానీ, బఱ్ఱెలను గానీ అభివృద్ధి అయ్యేటట్టు చూడడం మతంలో భాగం కాదు. మన ఉపయోగం కోసం అవి అభివృద్ధి అయ్యేటట్లు చేస్తూన్నాము. బఱ్ఱెల సంఖ్య పెరిగేటట్లు చూడడం, ఆవులమెడలనూ బఱ్ఱెల మెడలనూ కూడా క్రూరంగా ప్రవర్తించడమే. హిందూగొల్లవాళ్ళు దున్నపోతులను మేపడం గిట్టుబాటుకాదని చిన్నప్పుడే వాటిని క్రూరంగా చంపివేస్తారు.ఇది ఇప్పుడుకూడా జరుగుతూన్నది.జీవహింసైషులీ సంగతి గమనించాలి. ఆవునూ దాని సంతానాన్ని కాపాడడమొక్కటే సాధ్యమైనపని. అందుకోసం హిందువులు, గో

వ్యాపారంపైన గానీ, గోక్షీరం వగైరావ్యాపారంమీద గాని వచ్చేలాభాలను వదులుకోవాలి. అది చేయలేకపోతే ఈపని జరుగదు. మతం ఆచరణయోగ్యంగా ఉండవలెనంటే, లోక హిత కార్యముల అర్థశాస్త్రమునకు అనుగుణంగా ఉండాలి. అనగా ఆదాయవ్యయాలు రెండూనరిపోవాలి. ఒక్క ఆవు విషయంలోనే అది సాధ్యమౌతుంది. అప్పుడు కూడా కొంత మంది పుణ్యాత్ములయిన హిందువుల ద్రవ్యసహాయం కొన్నేళ్ల వరకూ కోరక తప్పదు. గోమాంస భక్షక ప్రపంచాన్ని ఎదురుగా పెట్టుకొని మన మీ మహా పుణ్య కార్యాన్ని ప్రారంభించామనే మాట మఱచిపోగూడదు నేను పైనచెప్పిన పరిమితులను దాటిపోవడానికి ప్రపంచంలో అత్యధిక భాగం శాకాహారులైతేనే తప్ప సాధ్యంకాదు. ఇప్పుడు నేను చెప్పినంత వఱకైనా చేయగలగడం భావి సంతానానికి తరువాతి పనికి దారి చూపడం. ఈహద్దులను అతిక్రమించడం- బర్రెలు వగైరా జంతువులతోపాటు ఆవును కూడా కసాయివాని కత్తికి బలిచేయడం.

హిందువులున్నూ తదితర జీవకారుణ్య సంఘాల వారున్నూ వివేకంగలవారైతే, ఈ గోసంరక్షణ నియమాలను మనస్సులో ఉంచుకొని వాటిని వెంటనే ఆచరణలోకి తీసికొని వస్తారు.

యంగిండియా (మార్చి 31, 1927)

కేవలం ఆవు అనే జంతువును రక్షించినంత మాత్రంతో మనిషి మోక్షం పొందుతాడని నేను నమ్మను. మోక్షంపొంద వలెనంటే, రాగద్వేషాలనూ, క్రోధాదులనూ ఈ అన్ని

నీచ భావాలనూ పూర్తిగా త్యజించాలి. కాబట్టి మోక్షమును గోసంరక్షణతో ముడి పెట్టినప్పుడు గోసంరక్షణకు మనం మామూలుగా అనుకొనే అర్థంకంటె ఎక్కువ విస్తృతార్థమూ, ఎక్కువ సమగ్రార్థమూ ఉండితీరాలి. కనుక మనిషికి మోక్ష మిప్పించే గోసంరక్షణలో సహజంగా స్పర్శజ్ఞానంగల ప్రతి ప్రాణి రక్షణా ఇమిడిఉండాలి.

# అనుబంధం ౨

[దాదాపు ఒక అర్థ శతాబ్దం కిందట ఇరువురు ప్రాజ్ఞ పురుషులు వ్రాసిన ప్రమాణ వాక్యాల నీకింద ఉదాహరిస్తున్నాము]

౧

## యంత్రము; భారత దేశంలోని హస్తకళా కౌశలము.

### సర్ జార్జి బర్డు ఉడ్డు

ఇండియాలో ప్రతి పనికోసమూ యంత్రమును ప్రవేశపెట్టడమంటే ముఖ్యంగా భయపడ వలసిన విషయం. కళను కాపాడవలెనని ఏమాత్రమైనా కోరిక ఉన్న మేము ఏవస్తువులు యంత్రముల మీద తయారు కావాలి, ఏవస్తువులను చేతితోనే చేయాలి అనే విషయాన్ని యూరపులో ఇప్పు డిప్పుడే గ్రహించడం ప్రారంభించాము.

కాని ఏమైనా కొన్ని ఆర్థిక కారణాలవల్ల హిందూదేశంలో అనూచానంగా చేతితో చేసే వస్తువులను సర్కించడానికి క్రమంగా యంత్రములను ప్రవేశ పెట్టవలసి వచ్చిన యెడల పారిశ్రామిక విప్లవం రాక తప్పదు. దానిని వివేకమూ విజ్ఞానమూగల నాయకులు, ప్రజల లలితాభిరుచుల కనుగుణంగా నడిపించ లేకపోయినచో పరంపరాగతములైన దేశీయ శిల్పకళలు నిత్య జీవితంలో ఉపయోగపడక చిక్కులలో పడే మాట వాస్తవము. ఇంగ్లాండులోనూ, పశ్చిమోత్తరయూరోపు ఖండం లోనూ, అమెరికా సంయుక్త రాష్ట్రాలలోనూ

యిదే విధంగా ఆలంకారిక శిల్పకళలు మూకుతరాలనుండి కనిపించకుండా పోయినవి.

యంత్రప్రవేశమువలన సాంఘికంగానూ నైతికంగానూ కలిగే చెడుగులు, ఇండియాలో ఇంకా యెక్కువగా ఉండవచ్చును. మాంచెస్టరు మిల్లులయొక్కయు రాజధాని మిల్లులయొక్కయూ పోటీకి ఆగలేక చేతిమగ్గపు నేతపని సన్నగిల్లుతూన్నప్పటికీ, ప్రస్తుతం దేశీయ పరిశ్రమలు భారత దేశమంతటా నడుస్తూనే ఉన్నవి. అంతేకాదు ఇండియాలోని ప్రతిగ్రామంలోనూ తరతరాల నాటినుండీ వస్తూన్న చేతిపనులు జరుగుతూనే ఉన్నవి. గ్రామానికి వెలుపలి మిట్టపైన కూర్చొని, కుమ్మరి గిరగిరా తనసారె తిప్పుతూ, అతని సహజ హస్తకౌశలంతో రేగడ మట్టికి రూపకల్పనం చేస్తూ ఉంటాడు. వంకరగాఉన్న పల్లపు వీధిలోని ఇళ్ల వెనుక చెట్లకింద వ్రేలుతూన్న రెండు మూడు మగ్గాలు, నీలం, ఊదా, పసిడిరంగుల పడుగుపైన, పువ్వులు రాలుతూండగా నేత సాగిస్తూ ఉంటవి.

వీధిలో కంచర బత్తులు, ఇత్తడి బిందెలు రాగి కాగులు అరివాణాలు. సిబ్బిరేకులూ తయారుచేస్తూఉంటారు. ఇంకా దిగువకు పోయి చూస్తే కలవారి ఇంటి వసారా కింద కంసాలి వెండి బంగారు నాణెములను కరిగించి, చెవిపోగులు, చంద్రవంకలు, కంకణాలు దండ కడియాలు, ముక్కరలూ, రత్నరేకులూ, అందెలు,కడియాలూ, కాలిమువ్వలు చేస్తూఉంటాడు. అతడుతనకు కావలసిన నమూనాలను, తన చుట్టూఉన్న పూవులనూ కాయలనూ చూచి అనుకరిస్తాడు. ఒక్కొక్కప్పుడు వీధి

కొసనున్న తామర చెరువు గట్టుమీదనే మామిడితోపులో కొబ్బరి చెట్లమధ్య దేవుడి గుడిపైన చెక్కబడిన శిలా ప్రతి మల నగలను అనుకరిస్తూఉంటాను.

సాయంకాలము మూడున్నర, నాలుగు గంటలమధ్య, ఒక్కొక్కరు రెండు మూడు కడవలు నెత్తినిపెట్టుకొని, చెరువుకు నీళ్లకోసంపోయే స్త్రీల చీరలరంగులతో పిథిపిథి అంతా వెలిగి పోతూంటుంది. వాళ్లు ఒక్కటేవరుసలో వచ్చి పోయే దృశ్యం సీతాకోక చిలుకలూ మెరుగుడు పువ్వులూ బారులు తీర్చి పోతూన్నట్లు కనిపిస్తుంది.

పొద్దుకూకేసరికి పశువుల కాపరు లావులను ఇంటికి తోలుకొని వస్తారంటే వచ్చికబయుళ్లు చిన్నబుచ్చుకొంటయి. మగ్గాలు ముడుచుకొంటయి. కంచర దుకాణాలు మూగపోతయి. పెద్దలందఱూ ఊరిమొగము చేరుతారు. చీకటిపడలు వ్యాపిస్తూన్న కొద్దీదీపాలు మిలమిల లాడుతూంటయి. అన్నివైపులా గ్రామం ఆటపాటలతో ఆనందంగాఉంటుంది. పొద్దు పోయినతరువాత రాత్రివేళ మహాభారతమునుండిగానీ, రామాయణము నుండిగానీ కీర్తనలు వినిపిస్తారంటవి.

మరునాడు సూర్యోదయంకాగానే ఇంటిముంగిట వీధిలో మామూలు పూజా పురస్కారాలు జరుపుకొని ఎవరిపనికి వారు వెళ్లిపోతారు. ఇదే పశ్చిమ ఇండియాలోని దక్షిణాపథ వర్తులైన గ్రామస్థుల ఆనందమయ నిత్యజీవితం. వారి ఆచారాలు అకృత్రిమాలు. వారిజీవిత పద్ధతి నిరాడంబరం. వారిసంస్కారం మూడువేల సంవత్సరాలనుండి చెక్కుచెదరని శిల్ప

నాగరిక సాహిత్యములను మనోహరంగా ప్రబోధిస్తూన్న పరంపరాగత ప్రాచీన మతగ్రంథములనుండి గ్రహింపబడినది.

ఎవరిపనితనానికి మోహించి ప్రపంచం మూడువేల సంవత్సరాలు ఇండియాకు ఎడతెగకుండా బంగారాన్ని ప్రవహింపచేసిందో, ఎవ్వరు నదీప్రవాహాలను మురికిచేయక, మనోజ్ఞదృశ్యాలను పొగ సర్పక గాలిని విషపూరితము కావింపక, ఆశ్చర్యకరములైన నగిషీపనుల నేకంచేయగలిగినారో, అసంఖ్యాకములైన తరతరాలనాటి సుశిక్షితవిద్య, ఎవరివ్యక్తిత్వ కళాకౌశలములలో పరమావధిని పొందినదో, ఆ పరంపరాగత శిల్పకారులు నేడు తమ ప్రజాపాలిత గ్రామాలను విడచి, ఎక్కువ కూలి కాశపడి మ్యాంచెస్టరుకు పోటీగా బట్టలను ఉత్పత్తి చేయబూనుకొన్న బొంబాయి మిల్లులలో దాస్యంచేయుటానికి వందలకొలదీ వేలకొలదీ గుంపులు గుంపులుగా వచ్చి పడుతూన్నారు. ఇక్కడ వారి తెలివి తేటలూ, కళానైపుణ్యం అంతా వ్యర్థం.

ఆధునిక నాగరిక ప్రపంచలో యంత్రాలు చేయతగిన పనిని కించపరచవలెనని నా అభిప్రాయం కాదు. యంత్రం మనిషికి పరికరంగా ఉండాలి. కాని యజమానిగా ఉండరాదు. జీవితంలో ఆనందసౌందర్యములకది ఏమాత్రమూ సహాయ పడజాలదు. జీవిత నిరంతరశ్రమను తగ్గించేటందుకు దాస్యం చేయడానికి మాత్రం పనికివస్తుందది. అందువలన ఇండియాలోనూ ఇంగ్లండులోనూ కూడా యంత్రమును హద్దులు దాటకుండా గట్టిగా అదుపులో ఉంచాలి.

ఇంగ్లాండులోని శిల్పుల అభిరుచులకు అభిప్రాయాలకు అనుగుణంగా, యంత్రాలు కళావస్తు నిర్మాణ కార్యరంగంలో అడుగు పెట్టకుండా, దానిని ప్రత్యేకం సుశిక్షిత హస్త నైపుణ్యము బుద్ధి కౌశలమూ గల శిల్పకారుల వ్యక్తిత్వమునకు వదలివేసిన యెడల, సంఘమంతటిలోనూ ఇంతకంటె ఎక్కువ సమానంగా ఐశ్వర్యం వ్యాపిస్తుంది. తమ దైనందిన వృత్తి యొక్క ఉదార ప్రభావము వలననూ, తమ సామర్థ్యము, పని తనము సంస్కారముల యెడల క్రమాభివృద్ధి పొందుతూన్న ప్రజా గౌరవము వలననూ, కార్మిక వర్గము పౌర రాజకీయ సాంఘికౌన్నత్యమును పొంది తమతోపాటు దేశమునంతనూ కూడా అత్యున్నత వర్గాలతో సమాన ప్రతిపత్తికి కొని పోగలరు. అంతే కాక ఆధునిక సభ్యతా సంపర్కంలేని ప్రాచ్యదేశ జీవితంలో నేటికిని నిలచి ఉన్నట్టిన్నీ గ్రీసులోనూ రోములోనూ ఒకప్పుడు కనిపించినట్టిన్నీ సంతోషానందములను, యూరపు కొంతవరకైనా నాడు చవి చూడగలదు.

## 'బి'

## [భారతీయ శిల్పవృత్తిని అధికారులణచి వేసినవిధానం]

### ఇ. బి. హావెల్

యూరపులో మధ్య యుగాలనాటి గొప్పగొప్ప భవన నిర్మాతలవలంబించిన శాస్త్ర పద్ధతులలో అంత చక్కని పని తనమూ చూపగలవారు, ఇండియాలో ఇప్పటికీ అనేక మంది శిల్పకారులున్నారు. వారేవిశ్వవిద్యాలయమునూ ప్రవేశించి

యొసగరు. అసలిండియాలోని విశ్వవిద్యాలయాలు ప్రభుత్వ యంత్రమున కవసరమైన మనుష్యులను తయారు చేయుడానికి మాత్రమే నిర్మింపబడినవి. వాటిలో శిల్పానికి గాని మతానికి గానీ స్థానంలేదు. కాని వారి ప్రాచీనులు తాజమహలును అబూపర్వత దేవమందిరాలనూ, అసంఖ్యాకములైన ఉత్తమోత్తమ నిర్మాణములనూ సృజించారు. మొగలాయి ప్రాసాదములు, ప్రభుత్వ భవనములు, వ్యవసాయక, జలాశయాలు, అవీ ఇవీ ఏమిటి వాస్తుశాస్త్రంలో పేర్కొనబడిన ప్రజోపయోగకర నిర్మాణములన్నీ వారు కట్టినవే.

ఈ నాడు మన ప్రభుత్వశాఖలీ పనులేవిధంగా నిర్వర్తిస్తున్నవి? శిల్ప, కళా, శిక్షణ నైపుణ్యములు లేని కొంత మంది యువకులు, ఒక ఇనుప దూలం మోయగల అత్యధిక భారమును అంచనా వేసేటందుకు, గోడను పడకుండా ఎంత వరకు తగ్గించ వచ్చునో ఆకసీన పరిమాణాన్ని లెక్కకట్టేటందుకు, ప్రభుత్వ సంవత్సరాదాయ వ్యయపట్టీకి లోబడి కారుచౌకగా భవనములను నిర్మించేటందుకూ కొన్నిసూత్ర సంగ్రహాలను కంఠస్థం చేసికొని ఉంటారు. ఒక ప్రభుత్వశాఖ తమకు కావలసిన భవనముయొక్క నమూనాను కాగితం మీదగీసి స్థిరపరచినతరువాత, ఈ ఇంజనీర్లలో ఒకరు బయలుదేరి తన ప్రాచీనవస్తుశాస్త్రబుద్ధితో, దానికి కళా కాంతులు లేని ఒక ముంగిలిని ఆయాశాఖల అభిరుచుల కనుగుణంగా అమర్చి వారిగౌరవ ప్రతిపత్తులకు తగినట్లేదో కొంతఅలంకారంచేస్తారు. ఎన్ని శతాబ్దాలనుండో పైతృక ధనంగా సంక్రమించిన భవన

నిర్మాణ కౌశలంగల భారతీయ శిల్పకారులకీ పాశ్చాత్య ప్రజ్ఞా నిధులుండి, కాగితపు నమూనాలను అనుకరించ వలసిన అవస్థ పట్టింది. నేత్ర పీడాకరమైన కళకంటెకూడా ప్రాచీనవస్తు శాస్త్రంలో చేయబడిన అపరాధం కొండంతకెక్కువ బాధకలిగిస్తుంది. అటువంటివారు కళ యెంత నాశనమౌతూన్నదో గ్రహించలేరు. కాని ఈ పద్ధతివలన వ్యర్థంగా యెంత దుర్వ్యయం జరుగుతూన్నదీ తేలికగా తెలియజెప్పవచ్చును. ఇటీవల కలకత్తాలో ఒకానొక అత్యుత్తమ ప్రాచీనవస్తు శాస్త్రీయభవన నిర్మాణమునకు అనేకమంది భారతీయ శిల్పకార వృత్తిపరులు నియమింప బడినారు. వారిలో చాలామంది భవనాలకు నమూనాలు గీయగలవారు, భవనాలను కట్టగలవారు, చెక్కడపు పని చేయగలవారూ కూడా ఉన్నారు. వారు మంచి హస్త కౌశలము కళా నైపుణ్యమూ కలవారు. అయితేనేమి? ప్రభుత్వశాఖవారు తయారు చేసి పెట్టిన నమూనాను అనుసరించి పని చేయాలి వారు. అంతకు మించి వారేమీ జోక్యం కలిగించుకోకూడదు. అందులో కూడా కొంత నగిషీ పని ఉన్నది కాని, అది ఇటలీ దేశపు కళ కావడంచేత, వారిని ముట్టుకోనియలేదు. ఐరోపా దేశపు ప్రాచీన శిల్పకళను అభ్యసించిన వారిని కొంత మందిని బొంబాయి నుండి పిలిపించి, ఈ కాగితపు నమూనాలను యంత్ర ప్రాయంగా అనుకరించ వలసిందని అనుజ్ఞ యిచ్చారు. వీరికి రోజుకు రెండురూపాయిలు మజూరీ ఈయబడినది. కలకత్తాకు దగ్గరగా ఉన్న ఒరిస్సా జిల్లా దేశీయశిల్ప కళ కెంతో ప్రసిద్ధి వహించింది. అక్కడ ఎంత

మందో తాపీ పనివాళ్లు, భవన నిర్మాతలూ ఉన్నారు. వారు జరిగిన ఇరువై యేండ్లలో యూరపులోని మధ్యయుగం నాటి అత్యంత మనోహర భవనములతో తులతూగ గల శిల్పాలంకారముల నెన్నిటినో చిత్రించి నిర్మించారు. అవి అన్నీ కూడా, పైన నేను ఉదహరించిన ప్రాచీన ఇటలీ కలానుకరణం కంటెఎంత ఎక్కువ సౌందర్యంగా ఉన్నవి. ఈ శిల్పుల సగటూ దాయము రోజుకు నాలుగణాలు—అనగా ప్రభుత్వం వారిచ్చే మజూరీలలో ఎనిమిదో వంతు. వారూ, వారి సహచర శిల్పకారులూ భారత దేశమంతటా పనిలేక బాధపడుతూన్నారు. ప్రభుత్వ శాఖలకు వారి పని పనికిరాదు. భారతీయ శిల్పం 'అన్నమో రామచంద్రా' అని అల్లాడు తూన్నది. మ్యూజియములు, ప్రదర్శనాలూ, ప్రాచీన వస్తువులూ, యిస్తూన్నాము దానికి.